# కౌటిల్యుని అర్థశాస్త్రము

(తెనుగు అనువాదము)

అనువాదకులు

మామిడిపూడి వెంకటరంగయ్య




1981

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

ద్వితీయ ముద్రణము ; 1,000 ప్రతులు
ఫిబ్రవరి 1981

ప్రథమ ముద్రణము : 1968
(గ్రంథకర్తచే ప్రచురితము)




సీరీస్ నెం. 164

వెల : రు. 50-

ప్రతులకు :

డిప్యూటీడైరెక్టరు, ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

ముద్రణ : ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు
విశాఖపట్టణం 530 003



ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు

# పరిచయం

పూజ్యులు మామిడిపూడి వెంకటరంగయ్యగారి 'కౌటిల్యుని అర్థశాస్త్రము' రెండవ ముద్రణ అచ్చువేసే అవకాశం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు లభించింది. ఇటువంటి విలువైన గ్రంథాలు ప్రచురించడానికే విశ్వకళాపరిషత్తు పెద్దదైన ఒక ముద్రణాలయాన్ని అమర్చుకున్నది. ఇటువంటి ప్రామాణికమైన ప్రచురణను తెలుగువారికి అందించగలగడం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు గర్వకారణం. ఈ ప్రచురణకు మాకు అవకాశమిచ్చిన ఆచార్య వెంకటరంగయ్యగారి కుటుంబానికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. అయితే, ఈ రెండవ ముద్రణ వెంకటరంగయ్యగారి జీవితకాలంలోనే పూర్తిచేయలేకపోయినందుకు విచారిస్తున్నాం.

రాజనీతిని గురించి నేడు విపులమైన చర్చ జరుగుతున్నది. త్వరితగతిని మారుతున్న మానవ సమాజం, రాజనీతిలో క్రొంగ్రొత్త భావాలకొరకై, నిరంతర అన్వేషణ జరుపుతూవుంది. అట్టి పరిస్థితులలో, ప్రాచీన రాజనీతి : దండనీతి : అర్థ శాస్త్రం ఎలావుండేదో తెలుసుకోడం అవసరంకదా! పునాదుల మర్మమెరిగిన పిమ్మటనే భవన నిర్మాణం జరగాలి.

కౌటిల్యుని అర్థశాస్త్రం భారతీయ రాజనీతికి ఒక వెలుగు దివ్వె; ఒక మార్గ దర్శి. దానినిగురించి అనేకమైన పరిశీలనలు జరిగినై. తెలుగువారికి ఆ కాంతి పుంజాన్ని అందించిన ఆచార్య వెంకటరంగయ్యగారు అభినందనీయులు. కౌటిల్యుని దండనీతి : రాజనీతి వెంకటరంగయ్యగారి లేఖినిద్వారా సౌలభ్యాన్ని సంతరించు కున్నది. అందుకనే ఈ గ్రంథానికి అంతటి విలువ, ప్రచారం వచ్చినై.

భావనాప్రపంచానికి, విజ్ఞాన వీథులకు గొప్ప వెలుగును ప్రసాదించి చరిత్రలో కలిసిపోయిన ఆచార్యులవారిని స్మరించుకుంటూ, వారి ఈ రచన రెండవ ముద్రణను తెలుగువారిముందు ఉంచుతున్నాం.

వాల్తేరు
మార్చి 30, 1981

ఆవుల సాంబశివరావు
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం

# ప్రథమ ముద్రణ పీఠిక

కౌటిల్యుడు 2300 సంవత్సరములకు పూర్వము సంస్కృతభాషలో రచించిన అర్థశాస్త్రము అను రాజనీతినిగురించిన గ్రంథమును 1923 లో పూజ్యులు శ్రీ ఆకుండి వెంకటశాస్త్రిగారును, నేనును కలిసి తెనిగించి ప్రచురించితిమి. దాని ప్రతులన్నియు ఖర్చగుటచేత దానిని తిరిగి ముద్రించవలసిన అవసర మేర్పడినది. కాని, ఆ తెనిగింపు సంస్కృతమయమగుటచేతను, అనువాదములో వ్యాఖ్యానము చేర్చని కారణముచేతను, దానిని యథాతథముగ ముద్రించుటకంటె సంస్కృత గ్రంథమును శిష్టవ్యవహారభాషలోనికి తెనిగించి ముద్రించుట వాంఛనీయమని మిత్రులు కొందరు సూచించిరి. వారి సూచనతో నేనుకూడ ఏకీభవించితిని. మూలగ్రంథమును శిష్టవ్యవహారభాషలోనికి అనువదించినయెడల పాఠకులు దానిని సులభముగ అర్థము చేసుకొనగలరనుట నిర్వివాదాంశము. అందుచేత ఇదివరలో మే మిద్దరము చేసిన అనువాదముతో ఎట్టిసంబంధము లేక నేను మూలగ్రంథమును తెనిగించి ఇప్పుడు ప్రచురించితిని. ఇదివరలోని తెనిగింపుకంటె ఇది సర్వవిధముల సుబోధకము కాగలదని నా విశ్వాసము. పాతతెనిగింపునకు "కౌటిలీయార్థశాస్త్రము" అని పేరు పెట్టితిమి. ఇప్పటి తెనిగింపునకు "కౌటిల్యుని అర్థశాస్త్రము" అని పేరు పెట్టితిని. పేర్లలోగల ఈ భేదము ఆ తెనిగింపునకు, ఈ తెనిగింపునకుగల భేదమును సూచించుచున్నది.

అప్పటి తెనిగింపునకు ఇప్పటిదానికి మరికొన్ని విషయములందుగూడ భేదము కలదు. 1923 లో శ్రీ శ్యామశాస్త్రిగారు సంస్కరించి ప్రచురించిన సంస్కృతమూల మొక్కటిమాత్రమే లభించుచుండెను. దానిని ఆధారముచేసుకొని అప్పటి తెనిగింపు జరిగెను. కాని, 1923 తర్వాత మరికొందరు పండితులు మరికొన్ని వ్రాతప్రతులను పరిశోధించి, మూలమును కొన్ని మార్పులతోను, అధిక పాఠములతోను ప్రచురించిరి. వాటిలో 1960 లో బొంబాయి విశ్వవిద్యాలయపు ఆధ్వర్యమున శ్రీ కంగ్లి పండితులు వెలువరించిన మూలము సమగ్రముగ నున్నట్లు కనుపించినది. వారు, మూలముతోపాటు వ్యాఖ్యానసహితముగ ఇంగ్లీషు అనువాదము నొకదానిని, విమర్శతోకూడిన వివరణగ్రంథము నొకదానిని ప్రచురించిరి. వారి గ్రంథముల ననుసరించి నే నిప్పటి అనువాదమును గావించితిని. ఇప్పటి నా తెనిగింపునకు దీనినిబట్టికూడ ఒక ప్రత్యేకత కలదు.

కౌటిల్యుని గ్రంథము అనేక పారిభాషికపదములతోగూడిన శాస్త్రగ్రంథము. దీనికితోడు అది సూత్రప్రాయముగ రచింపబడినట్టిది. అందుచేత కొంతవ్యాఖ్యాన మున్నగాని దానిని అర్థము చేసికొనుట సాధ్యము కాదు. 1923 అనువాదములో అట్టి వ్యాఖ్యాన మేదియు చేర్చబడియుండలేదు. ఆ లోపమును పూరించు ఉద్దేశముతో నే నిప్పటి అనువాదములో అచ్చటచ్చట సందర్భోచితముగ కొంత వ్యాఖ్యానమును చేర్చితిని. ఈ వ్యాఖ్యానభాగములో కౌటిల్యుని నాటి పరిపాలన విధానమునకును, ఇప్పటి పరిపాలన విధానమునకునుగల పోలికలను, భేదములను కొంతవరకు సూచించితిని. నా జీవితము నంతను రాజనీతిశాస్త్రమును పరిశోధించుట యందు గడపితిని. ఆ పరిశోధన ఈ సందర్భములో నాకు చాలవరకు తోడ్పడినది. ఇదికూడ ఇప్పటి తెనిగింపులోని విశేషములలో ఒకటి.

ఇప్పటి తెనిగింపులో ఉపోద్ఘాతమునుగూడ మరికొంత పెంచి వ్రాసితిని. గ్రంథకర్తనుగురించియు, గ్రంథకర్తృత్వమునుగురించియు, ఆతని కాలమును గురించియు, ఆతడు వివరించిన పరిపాలన విధానమునుగురించియు, అప్పటి ఆర్థిక సాంఘిక పరిస్థితులనుగురించియు విపులముగ వివరించితిని.

ఈ మార్పు లన్నిటిమూలమున 1923 లో 480 పుటలలో ముద్రించుటకు సాధ్యమైన అనువాదము ఈనాడు 660 పుటలకు పెరిగినది. ఈ ముద్రణములో సూత్రముల సంఖ్యను, శ్లోకభాగములను ప్రత్యేకముగ సూచించితిని.

ఇప్పటి నా అనువాదపు వ్రాతప్రతిలోని మొదటి అక్షరమునుండి ఆఖరు అక్షరమువరకు ఓపికతోను శ్రద్ధతోను చదివి, అమూల్యములగు సూచన లనేకములను గావించిన ఉస్మానియా విశ్వవిద్యాలయములోని తెనుగుశాఖకు ప్రధానాచార్యు లైనట్టియు బహుభాషాకోవిదులైనట్టియు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారికి నే నెంతయో కృతజ్ఞుడను.

నా వ్రాతప్రతిని ముద్రణకు తగినట్లుగ సిద్ధపరచి, ఎంతయో శ్రమపడి ప్రూఫులు దిద్దినట్టి భాషాకోవిదులు, విమర్శకులు అయిన శ్రీ నరిపల్లి విశ్వనాథశాస్త్రి గారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

ఈ అనువాదమును ముద్రించుటకు కావలసిన ద్రవ్యములో చాల భాగమును నాకు విరాళముగ దయచేసిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారికి, వారిలో ప్రధానముగ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి, విద్యాశాఖామాత్యులు శ్రీ టి.వి. రామవులుగారికి, విద్యాశాఖకు కార్యదర్శిగ నుండిన శ్రీ యస్. రమేశంగారికి కృతజ్ఞతాపూర్వమగు వందన సహస్రమును అర్పించుచున్నాను. ప్రభుత్వమువారి ద్రవ్యసహాయము లభించుటచేతనే నా కీ ప్రచురణము సాధ్యమయ్యెను.

గ్రంథమును ముద్రించుటలో హైదరాబాదులోని ఆంధ్ర రచయితల సహకార సంఘ ముద్రణాలయ కార్యకర్తలు నాకు సర్వవిధముల సహాయపడిరి. వారిలో ప్రూఫులు సరిచూచుటయందు తోడ్పడిన యోగిశ్రీ శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులు నా కృతజ్ఞతకు అత్యంతము పాత్రులైరి. వారికిని, ముద్రణాలయ మేనేజరు శ్రీ దాసు నరసింహారావుగారికిని నా ధన్యవాదములను సమర్పించుచున్నాను.

నా అనువాదములో అనేక లోపములు, దోషములు ఉండవచ్చును. పాఠకులు వాటిని చూపించినయెడల రెండవ ముద్రణములో సవరించెదను. ఉపోద్ఘాతము, వ్యాఖ్యానము మరింతవిపులముగ నుండిన బాగుండెడిది. కాని గ్రంథవిస్తరభీతిచే నే నా ప్రయత్నమును విడనాడితిని.

సికంద్రాబాదు

1968, ఫిబ్రవరి 24

మామిడిపూడి వెంకటరంగయ్య

# ఉపోద్ఘాతము

కౌటిల్యుని అర్థశాస్త్రము దండనీతి లేదా రాజనీతినిగురించి మన దేశములో వ్రాయబడిన గ్రంథములన్నిటిలో అగ్రస్థానము వహించినట్టిది. దాని ప్రాశస్త్యమున కనేక కారణము లున్నవి. వానిలో ప్రధానములగు వానిని కొన్నిటిని గుర్తించుట అవసరము.

## 1

అర్థశాస్త్రము బహుప్రాచీనమగు శాస్త్రము.* కౌటిల్యునికి పూర్వము అర్థశాస్త్రగ్రంథము లనేకములు వ్రాయబడినట్లు కౌటిల్యుని గ్రంథము

---

* దీని ప్రాచీనతను మహాభారతములోని శాంతిపర్వము ఈ క్రిందివిధమున స్పష్టముచేయుచున్నది : "కృతయుగమున రాజులును, రాజ్యములు నున్నటులు గానరాదు. అటులే దండమును లేదు. దండించువాడును లేడు. ధర్మమును విడువక ప్రజలే తమ్ము తాము రక్షించుకొనుచుండెడివారు. కాగా, వారిని ధర్మమే పాలించుచుండెడి దనవచ్చును. కాలక్రమమున వారు కొన్ని విధములగు నాపదలకు లోనగుట తటస్థింపగా జ్ఞానమునశించి, ధర్మములు చెడ నారంభించెను. అంతట ప్రజలు లోభవశులై యనర్థములగు వానిని నయితము బలాత్కరించుకొనుచు, కామసక్తులై కర్తవ్యాకర్తవ్యముల నెరుగక యొనరించుచు వర్తింపదొడంగిరి. అటుల వారనర్థములగు పను లొనర్చుచు దేవతలు భయ మొంది, పద్మభవునికడ కేగి, "ఓ దేవా ! మానవలోకమున వేదములు చెడి ధర్మమెల్ల నశించినది..." అని మొరపెట్టు కొనిరి. అది విని యా సురజ్యేష్ఠుడు, "ఓ సురలారా ! భయమందకుడు. మీకు శ్రేయమగువిధమును జింతించితిని," అని వారి నూరడించి, ధర్మార్థ కామములనియెడి త్రివర్గమును, నాల్గవదగు మోక్షమును వేరువేరు గుణములు గలుగునట్టు లేర్పరచి, యా యంశములగురించి నూరువేలఅధ్యాయములుగల నీతిశాస్త్ర మొకటి సృజించి వారికిచ్చెను. అటులు సాగరమువలె నమేయమగు నాగ్రంథరాజములు మున్నుగా మహేశుడు సంగ్రహించెను. పిమ్మట నల్పాయుష్యులగు మానవులకది నుసాధ్యము గానేరదని తలచి, విశాలాక్షుడను నామాంతరముగల యాశంకరుడే వైశాలాక్షమను పేరను బదివేల యధ్యాయములుగా సంక్షేపము గావించెను. అర్దాని నాతనివలన నింద్రుడు సంగ్రహించి, యయిదు వేలుగా సంక్షేపించెను. పిమ్మట బృహస్పతి దానినే మూడువేలుగా సంక్షేపించెను. తరువాత రాక్షసగురుండగు శుక్రుడు దాని నొక వేయి యధ్యాయములు కలుగునట్లుగా నొనర్చెను. అదియు నశక్తులగు మానవులు సంగ్రహింపజాలరనియెంచి, మునులు కొందరు క్రమముగా దానిని మరియు సంక్షిప్తములగు గ్రంథములు గావించిరి, ఇదియ నీతిశాస్త్ర జన్మప్రకారము (వావిళ్ళవారి వచనభారతము-ఆరవసంపుటము, పుటలు 98-99).

మూలమునను, మహాభారతాది ఇతరగ్రంథముల మూలమునను తెలియవచ్చు చున్నది. కాని అవియన్నియు శిథిలములై నామమాత్రావశిష్టములైనవి. వానిలోని సూత్రములు కొన్నియు శ్లోకములుకొన్నియు తప్ప తక్కిన భాగములు మనకు లభ్యముకాలేదు. వానిప్రతులేవియు మనకు దొరక లేదు. కౌటిల్యునిగ్రంథ మిట్లు శిథిలముకాక నిలబడగలిగినది. అందుచేత ప్రస్తుతము ప్రచారమందుండు ప్రాచీనకాలపు రాజనీతిగ్రంథములలో కౌటిల్యుని అర్థ శాస్త్రమే మొదటిది అని చెప్పవచ్చును. దానిప్రాశస్త్యమున కిది యొక కారణము.

కౌటిల్యుని తర్వాత మధ్యయుగములో కొందరు రాజనీతినిగురించిన గ్రంథములను వ్రాసిరి. నీతిసారమును వ్రాసిన కామందకుడు, నీతివాక్యామృతమును వ్రాసిన సోమదేవుడు, నీతిప్రకాశికను వ్రాసిన వైశంపాయనుడు, శుక్రనీతిని వ్రాసిన గ్రంథకర్త ఇట్టివారిలో కొందరు. ఇది కాక మహాభారతము లోని శాంతిపర్వమందు రాజనీతిని గురించిన వివరణ మున్నది. కాని ఈ గ్రంథము లేవియు కౌటిల్యుని గ్రంథమువలె సమగ్రములైనవి కావు. పరిపాలనమునకు సంబంధించి అతడు వివరించిన విషయము లనేకములు వీని యందు కనిపించవు. కామందకుని గ్రంథమునకు కౌటిల్యుని అర్థశాస్త్రము మూలగ్రంథమయినను అర్థశాస్త్రములోని ప్రధానాధికరణములగు అధ్యక్ష ప్రచారము, ధర్మస్థీయము, యోగవృత్తము, సంఘవృత్తము, మొదలగువానిని గురించి నీతిసారములో ఎట్టిప్రసక్తియు లేదు. వీనిలో కొన్నిటిని గురించి శుక్రనీతి ప్రస్తావించినను అది మిక్కిలి సంక్షిప్తముగనున్నది. కావున రాజనీతిని గురించిన మన గ్రంథములన్నిటిలో కౌటిల్యుని అర్థశాస్త్రమొక్కటే సమగ్ర మైనట్టిది అని చెప్పవచ్చును. దాని ప్రాశస్త్యమున కిది యొక కారణము.

గ్రంథకర్తనుబట్టికూడ గ్రంథమునకు ప్రాశస్త్యము లభించుట సహజము. కౌటిల్యుడు కామందకాదులవలె పండితుడుమాత్రమే కాడు. అతడు లౌకికవ్యవహారములందు గొప్పఅనుభవమును సంపాదించినవాడు. మౌర్య సామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్తచక్రవర్తికి కుడిభుజమై సామ్రాజ్య స్థాపనములో నతనికి సహాయము చేసినవాడు. శాస్త్రములోని సిద్ధాంతములను నిర్వచించుటయందేగాక వానిని ప్రయోగించుటయందుగూడ నైపుణ్యమును సంపాదించినవాడు. పరిపాలనమందనుభవము గలవారే శాస్త్రము నుపదేశించుటకు అర్హులని అతనిమతము. దీనిని మనసునందుంచుకొనియే అతడు రాజపుత్రుని విద్యాభ్యాసమును వివరించుసందర్భములో రాజపుత్రుడు, 'సిద్ధాంతము ప్రయోగము తెలిసినవారివద్దనుండి దండనీతిని నేర్చుకొనవలెను,' అనిచెప్పెను (1–5–8). ఇందుచేత నితనిగ్రంథములోని సూత్రములు వ్యవహారానుకూలములుగను ఆచరణార్హములుగనున్నవి. ఇది

యొకగొప్ప విశేషము. దీనినిబట్టిగూడ కౌటిల్యుని గ్రంథమునకు ప్రాశస్త్యము లభించినది.

## 2

కౌటిల్యుడు తన గ్రంథమును అర్థశాస్త్రమని పేర్కొనెను. దండనీతికి అర్థశాస్త్రమను నామాంతర మున్నట్లు మహాభారతమునుండి తెలియుచున్నది. శాంతిపర్వమం దొకచోట అర్జునుడు అర్థశాస్త్రవిదుడని చెప్పబడి యున్నది. మరియొకచోట శ్రేష్ఠులగురాజులు అర్థశాస్త్రము ననుసరించెదరని చెప్పబడి యున్నది. కాని ఈ పేరు ఎక్కువగ ప్రచారములో నుండినట్టిది కాదు. కామందకాదులు నీతిశాస్త్రమను పదమునే వాడిరి. మహాభారత మందును తదితరగ్రంథములందును, దండనీతి, రాజనీతి, రాజశాస్త్రము, రాజధర్మము అను పేర్లు వాడబడియున్నవి. కౌటిల్యుడుకూడ విద్యలసంఖ్యను నిర్ణయించు సందర్భములో విద్యలు ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అను పేర్లుగల నాలుగుఅని చెప్పెనేగాని అర్థశాస్త్రమనుమాటను వాడియుండలేదు. దానికి బదులు దండనీతిఅనియే ఉపయోగించెను. దీనినుండి దండనీతి అను పేరు ఎక్కువ ప్రచారములో నుండెనని స్పష్ట మగుచున్నది.

దండనీతికి అర్థశాస్త్రమను పేరుకూడ ఎట్లు తగియున్నదో కౌటిల్యుడు తన గ్రంథమం దొకచోట చెప్పియున్నాడు "మనుష్యుల జీవితమునకు మూలము అర్థము ; లేదా, మనుష్యులతో కూడినభూమియే అర్థము. అట్టి భూమిని సంపాదించు ఉపాయములు, పాలించు ఉపాయములు—వీనిని గురించిన శాస్త్రము అర్థశాస్త్రము," అని (15–1–1,2). అర్థమునకు భూమిమూలమగుటచేత భూసంపాదన పరిపాలనములను గురించిన శాస్త్రము నకు అర్థశాస్త్రమను పేరు తగినట్టిది అని అతని భావము.

దండనీతియొక్క ఉద్దేశము గూడ నిదివరకు లభించని (భూమిని) దానిని లభింపజేయుట, లభించిన దానిని పరిరక్షించుట, రక్షింపబడిన దానిని వృద్ధిచేయుట, వృద్ధిగాంచిన దానిని సత్పాత్రుల కందచేయుట అని అతడు వివరించెను. ఈరెంటియొక్క ఉద్దేశము ప్రధానముగ భూమిసంపాదన పరిపాలనములు. అందుచేత దండనీతికి అర్థశాస్త్రమను పర్యాయపదమును వాడుటలో అనౌచిత్యమెట్టిదియు లేదని కౌటిల్యుని అభిప్రాయము. ఇంతే కాక అతనిపూర్వులు కొందరు అర్థశాస్త్ర మను పేరును వాడియుండిరి.

ప్రస్తుతకాలమున ప్రచారములో నుండు అర్థశాస్త్రములోని విషయములకును కౌటిల్యుని అర్థశాస్త్రములోని విషయములకును ఎట్టిసంబంధము లేదని గుర్తించుట అవసరము. ప్రస్తుతకాలమందు మానవుల వాంఛలను

తీర్చుటకు సాధనములగు ఆహారాదిపదార్థముల సముదాయమే అర్థమనియు, అట్టి అర్థముయొక్క ఉత్పత్తి, పంపకము, వినిమయము, వినియోగము మున్నగువానిని వివరించు శాస్త్రము అర్థశాస్త్రమనియు శాస్త్రవేత్తల అభిప్రాయము. దీని కనుగుణముగ ఈనాటిఅర్థశాస్త్రగ్రంథములు వ్రాయబడు చున్నవి. ఇట్టిశాస్త్ర మొకటి ఉండవలెనని కౌటిల్యునికి తెలిసినదే. కౌటిల్యునికేకాదు, ప్రాచీనులందరు దీని అవసరమును గ్రహించిరి. అందుచేతనే నాలుగు విద్యలలో వార్త అనునది యొకటిగ గుర్తించబడెను. దీనినిగురించి కౌటిల్యు డీవిధముగ చెప్పియున్నాడు: "వ్యసాయము, పశుపాలనము, వాణిజ్యము కలిసి వార్తఅని అనిపించుకొనును. వీటిసాధనము ధాన్యము, పశువులు, హిరణ్యము, వన్యపదార్థములు, విష్టి (కూలిజనము) లభించగలవు," అని (1–4–1,2). దీనినుండి ప్రాచీనకాలపు వార్తాశాస్త్రమే ఈకాలపుఅర్థశాస్త్ర మని చెప్పుట సహేతుకముగ కనిపించుచున్నది.

ఈసందర్భములో మరియొక విషయమునుగురించి ప్రస్తావించుట ఉచితమని తోచుచున్నది. జీవితములో మానవుడు సాధించవలసిన ప్రయోజనములు (పురుషార్థములు) నాలుగనియు, అవి ధర్మార్థకామమోక్షము లనియు మనపూర్వులు భావించిరి. శాస్త్రగ్రంథములను రచించినవారు దీని కనుగుణముగ నాలుగువిధములగు శాస్త్రములు రచించిరి. శాస్త్రములలో ఒక్కొక్కటియు ఒకపురుషార్థమునకు సంబంధించినట్టిది. అందుచేత నవి ధర్మశాస్త్రములు, అర్థశాస్త్రములు, కామశాస్త్రములు, మోక్షశాస్త్రములు అని పేర్కొనబడినవి. కౌటిల్యుడుపేర్కొనిన నాలుగు విద్యలను ఈ వర్గీకరణముతో కొంతవరకు సమన్వయింపవచ్చును. అన్వీక్షకి మోక్షశాస్త్రముతోను, త్రయి ధర్మశాస్త్రముతోను, వార్తాదండనీతులు కలిసి అర్థశాస్త్రము తోను పోల్చదగియున్నవి. ఇందులో కామశాస్త్రములు పేర్కొనబడలేదు. దానికి కారణ మున్నది. విద్యలసంఖ్యను నిర్ణయించుటలో కౌటిల్యుని ప్రధానోద్దేశము రాజపుత్రుని విద్యాభ్యాసకాలమం దతడు ఏయేవిద్యలను నేర్చుకొనవలెనో పేర్కొనుట. రాజపుత్రునికి కామశాస్త్రమును తెలిసికొన వలసిన అవసరము లేదని అతడు భావించెను. అందుచేత దానిని విద్యలలో చేర్చలేదు.

శాస్త్రములు నాలుగు విధములయినను వానిలో అర్థశాస్త్రము స్వతంత్ర శాస్త్రము కాదనియు అది ధర్మశాస్త్రమునుండి పుట్టినదనియు కొందరివాదము. కౌటిల్యుని గ్రంథములోని న్యాయవిచారణమునకు కంటక శోధనమునకు సంబంధించిన మూడవనాల్గవఅధికరణములలోని విషయములకును ధర్మశాస్త్రములలోని వ్యవహారకాండకు సంబంధించిన విషయములకును సామరస్యము ఎక్కువగనుండుటయు, ధర్మశాస్త్రములలోని వివరణమును కౌటిల్యుడు గ్రహించినందుననే ఇట్టిసాదృశ్య మేర్పడినదనుటయు ఈవాదమున కాధారములు

కాని ఇది బలములేని వాదము. ఏలయన, ధర్మశాస్త్రముల దృక్పథము అర్థశాస్త్రముల దృక్పథమునకు పూర్తిగ భిన్నమైనట్టిది. ధర్మశాస్త్రములోని ప్రధానవిషయము వర్ణాశ్రమధర్మముల వివరణము. ఈశాస్త్రములకు మాతృకలగు ఆపస్తంబుని ధర్మసూత్రములు బోధాయనుని ధర్మసూత్రములు దీనిని స్పష్టపరుచు చున్నవి. ఇది గాక ధర్మశాస్త్రములు ప్రధానముగ వ్యక్తులనుద్దేశించియు వారివారిదైనందిన జీవితములో ననుసరించవలసిన విధులగురించియు వివరించు గ్రంథములు. అర్థశాస్త్రములోని ప్రధానవిషయము పరిపాలనావిధానము. అది రాజును ఉద్దేశించి వ్రాయబడి నట్టిది. అర్థశాస్త్రములో ధర్మస్థీయాద్యధికరణముల లోని ధర్మమునకును ధర్మశాస్త్రములలోని ధర్మమునకును సంబంధము లేదు. అర్థశాస్త్రములోని ధర్మ మనుమాట న్యాయమను అర్థమందు వాడబడినది. న్యాయమనగా న్యాయస్థానములలోని ధర్మస్థులు (న్యాయాధీశులు) వ్యవహార పరిష్కారము లందు గుర్తించిన విధినిషేధములు, ధర్మశాస్త్రములలో ధర్మ మనుమాట వర్ణాశ్రమధర్మములు అను అర్థమందు వాడబడినది. అర్థశాస్త్రములోని ధర్మమునుల్లంఘించినవారు న్యాయస్థులు విధించిన శిక్షను అనుభవించవలసిన వారుగ నుండిరి. ధర్మశాస్త్రములోని ధర్మము నుల్లంఘించినవారికి ప్రాయశ్చిత్తమే పరిహారము. విషయములందును, దృక్పథములందును ఇంతటి భేద మున్నప్పుడు ధర్మశాస్త్రమునుండి అర్థశాస్త్రము పుట్టినట్లుచెప్పుట సహేతుకము కాజాలదు. కొన్నివిషయములలో నీరెంటికిని సాదృశ్య ముండుటకు కారణము ధర్మశాస్త్రకర్తలు ఆవిషయములను అర్థశాస్త్ర గ్రంథములనుండి గ్రహించుటయే. ఆవిషయములు న్యాయస్థానములలో న్యాయవిచారణకు సంబంధించినట్టివి. ధర్మసూత్రములను రచించిన ఆపస్తంబాదులదృష్టిలో నవి అంతప్రధానములుగ నుండలేదు. వానినిగురించి వారు ఎక్కువగ కృషిచేసి యుండలేదు. అందుచేతనే వారు వానికి సంబంధించిన వివరణమునంతను అర్థశాస్త్రగ్రంథములనుండి గ్రహించుట జరిగెను. మనుస్మృతికర్త, యాజ్ఞవల్క్యుడు మున్నగువారుకూడ ఈ సంప్రదాయమునే అనుసరించిరి. కొన్ని విషయములలో రెండుశాస్త్రములలో కనిపించుసాదృశ్యమున కిదియే కారణము. దీనినిబట్టి అర్థశాస్త్రము స్వతంత్రమగు శాస్త్రమనియు, ధర్మశాస్త్ర కర్తలు అందులో నుండి కొన్నిభాగములను గ్రహించిరనియు స్పష్టమగు చున్నది.

## 3

అర్థశాస్త్రమును రచించినవాడు కౌటిల్యుడేనా ? అట్లైనపక్షమున, అతడెప్పటి వాడు ? ఎక్కడివాడు ? అను విషయములనుగురించి వాదోపవాదము లనేకములు జరుగుచున్నవి. కౌటిల్యుడే దీనిని రచించినవాడను సిద్ధాంతము బలవత్తరముగ నున్నట్లు చెప్పవచ్చును. ఈ సిద్ధాంతమును రెండు రకములగు హేతువులచే

సమర్థించవచ్చును. గ్రంథములో కనిపించు ఆధారములు మొదటిరకములోనివి. వందలాది సంవత్సరములుగ దేశమందువ్యాప్తిగాంచిన ప్రతీతియు, ప్రాచీనగ్రంథ కర్తలు వారిగ్రంథములం దీ విషయమునుగురించి చేసినప్రస్తావనలును రెండవ రకము లోనివి.

కౌటిల్యుడే అర్థశాస్త్రమును వ్రాసినాడనుటకు గ్రంథములోనే కొన్ని ఆధారము లున్నవి. వానిలో మొదటిది :

సుఖగ్రహణవిజ్ఞేయం తత్త్వార్థపదనిశ్చితమ్ !
కౌటిల్యేన కృతం శాస్త్రం విముక్తగ్రంథవిస్తరమ్ ॥

అను మొదటిఅధ్యాయములోని చివరి శ్లోకము (1–1–17).

రెండవది :

సర్వశాస్త్రాణ్యనుక్రమ్య ప్రయోగ ముపలభ్య చ
కౌటిల్యేన నరేంద్రార్థే శాసనస్యవిధిః కృతః ॥

అను రెండోఅధికరణములోని పదోఅధ్యాయమందలి శ్లోకము (2–10–63)

మూడవది :

యేన శాస్త్రం చ శస్త్రం చ నందరాజగతా చ భూః
అమర్షే ణోద్ధృతా న్యాశు తేన శాస్త్ర మిదం కృతమ్ ॥

అను గ్రంథాంతమునందుండు శ్లోకము (15–1–73).

నాల్గవది :

దృష్ట్వా విప్రతిపత్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణామ్
స్వయ మేవ విష్ణుగుప్త శ్చకార సూత్రం చ భాష్యం చ ॥

అను గ్రంథాంతమందలి వాక్యము.

అయిదవది :

“కౌటిలీయ స్యార్థశాస్త్రస్య” అని ప్రతిఅధికరణాంతమందలి గద్యలోనుండు మాటలు.

ఆరవది :

అర్థశాస్త్రగ్రంథములను రచించిన ఇతరుల అభిప్రాయములను విమర్శించు సందర్భములో, “ఇతికౌటిల్యః,” “నేతికౌటిల్యః,” అని గ్రంథకర్త తన అభిప్రాయమును వ్యక్తపరచుట.

ఈ ఆరు ఆధారములనుబట్టి అర్థశాస్త్రమును రచించినవాడు కౌటిల్యు డని స్పష్టమగుచున్నది. ఈసందర్భమున విష్ణుగుప్తుడు, చాణక్యుడు అనునవి

కౌటిల్యుని నామాంతరములని గ్రహించవలసి యున్నది. కౌటిల్యుడను పేరు గోత్రమునుండియు, చాణక్యుడను పేరు తండ్రినుండియు లభించినవి. విష్ణు గుప్తుడనునది వ్యవహారనామము.

గ్రంథములోని అధారములేకాక ప్రాచీనకాలపు గ్రంథకర్త లనేకులు అర్థశాస్త్రమును వ్రాసినవాడు కౌటిల్యుడని చెప్పిరి. నీతిసార కర్తయగు కామందకుడు :

"నీతిశాస్త్రామృతం శ్రీమా నర్థశాస్త్రమహోదధేః
యఉద్ధ్రథేనమ స్తస్మై విష్ణుగుప్తాయ వేధసే ॥

అను శ్లోకమున అర్థశాస్త్రమను మహాసముద్రమునుండి నీతిశాస్త్రమను అమృతమును విష్ణుగుప్తుడు మథించెనని చెప్పెను. దండిమహాకవి తన దశ కుమారచరిత్రమున : "అధీష్వయావద్దండనీతిం, ఇయ మిదానీ మాచార్య విష్ణు గుప్తేన మౌర్యార్థే షడ్భిఃశ్లోకసహస్రైః సంక్షిప్తా," అని చెప్పెను. ఇదిగాక కౌటిల్యుని అర్థశాస్త్రములోనిసూత్రము లనేకములను తనగ్రంథమం దుదా హరించెను. పంచతంత్రకర్త తనగ్రంథమందు : "తతోధరశాస్త్రాణి మన్వాదీ న్యర్థశాస్త్రాణి చాణక్యాదీని, కామశాస్త్రాణి వాత్స్యాయనాదీని," అని చెప్పి యున్నాడు. ముద్రారాక్షస నాటకమును వ్రాసిన విశాఖదత్తుడు చాణక్యునికి కౌటిల్యుడను నామాంతర మున్నట్లు చెప్పుటయేగాక కౌటిల్యుని అర్థశాస్త్రములోని నీతిననుసరించి కథనునడిపి, అందుండి సూత్రము లనేకములను తననాటకమందు పొందుపరిచెను. జైనుల పవిత్ర గ్రంథములలో నొకటి యగు నందిసూత్రము కౌటిల్యునిఅర్థశాస్త్రమును పేర్కొని అది మిథ్యాశాస్త్రములలో నొకటిగ పరిగణించు చున్నది. బాణకవి తన కాదంబరియందు "కింవా తేషాం సాంప్రతం యేషాం అతినృశంసప్రాయోపదేశం నిర్ఘృణం కౌటిల్యశాస్త్రం ప్రమాణం" అనివ్రాసియున్నాడు. ప్రాచీనగ్రంథములన్నిటి యందు చెప్పబడిన మాటలను త్రోసివేయుటకు కారణములేవియు కనిపించవు. ఈ ప్రస్తావనలబట్టి అర్థశాస్త్రమును వ్రాసినవాడు కౌటిల్యుడేఅని స్పష్టమగుచున్నది. ఆరవశతాబ్దమందుండి దేశమందంతట వ్యాప్తిగాంచిన ప్రతీతికూడ దీనినే బలపరుచుచున్నది.

ఈ ఆధారములలో ననేకములు కౌటిల్యుడు నందరాజుల వంశమును నిర్మూలించి మౌర్యవంశమునకు చెందిన చంద్రగుప్తుని సింహాసనాధిష్ఠితునిగ చేసినట్లు చెప్పుచున్నవి. చంద్రగుప్త చక్రవర్తి క్రీ. పూ. 321 ప్రాంతమున తనసామ్రాజ్యమును స్థాపించినట్లు దేశచరిత్రనుండి మనకు తెలియవచ్చు చున్నది. అందుచేత కౌటిల్యుడు క్రీ. పూ. నాల్గవశతాబ్దపు ఆఖరుభాగమం దుండిన వాడనియు, అర్థశాస్త్రము సుమారు 2300 సంవత్సరముల క్రిందట వ్రాయబడెననియు చెప్పవచ్చును.

## 4

అర్థశాస్త్రము కౌటిల్యవిరచితము కాదనిచెప్పువారు కొన్నికారణములుచూపి ఈసిద్ధాంతమును ఖండించుచున్నారు. అర్థశాస్త్రమందుండిపైని ఉదాహరింపబడిన శ్లోకములలో 1, 3, 4 ప్రక్షిప్తములని వారి అభిప్రాయము. అధికరణముల అంతమందుండు గద్యలలోని "కౌటిలీయస్యార్థశాస్త్రస్య" అను మాటలకు కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రము అనుఅర్థము పొసగ దనియు, వానిఅర్థము. కౌటిల్యుని సంప్రదాయమునకు చెందిన అర్థశాస్త్రమనియు వారివాదము. ఇదిగాక అర్థశాస్త్రమందనేక ప్రదేశములందుండు, "ఇతికౌటిల్యః," "నేతికౌటిల్యః" అనుమాటలు గ్రంథము కౌటిల్యవిరచితము కాదని సూచించుచున్నవని వారిభావము. కౌటిల్యుడే గ్రంథకర్త యగుపక్షమున తన అభిప్రాయమును ఇట్టిమాటలలో సూచించియుండడనియు, వీనికిబదులు, "ఇది నా అభిప్రాయము" "ఇది నా అభిప్రాయముకాదు" అను మాటల నుపయోగించి యుండుననియు కౌటిల్యునికంటె భిన్నులగువారు గ్రంథమును వ్రాసినప్పుడే ఇట్టిమాటలు సందర్భోచితములగుననియు వీరి వాదము. కాని ఇది సరియగు వాదము కాదని సమాధానము చెప్పుట కవకాశ మున్నది. ఇతరుల అభిప్రాయమును ఖండించి తన అభిప్రాయమును సమర్థించుకొను సందర్భములో గ్రంథకర్త అహంభావసూచక మగు "నా" అను మాట నుపయోగింపక స్వనామము నుపయోగించుట ప్రాచీనసంప్రదాయము. "ఇతిబోధాయనః", "ఇతిబాదరాయణః", "ఇతివాత్స్యాయనః" అను ప్రయోగములు బోధాయన బాదరాయణ వాత్స్యాయన కృతములగు గ్రంథములలో కనిపించుచున్నవి. ఇట్టిసందర్భములో "ఇతికౌటిల్యః," "నేతి కౌటిల్యః" అనుమాటలున్నంతమాత్రమున అర్థశాస్త్రము కౌటిల్యకృతము కాదని వాదించుట సహేతుకము కాజాలదు. "కౌటిలీయస్యార్థశాస్త్రస్య", అను మాటలకు కౌటిలీయ సంప్రదాయమునకు చెందిన అర్థశాస్త్రమనిగాని, కౌటిల్యు డుపదేశించిన అర్థశాస్త్రమనిగాని వ్యాఖ్యానించుటకూడ విపరీతముగనే కనిపించుచున్నది.

మౌర్యచక్రవర్తి చంద్రగుప్తుని కాలమున కౌటిల్యుడనువాడు లేనే లేడనియు, అట్టివా డుండినను అర్థశాస్త్రగ్రంథ మానాటిది కాదనియు, తర్వాతికాలమునాటి దనియు వాదించువారు మరికొన్ని హేతువులనుచూపి వారి వాదమును సమర్థించుకొన ప్రయత్నించుచున్నారు. క్రీ. పూ. 150 ప్రాంతపువాడయినట్టియు మహాభాష్య కర్తయు నగు పతంజలి తన కాలమందు ప్రచారములోనుండిన వేదాంగములు తర్కము ఇతిహాసము పురాణము మున్నగువానిని పేర్కొనెనుగాని అర్థశాస్త్రమును పేర్కొనలేదు. ఇదిగాక తన గ్రంథములో చంద్రగుప్తుని సభను గురించియు మౌర్యులగురించియు ప్రస్తావించెనేగాని కౌటిల్యునిగురించి ప్రస్తావించి యుండలేదు. కావున కౌటిల్యుడా కాలమున ఉండినవాడు కాడనియు, పతంజలి

నాటికి అర్థశాస్త్రము లేదనియు, అది తర్వాతి కాలమునాటిదనియు వారియూహ. కాని ఈవాదములో బలమున్నట్లు కనిపించదు. పతంజలి అర్థశాస్త్రము నొక ప్రత్యేకశాస్త్రముగా గాక ఇతిహాసములో నొకభాగముగ పరిగణించి యుండవచ్చును. పురాణ–ఇతివృత్త – అఖ్యాయికా – ఉదాహరణ – ధర్మశాస్త్ర అర్థశాస్త్రము లితిహాస మనబడునని కౌటిల్యుడు చెప్పియున్నాడు (1–5–12). పతంజలికూడ ఇట్లే భావించి యుండవచ్చును. అత డర్థశాస్త్రమును పేర్కొనకపోయినంత మాత్రమున ఆకాల మందర్థశాస్త్ర గ్రంథములు లేవనిచెప్పుట ప్రమాదకరము. కౌటిల్యునికి పూర్వ మెందరో అర్థశాస్త్రములను వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. పతంజలికాలము నాటికి అర్థశాస్త్రములే లేవని మన మంగీకరించినయెడల నటుతర్వాత రెండు వందలసంవత్సరములలో మానవ బార్హస్పత్య ఔశనసా ద్యర్థశాస్త్రము లన్నియు రచింపబడినవని నిశ్చయించవలసినవార మగుదుము. ఇంత స్వల్ప కాలములో నీ శాస్త్ర మింత యధికముగ నభివృద్ధిగాంచగలిగియుండునా? కావున పతంజలికి పూర్వముకూడ అర్థశాస్త్రములున్నట్లే మనము భావించ వలెను. పతంజలి చంద్రగుప్తసభను పేర్కొనెనేగాని సభలోనుండిన ప్రఖ్యాత పురుషుల నెవ్వరిని పేర్కొనలేదు. కొందరినైన పేర్కొని కౌటిల్యుని పేర్కొనక పోయినయెడల కౌటిల్యు డాకాలమున లేడని ఊహించుట పొసగు నేమో! కాని పతంజలి అట్లు చేయలేదు. కావున అర్థశాస్త్ర కాలమునుగాని కౌటిల్యుని కాలమునుగాని నిర్ణయించుటలో పతంజలిమహాభాష్యమును ప్రస్తా వించుట సందర్భోచితము కాజాలదు.

ఈపక్షమునకు చెందిన విమర్శకులు మరియొక హేతువునుకూడ చూపెట్టుచున్నారు. అది వాత్స్యాయనునికి, అతడు రచించిన కామసూత్ర గ్రంథమునకు సంబంధించినట్టిది. వాత్స్యాయనుడు క్రీస్తుశకము మూడవ శతాబ్దముననో నాల్గవశతాబ్దముననో ఉన్నట్టివాడు. అతనికి పూర్వమందుం డినవారెవ్వరును కౌటిల్యుని అర్థశాస్త్రముతో పరిచయమున్నట్టివారుకారు. పరిచయమున్నట్టివారిలో అతడే మొదటివాడు. ఇదిగాక అనేకవిషయములం దతడు కౌటిల్యుని అనుసరించెను. అతని శైలికూడ కౌటిల్యుని శైలివలె నున్నది. వీరిద్దరికి ఇంతటిసన్నిహితసంబంధముండుటచేత కౌటిల్యుని కాలము వాత్స్యాయనునికాలమునకు అతిసమీపముగనుండవ లెనని విమర్శకులవాదము. వాత్స్యాయనుడు మూడవశతాబ్దమువాడో నాల్గవశతాబ్దమువాడో అగుటచేత కౌటిల్యుడు రెండవశతాబ్దమువాడని వీరి నిర్ణయము.

కాని, ఇదికూడ బలములేని వాదము. వాత్స్యాయనుని గ్రంథము నకును కౌటిల్యుని గ్రంథమునకును విషయములలో నధికసాదృశ్యముండుటచే వారిమధ్యగడచినకాలము అతిస్వల్పముగ నుండియుండవలె ననుట సహేతుకము కాజాలదు. వాత్స్యాయనునికాలమునాటికి కౌటిల్యునిగ్రంథము మిక్కిలిప్రాచీన

మైనదగుటచేతనే దానియందతనికి అత్యంతగౌరవము కుదిరిన దని ఊహించుటయే సబబుగ కనిపించును. శైలివిషయములోని సాదృశ్యమునుబట్టి కాలమును నిర్ణయించుటకూడ సమంజసము కాజాలదు. కాళిదాసుని శైలిని తిక్కనశైలిని అనుకరించగలవా రీకాలమందుగూడ అభినవకాళిదాసు లని అభినవతిక్కలని బిరుదు వహించియున్నారు.

కౌటిల్యుడు మౌర్యచక్రవర్తి చంద్రగుప్తుని కాలమునాటివాడు కాడ నుటకు విమర్శకులు చూపెట్టు మరియొకకారణము మెగస్తనీసు (Megasthenes) అనువానికి సంబంధించినట్టిది. ఇతడు గ్రీకుజాతివాడు. సెల్యూకస్ అను గ్రీకుచక్రవర్తి ప్రతినిధిగ క్రీ. పూ. 300 ప్రాంతమున చంద్రగుప్తుని ఆస్థానమునకు వచ్చి, కొంతకాల మచట రాయబారిగనుండి, మౌర్యసామ్రాజ్యము నకు సంబంధించి తానుచూచినట్టియు వినినట్టియు విషయములను చేర్చి ఇండిక (Indica) అనుగ్రంథమును వ్రాసెను. ఇది చంద్రగుప్తుని కాలపు పరిస్థితులను వివరించు మౌలిక గ్రంథములలో నొకటి అని చరిత్రకారుల అభిప్రాయము.

మెగస్తనీసుగ్రంథమును ఆధారముగచేసికొనిన విమర్శకులు చెప్పునది: (1) ఈ గ్రంథమందెచ్చటను కౌటిల్యుడు పేర్కొనబడలేదు. కౌటిల్యుడు వాస్తవముగ చంద్రగుప్తునికి సహాయముచేసినవాడైనయెడల అంతటిప్రఖ్యాత పురుషుని మెగస్తనీసు పేర్కొనకుండునా? అతడు పేర్కొనలేదుగనుక కౌటిల్యుడప్పటివాడు కాజాలడు అని వీరిసిద్ధాంతము. కాని మెగస్తనీసు చంద్రగుప్తుని ఆస్థానములోనుండిన వారినెవ్వరిని పేర్కొనలేదు. అంతమాత్రము చేత నతని ఆస్థానమందు పేర్కొనదగిన వారెవ్వరు లేరనిగాని, కౌటిల్యుడను వాడు లేడనిగాని, నిర్ణయించుట హాస్యాస్పదమగును. (2) పరిపాలనావిధానమునుగురించియు ఇతరవిషయములనుగురించియు మెగస్తనీసు గావించిన వివరణమునకును కౌటిల్యుని అర్థశాస్త్రములోని వివరణమునకును ఎంతో భేదమున్నది. వీరిద్దరు ఒకేకాలమందు ఒకేచక్రవర్తి ఆస్థానమందుండియుండిన యెడల ఇట్టిభేదమున కవకాశ ముండునా? అనునది వీరిప్రశ్న. వారుభిన్న కాలములలో నుండినవారగుటచేతనే ఇట్టిభేదము కనిపించుచున్నదని వీరి సమాధానము. మెగస్తనీసు చంద్రగుప్తుని కాలమునాటి వాడనుట నిస్సంశయము. అందుచేత కౌటిల్యుడు తర్వాతికాలమువాడుగ నుండవలెనని వీరి సిద్ధాంతము.

ఈ సిద్ధాంతముకూడ సహేతుకము కాజాలదు. ఇట్లనుటకు కొన్ని కారణములు కలవు: (1) మెగస్తనీసు సమకాలపరిస్థితులను వివరించినవాడు. కౌటిల్యుడట్టివాడుకాడు. అతనియుద్దేశము దీనికిభిన్నమైనది. భూసంపాదన

పరిపాలనములగురించి పూర్వాచార్యులు చెప్పినవిషయములను సేకరించి సంప్రదాయసిద్ధమగు విధానమును వివరించుటయే తనయుద్దేశమని గ్రంథాదియం దతడు తెలిపియున్నాడు (1–1–1). అతడు వివరించిన విధానము సర్వకాలములకు వర్తించునట్టిది. అతనిది శాస్త్రగ్రంథము; ఇండిక వలె సమకాలిక చరిత్రగ్రంథముకాదు. (2) మెగస్తనీసు మౌర్యసామ్రాజ్య పరిపాలనావిధానమును చక్కగ అర్థముచేసికొనగలిగెనా అనువిషయముగురించి చరిత్రకారులు సంశయము లనేకములను వెలిపుచ్చియున్నారు. గ్రీకుల అనుభవమును పురస్కరించుకొని మౌర్యపరిపాలనావిధానము నతడు వ్యాఖ్యానించెనని అనేకులభావము. మౌర్యులనాటి గ్రామపరిపాలనము, సైనికవ్యవస్థ, నగరపరిపాలనము మున్నగు విషయములలో నత డిట్లు వ్యాఖ్యానించెనని ఊహించుట కవకాశ మున్నది. అందుచేత అతని వివరణమే సరియైనదని చెప్పుటకు వీలులేదు. (3) కొన్నివిషయములలో నతడు పూర్తిగ పొరపడినట్లు చరిత్రకారు లంగీకరించియున్నారు. చంద్రగుప్తుని కాలమున పన్నులసంఖ్య చాలతక్కువగ నుండెననియు, అప్పటిభారతీయులకు అయిదులోహములు మాత్రమే తెలిసియుండెననియు, భరతఖండములో బానిసలేలేరనియు, పాటలీపుత్రపు అగడ్తవెడల్పు 177 మీటర్లనియు అతడు చెప్పియున్నాడు. కాని ఇదంతయుసత్యము కాదు. ఇట్టి పొరపాటులత డనేకములను గావించియున్నాడు. వీనితో పోల్చిచూచినయెడల కౌటిల్యుని వివరణమే సరియైనదని తోపకమానదు. (4) ఇంతకూ మెగస్తనీసు గ్రంథముప్రతి మనకులభించలేదు. దానినుండి ఇతర గ్రీకుగ్రంథకర్తలు సంకలనముచేసిన కొన్నిభాగములనుండి అతని గ్రంథ మెట్టిదో మన మూహించవలసియున్నది. ఇట్టిపరిస్థితిలో అతని వివరణమునకును కౌటిల్యుని వివరణమునకును భేద మున్నదను కారణమున వారు సమకాలికులు కారని సిద్ధాంతముచేయుట ఆధారరహితమగు వాదమే అగును.

కౌటిల్యుడు చంద్రగుప్తుని కాలమునాటివాడే అయినయెడల చంద్రగుప్తుని రాజధానియగు పాటలీపుత్రమును అర్థశాస్త్రమం దత డెందుకు పేర్కొనలేదు? పేర్కొనకపోవుటచేత అత డాకాలమువాడు కాడనియే మనము ఊహించుట సమంజసమని కొందరు విమర్శకుల అభిప్రాయము. కాని కౌటిల్యుడు వాని గ్రంథమందు నగరములు వేనినికూడ పేర్కొనలేదు. అతడు పేర్కొనిన నేపాళము, పౌండ్రకము, అపరాంతము, మగధ, మేకల మున్నగు ప్రదేశములు పణ్యపదార్థములకు ప్రసిద్ధిగాంచినట్టివి. పాటలీపుత్రమునకట్టి ప్రాశస్త్యములేకపోవుటచేత నతడు దానినిగురించి ప్రస్తావించవలసిన అవసర మేర్పడలేదు.

అర్థశాస్త్రములో పేర్కొనబడిన చీనా, హారహూర, కపిల, కొంభోజ, ఆరట్ట, బాహ్లిక, సువర్ణకుడ్య, సువర్ణభూమి, పాండ్యకవాట, తామ్రపర్ణి మున్నగు ప్రదేశములతో ఉత్తరభారతదేశములోనివారికి క్రీ. పూ. నాల్గవశతాబ్దమున పరిచయముండలేదనియు, అట్టిపరిచయము తర్వాతికాలముననే వారికి కలిగినదనియు, అందుచేత కౌటిల్యుడు నాల్గవశతాబ్దమునకు తర్వాతివాడుగ నుండవలెననియు కొందరివాదము. కాని ఇదికూడ బలము లేనివాదము. అర్థశాస్త్రములోని చీనాదేశము ఇప్పటిచీనా అనియు, దీని కీపేరు క్రీ. పూ. మూడవశతాబ్దపు రెండభాగమున చిన్ జాతివారు జయించిన తర్వాతనే లభించెననియు వీరిఅభిప్రాయము. కాని అర్థశాస్త్రములోని చీనా ఇప్పటి చీనా కాదన్నమాటను వీరు విస్మరించుచున్నారు. చిన్‌జాతివారు తొలి కాలమున నివసించిన వాయవ్యచీనాలోని ప్రాంతమున కిట్టి పేరు క్రీ. పూ. ఏడవశతాబ్దమందుండి ఉండెను. ఇదిగాక కాశ్మీరు వాయవ్యభాగములో గిల్గిట్ ప్రాంతమందు నివసించు షినాజాతివారి ప్రాంతమే అర్థశాస్త్రములోని చీనా అనిచెప్పుటకుకూడ అవకాశమున్నది. ఇట్టిపక్షములో విమర్శకుల ఆక్షేపణకు సమాధానము లభించుచున్నది. ఇదేవిధముగ వారు హారహూర, కపిల, కాంభోజ, బాహ్లికదేశముల విషయమునకూడ పొరపడియున్నారు. ఇవి భరతఖండమున కావల వాయవ్యప్రాంతమందుండునట్టివి. వీనితో భారతీయులకు పరిచయము క్రీ. పూ. మూడవశతాబ్దముతర్వాత గ్రీకుల మూలమున కలిగినట్లు వీరు భావించుచున్నారు. కాని క్రీ. పూ. 518 ప్రాంతమున పారశీకపు చక్రవర్తి డెరయస్ వాయవ్యభారతములోని కొన్నిప్రాంతములను జయించినప్పటినుండి హారహూరాదులతో భారతీయులకు పరిచయమేర్పడినట్లు చెప్పవచ్చును. ఇదిగాక క్రీ. పూ. 3000 నుండి పశ్చిమ ఏషియా దేశములతో భరతఖండమునకు సంబంధమున్నట్లు మొహంజదారో, హరప్ప మొదలగు సింధునదీతీర ప్రదేశములలోని ప్రాచీనకాలపు శిధిలములవలన తెలియవచ్చుచున్నది. అందుచేత వనాయువు (అరేబియా) క్రీ. పూ. నాల్గవశతాబ్దపు వారికి తెలిసియుండెననుటలో సంశయింపవలసినది లేదు. ఇట్లే ఉత్తరభారతములోని ఆర్యులకు క్రీ. పూ. 500 నాటికి దక్షిణాపథముతోను ద్రవిడదేశముతోను సంబంధ మేర్పడినట్లు చెప్పుట కనేక ఆధారములు కలవు. అందుచేత తామ్రపర్ణి, పాండ్యకవాటము మొదలగునవి అప్పటిమగధదేశములోనివారికి తెలిసియుండును. కావున ఈ ప్రదేశములు అర్థశాస్త్రమందు పేర్కొనబడుటచేత ఇది క్రీ. పూ. నాల్గవశతాబ్దముతర్వాత వ్రాయబడిన గ్రంథమను వాదము సారము లేనట్టిది అని భావించవచ్చును.

కౌటిల్యుని అర్థశాస్త్రమందు పరిపాలనవిధానమునకు సంబంధించిన విషయములనుగురించియేగాక శిల్పము, రత్నములు, ఆయుధములు,

గుఱ్ఱములు, ఏనుగులు మున్నగువిషయములనుగురించికూడ వివరము లనేకము లున్నవి. పరిపాలనమునకు సంబంధించిన వివరములను పూర్వాచార్యుల గ్రంథములనుండి తాను సేకరించిన ట్లతడు చెప్పియున్నాడు ; కాని ఇతర విషయములనుగురించిన వివరములను ఏ గ్రంథములనుండి సంగ్రహించెనో అతడు చెప్పలేదు. చెప్పకపోయినను, వీనిని ఏవియో కొన్ని గ్రంథముల నుండి సేకరించియుండవలెనని భావించవచ్చును. స్వతంత్రముగ తానే పరిశోధనగావించి వీనినన్నిటిని తెలిసికొనెనని చెప్పుట పొసగదు. ఇట్టిసందర్భములలో నతనికి సహాయపడిన గ్రంథము లేవి ? అవి ఏకాలమునాటివి ? అను ప్రశ్నలు బయలుదేరుట సహజము. శిల్పము మొదలగువానికి సంబంధించిన గ్రంథములలో క్రీస్తుపూర్వమునాటివి మనకు లభ్యముకాలేదు. ప్రస్తుతము ప్రచారములోనున్నవి క్రీ. శ. 5, 6 వ శతాబ్దములకు తర్వాత వ్రాయబడినవి. వీనిలో మానసారము, సమరాంగణసూత్రధార మున్నగునవి శిల్పశాస్త్రగ్రంథములు, బృహత్సంహిత, యుక్తికల్పతరువు, మానసోల్లాసము మున్నగువానిలో రత్నములనుగురించియు, (కొన్నిటిలో) ఆయుధములను గురించియు వివరము లున్నవి. శాలిహోత్రుని అశ్వశాస్త్రము, నకులుని అశ్వశిక్షితము మున్నగువానిలో గుఱ్ఱములనుగురించియు, పాలకాప్యుని హస్తిశాస్త్రమందు ఏనుగులనుగురించియు వివరము లున్నవి. కౌటిల్యుడు శిల్పము మొదలగువానికి సంబంధించిన వివరముల నన్నిటిని మధ్యయుగమునకు చెందిన ఈగ్రంథములనుండియే సేకరించియుండవలె ననియు, అందుచేత నతడు మధ్యయుగమువాడుగ నుండవలెననియు కొందరి అభిప్రాయము.

కాని, ఇది సమర్థించదగిన అభిప్రాయము కాజాలదు. ఇందులో రెండు లోపము లున్నవి. ప్రాచీనకాలమందు శిల్పము మొదలగు విషయములకు సంబంధించినగ్రంథములు రచింపబడలేదని అనుకొనుట మొదటిలోపము. ఇట్టిగ్రంథములు మనకు లభ్యముకానంతమాత్రమున వాని రచనయే జరుగలేదని భావించుట తగదు. అర్థశాస్త్రమును గురించిన పూర్వాచార్యుల గ్రంథములన్నియు శిథిలములైనట్లు ఈ గ్రంథములుకూడ శిథిలములై ఉండవచ్చును. ఇదిగాక శిల్పము మొదలగువానికి సంబంధించిన వివరములను కౌటిల్యుడు గ్రంథములనుండియే సేకరించెనని భావించరాదు. దుర్గనిర్మాణాదులయందును, రత్నపరీక్షయందును, ఆయుధాదుల తయారుచేయుటయందును, గుఱ్ఱములకు ఏనుగులకు శిక్షణనిచ్చుటయందును నిపుణులెందరో ప్రాచీనకాలమం దుండియుండవలెను. వారితో సంప్రదించి వారి సహాయమున కౌటిల్యుడు తనకు కావలసిన వివరములన్నిటిని సంగ్రహించి తన గ్రంథములో చేర్చియుండవచ్చును. ఈ సందర్భములో మరియొక ప్రధానవిషయము గుర్తించవలసియున్నది. దానిని గుర్తించకపోవుటయే కౌటిల్యుడు

మధ్యయుగమువాడని చెప్పువారి అభిప్రాయములోని రెండవలోపము. ఈ విషయు మే మనిన, అనేకఅంశములలో అర్థశాస్త్రములోని వివరములకును మానసోల్లాసాది మధ్యయుగ గ్రంథములలోని వివరములకును ఎంతో భేద ముండుట. దుర్గనిర్మాణము, అంతఃపురనిర్మాణము, దుర్గనివేశము మొదలగు నవి కౌటిల్యుని కాలమున మానసారాదులలో వివరించిన విధానము ననుస రించి జరుగలేదు. ఇట్లే రత్నములు, ఆయుధములు, గుర్రములు, ఏనుగులు మున్నగువానికి సంబంధించిన వివరములలో ఎంతో భేదమున్నది. కావున అర్థశాస్త్రములోని సంప్రదాయములకును, మధ్యయుగగ్రంథములలోని సంప్ర దాయములకును సన్నిహితసంబంధము లేకుండుట స్పష్టము. ఇట్టి సందర్భములో కౌటిల్యు డీగ్రంథముల నాధారముగచేసుకొని తనగ్రంథమును వ్రాసె ననియు, ఇందుచేత నతడు మధ్యయుగమునకు చెందినవాడనియు పరిశోధ కులు కొందరు లేవదీసిన వాదము నిరాధారమనియే చెప్పవలసి యున్నది. కొంద రీవిషయములో కువాదముకూడ చేసియున్నారు. కౌటిల్యుడు కామందకునికి తర్వాతివాడని భావించినవారు లేకపోలేదు.

పై వివరణమునుబట్టి అర్థశాస్త్రము వ్రాసినవాడు కౌటిల్యుడు కాడనియు, ఒక వేళ నతడు దానిని వ్రాసినను అది క్రీ. పూ. నాల్గవశతాబ్దపు గ్రంథము కాదనియు విమర్శకులు కొందరు వ్యక్తపరచిన అభిప్రాయము సహేతుకము కాదని చెప్పవలసియున్నది. అర్థశాస్త్రమును వ్రాసినవాడు కౌటిల్యుడే అనియు, అతడు నందరాజులను నిర్మూలించి మౌర్యసామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్తచక్రవర్తికి కుడిభుజముగనుండిన వాడనియు, అందుచేత క్రీ. పూ. నాల్గవశతాబ్దికి చెందినవా డనియు చెప్పుటయే విశ్వసించ దగియున్నది. క్రీ. త. అయిదవశతాబ్దినుండి ఇట్టి ప్రతీతి దేశమందు వ్యాపించియున్నది. దీనిని త్రోసి పుచ్చుటకు బలమగు ఆధారము లేవియు కనిపించవు.

## 5

కౌటిల్యుడు భరతఖండములోని ఏ ప్రాంతమువాడో నిర్ణయించుటకు కావలసిన అధారములు లభించలేదు. సత్యమిదియని నిస్సంశయముగ తెలి యని సందర్భములో ఊహాగానమున కెంతో అవకాశ మున్నది. ఇట్టి అవ కాశమును పురస్కరించుకొని పరిశోధకులు కొంద రితడు దాక్షిణాత్యు డనియు, మరికొంద రితడు వింధ్యకు ఉత్తరముననుండు ఆర్యావర్తమువా డనియు నిరూపించుటకు ప్రయత్నము చేసియున్నారు. కాని వీరు సూచించు కారణము లేవియు సమర్థించతగినవి కావు.

ఇతడు దాక్షిణాత్యుడని భావించువారు చూపించు కారణములలో

కొన్ని ఇచట పేర్కొనదగియున్నవి. మార్గములను వివరించుసందర్భమున మెట్టమార్గములలో కంబళ్ళు, చర్మములు, గుర్రములు లభించు హిమవంతమునకు వెళ్ళు ఉత్తరమార్గమునకంటె శంఖములు, వజ్రములు, మణులు, ముత్తెములు లభించు దక్షిణాపథమునకువెళ్ళు దక్షిణమార్గము ఉత్తమమని కౌటిల్యుడు చెప్పెను. (7-12-23-24). ఇట్లే దక్షిణదేశమందలి రత్నముల నత్యధికముగ ప్రశంసించియున్నాడు (2-11-2,3). ఈ ప్రశంసల కితని స్వదేశాభిమానమే కారణమని వీరి ఊహ. ఇదిగాక అర్థశాస్త్రపు వ్రాతప్రతు లనేకములు దక్షిణదేశమందే లభించినవి. దీనికితోడు అర్థశాస్త్రములోని వివరములు కొన్ని బౌధాయనసూత్రములలోని వివరములతో సాదృశ్యముకలవిగ నున్నవి. బౌధాయనుడు దాక్షిణాత్యుడు. కౌటిల్యుడుకూడ దాక్షిణాత్యుడగుటయే ఈ సాదృశ్యమునకు హేతువుగనుండవలెనని వీరి అభిప్రాయము. ఇట్లే దాక్షిణాత్యుడగు దండిమహాకవికి కౌటిల్యుని అర్థశాస్త్రముతోనున్న పరిచయము తక్కిన సంస్కృతగ్రంథములతోడి పరిచయముకంటె నత్యధికముగ నున్నది. దీనికికారణము కౌటిల్యుడుకూడ దాక్షిణాత్యుడగుటయే — అని ఈవర్గమునకు చెందిన పరిశోధకుల వాదము.

కాని ఇది బలములేని వాదమని చెప్పకతప్పదు. కౌటిల్యుడు దక్షిణమార్గమును, రత్నములను ప్రశంసించుటకు అతనిస్వదేశాభిమానము కారణము కాజాలదు. ఇందునకు రత్నములు విలువగలపదార్థము లగుటయు, అవి దక్షిణదేశమున లభించుటయు కారణములని అతడే చెప్పియున్నాడు. బౌధాయన కౌటిల్యుల గ్రంథములలోని సాదృశ్యమునకు వారిద్దరు దాక్షిణాత్యులగుట కారణమని చెప్పరాదు. వారిద్దరు ఒకేమూలగ్రంథమునుండి వివరములనేకములను సేకరించియుండుటయుకూడ దీనికికారణము కావచ్చును. దండిమహాకవికి అర్థశాస్త్రముతో పరిచయముండుటకు అర్థశాస్త్రములోని విషయము లనేకములు అతనిరచనకు అవసరమగుటయే. ముద్రారాక్షసము వ్రాసిన విశాఖదత్తుడు దాక్షిణాత్యుడు కాకపోయినను కౌటిల్యునితో దండికంటె నెక్కువ పరిచయముకలవాడు. కవుల పరస్పరపరిచయమునకు ఒక్కేప్రదేశమందు నివసించవలసిన అవసరములేదు. అర్థశాస్త్రపు వ్రాతప్రతులిటీవల ఉత్తరప్రాంతమందుగూడ లభించినవి. కావున కౌటిల్యుడు దాక్షిణాత్యుడని దృఢముగ నిరూపించుటకు కావలసినకారణములు కనిపించుటలేదనియే చెప్పవలెను.

ఇతడు వింధ్యకు ఉత్తరముగనుండు ఆర్యావర్తమునకు చెందినవాడని భావించువారు దానికితగిన కారణములు కొన్నిటిని సూచించియున్నారు. అర్థశాస్త్రమందు 18 ముహూర్తములుగల పగలు అతిదీర్ఘమైనదని చెప్పబడియున్నది (2-20-37, 38). అట్టిపగలు ఉత్తరప్రాంతమందే కానవచ్చును. ఇట్లే

ఆషాఢమాసమందు మధ్యాహ్నమున నీడ ఉండదని చెప్పబడియున్నది (2–20–41). ఇదికూడ ఉత్తరప్రాంతపులక్షణమే. వర్ష పాత మధికముగనుండు ప్రాంతములను వివరించుసందర్భమున అశ్మక, అవంతి, అపరాంత, హైమన్య ప్రదేశములనే పేర్కొనెనుగాని దక్షిణప్రాంతములోని వానినిపేర్కొనలేదు (2–24–5). వాక్పారుష్యమును వివరించు సందర్భమున నతడు ఉత్తర ప్రాంతములలోని ప్రాజ్జున గాంధారదేశములను పేర్కొనెను (3–18–9). వీటినన్నిటినిబట్టి అతనికి ఉత్తరదేశముతో ఎక్కువ పరిచయ ముండెననియు, దీనికి అతడు ఉత్తరదేశమున పుట్టిపెరిగినవాడగుటయే కారణ మనియు ఈవర్గమునకు చెందిన పరిశోధకుల ఊహ.

కాని ఇదికూడ సరియగు ఊహ కాజాలదు. పగలు నీడ, వర్షపాతము మున్నగు విషయములనుగురించి ఎవరు వ్రాసినను ఇట్లే వ్రాయుదురుగాని ఉత్తర దేశవాసులు ఒకవిధముగను, దాక్షిణాత్యు లింకొకవిధముగను వ్రాయుట కవకాశము లేదు. వీనియన్నిటికి సంప్రదాయమో జ్యోతిష్యగ్రంథములో ఆధారములు.

కావున కౌటిల్యుడు దాక్షిణాత్యుడనిగాని ఉత్తరదేశమువాడనిగాని నిస్సంశయముగ నిర్ణయించుట సాధ్యము కాదు. ప్రతీతి మాత్రము అతడు ఉత్తరప్రాంతమునకు చెందినవాడని చెప్పుచున్నది. బౌద్ధగ్రంథములలో నతడు తక్షశిల ప్రాంతమువాడని కలదు. ఇదియే సత్యము కావచ్చునని అనేకుల అభిప్రాయము.

## 6

కౌటిల్యుని జీవితచరిత్రనుగురించి మనకు తెలిసిన విషయములు చాల తక్కువ. ఇతడు తక్షశిలా నగరమున జన్మించినవాడని అనేకులు ఊహించు చున్నారు. ఇతనిపూర్వీకులు ఋషితుల్యులగు బ్రాహ్మణులు. ఇతడు వేద వేత్తయేగాక, ఆకాలపు విద్యలనన్నిటిని సమగ్రముగ నభ్యసించెను. ఇతడు విద్వాంసు డయినను యౌవనదశలో దొంగనాణెములను తయారుచేసి విస్తార మగు ధనమును సంపాదించెనని కొన్నికథలు కలవు. ఇతని కాలమందు నవ నందు లను రాజులు మగధరాజ్యమును పాలించుచుండిరి. వీరు క్షత్రియ రాజ వంశములను నిర్మూలము గావించినవారనియు శూద్రులనియు పురాణములు చెప్పుచున్నవి. వీరు వైదికేతరమతములగు బౌద్ధజైనమతములలో నొకదాని నవలంబించినట్లు తోచుచున్నది. వీరు ప్రజలను పీడించి, ధనమును సంగ్రహించి రనికూడ తెలియవచ్చుచున్నది. శిష్టబ్రాహ్మణుడగు కౌటిల్యున కీ ప్రభు త్వము ధర్మరహితమయినదిగ కనబడెను. ఇదిగాక ఒకసమయమందు నందు

లతనిని పరిభవించిరి. అప్పు డతడు క్రోధావేశుడై వారివంశమును నిర్మూలముచేయునట్లు ప్రతిజ్ఞపట్టెను. దీనిని సాధించుకొను ప్రయత్నములో నతడు చంద్రగుప్తునికి మిత్రు డయ్యెను. చంద్రగుప్తుడు నందరాజునకు వేశ్యయందు పుట్టిన పుత్రుడనియు, నందరాజుయొక్క ఔరసపుత్రు లతనికి మానభంగము గావించిరనియు, అందుచేత నతడు వారియెడల విరోధము వహించెననియు ప్రాచీనగాథలవలన తెలియుచున్నది. మహాశూరుడగు చంద్రగుప్తుడును, సకలవిద్యాసంపన్నుడును రాజనీతిశాస్త్రకోవిదుడును అగు కౌటిల్యుడును కలిసి గొప్పసైన్యమును సమకూర్చుకొని పార్వతకుడను రాజుయొక్క సహాయమును సంపాదించి నందుల నోడించి మగధరాజ్యమును వశపరచుకొనిరి. కౌటిల్యు డీవిధముగ తనప్రతిజ్ఞను చెల్లించుకొని చంద్రగుప్తునికి పట్టాభిషేకము గావించి మౌర్యసామ్రాజ్యస్థాపనమందు ప్రధానపాత్రను వహించెను. అటుతర్వాత కొంతకాల మతడు చంద్రగుప్తుని వద్ద అమాత్యుడుగ నుండినట్లు కొందరు ఊహించుచున్నారు గాని ఇందులో సత్య మున్నట్లు తోచుటలేదు. తనప్రతిజ్ఞ కొనసాగినవెంటనే అతడు రాజకీయములనుండి విరమించుకొనినట్లు కనిపించుచున్నది. అతని జీవితమును గురించి ఇంతకంటె నెక్కువవివరములను తెలిసికొనుటకు విశ్వసనీయములగు ఆధారములు లేవు. ముద్రారాక్షసనాటకమును చదివినయెడల కౌటిల్యుని శక్తిసామర్థ్యములు రాజనీతిని ప్రయోగించుటయందు అతనికి గలనేర్పు మనకు స్పష్టముకాగలవు.

మానవుని స్వభావమును వానిచర్యలవలనను మాటలవలనను తెలిసికొనవచ్చును. కౌటిల్యుని స్వభావమును తెలిసికొనుటకు అర్థశాస్త్రములో నతడు వ్యక్తపరిచిన అభిప్రాయములు మనకు సహాయపడుచున్నవి. అతడు పూర్వాచార్యుల వాదము లనేకముల ఖండించియు కొన్నిటిని సమర్థించియు ఉన్నాడు. ఈవాదప్రతివాదములను పరిశీలించినయెడల అతనిబుద్ధి విశాలమైనదనియు విషయనిర్ణయమందు స్పష్టతను కోరునట్టిదనియు, "అతిసర్వత్ర వర్జయేత్." అనువాక్యానుసారముగ నతడు వర్తించినవాడనియు, యుక్తులను సాధించుటయందు వ్యవహారానుకూల్యమే ప్రధానాంశముగ నెంచినవాడనియు, దుర్మార్గమును సహింపనివాడనియు, వైదికమతమం దత్యంతమగు అభిమానముకలవా డనియు స్ఫురించును.

విభక్తాంశములందలి భిన్నలక్షణములను సమానధర్మములను స్పష్టపరచుటయే విషయవిభాగమువలన కలుగు ప్రయోజనమని అతడు భావించెను. ఇది జరిగినప్పుడు స్వల్పములగు భేదముకూడ మనకు తెలియగలవు. ఇట్టి ప్రయోజనమును కౌటిల్యు డపేక్షించె ననుటకు అర్థశాస్త్రములో అనేక నిదర్శనము లున్నవి. విద్యలు మూడనియు రెండనియు ఒక్కటేఅనియు పలు

వ్వరు పలువిధముల వాదించుచుండ విద్యలునాలుగని అతడు నిర్వచించుటయు (1-2-2-8), గుణములు సంధివిగ్రహములను రెండే అని కొందరిమతమైనను అవి ఆరుఅని అతడుచెప్పుటయు (7-1-3.5), ఇట్టి నిదర్శనములలో కొన్ని. వాదప్రతివాదములందు కౌటిల్యుడు "అతి" ని వర్జించి మధ్యమార్గమునుత్రొక్కి యున్నాడు. ప్రజలఉద్వేగములకు కారితీయు తీక్ష్ణదండముగాని, ప్రజల అవహేళనకు కారణమగు మృదుదండముగాని కూడదనియు యథార్థమగు దండము మాత్రమే పూజింపతగినది అను అతనివాక్యము (1-4-7,10). ధర్మార్థములకు విరోధములేక కామములను తీర్చుకొనవలెనుగాని సుఖములను త్యజించ రాదు...త్రివర్గమును సమముగ సేవింపవలెను అను వాక్యము (1-7-3,4) సంతానమునకు బీజముమాత్రముగాని క్షేత్రముమాత్రముగాని ప్రధానము కాదు, అవి రెంటికి చెందినది అనువాక్యము (3-7-1,3) మున్నగునవి అతని సమదృష్టికి ఉదాహరణములు. పిడివాదము చేసి ఏదియో ఒకవిధమున తన వాదమును నిలబెట్టుకొనవలెననిభావించు శాస్త్రవేత్తలలో కౌటిల్యుడొకడు కాడు. కార్యసాఫల్యమే అతనిప్రధానోద్దేశము. అమాత్యోత్పత్తి ప్రకరణములో పరాశరాదుల అభిప్రాయములను జెప్పి తుదకు, పైని చెప్పినదంతయు (అందరి అభిప్రాయములు) న్యాయముగానే ఉన్నవి...వారివారి సామర్థ్యములనుబట్టి....వారిని అమాత్యులుగ నియమించవలెను," అనిచెప్పియున్నాడు. (1-8-27, 29) ఇట్టి వాక్యము లనేకము లున్నవి.

కౌటిల్యుడు ధర్మచింత గలవాడు. అన్యాయప్రవృత్తిని గర్హించువాడు. స్వలాభమునుగాని తాత్కాలిక లాభమునుగాని అపేక్షించు వారియెడల గాఢవైరము గలవాడు ప్రభువు మరణావస్థయం దున్నప్పుడుగాని మృతిచెందిన వెంటనేగాని అమాత్యుడు న్యాయాన్యాయముల పాటింపక తానే సింహాసనారూఢుడగుట పరమధర్మమను భారద్వాజాదుల మతమును ఖండించి ఆత్మసంపన్నుడగు రాజపుత్రునే రాజ్యమునకు పట్టాభిషిక్తునిగ చేయవలెనని సిద్ధాంతపరిచియున్నాడు (5-6-24-33). రాజపుత్రరక్షణ ప్రకరణమందలి అభిప్రాయములనుబట్టికూడ కౌటిల్యుని ధర్మచింత వ్యక్తమగుచున్నది. (1-17-22,27). పదునాల్గవ అధికరణమందు వివరింపబడిన ఔపనిషదికములగు క్రూరకర్మలను చాతుర్వర్ణ్యరక్షణార్థమై అధర్మిష్ఠులయెడ ప్రయోగించవలెనేగాని స్వలాభము నుద్దేశించి ధర్మిష్ఠులయెడ ప్రయోగించరాదని చెప్పియున్నాడు. "కౌటిల్యః కుటిలమతిః," అను ముద్రారాక్షసములోని వాక్యము సహేతుకమైనట్టిది కాదు.

పైనిచెప్పినచొప్పున కౌటిల్యుడు వైదికమతాభిమాని అనువిషయమును కామందకుడు

జాతవేదా ఇవార్చిష్మాన్ వేదాన్ వేదవిదాంవరః
యోధీతవాన్ సుచతురః చతురో ప్యేకవేదవత్

అను వాక్యముచే బలపరిచియున్నాడు. వైదికమతవిరోధులగు నందరాజులను నిర్మూలించి కౌటిల్యుడు వైదికమతమును పునరుద్ధరించెను. కావుననే అతడు తనఅర్థశాస్త్రమందు చతుర్వర్ణచతురాశ్రమములకు ప్రాధాన్యము కల్పించెను. రాజపుత్రుడు నేర్చికొనవలసినవిద్యలలో త్రయిని (మూడువేదములు) కూడ చేర్చియున్నాడు (1–5–8). లోకము చతుర్వర్ణ చతురాశ్రమములతో కూడినట్టిది (1–4–16). రాజు వర్ణాశ్రమస్థితికి కర్త. లోకము త్రయిచేత రక్షింపబడుచున్నది (1–3–17). సర్వధర్మములకు నాశము సంభవించినప్పుడు ధర్మప్రవర్తకుడై చతుర్వర్ణ చతురాశ్రమములతోకూడిన ఈలోకమును రాజు రక్షించుచున్నాడు (3–1–38). ఇట్టివాక్యములవలన కౌటిల్యుని వైదికమతాభిమానము స్పష్టమగుచున్నది.

## 7

కౌటిల్యుని అర్థశాస్త్రమందు వివరింపబడిన పరిపాలనావిధాన మెట్టిదో మన మిప్పుడు తెలిసికొనవలెను.

ప్రపంచవ్యాప్తమగు అనుభవముగల ప్రస్తుతకాలపు రాజనీతిశాస్త్రవేత్తలు రాజ్యముల పాలించుటయందు తుదిఅధికారముగలవారి సంఖ్యనుబట్టి రాజ్యములను ఏకస్వామికములు; బహుస్వామికములు (లేదా, అల్పసంఖ్యాకస్వామికములు), ప్రజాస్వామికములు అని మూడురకములుగ విభాగము చేసియున్నారు. వంశపారంపర్యముగ లభించిన అధికారము వహించినరాజులచే పాలింపబడు నేపాలు ఆఫ్గన్‌స్థానమువంటి రాజ్యములు, సైనికనియంతలచే పాలింపబడు బర్మా, పాకిస్తాన్, ఈజిప్టు వంటిరాజ్యములు ఏకస్వామికములు. ప్రజలలో అల్పసంఖ్యాకులగు కమ్యూనిస్టుపక్షమునకు చెందినవారిచే పరిపాలింపబడు సోవియట్ రష్యా, చైనాలవంటి రాజ్యములు బహుస్వామికములు (లేదా, అల్పసంఖ్యాకస్వామికములు). క్రమబద్ధమగు ఎన్నికలలో ప్రజలు స్వేచ్ఛగ ఎన్నుకొనిన ప్రతినిధులచే పరిపాలింపబడు భారతదేశము, ఇంగ్లండు, అమెరికాలవంటి దేశములు ప్రజాస్వామికములు.

కౌటిల్యునిదృష్టి భరతఖండమునకుమాత్రమే పరిమితమైనట్టిది. దీనినే అతడు చక్రవర్తి క్షేత్రమని పేర్కొనెను (9–1–18). ఇందు అతనికాలములో నుండిన రాజ్యములు రాజులచే పరిపాలింపబడిన ఏకస్వామికములు. ఇట్టి రాజ్యములే ఆదర్శరాజ్యములని అతనిభావము. రాజ్యమున కుండవలసిన అంగములు ఏడింటిలో "స్వామి" అగ్రస్థానము వహించియుండెను. కొన్ని

ప్రాంతములందు అల్పసంఖ్యాకస్వామికరాజ్యము లుండెను. వానిని కౌటిల్యుడు సంఘపాలితరాజ్యము లని పేర్కొనెను. కాని అట్టివానిసంఖ్య చాల తక్కువ. అందుచేత కౌటిల్యుడు వివరించిన పరిపాలనావిధానమంతయు ఏకస్వామిక రాజ్యముల నుద్దేశించినట్టిదని చెప్పవచ్చును.

ఇట్టిరాజ్యములలో పరిపాలనాధికారమంతయు రాజులవశమందుండెను. అది నిరంకుశమగు అధికారమనికూడ చెప్పదగియున్నది. భాగస్వాము లెవ్వరు లేక ఒకడేవహించుఅధికారము నిరంకుశాధికారము. రాజుతో అధికారమును పంచుకొనినవారెవ్వరును కౌటిల్యుడు వివరించిన రాజ్యములందు లేరు; అట్టి వారుండవలెననికూడ నతడు భావించలేదు. కౌటిల్యునినాటికి వైదికయుగమందుండిన సభలు సమితులు అదృశ్యములయ్యెను. ప్రస్తుతకాలమందున్నట్లు శాసనసభలేవియు ఏర్పడలేదు. కావుననే కౌటిల్యు డుద్దేశించిన రాజు నిరంకుశుడని చెప్పవలసియున్నది.

బలవంతులనుండి బలహీనుల రక్షించుటకును, సంఘజీవితమున కాధారములగు కట్టుబాటులను ప్రజలు అతిక్రమించకుండ చేయుటకును దండనాధికారముగల ప్రభుత్వములు అవసరమైనను అట్టి అధికారమును దుర్వినియోగముచేయుట కవకాశము ఎంతైన గలదు. అట్టిదుర్వినియోగము జరుగకుండుటకై ఆధునికకాలమందు రాజ్యము లనేకములలో లిఖితపూర్వమగు రాజ్యాంగములోని సూత్రముల ననుసరించియే ప్రభుత్వము అధికారమును చలాయించవలెనని విధింపబడియున్నది. కాని కౌటిల్యునికాలమందు ఇట్టి రాజ్యాంగముయొక్క అవసరమును గ్రహించినవారు కారు. అందుచేత అధికారదుర్వినియోగమునకు అవకాశ ముండెడిది.

కాని, సాధారణముగ రాజులు వారి అధికారమును దుర్వినియోగము చేయుచుండినవారుకారు. దీనికి కొన్నిప్రధానకారణము లుండెను. (1) ఇప్పటివలె నాకాలమున లిఖితపూర్వమగు రాజ్యాంగములు లేకున్నను రాజులు తరతరములనుండి వచ్చుచుండిన సంప్రదాయములు, కులాచారములు, దేశాచారములు మున్నగువానికి బద్ధులై పరిపాలనమును సాగించుచుండిరి. సాంఘికవ్యవస్థను మార్చుటకు వారికి అధికార ముండినదికాదు. రాజుచేయు శాసనములన్నియు సంప్రదాయబద్ధములుగ నుండెడివి. "ప్రజలు వారివారి ధర్మముల నతిక్రమించకుండునట్లు ప్రభువు చూడవలెను. అట్టిరాజు ఇహపర సౌఖ్యముల ననుభవించును" (1–3–16). ఇట్టిసూత్రము లీసందర్భమున గుర్తించవలసియున్నవి. (2) సంప్రదాయానుసారముగ రాజులు రాజ్యములను పరిపాలించునట్లు చేయుటకు సర్వప్రయత్నములు చేయబడుచుండెను. రాజ్యాభిషిక్తుడు కావలసిన రాజపుత్రుడు రాజ్యాధికారమున కర్హుడగుటకై

అతడు గర్భమునం దుండినప్పటినుండి పదునారు సంవత్సరముల వయసు వాడగువరకు ఎంతో శ్రద్ధవహించబడెను. "అవినీతిపాలగు రాజకులము శత్రువులు దెబ్బతీసిన మరుక్షణముననే నశించును. కనుక పట్టమహిషి ఋతుమతి యగునప్పుడు ఋత్విక్కు ఇంద్రబృహస్పతులకు చరువు ఆహుతిగ నియ్యవలెను. ఆమెగర్భవతికాగానే గర్భపోషణమునకును ప్రసవమునకును శిశువైద్యునొకనిని నియమించవలెను. ప్రసవమైన వెంటనే పురోహితుడు పుత్రసంస్కారమును చేయవలెను. తగినవయస్సు వచ్చినతర్వాత నతనికి పండితులచే శిక్షణ నిప్పించవలెను" అను సూత్రములు దీనికి నిదర్శనములు (1–17–23, 27). విద్యాభ్యాసకాలమందు శిష్టులవద్ద త్రయావిద్యను అన్వీక్షకీవిద్యను, అధ్యక్షుల వద్ద వార్తను, సిద్ధాంతము ప్రయోగము తెలిసినవారివద్ద దండనీతిని రాజపుత్రుడు నేర్చుకొనువాడు. ఇది గాక అతడు పురాణము, ఇతివృత్తము, అఖ్యాయిక, ఉదాహరణము, ధర్మశాస్త్రము మున్నగువానియందు శిక్షణ పొందుచుండువాడు (1–5–8–14). ఇట్టివిద్యాభ్యాసమువలన రాజులు సంప్రదాయములందు గౌరవముగలవారగుచుండిరి. అధికారమును దుర్వినియోగముచేయకుండుట కిదిపటిష్ఠమగు సాధనమయ్యెను. గ్రీకుతత్వవేత్తలలో అగ్రస్థానము వహించిన ప్లేటో అధికారసద్వినియోగమునకు విద్యయే సాధనమని చెప్పెనుగదా! (3) ఈ రెండుకారణములకంటె బలవత్తరమగు కారణము మరియొకటి ఉండెను. అధికారమును దుర్వినియోగము చేసిన యెడల ప్రజలు తుష్టికోల్పోయి ప్రభువుతో కలహింతురను భయము రాజులకుండెడిది. ఒక్కొక్కప్పు డట్టిప్రజలు శత్రువులతో కలియుచుండువారు. ఈవిషయమును కౌటిల్యుడు "అర్థక్షయమునకు లోబడిన ప్రజలు లోభులగుచున్నారు. లోభత్వమువలన విరాగమును పొందుచున్నారు. విరక్తులైన ప్రజలు శత్రువును చేరెదరు, లేదా, తామే తమప్రభువును చంపివేయుదురు" అని వివరించియున్నాడు. ఇట్టిభయము ప్రభువుల కుండుటచేత వారు వారి అధికారమును దుర్వినియోగము చేయకుండిరి.

ప్రజాస్వామికములలో ఎన్నికలు అప్పుడప్పుడు జరుగవలసియుండుట చేత వానిఫలితముగ ఏ రాజకీయపక్షములవారు అధికారమునకు వచ్చెదరో ఎవరు ప్రధానమంత్రి కాగలరో అనువిషయమై పదేపదే సందేహ మేర్పడుట కును ప్రభుత్వములు స్థిరత్వమును కోల్పోవుటకును అవకాశము కలదు. వంశ పారంపర్యముగ సింహాసనము నధిష్ఠించు రాజుల పరిపాలనవిధానములో ఇట్టిఅస్థిరత్వమున కవకాశ ముండదు. తండ్రిమరణానంతరము జ్యేష్ఠపుత్రుడు రాజ్యాధికారము వహించు ఆచారము ఏర్పడియుండెను. రాజ్యాధికారమును వహించినవాడు యావజ్జీవము అధికారమునం దుండుటచేత అధికారమును వహించినవారిలో పదేపదే మార్పులు జరుగకుండెను. రాచరికపు

విధానముమూలమున కలుగు ప్రయోజనములలో నిది ప్రధానమైనట్టిదిగ పరిగణింపబడుచుండెను.

కాని, దీనికి భిన్నమగు పరిస్థితు లేర్పడు ప్రమాదము లేకపోలేదు. వానిలో కొన్నిటిని కౌటిల్యుడు సూచించియున్నాడు. తండ్రిజీవితకాల మందు అతనికిని పుత్రునికిని మధ్య మనఃస్పర్థ లేర్పడవచ్చును. "రాజపుత్రులు ఎండ్రకాయతో సమానమగు ధర్మముకలవారు. అందువలన తండ్రినే భక్షించెదరు" (1–17–5). తండ్రినిచంపి తాము రాజులు కాగోరెదరు. కావున, అట్టి పుత్రులను జాగరూకతతో పరీక్షించుచు వారిని రహస్యవధకో, దేశాంతర వాసమునకో పాత్రుల జేయవలసియుండెను. ఒక్కొక్కప్పుడు తండ్రి జ్యేష్ఠ పుత్రునియెడ విరోధియగుటయు, ఇతరపుత్రుల యందభిమానము కలుగుటయు సంభవించుచుండెను. అప్పు డాపుత్రుడు దేశాంతరములకు వెళ్ళి బలమును సేకరించుకొని తండ్రిపై విక్రమించి రాజ్యాపహరణము చేయుట కలదు (1–18–7). ఇది గాక కొన్నిసమయములలో తండ్రిమరణానంతరము జ్యేష్ఠపుత్రుడు అధికారమునకు రాకూడదని కౌటిల్యుడు చెప్పియున్నాడు. "ఎట్టిపరిస్థితులలోకూడ దుర్బుద్ధియగు ఏకపుత్రుని సింహాసనాధిష్ఠితునిగ చేయరాదు" అని అతని అభిప్రాయము (1–17–51). అట్టిసందర్భములో రాజు జీవితకాలములోనే మరియొక పుత్రసంతానమును గాంచవలెననియు, లేదా, పుత్రికకు పుత్రసంతానము లభించునట్లు చూడవలెననియు సూచించియున్నాడు (1–17–48–49). స్త్రీలు అధికారమును వహించరాదని అతని అభిప్రాయము.

పుత్రుడు వినయసంపన్నుడైనను ఒక్కొకప్పు డతనికి రాజ్యము లభించకపోవచ్చును. ఈప్రమాదము అమాత్యుని దురాశచేగాని సామంతాదుల ప్రకోపముచేగాని సంభవించుచుండెడిది. కొన్నిసమయములందు ప్రభువు యొక్క మరణమును రహస్యముగ నుంచి, రాజబంధువులను పరస్పరము కలహించునట్లు చేసి, అమాత్యుడు రాజ్యమును గ్రహించుచుండువాడు. ఇదియే ధర్మమని భరద్వాజుని మతము (5–6–24,31). కౌటిల్యుడు "ఇది ప్రజల తిరుగుబాటునకు కారణ మగుచున్నది ; ఇది అధర్మము, దీనివలనకలుగు ఫలితముకూడ అనిశ్చితము" అని భారద్వాజుని మతమును ఖండిచెనుగాని (5–6–32) ఇట్టిప్రమాదము సంభవించవచ్చునని అంగీకరించెను.

సింహాసనము నధిష్ఠించినతర్వాత రాజు అమాత్యు లనేకులసహాయముతో పరిపాలనము చేయుట అవసరమని కౌటిల్యుని అభిప్రాయము. "ఇతరులసహాయముతోడనే రాజత్వము సాధ్యమగును. చక్ర మొకటే ఉన్నప్పుడు బండి నడువజాలదు" అని అత డనెను (1–7–9). పరిపాలనములో

రాజునకు సహాయముచేయువారందరికి అమాత్యులను పేరుండెను. అమాత్యులలో కొందరు పరిపాలనశాఖలకు అధ్యక్షులుగను, కొందరు సమాహర్త్రాది ప్రధానోద్యోగులుగను, కొందరు మంత్రిపరిషత్సభ్యులుగను, మరికొందరు మంత్రులుగను పనిచేయుచుండిరి. అమాత్యులలో ఎవరు ఏయే స్థానములందు పనిచేయవలెనో నిర్ణయించుటకు వారివారి శక్తిసామర్థ్యములు ఆధారము లుగ నుండెను (1–8–29).

అమాత్యు లందరిలో మంత్రులు ప్రధానులు. వారితో నాలోచింపక ఎట్టికార్యములను రాజు చేయువాడు కాడు (1–15–2). కార్యసిద్ధికి కావలసిన ఆరంభోపాయము, పురుషద్రవ్యసంపద, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము మున్నగు విషయములను నిర్ణయించుటలో వారు రాజునకు సహాయపడుచుండిరి. సామాన్యముగ ముగ్గురో నలుగురో మంత్రులుండుట ఆచారము. ఏదయిన విషయమునుగురించి ఆలోచించవలసినప్పుడు రాజు మంత్రుల నందరిని సమావేశపరచి, అనుకొనిన కార్యములోని సాధకబాధకములను వారితో చర్చించువాడు. అందరితోకలిసిచర్చించుట అనవసరమని తోచినపుడు వారిలో నొక్కొకరిని ప్రత్యేకముగ పిలిపించి వారి అభిప్రాయములను తెలిసికొనుచుండువాడు. ఈవిధముగ నేదియో తీర్మానము కుదిరినతర్వాత, దానిని లేఖకునిచే శాసనాధికారప్రకరణమున చెప్పబడిన రచనాదోషములు లేకుండ వ్రాయించి ప్రభువు తత్సంబంధులకు పంపువాడు. మంత్రులు సాధారణముగ ప్రభువుసమక్షమున నుండువారు. ఆకారణముచేత వారికి దుర్గమందు ప్రత్యేకముగ నివాసస్థానములు ఏర్పాటుగావింపబడియుండెను.

మంత్రులు గాక మంత్రిపరిషత్తు అను మరియొక ప్రత్యేకసభ ఏర్పడియుండెను. ఇందులోని సభ్యులసంఖ్య నియమితముకాదు. కార్యగౌరవమును బట్టి సంఖ్య నిర్ణయమగుచుండెను. పరిపాలనశాఖల అధ్యక్షులు, తక్కిన అధికార పదవులలో నుండినవారు అందు సభ్యులుగ నుండిరి. వీరు రాజ్యమునందు సంచారము చేయుచు పరగణాలలోని ఉద్యోగులను పర్యవేక్షించుచుండువారు. అందుచేత వా రెల్లప్పుడు ప్రభువు సముఖమున నుండువారు కారు. అప్పుడు వారితో సమాలోచన అవసరమగునెడల పత్రప్రేషణము మూలమున ప్రభువు వారి అభిప్రాయములను తెలిసికొనుచుండెను (1–15–53). కొన్నిసందర్భములలో నతడు మంత్రులు మంత్రిపరిషత్సభ్యులు కలిసిన సభలో సమాలోచనము చేయువాడు. అట్టిసమయములలో అధికసంఖ్యాకుల అభిప్రాయముల ననుసరించి అతడు కార్యములను సాగించుచుండెను (1–15–59).

మంత్రులందరిలో అమాత్యుడు ప్రధానస్థానము వహించినవాడు. రాజ్యమందు రాజు తర్వాత పేర్కొనదగినవా డితడే. రాజ్యాంగములలో

'స్వామి' తర్వాత రెండవస్థానమితనిదే. ప్రభుత్వవిషయములన్నిటిలో రాజున కితడు కుడిభుజము. రాజున కుపకారముగాని అపకారముగాని యొనర్చు నంతటి అధికార మితనికుండెను. ఇష్టముండినయెడల రాజ్యమునుకూడ నప హరింపగల స్థానములో ఇతడు ఉండెను. మహాపరాధముగావించినను పురో హితునికిని అమాత్యునికిని మరణదండము లేదు. రాజ్యములోని గూఢపురుషు లపై ఇతనికి సంపూర్ణాధికార ముండెను.

పరిపాలనమును సాగించుటలో కార్యాలోచనకంటె కార్యనిర్వహ ణము ప్రధానమగునట్టిది. కౌటిల్యునికాలమందలి రాజకార్యనిర్వాహకులలో (1) రాజసమక్షముననుండి రాజ్యమంతటిపై అధికారము వహించినవారు కొందరు, (2) రాజ్యములోని ఒక్కొక రాష్ట్రముపై అధికారమును చలా యించుచుండినవారు కొందరు, (3) రాష్ట్రములలోని గ్రామములమీదను గ్రామసముదాయములమీదను అధికారమును వహించినవారు కొందరును ఉండిరి. వీరిలో మొదటివర్గమందు 1. మంత్రి, 2. పురోహితుడు, 3. సేనా పతి, 4. యువరాజు, 5. దౌవారికుడు, 6. అంతర్వంశికుడు, 7. ప్రశాస్త, 8. సమాహర్త, 9. సన్నిధాత, 10. ప్రదేష్ట, 11. నాయకుడు, 12. పౌర వ్యావహారికుడు, 13. కార్మాంతికుడు, 14. మంత్రిపరిషదధ్యక్షుడు, 15. దండపాలుడు, 16. దుర్గపాలుడు, 17. అంతపాలుడు, 18. ఆటవికుడు అను పదు నెనిమిదిమంది అధికారు లుండిరి. వీరికి పదునెనిమిది తీర్థము లను పేరు కూడ కలదు.

వీరందరిలో సమాహర్త ఎక్కువబాధ్యతలను వహించుచుండువాడు. సమస్తకార్యములకు కోశము మూలము (2–8–1). సమాహర్త కోశమును సంగ్రహించువాడు. వివిధముఖములనుండి రాజునకు రావలసిన ఆదాయ మును వసూలుచేయుట, దానిని వృద్ధిచేయుట, వ్యయమును తగ్గించుట, విపర్యయముల నివారించుట మున్నగునవి వానికర్తవ్యములు (2–6–28). ఆదాయమును వసూలుచేయుట కతడు జనపదమును నాలుగుభాగములుగను, ఒక్కొక్కభాగము ననేక గ్రామసముదాయములుగను విభజించి వానిపై ఉద్యోగుల నియమించువాడు. వీరిలో గోపుడనువాడు ఐదుగాని పదిగాని గ్రామములపై అధికారము వహించి గ్రామమునకు సంబంధించిన లెక్కల నన్నిటిని తయారుచేసి పన్నులు వసూలుచేయుటయందు సమాహర్తకు తోడ్పడువాడు. గోపులపై స్థానికుడను మండలాధికారియు, స్థానికులపై ప్రదేష్ట అను అధికారియు నుండిరి. ప్రదేష్టలు సాధారణముగ నొకేచోట నుండక, రాష్ట్రాటనముగావించుచు గోపులయొక్కయు, స్థానికులయొక్కయు పనులను పర్యవేక్షించుచుండువారు. వీరు గాక గూఢపురుషుల నేకులు జనపద

మందంతట తిరుగుచు వివిధవిషయములగురించి సమాహర్తకు తెలియపరుచు చుండువారు (2–35–14).

యుద్ధము, దుర్భిక్షము మొదలగు నుపద్రవముల మూలమున కోశము నకు నష్టముకలిగినపుడు సమాహర్త స్వబుద్ధి నుపయోగించి ఏదియో ఒక మిషతో యాచనము చేసియు, మోనమునకు దిగియు, బెదరించియు ప్రజల నుండి ధనమును రాబట్టువాడు (5–2–32). కావున, ప్రభువుయొక్క ప్రయ త్నములు సఫలమగుటకు సమాహర్త కారణభూతుడుగ నుండెనని చెప్ప వచ్చును.

పైనిచెప్పిన పదునెనిమిది తీర్థములకు లోబడి తక్కిన యుద్యోగు లందరు వారివారికార్యముల నిర్వహించుచుండిరి. రాజోద్యోగుల నెప్పుడును నమ్మకూడదనియే కౌటిల్యుని అభిప్రాయము. మానవులు చంచలచిత్తులు. కనుక, రాజు నిత్యము వీరికార్యములను పర్యవేక్షించుచుండవలెను (2–9–2); నాలుకపై ఉండుతేనెనుగాని విషమునుగాని రుచిచూడకుండుట ఎట్లుసాధ్యము కాదో, అట్లే రాజద్రవ్యముతో సంబంధముకలవానికి దానిలో అల్పభాగము నైనను రుచిచూడకుండుట సాధ్యము కాదు. నీటిలో చరించుచేపలు ఎప్పుడు నీటిని త్రాగునో తెలిసికొనుట సాధ్యముకానట్లు కార్యముల నిర్వహణము నకై నియోగింపబడిన అధికారులు ఎప్పుడు (రాజ) ద్రవ్యము నపహరిం తురో తెలిసికొనుట సాధ్యముకాదు. ఆకాశమున ఎగురుచుండు పక్షుల గమ నములనైనను తెలిసికొనవచ్చునుగాని ప్రచ్ఛన్నభావములతో సంచరించు అధికారుల మార్గములను తెలిసికొనుట సాధ్యము కాదు (2–9–32–4). ఉన్నతపదవి యందుండు సమాహర్తకూడ ఇట్టివాడే. "సమాహర్త ప్రప్రథ మమున తనలాభమును సమకూర్చుకొని, తర్వాత రాజునకు రావలసిన ఆదా యమును వసూలు చేయును. లేదా, వసూలుచేయుట మానును" (8–4–33). కౌటిల్యు డీవాక్యములను వ్రాసి రెండువేలసంవత్సరములకంటె అధికమయి నది. కాని, వ్యవహారానుభవము కలవారందరు ఆవాక్యములు ప్రస్తుతకాలము నకుకూడ వర్తించునవి యని అంగీకరింతురు. అప్పటికిని ఇప్పటికిని మానవ స్వభావమందు విశేషమగుమార్పు కలిగినట్లు తోపదు. కౌటిల్యు డనుభవజ్ఞు డనుటకు ఇది యొక గొప్ప నిదర్శనము.

ఉద్యోగు లట్టివారగుటచేత వారు న్యాయప్రవృత్తులుగ నుండుటకు పలయు ఏర్పాటులను చేయవలసినదిగ కౌటిల్యుడు సూచించెను. ఏదియో యొకపరీక్షయందు ఉత్తీర్ణుడైనవానికే ప్రస్తుతకాలమందు గొప్పఉద్యోగ ములు దొరకునట్లు అమాత్యులకుండవలసిన గుణములు కలవారికే ఉద్యో గములందు ప్రవేశముండవలెనని అతడు చెప్పియున్నాడు. దేశము, కులము,

శీలము లోనగునవి ఈగుణములలో కొన్ని (1–9–1). ప్రారంభమున ఉద్యోగ మును తాత్కాలికముగనిచ్చి కార్యములను లాభకరములుగ చేయగలవా డను నమ్మిక కలిగినతర్వాత ఉద్యోగిని ఖాయపరుచుట (2–9–36) ; అధికారుల పక్షపాతము మూలమున రాజకార్యములు చెడకయుండుటకు శక్తిసామర్థ్య ములబట్టి వారిని ఉత్తమమధ్యమాధమకక్ష్యలందు నియోగించుట (2–7–4) ; ఉపదలనేకములచే వారి శుచిత్వాశుచిత్వముల దెలిసికొని హీనపదవులందుండు వారిని ఉన్నతపదవులలోనికి మార్చుట ; సాధారణముగ వారిని ఒకపదవినుండి మరియొకదానికి బదలాయించుట ; అధికారులు నిరంకుశముగ ప్రవర్తింప కుండుటకై ఒక్కొక అధికారస్థానమందు అనేకముఖ్యుల నియమించుట (2–9–31) ; ప్రతిఅధికారస్థానమందు అధ్యక్షునేగాక వానికి సహాయముగ సంఖ్యాయక లేఖక రూపదర్శక నీవీగ్రాహకులను నియమించుట (2–9–28) ; రాజకార్యములకు విఘాతముకలిగించినవారిని వశపరుచుకొనుటకు ఉత్తరా ధ్యక్షుల నేర్పాటుచేయుట (2–9–29–30) మొదలగు ఏర్పాటులను కౌటి ల్యుడు విధించెను. అన్యాయముగ ప్రజలను పీడించి రాజాదాయమును ద్విగుణపరిచినవారిని, స్వలాభము నపేక్షించి రాజద్రవ్యమునకు నష్టముకలిగిం చినవారిని కఠినముగ శిక్షించవలెనని అతడు చెప్పెను (2–9–13,15). ఇట్టి అక్రమముల బహిరంగపరుచు ప్రజలకు తగినప్రోత్సాహము కల్పించవలె ననియు, అధ్యక్షుల అజాగ్రత్తవలన ప్రజలకు నష్టము సంభవించినప్పుడు అధ్యక్షు లానష్టమును పూరించవలెననియు, న్యాయస్థానములందు వివాద ముల పరిష్కరించు న్యాయాధీశులు పొరపాటుపడినప్పుడు కఠినశిక్షకు పాత్రులు కావలెననియు అతడు సూచించెను.

ఉద్యోగులు న్యాయానుసారముగ ప్రవర్తించుటలో బెదరింపులు శిక్షలు మున్నగువానికంటె వారిని తగువిధముగ సత్కరించుటయే ఉత్తమ మార్గమనియు, జీతములు స్వల్పమగుటచేతనే వారు లంచములు తీసుకొను టయు ప్రజలను పీడించుటయు సంభవించుచున్నదనియు ప్రస్తుతకాలమం దనేకులు అభిప్రాయపడుచున్నారు. కౌటిల్యుని అభిప్రాయముకూడ ఇట్టి దియే. అధికారుల జీతములు వారివారిమర్యాదకు తగినట్లుండవలెననియు, జీతములబట్టి ఉద్యోగులను పదకొండు తరగతులుగ విభజింపవలెననియు అతడు చెప్పెను. ఉత్తములకు సంవత్సరమునకు నలువదియెనిమిదివేల పణ ములు, అధములకు అరువదిపణములు, దూతలకును, మరికొందరికిని సంవత్సర మున కింతయనిగాక వారి పనులబట్టి వేతనములు నిర్ణయింపబడవలెనని అతడు సూచించెను (5–3–3.17). నిర్ణీతమగు జీతములు కలవారికి అధికమాసముతో కూడిన సంవత్సరములో మామూలుకంటె నధికజీత మియ్యవలెననియు, ఉద్యోగులఇండ్లలో ప్రేతవ్యాధితప్రసూతికాకృత్యములు సంభవించినప్పుడు ప్రత్యేక

ముగ ధనసహాయము చేయవలెననియు, ప్రభుత్వకార్యముల చేయుచు మృతినొం దినవారి దారపుత్రులకు భక్తవేతనముల నియ్యవలెననియు మహోపకారము చేసిన అధ్యక్షులకు ప్రత్యేకబహుమానము లియ్యవలెననియు అతడు సూచించెను (2–7–41). కౌటిల్యునికాలములో కొందరికి జీతములే గాక భూములుకూడ లభించుచుండెను (2–1–7). సాధారణముగ వేతనములు నాణెముల రూపమున ఉండెడివి. కాని ఎప్పుడైనను కోశమందు ధనము లేనప్పుడు కుప్యపశుక్షేత్రముల నిచ్చుటయు కలదు. గ్రామాదులను ఇనాములుగ నిచ్చుట మంచిదికాదని కౌటిల్యుని అభిప్రాయము (5–3–32). అనేక సదుపాయములున్న యెడల ఉద్యోగులు సంతృప్తిచెంది వారి పనులను మెలకువతో చేయుదురని అతడు భావించెను.

రాజ్యమందు జనపదము, నగరము అనురెండు భాగము లుండెను. పరి పాలనసౌకర్యమునకై జనపదము నాలుగుభాగములుగ విభజింపబడి యుండెను. ఒక్కొక చతుర్భాగములోని గ్రామములను ప్రభువుతో వానికి గల సంబంధమునుబట్టి నాలుగు రకములుగ విభాగముచేసియుండిరి. కొన్ని గ్రామములు పరిహారకములు (పన్నులుచెల్లించనవసరములేనివి) ; కొన్ని ఆయుధీయములు ; కొన్ని ధాన్యపశు హిరణ్యరూపములగు పన్నులను చెల్లించు నట్టివి ; కొన్నిప్రభుత్వము కోరినప్పుడు కూలిపనులను చేయునట్టివి. విస్తీర్ణ మందును జనసంఖ్యయందును గ్రామములమధ్య భేద ముండినను ఉత్తమము లగు గ్రామములలో నూరిండ్లకు తక్కువగాక అయిదువందలఇండ్లకు ఎక్కువ గాక శూద్రకర్షక కుటుంబము లుండవలెనని కౌటిల్యుని అభిప్రాయము (2–1–2). గ్రామపరిపాలనము గ్రామికుని యొక్కయు గ్రామవృద్ధులయొక్కయు అధీనమం దుండెను. గ్రామికునికే గ్రామస్వామిఅనియు గ్రామాధ్యక్షు డనియుపేర్లు. అతడు గ్రామమందు రాజప్రతినిధిగ నుండి అల్లరు లేవియు సంభవించకుండ చూచుచుండెను. చోరులను జారులను గ్రామమునుండి బహిష్కరించు అధికారమతనికి ఉండెను (3–10–18). గ్రామ కార్యముల నిమిత్తమతడు మరియొకచోటికి వెళ్ళినపుడు గ్రామస్థులలో నొక్కొకరు ఒక్కొకమారు అతనికి సహాయముగ వెళ్ళువారు. వ్యాపారార్థము గ్రామమునకు వచ్చిన వర్తకులను రక్షించుట వీని విధిగ నుండెను.

గ్రామికుడుగాక ప్రతిగ్రామమందును గ్రామవృద్ధులు కొందరుండిరి (3–9–15). వీరు పంచాయతీదార్లవంటివారు (పంచాయతి అనుపేరు కౌటి ల్యుని గ్రంథమున వాడబడలేదు). గ్రామములోని కృషిక్షేత్రముల గురించిన వివాదములను వీరు పరిష్కరించుచుండిరి (3–9–15). వీరు గ్రామములోని దేవద్రవ్యమును, మైనరులగు బాలురద్రవ్యమును తమ స్వాధీనమం దుంచు కొని వృద్ధిపొందించుచుండిరి (2–1–27). సేతుబంధముల నిర్మాణముచేయుట, భగ్నములయిన చైత్యదేవతాయనములను బాగుచేయుట, ఉత్సవప్రదర్శన

ముల నేర్పాటుచేయుట మొదలగు గ్రామమునకంతకు నుపయుక్తములగు పనులను వారు చేయుచుండువారు.

పదిగ్రామములకుగాని అయిదుగ్రామములకుగాని గోపుడను ఉద్యోగి యొక డుండెను. ఇత డనేకవిధములగు పనులను చేయువాడు (2-35-1). గ్రామకరణమువలె భూములకు సంబంధించిన లెక్కలను తయారుచేయుట, ఇన్‌కంటాక్సు అధికారివలె నొక్కొకగృహస్థుని ఆదాయమును కనుగొనుట, జనాభాలెక్కలను పొందుపరుచుట, రిజిష్ట్రారువలె దానములకు విక్రయము లకు సంబంధించిన పత్రములను రిజిష్టరుచేయుట మున్నగునవి అతని కార్య కలాపములలో చేరియుండెను. ప్రజల సాంఘిక ఆర్థిక పరిస్థితులను తెలిసి కొనుటకు ప్రస్తుతకాలమున గణాంకశాఖ (Statistical Department) ఒకటి ఉన్నది. ఈశాఖచేయు పనులనన్నిటిని కౌటిల్యుని కాలమున గోపుడు చేయుచుండెను. రాజ్యములోని గోపులు తయారుచేసిన లెక్కల నాధారము చేసికొని రాజధానిలోని అక్షపటలాధ్యక్షుడు ఆదాయవ్యయములకు సంబం ధించిన వివరములను నిబంధన పుస్తకములలో వ్రాసిపెట్టుకొనువాడు. ప్రజల పరిస్థితులనుగురించిన వివరములను సంగ్రహించుటలో ప్రస్తుతకాలపు ప్రభుత్వ ములకంటె కౌటిల్యునికాలపు ప్రభుత్వము ఎక్కువ శ్రద్ధవహించినట్లు చెప్ప వచ్చును.

నగరముల పరిపాలన విషయమునకూడ ఆకాలమున చేయబడిన యేర్పాటులు ప్రశంసనీయములుగ కనిపించుచున్నవి. నగర మొక పద్ధతి ననుసరించి నిర్మింపబడుచుండెను. ఎవరికి ఇష్టమువచ్చినచోట వారికి ఇష్టము వచ్చినట్లు ఇండ్లను కట్టుకొనుట, క్రమరహితముగను వర్తకవ్యాపారాదులకు అననుకూలముగను వీథుల నేర్పరుచుట నిషేధింపబడెను. నగరములోపల విశాలములగు రాజమార్గములు, సమృద్ధములగు జలాధారములు, వృత్తి జాతికులముల ననుసరించి యేర్పరుపబడిన నివాసప్రదేశములు మున్నగునవి నిర్మింపబడి యుండెను (2-4-1,5). పరిపాలన సౌకర్యమునకై నగరము నాలుగు భాగములుగ విభక్తమై, ఒక్కొకభాగ మొక స్థానికుడను ఉద్యోగి అధీనమందుండెను. అదేవిధముగ ఇరువదిగాని నలువదిగాని కుటుంబముల వ్యవహారమును చూచుటకు గోపు డొక డుండెను. నగరమునంతను పాలిం చుటకు నాగరికుడను అధికారి నియమింపబడెను. నగరవాసులకు ఆరోగ్యాది సౌకర్యముల నమకూర్చుబాధ్యత ఇతనిదే. నగరములోనికి వచ్చు పరాయి వారి రాకకు కారణములను తెలిసికొనుట, వారిమూలమున రాజునకుగాని, రాష్ట్రమునకుగాని ప్రమాదము సంభవింపకుండునట్లు చూచుట, మార్గము లను వీథులను శుభ్రముగనుంచుట, అగ్న్యుదక బాధలనుండి ప్రజలను రక్షిం చుట, రాత్రికాలమందు దుర్మార్గుల సంచారము నరికట్టుట—మున్నగు

పనులు నాగరికుని మూలమున జరుగుచుండెను. నగరములోని ఇంధనాగారములు, రక్షకస్థానములు అతని వశమందుండెను. నాగరికునికి సహాయము చేయుటకై ఇప్పటి మునిసిపల్ కౌన్సిళ్ళవలె ఆకాలమున ప్రజలెన్నుకొనిన సభలు లేనట్లు కనిపించుచున్నది. అందుచేత నాగరికుడు సర్వాధికారిగ నగరమును పాలించుచుండెను (2–36–1,47).

రాజ్యమును పాలించుటలో బహిరంగముగ పనిచేయు అమాత్యులు, అధ్యక్షులు మున్నగువారు ఎంతటి ప్రాధాన్యమును వహించియుండిరో అంతటి ప్రాధాన్యమును గూఢచారులుకూడ వహించియుండిరి. "చారచక్షువు" అనుపేరు రాజునకుండుట కిదియే కారణము. అతడు సమస్తవిషయములను గూఢచారుల సాధనమున తెలిసికొనుచుండువాడు. అతని దినచర్యలో కొంతభాగము గూఢచారులతో సంప్రతించుటకు వినియోగింపబడుచుండెను. "ఇందుగల డందులేడను సందేహమువలదు ; చక్రీసర్వోపగతుండు" అనినట్లు వారు రాజ్యములోని సమస్తప్రదేశములందును శత్రురాజ్యములందును సంచారము చేయుచుండువారు. వారువేసికొనని వేషము లేదు. సిద్ధులు, తాపసులు, జ్యోతిష్కులు, సాముద్రిక శాస్త్రప్రవీణులు, ఇంద్రజాలికులు, వర్తకులు, కర్షకులు, మందకాపరులు, నటులు, నర్తకులు, గాయకులు, కుశీలవులు, వంటవాండ్రు, వడ్డించువారు, ధనికులఇండ్లలో ఇతరములగు పనులనుచేయువారు—ఇట్టివారి వేషములో వారు సంచరించుచు రహస్యములను తెలిసికొని రాజునకు, అమాత్యునికి తెలియపరుచుచుండిరి. వారిలో పురుషులతోపాటు స్త్రీలుకూడ అనేకులుండిరి. కొందరు హత్యలగావించుటయందును, విషప్రయోగము చేయుటయందును ప్రవీణులుగ నుండిరి. తమ యుద్దేశములను నెరవేర్చుకొనుటలో ధర్మాధర్మ విచక్షణ చేయక వారు వివిధసాధనముల నుపయోగించుచుండిరి. అమాత్యులలో ఎవరు శుచులో, ఎవరు అశుచులో, ప్రజలలో ఎవరు ప్రభువుపట్ల అనురాగము కలవారో, ఎవరు విరాగులో వారు తెలిసికొని సకాలమున రాజునకు నివేదించుచుండువారు. ఇతరరాజ్యములలోని రహస్యములను తెలిసికొనుటయందుగూడ వారు ప్రధానపాత్రను వహించియుండిరి. గూఢచారులు పరిపాలనా విధానములో ఇంతటి ప్రధానమగు పాత్రను వహించుటలో వైపరీత్య మెట్టిదియు లేదు. ప్రస్తుతకాలమునగూడ ప్రతిరాజ్యములో రహస్యముగ పనిచేయు గూఢచారిశాఖయొకటి ఉన్నది. ప్రయాణసౌకర్యములు, సమాచారసౌకర్యములు విరివిగనున్న ప్రస్తుతకాలములోనే చారుల కవసరమున్నప్పుడు, ఇట్టిసౌకర్యములులేని ప్రాచీనకాలమందు వారి అవసరము మరింత అధికముగ నుండెననుటలో నచ్చెరువు లేదు.

## 8

కౌటిల్యుడు రాజులకర్తవ్యములను పూర్వాచార్యుల మతము ననుస రించి రెండురకములుగ విభాగముచేసెను. భూపరిపాలనమునకు సంబంధించిన కర్తవ్యములు మొదటిరకములోనివి. రాజ్యముదృష్ట్యా ఇవి అంతరంగిక వ్యవహారములని పేర్కొనదగినవి. అర్థశాస్త్రగ్రంథములోని మొదటి అయిదు అధికరణములు వీనిని వివరించుచున్నవి. భూసంపాదనమునకు సంబంధించిన కర్తవ్యములు రెండవరకములోనివి. ఇవి బాహ్యవ్యవహారములని చెప్పదగి నవి. భూసంపాదనమునకు ఇతరరాజ్యముల జయించుటయే సాధనమగుటచేత ఈవ్యవహారములన్నియు ఒకరాజ్యమును పాలించురాజు ఇతరరాజులపట్ల ప్రవర్తించవలసిన విధానమునకు సంబంధించినట్టివి. అర్థశాస్త్రములో 6–14 అధికరణములు వీనిని వివరించుచున్నవి.

దుష్టులను శిక్షించుట, ప్రజలను ప్రజలసాంఘికవ్యవస్థను రక్షించుట, వారి యోగక్షేమములను వృద్ధిచేయుట పాలనములోని ప్రధానాంశములు. పరి పాలనమందు దుష్టులను దండించుట ఎంత ప్రాధాన్యము వహించుచున్నదో అర్థశాస్త్రమునకు పూర్వులు పెట్టిన దండనీతి అను పేరు స్పష్టపరుచుచున్నది. దండించదగిన దుష్టులెవరో "కంటకశోధనము" అను నాల్గవఅధికరణమందు కౌటిల్యుడు వివరముగ చెప్పెను. న్యాయవిరుద్ధముగ ప్రవర్తించి ప్రజలను హింసించువారు, వారిఆస్తికి ఆదాయమునకు నష్టముకలిగించువారు దుష్ట వర్గములో చేరినవారు. అట్టివారికి ప్రజాకంటకులను పేరు సార్థకమగుచున్నది. ఘాతుకులు, వాక్పారుష్యదండపారుష్యములకు సాహసించువారు, స్త్రీలను బలాత్కరించువారు, దొంగలు, దోపిడికాండ్రు, ఇతరఅపచారములను గావించు వారు కంటకులనుట సర్వసాధారణము. వీరు గాక తప్పుతూనికలను కొలత లను వినియోగించి ప్రజలను మోసగించు వర్తకులు, ఒప్పందములకు విరుద్ధ ముగ పనిచేయు నేత మున్నగు చేతిపనులను వృత్తిగాగలవారు, కూలిపని చేయువారు, రజకులు మొదలగువారుకూడ కంటకులుగ నెంచబడుచుండిరి. అవినీతికి పాల్పడి ప్రజలను పీడించు ఉద్యోగులు, రాజులపై కుట్రచేయు దూష్యులు ఈవర్గములో చేరియుండిరి. ఇట్టివారినందరిని దండించి ప్రజలను రక్షించుట రాజులకర్తవ్యములో ప్రధానస్థానము వహించియుండెను.

దుష్టులను దండించుటయేకాక పౌరులమధ్య సంభవించు వివాదము లను పరిష్కరించుటకూడ ప్రభుత్వముయొక్క కర్తవ్యమని గుర్తింపబడెను. ఇందుకై జరుగవలసిన యేర్పాటులను కౌటిల్యుడు అర్థశాస్త్రమందు వివరించియున్నాడు. ఈవివరణము ధర్మసూత్రములలోని వివరణమున కంటెను, మనుస్మృతి యాజ్ఞవల్క్యస్మృతి మొదలగు ధర్మశాస్త్రములలోని వివరణముకంటెను,

సమగ్రముగనున్నట్లు విజ్ఞుల అభిప్రాయము. వివాదములను పరిష్కరించుటకును దుష్టుల శిక్షించుటకును ఏర్పాటుగావింపబడిన సంస్థలకు ధర్మస్థీయములను పేరుండెను. ప్రజలఅందుబాటులోనుండుటకై యివి పొలిమేరలలోని జనపదసంధులందును, పదేసిగ్రామములకు కేంద్రములగు సంగ్రహణములందును, నాలుగువందల గ్రామములకు కేంద్రములగు ద్రోణ ముఖములందును, ఎనిమిదివందలగ్రామములకు కేంద్రములగు స్థానీయము లందును స్థాపింపబడెను. ఒక్కొక ధర్మస్థీయమున ముగ్గురు ధర్మస్థు లుండిరి. వీరు కలిసి వివాదములను పరిష్కరించుచుండిరి. క్రిందిధర్మస్థీయములనుండి మీదివానికి పునర్విచారణకై అపీలుచేసుకొనుపద్ధతి ఉండినట్లు కనిపించదు. అపీళ్ళను విను అధికారము రాజునకుమాత్రమే ఉండినట్లు తోచుచున్నది. వివాదముల నన్నిటిని పదునేడు శీర్షికల క్రింద కౌటిల్యుడు విభాగము చేసెను. వానిలో వివాహము, దాయవిభాగము, వాస్తుకము, ఋణాదానము మున్నగునవి సివిల్‌వర్గమునకు చెందినవి ; సాహసము, దండపారుష్యము, వాక్పారుష్యము మున్నగునవి క్రిమినల్‌వర్గమునకు చెందినవి. వివాదములను పరిష్కరించుటయందు ధర్మము, వ్యవహారము, చరిత్ర, రాజశాసనము అను నాలుగువిధములగు నియమము లనుసరింపబడుచుండెను. వివావముల పరిష్కరించుటయందు పక్షపాతముగను, న్యాయవిరుద్ధముగను ప్రవర్తించిన ధర్మస్థులు శిక్షలకు పాత్రులగుచుండిరి.

మనుష్యులమూలముననేగాక దైవికములగు పీడలమూలమునగూడ ప్రజలు నష్టపడుచుందురు. అట్టినష్టములకు ప్రతీకారముగావించి ప్రజలను రక్షించుట రాజులకర్తవ్యముగనెంచబడెను. పీడలలోఅగ్ని, వరదలు, వ్యాధి, దుర్భిక్షము, ఎలుకలు, క్రూరమృగములు, సర్పములు, పిశాచములు అనునవి అత్యధిక ప్రమాదమును గలిగించునట్టివి. వీనిని ఏవిధముగ నెదుర్కొనవలసినదియు, ఇట్టిసందర్భములలో ఉద్యోగులు, ప్రజలు తీసికొనవలసిన చర్యలు ఎట్లుండవలసినదియు కౌటిల్యుడు వివరించియున్నాడు (4–3–1.44). వానిలో కొన్ని ప్రస్తుతకాలమునగూడ ననుసరించదగియున్నవి.

రక్షణవిధానములో వ్యక్తుల రక్షణయేగాక సాంఘికవ్యవస్థను రక్షించుటగూడ ఒకప్రధానాంశముగ కౌటిల్యుడు గుర్తించెను. ఇందులోగూడ నతడు పూర్వాచార్యుల మతము ననుసరించెను. ప్రాచినకాలమందు మన దేశములోని సాంఘికవ్యవస్థకు వర్ణాశ్రమధర్మము ప్రధానలక్షణముగ నుండెను. ప్రజలందరు దీనియందు గౌరవవిశ్వాసములు కలవారుగ నుండిరి. కాలానుసారముగ నేర్పడిన సాంఘికవ్యవస్థను రక్షించుటయే రాజులకు కర్తవ్యమని భావింపబడెను. దానిని మార్చుటకు వారికి అధికారము లేదు. ఈవిషయములో పాశ్చాత్యప్రపంచమందు ఆధునికయుగమున ప్రాబల్యము గాంచిన రాజకీయతత్త్వమునకును మనపూర్వులు ప్రతిపాదించిన తత్త్వమునకును గొప్ప భేదమున్నది.

రాజ్యాధికారమును సాంఘికవ్యవస్థను మార్చుటకు వినియోగించుట ధర్మమని పాశ్చాత్యులు ప్రతిపాదించుచున్నారు. పదునెనిమిదవ శతాబ్దమున సంభవించిన ఫ్రెంచివిప్లవమువంటి విప్లవములమూలమున ఏర్పడిన ప్రభుత్వములు ఫ్యూడల్ వ్యవస్థను మార్చి మధ్యవర్గము వారి కనుకూలమగు సాహుకారీవ్యవస్థను ప్రవేశ పెట్టుటయు, ఇరువదియవ శతాబ్దమునం దేర్పడిన ప్రభుత్వములు సోషలిస్టువ్యవస్థను ప్రవేశపెట్టుటయు దీనికి నిదర్శనములు. సాంఘికవ్యవస్థలు కాలానుసారముగ ప్రజలప్రయత్నము వలన మారవలసినవేగాని పరిపాలకుల బలప్రయోగముద్వారా మారకూడదని మనపూర్వులు భావించిరి. వర్ణాశ్రమధర్మములను రక్షించుట రాజులధర్మ మని కౌటిల్యాదులు విధించుట కీభావమే కారణము. ఈ సందర్భమున అతడు చెప్పినమాటలుకొన్నిటి నిచట ఉదహరించుట ఉచితము కాగలదు. "స్వధర్మము నాచరించుటవలన స్వర్గము, శాశ్వతసుఖము లభించును. దీని నతిక్రమించిన పక్షమున సాంకర్యమేర్పడి లోకము నశించును. అందుచేత ప్రజలు వారివారిధర్మముల నతిక్రమించకుండునట్లు ప్రభువు చూడవలెను. అట్టిరాజు ఇహపర సౌఖ్యముల ననుభవించును. ఆర్యమర్యాదలకు బద్ధులైనట్టియు, వర్ణాశ్రమధర్మ ములకు కట్టుపడినట్టియు ప్రజలు వేదములచే రక్షింపబడి, నశింపక, సుఖము ననుభ వించెదరు" (1–3–14.17).

## 9

కౌటిల్యుని అర్థశాస్త్రములోని వర్ణధర్మములలో ప్రత్యేకముగ గుర్తించదగిన లక్షణములు కొన్ని కలవు. వర్ణధర్మములను నిర్ణయించుటలో ధర్మశాస్త్రములలో విధింపబడిన నియమములేగాక దేశాచార కులాచారములుకూడ పరిగణించుట అవసరమని అతడు చెప్పెను (13–5.7). నాల్గవ వర్ణమువారగు శూద్రులకు ద్విజాతిశుశ్రూషమాత్రమే ధర్మమని స్మృతులు విధించినను, కౌటిల్యుడు వాస్తవపరిస్థితుల ననుసరించి, "వార్త, కారుకర్మ, నాటకములలో పాత్రధారణ" మున్నగునవి వారికి ధర్మములనిపలికెను. వార్తలో కృషి, పశుపాలనము, వాణిజ్యాదులుచేరియుండెను. ఇందుచేత వేదాధ్యయనము వైదికకర్మలగు యజ్ఞ యాగాదులు తప్ప తక్కిన విషయములలో వృత్తులకు, సంబంధించినంతవరకు ద్విజాదులకును శూద్రులకును మధ్య ఎట్టిభేదము లేదని చెప్పుట సమంజసము. ఇది గాక కౌటిల్యుడు శూద్రులను ఆర్యులుగ పరిగణించెను (3–13–1,4). సైన్యమందు శూద్రులు అధికసంఖ్యాకులుగ ప్రవేశించుచుండిరి (9–2–21,24).

అర్థశాస్త్రములో వివరింపబడిన రాజ్యములందు నాలుగువర్ణములకు చెందని ప్రజలనేకు లుండిరి. చండాలురు, ఆటవికులు, బాహిరికులు, మ్లేచ్ఛులు మొదలగువారిట్టివారు. చండాలురు గ్రామములకు నగరములకు వెలుపల నివసించుచుండిరి. ఆటవికులు అరణ్యములలో నుండువారు. వీరు సాధారణ

ముగ నొకచోట నుండక దేశద్రిమ్మరులుగ సంచారము చేయువారు. వీరిని సైన్యములో చేర్చుకొని శత్రుదేశములోని ప్రజలను దోపిడి చేయుటకు రాజులు వినియోగించు చుండువారు. మ్లేచ్ఛులు విదేశములనుండివచ్చి భరత ఖండములో స్థిరముగ నివాసముల నేర్పరుచుకొనిన గ్రీకులవంటివారు. ఇట్టి వారందరిని, వారివారి ఆచారములను రక్షించుట రాజులకర్తవ్యముగ భావింపబడెను. బాహిరికులు దేశద్రిమ్మరుల వర్గమునకు చెందినవారు.

ఆశ్రమధర్మములను రక్షించుటకూడ రాజులకు కర్తవ్యముగ నుండెను. ప్రతివ్యక్తియు ఒక ఆశ్రమము తర్వాత మరియొక ఆశ్రమమును ప్రవేశించు చుండెనని అనుకొనరాదు. కొందరు యావజ్జీవము బ్రహ్మచారులుగనో గృహస్థులుగనో ఉండిరి. సంసారములను వదలి సన్యాసాశ్రమమును స్వీక రించువారి సంఖ్యను తగ్గించుట అవసరమని కౌటిల్యుడు భావించినట్లు తోచుచున్నది. "పుత్రులకును భార్యకును జీవనము కల్పించక సన్యసించిన వాడును, స్త్రీని సన్యసింపజేసినవాడును సాహసదండములోని తక్కువ మొత్తమునకు పాత్రుడగును," అని అతడు విధించుటలో ఇదియే ఉద్దేశము (2–1–29).

స్మృతికర్తలవలె కౌటిల్యుడుకూడ గృహస్థాశ్రమము ఆశ్రమము లన్నిటిలో ప్రధానమైనదిగ భావించెను. దీనికి వివాహము మూలమగుటచేత వివాహధర్మములను విపులముగ వివరించెను. వివాహము ఎనిమిదివిధము లనియు, వానిలోకొన్నిమాత్రమే ప్రసంశనీయములనియు, శుల్కము నిచ్చి భార్యను వివాహమాడుట ధర్మమనియు, కొన్నిసందర్భములలో వివాహ బంధమును త్రెంపివేయవచ్చుననియు అతడు చెప్పియున్నాడు. అనేకవిషయములలో భార్యలు స్వతంత్రలుగ ప్రవర్తించ వచ్చుననియు, స్త్రీలు పునర్వివాహమాడుట ధర్మమనియు అతడు భావించెను. అతని కాలమున అట్టిది సదాచారముగనే గ్రహింపబడెను. వివాహమాడని పూర్వసువాసినులు తర్వాతికాలపు వారికంటె నెక్కువ స్వాతంత్ర్యము ననుభవించు చుండిరి (3–20–16). వారిలో కొందరు పరివ్రాజికలుగ జీవించుచుండిరి.

సంఘము ఆచారబద్ధముగను సంప్రదాయబద్ధముగను ఉండుటయే ధర్మమని భావింపబడిన కారణముగ రాజులు సామాన్యముగ ఆచారముల నన్నిటిని రక్షించుచుండిరి. కౌటిల్యునికాలమునాటికి వైదికేతరములగు మతములు దేశమందు నెలకొనియుండెను. వేదవిహితముగ సన్యాసాశ్రమ మును స్వీకరించినవారే కాక బౌద్ధాదిమతముల ననుసరించి సన్యసించిన శాక్యులు, ఆజీవకులు, పాషండాదులు కూడ నుండిరి (3–20–16). రాజులు అట్టివారికికూడ ఆశ్రయము కల్పించుట ధర్మమని కౌటిల్యుడు భావించెను. వైదికములగు యజ్ఞయాగాదు లొనర్చుటయేకాక దైవతములకు దేవగృహ

ముల నిర్మించుట, వానిలో విగ్రహములను ప్రతిష్ఠించి పూజించుట ఆచార మయ్యెను. "పురమధ్యమందు అపరాజిత, అప్రతిహత, జయంత, వైజయంత అనువారికి శివ, వైశ్రవణులకు, అశ్వనీదేవతలకు, శ్రీమదిరాదేవతలకు ఆల యముల నిర్మించవలెను. నగరద్వారములకు బ్రహ్మ, ఇంద్రుడు, యముడు, సేనాపతి అధిష్ఠాన దేవతలుగ నుండవలెను" (2–4–17) అను నియమ మున్నట్లు కౌటిల్యుడు పేర్కొనెను. ఈ దైవతములలో కొన్ని ఆర్యులు భారతదేశమునకు రాకపూర్వము అనార్యులు పూజించుచుండిన వైదికేతర ములు. కౌటిల్యుని నాటికి ఆర్య–ఆర్యేతరజాతులు కలసిపోవుటయు దాని మూలమున భారతజాతి యేర్పడుటయు జరిగెను. రాక్షసులను, పిశాచము లను పారద్రోలుటకును, క్షుద్రదేవతలను వశపరచుకొనుటకును అర్థశాస్త్రము లోని పదునాల్గవ అధికరణమందు వివరింపబడిన ఔపనిషదికప్రక్రియలు భారతజాతి అనార్యులనుండి గ్రహించినట్టివి. ఇవి అథర్వవేదవిహితములని పరిగణింపబడెను. ఇట్టి మంత్రతంత్రసాధనమున రక్షోగణమును వశపరచు కొనగలశక్తి పురోహితునికి ఉండవలసిన అర్హతలలో నొకటిగ పరిగణింపబడెను.

రక్షణమను మాటను కౌటిల్యుడు విశాలార్థములో వాడెను. రాజు లను సరించవలసిన రక్షణవిధానములో ప్రజలఆరోగ్యరక్షణ, నీతిరక్షణ మున్నగునవి కూడ ప్రాధాన్యమువహించియుండెను. అన్నవిక్రేతలు, మాంసవిక్రేతలు, మద్య పానముల విక్రేతలు, గణికలు, జూదగాండ్రు మొదలగువారిపై ఇందుకుగాను అనేకనియమములు, నిర్బంధములు విధింపబడెను. గ్రామవాసులు వారికాలమును ఆదాయమును వినోదములకై వ్యర్థపుచ్చకుండునట్లు అధికారు లనేకచర్యలను తీసికొనుచుండిరి. గ్రామములందు "ఆరామములుగాని విహారశాలలుగాని ఉండ రాదు. నటులు, నర్తకులు, గాయకులు, వాద్యగాండ్రు, కథకులు, కుశీలవులు అచ్చటి కార్యకలాపములకు విఘాతము కలిగించరాదు" (2–1–33–34) అను అర్థశాస్త్రములోని సూత్రములు దీనిని స్పష్టపరుచుచున్నవి. ఆర్థిక ముగ ప్రజలకు నష్టము కలుగకుండుటకు రాజులు వస్తువుల ధరలు నిర్ణయించు టయు (4–2–36), గుత్తవ్యాపారమును నిషేధించుటయు (4–2–19) రక్షణ విధానములో నొకభాగముగ నుండెను.

ప్రజలను రక్షించుటయేకాక వారియోగక్షేమముల నభివృద్ధిచేయుట కూడ రాజులకర్తవ్యముగ పరిగణింపబడెను. ఇందుకై వారు శూన్యప్రదేశ ములలో గ్రామములను నిర్మాణము చేయుచుండువారు. వ్యవసాయాభి వృద్ధికై జలాధారములను కల్పించుచుండువారు. పచ్చికబయళ్ళను ప్రత్యేక ముగ రక్షించుచు పశుగణాభివృద్ధికి తోడ్పడుచుండిరి. వ్యాపారమును వృద్ధి చేయుటకు రహదారుల నిర్మించుచుండిరి. ప్రజలపై వారు పన్ను లనేకములు విధించినను వానిమూలమున ప్రజలు వహించవలసిన భారము పరిమితముగ

నుండునట్లు చూచుచుండిరి. ప్రభువునకు ప్రజలకుమధ్య నుండదగిన సంబంధము తండ్రి పిల్లలమధ్య నుండు సంబంధమువంటిది అను సూత్రము నాధారముగ చేసికొని రాజులు పరిపాలనము సాగించుచుండిరి.

రాజ్యమున కుండవలసిన సప్తాంగములలో కోశ మొకటి. కోశమును నింపుటకు పన్ను లొక ప్రధానసాధనము. కాని కోశమునంతను పన్నుల మూలమున నింపుటకు ప్రయత్నించినయెడల ప్రజలపై వారు భరించలేనంతటి భారము పడుటతప్పదు. అందుచేత కోశసంగ్రహణమునకు సాధనాంతరముల నుపయోగించుట అవసరమగుచున్నది. ప్రాచీనకాలపు అర్థశాస్త్రవేత్తలు, ప్రభువులు దీనిని గుర్తించిరి ధనమును సంపాదించుటకు కృషి, పశుపాలనము, పరిశ్రమలు, వాణిజ్యము సాధనములగుట అందరికి తెలిసిన విషయమే. ధనమును సంపాదించగోరు పరిపాలకులకుకూడ ఇవియేసాధనములు. ఇట్టి సాధనములను ప్రభుత్వములు ఉపయోగింపవచ్చునా అను విషయమై ప్రస్తుతకాలమున రాజకీయపక్షములమధ్యను శాస్త్రవేత్తలమధ్యను వాదోపవాదము లనేకములు జరుగుచున్నవి. అట్టివాదములేవియు ప్రాచీనకాలమున జరిగినట్లు కనిపించవు. వ్యక్తులు వ్యవసాయాదులను సాగించి ధనమును సంపాదించినట్లే ప్రభువులుకూడ వాని సాహాయ్యమున ధనమును సంపాదించవచ్చు ననునది సర్వసమ్మతముగ నుండెను.

అర్థశాస్త్రములోని రెండవ అధికరణమగు అధ్యక్షప్రచారమందు ప్రభుత్వములీసాధనముల నెట్లు ఉపయోగించవలెనో వివరింపబడియున్నది. ప్రభుత్వయాజమాన్యమున వ్యవసాయము, పశుపాలనము, వనముల పెంపకము, గనుల పరిశ్రమ, లోహపరిశ్రమలు, నేత మొదలగు చేతిపనులు, వివిధవస్తువులకు సంబంధించిన వర్తకవ్యాపారములు సాగుటకు ఏర్పాటులుండెను. సీతాధ్యక్షుడు, గోధ్యక్షుడు, కుప్యాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు, ఆకరాధ్యక్షుడు, సువర్ణాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, పణ్యాధ్యక్షుడు మున్నగు అధికారులు వ్యవసాయాదులకు సంబంధించిన కార్యకలాపములను చేయించుచుండిరి. పరిపాలన సౌష్ఠవమునకును, విజయయాత్రలు సాగించుటకును కావలసిన వస్తుసామగ్రిని ధనమును రాజులు వీనిమూలమున సంపాదించుచుండిరి.

## 10

రాజులకర్తవ్యములలో రెండవరకములో చేరినవి, భూసంపాదనమునకు సంబంధించినట్టివి. తనకున్న రాజ్యముతో తృప్తిగాంచక, ఇతరరాజ్యముల జయించి తనరాజ్యమును విస్తరింపజేసికొనుటలో అధర్మ మెట్టిదియు లేకపోవుటయేగాక ఇది రాజులకు పరమధర్మమని పూర్వాచార్యుల మతము ననుసరించి కౌటిల్యుడు ఘంటాపథముగ పలికియున్నాడు. ఇది గర్హించదగిన

సామ్రాజ్యతత్త్వమని అత డనుకొనలేదు. అతని వాస్తవికదృష్టి కిదియొక ప్రబల నిదర్శనము.

ఈధర్మమును ప్రతిపాదించు సందర్భమున భరతఖండమును చక్రవర్తి క్షేత్రముగ నతడు పేర్కొనెను. చక్రవర్తి క్షేత్ర మనగా ఒకేచక్రవర్తి పరిపాలనములో నుండదగిన భూభాగము. హిమవంతము మొదలు సముద్రము వరకు వ్యాపించిన భరతఖండము పెక్కు చిన్నచిన్నరాజ్యములుగ చీలిపో కూడదనియు, దేశమంతయు నొకని పరిపాలనము నందుండదగినదనియు నతడు భావించెను. ఈమహోన్నతాశయము మనదేశచరిత్రలో ఒక్కొకప్పుడు సిద్ధించుటయు, మరియొకప్పుడు సిద్ధించకపోవుటయు సంభవించుచుండెను. కాని, ఇదియే సాధించదగిన ఆశయమని ప్రాచీనకాలపు శాస్త్రవేత్తలు వేలకొలది సంవత్సరములక్రిందట నుద్ఘాటించిరను విషయమును మనము విస్మరించరాదు.

ఈఆశయమును సాధించుట కవసరమగు సాధనముల నన్వేషించు సందర్భమున రాజు లనుసరించదగిన విదేశరాజ్యాంగనీతి ఎట్టిదిగ నుండవలెనో, ఆనీతి సఫలమగుటకు రాజులు ఎట్టిబలమును సమకూర్చుకొనవలెనో కౌటిల్యుడు వివరించెను.

రాజ్యమున కుండవలసిన సప్తాంగములలో దుర్గము, దండము, మిత్రుడు అనునవి భూసంపాదనమందు రాజున కుపకరించు సాధనములు. దుర్గములను సహజములు, కృత్రిమములు అని రెండురకములుగ కౌటిల్యుడు విభాగము చేసెను. జలదుర్గము, పర్వతదుర్గము, ఎడారిలోని దుర్గము, వనదుర్గములు సహజములు. మనుష్యప్రయత్నముచే నిర్మింపబడినవి రెండవ రకములో చేరినట్టివి. వీని నెట్లు నిర్మాణము చేయవలెనో దుర్గముల నిర్మాణ ప్రకరణమందు కౌటిల్యుడు వివరించియున్నాడు (2-3-1.35). శత్రువులు రాజ్యముపై దండెత్తివచ్చినప్పుడు దానిని రక్షించుకొనుటలో సైన్యమున కంటె దుర్గమే ఎక్కువగ నుపకరించగలదని కౌటిల్యుని అభిప్రాయము.

అర్థశాస్త్రమందు వివరింపబడిన సైన్యములు హస్త్యశ్వరథపదాతులను నాలుగుఅంగములతో కూడియుండెను. సైన్యములు బ్రాహ్మణప్రాయముగ నుండవలెనని పూర్వాచార్యులు చెప్పినను, కౌటిల్యుడు వారి అభిప్రాయములను ఖండించి సైన్యములు క్షత్రియప్రాయములుగ నుండవలెననియు, కావలసిన సంఖ్యలో క్షత్రియులు లభించనప్పుడు వైశ్యులను శూద్రులను చేర్చుకొన వలెననియు నతడు చెప్పెను (9–2–21,24).

సైన్యములో మౌలబలము, భృతకబలము, శ్రేణీబలము, మిత్రబలము, అమిత్రబలము, ఆటవికబలము అను ఆరువిభాగము లుండెను. వీనిలో మౌల

బలము సర్వవిధముల నగ్రస్థానము వహించినట్టిది. ఇది వంశపారంపర్యముగ రాజును సేవించుచుండువారితో కూడినట్టిది. ఇది శాశ్వతముగ పనిచేయు చుండునట్టిది. భృతకబలము యుద్ధసమయములందు తాత్కాలికముగ వేతనములు పుచ్చుకొని యుద్ధములో పాల్గొనువారితో కూడినట్టిది. శ్రేణి అనగా అనేకులతోకూడిన సంఘము. తమతమ నాయకుల యాజమాన్యమున సంఘములుగ నేర్పడి యుద్ధకాలమందు రాజులకు సాహాయ్యము చేయు సైనికుల సముదాయము శ్రేణీబలము. మిత్రుడు సాహాయ్యార్థము పంపిన సైన్యము మిత్రబలము. ఒకప్పుడు శత్రువుగ నుండి జయింపబడుట మూలమునగాని, సంధిమూలమునగాని రాజునకు వశపడిన సామంతుడు సాహాయ్యార్థము పంపుబలము అమిత్రబలము. ఇది విశ్వసనీయము కానట్టిదని కౌటిల్యుని అభిప్రాయము. పుళిందులు, శబరులు మొదలగు ఆటవికజనముతో కూడినది ఆటవికబలము. ఇదికూడ విశ్వసనీయము కానట్టిదిగ భావింపబడెను. శత్రురాజ్యములో దోపిడికార్యములు చేయుటలో వీరు నైపుణ్యమును చూపుచుండిరి.

విజయమునకంతకు మౌలబలము ప్రధానమగు ఆధారము. అందుచేత దానికి సర్వవిధముల శిక్షణనిచ్చుటకు ఏర్పాటులు గావింపబడియుండెను. రాజులు దానినితరుచు పర్యవేక్షించుచుండువారు.

దుర్గమును దండమును బలపరుచుకొని ఇతరరాజుల జయించి భూ సంపాదనమునకు ప్రయత్నించు రాజు విజిగీషువు అను పేరునకు తగినవాడు. కార్యసాధనమున కిత డనుసరించదగిన విదేశాంగరాజనీతిని వివరించు సందర్భ ములో పూర్వాచార్యులమతము ననుసరించి కౌటిల్యుడు ద్వాదశరాజమండల మునకును షాడ్గుణ్యమునకును సంబంధించిన సిద్ధాంతములను ప్రతిపాదించెను.

మండలసిద్ధాంతము భూసంపాదనము విషయములో విజిగీషునితో సంబంధముగల రాజు లెవరో, ఆ సంబంధము లెట్టివో వివరించుచున్నది. విజిగీషువు కేంద్రస్థానమందున్నట్లు భావించినపక్షమున తక్కినరాజులలో కొందరు అతనికి ముందుభాగమునను, కొందరతని వెనుకభాగమునను, మరి కొంద రీరెండుభాగములకు బాహ్యముగను ఉన్నట్లు ఊహించవచ్చును. ముందుభాగమున ఉన్నవారిలో మొదటివాడు విజిగీషునికి పొరుగునందుండు రాజ్యమును పాలించువాడు. ఇతనికి అరి (శత్రువు) అని పేరు. సాధారణ ముగ వీరిమధ్యనుండు సంబంధము శత్రుసంబంధముగ నుండును. అరికి తర్వాత నుండు రాజు (విజిగీషునిదృష్ట్యా) మిత్రుడు. మిత్రునికి తర్వాతిరాజ్యమును పాలించువాడు అరిమిత్రుడు. ఇతనికి తర్వాతిరాజ్యమును పాలించువాడు మిత్రమిత్రుడు. ఇతనికి తర్వాతిరాజ్యమును పాలించువాడు అరిమిత్ర మిత్రుడు. ఈవిధముగ విజిగీషునికి ముందుభాగమున అయిదుగురు రాజు

లున్నట్లు చెప్పవచ్చును. వారిపేర్లనుబట్టి విజిగీషునితో వారికిగల సహజ మగు సంబంధములెట్టివో ఊహించవచ్చును. అతనికి వెనుకభాగమున ఉన్న వారిలో మొదటివాడు అతనిపొరుగునయుండు రాజ్యమును పాలించువాడు. ఇతడుకూడ అరి అని చెప్పదగినను వెనుకభాగమందుండువా డను కారణ మున పార్ష్ణిగ్రాహి అను పేరునకు తగినవాడు. విజిగీషువు ముందుండు అరిపై దండెత్తినప్పుడు వెనుకనుండి ఇతడు విజిగీషుని కొట్టగల స్థితిలో నుండును. అందుచేత నితడు పార్ష్ణిగ్రాహి అనుపేరునకు తగినవాడు. వెనుకభాగమం దితనికి తర్వాతిరాజ్యమును పాలించువాడు ఆక్రందుడు. ఇతడు సాధారణ ముగ విజిగీషుని మిత్రవర్గములో చేరియుండును. ఇతనికి తర్వాతిరాజ్యమును పాలించువాడు పార్ష్ణిగ్రాహికి మిత్రుడగు పార్ష్ణిగ్రాహ్యాసారుడు. ఇతని తర్వాతిరాజ్యమును పాలించువాడు ఆక్రందునికి మిత్రుడగు ఆక్రందా సారుడు. ఈవిధముగ విజిగీషునితో శత్రుసంబంధమో మిత్రసంబంధమో గల రాజులు ముందుభాగమున అయిదుగురు, వెనుకభాగమున నలుగురు ఉన్నట్లు చెప్పవచ్చును. అరి విజిగీషుల రాజ్యముల నానుకొనియుండు రాజ్యములను పాలించువారికంటె బలవత్తరుడుగనుండురాజు మధ్యముడు. అరి విజిగీషు మధ్యముల రాజ్యములకు బాహ్యముగ నున్నవాడును, ఈ ముగ్గురికంటె బలవత్తరుడునగు రాజు ఉదాసీనుడు. ఈవిధముగ విజిగీషువు అతనికి ముందు భాగమునయుండు అరి మొదలగురాజు లయిదుగురు, వెనుకభాగమునయుండు పార్ష్ణిగ్రాహి మొదలగురాజులు నలుగురు, మధ్యమోదాసీనులు కలిసి పండ్రెండుగురు రాజు లగుచున్నారు. వీరిసముదాయమునకు రాజమండల మనిపేరు. ఈ రాజుల పేర్ల నుబట్టి విజిగీషునితో వారికిగల సహజమగుసంబంధ మెట్టిదో స్పష్టమగుచున్నది.

భూసంపాదనమునకు ప్రయత్నించు విజిగీషువు అరిపట్ల అనుసరించ దగిన నీతివిధానమునకు షాడ్గుణ్యమని పేరు. షాడ్గుణ్యమనగా ఆరుగుణములు, లేదా, ఆరు నీతివిధానముల సముదాయము. ఇవి సంధి, విగ్రహము, ఆసనము, యానము, సంశ్రయము, ద్వైధీభావము అనునవి. తనకార్యమును సాధించు కొనుటకు పరిస్థితులనుబట్టి విజిగీషువు ఒక్కొక్కప్పుడు అరితో సంధి జేసికొన వచ్చును; లేదా, విగ్రహము (విరోధము) వహించవచ్చును. విరోధము వహించి నను అరిపై దండెత్తక ఊరకుండవచ్చును. ఇట్టిస్థితి ఆసనము; లేదా, అతనిపై దండెత్తి వెళ్ళవచ్చును. అదియే యానము. బలము కోల్పోయినప్పుడతడు బలవంతు డొకనిని ఆశ్రయింపవచ్చును; లేదా, తనదుర్గములో ప్రవేశించి తన్ను తాను రక్షించుకొనవచ్చును. ఈ రెండువిధానములకు సంశ్రయమని పేరు. కొన్నిపరిస్థితులలో నతడు ఏకకాలమున నొకనితో సంధిచేసికొని మరి యొకనితో విగ్రహించవచ్చును. ఈ విధానమునకు ద్వైధీభావమని పేరు.

షాడ్గుణ్యములో ఏయేపరిస్థితులందు ఏగుణము ననుసరించుట లాభకరమగునో కౌటిల్యుడు సమగ్రముగ వివరించియున్నాడు. అరి కుండునంత బలము తనకు లేనప్పుడు సంధియు, ఎక్కువబలమున్నప్పుడు విగ్రహము, సమానబలమున్నప్పుడు ఆసనము, బలమత్యధికముగ నున్నప్పుడు యానము, బలము కోల్పోయినప్పుడు సంశ్రయము, ఇతరరాజుల సాహాయ్యము లభించినప్పుడు ద్వైధీభావము అనుసరణ యోగ్యములగును. ఈ విధానములన్నియు ధర్మసమ్మతములే. బలహీనుడుగనున్నప్పుడు సంధిచేసికొనినవాడు బలవంతుడైనతర్వాత సంధిషరతులకు విరుద్ధముగ విగ్రహించుటలో దోషమెట్టిదియు లేదు. లక్ష్యము భూసంపాదనము. ఇట్టి లక్ష్యము రాజున కుండుట ధర్మసమ్మతము. దీనిసిద్ధికై అత డనుసరించుమార్గము లన్నియు ధర్మసమ్మతములే. ప్రాణివధ, కుట్రలు, మోసము, అసత్యములాడుట మొదలగునవి వ్యక్తిజీవితములో నీతివిరుద్ధముగ పరిగణింపబడవచ్చును. కాని రాజ్యాధికారమును చేపట్టి ధర్మసమ్మతమగు రాజ్యవిస్తరణకార్యమును సాధించు రాజులజీవితములో నీతివిరుద్ధములు కాజాలవు.

షాడ్గుణ్యములో యానము ప్రధానస్థానము వహించుచున్నది. శత్రురాజ్యముపై దండెత్తుటయే యానము. విజయమునకు సాధనములగు ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి మున్నగు శక్తు లత్యధికముగ నున్నప్పుడే యానము చేయవలెను. ఇవి లోపించినప్పుడు యానము చేయరాదు. యానము చేయుటకు పూర్వము దానిమూలమున సంభవించు లాభనష్టముల నన్నిటిని లెక్కించి లాభము తప్పక కలుగునని తోచినప్పుడే యానము చేయవలెను. తాను రాజ్యములో లేనప్పుడు తనపై మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు మొదలగువారు కుట్రలుపన్ని తిరుగుబాటులు లేవదీయు ప్రమాదమున్నది. అందుచేత నట్టివి సంభవించకుండుటకు కావలసిన యేర్పాటులను గావించి యానమునకు పూనవలెను. యానకాలమందు తాను రాజ్యములో లేనప్పుడు తన ప్రతినిధిగ పరిపాలనకార్యములను సమర్థతతో నిర్వహించగల "శూన్యపాలు" డను అధికారిని నియమించవలెను. ఈవిధముగ పరిస్థితులనన్నిటిని అనుకూలపరుచుకొని యానములో సంభవించు కష్టములను సహించగల సైన్యమును వెంటనిడుకొని యుక్తమగు ఋతువులో విజిగీషువు శత్రురాజ్యముపై దండెత్తవలెను.

యుద్ధరంగములో విజయము సంపాదించుటకు పన్నవలసిన సైనికవ్యూహములనన్నిటిని కౌటిల్యుడు వివరించెను. వీనికితోడు శత్రుబలమును వినాశముచేయుటకు విజిగీషువు ఎట్టిసాధనములనైన ఉపయోగించవచ్చునని అతడు చెప్పియున్నాడు. కూటయుద్ధములు, కుట్రలు, శత్రురాజ్యములోని ప్రజలలో తిరుగుబాటులను ప్రోత్సహించుట, లంచము లిచ్చి శత్రురాజుల

కొలువులోని అధికారులను తనపక్షమునకు వచ్చునట్లు చేయుట, విషప్రయోగములు, మంత్రతంత్రములతోకూడిన ఔపనిషదికక్రియలు మున్నగునవి అన్నియు వినియోగింపదగిన సాధనములే. యుద్ధరంగమందపజయము గాంచి దుర్గములో తలదాచుకొనిన శత్రువు నోడించి దుర్గమును వశపరుచుకొనుటలో వివిధములగు ఇట్టి ఉపాయములను సాధనములను వినియోగించుట యందు ధర్మవైరుద్ధ్యమెట్టిదియు లేదని కౌటిల్యుని అభిప్రాయము.

అపజయముగాంచిన శత్రువును సింహాసనచ్యుతునిగజేసి, అతనిరాజ్యమును విజిగీషువు తనరాజ్యములో కలుపుకొనవచ్చును; లేదా, అతనిని తనకు సామంతునిగ జేసికొని, కప్పముచెల్లించునట్లు నిర్ణయించవచ్చును. ఈరెండింటిలో మొదటిమార్గము ననుసరించినప్పుడు శత్రురాజ్యములోని ప్రజలు తనయందు అనురాగముగలవారుగ ప్రవర్తించుటకు కావలసిన చర్యలనన్నిటిని విజిగీషువు తీసికొనవలెనని కౌటిల్యుడు సూచించియున్నాడు. ఇది అతని దూరదృష్టికి, వాస్తవికతకు, మరియొక నిదర్శనము. సామ్రాజ్యముల సంపాదించి పరిపాలించువారికి మార్గదర్శకముగగూడ నున్నదని చెప్పవచ్చును. "క్రొత్తదేశమును సంపాదించినతర్వాత శత్రువులోని దోషములను తనలోని సుగుణములచే కప్పివేయవలెను. తనలోని సుగుణములను రెండింతలుగ వృద్ధిచేసికొనవలెను. నిర్దిష్టమగు స్వధర్మమును నిర్వహించియు, అనుగ్రహములగు కార్యముల గావించియు, పరిహారముల నిచ్చియు, దానముల జేసియు, గౌరవముల కల్పించియు ప్రజలకు ప్రియమును హితమును చేయవలెను... శీలము, వేషము, భాష, ఆచారము మొదలగువాని విషయములో తాను ప్రజలతో సమానుడుగ నుండవలెను. (జయించిన) దేశములోని దేవతల యెడలను, సమాజోత్సవముల యెడలను, విహారముల యెడలను, భక్తిగలవాడై ప్రవర్తించవలెను...అతడు వారిదేవత లందరికిని, వారిఆశ్రమములకును పూజ లొనరించవలెను..." తాను పరాయివాడను భావము వారిలో కలుగకుండునట్లును, వారిలో నొకడను భావము కలుగునట్లును, అతడు ప్రవర్తించుట ధర్మమని ఈసూత్రములు స్పష్టపరుచుచున్నవి (13.5).

భరతఖండమునందనాదిగ నిటీవలివరకు స్థాపింపబడిన సామ్రాజ్యములన్నిటిలో పరిపాలనవిధానము దృష్ట్యా భూభాగములు రెండురకములుగ నుండెనని చెప్పవచ్చును. చక్రవర్తిచే ప్రత్యక్షముగ పరిపాలింపబడుచుండిన భూభాగము మొదటిరకములోనిది. అట్లుగాక, చక్రవర్తికి లోబడి, అతనికేదియో ఒకరూపమున కప్పము చెల్లించుచు పరిమితమగు స్వాతంత్ర్యము ననుభవించు సామంతులచే పరిపాలింపబడుచుండిన సంస్థానములతో కూడిన భూభాగము రెండవరకములోనిది. ఈరెండురకముల భూభాగముల అవసత

మును కౌటిల్యుడు గుర్తించెను. ఆకారణముచేత నితడు విజిగీషువు జయించిన శత్రురాజును సింహాసన భ్రష్టునిగ చేయక యతనిని కప్పముచెల్లించు సామంతునిగ నంగీకరించుట కొన్నిపరిస్థితులలో శ్రేయస్కరమగునని చెప్పెను. చక్రవర్తి సామంతుల మధ్యనుండదగిన సంబంధమునుగూడ నతడు వివరించెను. ఈసందర్భములో నతని సూత్రములు కొన్నిటి నిచట పొందుపరుచుట సమంజసము.

సామంతుడగు రాజు : "దుర్గాదికర్మలను, వివాహములలో కన్యనిచ్చి పుచ్చుకొనుట, రాజపుత్రాభిషేకము, గుర్రములను కొనుట, ఏనుగులను పట్టుకొనుట, యజ్ఞయాగములచేయుట, యాత్రలకు విహారములకు వెళ్ళుట—ఈ పనులన్నిటిని అతని (చక్రవర్తి) యనుజ్ఞతో చేయవలెను...దైవతముల పూజించునపుడును స్వస్తి వాచన సమయములందును, భర్తను (చక్రవర్తిని) ఆశీర్వదించునట్లు చేయవలెను..." (7–15–21,28).

చక్రవర్తి సామంతులను, "పరిభవించరాదు ; హింసించరాదు ; హేళన చేయకూడదు ; వారితో మితిమీరి మాటాడరాదు ; వారి కభయదానముచేసి తండ్రివలె ననుగ్రహించవలెను...చనిపోయినవాని భూమిని, ద్రవ్యమును, పుత్రులను, భార్యలను, తాను పరిగ్రహించరాదు. అతని కుటుంబములోనివారిని వారికి తగిన స్థానములందుంచవలెను. తనపనులు చేయుచు చనిపోయినవాని కుమారుని వానిరాజ్యమందు నిలుపవలెను......" (7–16–22,28).

పై వివరణమువలన కౌటిల్యుని దృష్టిలో రాజత్వమెట్టిదో, రాజ్యమును పాలించుటకు రాజులు నిర్మాణము చేసికొనదగు యంత్రాంగమెట్టిదో, రాజుల అంతరంగిక బాహ్యకర్తవ్యము లెట్టివో స్పష్టమగు చున్నది. అర్థశాస్త్ర వేత్తలలో నగ్రగణ్యుడగు కౌటిల్యు డుద్దేశించిన భూపరిపాలన సంపాదనముల గురించి చెప్పవలసిన విశేషము లింకను ఎన్నియో కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాను. ఒక పరిపాలనవిధానమును గురించియేకాక, ప్రాచీనకాలపు భారతదేశమందలి సాంఘికపరిస్థితులు, ఆర్థికపరిస్థితులు, మతాచారములు మున్నగువానిని గురించిన వివరములు కూడ ననేకములు అర్థశాస్త్రమందున్నవి. గ్రంథమును శ్రద్ధతో చదువువారు కొంతశ్రమపడిన యెడల వీని నన్నిటినిగురించి స్వయముగ తెలిసికొనినవారు కాగలరు.

# విషయసూచిక



## మొదటి అధికరణము : వినయాధికారికము (1–57)

రెండో అధికరణము : అధ్యక్షప్రచారము (58—179)

నాలుగో అధికరణము : కంటకశోధనము (246—288)

ఎనిమిదో అధికరణము : వ్యసనాధికారము (394–415)



తొమ్మిదో అధికరణము : అభియానముచేయువాని కార్యము (416–444)

## పదో అధికరణము : సాంగ్రామికము (445–464)



## పదకొండో అధికరణము : సంఘవృత్తము (465–469)



## పండ్రెండో అధికరణము : ఆబలీయసము (470–485)

పదమూడో అధికరణము : దుర్గలంభోపాయము (486-507)



పదునాలుగో అధికరణము : ఔపనిషదికము (508-525)



పదిహేనో అధికరణము : తంత్రయుక్తి (526-530)

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## మొదటి అధికరణము

## వినయాధికారికము

### అధ్యాయము 1

### ప్రకరణాధికరణముల సూచిక

ఓం నమః శుక్రబృహస్పతిభ్యామ్.[1]

1. భూసంపాదన పరిపాలనముల నుద్దేశించి పూర్వాచార్యులచే ఎన్నెన్ని అర్థశాస్త్రములు రచింపబడినవో వానినన్నిటిని సమకూర్చి ఈ అర్థశాస్త్రము వ్రాయబడినది.[2]

2. అందులో ఇది ప్రకరణాధికరణముల సూచిక.

3. విద్యలసంఖ్య, వృద్ధులతో సాంగత్యము, ఇంద్రియజయము, అమాత్యుల నియామకము, మంత్రి పురోహితుల నియామకము, రహస్యపరీక్షలద్వారా అమాత్యుల శుచిత్వాశుచిత్వముల నెరుంగుట, గూఢపురుషుల నియామకము, గూఢపురుషుల నియమావళి, స్వవిషయములోని కృత్యాకృత్యపక్షములవారి పరిశీలనము, పరవిషయములోని కృత్యాకృత్య పక్షములవారి పరిశీలనము, (మంత్రులతో) ఆలోచనా విధానము, దూత లనుసరించవలసిన విధులు, రాజపుత్రుని మూలమున కలుగు ప్రమాదములనుండి రక్షణ, అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని

---

[1] శుక్రుడు రాక్షసులకు, బృహస్పతి దేవతలకు గురువులై రాజనీతిశాస్త్రమును రచించినవారిలో ప్రథములని ప్రతీతి. గ్రంథాదియందు వారిని స్తుతించుట ఎంతైన ఉచితము.

[2] అర్థశాస్త్రము బహుప్రాచీనము. క్రీ.పూ. 600 నాటికే కొన్ని గ్రంథములు రచింపబడినట్లు విజ్ఞుల అభిప్రాయము. కౌటిల్యునినాటికి అనేక గ్రంథములు ప్రచారములో ఉండినవి. వానిలో కొన్ని వ్యక్తులు వ్రాసినట్టివి; మరికొన్ని ప్రత్యేక సంప్రదాయములకు జెందినవి. వ్యక్తులలో భారద్వాజుడు, విశాలాక్షుడు, పిశునుడు, కౌణపదంతుడు, వాతవ్యాధి, బాహుదంతపుత్రుడు మున్నగువారిని, సంప్రదాయములకు జెందినవారిలో బార్హస్పత్యులు, ఔశనసులు, మానవులు, పారాశరులు, అంభీయులు మున్నగువారిని కౌటిల్యుడు పేర్కొని యున్నాడు. పూర్వాచార్యులన్నమాట వీరందరివిషయమునను వర్తించుచున్నది. మహాభారతములోని శాంతిపర్వమందలి రాజనీతిప్రకరణము ఈ శాస్త్రముయొక్క ప్రాచీనతను స్పష్టపరచుచున్నది.

ప్రవర్తన, అభిమానమును కోల్పోయిన రాజపుత్రునిపట్ల ప్రవర్తన, రాజు అనుసరించ వలసిన విధులు, రాజాంతఃపుర నియమావళి, (రాజు) ఆత్మరక్షణము మొదలగు విషయములతో కూడిన వినయాధికారికము అనే మొదటి అధికరణము.

4. జనపద నివేశము, వ్యవసాయమునకు పనికిరాని భూముల వినియోగము, దుర్గముల నిర్మాణము, దుర్గములోని నివాసముల నిర్ణయము, (సన్నిధాత) వస్తు సంగ్రహణాధికారి కార్యకలాపము, సమాహర్త ఆయమును సమకూర్చు విధానము, అక్షపటలమందు లెక్కల సంవిధానము, ఉద్యోగులు అపహరించిన ధనమును తిరిగి రాబట్టుకొనుట, ఉద్యోగులపై పర్యవేక్షణ, శాసనాధికారము, కోశములో దాచదగిన రత్నముల పరీక్ష, గనుల పరిశ్రమను ఇతర పరిశ్రమలను ఏర్పాటుచేయుట, అక్షశాలయందలి సువర్ణాధ్యక్షుడు, విపణివీథియందలి సౌవర్ణకుని కార్యకలాపము, కోష్ఠాగారాధ్యక్షుడు, పణ్యాధ్యక్షుడు, కుప్యాధ్యక్షుడు, ఆయుధాగారాధ్యక్షుడు, పౌతవాధ్యక్షుడు, దేశకాలమానము, శుల్కాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, సీతాధ్యక్షుడు, సురాధ్యక్షుడు, సూనాధ్యక్షుడు, గణికాధ్యక్షుడు, నావధ్యక్షుడు, గోధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు, రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, సేనాపతి ప్రచారము, ముద్రాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు, సమాహర్త ప్రచారము, గృహపతికుల వర్తకుల సన్యాసుల వేషములు ధరించిన గూఢచారులు, నాగరికుని విధులు మొదలగు విషయములతో కూడిన అధ్యక్షప్రచారము అనే రెండో అధికరణము.

5. వ్యవహార స్థాపనము, వివాదపదనిబంధము, వివాహసంయుక్తము, దాయ విభాగము, వాస్తుకము, సమయస్యానపాకర్మ (ఒడంబడికల ఉల్లంఘించుట), ఋణాదానము (తీసుకొనిన అప్పును చెల్లించకపోవుట), ఔపనిధికము, దాసకర్మ కరకల్పము, సంభూయ సముత్థానము, విక్రీత క్రీతానుశయము, దత్తస్యానపాకర్మ, అస్వామి విక్రయము, స్వస్వామిసంబంధము, సాహసము, వాక్పారుష్యము, దండ పారుష్యము, ద్యూతసమాహ్వయము, ప్రకీర్ణకము మొదలగు విషయములతో కూడి నది ధర్మస్థీయము అనే మూడో అధికరణము.

6. కారుక రక్షణము, వైదేహక రక్షణము, ఉపనిపాత ప్రతీకారము, గూఢ జీవనము చేయువారినుండి రక్షణము, సిద్ధులవేషములో ఉన్న గూఢచారుల సాధ నమున అపరాధులను కనుగొనుట, అనుమానించబడినవారిని (దొంగిలించిన) వస్తువులతోను (దొంగిలించిన) సమయములలోను పట్టుకొనుట, ఆశుమృతకపరీక్ష, వాక్యకర్మానుయోగము, సర్వాధికరణ రక్షణము, ఏకాంగవధ నిష్క్రయము, శుద్ధచిత్ర దండకల్పము, కన్యాప్రకర్మ, అతిచారదండములు మొదలగు విషయములతో కూడి నది కంటకశోధనము అనేనాలుగో అధికరణము.

7. దాండకర్మికము, కోశాభిసంగ్రహణము, భృత్యభరణీయము, అనుజీవి వృత్తము, సమయాచారికము, రాజ్యప్రతిసంధానము, ఏకైశ్వర్యము మొదలగు విషయములతో కూడినది యోగవృత్తము అనే అయిదో అధికరణము.

8. ప్రకృతిసంపదలు, శమవ్యాయామికము మొదలగు విషయములతో కూడి నది మండలయోని అనే ఆరో అధికరణము.

9. షాడ్గుణ్యసముద్దేశము, క్షయస్థానవృద్ధినిశ్చయము, సంశ్రయవృత్తి, సమ హీనజ్యాయుల గుణాభినివేశము, హీనసంధులు, విగృహ్యాసనము, సంధాయాసనము, విగృహ్య యానము, సంధాయ యానము, సంభూయప్రయాణము, యాతవ్యా మిత్రుల యభిగ్రహము, ప్రకృతుల క్షయలోభవిరాగ హేతువులు, సామవాయిక విపరిమర్శము, సంహిత ప్రయాణికము, పరిపణితాపరిపణితాపసృత సంధులు, ద్వైధీభావికములగు సంధివిగ్రహములు, యాతవ్యవృత్తి, అనుగ్రహించదగిన మిత్రులగురించిన విశేషములు, మిత్రహిరణ్యభూమికర్మసంధులు, పార్ష్ణిగ్రాహచింత, హీనశక్తిపూరణము, బలవంతునితో విగ్రహించి దుర్గములో తలదాచుకొనుటకు హేతువులు, దండోపనతుని వృత్తి, దండోపనాయివృత్తము, సంధికర్మ, సమాధిమోక్షము, మధ్యమచరితము, ఉదాసీనచరితము, మండల చరితము మొదలగు విషయములతో కూడినది షాడ్గుణ్యము అనే ఏడో అధికరణము.

10. ప్రకృతివ్యసనవర్గము, రాజరాజ్యముల వ్యసనచింత, పురుష వ్యసన వర్గము, పీడనవర్గము, స్తంభవర్గము, కోశసంగ వర్గము, సైన్యవ్యసన వర్గము, మిత్ర వ్యసన వర్గము మొదలగు విషయములతో కూడినది వ్యసనాధికారికము అనే ఎనిమిదో అధికరణము.

11. శక్తి దేశ కాల బలాబల జ్ఞానము, యాత్రాకాలములు, బలోపాదన కాలములు, సన్నాహ గుణములు, ప్రతిబలకర్మ, వెనుకవైపు సంభవించు తిరుగు బాటులు, బాహ్యాభ్యంతరకోపప్రతీకారములు, క్షయవ్యయలాభముల విపరిమర్శ, బాహ్యాభ్యంతరములగు ఆపదలు, దూష్యశత్రు సంయుక్తములు, అర్థానర్థసంశయ యుక్తములు, వివిధములగు నుపాయములమూలమున వాని నెదుర్కొని కార్యసిద్ధి గాంచుట మొదలగు విషయములతో కూడినది అభియానము చేయువాని కార్యము అనే తొమ్మిదో అధికరణము.

12. స్కంధావార నివేశము, స్కంధావార ప్రయాణము, సైన్యముల నాప త్కాలమందును ఆక్రమణకాలమందును రక్షించుకొనుట, వివిధములగు కూటయుద్ధ ములు, స్వసైన్యోత్సాహనము, శత్రుబలము నెదుర్కొనునట్లు స్వబలవ్యూహము, యుద్ధభూములు, పత్త్యశ్వరథహస్తికర్మలు, పక్షకక్షోరస్యములందును పురోభాగ మందును వ్యూహవిభాగము, సారఫల్గుబలవిభాగము, పత్త్యశ్వరథహస్తియుద్ధములు, దండభోగమండలాసంహత వ్యూహముల వ్యూహనము, వాని నెదుర్కొనుటకు ప్రతి వ్యూహస్థాపనము మొదలగు విషయములతో కూడినది సాంగ్రామికము అను పదో అధికరణము.

13. భేదోపాదానములు, రహస్యదండములు మొదలగు విషయములతో కూడి నది సంఘవృత్తము అనే పదకొండో అధికరణము.

14. దూతకర్మ, మంత్రయుద్ధము, సేనాముఖ్యవధ, మండలప్రోత్సాహనము, శస్త్రాగ్నిరసముల రహస్యప్రయోగము, వీవధాసార ప్రసార వినాశము, రహస్యసాధనములచే శత్రువును పరిమార్చుట, సైన్యముచే శత్రువును పరిమార్చుట, ఏకవిజయము మొదలగు విషయములతో కూడినది ఆబలీయసము అనే పన్నెండో అధికరణము.

15. ఉపజాపము, యోగవామనము, గూఢపురుషుల వినియోగము, (దుర్గమును) ముట్టడించుట, అవమర్దము, లబ్ధప్రశమనము మొదలగు విషయములతో కూడిన దుర్గలంభోపాయము అనే పదమూడో అధికరణము.

16. పరబలఘాత ప్రయోగము, ప్రలంభనము, స్వబలోపఘాత ప్రతీకారము మొదలగు విషయములతో కూడినది ఔపనిషదికము అనే పదునాలుగో అధికరణము.

17. తంత్రయుక్తులు మొదలగు విషయములతో కూడినది తంత్రయుక్తి అనే పదిహేనో అధికరణము.

18. ఈ శాస్త్రగ్రంథములో పదిహేను అధికరణములు, నూటయేభై అధ్యాయములు, నూటఎనభై ప్రకరణములు, ఆరువేల శ్లోకములు ఉన్నవి.[3]

19. (శ్లో) సుఖావబోధముగను, తత్త్వార్థపదనిశ్చితముగను, గ్రంథ విస్తరము కాకుండగను కౌటిల్యునిచే ఈ శాస్త్రము వ్రాయబడినది.

ఇది కౌటిల్యుని అర్థశాస్త్రమందు వినయాధికారికము అను మొదటి అధికరణమందు ప్రకరణాధికరణముల సూచిక అనే మొదటి అధ్యాయము.

[3] రామాయణము కాండలుగను, మహాభారతము పర్వములుగను విభజింపబడినట్లు కౌటిల్యుని అర్థశాస్త్రము అధికరణములుగ విభజింపబడినది. ఒక్కొక్క అధికరణమున ఒక ప్రధాన విషయము వివరింపబడినది. మొదటి అధ్యాయములో ప్రకరణముల విభజన లేదు. తక్కిన 149 అధ్యాయములలో 180 ప్రకరణము లున్నవి. ఒక్కొక్క ప్రకరణము ఒక విషయమును వివరించునట్టిది. దాదాపు గ్రంథమంతయు గద్యరూపమున నున్నది. అధ్యాయముల చివరి భాగమందు మాత్రము శ్లోకములున్నవి. వాని సంఖ్య 380 మాత్రమే. 32 అక్షరములతో కూడినట్టిది గద్యరూపమందున్నను శ్లోకమే అని అనుకొనినను గ్రంథమందు 6,000 శ్లోకములు లేవు. 5,000 కు కొంచెము తక్కువగనున్నవి. సూత్రములకు పర్యాయపదముగ శ్లోకములు వాడబడినవి అని అనుకొనుటకుకూడ వీలులేదు. గ్రంథములోని సూత్రముల సంఖ్య 5,370 మాత్రమే. ఈ కారణములచేత గ్రంథమందు 6,000 శ్లోకము లున్నవి అనే వాక్యము ప్రక్షిప్తమేమో అను సందేహమున కవకాశము కల్పించుచున్నది.

# మొదటి అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 1 : విద్యలసంఖ్య (అందులో ఆన్వీక్షకీస్థాపన)

1. ఆన్వీక్షకి,[1] త్రయి, వార్త, దండనీతి—అని విద్యలు.

2. త్రయి, వార్త, దండనీతి—ఇవి మాత్రమే విద్యలు అని మానవులు.[2] 3. ఆన్వీక్షకి వేదవిద్యలో (అంతర్భూతమైన) ఒకశాఖ.

4. వార్త, దండనీతి—ఇవి మాత్రమే విద్యలు అని బార్హస్పత్యులు. 5. లోకయాత్రావిదునికి వేదవిద్య ఒక ఆచ్ఛాదనముమాత్రమేగదా!

6. దండనీతి ఒక్కటే విద్య అని ఔశనసులు. 7. సర్వవిద్యలకు సంబంధించిన వ్యవహారము లన్నియు దండనీతితో ప్రతిబద్ధములుగదా!

8. విద్యలు నాలుగు అని కౌటిల్యుడు. 9. ధర్మార్థములను తెలుసుకొనుటకు సాధనము లగుటచేతనే విద్యలకు విద్యాత్వము లభించుచున్నది.

10. సాంఖ్యము, యోగము, లోకాయతము[3]—ఇవి ఆన్వీక్షకికి అంగములు. 11. వేదవిద్యలో ఏది ధర్మమో ఏది అధర్మమో, వార్తలో ఏది అర్థమో ఏది అనర్థమో. దండనీతిలో ఏది నయమో ఏది అనయమో, విద్యలన్నిటిలో ఏవి గుణములో ఏవి దోషములో హేతువాదముచే నిర్ణయించుచు, ఆన్వీక్షకి లోకమున కుపకారము

[1] ఏది ధర్మార్థములను తెలుసుకొనుటకు సాధనమో అది విద్య. ఇది కౌటిల్యుని నిర్వచనము. ఇందుచేత విద్యలు నాలుగనియు వానిలో ఆన్వీక్షకి ఒకటి అనియు దానిమూలమున మానవునికి అనేక ప్రయోజనములు చేకూరుచున్న వనియు ఈ అధ్యాయము స్పష్టపరచుచున్నది. ఈ విషయములో తక్కినవారి మతము కౌటిల్యుని మతమునకు భిన్నము.

[2] మానవు లనగా మనువు అనుయాయులు. కాని ఈ మనువు మనుస్మృతిని వ్రాసినవాడు కాడు. ఇతడు శాంతిపర్వములో నుదహరింపబడిన ప్రాచేతస మనువు. ప్రస్తుతము ప్రచారములో నుండు మనుస్మృతిలో విద్యలు నాలుగని చెప్పబడియున్నవి.

[3] లోకాయతము—చార్వాకునిచే ప్రతిపాదింపబడిన నాస్తికమతము. ఇది సాంఖ్యయోగములతో సమానముగ పేర్కొనబడుటచేత కౌటిల్యుని కాలములో దానికి గౌరవస్థాన మున్నట్లు స్పష్టము.

చేయుచున్నది. వ్యసనాభ్యుదయములలో బుద్ధికి స్థైర్యము కలిగించుచున్నది. మనోవాక్కాయకర్మలకు పటిష్ఠతను చేకూర్చుచున్నది.[4]

12. (శ్లో) ఆన్వీక్షకి సర్వవిద్యలకు దీపమువలె కాంతి నిచ్చునదై, సమస్త కర్మలకు సాధనమై, సర్వధర్మములకు ఆశ్రయమై సర్వదా గౌరవపాత్రమై ఉన్నది.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున విద్యల సంఖ్య (అందులో ఆన్వీక్షకీస్థాపన) అనే రెండో అధ్యాయము.

[4] ఆన్వీక్షకి తత్త్వశాస్త్రము. ఇందులో ప్రతిపాదింపబడిన తత్త్వమునకు హేతువాదము ఆధారము. కాని ఇది తర్కశాస్త్రము కాదు.

# మొదటి అధికరణము

## అధ్యాయము - 3

### ప్రకరణము 1 : (మిగులు) విద్యలసంఖ్య (అందులో త్రయీస్థాపన)

1. సామవేదము, ఋగ్వేదము, యజుర్వేదము—ఈ మూటికి త్రయి[1] అని పేరు. 2. అథర్వవేద ఇతిహాస వేదములుకూడ వేదములే.

3. శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తి, ఛందస్సు, జ్యోతిషము—ఇవి అంగములు.

4. ఈ త్రయిలోని ధర్మము నాలుగు వర్ణములయొక్కయు, నాలుగు ఆశ్రమములయొక్కయు విధులను నిర్ణయించునట్టిదై ఉపకారక మగుచున్నది.

5. బ్రాహ్మణునికి అధ్యయనము, అధ్యాపనము, యజ్ఞములు చేయుట, యజ్ఞములను చేయించుట, దానము చేయుట, దానము గ్రహించుట స్వధర్మము.

6. క్షత్రియునికి అధ్యయనము, యజ్ఞములు చేయుట, దానము చేయుట, కత్తిపట్టి జీవించుట, లోకరక్షణ స్వధర్మము.

7. వైశ్యునికి అధ్యయనము, యజ్ఞములు చేయుట, దానము చేయుట, వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము స్వధర్మము.

8. శూద్రునికి ద్విజాతి శుశ్రూష, వార్త, కారుకర్మ, నాటకములలో పాత్రధారణ స్వధర్మము.[2]

9. గృహస్థునికి స్వధర్మానుసారము జీవించుట, సగోత్రముకాని తుల్యవర్ణపు కన్యతో వివాహము, ఋతుగామిత్వము, దేవపితృఅతిథిపూజలు, భృత్యుల

[1] త్రయి అనగా వేదము. వర్ణాశ్రమ ధర్మములను తెలిసికొనుట కిది సాధనము. అందుచేత దీనికి విద్య అన్న పేరు సార్థక మగుచున్నది.

[2] స్మృతులలో శూద్రునికి ద్విజాతి శుశ్రూష మాత్రమే ధర్మమని చెప్పబడినది. కాని కౌటిల్యుని మతము దీనికి భిన్నము. ఇది వాస్తవ పరిస్థితులను తెలియపరచుచున్నది. శూద్రులు స్వతంత్రవృత్తులనేకముల ననుసరించుచు జీవించుచుండిరని దీని మూలమున స్పష్టమగుచున్నది.

యెడత్యాగము, (అతిథులు భుజించినతర్వాత) శేషభోజనము స్వధర్మము.

10. బ్రహ్మచారికి స్వాధ్యాయము, స్నానము, అగ్నికార్యము, మాధుకర జీవనము, యావజ్జీవము గురువుతోగాని, గురుపుత్రునితోగాని, తోడి బ్రహ్మచారితోగాని కలిసిజీవించుట స్వధర్మము.

11. వానప్రస్థునికి బ్రహ్మచర్యము, నేలమీద పరుండుట, జడలను జింక చర్మమును ధరించుట, స్నానము, అగ్నిపూజ, దేవతలను పితరులను అతిథులను పూజించుట, వన్యపదార్థములను మాత్రమే భుజించుట స్వధర్మము.

12. పరివ్రాజకునికి ఇంద్రియనిగ్రహము, కర్మలు త్యజించుట, తనది అనే వస్తువు లేకుండుట, ఎవరితోటి సంబంధము పెట్టుకొనకుండుట, భిక్షావృత్తి, అరణ్యవాసము, బాహ్యాభ్యంతరశుచిత్వము స్వధర్మము.

13. మానవులందరికి, అహింస, సత్యము, శుచిత్వము, అనసూయ, దయ, క్షమ స్వధర్మము.

14. స్వధర్మము నాచరించుటవలన స్వర్గము, శాశ్వతసుఖము లభించును.

15. దీని నతిక్రమించినపక్షమున సాంకర్య మేర్పడి లోకము నశించును.

16. (శ్లో) అందుచేత ప్రజలు వారివారిధర్మముల నతిక్రమించకుండు నట్లు ప్రభువు చూడవలెను. అట్టిరాజు ఇహపరసౌఖ్యముల ననుభవించును.

17. (శ్లో) అర్యమర్యాదలకు బద్ధులైనట్టియు, వర్ణాశ్రమధర్మములకు కట్టుబడినట్టియు ప్రజలు వేదములచే రక్షింపబడి, నశింపక సుఖము ననుభవించెదరు.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున విద్యలసంఖ్య (అందులో త్రయీస్థాపన) అనే మూడో అధ్యాయము.

# మొదటి అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 1 : (మిగులు) విద్యల సంఖ్య
### (అందులో వార్తాస్థాపన, దండనీతిస్థాపన)

1. వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము కలిసి వార్త[1] అని అనిపించు కొనును. వీటి సాధనమున ధాన్యము, పశువులు, హిరణ్యము, వన్యపదార్థములు, విష్టి (కూలిజనము) లభించగలవు. 2. అట్లే వీటిసహాయమున రాజు కోశమును, సైన్యమును వినియోగించి స్వపక్షపరపక్షములను వశపరచుకొనగలడు.

3. ఆన్వీక్షకీత్రయీవార్తల యోగక్షేమములకు[2] దండము సాధనము ; దాని ప్రయోగమే దండనీతి. అది ఇదివరకు లభించనిదానిని లభింపజేయును ; లభించిన దానిని పరిరక్షించును ; రక్షింపబడినదానిని వృద్ధిచేయును ; వృద్ధిగాంచిన దానిని సత్పాత్రుల కందజేయును. 4. లోకయాత్ర అంతయు దానిపైన ఆధారపడియున్నది.

5. అందుచేత లోకయాత్రను సక్రమముగ సాగించదలచిన రాజు ఉద్యత దండుడై ఉండవలెను. 6. ఏలయన, "ప్రాణులను వశపరచుకొనుటకు దండము వంటి సాధన మింకొకటి లేదు," అని ఆచార్యులు.

7. "కాదు," అని కౌటిల్యుడు. 8. దండము తీక్ష్ణముగ నున్నపక్షమున

---

[1] వృత్తి అనగా జీవనాధారము. వృత్తినుండి పుట్టినది వార్త. వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము—ఇవి ప్రధానములగు వృత్తులు ; చేతిపనులు మొదలైనవి ఉపవృత్తులు.

[2] యోగమనగా వస్తుసామగ్రిని సంపాదించుట ; క్షేమ మనగా సంపాదించిన దానిని శ్రద్ధపరచుకొని రక్షించుట. ప్రజల శ్రేయస్సుకు ఇవి రెండును ఆధారములు. కాని, దండమును ధరించినరాజు ఉన్నప్పుడే ఇవి సాధ్యములగును. దండము (కర్ర) అధికార చిహ్నము. న్యాయవిరుద్ధముగ ప్రవర్తించు వారిని దండముతో కొట్టి శిక్షించుటతో రాజుల పరిపాలనాధికారము ప్రారంభమయ్యెను.

ప్రజలు ఉద్వేగములకు గురియగుదురు. 9. దండము మృదువగుపక్షమున ప్రజలు రాజును అవహేళన చేయుదురు. 10. అందుచేత యథార్థమగు దండము మాత్రమే పూజింపతగినది.[3]

11. చక్కగ ఆలోచించి వినియోగింపబడిన దండము ప్రజలకు ధర్మార్థ కామములను చేకూర్చును. 12. కామక్రోధములమూలమునగాని, అజ్ఞానమువలన గాని అన్యాయముగ వినియోగింపబడిన దండము వానప్రస్థపరివ్రాజకులనుకూడ ఉద్వేగములకు పాలుచేయును. గృహస్థులమాట చెప్పవలసిన దేమిటి ఉండును? 13. దండమును ప్రయోగించని పక్షమున మాత్స్యన్యాయము[4] పుట్టును. 14. దండధరుడు లేనప్పుడు బలవంతుడు బలహీనుని భక్షించును. 15. దండ ధరుడగు రాజుచే రక్షింపబడి దుర్బలుడు బాగుపడుచున్నాడు.

16. (శ్లో) చతుర్వర్ణ చతురాశ్రమములతో కూడిన ఈ లోకము రాజ దండముచే పాలింపబడి, స్వధర్మకర్మలయందభిరుచికలిగించి ప్రజలను తమతమ మార్గములందు నడుచునట్లు చేయుచున్నది.

ఇది వినయాధికారికమను మొదటిఅధికరణమున విద్యలసంఖ్య (అందులో వార్తాస్థాపన, దండనీతిస్థాపన) అనే నాలుగో అధ్యాయము.

దీనితో విద్యలసంఖ్య సమాప్తము

---

[3] దండము తీక్ష్ణముగ నుండవలెనని ఆచార్యుల అభిప్రాయము. అధి మృదువుగ నుండవలెనని మరికొందరి అభిప్రాయము. కాని, కౌటిల్యునిమతము ప్రకారము అది అతితీక్ష్ణముగగాని అతిమృదువుగగాని ఉండరాదు ; యథార్థముగ నుండవలెను.

[4] మాత్స్యన్యాయ మనగా పెద్దచేప చిన్నచేపను మ్రింగుట. ఇది చేపలకు స్వభావము. దండధరుడగు రాజు లేనప్పుడు సంఘములోని బలవంతులు బలహీనులను మ్రింగివేయుదురు. అట్టిది జరుగకుండుటకు ప్రభుత్వ ముండుట అవసరము. రాజ్యాధికారమునకు బలప్రయోగము (force) ప్రధాన లక్షణ మని ఇది సూచించుచున్నది.

## అధ్యాయము 5

### ప్రకరణము 2 : వృద్ధులతో సాంగత్యము

1. కావున, తక్కినమూడువిద్యలకు దండము మూలము. 2. వినయ మూలమగు దండము, ప్రాణులకు యోగక్షేమములను సమకూర్చును.[1]

3. కృతకము, స్వాభావికము అని వినయము రెండువిధములు.

4. (శిక్షణ అను) క్రియ అర్హునికి వినయము చేకూర్చును; అనర్హునికి చేకూర్చదు.

5. విద్యయం దాసక్తి, శ్రద్ధగ వినుట, వినినదానిని గ్రహించుట, గ్రహించిన దానిని ధారణచేయుట, విజ్ఞానము, ఊహించుశక్తి, అపోహల విడనాడుట, సత్యమందు శ్రద్ధ—ఇన్నిలక్షణములతో కూడినబుద్ధిగల వ్యక్తిని శాస్త్రము శిక్షించగలదు గాని ఇతరులను శిక్షించజాలదు.

6. ఆయావిద్యలలో ఆచార్యులైనవారియెడల ప్రామాణ్యబుద్ధిగలవారికే విద్యలు వినయ నియమములను[2] చేకూర్చగలవు.

7. చౌల కర్మానంతరము (రాజపుత్రుడు) అక్షరములు, లెక్కలు నేర్చుకొనవలెను.

8. ఉపనయనానంతరము శిష్టులవద్ద త్రయీవిద్యను, ఆన్వీక్షకీవిద్యను,

---

[1] అన్నిటికి దండము మూలము. కాని దండధరుడు వినయవంతుడగునప్పుడే ఇట్టి ప్రయోజనము లభించుచున్నది. వినయ మనగా క్రమశిక్షణకు లోబడిన వాడగుట. ఇది కొంతవరకు స్వాభావికమైనను మొత్తముమీద గురువులవద్ద విద్యలను నేర్చుకొనుటమూలముననుు, మంత్రులు మొదలగు ప్రయోగశాలురవద్ద పరిపాలన విధానము నేర్చుకొనుట మూలముననుు లభించుచున్నది. విద్యావిహీనుడు పరిపాలించుట కనర్హుడు. పరిపాలించువాడు ఏయే కాలములలో ఏయేవిద్యలను నేర్చుకొనవలెనో ఈ అధ్యాయము స్పష్టపరచుచున్నది.

[2] వినయ మనగా శిక్షణ. విద్యలను నేర్చుకొనువయస్సులో క్రమబద్ధమగు జీవితము, నియమము. బ్రహ్మచర్యము అందులో ఒక ప్రధానభాగము. ప్రస్తుతకాలపు విద్యార్థులలో ఆచార్యుల యెడ ప్రామాణ్యబుద్ధి, నియమముతోకూడిన జీవితవిధానము లోపించియున్నవి.

(ప్రభుత్వ) అధ్యక్షులవద్ద వార్తను సిద్ధాంతము ప్రయోగము తెలిసినవారివద్ద దండనీతిని[3] నేర్చుకొనవలెను.

9. పదహారేండ్లు వచ్చువరకు బ్రహ్మచర్యమును పాలించవలెను.

10. అటుతర్వాత కేశఖండనము ; అనంతరము వివాహము.

11. వినయము వృద్ధియగుట కతడు సదా విద్యావృద్ధులతో సాంగత్యము చేయవలెను. వినయమునకు అదియే మూలము.

12. పూర్వాహ్ణమున గజతురగరథశాస్త్ర విషయకమైన యుద్ధకర్మలయందు శిక్షణ పొందవలెను.

13. అపరాహ్ణమున ఇతిహాసములను వినవలెను.

14. ఇతిహాసములో పురాణము, ఇతివృత్తము, ఆఖ్యాయికము, ఉదాహరణము, ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము చేరిఉన్నవి.[4]

15. అహోరాత్రములలో శేషించిన సమయములను కొత్తవిషయముల నేర్చుకొనుటకు, ఇదివరలో నేర్చుకొనినవాటిని మననము చేయుటకు, నేర్చుకొనని వాటితో పదేపదే విని పరిచయము సంపాదించుటకు వినియోగించవలెను.

16. ఏలయన, పదేపదే వినుటవలన ప్రజ్ఞ, ప్రజ్ఞవలన యోగము (ప్రయోగ శక్తి), యోగమువలన ఆత్మవిశ్వాసము కలుగును. విద్యలకుగల సామర్థ్యమిట్టిదే కదా !

17. (శ్లో) విద్యలలో శిక్షితుడైనరాజు ప్రజలను వినయవంతులుగ చేయుటయందు శ్రద్ధవహించి, సర్వభూతములకు హితము చేయుటయం దనురక్తుడై, భూమిని ఏకచ్ఛత్రాధిపతిగ పాలించును.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున వృద్ధులతో సాంగత్యము అనే అయిదో అధ్యాయము.

---

[3] దండనీతిని సిద్ధాంతము తెలిసినవారినుండిమాత్రమే నేర్చుకొనరాదు. దాని ప్రయోగమును తెలిసిన మంత్రులు మొదలగువారినుండికూడ నేర్చుకొనవలెను. ప్రస్తుతకాలపు విద్యావిధానములో థియరీ (theory), ప్రాక్టీస్ (practice) అను రెండింటికి ప్రాధాన్యము కల్పించబడుట ఈ సందర్భములో గమనించతగినది.

[4] ఇతిహాసమును ఇంతటి విశాలార్థములో వాడినవారెవ్వరును లేరు. ఇది కౌటిల్యుని సూత్రము కాదనియు, వ్యాఖ్యాతలు ప్రవేశపెట్టినది కావచ్చుననియు కొందరి అభిప్రాయము.

# మొదటి అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 3 : ఇంద్రియజయము (అందు అరిషడ్వర్గ త్యాగము)

1. విద్యావినయ హేతువైన ఇంద్రియజయమును కామ క్రోధ లోభ మాన మద హర్ష త్యాగమువలన సంపాదించవలెను.

2. త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణములు—అనుఇంద్రియ ముల వృత్తులైన స్పర్శ రూప శబ్ద రస గంధములయందు అపరిమితమైన ఆసక్తి లేకపోవుటయే ఇంద్రియజయము. శాస్త్రానుష్ఠానము అట్టి ఇంద్రియజయమును లభింపజేయును.

3. ఏలయన, ఈశాస్త్రమంతటియొక్క ప్రయోజనము ఇంద్రియజయమే.

4. శాస్త్రవిరుద్ధ ప్రవృత్తిగలరాజు ఇంద్రియలోలుడై చతుర్దిగంతములకు పతియైనను వినాశము పొందును.

5. ఉదాహరణము : భోజవంశీయుడగు దాండక్యుడు, వైదేహుల రాజగు కరాళుడు బ్రాహ్మణకన్యను కామించి బంధురాష్ట్రసహితముగ నాశము పొందిరి.[1]

6. అదేవిధముగ, కోపమునకు వశుడై బ్రాహ్మణుల కపచారము చేసిన జనమేజయుడు ; భృగువులపై బలప్రయోగము చేసిన తాళజంఘుడు ; 7. లోభ మునకు వశుడై నాలుగు వర్ణములనుండి ధనము నమితముగ హరించిన ఐలుడు, సౌవీరుడైన అజబిందుడు ; 8. మానమునకు వశుడై పరదారనిచ్చివేయుట కిష్ట పడని రావణుడు, రాజ్యములో భాగము నిచ్చుట కిష్టపడని దుర్యోధనుడు ; 9. మదమునకు వశుడై ప్రాణుల నవమానించిన దంభోద్భవుడు, హైహయుడగు కార్త

[1] 5-10 సూత్రములలో పేర్కొనబడినవారినిగురించిన గాథలు రామాయణమందు, మహా భారతమందు, అశ్వఘోషుని బుద్ధచరిత సౌందరనందములందు, మరికొన్ని పురాణములందు కనిపించుచున్నవి. చరిత్ర గ్రంథములలో వీరి పేర్లు కనిపించుటలేదు.

వీర్యార్జునుడు ; 10. హర్షమునకు వశుడై అగస్త్యుని నెదుర్కొనిన వాతాపియు వినాశము గాంచిరి. ద్వైపాయను నెదుర్కొనిన వృష్ణిసంఘము ఇట్లే నశించెను.

11. (శ్లో) అరిషడ్వర్గము నాశ్రయించినట్టియు జితేంద్రియులు కానట్టియు ఈరాజులూ, వీరివంటి ఇతరరాజు లనేకులూ, బంధురాష్ట్రసహితముగ నశించిరి.

12. (శ్లో) అరిషడ్వర్గమును విడనాడి జితేంద్రియుడైన జామదగ్న్యియు, నాభాగుని కుమారుడగు అంబరీషుడును చిరకాలము భూమిని పాలించగలిగిరి.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున ఇంద్రియజయము (అందు అరిషడ్వర్గత్యాగము) అనే ఆరో అధ్యాయము.

# మొదటి అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 3 : (మిగులు) ఇంద్రియజయము (అందు రాజర్షి జీవితవిధానము)

1. కావున, రాజు అరిషడ్వర్గమును త్యజించి ఇంద్రియములను జయించ వలెను; వృద్ధులను సేవించి ప్రజ్ఞావంతుడు కావలెను; చారులమూలమున సమ స్తమును చూడగలవాడు కావలెను; ఉత్సాహముగలవాడై యోగక్షేమములను సాధించవలెను; తనధర్మమును నిర్వహించుటమూలమున ప్రజలు, వారివారి ప్రత్యేకధర్మములను నిర్వహించునట్లు చేయవలెను; విద్యల నభ్యసించి వినయ వంతుడు కావలెను; అర్థవంతములగు కార్యములను గావించి ప్రజలకు అభిమాన పాత్రుడు కావలెను; హితసాధనమున ఋజుప్రవర్తనుడు కావలెను.

2. ఈ విధముగ నింద్రియముల జయించి, పరస్త్రీ పరద్రవ్యములను హింసాకార్యములను విసర్జించవలెను; నిద్రమత్తు, లౌల్యము, అనృతము, డాంబిక వేషము, అప్రయోజకులతోడి సాంగత్యము, ధర్మరహితములు అనర్థములు అగు వ్యవహారములు—వీటిని త్యజించవలెను.

3. ధర్మార్థములకు విరోధములేక కామములను తీర్చుకొనవలెను; కాని, సుఖములను (పూర్తిగ) త్యజించరాదు. 4. లేదా, ఒకటితోనొకటి అనుబంధము గల త్రివర్గమును సమముగ సేవింపవలెను. 5. ధర్మార్థకామములలో దేనినైనను అతిగా సేవించిన పక్షమున అదియు తక్కిన రెండును పీడలుగమారును.

6. "అర్థమొక్కటే ప్రధానము," అని కౌటిల్యుడు.[1]

7. ఏలయన, ధర్మకామములకు అర్థము మూలము.

8. ఎవరు రాజును ఆపదలపాలు కానీయక నివారించెదరో, ఎవరు అతని

[1] ఇది మార్క్సు (Marx) సిద్ధాంతముతో పోల్చతగియున్నది.

రహస్య ప్రవర్తనలందుకూడ నీడపలెగాని, నాళికవలెగాని మేల్కొల్పి ప్రమాదముల నుండి రక్షించెదరో, అట్టి ఆచార్యులనుగాని, అమాత్యులనుగాని ఆతడు తన ప్రవర్తనకు హద్దుగా నేర్పరచుకొనవలెను.[2]

9. (శ్లో) ఇతరుల సహాయముతోడనే రాజత్వము సాధ్యమగును. చక్ర మొక్కటే ఉన్నప్పుడు బండి నడువజాలదు. కాబట్టి, మంత్రుల నేర్పరచుకొని, వారి అభిప్రాయములను వినవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున ఇంద్రియజయము (అందు రాజర్షి జీవితవిధానము) అనే ఏడో అధ్యాయము.

దీనితో ఇంద్రియజయము సమాప్తము

---

2 నీడ, నాళిక —ఇవి కాలమును తెలిసికొనుటకు సాధనములు. ఆచార్యులు, అమాత్యులు రాజు ఏయే కాలములలో ఏయే పనులను చేయవలెనో జ్ఞాపకము చేసి, అతని ప్రవర్తనను సరిదిద్దవలెను. వారి మాటయే అతనికి హద్దుగా నుండవలెను. అట్టివాడు రాజర్షి బిరుదమున కర్హుడు.

## అధ్యాయము 8

### ప్రకరణము 4 : అమాత్యుల నియామకము

1. "రాజు తనతో చదువుకొనినవారినే అమాత్యులుగ నియమించవలెను. ఏలయన, వారి శుచిత్వసామర్థ్యములు రాజునకు తెలిసియుండును. 2. వారతనికి విశ్వాసపాత్రులు," అని భారద్వాజుడు.[1]

3. "ఇది కూడదు," అని విశాలాక్షుడు.[2] 4. "ఏలయన, రాజుతో కలిసి వారాడుకొనిన వారగుటచేత నతనిని పరిభవింతురు. 5. రహస్య వ్యవహారములలో తన స్వభావమువంటి స్వభావము కలవారినే అతడు అమాత్యులుగ నియమించవలెను. అట్టివారతనితో సమానమగు శీలవ్యసనములను కలవారుగ నుందురు. 6. తమ రహస్యములు రాజునకు తెలిసియున్నవను భయముచేత వారాతనిని నొప్పించరు," అని.

7. "ఈ దోషము ఉభయులలోనూ ఉన్నది," అని పారాశరులు. 8. "తన రహస్యములు వారికి తెలిసియున్నవి అను భయముచేత వారేమి చేసినను, చేయక పోయినను అతడంగీకరించవలసిన వాడగును. 9. రాజు తన రహస్యముల నెందరికి తెలియపరచునో వారందరికి లోబడవలసిన వాడగును. 10. (అందుచేత), ఎవరు ప్రాణాపాయకరములగు నాపదలందు రాజును రక్షించియున్నారో వారినే అమాత్యులుగ నియమించవలెను. ఏలయన, వారి కతనియం దనురాగ ముండుట స్పష్టము."

---

[1] ఈ భారద్వాజుడు ద్రోణుడు కాడు. ఇతడు 5-5-11 లో ఉదహరింపబడిన కణింక భారద్వాజుడను మంత్రి. ఇతడుపదేశించిన రాజనీతి మహాభారతములోని శాంతిపర్వమం దుదహరింపబడియున్నది.

[2] విశాలాక్షుడనగా శివుడనియు, బ్రహ్మ రచించిన నూరువేల అధ్యాయములు గల దండనీతి శాస్త్రమును పదివేల అధ్యాయములుగ సంక్షేపించెననియు శాంతిపర్వము చెప్పుచున్నది.

11. "ఇది కూడదు," అని పిశునుడు.[3] 12. "ఇది భక్తిగాని బుద్ధికుశలత కాదు. 13. ఎవరు కార్యములందు నియుక్తులై అనుకొన్నంతగాని, అంతకంటె నెక్కువగాని లాభమును సమకూర్చగలరో వారినే అమాత్యులుగ నియమించవలెను. ఏలయన, వారి సామర్థ్యము ఋజువైనది గనుక."

14. "ఇట్లు చేయరాదు," అని కౌణపదంతుడు.[4] 15. "ఏలయన, అమాత్యులలో ఉండవలసిన తక్కిన గుణములు వీరిలో లేకపోవచ్చును. 16. తన తండ్రి తాతలనుండి ఎవరు సేవించుచు వచ్చిరో వారినే అమాత్యులుగ నియమించ వలెను. ఏలయన, వారి యోగ్యత తెలిసినట్టిది గనుక. 17. ఎప్పుడైనను రాజు వారిపట్ల దుష్టుడై ప్రవర్తించినను బంధుత్వముండుటచేత వారాతనిని త్యజించరు. 18. ఈ లక్షణము పశువులయందుకూడ కనుపించుచున్నది. 19. గోవులు తమతో సంబంధములేని మందను విడనాడి తమ మందలో కలిసిపోవును."

20. "ఇదికూడ చేయతగినది కాదు," అని వాతవ్యాధి.[5] 21. "ఏలయన, వారతని సర్వస్వము వశపరచుకొని తామే ప్రభువులన్నట్లు ప్రవర్తింతురు. 22. కావున (దండ) నీతివిదులైన క్రొత్తవారినతడు అమాత్యులుగ నియమించ వలెను. 23. క్రొత్తవారు దండధరుడగు రాజు యముని స్థానమందుండువాడని గ్రహించి, అతనికి అపరాధము చేయరు."

24. "ఇది కూడదు," అని బాహుదంతీపుత్రుడు.[6] 25. "శాస్త్రమును మాత్రము ఎరిగినవాడు వ్యవహార కర్మలందు అనుభవము లేనివాడై కార్యముల చెడగొట్టును. 26. కావున సద్వంశమందు పుట్టినవారిని, ప్రజ్ఞావంతులను, శుచులను, శౌర్యానురాగములు గలవారిని అమాత్యులుగ నియమించవలెను. (ఈ విషయములో) గుణములే ప్రధానములు."

27. "పైన చెప్పినదంతయు న్యాయముగానే ఉన్నది," అని కౌటిల్యుడు. 28. "కార్యములందుగల సామర్థ్యమునుబట్టి పురుషుని సామర్థ్యము నిర్ణయింప బడవలెను." 29. (శ్లో) కనుక, వారివారి సామర్థ్యములనుబట్టి వారి అంతస్థును, వారు పనిచేయవలసిన ప్రదేశమును, కాలమును, పనిని నిర్ణయించి వారిని అమాత్యులుగ నియమించవలెనుగాని మంత్రులుగ నియమించరాదు.[7]

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున అమాత్యుల నియామకము అనే ఎనిమిదో అధ్యాయము.

---

3 పిశునుడు నారదుడని ప్రతీతి. కాని ఇతడొక మంత్రి అని 5-5-11 చెప్పుచున్నది.

4 కౌణపదంతుడు భీష్మునికి నామాంతరము.

5 వాతవ్యాధి శ్రీకృష్ణుని మంత్రియగు ఉద్ధవుడని కొందరి అభిప్రాయము.

6 బాహుదంతీపుత్రుడు ఇంద్రుడని కొందరి అభిప్రాయము. ఇంద్రుడు దండనీతిశాస్త్రమును విశాలాక్షునివద్ద నేర్చుకొని, దానిని అయిదు వేలుగ సంక్షేపించెనని శాంతిపర్వము చెప్పుచున్నది.

7 మంత్రులు ప్రధానములగు రాచకార్యములలో ప్రభువునకు సలహా చెప్పువారు. వీరి పదవి అమాత్యుల పదవికంటె ఉన్నతమైనది.

# మొదటి అధికరణము

## అధ్యాయము 9

### ప్రకరణము 5 : మంత్రి పురోహితుల నియామకము

1. స్వీయరాష్ట్రములో పుట్టినవాడు, మంచి వంశములో జన్మించినవాడు, అదుపులో నుంచదగినవాడు, కలాకుశలుడు, చక్షుష్మంతుడు, ప్రాజ్ఞుడు, పట్టుదల గలవాడు, దక్షుడు, చక్కగ మాట్లాడగలవాడు, ప్రగల్భుడు, సద్యఃస్ఫూర్తి గలవాడు, ఉత్సాహ ప్రభావములు గలవాడు, క్లేశములను సహించువాడు, శుచి, మిత్రుడు, దృఢమగు భక్తిగలవాడు, శీలము, బలము, ఆరోగ్యము, సత్త్వము గలవాడు, మొండితనము, చాపల్యము లేనివాడు, సంప్రియుడు, కలహించని వాడు—ఇట్టివాడు మంత్రి కాదగినవాడు. 2. ఇందు ముప్పాతిక సంపద గలవాడు మధ్యముడు. సగము సంపద గలవాడు అధముడు.

3. ఈ గుణములలో – ఆప్తులద్వారా జన్మభూమిని, వంశమును, వశ్యతను ; సమాన విద్యలు గలవారిద్వారా కలాకుశలత్వమును, శాస్త్రచక్షుష్మతను ; (అతడు) చేయు కార్యములద్వారా, ప్రజ్ఞను, పట్టుదలను, దక్షతను ; సంభాషణలద్వారా వాగ్మిత్వమును, ప్రాగల్భ్యమును, ప్రతిభను ; ఆపదల నెదుర్కొనునపుడు ఉత్సాహమును, ప్రభావమును, క్లేశసహిష్ణుతను ; (అతడు పాల్గొను) వ్యవహారముల ద్వారా శుచిత్వమును, మిత్రత్వమును దృఢభక్తిత్వమును ; అతనితో కలిసి నివసించువారిద్వారా శీలమును, బలమును, ఆరోగ్యమును, సత్త్వమును, మొండి తనము చాపల్యములు లేకపోవుటను ; ప్రత్యక్షానుభవముద్వారా సంప్రియత్వమును, కలహములం దప్రియత్వమును – పరీక్షించి కనుగొనవలెను.

4. రాజవృత్తి ప్రత్యక్షము, పరోక్షము, అనుమేయము (అని మూడు రకములు). 5. రాజుచే స్వయముగ చూడబడినది ప్రత్యక్షము. 6. ఇతరుల నుండి తెలుసుకొనునట్టిది పరోక్షము. 7. కార్యములలో కొనసాగినదానినుండి

కొనసాగవలసినదానిని ఊహించుట అనుమేయము. 8. కార్యము లనేకము లగుటచేతను, ఒకే సమయమున వాటి ననేక ప్రదేశములలో చేయవలసివచ్చుట చేతను, దేశకాల వైపరీత్యము కలుగకుండుటకై వాటిని పరోక్షమున మంత్రులచే చేయించవలెను.

ఇది మంత్రుల నియామక కార్యము

9. అత్యున్నతములైన కులశీలములు గలవానిని, వేదవేదాంగములందు, జ్యోతిష ప్రశ్నశాస్త్రములందు, దండనీతియందు ఆరితేరినవానిని; దైవకృతమానవ కృతములగు నాపదలనుండి, అథర్వవేదవిహితములగు ఉపాయములద్వారా రక్షింప గలవానిని పురోహితునిగ నియమించవలెను.[1] 10. ఆచార్యుని శిష్యుడును, తండ్రిని కుమారుడును, యజమానుని సేవకుడును అనుసరించునట్లు పురోహితుని రాజు అనుసరించవలెను.[2]

11. (శ్లో) బ్రాహ్మణుని సహాయమున[3] వృద్ధిగాంచిన క్షాత్రము, మంత్రుల సలహాలు అను మంత్రములచే పునీతమై, దండనీత్యనుసరణమను శస్త్రమును ధరించి అపజయ మన్నదాని నెరుగక విజయవంతము కాగలదు.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున మంత్రిపురోహితుల నియామకము అనే తొమ్మిదో అధ్యాయము.

---

1 రాజునకు సలహా చెప్పువారందరిలో పురోహితుడు ఋగ్వేదకాల మందుండి అగ్రస్థానము వహించినవాడు. దైవసహాయములేక ప్రమాదములనుండి రక్షించుకొనుటయు, యుద్ధములో విజయము సంపాదించుటయు సాధ్యము కాదను నమ్మకము రాజులకు, ప్రజలకు ఉండెడిది. పురోహితుడట్టి సహాయమును సంపాదించు శక్తి కలవాడు. దండనీతిశాస్త్రమందు దారితేరినవాడు. రాచకార్యములందు పురోహితుల కున్నంతటి అనుభవము తక్కిన మంత్రులకు లేని కారణమున నీతిశాస్త్రములను ప్రప్రథమముగ రచించినవారు పురోహిత స్థానము నధిష్ఠించిన శుక్రబృహస్పతులు.

2 ఈ సూత్రము పురోహితుని పదవికిని, తక్కిన మంత్రుల పదవికినిగల భేదమును స్పష్టపరచు చున్నది.

3 బ్రాహ్మణు డనగా జ్ఞానము కలవాడు, విద్యలయందు దారితేరినవాడు అని గ్రహించవలెను. వారు ప్రస్తుతకాలపు intellectuals తో పోల్చదగినవారు.

# మొదటి అధికరణము

## అధ్యాయము 10

### ప్రకరణము 6 : రహస్య పరీక్షల ద్వారా అమాత్యుల శుచిత్వాశుచిత్వముల నెరుంగుట

1. మంత్రిపురోహితుల సలహాతో సామాన్య పరిపాలనశాఖలందు అమాత్యులను నియమించి, రహస్య పరీక్షలద్వారా[1] వారి శుచిత్వమును రాజు పరిశోధించవలెను.

2. యజ్ఞముచేయు అధికారము లేనివానిచేత యజ్ఞము చేయించవలసినదనిగాని, అట్టివానికి శాస్త్రోపదేశము చేయవలసినదనిగాని రాజు పురోహితుని ఆజ్ఞాపించి, ఆ ఆజ్ఞను తిరస్కరించినాడను కారణముచే నతనిని పౌరోహిత్య పదవి నుండి తొలగించినట్లు రాజు నటించవలెను. 3. అతడు గూఢచారులతో కూడి ఒక్కొక్క అమాత్యుని శపథపూర్వకముగ నిట్లు పురికొల్పవలెను: "ఈ రాజు అధార్మికుడు. ఇతని స్థానే ఇతని కుటుంబమునకు జెందిన మరియొకనినిగాని, బంధింపబడియుండు రాజపుత్రునిగాని, రాజకుటుంబమునకు జెందిన ఇంకొకనిని గాని, రాజ్యమునకు మూలస్తంభముగ నుండు మరియొకనిని (మంత్రిని) గాని, సామంతునిగాని, ఆటవిక ప్రభువునిగాని మనమందరము కలిసి రాజుగ నేర్పరచుకొనుట మంచిది. అందరును దీనికి సమ్మతించుచున్నారు. నీ మాట ఏమిటి?" అని. 4. అత డీసూచనను తిరస్కరించినయెడల శుచి అని భావించవచ్చును.

ఇది ధర్మపూర్వకమైన రహస్య పరీక్ష[2]

5. దుష్టులకు సహాయము చేసినాడన్న కారణమున పదవినుండి తొలగింప

---

[1] ఉపధ అని మూలము. ఉపధ అనగా రహస్య పరీక్ష.

[2] ఈ పరీక్షకు అధార్మికుడగు రాజును తొలగించి అతనిస్థానే ధార్మికుడగువానిని నియమించుట ఆధారము. అందుచేత ధర్మోపధ అను పేరు సార్థకమగుచున్నది.

బడినట్లు నటించు సేనాపతి రాజవినాశనమునకై గూఢచారులద్వారా ఒక్కొక్క అమాత్యుని (ధనముచే) లోభపెట్టి, "అందరును దీనికి సమ్మతించుచున్నారు. నీ మాట ఏమిటి," అని అడుగవలెను. 6. అత డీసూచనను తిరస్కరించిన యెడల శుచి అని భావించవచ్చును.

ఇది లోభపూర్వకమైన రహస్య పరీక్ష

7. (అమాత్యులందరికి) విశ్వాసపాత్రురాలై నట్టియు, అంతఃపురమందు సహితము సత్కారము పొందుచున్నట్టియు పరివ్రాజిక ఒక్కొక్క అమాత్యునితో రహస్యముగ "రాజమహిషి నిన్ను వలచినది. నీతో సమాగమమునకు ఏర్పాటు గావించియున్నది. ఇదిగాక, అధికధనము కూడ నీకు లభించగలదు," అని మభ్య పెట్టవలెను. 8. అతడు దీనిని తిరస్కరించినయెడల శుచి అని భావించవచ్చును.

ఇది కామపూర్వకమైన రహస్య పరీక్ష

9. అమాత్యులలో నొకడు విందు నిమిత్తమై తక్కిన అమాత్యుల నందరిని ఆహ్వానించవలెను. 10. దానికి కోపించి (నట్లు నటించి) వారిని రాజు (కారాగారములో) బంధించవలెను. 11. అంతకుపూర్వమే అచ్చట బంధింపబడిన కపట శిష్యుడొకడు అర్థమానములు కోల్పోయిన ఆ అమాత్యులలో నొక్కొకనిని "ఈ రాజు దుర్మార్గుడు; ఇతనిని చంపి, ఇంకొకనిని రాజుగ నేర్పరచుకొందము. అందరికి ఇది ఇష్టము. నీ మాట ఏమిటి?" అని అడుగవలెను. 12. అత డీ సూచనను తిరస్కరించినయెడల శుచి అని భావించవచ్చును.

ఇది భయమూలకమైన రహస్య పరీక్ష

13. వీరిలో ధర్మపరీక్షకు నిలబడినవారిని న్యాయస్థానములలోని ఉద్యోగము లందును, నేరము చేసినవారిని పట్టుకొనుటయందును; లోభ పరీక్షకు నిలబడిన వారిని సమాహర్త సన్నిధాత కార్యాలయములలోను; కామపరీక్షకు నిలబడినవారిని (రాజప్రాసాదము) లోపలను, వెలుపలను, విహారస్థానముల రక్షణమందును; భయ పరీక్షకు నిలబడినవారిని రాజుకు సన్నిహితములగు కార్యములందును నియమించ వలెను.

14. అన్ని పరీక్షలకు నిలబడినవారిని మంత్రులుగ నియమించవలెను.

15. ఏ పరీక్షకును నిలబడని అశుచులను గనులలోను, వన్యపదార్థముల అడవులలోను, ఏనుగుల అడవులలోను, కర్మాగారములలోను నియమించవలెను.

16. (శ్లో) "త్రివర్గ (ధర్మార్థకామ) పరీక్షలకును, భయ పరీక్షకును నిలబడిన అమాత్యులను వారివారి శుచిత్వమునుబట్టి వారివారికి అర్హములగు ఉద్యోగము లందు నియమించవలెను," అని ఆచార్యులు విధించియున్నారు.

17. (శ్లో) "కాని, అమాత్యుల శుచిత్వమును శోధించుటలో, ఏపరిస్థితు

ంలో కూడ, రాజు తననుగాని, పట్టమహిషినిగాని లక్ష్యముగ చేయరాదు,” అని కౌటిల్యుడు.

18. (శ్లో) నీటిని విషముచేత కలుషితము చేసినట్లు దోషరహితుడైన వానిని దోషమునకు లోబడునట్లు చేయరాదు. ఏలయన, దోషమునకు లోనైన వానిని కుదుర్చుటకు ఔషధ మేదియు లేకపోవచ్చును.

19. (శ్లో) సత్యవంతులబుద్ధి నాలుగువిధములగు పరీక్షలచే కలుషితమై దోషమందు స్థిరపడి, దానిచివరకు వెళ్ళునేగాని వెనుకకు మరలదు.

20. (శ్లో) కనుక, రాజు ఈనాలుగు విధములైన పరీక్షలందు తనను గాక ఇతరులనే లక్ష్యముగ చేసి, గూఢచారులద్వారా అమాత్యుల శౌచాశౌచములను శోధించవలెను.

ఇది వినయాధికారిక మను మొదటి అధికరణమున రహస్యపరీక్షలద్వారా అమాత్యుల శుచిత్వాశుచిత్వముల నెరుంగుట అనే పదో అధ్యాయము.

# మొదటి అధికరణము

## అధ్యాయము 11

### ప్రకరణము 7 : గూఢపురుషుల నియామకము (వారిలో సంస్థల నియామకము[1])

1. రహస్య పరీక్షలద్వారా శుద్ధులని తెలిసిన అమాత్యవర్గముగలవాడై రాజు గూఢపురుషుల నియమించవలెను. వారు కాపటికుడు, ఉదాస్థితుడు, గృహపతికుడు, వైదేహకుడు, తాపసవ్యంజనుడు, సత్రి, తీక్ష్ణుడు, రసదుడు, భిక్షుకి (అని తొమ్మిదిరకములవారు).

2. ఇతరుల రహస్యములను తెలుసుకొనినవాడును, ప్రగల్భముల పలుకువాడును అగు శిష్యుడు కాపటికుడు. 3. అతనిని అర్థమానములతో ప్రోత్సహించి, మంత్రి "రాజును నన్నును ప్రమాణముగ భావించి ఎవరి మూలమున ఏ అపాయమును కనిపెట్టెదవో దానిని తక్షణమే మాకు నివేదించవలెను" అని చెప్పవలెను.

4. పరివ్రాజకవృత్తిని విసర్జించినవాడును, ప్రజ్ఞాశౌచములతో కూడినవాడును ఉదాస్థితుడు. 5. అతడు అధికధనముతోడను, శిష్యులతోడను (మంత్రిచే) నిర్ణీతమైన ప్రదేశమందు కాపురము పెట్టి ఏదో ఒక వృత్తి ననుసరించవలెను. 6. దానిసాధనముతో గడించిన లాభముతో పరివ్రాజకులందరికి భోజన వస్త్ర గృహవసతులను కల్పించవలెను. 7. వారిలో ఏదైన వృత్తిని శాశ్వతముగ ననుసరించు గోరినవారితో, "ఈ వేషములోనే మీరు రాజునకు లాభము చేకూర్చు కార్యములలో శ్రద్ధవహించి, భోజన సమయములందును, జీతములను పుచ్చుకొనునపుడును ఇచటికి రావలెను" అని రహస్యముగ చెప్పవలెను. 8. పరివ్రాజకులందరు వారివారి వర్గముల నిదేవిధముగ నాదేశించవలెను.

9. వ్యవసాయము చేసి నష్టపడినవాడును, ప్రజ్ఞాశౌచములు గలవాడును

---

[1] గూఢపురుషులు రెండు రకములు. ఒకే ప్రదేశమున నివసించుచు తమ రహస్యకార్యముల నిర్వహించువారు మొదటి రకములోనివారు. వీరికి సంస్థలని పేరు. దేశ సంచారము చేయుచు తమ కార్యముల నిర్వహించువారు రెండవ రకములోనివారు. వీరికి సంచారు లని పేరు.

అగు కర్షకుడు (కపట) గృహపతికుడు. 10. అతడు వ్యవసాయార్థమై (మంత్రి) ఇచ్చిన ప్రదేశమందు కాపురము పెట్టి పై విధముగ ప్రవర్తించవలెను.[2]

11. వ్యాపారములో దెబ్బతిన్నట్టివాడును, ప్రజ్ఞాశౌచములు గలవాడును అగు వర్తకుడు (కపట) వైదేహకుడు. 12. అతడు వ్యాపారార్థమై (మంత్రి) ఇచ్చిన ప్రదేశమందు పై విధముగ ప్రవర్తించవలెను.

13. ముండనము చేసుకొనినవాడుగాని, జడలు ధరించినవాడుగాని, (తిరిగి) ఏదో ఒక వృత్తిని అనుసరించదలచినవాడు తాపసవ్యంజనుడు. 14. అతడు నగరసమీపమున ముండులును, జటాధారులును అగు శిష్యసమూహముతో నివసించుచు, బహిరంగముగ నెలకో, రెండునెలలకో ఒక పర్యాయము శాకములను గాని, ఒక పిడికెడు యవలనుగాని భుజించుచు, రహస్యముగ ఇష్టానుసారము ఆరగించుచుండవలెను. 15. గూఢచారులైన అతని వర్తక శిష్యులు ఐశ్వర్యార్థమై యోగాచారములతో అతనిని పూజించవలెను. 16. అతని శిష్యులు, "ఇతడు అమానుష ప్రజ్ఞగలవాడు, (ఎవరికైనను) ఐశ్వర్యము చేకూర్చగలవాడు" అని ప్రకటించవలెను. 17. ఐశ్వర్యమును కాంక్షించుచు అతనిని చేరినవారి (హస్తాది) అంగముల పరీక్షించిగాని, శిష్యుల సంజ్ఞలచేతగాని వారికుటుంబములలో జరుగనున్న కార్యముల సూచించుచు, "ముందుముందు అల్పలాభము, అగ్నిభయము, చోరభయము, రాజద్రోహులవధ, తుష్టిదానము" కలుగుననియు, "ఇది ఈరోజున గాని, రేపుగాని సంభవించును," "ఈ పనిని రాజు చేయును," అని చెప్పుచు విదేశవ్యవహారముల గురించిన విశేషములను తెలియజేయవలెను. 18. అతడు చెప్పిన దంతయు జరుగునట్లు అతని శిష్యులు, గూఢచారులు ఉపాయములను పన్నవలెను. 19. (దర్శనమునకు వచ్చినవారిలో) సత్యము, ప్రజ్ఞ, వాక్శక్తి గలవారికి రాజగౌరవము, మంత్రులతో సంయోగభాగ్యము రానున్నదని జోస్యము చెప్పవలెను. 20. మంత్రి వీరికి జీవనోపాయమును, వృత్తిని కల్పింపవలెను.

21. ఎవరు సహేతుకముగ రాజునకు విముఖు లయ్యెదరో (మంత్రి) వారికి అర్థగౌరవముల నిచ్చి వారిని శాంతింపజేయవలెను. అకారణముగ విముఖులైనవారినీ, రాజద్వేషులనూ రహస్యముగ దండించవలెను.

22. (శ్లో) (గూఢపురుషులు) రాజుచేత అర్థమానములతో పూజింపబడి, రాజభృత్యుల శుచిత్వమును తెలుసుకొనవలెను. ఈ విధముగ నీ అయిదుసంస్థలు[3] వివరింపబడినవి.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున గూఢపురుషుల నియామకము (వారిలో సంస్థల నియామకము) అనే పదకొండో అధ్యాయము.

---

[2] ఇతరకర్షకులను చేరదీసి, రాజునకు లాభము సమకూర్చు కార్యములను వారిచేత చేయించవలెను.

[3] కాపటికుడు, ఉదాస్థితుడు, గృహపతికుడు, వైదేహకుడు, తాపసవ్యంజనుడు—అనువారు.

# మొదటి అధికరణము

## అధ్యాయము 12

### ప్రకరణము 7 : (మిగులు) గూఢపురుషుల నియామకము (వారిలో సంచారుల నియామకము)

### ప్రకరణము 8 : గూఢపురుషుల నియమావళి

1. ఎట్టిబంధువులు లేనివారు, విధిగా ప్రభుత్వముచే పోషింపబడవలసిన వారు[1] – ఇట్టివారిలో లక్షణవిద్య, అంగవిద్య, జంభకవిద్య, మాయాగతము, ఆశ్రమ ధర్మము, నిమిత్తవిద్య, అంతరచక్రవిద్యలను[2] నేర్చినవారుగాని, సంసర్గవిద్యను నేర్చినవారుగాని సత్రులు.

2. జనపదమందు శూరులైనవారు, ప్రాణములకు తెగించినవారు, ధనాపేక్షచే ఏనుగులతోను, అడవిమృగములతోను పోరాడువారు తీక్ష్ణులు.

3. బంధువులయెడ ప్రీతిలేనివారు, క్రూరులు, సోమరులు – వీరు రసదులు.

4. (జీవనమునకై) ఏదైనావృత్తిని కోరునట్టియు, దరిద్రురాలును, విధవయు, ప్రగల్భురాలును, బ్రాహ్మణియు అగునట్టి పరివ్రాజిక భిక్షుకి. ఈమె అంతఃపురమునందు సత్కారమును పొందినట్టిదై ఉన్నతోద్యోగుల ఇండ్లకు వెళ్ళు

[1] తల్లితండ్రులులేని అనాథలను ప్రభుత్వము విధిగా పోషించవలెనని 2–1–26లో చెప్పబడినది.

[2] ఈవిద్య లా కాలములో ప్రచారములో నున్నట్టివి. శరీరములోని పుట్టు మచ్చలు మున్నగు లక్షణములనుబట్టి అదృష్టమును నిర్ణయించునట్టిది లక్షణవిద్య. శరీరస్పర్శచేత అదృష్టమును సూచించునది అంగవిద్య. మంత్రప్రయోగములచే ఇతరులను వశపరచుకొనుటకు, అదృశ్యులగుటకును సాధనమగునది జంభకవిద్య. శకునములను గురించిన విద్య నిమిత్తము. పక్షులకూతలు, జంతువుల అరుపులను బట్టి శుభాశుభముల నిర్ణయించుటలో నుపయోగపడు విద్య అంతరచక్రము. కామసూత్రములు, వానికి సంబంధించిన సంగీతనాట్యాదులతో కూడినది సంసర్గవిద్య.

చుండవలెను. 5. ముండులు, వృషలులుకూడ ఇట్లే ప్రవర్తింపవలెనని గ్రహింప వలెను.

వీరే సంచారులు. దీనితో ఏడవప్రకరణము సమాప్తము

6. (గూఢపురుషులగు) వీరికి ఆయాప్రదేశములకు, వేషమునకు, వృత్తికి, భాషకు, కులమునకు ఉచితమైన మారువేషమును నమ్మదగినట్లుగవేసి, రాజు వీరి భక్తి సామర్థ్యములబట్టి తనరాజ్యములోని మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు, దౌవారికుడు, అంతర్వంశికుడు, ప్రశాస్త, సమాహర్త, సన్నిధాత, ప్రదేష్ట, నాయకుడు, పౌరవ్యావహారికుడు, కార్మాంతికుడు, మంత్రిపరిషత్సభ్యుడు, అధ్యక్షుడు, దండపాలుడు, దుర్గపాలుడు, అంతపాలుడు, ఆటవికుడు మొదలైన ఉద్యోగుల (రహస్య) పరీక్షార్థమై వినియోగించవలెను.[3]

7. తీక్ష్ణులు (ఈ ఉద్యోగుల ఇండ్లలో) ఛత్రము, భృంగారము, వ్యజనము, పాదుకలు, ఆసనములు, యానములు, వాహనములు మున్నగువాటికి సంబంధించిన కార్యములలో ప్రవేశించి, వీరిబాహ్యచర్యను పరీక్షించవలెను. 8. సత్రులు వారి నివేదికను సంస్థలకు అందజేయవలెను.

9. రసదులు (ఈ ఉద్యోగుల ఇండ్లలో) వంటవాండ్రుగను, వడ్డించేవారుగను, స్నానము చేయించేవారుగను, పాదములు ఒత్తేవారుగను, పడకలు వేయువారుగను, మంగళ్ళుగను, వస్తువుల నందించువారుగను, నీళ్ళను మోయువారుగను పనిచేయవలెను. గూనివాండ్రుగను, పొట్టివాండ్రుగను, కిరాతులుగను, మూగవాండ్రుగను, చెవిటివాండ్రుగను, జడులుగను, గుడ్డివాండ్రుగను వేషము ధరించినవారు; నటులు, నర్తకులు, గాయనులు, వాద్యగాండ్రు, కథకులు, స్తుతిపాఠకులు (వీరివేషమును ధరించినవారు), స్త్రీలు (రసదులతో సహా వీరందరు) ఉద్యోగుల అభ్యంతరచర్యను పరీక్షించవలెను. 10. భిక్షుకులు వారి నివేదికను సంస్థలకు అందజేయవలెను.[4]

11. సంస్థలశిష్యులు సంకేతాక్షరములద్వారా గూఢచారులవార్తలను తెలియపరచవలెను. 12. సంస్థలుగాని, వారిశిష్యులుగాని, పరస్పరము పరిచయము గలవారుగ నుండరాదు.

13. భిక్షుకులకు ప్రవేశము లభించనప్పుడు (గూఢచారులు) ఇండ్లలోని

---

[3] ఉన్నతపదవులలో నుండువారెవరుకూడ తనయందు అచంచలమగు భక్తి గలవారను భావము రాజునకుండరాదు. వీరిలోనెవరైన నతనిపై కుట్రలు పన్నవచ్చును. అందుచేత నతడు వారి ప్రవర్తనను సదా పరీక్షించుటకు స్వయముగ గూఢచారుల నియమించవలెను. 6వ ప్రకరణములో వివరింపబడిన గూఢచారులను నియమించువాడు మంత్రి. మంత్రుల ప్రవర్తనను పరిశోధించుటకు కావలసిన గూఢచారులను రాజే స్వయముగ నియమించవలెను. వారు వారి నివేదికలను రాజునకు సమర్పించవలెను.

[4] 7-9 సూత్రములనుండి ఆకాలములో ఉన్నతాధికారుల ఇండ్లలో ఎన్నిరకములగు నౌకరులుండిరో తెలియుచున్నది. వీరిలో కొందరు కపటవేషధారులగు గూఢచారులు. గూఢచారులు వేసుకొనని వేషము లేనట్లు దీనినుండి స్పష్టము.

నౌకర్ల తల్లిదండ్రులనియో, శిల్పులనియో, గాయకులనియో, దాసీజనమనియో ద్వారములలో పరంపరగ ప్రవేశించి (లోపలిచారులు సంపాదించిన రహస్యవార్తలను) పాటలు, పద్యములు, వాద్యములలోని రహస్యపు వ్రాతలు, ఇతర సంజ్ఞలు మున్నగువానిద్వారా తెలుసుకొనవలెను. 14. లేదా, దీర్ఘరోగ, ఉన్మాదమిషలతో గాని, అగ్నిప్రమాదము కలిగించిగాని, విషప్రయోగము చేసిగాని (లోపలిచారులు) రహస్యముగ వెలుపలికి (తప్పించుకొని) రావలెను.

15. (గూఢపురుషులు) ముగ్గురి నివేదికలలో ఏకాభిప్రాయమున్నప్పుడు అది నమ్మదగినది. 16. వారు ప్రతిక్షణము పొరబడిన పక్షమున రహస్యశిక్షణద్వారా వారిని తొలగించవలెను.

17. కంటకశోధనప్రకరణమందు వివరింపబడిన గూఢపురుషులు ఒకరితో నొకరు సంబంధము పెట్టుకొనక, రహస్యవృత్తాంతమును సంపాదించుటకై శత్రువుల నుండియే వేతనముల పుచ్చుకొనుచు, వారితో నివసించుచుండవలెను. 18. వారు ఉభయవేతనులు.

19. (శ్లో) వారిభార్యాపుత్రులను రాజు తన అధీనమందుంచుకొని వారిని ఉభయవేతనులుగ నియమించవలెను. వారిలో ఎవరు శత్రువుల ఉద్యోగములో నున్నారో అతడు తెలుసుకొనవలెను. వారివంటి చారులద్వారా వారిశుచిత్వమును ఎరుగవలెను.

20. (శ్లో) ఇట్లు రాజు శత్రువు, మిత్రుడు, మధ్యముడు, ఉదాసీనుడు, వారి పద్దెనిమిదిమంది తీర్థులు — వీరందరిమధ్య చారులను వెదచల్లవలెను.

21. (శ్లో) వీరిఇండ్లలో గూనివాండ్రను, పొట్టివాండ్రను, నపుంసకులను, శిల్పవతులగు స్త్రీలను, మూగవాండ్రను, రకరకములగు మ్లేచ్ఛులను (సంచార చారులుగ) నియమించవలెను.

22. (శ్లో) దుర్గములలో వర్తకులను, దుర్గములకు వెలుపల సిద్ధతాపసులను, రాష్ట్రములో కర్షకులను, ఉదాస్థితులను, రాష్ట్రపు పొలిమేరలందు మందకాపరులను సంస్థలుగ నియమించవలెను.

23. (శ్లో) శత్రుప్రవృత్తిని తెలుసుకొనుటకు వనములలో శీఘ్రముగ ప్రయాణము చేయగల శ్రమణులను, ఆటవికులు మొదలైన వనచరులను నియమించవలెను.

24. (శ్లో) (తనరాజ్యములో తిరుగుచుండు) శత్రువుల చారులను — (అనగా) సంచారులను, సంస్థలను, గూఢపురుషుల సంజ్ఞలులేని గూఢపురుషులను—తనచారులలో ఆయా రకములకు చెందినవారిద్వారా ఎరుగవలెను.

25. (శ్లో) శత్రువుల గూఢచర్యలను తెలుసుకొనుటకై (రాజు) విశ్వసనీయులగు ఉద్యోగులను పొలిమేరలలో నియమించవలెను. వారు (రాజునకు)

వశపడినవారిచేత, వశపడనివారి కార్యోద్దేశములతో సంబంధముగలవారుగ గుర్తింప బడియుండవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున గూఢపురుషుల నియామకము (వారిలో సంచారుల నియామకము), గూఢపురుషుల నియమావళి అనే పన్నెండో అధ్యాయము.

# మొదటి అధికరణము

## అధ్యాయము 13

### ప్రకరణము 9 : స్వవిషయములోని కృత్యాకృత్యపక్షములవారి పరిశీలనము[1]

1. (రాజు చారులద్వారా) మహామాత్రులను శోధించుటతోపాటు పౌరులను, జానపదులను శోధించవలెను.[2]

2. సత్రులు జంటలుజంటలుగ పుణ్యక్షేత్రములలోను, సభలయందును, వర్తక శ్రేణులమధ్యను, ఇతర ప్రజాసమూహములలోను వాదోపవాదములలోకి దిగవలెను. 3. వారిలో ఒకడు, "ఈ రాజు సకల సద్గుణ సంపన్నుడని ప్రతీతి; కాని, ఇతనిలో ఒక సుగుణముకూడ కనుపించదు. కారణము – ఇతడు జరిమానాలు వేసియు, పన్నులు వసూలు చేసియు ప్రజలను పీడించుచున్నాడు. 4. (దీనిని అందుకొని) రెండవవాడు ఇతనిని, ఇతనిని సమర్థించువారిని, ఖండించవలెను. 5. (అత డిట్లనవలెను) : మత్స్య న్యాయముచే భయమొందిన మానవులు వివస్వతుని కుమారుడైన మనువును రాజుగా నెన్నుకొనిరి. 6. అతనికి (తాము పండించిన ధాన్యములో) ఆరవవంతును, వ్యాపార వస్తువుల లోను, ధనలాభములోను పదోవంతును ఇచ్చునట్లు ఖరారు చేసుకొనిరి. 7. దీనిచే పోషింపబడి రాజులు ప్రజలకు యోగక్షేమములను సమకూర్చుచున్నారు.[3]

---

1 కృత్యపక్షీయు లనగా వశపడి తనపక్షములో చేరువారు ; అకృత్యపక్షీయు లనగా అట్టివారు కానివారు.

2 ప్రజల అనురాగములేక రాజ్యమును పాలించుట సాధ్యముకానిపని. అందుచేత ప్రజలలో రాజును ద్వేషించువా రెవరో తెలిసికొనుటకు గూఢచారులను నియమించువిధానము అవసరము. ఆ సందర్భములో గూఢచారులు చేయవలసిన కార్యకలాపములు ఈ అధ్యాయమున వివరింపబడినవి.

3 రాజ్యాధికారమునకు ప్రజలు ప్రభువులమధ్య జరిగిన ఖరారు మూలాధారము అను ఈ వాదము పాశ్చాత్య తత్వవేత్త లాకప్పుడు ప్రతిపాదించిన ఖరారు సిద్ధాంతముతో (Social Contract Theory) పోల్చతగియున్నది.

8. జరిమానాలను, పన్నులను చెల్లించనివారు రాజుచేయు పాపములలో భాగస్వాము లగుచున్నారు. అట్లే, ప్రజలకు యోగక్షేమములను చేకూర్చని రాజు వారి పాపము లలో భాగస్వామి అగుచున్నాడు. 9. కావున, అరణ్యవాసులుకూడ "మనలను రక్షించు రాజునకు చెందవలసిన భాగ మిది" అని చెప్పుచు వా రేరుకొనిన ఉంఛ ధాన్యములో ఆరవ భాగము నతని కిచ్చుచున్నారు. 10. రాజుల పదవి ఇంద్ర యముల పదవియే.[4] (రాజులద్వారా) వారి ఆగ్రహానుగ్రహములు ప్రత్యక్షములగు చున్నవి. 11. రాజుల నవమానించినవారు దేవతలదండనకు పాత్రులగుచున్నారు. 12. కనుక, వారిని చులకన చేయరాదు అని. 13. ఈ విధముగ నతడు సామాన్య ప్రజలను అదుపులోనికి తేవలెను. 14. వీరు (ప్రజలలో వ్యాపించు) కింవదంతులను కూడ తెలుసుకొనవలెను.

15. రాజు ఇచ్చు ధాన్య పశు హిరణ్యముల ఆధారముతో జీవించువారు; మంచిరోజులలోను, చెడురోజులలోను అతనికి సహాయపడినవారు; వానిపై కలహించిన బంధువును, రాష్ట్రమును అణచినట్టివారు; అతని శత్రువును, అతనితో విరోధించిన ఆటవికుని ఎదుర్కొనినవారు—ఇట్టివారు సంతృప్తులుగ నున్నదీ లేనిదీ ముండు లయు, జటిలులయు వేషము ధరించిన చారులు తెలుసుకొనవలెను. 16. సంతృప్తు లుగ నున్నవారిని మరింత ధనగౌరవముల నిచ్చి పూజించవలెను. 17. సంతృప్తి గాంచనివారికి ధన మిచ్చి శాంతింపజేసి తృప్తి గలిగించవలెను. 18. లేదా, వారిలో భేదమును కల్పించి సామంతులనుండియు, ఆటవికులనుండియు, బంధువుల నుండియు, బంధితులగు రాజపుత్రులనుండియు వేరుపరచవలెను. 19. అప్పటికి కూడ వారు వశపడని పక్షమున వారిని జరిమానాలు, పన్నులు వసూలుచేయు ఉద్యోగులుగ నియమించి ప్రజలద్వేషమునకు గురిచేయవలెను.[5] 20. ప్రజల ద్వేషమునకు పాత్రులైనతర్వాత వారిని రహస్య దండనముద్వారాగాని, తిరుగుబాటు ద్వారాగాని తుదముట్టించవలెను. 21. లేదా, వారిని శత్రువులు లోబరచుకొనగల రను భయముండుటచేత వారి భార్యాపుత్రులను తన అధీనమందుంచుకొని, వారిని గనులలోగాని, కర్మాగారములలోగాని పనిచేయు ఉద్యోగులుగ నియమించవలెను.

22. కాని, వారిలో క్రుద్ధులు, లోభులు, భీతులు, గర్విష్ఠులు శత్రువుల ప్రేరేపణకు వశులగు ప్రమాదము కలదు. 23. (కనుక) కార్తాంతిక నైమిత్తిక మౌహూర్తికుల వేషము ధరించిన చారులు[6] వారి పరస్పర సంబంధములను శత్రువులతోగాని, ఆటవికులతోగాని వారికిగల సంబంధమును ఎరుగవలెను. 24...

---

[4] 10–13 సూత్రములలోని అభిప్రాయములు పాశ్చాత్యతత్త్వవేత్తలు ప్రతిపాదించిన, "రాజు దైవాంశసంభూతుడు" అను Divine Right Theory తో పోల్చతగియున్నది.

[5] జరిమానాలు, పన్నులు వసూలుచేయు ఉద్యోగులు ప్రజలద్వేషమునకు గురియగుట అన్ని కాలములలో నర్వసాధారణము.

[6] వీరందరు జ్యోతిషము చెప్పువారు.

-తుష్టులను అర్థగౌరవము లిచ్చి పూజించవలెను. 25. అతుష్టులను సామదాన భేద దండోపాయములచే సాధించవలెను.

26. (శ్లో) ఈ విధముగ విచక్షణుడగు రాజు తన రాష్ట్రమందలి ప్రముఖుల లోను, సామాన్యులలోను కృత్యులు (వశ్యులు), అకృత్యులు (వశముకానివారు) -శత్రువుల రహస్యపు లోభములకు గురికాకుండునట్లు జాగ్రత్త తీసుకొనవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున స్వరాష్ట్రములో కృత్యా-కృత్య పక్షములవారి పరిశీలనము అనే పదమూడో అధ్యాయము.

## అధ్యాయము 14

### ప్రకరణము 10 : పర విషయములోని కృత్యాకృత్యపక్షములవారి పరిశీలనము

1. స్వవిషయములో కృత్యపక్షీయులను, అకృత్యపక్షీయులను వశముచేసుకొను విధానము వివరించడము అయినది. పరవిషయమును గురించి వివరించవలసి ఉన్నది.

2. ధనవిషయములో వాగ్దానము చేయబడి మోసమునకు లోనైనవాడు, కార్యనైపుణ్యమందును, ఉపకారము చేయుటయందును సమానులైన ఇద్దరిలో అవమానింపబడినవాడు, రాజవల్లభుల కుట్రలు కారణముగ రాజవిరోధమునకు పాత్రుడైనవాడు, (పోటీలో) సవాలుచేయబడి పరాజయము పొందినవాడు, దేశ బహిష్కరణము మూలమున కష్టములపాలైనవాడు, ఖర్చుపెట్టిన తర్వాత లాభము సంపాదించలేకపోయినవాడు, స్వధర్మ నిర్వహణమందుగాని, దాయభాగమును వశపరచుకొనుటయందుగాని అడ్డగింపబడినవాడు, (రాజాజ్ఞచే) గౌరవమునుగాని, అధికారమునుగాని కోల్పోయినవాడు, రాజబంధువులచే నిరోధింపబడినవాడు, బలాత్కరించబడిన స్త్రీజనము కలవాడు, కారాగారబద్ధుడు, దావాలో ఓడిపోయి దండింపబడినవాడు, దుష్టప్రవర్తననుండి వారింపబడినవాడు, సర్వస్వము హరించ బడినవాడు, కారాగారములో హింసింపబడినవాడు, దేశాంతరానికి పంపబడిన బంధువులు కలవాడు – వీరు క్రుద్ధ వర్గమునకు జెందినవారు.

3. తానై ఇతరులను నష్టపరచినవాడు, విపరీతమగు నేరము చేసినవాడు, పాపకర్మ చేసినట్లు బయటపడినవాడు, సమానదోషి శిక్షింపబడుట చూచి భయపడిన వాడు, ఇతరుల భూమినాక్రమించినవాడు, బలప్రయోగము మూలముగ లోబరచు కొనబడినవాడు, అధికారియై స్వల్పకాలములోనే ధనమును కూడబెట్టుకొనినవాడు, రాజవంశములోని మరియొకడు రాజు కావలెనని ఆశించువాడు, రాజుచే ద్వేషింప బడినవాడు, రాజును ద్వేషించినవాడు – వీరు భీతవర్గమునకు జెందినవారు.

4. నిర్ధనుడైనవాడు, అన్యుల అపహరణముచే ధనమును కోల్పోయిన

వాడు. లోభి, వ్యసనములకు లోనైనవాడు, ప్రమాదకరములగు వ్యవహారములలో దిగినవాడు—వీరు లుబ్ధవర్గమునకు జెందినవారు.

5. అహంభావము కలవాడు, ప్రతిష్ఠకు ప్రాకులాడువాడు, శత్రుగౌరవమును చూచి ఓర్వలేనివాడు, నీచములగు పదవులలో నుండువాడు, తీక్ష్ణస్వభావము కలవాడు, సాహసికుడు, భోగము లున్నను తృప్తిగాంచనివాడు—వీరు మాని (గర్విష్ఠ) వర్గమునకు జెందినవారు.[1]

6. వీరిలో వశ్యులు కాదగినవారివద్దకు ముండజటిలవేషధారులగు చారులను పంపి, ఎవనికి ఏ చారునియందు భక్తి గలదో వానిని ఆ చారుని ద్వారా లోభపెట్ట వలెను.

7. "ఎట్లు మదాంధమైన ఏనుగు మత్తెక్కిన మావటివానిచే నధిష్ఠితమై అడ్డమువచ్చినవారి నందరిని త్రొక్కివేయునో, అట్లే శాస్త్రజ్ఞానము లేకపోవుటచే అంధుడైన ఈ రాజు పౌరులను, జానపదులను వినాశము గావించుటకు పూను కొనినాడు. ప్రతిగజమును పురికొల్పి అతనికి ప్రమాదము కల్పించవచ్చును. నీ కోపమును ప్రదర్శింపుము," అని క్రుద్ధవర్గమును పురికొల్పవలెను.

8. "ఎట్లు దాగియున్నసర్పము ప్రమాదమును శంకించిన ప్రదేశములో విషమును కక్కునో అట్లే ఈ రాజు నీవలన ప్రమాదమును శంకించి, అచిరకాలము లోనే నిన్ను క్రోధవిషాగ్నికి గురిచేయగలడు. అందుచేత మరియొక చోటికి వెళ్ళుట మంచిది," అని భీతవర్గమును పురికొల్పవలెను.

9. "ఎట్లు వేటగాండ్రగోవు బ్రాహ్మణుల ఉపయోగార్థము కాక కుక్కల ఉపయోగార్థము పితుకబడునో, అట్లే, ఈ రాజు ఆత్మగుణసంపత్తిగలవారికి గాక, సత్వము, ప్రజ్ఞ, వాగ్మిత్వము లేనివారికి ఉపకారము చేయుచున్నాడు. ఆ (మా) రాజు మనుష్యులలోని విశిష్టత నెరిగినవాడు. అతని నాశ్రయించుము," అని లుబ్ధవర్గమును పురికొల్పవలెను.

10. "ఎట్లు చండాలురబావి చండాలురకేగాని ఇతరుల కుపయోగపడదో, అట్లే నీచుడగు ఈరాజు నీచులకేగాని నీవంటి ఆర్యులకు ఉపయోగపడుటలేదు. ఆ (మా) రాజు మనుష్యులలోని విశిష్టత నెరిగినవాడు. అతనిని ఆశ్రయించుడు," అని మానివర్గమును పురికొల్పవలెను.[2]

11. (శ్లో) వారు "అలాగే" అని సమ్మతించి, సంధిషరతుల కంగీకరించిన

---

[1] శత్రురాజ్యములో ఈనాలుగువర్గములకు చెందిన ప్రముఖులు, తదితరులు వారి ప్రభువుపట్ల ద్వేషమును వహించియుండువారు. అట్టి వారిని గూఢచారులద్వారా తనపక్షములో చేరు నట్లు ప్రోత్సహించుట రాజధర్మము. వారిని ఏఉపాయములద్వారా తనకు వశులుగ చేసు కొనవలెనో, ఈ అధ్యాయము వివరించుచున్నది.

[2] చండాలురు ఆర్యులు కారనియు, వారు ఊరికి వెలుపల నుండువారనియు దీనినుండి గ్రహించవచ్చును.

వెంటనే వారివారి సామర్థ్యమునుబట్టి చారులతోసహా వారిని తన పనులతో నియోగించవలెను.

12. (శ్లో) శత్రురాజులోని దోషములను కనుపరచుచు పరవిషయము లోని కృత్యులను సామదానములచేతను, అకృత్యులను భేదదండములచేతను తన వైపు త్రిప్పుకొనవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున పరవిషయములోని కృత్యాకృత్యపక్షములవారి పరిశీలనము అనే పదునాలుగో అధ్యాయము.

## అధ్యాయము 15

### ప్రకరణము 11 : (మంత్రులతో) ఆలోచన విధానము

1. ఈ విధముగ రాజు స్వపక్షపరపక్షములను వశముచేసుకొనినపిమ్మట కార్యక్రమములగురించి ఆలోచించవలెను.

2. సమస్తకార్యములను ఆలోచనపూర్వముగ చేయవలెను.

3. దానికై ఉద్దేశింపబడిన ప్రదేశము ఏకాంతమై, వెలుపలనుండువారు అందులోనిమాటలు వినుటకు సాధ్యముకానట్టిదై, పక్షులు సహితము చూడ శక్యముకానట్టిదై ఉండవలెను. 4. ఏలయన, ఆలోచనలు చిలుకలు గోరువంకలద్వారాను, కుక్కలు తదితరజంతువులద్వారాను బట్టబయలైనట్లు వినుచుండుము. 5. కనుక అధికారికానివా డెవడును ఆలోచన ప్రదేశమును సమీపించరాదు. 6. రహస్యము బయటపెట్టినవానిని చంపివేయవలెను.

7. దూత, అమాత్యుడు, రాజు—వీరి ఇంగితము మూలముగను ఆకారము మూలముగను మంత్రభేదము సంభవించును. 8. ఇంగిత మనగా మామూలు దానికంటె భిన్నమగు ప్రవర్తన. 9. ఆకార మనగా ముఖవైఖరి. 10. కార్యము పూర్తియగువరకు రహస్యమును రక్షించవలెను. కార్యములో పాల్గొను అధికారులను కనిపెట్టి ఉండవలెను. 11. ప్రమాదమువలనగాని, మత్తువలనగాని, నిద్రవలనగాని వారు చేయు పలవరింతలు; వారికామోద్రేకము; (ఆలోచనప్రదేశములో) రహస్యముగ దాగియున్నవాడు; అవమానితుడు—రహస్యము బయట పడుటకు కారణములు. 12. కావున నతడు రహస్యమును సర్వవిధముల రక్షించవలెను.

13. "రహస్యము బయలుపడుట రాజుయొక్కయు, అతనిచే నియమితులైన అధికారులయొక్కయు యోగక్షేమములకు భంగకరము. 14. కాబట్టి, రహస్యవిషయమునుగురించి తానొక్కడే ఆలోచించుకొనవలెను. 15. ఏలయన, మంత్రులకు కూడ మంత్రు లుండెదరు; వారికి కూడ నితర మంత్రు లుండెదరు. 16. ఈ విధముగ నిట్టిమంత్రుల పరంపర రహస్యమును బట్టబయలు చేయును.

17. (శ్లో) "కనుక, రాజు చేయదలచినకార్య మితరులకు తెలియకూడదు. అది ప్రారంభమైనప్పుడుగాని, పూర్తియైనప్పుడుగాని ప్రారంభించిన వారికి మాత్రమే తెలియవలెను" అని భారద్వాజుడు.

18. "ఒకేఒకనిఆలోచన కార్యసిద్ధిని చేకూర్చదు. 19. ఏలయన, రాచకార్యములు ప్రత్యక్షపరోక్షానుమేయములు. 20. తెలియనిదానిని తెలుసుకొనుట, తెలిసినదానిని మరింత బలపరచుట, ఒకేవిషయమునుగురించి రెండు అభిప్రాయము లున్నప్పుడు సంశయమును తొలగించుకొనుట, ఒక విషయమును గురించి కొంత భాగము మాత్రమే తెలిసినపుడు తక్కిన బాగమునుకూడ తెలుసుకొనుట—ఇదిఅంతయు మంత్రుల సహాయముననే సాధ్యము. 21. అందుచేత నతడు బుద్ధివృద్ధులతో కూర్చుండి ఆలోచించవలెను. 22. (శ్లో) అతడెవరినికూడ నవమానించరాదు. అందరియొక్క అభిప్రాయములను వినవలెను. పండితుడైన వాడు బాలునివాక్యమునైనను అర్థవంతమైనప్పుడుపయోగించుకొనవలెను," అని విశాలాక్షుడు.

23. "ఇది మంత్రజ్ఞానముగాని మంత్రరక్షణము కాదు. 24. (రాజు) తాను చేయదలచినకార్యముతో సరిపోల్చదగిన మరియొక కార్యమును గురించి మంత్రులతో ఇట్లనవలెను: 'ఈ పని ఈలాగు జరిగినది. అది ఈలాగు జరిగినప్పుడు దానిని ఏలాగు చేయవలెను?' 25. వారినలహాప్రకారము (తాను తలపెట్టిన పనిని) చేయవలెను. 26. ఈవిధముగ చేసినయెడల మంత్రుల అభిప్రాయము తెలుసుకొనుటతోపాటు రహస్యరక్షణముకూడ సాధ్యమగును," అని పారాశరులు.

27. "ఇది కూడదు. 28. ఏలయన, జరిగినట్టియు, జరగనట్టియు ఏదియో ఒక ఊహింపబడినకార్యముగురించి ప్రశ్నింపబడినప్పుడు మంత్రులు అనాదరముగ సమాధానము చెప్పుదురు; లేదా, రహస్యము వెల్లడిచేయుదురు. 29. ఇది ఒక దోషము. 30. అందుచేత తాను చేయదలచినకార్యముల గురించి సలహాచెప్పుటకు ఎవరు సమర్థులో అట్టిమంత్రులతో ఆలోచించవలెను. 31. అట్టి వారితో (మాత్రమే) సలహా చేయుటవలన మంత్రులసలహాతోపాటు రహస్య రక్షణముకూడ లభించును," అని పిశునుడు.

32. "ఇది కూడదు. 33. ఇందులో అనవస్థా దోష ముండును.[1] 34. అతడు ముగ్గురు నలుగురు మంత్రులతో ఆలోచనలు జరుపవలెను. 35. ఏలయన, ఒక్కనితో మాత్రమే ఆలోచన జరిపినయెడల క్లిష్టవిషయములలో నిశ్చయము కుదరదు. 36. మంత్రి ఒకడే అయినప్పుడు విశృంఖలముగ ఇష్టానుసారము ప్రవర్తించును.

[1] ఈ విధానములో, ఒక్కొక్కపర్యాయము వేర్వేరుమంత్రులతో ఆలోచించుటచేత రాజునకు సలహా చెప్పుటకు నిర్ణీతముగ మంత్రులుండరు. ఇట్లు లేకపోవుటయే అనవస్థాదోషము.

37. (ఇట్లని) ఇద్దరితో సలహా చేసినయెడల వారిద్దరు ఏకమైనపక్షమున (అతడు) లోబడక తప్పదు. వారిద్దరు కలహించిన పక్షమున అతనికి వినాశము తప్పదు. 38. మంత్రులు ముగ్గురు నలుగురైనప్పుడు అది (వినాశము) కష్టసాధ్యము. 39. కాని అది సాధ్యమగు పక్షమున అందులోకూడ ప్రమాదమున్నది. 40. (మంత్రులు) అంతకంటె నెక్కువగుపక్షమున నిశ్చయము కుదురుటయు. రహస్యరక్షణము—ఈ రెండూ—కష్టసాధ్యములు. 41. అయినను, అతడు దేశకాల కార్యస్వభావములను గుర్తించి వారివారిసామర్థ్యములనుబట్టి ఒకరితోగాని, ఇద్దరితో గాని, లేక తనంతట తానేగాని ఆలోచించవలెను," అని కౌటిల్యుడు.

42. (మంత్రులతో) ఆలోచనకు అయిదు అంగములు: కార్యముల ఆరంభమునకు ఉపాయములు; (వాటిని సాధించుటకు కావలసిన) మనుష్య సంపద, అర్థసంపద; (వాటి కనువగు) దేశకాలములు; (కార్య) వైఫల్యమునకు ప్రతికార చర్య; కార్యసిద్ధి (అని).

43. మంత్రులను వేరువేరుగగాని, సముదాయముగగాని ప్రశ్నింపవలెను. 44. వారి అభిప్రాయములను, వానికిగల హేతువులను అతడు తెలుసుకొనవలెను. 45. (మంత్రులతో) ఆలోచించవలసిన విషయ ముత్పన్నమైనప్పుడు అతడు కాల యాపన చేయరాదు. 46. అతడు దీర్ఘాలోచన చేయరాదు. ఎవరికి హాని చేయదలచునో వారిపక్షమువారితో నాలోచించరాదు.

47. "అతడు పండ్రెండు మంది మంత్రులతో కూడిన మంత్రిపరిషత్తును ఏర్పరచవలెను," అని మానవులు. 48. "పదహార్గురు," అని బార్హస్పత్యులు. 49. "ఇరవై మంది" అని ఔశనసులు. 50. "యథాసామర్థ్యము," అని కౌటిల్యుడు.[2]

51. వారు (రాజుయొక్క) స్వపక్ష పరపక్షములను గురించి ఆలోచించవలెను. 52. కార్యముల విషయములో వా రిదివరలో చేయనివానిని ప్రారంభించుట, ప్రారంభించిన వానిని పూర్తిచేయుట, పూర్తిచేసినవానికి మరింత బలముచేకూర్చుట, ఆజ్ఞలను పూర్తిగ పాలించుట జరిపించవలెను.

53. హాజరైనమంత్రులతో కలిసి అతడు కార్యాలోచనలు చేయవలెను. 54. హాజరుకానివారితో లేఖలద్వారా ఆలోచనలు సాగించవలెను.

55. ఇంద్రుని మంత్రిపరిషత్తులో వేయిమంది ఋషులున్నారు. 56. అదే అతనికన్ను. 57. అందుచేతనే అతనికి రెండుకన్నులుమాత్రమే ఉన్నను సహస్రాక్షు డందురు.

58. అత్యవసర విషయములో నతడు మంత్రులను, మంత్రిపరిషత్తును సమా

[2] రాజులు ప్రత్యేకముగ మంత్రులతోనే గాక మంత్రిపరిషత్తు అను సభతోకూడ ఆలోచనలను సాగించువారని దీనినుండి తెలియుచున్నది.

వేశపరచి వారితో ఆలోచించవలెను. 59. వారిలో అధికసంఖ్యాకులు చెప్పినదానిని గాని, కార్యసిద్ధికి తోడ్పడుదానినిగాని అతడు చేయవలెను.

60. దానిని చేయుచున్నప్పుడు—

(శ్లో) అతని రహస్యము శత్రువులకు తెలియకూడదు. కాని శత్రువుల లోపముల నతడు తెలుసుకొనవలెను. తన పరిపాలనాంగములను తాబేలువలె బట్ట బయలు కానీయక గుప్తముగ నుంచుకొనవలెను.

61. (శ్లో) శ్రోత్రియుడుకానివాడు సత్పురుషుల శ్రాద్ధాన్నము తినుటకు అర్హుడుకానట్లే (దండనీతి) శాస్త్రార్థములను తెలియనిరాజు మంత్రుల ఆలోచనలను వినుటకు అర్హుడు కాడు.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున (మంత్రులతో) ఆలోచన విధానము అనే పదిహేనో అధ్యాయము.

## అధ్యాయము 16

### ప్రకరణము 12 : దూత లనుసరించవలసిన విధులు

1. ఆలోచనఫలితముగ నొకనిశ్చయ మేర్పడినతర్వాత దూతను (కార్యాచరణమునకు) నియోగించవలెను.

2. అమాత్యుల కుండవలసిన అర్హతలుగల దూత సర్వాధికారముగలవాడు.[1] 3. (ఆ అర్హతలలో) నాల్గవవంతు లేనివాడు పరిమితాధికారముగల దూత. 4. అర్ధ భాగము లేనివాడు రాజాజ్ఞను అందించువాడు (అందుకుమాత్రమే ఉపయోగించు వాడు).

5. దూత యాన వాహన పరివారములవిషయమున తగిన ఏర్పాటులు గావించు కొని బయలుదేరవలెను. 6. "శత్రువున కందించవలసిన రాజశాసనమిది. అతడు చెప్పు జబాబు ఇట్టిది. దానికి తగిన సమాధానమిది. ఈవిధముగ నతని ఎత్తుకు పై ఎత్తు వేయవలెను," అని ఆలోచించుకొనుచు అతడు ప్రయాణము చేయవలెను. 7. (మార్గములో) అతడు ఆటవికులతోను, అంతపాలురతోను, పురరాష్ట్రములలోని ప్రధానాధికారులతోను సంప్రతింపులు సాగించుచువెళ్ళవలెను. 8. తమయొక్కయు, శత్రువులయొక్కయు సైన్యముల నిలుపుటకును; యుద్ధము చేయుటకును; అద నపు సేనల నుంచుటకును; పారిపోవుటకును అనువగు ప్రదేశములను పరిశీలించ వలెను. 9. (శత్రురాజుయొక్క) దుర్గములయు, రాష్ట్రములయు ప్రమాణము, అందులోని బలాబలములు, (ప్రజల) వృత్తులు, రక్షణసాధనములు తెలుసుకొన వలెను.

10. శత్రువు అనుజ్ఞను పొంది అతడు ఆస్థానమును ప్రవేశించవలెను. 11. ప్రాణాపాయము కనుపించినను (దానిని గమనించక) యథోక్తముగ రాజ సందేశము నతనికి తెలియపరచవలెను.

[1] రాయబారమును జరుపుటలో స్వతంత్రాధికారము కలవాడగును.

12. (శత్రురాజుయొక్క) మాటలలో, ముఖములో, కండ్లలో సౌమ్యత, (దూతయొక్క) మాటలపట్ల గౌరవభావము, అతని అభిమతమునుగురించి కుశలప్రశ్న, (తనరాజునుగురించిన) గుణకథనమునం దాసక్తి, (సింహాసనము నకు) సమీపముగ ఆసన మిచ్చుట, సత్కారము, ఇష్టాగోష్ఠులలో (దూతను గురించి) స్మరణ, (దూతలో) విశ్వాసప్రదర్శనము—ఇవి అనుకూలుడగు శత్రురాజులక్షణములు. ప్రతికూలుడగు వాని లక్షణములు వీనికి విరుద్ధములుగ నుండును. 13. ప్రతికూలునితో, "రాజులందరు—నీవూ తక్కినవాడూ—దూతముఖులేగదా! 14. అందుచేత తమపై శస్త్రము లెత్తినను దూతలు (తమ రాజుల) మాటలను తూచాతప్పక చెప్పవలసియున్నది. 15. వారిలో అంత్యజులు కూడ అవధ్యులు. బ్రాహ్మణులమాట వేరుగ చెప్పవలెనా?[2] 16. ఈనామాటలు మరియొకరివి. 17. ఇది దూతధర్మము," అని చెప్పవలెను.

18. చూపబడిన గౌరవమునకు పొంగిపోక, (శత్రురాజు) వెళ్ళవచ్చునని చెప్పునంతవరకు వెనుకకు మరలి రాకూడదు. 19. (అతని) శత్రువులలో (తనరాజే) బలవంతు డని అనుకొనరాదు. 20. అప్రియములగు మాటలు పలికినను సహించ వలెను. 21. స్త్రీపానములను వర్జించవలెను. 22. తాను ఒంటరిగ నిద్రించవలెను. 23. ఏలయన, నిద్రలోను, మత్తెక్కినప్పుడును ఒకనిభావములు వ్యక్తములగును.

24. తాపస వైదేహక వేషధారులగు చారులద్వారాగాని, వారిశిష్యులద్వారా గాని, ఉభయవేతనులైన చికిత్సక పాషండ వేషధారులగు చారులద్వారాగాని శత్రు రాష్ట్రములోని కృత్యపక్షములవారి కుట్రలను, అకృత్యపక్షములవారిని శోధించుటకై వినియోగింపబడిన చారుల ప్రవృత్తిని, (శత్రుప్రజలు) వారి రాజుపట్ల చూపు రాగాను రాగములను, అచటి ప్రకృతులలోని లోపములను తెలుసుకొనవలెను. 25. వారితో సంభాషణము సాధ్యము కానప్పుడు యాచకులు, మత్తెక్కినవారు, ఉన్మాదులు, నిద్ర లోనుండువారు—వీరు చేయు ప్రలాపములద్వారాగాని, పుణ్యక్షేత్రములలోనియు, దేవాలయములలోనియు చిత్రలేఖనములు, వ్రాతలు, సంజ్ఞలు మున్నగువానిద్వారా గాని రహస్యసమాచారమును తెలుసుకొనవలెను. 26. అది తెలియగనే, అతడు కుట్రలు పన్నవలెను.[3]

27. శత్రురాజు అడిగినను తన (రాజుయొక్క) ప్రకృతుల పరిమాణమును తెలియపరచరాదు. 28. "సర్వము మీకు తెలిసినదే," అనిగాని, తన కార్యసిద్ధి కనుకూలించు (మరియొక) సమాధానమునుగాని చెప్పవలెను.

29. దూత కార్యము సఫలము కాకపోయినను వెనుకకు వెళ్ళిపోవుటకు

---

[2] సామాన్యముగ బ్రాహ్మణులే దూతలుగ పంపబడుచుండువారు.

[3] 24–26 సూత్రములలో దూత చేయవలసిన పనులన్నియు వివరింపబడినవి. శత్రువుల యొక్క రహస్యములను, వారిబలాబలములను తెలుసుకొనుట, వారిపై కుట్రలు లేవదీయుట ఇట్టిపనులలో కొన్ని.

(శత్రురాజు) అనుజ్ఞ నియ్యనప్పుడు అతడు ఈలాగు తలపోసుకొనవలెను: "ఇట్లు నన్ను నిలిపివేయుటకు కారణము నా ప్రభువునకేదో ప్రమాదము సంభవించనున్నదని అనుకొనుటయా; లేక, తనకు సంభవించబోవు ప్రమాదమునకు ప్రతిక్రియ చేసికొను ఉద్దేశమా; లేక, నా ప్రభువుపైన పార్ష్ణిగ్రాహునిగాని, తన మిత్రునిగాని, అంతః కలహమునుగాని, ఆటవికునిగాని ప్రేరేపణచేయ వాంఛయా; లేదా, నా ప్రభువు, యొక్క మిత్రునిగాని, ఆక్రందునిగాని నిరోధించదలచియా; లేదా, తాను శత్రువుతో, గాని, ఆటవికునితోగాని చేయుచుండు యుద్ధములోను, అంతఃకలహములోను అవసర చర్యలు తీసుకొనగోరియా; లేక, నా ప్రభువు సన్నాహము పూర్తిచేసుకొనిన, విజయయాత్రాకాలమునకు భంగము కలిగించు ఉద్దేశమా; లేక, తనకవసరమగు ధాన్యమును, వస్తుసామగ్రిని, వన్యవస్తువులను సంగ్రహించుకొనగోరియా; లేక, తన దుర్గమును బలపరచుకొను ఇచ్ఛయా; సైనిక బలమును సమకూర్చుకొను ఆశయా; లేక, తాను తలపెట్టిన యుద్ధయాత్ర కనువగు దేశకాలముల నిరీక్షించుటయా; లేక, పరిభవప్రమాదము సంభవించుననియా; లేక, నాప్రభువుతో సఖ్యము విడనాడరాదను అభిప్రాయమా" అని. 30. (శత్రువు) ఉద్దేశము నూహించి తానక్కడ ఉండుటయో, వెళ్ళిపోవుటయో నిశ్చయించుకొనవలెను. 31. లేక, వాంఛనీయమగు మరియొక ప్రయోజనము గురించి ఆలోచించవలెను.

32. (శత్రురాజునకు) గిట్టని సందేశమును తెలియపరచినతర్వాత తనకు నిర్బంధమో, మరణమో సంభవించునను భయముండును గనుక, అనుజ్ఞ లభించినను, లభించకపోయినను అక్కడనుండి వెళ్ళిపోవలెను. అట్లు చేయనియెడల నిర్బంధమునకు గురి కావచ్చును.

33. (శ్లో) (తన ప్రభువునకు) వార్తలను పంపుట, సంధి షరతులను పాలించుట, (తన ప్రభువుయొక్క) ప్రతాపమును ప్రశంసించుట, మిత్రులను సంపాదించుట, కుట్రలు పన్నుట, (శత్రువుయొక్క) మిత్రులలో భేదము కల్పించుట, గూఢచారులను సైనికులను (శత్రు రాజ్యములో) ప్రవేశపెట్టుట; 34. (శ్లో) (శత్రువుయొక్క) బంధువులను, రత్నములను అపహరించుట, రహస్య సమాచారమును సేకరించుట, పరాక్రమ ప్రదర్శనము, హామీగా ఉంచబడినవారిని తప్పించుకొనునట్లు చేయుట, రహస్య చర్యల ప్రయోగము—ఇవి దూత చేయవలసిన పనులు.[4]

35. (శ్లో) (రాజు) దూతలద్వారా ఈ కార్యములను సాగించుచు ప్రతి దూతల మూలమునను, చారుల మూలమునను ప్రకటముగను, గూఢముగను శత్రు దూతలను కనిపెట్టియుండవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున దూతలనునరించవలసిన విధులు అనే పదహారో అధ్యాయము.

---

[4] దూతలు గూఢచారులుగ ప్రవర్తించువారని దీనినుండి తెలియుచున్నది.

## అధ్యాయము 17

### ప్రకరణము 13 : రాజపుత్రుని మూలమున కలుగు ప్రమాదములనుండి రక్షణ

1. రాజు తన్నుతాను సమీప వర్తనులనుండియు, శత్రువులనుండియు— వీరిలో మొట్టమొదట భార్యాపుత్రులనుండియు—రక్షించుకొనగలిగినప్పుడే రాజ్యమును రక్షించగలవాడగును. 2. భార్యలనుండి రక్షణ "రాజాంతఃపుర నియమావళి," అను అధ్యాయములో వివరింపబడినది.

3. మరి పుత్రులనుండి రక్షణ.

4. పుట్టిన నిమిషము మొదలు రాజపుత్రులవలన కలుగు ప్రమాదముల నుండి రాజు తన్ను రక్షించుకొనవలెను. 5. ఏలయన, "రాజపుత్రులు ఎండ్రకాయతో సమానమగు ధర్మము కలవారు.[1] అందువలన తండ్రినే భక్షించెదరు. 6. తండ్రికి (వారియెడల) ప్రేమ ఉదయించకపూర్వమే వారికి రహస్య దండము విధించుటయే శ్రేయస్సు," అని భారద్వాజుడు.[2]

7. "ఇది నిర్దోషుల వధ. అందుచేత క్రూరకార్యము. దీనిమూలమున క్షత్రియ జాతికే వినాశము. 8. కనుక ఏదైన నొక ప్రదేశమందు[3] నిర్బంధములో నుంచుటయే శ్రేయస్సు," అని విశాలాక్షుడు.

9. "ఇది సర్పభయము వంటిది.[4] 10. ఏలయన, రాజపుత్రుడు, "నా పరాక్రమమునకు భయపడి తండ్రి నన్ను నిర్బంధములో ఉంచినాడు," అని

---

[1] "కర్కటక సధర్మాణః," అని మూలము.

[2] గ్రంథములో భారద్వాజుడు వ్యక్తపరచిన అభిప్రాయముల నన్నిటిని పరిశీలించినయెడల అతడు అతివాది యని చెప్పవలసివచ్చును.

[3] "రాజు నివసించు ప్రదేశమునకు సమీపమున" అని వ్యాఖ్యాతలు.

[4] పాము పగబట్టిన పక్షమున దాని నెట్టైన తీర్చుకొనజూచును.

భావించి తండ్రినే వశపరచుకొనవచ్చును. 11. అందుచేత వానిని పొలిమేర కోట యందు నివసించినట్లు చేయుటయే శ్రేయస్సు," అని పారాశరులు.

12. "ఇది ఔరభ్ర భయము వంటిది.[5] 13. ఏలయన, మరల వచ్చుట కది ఒక్కటే ఉపాయమని గ్రహించి (రాజపుత్రుడు) అంతపాలునితో కలిసి పోవచ్చును. 14. అందుచేత నతనిని తన రాజ్యమునకు మిగుల దూరమందుండు సామంతుని దుర్గములో నివసించునట్లు చేయుటయే శ్రేయస్సు," అని పిశునుడు.

15. "(రాజపుత్రుని దృష్ట్యా) ఇది వత్సస్థానము. 16. దూడ సహాయముతో ఆవును పితుకునట్లు (రాజపుత్రుని సహాయముతో) సామంతుడు రాజును వశపరచుకొనవచ్చును. 17. అందుచేత నతనిని తల్లివంకవారివద్ద నుంచుట శ్రేయస్సు," అని కౌణపదంతుడు.

18. "ఇది ధ్వజస్థానము. 19. ఏలయన, ఇతనిని ధ్వజముగ నుపయోగించుకొని అదితి కౌశికులవలె[6] మాతృబంధువులు రాజునుండి ధనమును లాగవచ్చును. 20. కనుక, రాజపుత్రుని (స్త్రీ, పానము మొదలైన) నీచసుఖలాలసునిగ చేయవలెను. 21. ఏలయన, నీచసుఖములకు మరగిన పుత్రులు తండ్రియెడ ద్రోహమును తలపెట్టరు," అని వాతవ్యాధి.

22. ఇది జీవన్మరణము. 23. ఏలయన, పురుగు తొలిచిన కఱ్ఱ విధమున అవినీతిపాలగు రాజకులము శత్రువులు దెబ్బతీసిన మరుక్షణముననే నశించును. 24. కనుక, పట్టమహిషి ఋతుమతి యగునప్పుడు ఋత్విక్కు ఇంద్రబృహస్పతులకు చరువు ఆహుతిగ నియ్యవలెను. 25. ఆమె గర్భవతి కాగానే, గర్భపోషణము నకును ప్రసవమునకును శిశువైద్యు నొకనిని[7] నియమించవలెను. 26. ప్రసవమైన వెంటనే పురోహితుడు పుత్రసంస్కారమును చేయవలెను. 27. తగిన వయస్సు వచ్చినతర్వాత నతనికి పండితులచే శిక్షణ నిప్పించవలెను," అని కౌటిల్యుడు.

28. "గూఢచారులలో నొకడు వానిని వేట, జూదము, పానము, స్త్రీ వ్యసనములవైపు లాగి, 'తండ్రిపై కలహించి రాజ్యమును చేజిక్కించుకొనుము,' అని ప్రోత్సహించవలెను. 29. మరియొకచారుడు దీనినంతను వారించవలెను," అని ఆంభీయులు.

30. నిద్రలో నుండువాని నిట్లు మేల్కొల్పుట మహాదోషము. 31. క్రొత్త వస్తువునకు దేనితో సంబంధము కలుగునో దానిరంగు దాని కంటుకొనును.

---

5 ఔరభ్ర మనగా పొట్టేలు, పంచెపు ప్రదేశమందు వివర నిలబెట్టినను మధ్యభాగమునకు వెళ్ళి ఎదటి పొట్టేలును కుమ్ముట వాని స్వభావము.

6 అదితి కౌశికులు—యాచనయే వృత్తిగాగల ఒక బృందము. వీరు ఏదియో ఒక దేవతా విగ్రహమునో, ధ్వజమునో ప్రదర్శించుచు భిక్ష మెత్తుకొనువారని కొందరు వ్యాఖ్యాతలు.

7 'కౌమారభృత్య': అని మూలము. శిశురోగములను కుదుర్చు వైద్యుడు అను అర్థములో ఈ పదము కొన్ని వైద్యగ్రంథములందు వాడబడియున్నది.

32. ఇట్లే స్వల్పబుద్ధిగల రాజపుత్రుడు ఎవ రేది చెప్పిన దానినే శాస్త్రోపదేశమని భావించును. 33. కనుక వానికి ధర్మార్థములనే బోధించవలెను గాని అధర్మమును అనర్థమును బోధించరాదు.

34. గూఢచారులు, "మేము నీవార"మని చెప్పుచు అతనిని (తప్పుత్రోవలో పోకుండ) రక్షించవలెను. 35. యౌవనోద్రేకముచేత పరులభార్యలను కామించిన పక్షమున వారు ఉత్తమస్త్రీలవేషముధరించిన నీచస్త్రీలను శూన్యప్రదేశములందు రాత్రివేళల నతనికి చూపి అతనిని భయపెట్టవలెను.

36. మద్యపానాభిలాషి అగునెడల యోగపానము[8] నిచ్చి అతనిని భయ పెట్టవలెను. 37. ద్యూతకాముడగునెడల కపటపు జూదగాండ్రద్వారా వానిని భయపెట్టవలెను. 38. వేటయం దాసక్తుడైనయెడల దారిదోపిడివాండ్రవేషము వేసుకొనినవారిద్వారా వానిని భయపెట్టవలెను. 39. తండ్రిపై కలహించగోరిన పక్షమున వారు, "సరే" అని అతనికి విశ్వాసపాత్రులై, తదుపరి, "రాజుపై కలహించరాదు. కలహమం దోడినయెడల మరణము తప్పదు. గెలిచినయెడల నరకపాతము సంభవించును. మరియు, ప్రజ లుద్రేకులై మట్టిపెళ్ళవలె నిన్ను నాశము చేసెదరు," అని చెప్పి అతని బుద్ధిని మార్చవలెను.

40. అతడు (తండ్రిపట్ల) విరాగుడైనయెడల వారు రాజునకు తెలియ పరచవలెను. 41. ప్రియుడైన ఏక పుత్రుని (విరోధియగునెడల) నిర్బంధ మందుంచవలెను. 42. పుత్రు లనేకు లున్నయెడల విరాగియగువానిని ఎచ్చట నతడు గర్భములోని శిశువువలెను, లేదా, పణ్యవస్తువువలెను, లేదా, డింభము వలెను కాజాలడో[9] అట్టిపొలిమేర ప్రదేశమునకుగాని, మరియొక దేశమునకుగాని, పంపివేయవలెను. 43. ఆత్మసంపన్నుడైనయెడల వానిని సేనాపతిగనో, యువరాజు గనో నియమించవలెను.

44. బుద్ధిమంతుడని, ఆహార్యబుద్ధిఅని, దుర్బుద్ధి అని పుత్రులు మూడు రకములు. 45. గురువులవద్ద శిష్యుడై, వారు నేర్పినధర్మార్థముల నర్థము చేసు కొని అనుష్ఠించుచున్నవాడు బుద్ధిమంతుడు. 46. అర్థము చేసుకొని అనుష్ఠించని వాడు ఆహార్యబుద్ధి. 47. సర్వదా ఇతరులకు కీడు చేయుచు, ధర్మార్థముల ద్వేషించువాడు దుర్బుద్ధి.[10]

---

8 ఇది ఒక విధమగు మత్తుపదార్థము, పైత్యాధిక్యమునకు హేతువు.

9 గర్భములోని శిశువువలె—పొలిమేరలోని ప్రజలు రాజపుత్రుని ముందు పెట్టుకొని రాజుపై తిరుగుబాటుచేయ అవకాశము ఉండరాదు. పణ్య వస్తువువలె—తమలాభమును వృద్ధి చేసుకొనుటకు రాజపుత్రుని వినియోగించుకొను ప్రమాదము ఉండరాదు. డింభమువలె, అలజడికి కారణభూతుడగువానివలె, ఇదికూడా వారు తిరుగుబాటు చేయుట కవకాశము కల్పించును.

10 దుర్బుద్ధి అగువాడు రాజ్యమును పాలించరాదు. అట్టి ప్రమాదము సంభవింపకుండుటకు కొన్ని మార్గములు 48-50 సూత్రములు సూచించుచున్నవి.

48. ఏక పుత్రు డిట్టివా డగునెడల మరియొకపుత్రసంతానమును గాంచవలెను. 49. లేదా, పుత్రికకు పుత్రసంతానము లభించునట్లు చూడవలెను.

50. రాజు ముసలివాడుగాని, రోగిగాని అయినప్పుడు భార్యకు సంతానము కలుగుటకై తనతల్లియొక్క బంధువునుగాని, గుణవంతుడగు సామంతు నొకనిని గాని వినియోగించవలెను.[11] 51. ఎట్టిపరిస్థితులలోకూడ దుర్బుద్ధియగు ఏక పుత్రుని సింహాసనాధిష్ఠునిగ చేయరాదు.

52. (శ్లో) (దుర్బుద్ధులగు) కొడుకు లనేకు లున్నప్పుడు వారి నొకచోట నిర్బంధించియుంచవలెను. కాని (మొత్తము మీద) తండ్రి పుత్రులయెడ హితుడుగనే ఉండవలెను. గొప్పప్రమాదము సంభవించినప్పుడుతప్ప జ్యేష్ఠ పుత్రుడే పట్టాభిషిక్తుడగుట ప్రశంసనీయము.

53. (శ్లో) లేదా, రాజ్యము రాజవంశమునకు (సమష్టిగ) చెందవలెను, ఏలయన, కులసంఘము దుర్జయము. రాజు లేడను వ్యసనము లేక, అది సర్వదా భూమిని పాలించగలది యగును.[12]

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున రాజపుత్రునిమూలమున కలుగు ప్రమాదములనుండి రక్షణ అనే పదిహేడో అధ్యాయము.

---

[11] నియోగపద్ధతి ధర్మ మను విషయము నీసూత్రము సూచించుచున్నది.

[12] జ్యేష్ఠపుత్రుడు పట్టాభిషిక్తుడగుట సాధారణధర్మము. కాని అతడు దుర్బుద్ధి యగుటచేతగాని, మరియొకకారణము వలనగాని సింహాసనార్హుడు కానప్పుడు రాజవంశమునకు చెందిన ప్రముఖులందరు కలిసి కొంతకాలము పరిపాలనమును సాగించవచ్చునని ఈ సూత్రము చెప్పుచున్నది. ఇది ఆపద్ధర్మము. కాని కొన్ని పరిస్థితులలో వాంఛనీయ మగును.

## అధ్యాయము 18

### ప్రకరణము 14 : అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని ప్రవర్తన
### ప్రకరణము 15 : అభిమానమును కోల్పోయిన రాజపుత్రునిపట్ల ప్రవర్తన

1. వినయవంతుడగు రాజపుత్రుడు జీవనార్థము కష్టపడవలసివచ్చినప్పుడు, తండ్రిచే తనకు తగనికార్యమందు నియుక్తుడైనను – ఆ కార్యము ప్రాణాపాయము కలిగించునట్టిదో, ప్రజల విరోధమునకు కారణ మైనట్టిదో, పాతకమునకు దారి తీయునట్టిదో అయినప్పుడుతప్ప, తండ్రినే అనుసరించవలెను.

2. తనకు నచ్చినకార్యమందు నియుక్తుడగునప్పుడు తనపనిని పర్యవేక్షించుట కొక ఉద్యోగిని నియమించవలసినట్లుగ కోరవలెను. 3. అతనిపర్యవేక్షణలో తనకు నియోగింపబడినకార్యమును మరింత ఉత్సాహముతో నెరవేర్చవలెను. 4. ఇంతేగాక, ఆకార్యమువలన కలిగిన సాధారణఫలితమును, తన కుపాయనముగ రాదగిన లాభమును తండ్రికే చేర్చవలెను.

5. అప్పటికికూడ (తండ్రి) సంతుష్టుడు కాక ఇంకొక పుత్రునిగాని, (తనతల్లికాక) ఇతరభార్యనుగాని అభిమానించినపక్షమున, అరణ్యమునకు వెళ్ళుట కనుమతిని కోరవలెను. 6. లేదా, నిర్బంధభయముగాని. మరణభయముగాని కలిగినప్పుడు న్యాయప్రవృత్తికలవాడును, ధార్మికుడును, సత్యము పలుకువాడును, మోసము చేయనివాడును, తన్ను చేరినవారికి స్వాగత మిచ్చి గౌరవించువాడును అగు సామంతు నాశ్రయించవలెను. 7. అక్కడ (ఉండి) కోశమును, సైన్యమును సమకూర్చుకొని, పరాక్రమవంతులతో వివాహసంబంధము కలుపుకొని, ఆటవికులతో స్నేహము చేసి, (తండ్రిరాజ్యములోని) కృత్యపక్షము వారిని వశపరచుకొనవలెను.

8. (ఎవ్వరి నాశ్రయించక) ఒంటరిగ నుండవలసినప్పుడు గనులలోను బంగారమును కరిగించునట్టియు, మణులకు రంగువేయునట్టియు, బంగారు వెండి

సరకులను తయారుచేయునట్టియు కర్మాగారములలో పనిచేసి జీవించవలెను. 9. లేదా, అతడు పాషండ సంఘముల ద్రవ్యమునుగాని,[1] శ్రోత్రియ బ్రాహ్మణు లుపయోగించని దేవాలయ ద్రవ్యమునుగాని, ధనికురాండ్రగు విధవలకు విశ్వాస పాత్రుడై తర్వాత వారి ధనమునుగాని, రహస్యముగ నపహరించవలెను. అట్లే, మత్తెక్కించు మద్యరసమును త్రాగించి సార్థవాహులను, నావలను దోపిడీ చేయ వలెను. 10. లేదా, ఆవసరమగు నుపాయము నవలంబించి, శత్రుగ్రామములు పట్టుకొనవలెను. 11. లేదా, తల్లివంకవారి సహాయము సంపాదించి కార్యమునకు దిగవలెను. 12. లేదా, చేతిపనివాడు, శిల్పి, కథకుడు, వైద్యుడు, పౌరాణికుడు, పాషండుడు—వీరిలో నొకని వేషము ధరించి—అదే వేషమును ధరించిన స్నేహితులతో కలిసి ఏదో ఒక అవకాశము నాధారము చేసుకొని (తండ్రి) రాజ్యమును ప్రవేశించి శస్త్రముతోగాని, విషముతోగాని రాజు నెదుర్కొని, "నేను ఆ కుమారుడను; ఈ రాజ్యము కలిసి అనుభవించవలసినట్టిది; ఒక్కడే అనుభ వించదగినవాడు కాడు. నన్ను సేవించదలచినవారికి రెండింతల ఆహారమును, వేతనము నిచ్చెదను" అని ప్రకటించవలెను.

ఇది అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని ప్రవర్తన

13. ప్రధానాధికారుల పుత్రులు గూఢచారుల వేషములను ధరించి అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని అతని సమ్మతిని పొంది రాజువద్దకు తీసుకొని రావలెను. 14. (మరి లాభము లేదని) త్యజింపబడినవానిని గూఢ పురుషులు శస్త్రమునుగాని, విషమునుగాని ప్రయోగించి చంపివేయవలెను. 15. త్యజింపబడనివానిని సమశీలలగు స్త్రీలోలుడుగనో, త్రాగుడుకు, వేటకు అలవాటు పడిన వానిగనో చేసి రాత్రిపూట పట్టుకొని రాజువద్దకు తీసుకొనిరావలెను.

16. (శ్లో) వచ్చినవానితో "నా తర్వాత రాజ్యము నీది," అని చెప్పి శాంతింపచేయవలెను. (శాంతించనివానిని) ఏకపుత్రుడైనయెడల నిర్బంధములో నుంచవలెను. అనేక పుత్రులున్నయెడల చంపివేయవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని ప్రవర్తన, అభిమానమును కోల్పోయిన రాజపుత్రునిపట్ల ప్రవర్తన అనే పద్దెనిమిదో అధ్యాయము.

---

[1] పాషండు లనగా వైదికేతరములగు బౌద్ధాది మతములకు చెందిన సన్యాసులు. వీరు సంఘములుగ నేర్పడియుండిరి. సంఘములకు సమిష్టిగ ద్రవ్యవసతులుండెను. దేవాలయము లకు దానముల మూలమున ద్రవ్యవసతులు లభించినట్లుకూడ దీనినుండి స్పష్టమగుచున్నది. విధవలలో కొందరు ధనికురాండ్రై స్వతంత్రముగ జీవించుచుండిరని ఈ సూత్రము సూచించుచున్నది.

## అధ్యాయము 19

### ప్రకరణము 16 : రాజు అనుసరించవలసిన విధులు

1. రాజు కార్యోత్సాహుడైనయెడల, భృత్యులు కార్యోత్సాహులగుదురు. 2. అతడు నిరుత్సాహుడైనయెడల వారుకూడా నిరుత్సాహులగుదురు. 3. అతని పనులను పాడుచేసెదరు. 4. అంతేకాక, శత్రువులతనిని వంచించెదరు. 5. కావున, తాను ఉత్సాహవంతుడుగ నుండవలెను.

6. నాళిక సాధనమునగాని, నీడను బట్టిగాని పగటిని, రాత్రిని ఎనిమిదేసి భాగములుగ విభజించవలెను.

7. నీడపరిమాణము మూడుపౌరుషములు[1] మొదటిభాగము, ఒకపౌరుషము రెండోభాగము, నాలుగంగుళములు మూడోభాగములు, నీడలేకపోవుట నాలుగోభాగము – ఇవి క్రమముగ పూర్వాహ్ణములోని నాలుగుభాగములు. 8. అపరాహ్ణ భాగములను దీనినిబట్టి గ్రహించవలెను. 9. వీనిలో మొదటి ఎనిమిదవ భాగమందు దేశరక్షణ విధానమును, ఆయవ్యయములను నాలకించవలెను. 10. రెండవ భాగమందు పౌరులయు, జానపదులయు వ్యవహారములను పరిశీలించవలెను. 11. మూడవ భాగమందు స్నానభోజనములను, విద్యావ్యాసంగమును చేయవలెను. 12. నాలుగవ భాగమందు ధనరూపమగు రాబడిని గ్రహించి, అధ్యక్షుల పనులను నిర్ణయించవలెను. 13. అయిదవ భాగమందు లేఖలద్వారా మంత్రి పరిషత్తుతో సమాలోచనలు గావించి, చారులు తెచ్చిన సమాచారములను తెలుసుకొనవలెను. 14. ఆరవభాగమును స్వైరవిహారమునకుగాని, మంత్రాలోచనకుగాని వినియోగించవలెను. 15. ఏడవ భాగమందు గజతురగ రథములను, ఆయుధధారులను పర్యవేక్షించవలెమ. 16. ఎనిమిదవ భాగమందు సేనాపతితో కూడి యుద్ధవ్యూహములగురించి ఆలోచించవలెను. 17. దినాంతమున సంధ్యాదేవత నుపాసించవలెను. 18. రాత్రి ప్రథమ భాగమందు గూఢపురుషులతో సంప్రతించవలెను.

[1] 9 ఇంచీలు (inches) ఒక పౌరుషము.

19. రెండవ భాగమున స్నానభోజనములను, విద్యావ్యాసంగమును చేయవలెను. 20. మూడవ భాగమందు మంగళ వాద్యములను వినుచు శయనించి నాల్గవ అయిదవ భాగములందు నిద్రపోవలెను. 21. ఆరవ భాగమందు మంగళవాద్య పూర్వకముగ మేల్కొని (దండనీతి) శాస్త్రోపదేశముల గురించియు, రాబోవు దినచర్యను గురించియు నాలోచించవలెను. 22. గూఢపురుషులను (వారివారి ప్రదేశ ములకు) పంపవలెను. 23. ఎనిమిదవ భాగమందు ఋత్విక్కులయు, ఆచార్యులయు. పురోహితులయు ఆశీర్వాదముల గ్రహించి, వైద్యుని, వంటవానిని, జ్యోతిష్కుని చూడవలెను. 24. తర్వాత దూడతోకూడిన ఆవునకు, ఎద్దునకు ప్రదక్షిణముచేసి, సభామంటపమునకు వెళ్ళవలెను.

25. లేదా, తనశక్తి ననుసరించి రాత్రింబగళ్ళను విభాగము చేసి, కార్యము లను నిర్వహించవలెను.

26. సభాసీనుడై కార్యార్థము తన్ను చూచుటకు వచ్చినవారందరికి స్వేచ్ఛాప్రవేశము కల్పించవలెను. 27. ఏలయన, దర్శనము కష్టసాధ్యమగునప్పుడు సమక్షమందున్న ఉద్యోగులు రాజుచేత చేయరాని పనులను చేయించెదరు. చేయతగిన పనులను చేయనియ్యరు. 28. అందుచేత, ప్రజలు తిరుగుబాటు చేయుటయో, శత్రువులు రాజ్యమును వశపరచుకొనుటయో సంభవించవచ్చును. 29. కనుక, అతడు (దేవాలయములో ప్రతిష్ఠింపబడిన) దేవతలయు, ఆశ్రమము లయు, పాషండులయు, శ్రోత్రియులయు, పశువులయు, పుణ్యక్షేత్రములయు, బాలురయు, వృద్ధులయు, వ్యాధితులయు, కష్టజీవులయు, అనాథలయు, స్త్రీలయు, వ్యవహారములను ఈ క్రమమునగాని, కార్యగౌరవమును, అవసరమునుబట్టిగాని విచారించవలెను.

30. (శ్లో) అత్యవసరములగు కార్యము లన్నిటిని వెంటనే వినవలెను, ఆలస్యము చేయరాదు. ఆలస్యము చేసినప్పుడవి కష్టసాధ్యములో, అసాధ్యములో కాగలవు.

31. (శ్లో) వేదవిదులయు, తాపసులయు కార్యములను లేచి వారికి నమస్కరించి పురోహితునితోను, ఆచార్యునితోను కలిసి అగ్నిహోత్ర గృహమునకు వెళ్ళి వచ్చినపిమ్మట పరిశీలించవలెను.

32. (శ్లో) తాపసులయు, (మంత్రతంత్రములు తెలిసిన) మాయాయోగ విదులయు కార్యములను మూడు వేదములు తెలిసినవారితో సలహా చేసి చేయవలెనే గాని (ఒంటరిగ) స్వయముగ చేయరాదు. కారణము వారు కోపిష్టులు గనుక.[2]

[2] ఈ అధ్యాయములోని వివరములనుబట్టి రాజుతే స్వయముగ పరిపాలన కార్యభారమును వహించుచుండినవారనియు, న్యాయాధీశులుగ వ్యవహారములను, వివాదములను పరిష్కరించు చుండిరనియు తెలియుచున్నది. దీనినిబట్టి అర్థశాస్త్రమందుద్దేశింపబడిన రాజులు పరిమిత ప్రమాణముగల సామాన్య రాజ్యముల నేలుచుండినవారనియు, మౌర్యసామ్రాజ్య స్థాపనకు పూర్వము భారతదేశమందుండిన పరిస్థితుల కనుగుణముగ అర్థశాస్త్రము వ్రాయబడినదనియు వ్యాఖ్యాతలు ఊహించుచున్నారు.

33. (శ్లో) రాజునకు కార్యోత్సాహమే వ్రతము ; కార్యపరిపాలనమే యజ్ఞము ; పక్షపాతరహితమగు ప్రవర్తనయే యజ్ఞదక్షిణ ; పట్టాభిషేకమే యజ్ఞదీక్ష.

34. (శ్లో) ప్రజల సుఖమే రాజునకు సుఖము ; ప్రజల హితమే రాజునకు హితము. తన ప్రియమే రాజునకు హితము కాజాలదు. ప్రజలకేది హితమో అదియే రాజునకు హితము.

35. (శ్లో) కావున, రాజు సర్వదా కార్యోత్సాహుడై అర్థమునకు సంబంధించిన వ్యవహారములను నడుపవలెను. అర్థమునకు కార్యోత్సాహమే మూలము. దాని లోపమే అనర్థమునకు మూలము.

36. (శ్లో) కార్యోత్సాహము లేనివాడు లభించిన ఫలమును, లభింపనున్న ఫలమును వినాశముగాంచుట తప్పదు. కార్యోత్సాహము మూలమున ఫల ప్రాప్తియు, అర్థసంపదయు లభించును.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున రాజు అనుసరించవలసిన విధులు అనే పందొమ్మిదో అధ్యాయము.

## మొదటి అధికరణము

### అధ్యాయము 20

### ప్రకరణము 17 : రాజాంతఃపురనియమావళి[1]

1. వాస్తుశాస్త్రప్రవీణులచే ప్రశంసింపబడిన ప్రదేశమందు ప్రాకారము, అగడ్త, ద్వారములు, అనేక కక్ష్యలు మున్నగువాటితో కూడినట్లుగ అంతఃపురమును కట్టించవలెను.

2. మధ్యభాగములో, నివాసగృహమును కోశగృహము మోస్తరుగనే కట్టించవలెను. లేదా, గోడలలోని రహస్యమార్గములతో కూడిన మోహన గృహపు మధ్యభాగమున నివాసగృహ ముండవచ్చును. లేదా, భూమిలోపల నొకగృహమును కట్టి, సమీపదేవాలయములోని కర్రవిగ్రహము నొకదానితో, దానిద్వారమును మూసి[2] లోపల అనేక సురంగమార్గములను[3] నిర్మించవలెను; దానిపైన ప్రాసాదము నొకదానిని కట్టి, దానిని చేరుటకు పైకి కనుపడకుండునట్లు గోడలో నొకసోపానమును గాని, గుల్లస్తంభములో నొక ప్రవేశద్వారమును, ఒక నిష్క్రమణద్వారమునుగాని ఏర్పాటుచేసి దానిని నివాసగృహముగ నుపయోగించ వచ్చును. ఆపద నెదుర్కొనుటకుగాని, అది సంభవించునని తోచినప్పుడుగాని కూలద్రోయుటకు

[1] అంతఃపుర మనగా రాణివాసపుస్త్రీలుమాత్రమే నివసించు ప్రదేశము కాదు. రాజప్రాసాదము అను అర్థములో వాడబడినది.

[2] పరిచయములేనివాడు ప్రవేశించినను నిష్క్రమించుటకు సాధ్యము కానట్టిది మోహన గృహము.

[3] సురంగము అనునది గ్రీకుభాషలోని పదమనియు, ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దములో ప్రచారములోనికి వచ్చినదనియు, అందుచేత కౌటిల్యుడు చంద్రగుప్తచక్రవర్తి కాలములోని వాడు కాడనియు కొందరివాదము. సురంగము బహుప్రాచీనులగు బాబిలోనియనులనుండి గ్రహించినమాట అని కొందరి అభిప్రాయము; మరికొందరిది భారతదేశములోని ఆదిమ వాసులగు సంతాలులు మున్నగువారు వాడుచుండిన మాట అని చెప్పుచున్నారు. అందుచేత పైవాదము బలములేనట్టిదని చెప్పనగును.

వీలగునట్లు దానినేలమీద నొక యంత్రము నమర్చవలెను.[4] 3. లేదా, సహాధ్యాయుల మూలమున భయపడవలసిన కారణ మున్నప్పుడు[5] మరియొక విధమున (నివాసగృహ) నిర్మాణమును గావింపవచ్చును.

4. మనుష్యుల ఎముకలను మథించుటవలన పుట్టిన అగ్నిని మూడు పర్యాయములు అంతఃపురముచుట్టు నపసవ్యముగ త్రిప్పినయెడల దానికి మరి యెట్టి అగ్నిభయము ఉండదు; ఇంకొకఅగ్ని అందు జ్వలించదు. పిడుగు పడుట వలన నేర్పడిన బూడిదెను పూసి, మట్టితో కలిసిన వడగండ్లతో తడుపబడి నప్పుడుకూడ నిట్టిఫలితమే లభించును.

5. జీవంతీ, శ్వేతా, ముష్కక, పుష్పవందాక లను మొక్కలరెమ్మలతోను పల్లపునేలలో పెరిగిన అశ్వత్థపు రెమ్మలతోను రక్షింపబడిన అంతఃపురమునకు పాములవలనగాని, విషములవలనగాని భయముండదు.

6. నెమిళ్ళను, ముంగిసలను, పొడలజింకలను సంచరింపజేసిన యెడల సర్పములకు నాశము కలుగును. 7. సర్పములయు, విషములయు భయమును శంకించినప్పుడు చిలుక, గోరువంక, భృంగరాజము కేకవేయును. 8. విషము సమీపమందున్నప్పుడు క్రౌంచపక్షికి మత్తెక్కును; జీవంజీవిక మూర్ఛిల్లును; మత్తకోకిలము చనిపోవును; చకోరముల కండ్లు ఎఱ్ఱబడును.[6]

9. ఇట్లతడు అగ్నివిషసర్పభయములకు ప్రతీకారము చేసుకొనవలెను.

10. వెనుకభాగములోని కక్ష్యయందు స్త్రీలగృహములు, పురిటిగదులు, రోగులగదులు, వృక్షస్థానములు, ఉదకస్థానములు ఉండవలెను. 11. దానికి వెలుపల రాజపుత్రికలయు, పుత్రులయు గృహము లుండవలెను. 12. ఎదుట అలంకారగృహము, మంత్రగృహము, సభాస్థలి, కుమారాధ్యక్షుని[7] గృహము లుండవలెను. 13. ఈ కక్ష్యలకు మధ్యనుండు (బయలు) ప్రదేశములో ప్రాసాదరక్షకు లుండవలెను.

14. వృద్ధస్త్రీలు శుద్ధురాలని చెప్పినతర్వాతనే లోపలికక్ష్యలోని రాణిని చూచుటకు రాజు వెళ్ళవలెను. 15. ఏలయన, రాణిగదిలో దాగియున్న సోదరుడు భద్రసేనుని, తల్లిపడకలో దాగియున్నకుమారుడు కరూశుని చంపిరి. 16. తేనెయని విషమును పేలాలతో కలిపి కాశీరాజును, విషముపూసిన కడియముతో వైరంత్యుని, విషముపూసిన మేఖలామణితో సౌవీరరాజును, అద్దముతో జాలూథుని వారివారి

---

[4] ఈ వివరణమునుబట్టి మూడురకములగు నివాసగృహములను నిర్మింపవచ్చునని తెలియు చున్నది.

[5] సహాధ్యాయులకు రాజగృహరహస్యములు తెలిసియుండును.

[6] అంతఃపురములో రకరకములగు పక్షులను పెంచుటకు కారణములు దీని వలన తెలియు చున్నది.

[7] కుమారాధ్యక్షు డనగా రాజపుత్రుల కార్యకలాపములను పర్యవేక్షించు అధికారి.

రాణులు చంపిరి. జడలో శస్త్రమును దాచియుంచుకొని విదూరథుని అతనిరాణి చంపెను. 17. కనుక ఇట్టియవకాశములు రాకుండ నతడు జాగ్రత్తపడవలెను.

18. రాజు (రాణిని) ముండులతోను, జటిలులతోను, మాంత్రికులతోను, వెలుపలినుండివచ్చు దాసీజనముతోను కలియనీయరాదు. 19. రోగప్రసూతి శాలలందుతప్ప తక్కిన ప్రదేశములందు వీరిబంధువులకు (రాణివాస) ప్రవేశ ముండరాదు. 20. స్నానముచేతను, రుద్దుకొనుటచేతను, పరిశుభ్రత గాంచిన శరీరములతోను, మార్చుకొనిన వస్త్రాలంకారములతోను వేశ్యలు రాణులను దర్శించ వలెను. 21. తండ్రివలె కనుపించు ఎనభై సంవత్సరముల వయస్సు వచ్చిన పురుషులు, తల్లివలె కనుపించు యాభై సంవత్సరముల వయస్సువచ్చిన స్త్రీలు, వృద్ధులు, నపుంసకులు మున్నగుభృత్యులు అంతఃపుర స్త్రీల శౌచాశౌచములను కనిపెట్టుచు రాజహితమునందు వారికి శ్రద్ధకలుగునట్లు చేయవలెను.

22. (శ్లో) అంతఃపురములోని వారందరు వారివారిగృహములలోనే ఉండ వలెనుగాని ఇతరుల నివాసమునకు వెళ్ళరాదు. (అంతఃపురము) లోపల నుండు వారెవ్వరును వెలుపలివారితో సంబంధము పెట్టుకొనరాదు.

23. (శ్లో) పరీక్షింపబడిన తర్వాతనే ప్రతివస్తువు బయటికి వెళ్ళుటగాని, లోపలికి వచ్చుటగాని జరుగవలెను. దానిరాకయు, నిర్గమనమును లిఖితపూర్వము కావలెను. రాజముద్రతోడనే గమ్యస్థానము చేరవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున రాజాంతఃపురనియమా వళి అనే ఇరువదవ అధ్యాయము.

## అధ్యాయము 21

### ప్రకరణము 18 : (రాజు) ఆత్మరక్షణము

1. శయ్య నుండి లేవగనే (మొదటికక్ష్యలో) ధనుర్ధారిణులగు స్త్రీలు, రెండవకక్ష్యలో కంచుకములను పాగాలను ధరించిన నపుంసకులగు భృత్యులు, మూడవకక్ష్యలో గూనివాండ్రు, పొట్టివాండ్రు, కిరాతులు, నాల్గవదానిలో మంత్రులు, బంధువులు, శస్త్రధారులగు దౌవారికులు రాజునకు స్వాగతము చెప్పవలెను.

2. తండ్రితాతలనుండి సేవలో నున్నవారిని, దగ్గర బంధుత్వముగలవారిని, సుశిక్షితులను, అనురక్తులను, కార్యసమర్థులను ఆసన్నభృత్యులుగ నియమించవలెను. తన చేతిమీదుగ నర్థమానములు పొందియుండనట్టి అన్య దేశీయులను, స్వదేశీయుడైనను తనచేశిక్షింపబడి తిరిగి నౌకరిలో చేర్చుకొన్నవానిని (ఆసన్న భృత్యులుగ) నియమించరాదు. 3. ప్రాసాదసైనికులు ప్రభువును, అంతఃపురమును రక్షించవలెను.

4. వంటవాండ్రపెద్ద బహుళరుచికరములగు వంటకములను రహస్య ప్రదేశమందు వండించవలెను.

5. రాజు వాటిని మొదట అగ్నికి, పక్షులకు బలిదానము చేసి, తర్వాత భుజించవలెను.

6. అగ్నిజ్వాలలోను, పొగలోను నీలిరంగు, అగ్నిలో చిటపటశబ్దము, పక్షులు చనిపోవుట విషయుక్తమగు వంటకమునకు లక్షణములు. 7. అన్నపు ఆవిరికి నెమలికంఠపురంగు, వేగముగ చల్లారిపోవుట, రుచిహీనమై వెలవెటపోవుట, నీళ్ళతో కలిసియుండుట, మెత్తబడకుండుట; కాయగూరలతో చేయబడిన వంటకము లున్నట్లుండి ఎండిపోయినట్లు కనబడుట (పొయ్యినుండి దించినతర్వాతకూడ) కుతకుతలాడు చుండుట, నల్లబడుట, నురుగుకట్టుట, విరిగి పోవుట, వాసనను, స్పర్శను, రుచిని కోల్పోవుట; (ద్రవపదార్థములలో మామూలుకంటె) రంగు ఎక్కువగనో, తక్కువగనో ఉండుట, నురుగుయొక్క

అంచులలో ఊర్ధ్వరేఖలు కనుపించుట; రసములకుమధ్య నీలరేఖ, పాలకుమధ్య ఎరుపు, మద్యము జలములమధ్య నలుపు, పెరుగుమధ్య మరింత నలుపు, నీటితో కూడిన వంటకములు వేగముగా కాంతిని కోల్పోవుట, ఎక్కువగ ఉడికినట్లు కనబడుట, ఉడుకుచున్నప్పుడు గట్టి నీలిరంగు కలిగియుండుట, ఒరుగు వంటకములు ముక్కలైపోవుట, రంగును పోగొట్టుకొనుట, కఠినపదార్థములకు మృదుత్వము, మృదుపదార్థములకు కాఠిన్యము, వాటి సమీపముననుండు క్షుద్రప్రాణుల మరణము, తివాసీలపైనను, తెరలపైనను గుండ్రపు మచ్చలు, వీటిలోని నూలు, ఉన్ని, రోమములు విడిపోవుట; లోహమణిమయములగు పాత్రములు మట్టితో పూసినట్లగు పడుట, నునుపును, రంగును, బరువును, కాంతిని, స్పర్శమును కోల్పోవుట—ఇవి విషయుక్తములగు వివిధ పదార్థముల లక్షణములు.

8. శుష్కించి నల్లబడిన ముఖము, సంశయించుచు మాట్లాడుట, అతిమాత్రమగు చెమట, అవులింతలు, భయపడియుండుట, తప్పటడుగులు, అటుఇటు చూచుచు మాట్లాడుట, పనులయందు దిగులు చూపుట, నెమ్మదిగ కూర్చుండలేకపోవుట—ఇవి విషప్రయోగము చేసినవాని లక్షణములు.

9. కావున, విషవైద్య ప్రవీణులు, వైద్యులు ప్రభువు సమక్షమందుండవలెను. 10. వైద్యుడు ఔషధశాలనుండి రుచిచూచి శుద్ధమైనట్లు తేలిన ఔషధమును తీసుకొని, ముందుగ దానిని వంటవానిచేతను, మందులు నూరువానిచేతను తినిపించి, తానుకూడ మరియొక పర్యాయము రుచిచూచి రాజున కియ్యవలెను. 11. పానపానీయముల విషయమున తీసుకొనవలసిన ముందు జాగ్రత్తలు వీనినుండి గ్రహించవలెను.

12. మంగళ్ళు, నౌకర్లు ముందుగ స్నానము చేసి, తమ వస్త్రములను చేతులను శుభ్రపరచుకొని అంతఃపుర రక్షకునినుండి ముద్రవేసిన వస్తువులను తీసుకొని రాజునకు పరిచర్య చేయవలెను. 13. శుచులని నిశ్చయించబడిన దాసీజనము[1] స్నానము చేయించువారుగను, ఒడలుపట్టువారుగను, పడకలు వేయువారుగను, చాకళ్ళుగను, పుష్పమాలాకారులుగను పనిచేయవలెను. లేదా, వారి పర్యవేక్షణలో కళాకారు లితరులు వీటిని చేయవచ్చును. 14. వారు వస్త్రములను, పుష్పములను మొదట తమ కండ్ల కద్దుకొని తర్వాత రాజున కియ్యవలెను. స్నానతైలములను, చూర్ణములను, వస్త్రములను, సుగంధద్రవ్యములను తమ రొమ్ములకు, చేతులకు అద్దుకొని రాజున కియ్యవలెను. 15. ఇతరులనుండి గ్రహింపబడిన వస్తువు లన్నిటి విషయమున ఈ నియమములను పాటించవలెనని గ్రహించవలెను.[2]

---

1 శత్రువులచే పంపబడిన గూఢచారులు, దాసీజనము వేషము వేసికొని అంతఃపురపరిచారికలుగ పనిచేయు ప్రమాదముండుటచే అట్టి పరిచారికల శుచిత్వాశుచిత్వముల పరిశోధించుట అవసరము.

2 రాజున కియ్యదగిన వస్త్రాదులను కండ్లకు, రొమ్ములకు, చేతులకు పరిచారికులు అద్దుకొనుటకు కారణము అవి విషయుక్తములో, కావో తెలిసికొనుటకే.

16. ఆయుధములు, అగ్ని, విషము—వీటి ప్రయోగమునతో సంబంధములేని నాటకములను, వినోదములను నటకులు సమకూర్చవలెను.[3] 17. వారి వాద్యములు, అశ్వరథగజముల అలంకారములు ప్రాసాదము లోపలనే ఉండవలెను.

18. విశ్వాసపాత్రులగు భృత్యపరివారముతో కూడి రాజు యానవాహనముల నెక్కవలెను. ఆప్తుడగు నావికు డధిష్ఠించిన నావయందే ప్రయాణము చేయవలెను. 19. మరియొక నావతో కట్టబడిన నావలోగాని, వాయువేగమునకు గురియగు నావలోగాని ప్రవేశించరాదు. 20. నీటియొద్దున రక్షకసైన్యము సిద్ధముగ నుండ వలెను.

21. చేపలు పట్టువారిచేత పరీక్షింపబడిన జలములలోనే ప్రవేశించవలెను. 22. పాములవాండ్రు పరీక్షించిన తరువాతనే ఉద్యానవనమునకు వెళ్ళవలెను.

23. వేటగాండ్రు, వేటకుక్కల కాపరులు అరణ్యమునుండి దొంగలయు, అడవిమృగములయు, శత్రువులయు ప్రమాదమును తొలగించిన తర్వాతనే అతడు కదలుచుండు మృగములను వేటాడుటలో నైపుణ్యమును సంపాదించుకొనుటకై వెళ్ళవలెను.

24. ఆప్తశస్త్రధరులను ముందుపెట్టుకొని సిద్ధతాపసునికి, మంత్రి పరిషత్తుతో కూడినవాడై సామంతదూతకు దర్శన మియ్యవలెను. 25. పూర్తి సైనిక వేషమును ధరించి, గుఱ్ఱమునో, రథమునో, ఏనుగునో యెక్కి యుద్ధసన్నద్ధమగు సైన్యమును పర్యవేక్షించవలెను.

26. అంతఃపురమునుండి నిష్క్రమించునపుడును, అందులో ప్రవేశించు నపుడును అతడు వెళ్ళు రాజమార్గమునకు రెండు వైపుల రక్షకభటులు, సాయుధు లగు సైనికులు నిలబడవలెను. ఆయుధములను ధరించిన యితరు లెవ్వరుగాని, పరివ్రాజకులుగాని, అంగవిహీనులుగాని ఉండరాదు. 27. గుంపుగూడినవారి నడుమ రాజు ప్రవేశించరాదు. 28. పదిమంది సైనికుల కొకడుచొప్పున నాయకత్వము వహించిన అధికారుల పర్యవేక్షణలో నున్నట్టి యాత్రలకు, సమాజములకు, ఉత్సవములకు, విందులకు వెళ్ళవలెను.

29. (శ్లో) ఎట్లు గూఢపురుషులద్వారా ఇతరులను పరిశోధించుచున్నాడో, అట్లే రాజు ఆత్మవంతుడై ఇతరుల మూలమున కలుగు ప్రమాదములనుండి తన్ను రక్షించుకొనవలెను.

ఇది వినయాధికారికమను మొదటి అధికరణమున (రాజు) ఆత్మరక్షణము అనే ఇరవైఒకటవ అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు వినయాధికారికము అను మొదటి అధికరణము సమాప్తము.

---

[3] అంతఃపురములో నాటకాది ప్రదర్శనములు జరుగుట మామూలు.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## రెండో అధికరణము

## అధ్యక్ష ప్రచారము

### అధ్యాయము 1

### ప్రకరణము 19 : జనపద నివేశము

1. పూర్వము జననివాసమై తర్వాత పాడుపడిన ప్రదేశమందుగాని, నూతన ప్రదేశమందుగాని, పరదేశములలోని ప్రజలను ఆహ్వానించియో, స్వదేశములోని జనసమ్మర్ధముగల ప్రాంతముల ప్రజలను తరలించియో జనపదమును[1] (గ్రామ సీమలను) ఏర్పాటుచేయవలెను.[2]

2. ఏర్పాటుచేయబడిన గ్రామములొక్కొక్కటియు అత్యధికులైన శూద్ర కర్షకులను, నూటికితక్కువగాక అయిదువందలకుమించని కుటుంబముల సంఖ్యను

---

[1] రాజ్యమునకుండవలసిన సప్తాంగములలో జనపదము మూడవది. ఇది రాష్ట్రమునకు పర్యాయ పదము. ధర్మశాస్త్ర గ్రంథములలో రాష్ట్రము అనుమాట వాడబడినది. కౌటిల్యుడామాటను వాడలేదు. ఆర్యులు పంజాబును ప్రవేశించిన తొలికాలములో కొన్ని "జనము"లుగ విభాగమై యుండిరి. ఒక్కొక్క "జనము" (తెగ = tribe) ఒక రాజ్యమును స్థాపించుకొనెను. అట్టిరాజ్యమే జనపదము. క్రాంతకాలమైన తర్వాత వారు గంగామైదానములోని ప్రాచ్యదేశమునకు వచ్చి మహాజనపదములను పేరుతో అనేక రాజ్యములను స్థాపించిరి. గౌతమబుద్ధునికాలమున కోసల మహాజనపదము, విదేహ మహాజనపదము మున్నగునవి పదహారు ఉన్నట్లు బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి.

[2] ప్రాచీనకాలమున జనసంఖ్య తక్కువగను శూన్యప్రదేశములు ఎక్కువగను ఉండెను. ప్రస్తుత కాలపు పరిస్థితులు దీనికి భిన్నము. అన్ని హంగులతో కూడినట్లుగ కొత్త గ్రామములను నిర్మాణము చేయుట ప్రాచీనరాజుల ధర్మముగ పరిగణింపపడెను. ప్రకృతిసంపదలను పూర్తిగ వినియోగించి ఆహారాదిపదార్థముల నధికముగ నుత్పత్తిచేయుటయు తద్వారా తమ కోశమును వృద్ధిచేసికొనుటయు వారి ఆశయము. దీని కనుగుణముగ గ్రామ నిర్మాణము జరిగెను.

గల్గి అన్యోన్యాశ్రయమై ఒకటిరెండు క్రోసుల దూరము వ్యాపించి ఉండవలెను. **3.** గ్రామమునకు హద్దులుగ నది, కొండ, వనము, రాళ్ళగుట్ట, ఇసకదిబ్బ, గుహ, కట్ట, బూరుగు జమ్మి క్షీరవృక్షములు – వీటిలో దేనినైనను ఏర్పరచవలెను.[3]

**4.** ఎనిమిదివందల గ్రామములమధ్య ఒకస్థానీయమును, నాలుగువందల గ్రామములమధ్య ఒక ద్రోణముఖమును, రెండువందలగ్రామములమధ్య ఒక కార్వటికమును, పదిగ్రామములమధ్య ఒక సంగ్రహణమును స్థాపించవలెను.[4]

**5.** సరిహద్దులలో జనపదద్వారములుగ అంతపాలుర ఆధిపత్యమున అంతపాలదుర్గములను నిర్మించవలెను. **6.** వానిమధ్యనుండు ప్రదేశములను వాగురికులు, శబరులు, పుళిందులు, చండాలురు, అరణ్యవాసులు రక్షించవలెను.

**7.** ఋత్విజులకు, ఆచార్యులకు, పురోహితులకు, శ్రోత్రియబ్రాహ్మణులకు జరిమానాలు పన్నులు ఇయ్యవలసిన అవసరము లేకుండగను, దాయవిభాగపు హక్కుల ననుభవించులాగునను బ్రహ్మదేయభూములను[5] దానముచేయవలెను. అధ్యక్షులకు, లెక్కలువ్రాయువారికి, తదితరులకు, గోపులకు, స్థానికులకు, అనీకస్థులకు, వైద్యులకు, అశ్వశిక్షకులకు, సందేశహరులకు విక్రయముచేయుటకు గాని తాకట్టు పెట్టుటకుగాని హక్కులేనట్లుగ భూముల నియ్యవలెను.[6]

**8.** వ్యవసాయయోగ్యములగు భూములను పన్నులు చెల్లించువారికి ఒక తరము వరకు మాత్రమే అనుభవించునట్లు ఇయ్యవలెను. **9.** వ్యవసాయయోగ్యముగ చేయుచుండువారినుండి బీడుపొలములను తీసుకొనరాదు.[7]

**10.** వ్యవసాయముచేయనివారిభూములను తీసుకొని ఇతరులకియ్యవలెను. **11.** లేదా, గ్రామనౌకర్లు వర్తకులు వానిని సాగుచేయవలెను. **12.** సాగుచేయనివారు (రాజునకు) నష్టపరిహార మియ్యవలెను.[8]

**13.** (రాజు కర్షకులకు) ధాన్యమును పశువులను హిరణ్యము నిచ్చి అనుగ్రహించవలెను.[9] **14.** వారు వీనిని తమ అనుకూలమునుబట్టి తిరిగి ఇచ్చివేయ

---

[3] ఇరుగు పొరుగు గ్రామముల మధ్య హద్దులుగురించిన వివాదములను పరిష్కరించుటకు ఇది అవసరము. 3–9–10–14 లో దీని ప్రశంసకలదు.

[4] ఇవి పన్నులు వసూలుచేయు అధికారులుండిన పట్టణములు. ప్రస్తుతకాలపు జిల్లాకేంద్రము, తాలూకా కేంద్రము, ఫిర్కాకేంద్రములతో పోల్చతగినవి.

[5] ఇవి తర్వాతికాలపు అగ్రహార భూములవంటివి.

[6] ఇవి గ్రామనౌకర్ల ఇనాములవంటివి. అనీకస్థులనగా గజశిక్షకులని కొందరు, పశువైద్యులని కొందరు వ్యాఖ్యానించియున్నారు.

[7] శూన్యప్రదేశములపై ఆస్తిహక్కు రాజులది అని ఇది స్పష్టపరచుచున్నది.

[8] తమకిచ్చినభూములను బీడు పెట్టువారు తామునష్టపడుటయేగాక రాజకోశమునకు నష్టము కలిగించెదరు. అందుచేత ఈ నియమము అవసరము.

[9] ఇవి ప్రస్తుతకాలపు తక్కావి మొదలగు ఋణములవంటివి. కర్షకులకు ప్రభుత్వము సర్వవిధముల సహాయము చేయుట బహుప్రాచీనాచారము.

వలెను. 15. అతని అనుగ్రహ పరిహారములు కోశమును వృద్ధిచేయునట్టివిగ నుండవలెనేగాని నష్టముకలిగించునట్టివిగ నుండరాదు. 16. ఏలయన, అల్పకోశుడగు రాజు పౌరజానపదులను (తానే) కబళించును.[10] 17. గ్రామముల నేర్పాటుచేసినప్పుడుగాని, ప్రజలు అందు చేరునప్పుడుగాని రాజు పరిహారములనియ్యవలెను. 18. కాలానుసారముగ పరిహారములు[11] కోల్పోయిన వారికి తండ్రివలె అనుకూలములను కల్పించవలెను.

19. గనులలోను, కర్మాగారములలోను, ద్రవ్య హస్తి వనములలోను, పశువుల మందలలోను, వ్యాపారమార్గములలోను అనుగుణమైన కార్యకలాపములను ప్రారంభించవలెను. నీటిరహదారులను మెట్టరహదారులను వాణిజ్యపట్టణములను ఏర్పరచవలెను.[12]

20. (నదులవంటి) సహోదకముల సహాయమునగాని, ప్రదేశాంతరముల నుండి జలములను తెప్పించిగాని నీటివసతులను కల్పించవలెను. 21. లేదా, వీనిని నిర్మించువారికి భూమిని, చెట్లను, పనిముట్లనిచ్చియు రహదారుల నిర్మించియు సహాయము చేయువలయును. పుణ్యస్థానములు, ఆరామములు నిర్మించువారికి కూడ ఇట్టి సహాయమునే చేయవలెను. 22. సాముదాయికములగు నీటివసతుల నిర్మాణ కార్యములో (సహాయపడక) వెళ్ళిపోయినవాని పనిని, అతని కూలివాండ్రచేతను ఎద్దులచేతను చేయించవలెను. 23. అట్టివానికి ఖర్చులో భాగము ఉండవలెనేగాని లాభములో భాగము ఉండరాదు. 24. నీటివసతులలోని చేపలపైని, బాతులపైని, ఆకుకూరలపైని స్వామ్యము రాజుదే.

25. రాజు దాసజనమును, అహితకులను,[13] యజమానులకు లోబడని బంధువులను అదుపులో నుంచవలెను.

26. అనాథలగు బాలురను, వృద్ధులను, ఆపదల పాలగువారిని, సంతానము లేని స్త్రీలను, (నిరాధారులగు) స్త్రీల పుత్రసంతానమును రాజు పోషించవలెను.[14]

---

[10] తనకోశమును భర్తీచేసికొనుటకు ప్రజలపై ఎక్కువపన్నులను విధించవలసిన వాడగుటచే వారిని కబళించుట తప్పదు.

[11] పరిహారమనగా పన్నులను రద్దుచేయుట.

[12] ప్రాచీనకాలమున ప్రభుత్వపుయాజమాన్యమున అర్థోత్పత్తికి సాధనములగు కార్యకలాపము లన్నియు జరుగుచుండెను. పరిశ్రమలు, వర్తకవ్యాపారము, రోడ్డు రవాణా మున్నగునవి ప్రభుత్వ యాజమాన్యమున ఉండదగునా అనువిషయమై అర్థశాస్త్రవేత్తలు వివిధ రాజకీయ పక్షములవారు నేడు వాదోపవాదములకు దిగియున్నారు. కౌటిల్యుని కాలమున అట్టివి ఉన్నట్లు కనిపించదు.

[13] అహితకులనగా తాకట్టులోనుండువారు.

[14] ప్రస్తుతకాలపు ప్రభుత్వ మిట్టిబాధ్యతను వహించుటకు సాహసించుట లేదను విషయము గుర్తించదగినది.

**27.** గ్రామవృద్ధులు[15] బాలురధనమును వారికి వ్యవహారదశ వచ్చు వరకును, దేవాదాయమును వృద్ధిచేయవలెను.

**28.** (పోషణ) సమర్థుడగు వాడెవడుగాని తనసంతానమును, భార్యను, తల్లిదండ్రులను, మైనర్లగు సోదరులను, అవివాహితలు విధవలుఅగు అక్క చెల్లెండ్రను పోషించనియెడల పండ్రెండుపణముల దండమునకు పాత్రుడగును.[16] తల్లితప్ప వీరిలో నెవరైన పతితలగునపుడు[17] దండము నియ్యవలసినది లేదు.

**29.** పుత్రులకు భార్యకు జీవనముకల్పించక సన్యసించినవాడును, స్త్రీని సన్యసింపచేసినవాడును సాహసదండములోని తక్కువమొత్తమునకు పాత్రుడగును.[18] **30.** పనిచేయుటకు శక్తిని కోల్పోయినవాడు న్యాయాధీశుల అనుమతిని పొంది సన్యసించవచ్చును. **31.** అనుమతిపొందక సన్యసించినయెడల బంధింపబడవలెను.

**32.** వానప్రస్థుడుకాని సన్యాసి[19] ఇతర ప్రదేశములకు చెందిన వర్తక సంఘము[20] సాముదాయికవ్యవహారమునకు సంబంధించని ఒప్పందముల జేసి కొనిన సంఘము, జనపదములో నివాస మేర్పరచుకొనరాదు.

**33.** అందు ఆరామములుగాని విహారశాలలుగాని ఉండరాదు. **34.** నటులు, నర్తకులు, గాయకులు, వాద్యగాండ్రు, కథకులు, కుశీలవులు అచ్చటి కార్యకలాపములకు విఘ్నము కలిగించరాదు.[21] **35.** (వీరికి) ఆశ్రయము లేనికారణమునను, గ్రామస్థులందరు వారివారివ్యవసాయకార్యములలో నిమగ్నులుగ నుండు కారణమునను, కోశము, కూలిజనము, ద్రవ్యములు, ధాన్యములు, రసములు అభివృద్ధిగాంచును.

**36.** (శ్లో) శత్రుసైన్యములచేతను, ఆటవికులచేతను దోపిడీ చేయబడినట్టియు, వ్యాధిదుర్భిక్షములచేత పీడింపబడినట్టియు ప్రదేశమునకు పన్నులపరిహారమును దయచేయవలెను. ఖర్చుతోకూడిన క్రీడలను నివారించవలెను.

**37.** (శ్లో) జరిమానాల మూలమునను, కూలిజనము మూలమునను, పన్నుల

---

15 గ్రామవృద్ధులు తర్వాతికాలపు పంచాయతీదార్ల వంటివారు. కాని, అర్థశాస్త్రమందు పంచాయతి అనుమాట కనిపించదు.

16 కుటుంబములు సమిష్టిగనుండెననుట కిది నిదర్శనము.

17 కుల మర్యాదల నతిక్రమించుటచేత బహిష్కరింపబడినవారు పతితులు.

18 ఇట్టి పురుషులు సన్యసించినయెడల వారి భార్యాపుత్రులనాథలగుటయు వారిని పోషించు బాధ్యత ప్రభుత్వముపై పడుటయు తప్పదు. సన్యాసుల సంఖ్య అధికమగు నెడల అర్థోత్పత్తి కూడ దెబ్బతినును. స్త్రీలను సన్యసింపజేయుట వైదికేతరములగు బౌద్ధాదిమతములు ప్రవేశ పెట్టిన ఆచారము. వైదికధర్మానుసారియగు కౌటిల్యుడు దానిని గర్హించుట సహజము.

19 ఇట్టివారు బౌద్ధము, జైనము మొదలగు మతములకు చెందినవారు.

20 విదేశీయవర్తకసంఘములను ప్రోత్సహించరాదని దీనిభావము.

21 వినోదములు విలాసములు మున్నగు వానియందు గ్రామస్థులు వారి కాలమును ఆదాయమును వ్యర్థపుచ్చరాదని దీని భావము.

మూలముననను, బాధలకు లోనగు వ్యవసాయమును ; దొంగలు, అడవి మృగములు, విషజంతువులు, మొసళ్ళు, వ్యాధులు మున్నగువానిచే పీడింపబడు పశువులమందలను రక్షింపవలెను.

**38.** (శ్లో) రాజవల్లభులయు,[22] కార్యోద్యోగులయు, దొంగలయు, అంతపాలురయు మూలముననను ; పశువులమందల మూలముననను ప్రమాదములేకుండ రహదారులను రక్షించవలెను.

**39.** (శ్లో) ఈ విధముగ రాజు పురాతనములగు ద్రవ్యహస్తివనములను, జలాధారములను, గనులను రక్షించుచు క్రొత్తవానిని ఏర్పాటుచేయవలెను.

ఇది అధ్యక్షప్రచారము అను రెండోఅధికరణమున జనపదనివేశము అనే మొదటి అధ్యాయము.

[22] రాజవల్లభులనగా రాజుతో సన్నిహిత సంబంధము కలిగి అతని అభిమానమునకు పాత్రులగువారు.

# రెండో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 20 : వ్యవసాయమునకు పనికిరాని భూముల వినియోగము

1. వ్యవసాయమునకు పనికిరానిభూములలో పశువులకై పచ్చికబయళ్ళను ఏర్పాటుచేయవలెను. 2. అరణ్యప్రదేశములకును (అందులోని) స్థావరజంగమము లన్నిటికిని అభయమును ప్రసాదించి వేదాధ్యయన సోమయాగముల నిమిత్తమై గోరుత విస్తీర్ణమునకు[1] మించక తాపసులకు దానము చేయవలెను.

3. రాజు విహరించుటకై అదేవిస్తీర్ణమును ఏకద్వారమునుగల మృగయావనము ఏర్పాటుకావలెను. దానినిరక్షించుటకై ఒక అగడ్త, తియ్యాని పండ్లతో కూడినపొదలు, ముండ్లులేనిచెట్లు, లోతులేనితటాకములు, మచ్చికచేయబడినలేళ్ళు ఇతరజంతువులు, గోళ్ళూ కోరలుతీసివేయబడిన అడవిమృగములు, వేటకు ఉపయోగించు మగ, ఆడు, పిల్లఏనుగులు ఉండవలెను. 4. దాని పొలిమేరయందుగాని, అనువైన మరియొక సమీప ప్రదేశమందు గాని జంతువు లన్నియు ఆతిథ్య సౌకర్యములనుభవించుటకు వీలగునట్లు ఇంకొకమృగవనమును ఏర్పరచవలెను.[2]

5. వన్యపదార్థములని ఉదాహరింపబడినవాటిలో, ఒక్కొక్కదానిని లభింపజేయగల వనములను, వన్యపదార్థములనుండి ఇతరవస్తువులను తయారుచేయు కర్మాగారములను నెలకొల్పి, ద్రవ్యవనములలో జీవించు ఆటవికులను అచట చేర్చవలెను.[3]

---

1 'గోరుతము' విస్తీర్ణమును తెలుపుమాట. 2,000 ధనున్సులు ఒకగోరుతము. 2–20–25.

2 ఇతరవనములనుండివచ్చు మృగముల కచటనుండుటకు కావలసిన అవకాశములే ఆతిథ్య సౌకర్యములు.

3 ప్రస్తుతకాలమున అటవీశాఖకు చెందిన పరిపాలనాధికారులు ఇట్టిపనులను చేయుచున్నారు. ప్రాచీనకాలమున ఇప్పటికంటె బాహుళ్యముగ అటవీశాఖవారు కార్యకలాపములు సాగించుచుండిరి. ముడిపదార్థములను సేకరించుటయేకాక వాటినుండి అనుభవయోగ్యములగువానిని తయారుచేయుటకు కర్మాగారములుండెను. అందు ఆటవికులు పనిచేయుచుండువారు. వానిలో ఆయుధములు ప్రధానములు (2–17–17).

6. (రాజ్యము) పొలిమేరలో ఆటవికులచే రక్షింపబడు హస్తివనమును ఏర్పాటు చేయవలెను. అట్టివి పర్వత ప్రదేశములందుగాని, నదీతీరములందుగాని, సరోవర ప్రాంతములందుగాని, బురదనేలలలోగాని ఉండవచ్చును. 7. ఎక్కడఉన్నను నాగవనాధ్యక్షుడు దానిహద్దులను ప్రవేశనిష్క్రమణ మార్గములను స్పష్టపరచి, నాగ వనపాలుర సహాయమున దానిని రక్షించవలెను. 8. ఏనుగును వధించినవానిని వారు చంపివేయవలెను. 9. స్వయముగ మృతిజెందిన ఏనుగు దంతములజంటను తెచ్చినవానికి నాలుగుంబాతిక పణములను బహుమానముగ నియ్యవలెను.

10. ఏనుగులను మచ్చికచేయువారియొక్కయు, వాటికాళ్ళకు గొలుసులు తగిలించువారియొక్కయు, పొలిమేరలను కాపలాకాయువారియొక్కయు, ఆటవికులయొక్కయు, భృత్యులయొక్కయు సహాయముతో నాగవనపాలురు తమ వాసనలు తెలియకుండుటకై ఏనుగులమూత్రపురీషములను పూసుకొని, తమ శరీరములను భల్లాతకీశాఖలతో కప్పుకొని, అయిదుగాని, ఏడుగాని, ఆడుఏనుగులను వెంటబెట్టుకొని, ఏనుగులునిద్రించు ప్రదేశములు, వాటిఅడుగులగుర్తులు, వాటి పురీషము, నదీ తీరములకు వాటిమూలమున కలిగిననష్టము మొదలైన జాడల సాధనమున గుంపులపరిమాణమును తెలుసుకొనవలెను. 11. ఒక్కొకఏనుగును గురించి అది గుంపులోకలిసి తిరుగునట్టిదా, గుంపునకు యజమానియా, ఒంటరిగ తిరుగునట్టిదా, గుంపునుండి చెదరిపోయినట్టిదా, క్రూరమైనదా, మదించినదా, పిల్ల ఏనుగా, బంధము నుండి తప్పించుకొనిపోయినట్టిదా అను లిఖితపూర్వమైన వివరణము ఉండవలెను.

12. ఏనుగులకు శిక్షణ ఇచ్చువారి అభిప్రాయమునుబట్టి గుర్తులు ప్రవర్తన ప్రశస్తములైనట్టి ఏనుగులనే పట్టుకొనవలెను. 13. రాజు విజయమునకు ఏనుగులే ఆధారము. 14. అత్యధిక ప్రమాణములైన శరీరములు కలవి అగుటచేతను ప్రాణములను హరించుటయందు సామర్థ్యము కలవి అగుటచేతను అవి శత్రుసైన్యములను, వ్యూహములను, మార్గములను, శిబిరములను మర్దించగలవు.

15. (శ్లో) కళింగాంగదేశముల ఏనుగులు శ్రేష్ఠములని; ప్రాచ్య, చేది, కరూశ, దశార్ణాపరాంతదేశములఏనుగులు మధ్యమములని భావింపబడుచున్నవి.

16. (శ్లో) సౌరాష్ట్ర పంచనద దేశముల ఏనుగులు అధమములని భావింపబడుచున్నవి. (కాని) శిక్షణవలన వీటి అన్నిటియొక్క వీర్యము, జవము, తేజస్సు వృద్ధిపొందును.

ఇది అధ్యక్షప్రచారము అను రెండో అధికరణమున వ్యవసాయమునకు పనికిరాని భూముల వినియోగము అనే రెండో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 21 : దుర్గములనిర్మాణము

1. జనపదము సరిహద్దులలో నాలుగుదిక్కులందు దైవకృతమగు[1] దుర్గమును యుద్ధసన్నద్ధమగునట్లుగ నిర్మించుకొనవలెను. జలమధ్యమందుండు ద్వీపముగాని, జలముచే చుట్టబడిన ఉన్నతప్రదేశముగాని జలదుర్గము. గుట్టల మయమైనట్టిది గాని, గుహగాని పర్వతదుర్గము. ఉదకమూ పొదలూలేనట్టి ప్రదేశముగాని, ఉప్పుపఱ్ఱ గాని ఎడారిదుర్గము. ఉదకముతో గూడిన బురదప్రదేశముగాని, దట్టమైనపొదలతో గూడినట్టి ప్రదేశముగాని వనదుర్గము. 2. వీటిలో జలదుర్గ పర్వతదుర్గములు జనపదరక్షణమునకును, ఎడారిదుర్గ వనదుర్గములు ఆటవికులకును, ప్రమాద సమయములలో పారిపోయి తలదాచుకొనుటకును ఉపయోగించును.

3. ప్రభుత్వాదాయమును సేకరించి దాచుకొనుటకై జనపదమందు స్థానీయమును నిర్మించవలెను. అది వాస్తుశాస్త్రమునెరిగినవారిచే ప్రశస్తమని చెప్పబడిన ప్రదేశమందు నదీసంగమమునగాని, ఎప్పుడును ఎండిపోని హ్రదసరోవర తటాకముల సమీపమందుగాని, గుండ్రముగనో, దీర్ఘముగనో, చతురస్రముగనో, లేక, ప్రదేశానుగుణముగనో, ఎడమవైపునుండి కుడివైపునకు ప్రవహించు ఉదకములు కలదై స్థలజలమార్గములతోకూడిన పణ్యకపు పట్టణముగ నుండవలెను.

4. దానిచుట్టును ఒకదానినుండి మరియొకదానికి మధ్య పండ్రెండుదండ ముల అంతరముండునట్లుగ మూడుఅగడ్తలను త్రవ్వించవలెను. వాటివెడల్పు క్రమముగ పథ్నాలుగు పండ్రెండు పది దండములుగను, లోతు వెడల్పులో ముప్పాతికగనో సగముగనో, అడుగుభాగము మీదిభాగములో మూడోవంతుగనో, చతురస్రముగనో ఉండవలెను. అడుగుభాగమున రాళ్ళను పరచి, రెండు

---

[1] ప్రకృతిసిద్ధమునైన అనుకూలములతో కూడిన ప్రదేశమునకు దైవకృతము అని పేరు.

ప్రక్కలను రాళ్ళతోగాని ఇటికలతోగాని కట్టవలెను. అడుగుభాగమందుండు ఊటలసాధనమున గాని ప్రదేశాంతరములనుండి తేబడిన జలములసాధనమునగాని అగడ్తలను నీటితో నింపవలెను. అత్యధికములైన జలములు బయటికివెళ్ళి పోవుటకు ఏర్పాటు లుండవలెను. అగడ్తలనిండ పద్మములు మొసళ్ళు ఉండవలెను.

5. అగడ్తకు నాలుగు దండముల దూరమున, త్రవ్వబడినమట్టితో ఒక ప్రాకారమును నిర్మించవలెను. అదిచక్కగ గట్టిపడినట్టిదిగను, ఆరుదండముల ఎత్తును దానికి రెండింతల వెడల్పును కలిగినట్టిదిగను ఉండవలెను. నలుచదరమైన దానిపైభాగము, కుండవంటి ఆకారముగల దాని ప్రక్కభాగము ఏనుగులచేతను ఎడ్లచేతను గట్టిపడునట్లు త్రొక్కించవలెను. దాని రెండువైపుల ముళ్ళపొదలు విషపుతీగలమొక్కలు ఉండవలెను. 6. మిగిలిపోయిన మట్టితో నివాసప్రదేశము లోని పల్లములను రాజభవనములోని పల్లములను పూడ్పించవలెను.

7. ప్రాకారమునకు పైభాగమున ఇటుకలతో ఒక గోడను కట్టవలెను.[2] దానిఎత్తు వెడల్పునకు రెండింతలుగ ఉండవలెను. ఎత్తు సరిసంఖ్యలోగాని బేసి సంఖ్యలోగాని పండ్రెండు మొదలు ఇరవైనాలుగుహస్తములవరకు ఉండవచ్చును. దానిపైన రథములు నడుచుటకు తగినట్టి రహదారి ఉండవలెను. రహదారి ఆకారము తాటిబోదెవలెను, దానిపైభాగము "తప్పెటల"తోను "కపిశీర్షకముల"తోను[3] చిత్రింప బడినదిగను ఉండవలెను. 8. లేదా, (ఇటుకల బదులు) దానిని దగ్గర దగ్గరగా పరచిన రాతిపలకలతోను రాళ్ళతోను నిర్మించవచ్చును. కాని, ఎట్టిపరిస్థితులలోకూడ కలపను వాడరాదు. 9. ఏలయన, అందులో అగ్నిదాగియుండును.

10. ఒక దానికి మరియొక దానికి మధ్య ముప్పైదండములు అంతర ముండునట్లును, వెడల్పుతో సమానముగ చతురస్రమగునట్లును, సమానమైన పొడవును ఎత్తును కలిగియుండునట్లుగను, క్రిందికిదిగుటకు మెట్లతోకూడినట్లుగను (ప్రాకారముపై) గోపురముల నిర్మించవలెను. 11. రెండేసి గోపురములకుమధ్య ప్రదేశమందు రెండంతస్తులు కలిగినట్టియు, (పై అంతస్తులో) వెడల్పుకంటె పొడుగు ఒకటిన్నరరెట్లు అధికముగనుండుమందిరముతో కూడినట్టియు ఒక గోపుర గృహమును కట్టవలెను. 12. గోపురమునకును గోపుర గృహమునకును మధ్య ముగ్గురు ధనుర్ధరులు (ఏకకాలమున) పనిచేయుటకు అవకాశము గలిగినట్టియు

---

2 ప్రాకారము మట్టితోను దానిపైగోడను ఇటుకలతోను నిర్మించవలెనని కౌటిల్యుని మతము. గ్రీకురాయబారి మెగస్తనీసు పాటలీపుత్రముచుట్టు కలపతోనిర్మాణముచేయబడిన కోట ఉండి నట్లు చెప్పియున్నాడు. కాని ఈ విషయములో నతడు పొరబడినట్లు ఊహించవలసి యున్నది.

3 పైభాగమున పేర్చినరాళ్ళు వీటి ఆకారములో ఉండవలెనని అర్థము.

కప్పివేయుటకు వీలుగ మూడుకన్నములతో కూడిన ఫలకము కలిగినట్టియు ఒక ఇంద్రకోశమును[4] నిర్మించవలెను.

13. మధ్యమధ్య ఉండు ఖాళీ ప్రదేశముల పార్శ్వములలో రెండుహస్తముల వెడల్పు, దానికి నాలుగింతల పొడవుగల "దైవపథమును"[5] ఏర్పరచవలెను.

14. ఒకటి రెండు దండముల వెడల్పుగల (మెట్లతోకూడి పైకిఎక్కుటకు వీలైన) మార్గములను కల్పించవలెను. ప్రవేశదుస్సాధ్యమైన స్థలమున (పారిపోయి దాగియుండుటకు అనువైన) ప్రధావనికమును, నిష్క్రమణద్వారమును ఏర్పరచ వలెను.

15. దుర్గమునకువెలుపల మోకాళ్ళను విరుగగొట్టు సాధనములు, శూల సముదాయములు, కూపములు, దాచబడిన వలలు, ముండ్ల (ఇనుప) తీగెలు, అహిపృష్ఠములు, తాళపత్రములు, శృంగాటకములు, కుక్కదవడలు, (ఇనుప) కమ్ములు,[6] ఎగురుపాదుకలు,[7] పెనములు, నీటిగుంటలు—వీటితోకూడిన ఒక (పైకికనుపించని) ప్రచ్ఛన్నమార్గమును నిర్మించవలెను.

16. ప్రాకారమునకు రెండుపార్శ్వములలో ఒకటిన్నర దండముల ప్రమాణముగల మేండకమును[8] నిర్మించి, ఆరుదూలములతోకూడిన (రెండంతస్తుల గోపుర గృహమువంటి) ద్వారమును ఏర్పరచవలెను. ఇది అయిదుదండముల చతురస్రముగనో, లేదా, ఒక్కొక దండముచొప్పున అధికమై ఎనిమిది దండముల చతురస్రముగనో, లేదా, పొడుగుకంటె వెడల్పుఆరోవంతో ఎనిమిదోవంతో ఎక్కువగ కలదిగనో ఉండవలెను. 17. క్రింది అంతస్తు ఎత్తు పదిహేను హస్తముల నుండి ఒక్కొక హస్తముచొప్పున అధికమగుచు పద్దెనిమిది హస్తము లుండవలెను. 18. స్తంభపుచుట్టుకొలత పొడవులో ఆరవభాగముగను, భూమిలో పాతబడిన భాగమునకు రెండింతలుగను ఉండవలెను. శిఖరము (చుట్టుకొలత) పొడవులో నాల్గవభాగముగ ఉండవలెను.

19. క్రింది అంతస్తులోని అయిదవభాగమందు ఒక శాల, ఒక బావి, ఒక

---

4 ఇంద్రకోశము ఇంద్రునికండ్లవలె కన్నములుండు పలకలతోకూడిన ప్రదేశము. ఈ కన్నముల నుండి ధనుర్ధరులు శత్రువుపై బాణముల వేయవచ్చును. ఇవి కప్పివేయుటకు వీలగుటచేత శత్రుబాణములు వీరికి తగల జాలవు.

5 ఇందులో ప్రవేశించుట కష్టసాధ్యమగుటచేత దైవపథమను పేరు పెట్టబడినది.

6 అహిపృష్ఠములు మొదలైనవి వాటివాటి ఆకారములనుబట్టి ఈ విధముగ పేర్కొనబడినవి. ఇవి ఇనుముతోగాని కర్రతోగాని చేయబడిన సాధనములు.

7 వీటిని ధరించిన యెడల ఎగురుట సులభసాధ్యమగునని ప్రతీతి.

8 మేండకముఅనగా పొట్టేలుతల. ఈ నిర్మాణము రెండుకొమ్ములతో కూడిన పొట్టేలుతల ఆకారముకలది.

సీమాగృహము[9] ఉండవలెను. 20. పదియవభాగమందు ఎదురెదురుగా రెండు అరుగులు, వీటి మధ్య ఒక చిన్నగదియు ఉండవలెను. 21. సగముఎత్తులో స్తంభములపై కట్టడముండవలెను. 22. కట్టబడిన ప్రదేశపు విస్తీర్ణములో సగము విస్తీర్ణముగాని మూడవ వంతు విస్తీర్ణముగాని కలిగినగది పై అంతస్తులో ఉండవలెను. దానిరెండుపార్శ్వములు ఇటుకలతో కట్టబడవలెను. దానికి ఎడమ ప్రక్కన ఎడమవైపు నుండి కుడివైపుగా కట్టబడిన సోపానము, రెండవభాగమందు గోడలోపల అమర్చబడిన రహస్య సోపానము ఉండవలెను. 23. తోరణ శిఖరముఎత్తు రెండుహస్తములు. 24. తలుపులరెక్కలు రెండును అయిదింట మూడవభాగము నాక్రమించవలెను. 25. (తలుపులకు) రెండు అడ్డకడ్డీలుండవలెను. 26. గుదియ ఎత్తు ఒక అరత్ని. 27. అయిదు హస్తముల ఎత్తుగల ఒక ప్రక్కతలుపు ఉండవలెను. 28. హస్తిపరిఘలు[10] నాలుగు. 29. నివేశములో అర్ధభాగమున "హస్తినఖము"[11] ఉండవలెను. 30. వంతెన,[12] ముఖమంతటి వెడల్పుగలదై తీసివేయతగినదిగ ఉండవలెను. అది ఉదకములేనిచోట[13] మట్టితో నిర్మింప బడవలెను.

31. ప్రాకారముతో (వెడల్పుతో) సమమైన వివరము నొకదానిని అమర్చి గోపురద్వారమును నిర్మింపజేయవలెను. దీనిలో (పై) మూడవ భాగము బల్లినోటి ఆకారము కలదిగ నుండవలెను. 32. ప్రాకార మధ్యభాగమున ఒక బావిని త్రవ్వి పుష్కరిణీద్వారమును; ఒకదానినుండి మరియొకటి ఒకటిన్నరదండముల దూర ముండున్నట్టియు (బాణములు వేయుటకు తగినట్టి) కన్నములున్నట్టియు నాలుగు శాలలతో కూడిన కుమారీపురద్వారమును; రెండు అంతస్తుల శూన్యగృహముతో కూడిన ముండకద్వారమును నిర్మించవలెను.[14] లేదా, ప్రదేశమునకును సామగ్రికని అనుకూలమైనట్లు ద్వారములు నిర్మించవలెను.

33. సామగ్రిని సేకరించి దాచుటకు వెడల్పుకంటె మూడవవంతు ఎక్కువగ పొడవుగల కాలువలను[15] నిర్మించవలెను.

---

[9] ఆయుధములనుంచుకొనుటకుశాల. బావి ఒకకన్నముపంటిది. దీనిసాధనమున శత్రువుపై బాణముల వేయవచ్చును. లోపలిభాగమునకును వెలుపలిదానికిని సరిహద్దుగనుండు ప్రదేశములో ఇది ఉండుటచేత ఈ పేరు సార్థకమగుచున్నది.

[10] ఇవి ద్వారములకు వెనుకభాగమున నాటబడిన నాలుగు ఇనుపస్థంభములు. వీటి ఉపయోగము ద్వారములకు ఏనుగుల మూలమున ప్రమాదము కలుగ కుండుట.

[11] ఇది ద్వారమునుండి క్రిందికి దిగుటకు దారి.

[12] అగడ్తపైన వంతెన. ఇది తీసివేయుటకు తిరిగి అమర్చుటకు సాధ్యమైనట్టిది.

[13] అగడ్తకు రెండువైపులనుండు మట్టిదిబ్బ.

[14] ఇందు నాలుగు రకముల ద్వారములు పేర్కొనబడినవి. శూన్యగృహమనగా లోపల ఏవస్తువులును లేనట్టిది.

[15] ఇవి ప్రాకారము లోపల సొరంగముల రూపములందున్నట్టివి.

**34-35.** (శ్లో) వీటిలో రాళ్ళు, పారలు, గొడ్డళ్ళు, బాణములు, కత్తులు, గదలు, సుత్తెలు, కర్రలు, చక్రములు, యంత్రములు, శతఘ్నులు,[16] కమ్మరులు తయారుచేసిన శూలములు, పొడుచుటకు వీలైన వెదుళ్ళు, ఉష్ట్రగ్రీవములు,[17] అగ్నిసంయోగములు, కుప్యకల్ప ప్రకరణమున పేర్కొనబడిన వస్తుసామగ్రి అంతయు సేకరించి దాచవలెను.[18]

ఇది అధ్యక్ష ప్రచారమను రెండో అధికరణమున దుర్గముల నిర్మాణము అనే మూడో అధ్యాయము.

---

[16] శతఘ్ని—వేయి మొనలతో ఉన్నట్టి ఇనుపకడ్డీ. పొడుచుటకు ఉపయోగించునట్టిది.

[17] ఒకవిధమైన ఆయుధము, ఉష్ట్రికమని నామాంతరము.

[18] రాజ్యమునకుండవలసిన సప్తాంగములలో దుర్గము నాల్గవది. శత్రువు రాజ్యముపై దండెత్తి వచ్చినప్పుడు రక్షణకు దుర్గము ప్రధానస్థానము. దీర్ఘకాలపు ముట్టడినికూడ సహింపగలదిగ నుండవలెను. అందుకుగాను వివిధములగు ఆయుధములను ఆహారాదిపదార్థములను అందు సేకరించి యుంచుట అవసరము.

రెండో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 22 : దుర్గములోని నివాసముల నిర్ణయము

1. పడమటినుండి తూర్పునకు వెళ్ళు మూడు రాజమార్గములు దక్షిణము నుండి ఉత్తరమునకు వెళ్ళు మూడు రాజమార్గములు ఆధారముగా (దుర్గములోని) నివాసప్రదేశమును విభాగము చేయవలెను.[1] 2. అందు పండ్రెండు ద్వారములు, త్రాగు నీటివసతులు, నీళ్ళు వెళ్ళిపోవుటకు కాలువలు, రహస్య మార్గములు ఉండవలెను.

3. మార్గముల (రోడ్ల) వెడల్పు నాలుగు దండములు. 4. రాజమార్గము, ద్రోణముఖము, స్థానీయము, రాష్ట్రము, వివీతము, రేవుపట్టణము, సైనికవ్యూహము, శ్మశానము, గ్రామము—వీటిమార్గముల వెడల్పు ఎనిమిది దండములు.[2] 5. సాగు నీటివసతుల మార్గములయు వనమార్గములయు వెడల్పు నాలుగు దండములు; ఏనుగు మార్గములయు సాగుపొలముల మార్గములయు వెడల్పు రెండు దండములు; రథ మార్గము వెడల్పు అయిదు అరత్నులు; పశుమార్గముల వెడల్పు నాలుగు అరత్నులు. క్షుద్రపశువులు మనుష్యులు నడుచునట్టి మార్గముల వెడల్పు రెండు అరత్నులు.

6. శ్రేష్ఠమగు వాస్తుప్రదేశమందు నాలుగు వర్ణములవారు నివసించుటకు తగినట్లుగ రాజనివేశము నిర్మాణము కావలెను. 7. (దుర్గ) నివాస ప్రదేశ మధ్య భాగమునకు ఉత్తరమున, తొమ్మిదవ వంతు విస్తీర్ణముతో తూర్పుముఖముగగాని ఉత్తరముఖముగగాని వాస్తుశాస్త్ర విధుల ననుసరించి అంతఃపురమును[3] కట్టించవలెను.

---

1 ఇట్టి విభాగమువలన పదహారు చదరములు ఏర్పడును.

2 ఇవి వివిధ ప్రదేశములకు వెళ్లు మార్గములని ఊహించుకొనవలెను.

3 నగరవిస్తీర్ణములో తొమ్మిదవ భాగము అంతఃపురమునకు కేటాయించవలెను.

8. అందులోని తూర్పుప్రదేశపు ఉత్తర భాగమున ఆచార్య పురోహితుల నివాసములు, యాగశాల, ఉదకస్థానము, మంత్రుల నివాసములు. దక్షిణ భాగమున వంటశాల, ఏనుగులశాలలు, కోష్ఠాగారము ఉండవలెను. 9. దానికి ఆవల తూర్పు భాగమున గంధమాల్యారసములను విక్రయించువారు, పరిమళ ద్రవ్యములను తయారుచేయువారు, క్షత్రియులు నివసించవలెను.

10. దక్షిణపు తూర్పుభాగమున భాండాగారము, అక్షపటలము, కార్మికుల నివాసములు, పశ్చిమ భాగమున కుప్యగృహము,[4] ఆయుధాగారము ఉండవలెను. 11. దానికి ఆవల దక్షిణ భాగమున నగరములో ధాన్యవ్యాపారము చేయువారు. కార్మికుల అధ్యక్షులు, సైన్యాధ్యక్షులు, అన్నవిక్రయులు, సురామాంస విక్రయులు, వేశ్యలు, నర్తకులు, వైశ్యులు నివసించవలెను.

12. పశ్చిమపు దక్షిణభాగమున గాడిదల ఒంటెల స్థానములు, కర్మాగారము, ఉత్తరభాగమున యానరథశాలలు ఉండవలెను. 13. దానికి ఆవల పశ్చిమభాగమున ఉన్ని, నూలు, వెదురు, చర్మము, వర్మములు, ఆయుధములు, కవచములు — వీటికి సంబంధించిన పనులను చేయువారు, శూద్రులు నివసించవలెను.

14. ఉత్తరపు పశ్చిమభాగమున పణ్యగృహములు, ఔషధాగారములు; తూర్పుభాగమున కోశము, గోవులు, గుర్రములు ఉండవలెను. 15. దానికి ఆవల ఉత్తరభాగమున నగరదేవతలు, రాజదేవతలు, లోహకారులు, మణికారులు బ్రాహ్మణులు నివసించవలెను.

16. నివాస ప్రదేశములకు ఆవల (వర్తక) శ్రేణులకును విదేశవ్యాపారులకును ప్రదేశము లుండవలెను.

17. పురమధ్యమందు అపరాజిత, అప్రతిహత, జయంత, వైజయంత అను వారికిని, శివ, వైశ్రవణులకును, అశ్వినీదేవతలకును, శ్రీమదిరాదేవతలకును ఆలయములు[5] నిర్మించవలెను. 18. వారివారి ప్రదేశముల ననుసరించి వాస్తుదేవతలను ప్రతిష్ఠించవలెను. 19. నగరద్వారములకు బ్రహ్మ, ఇంద్రుడు, యముడు, సేనాపతి అధిష్ఠానదేవతలుగ నుండవలెను. 20. (నగరమునకు) వెలుపల, అగడ్తకు నూరు ధనుస్సుల దూరమున చైత్యములు, పుణ్యస్థానములు, వనములు, ఉదక స్థానములు ఏర్పరచవలెను. ఆయాదిక్కులలో దిగ్దేవతలను ప్రతిష్ఠించవలెను.

21. శ్మశానములోని ఉత్తరభాగమును గాని తూర్పుభాగమును గాని ఉత్తమ వర్ణములవారు, దక్షిణభాగమును అపరవర్ణములవారు ఉపయోగించుకొనవలెను.

---

[4] కుప్యమనగా అడవులయందు ఉత్పత్తియగు వస్తుసామగ్రి.

[5] దేవాలయముల నిర్మాణము వైదికేతరమగు ఆచారము. కౌటిల్యునినాటికి అది ప్రబలినట్లు కనిపించును. వైశ్రవణునికి (కుబేరునికి), అశ్వినీదేవతలకు దేవాలయములుండుట ఒక విశేషము. మదిరాదేవత దుర్గయో కాళియో కావచ్చును. చైత్యములు వైదికేతరమగు బౌద్ధ మతము ననుసరించినవారికి పవిత్రములు.

22. దీనిని అతిక్రమించినవారు సాహసదండములో తక్కువ మొత్తమును చెల్లించవలెను.

23. పాషండులయు, చండాలురయు నివాసములు శ్మశానాంతమందు ఉండవలెను.

24. వారివారి కర్మాగారములకు కావలసిన విస్తీర్ణమునుబట్టి కుటుంబీకుల ఇండ్లహద్దులను నిర్ణయించవలెను. 25. అందు రాజాజ్ఞను పొంది పువ్వులతోటలను పండ్లతోటలను వారు వేసుకొనవలెను; అట్టి ఆజ్ఞను పొంది ధాన్యాగారములను పణ్యాగారములను కట్టుకొనవలెను. 26. పదిపది కుటుంబములకు ఒకబావి ఉండవలెను.

27. అన్ని రకముల నూనెలు, ధాన్యములు, క్షారములు, లవణములు, సుగంధద్రవ్యములు, ఔషధములు, కాయగూరల ఒరుగులు, పశుగ్రాసము, ఎండిన మాంసము, గడ్డి, కట్టెలు, లోహములు, చర్మములు, బొగ్గులు, నరములు, విషములు, వెదుళ్లు, నారలు, గట్టికలప, ఆయుధములు, కవచములు, రాళ్ళు—వీటినన్నిటిని అనేక సంవత్సరములకు చాలునట్లుగ సేకరించి దాచవలెను. 28. పాతవాటిస్థానే క్రొత్తవాటిని సేకరించుచుండవలెను.

29. రథగజతురగపదాతులతో కూడిన సైన్యమును అనేక ముఖ్యుల వశమందుండునట్లు ఏర్పాటుచేయవలెను. 30. ఏలయన, అనేక ముఖ్యుల వశమందుండు సైన్యము పరస్పర భయముచే శత్రువుల కుట్రలకు లొంగజాలదు.

31. దీనినిబట్టి పొలిమేరలలోని దుర్గముల ఏర్పాటులను గ్రహించునది.

32. (శ్లో) రాష్ట్రమునకు నష్టముకలిగించు "బాహురికుల"[6] నెవ్వరిని నగరములోనికి రానీయకూడదు. అట్టివారిని జనపదములో అన్ని ప్రదేశములందు వెదచల్లవలెను: లేదా, పన్నులన్నిటిని చెల్లించునట్లు చేయవలెను.

ఇది అధ్యక్ష ప్రచారమను రెండో అధికరణమున దుర్గములోని నివాసముల నిర్ణయము అనే నాల్గో అధ్యాయము.

---

[6] బాహురికులనగా దేశద్రిమ్మరులగు జాతులు.

# రెండో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 23 : (సన్నిధాత) వస్తుసంగ్రహణాధికారి కార్యకలాపము

1. సన్నిధాత కోశగృహమును, పణ్యగృహమును, కోష్ఠాగారమును, కుప్య గృహమును, కారాగారమును కట్టించవలెను.

2. నీరు తేమ తగులకుండునట్లు నాలుగు మూలల కూపమును త్రవ్వించి దాని రెండు పార్శ్వములందును అడుగునను పెద్ద రాతిపలకలను పరచి, అందులో పంజరాకారమున గట్టి కలప దూలములను అమర్చి, వివిధములగు ఏర్పాటులతో కూడిన మూడంతస్తుల గృహమును నేలమట్టమునకు కట్టవలెను. అందులోని క్రింది మీది అంతస్తుల పార్శ్వములు అడుగు భాగములు పైకప్పులు చక్కగ అమర్చబడి ఉండవలెను. భూమి గృహమునకంతకు ఒకే ద్వారము, యంత్రసహితమగు ఒక సోపానము ఉండవలెను. 3. దానిపైన కోశగృహమును నిర్మించవలెను. దాని గోడలు రెండింటికి ద్వారములు ఉండరాదు. దానికి (ముందుభాగమున) ఇటుక లతో కట్టబడిన ప్రవేశమందిరము ఉండవలెను. దీనిచుట్టును వస్తుసామగ్రిని దాచుటకు అనువైన క్షాలువలు[1] ఉండవలెను. లేదా, (భూమి గృహముమీద) ఒక ప్రాసాదమును కట్టవలెను. 4. ఆపదర్థమై అతడు జనపదాంతమందు శాశ్వతనిధి నొకదానిని వధార్హులైనవారి[2] సాధనమున స్థాపించవలెను.

5. కాల్చిన ఇటుకల స్తంభములతోను, నాలుగు చావడులతోను, అనేకము లైన క్రిందిమీది అంతస్తులతోను, తప్పించుకొని పారిపోవుటకు వీలుగ రెండు పార్శ్వములందు గుల్లస్తంభములద్వారా ఒక రహస్యమార్గముతోను పణ్యాగార మును కోష్ఠాగారమును కట్టించవలెను. వీటిమధ్య వస్తుసామగ్రిని దాచుటకు

---

[1] 2-3-33 లో వీటి ప్రస్తావన ఉన్నది.

[2] ఈ నిధిని పూడ్చిపెట్టినప్పుడు పనిచేసిన కూలివాండ్రను చంపివేయుట ఆచారము. రహస్యము వెల్లడికాకుండుటకు రాజు తీసుకొను జాగ్రత ఇట్టిది.

పొడవైన చావడులతోకూడిన కుప్యాగారము ఉండవలెను. కుప్యాగారమువలెనే, (దానితోపాటు) భూగర్భ గృహముతోకూడిన ఆయుధాగారమును కట్టించవలెను. (ధర్మస్థీయ) న్యాయాధీశులచే శిక్షింపబడినవారికి, ఉన్నతాధికారులచే శిక్షింపబడిన వారికీ వేరువేరుగ రెండుకారాగారములు ఉండవలెను. వీటిలో ఖైదీలు తప్పించు కొనిపోవుటకు వీలులేనట్లుగను, స్త్రీలు పురుషులు వేర్వేరు భాగములలో నివసించు టకు వీలగునట్లును ఏర్పాటులుండవలెను.

6. అగారములన్నిటిలో ఒక అగడ్త, బావి, మరుగుదొడ్డి, స్నానముల గది, అగ్నివిషముల ప్రమాదమునుండి రక్షణకు సాధనములు, (ఇతర విధములైన) రక్షణకు పిల్లులు, ముంగిసలు, ఆయా దేవతల పూజలకు ఏర్పాటులు[3] ఉండవలెను.

7. వర్షపాతమును కొలుచుటకు అరత్ని వెడల్పు మూతిగల పాత్రను కోష్ఠాగారమున ఉంచవలెను.

8. (ఆయా వస్తువుల గుణముల పరీక్షించుటయందు) నిపుణులైనవారిపై ఆధ్వర్యమును వహించి, సన్నిధాత రత్నములను, ఎక్కువ విలువగల వస్తువులను, తక్కువ విలువగల వస్తువులను, కుప్యములను—పాతవాటినీ కొత్తవాటినీ— ప్రతిగ్రహించవలెను.[4] 9. వీటిలో రత్నముల విషయమై మోసము జరిగినప్పుడు మోసము చేసినవారికీ వారిని ప్రేరేపించినవారికీ గరిష్ఠసాహసదండమును, ఎక్కువ విలువగల వస్తువుల విషయమై మోసము జరిగినప్పుడు మధ్యమ సాహసదండమును విధించవలెను. తక్కువ విలువగల వస్తువుల విషయమైగాని, కుప్యముల విషయమై గాని మోసము జరిగినప్పుడు వాటి ఖరీదును దానికి సమానమగు దండమును ఇచ్చుకొనవలెను.

10. (రూపదర్శకుడు) నాణెముల పరీక్షించువాడు శుద్ధములని చెప్పిన నాణెములను ప్రతిగ్రహించవలెను. 11. అశుద్ధములను ఛేదించివేయవలెను. 12. అట్టి నాణెములను తెచ్చువానిపై కనిష్ఠసాహసదండమును విధించవలెను.

13. శుద్ధము, (కొలతలో) పూర్ణము, నవము (కొత్తది) అయిన ధాన్యమును పరిగ్రహించవలెను. 14. విరుద్ధముగ ప్రవర్తించినవాడు ఖరీదుకు రెండింతల దండమును చెల్లించవలెను.

15. దీనినిబట్టి ఇతర వస్తుసామగ్రి, కుప్యము, ఆయుధములు మున్నగు వానినిగురించిన వివరములను గ్రహించవలెను.

---

[3] ఒక్కొక ఆగారమునకు ఒక ఇష్టదేవత : కోశగృహమునకు వైశ్రవణుడు, కోష్ఠాగారమునకు సీత, పణ్యగృహమునకు శ్రీ, కుప్యగృహమునకు ఈశానుడు, ఆయుధాగారమునకు స్కందుడు, కారాగారమునకు యమవరుణులు ఇష్టదేవతలని కొందరు వ్యాఖ్యాతలు.

[4] ప్రజలనుండి వసూలు చేయవలసిన పన్నులు ప్రాచీనకాలమున రొక్కరూపమునగాక ఎక్కువగ వస్తువుల రూపమున ఉండెడివి. ఇదిగాక ప్రభుత్వపు యాజమాన్యమున సమస్త పదార్థములు ఉత్పత్తియగుచుండెడివి. వీనినన్నిటిని దాచుటకు తగినట్లు కోష్ఠాగారము నిర్మింపబడియుండెడిది.

16. పరిపాలన శాఖలో పై అధికారులు, క్రింది అధికారులు, భృత్యులు ఒక పణము మొదలు నాలుగు పణములవరకు అపహరించినపుడు క్రమముగ కనిష్ఠ మధ్యమ గరిష్ఠ సాహసదండములకూ మరణదండనమునకూ పాత్రులగుదురు. 17. కోశమును అపహరించిన కోశాధికారికి శిరచ్ఛేదశిక్ష. 18. ఆతనికి సహాయము చేసినవారికి (శిక్ష) దండములో అర్ధభాగము. 19. వారికి తెలిసియుండని పక్షమున మందలింపే శిక్ష.

20. కోశాగారమునకు కన్నమువేసిన దొంగలకు శిక్ష చిత్రవధ.

21. కావున, విశ్వాసపాత్రులగువారికి అధికారియై, సన్నిధాత వస్తు సంగ్రహమును చేయవలెను.

22. (శ్లో) నూరు సంవత్సరములనాటి బాహ్యాభ్యంతరమగు[5] ఆదాయమునుకూడ ఎరిగినవాడై సన్నిధాత ఆయవ్యయ విశేషములగురించి ప్రశ్నింపబడినపుడు తడబాటులేనివాడుగ ఉండవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున (సన్నిధాత) వస్తుసంగ్రహణాధికారి కార్యకలాపము అనే అయిదో అధ్యాయము.

---

[5] జనపదమునుండి లభించు ఆదాయము బాహ్యము; దుర్గములోపలి ప్రజలనుండి కర్మాగారాదులనుండి లభించునది అభ్యంతరము. 2-6 లో వీని వివరములున్నవి.

# రెండో అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 24 : సమాహర్త ఆయమును సమకూర్చు విధానము

1. సమాహర్త[1] దుర్గమును, రాష్ట్రమును, గనులను, సేతువులను,[2] వనములను, మందలను, రహదారులను (ఆయమునకు మూలములను దృష్టితో) పరిశీలించవలెను.

2. శుల్కములయు, దండములయు, తూకములయు, మానములయు ప్రమాణనిర్ణయము, నగరాధ్యక్షుడు, లక్షణాధ్యక్షుడు,[3] ముద్రాధ్యక్షుడు, మద్య ములు, జంతువులవధ, నూలు, నూనె, నెయ్యి, క్షారములు, సువర్ణకారుడు, వాణిజ్యసంస్థ, వేశ్యలు, జూదము, కట్టడములు, చేతిపనివాండ్రయు శిల్పులయు సముదాయము, దేవతాధ్యక్షుడు, ద్వారముల వసూళ్ళు, బాహిరకులనుండి వసూళ్ళు —ఇవి దుర్గసంబంధము.

3. వ్యావసాయకోత్పత్తి, భాగము, కప్పము, పన్ను, వర్తకుడు, నదీ పాలుడు, (నదులను దాటించు) తెప్ప, బల్లకట్టు, నావ, రేవు పట్టణము, పచ్చిక బయళ్లు, రహదారుల రుసుము, భూముల కొలత, దొంగలను పట్టుకొనుట—ఇవి రాష్ట్రసంబంధము.

4. బంగారము, వెండి, వజ్రములు, మణులు, ముత్తెములు, పగడములు, శంఖములు, లోహములు, లవణములు, భూమి ప్రస్తారములు,[4] రసములు, ధాతువులు—ఇవి గనుల సంబంధము.

5. పువ్వుల తోటలు, పండ్ల తోటలు, కాయగూరల తోటలు, పల్లపుసాగు పొలములు, దుంపజాతులు—ఇవి సేతువుల సంబంధము.

---

[1] సమాహర్త ఆయ (రివిన్యూ) శాఖకు అధికారి.

[2] సేతువులనగా అన్నిరకముల జలాధారములు.

[3] లక్షణాధ్యక్షుడనగా నాణెములపై అధికారమును వహించినవాడు.

[4] భూమి ప్రస్తారములు అనగా భూగర్భములోని వివిధములగు ముడిపదార్థములు.

6. మృగవనములు, లేళ్ళ (జింకల) వనములు, ద్రవ్యవనములు, హస్తివనములు — ఇవి వనముల సంబంధము.

7. గోవులు, మహిషములు, మేకలు, గొర్రెలు, గాడిదెలు, ఒంటెలు, గుర్రములు, కంచరగాడిదెలు – ఇవి మందల సంబంధము.

8. మెట్టమార్గములు, నీటిమార్గములు – ఇవి రహదారుల సంబంధము. 9. ఇది ఆయశరీరము.

10. మూల్యము, భాగము, మూల్యాధికము,[5] గుత్తపన్ను,[6] క్లుప్తము, రూపికము, అత్యయము – ఇది ఆయముఖము.[7]

11. దేవపిత్రుపూజలఖర్చులు, దానములు, స్వస్తివాచనము,[8] అంతఃపురము, వంటశాల, దూతలనియోగము, కోష్ఠాగారము, అయుధాగారము, పణ్యగృహము, కుప్యగృహము, కర్మాగారములు, విష్టి, రథగజతురగపదాతుల సంరక్షణము, పశువులమందలు, పశుమృగపక్షివ్యాళవాటములు, కాష్ఠతృణవాటములు — ఇవి వ్యయ శరీరము.

12. రాజవర్షము,[9] మాసము, పక్షము, దివసము (అని) రోజువారీలెక్క; వర్ష హేమంత గ్రీష్మ ఋతువులలో[10] ఒక రోజుతగ్గిన మూడవ ఏడవ పక్షములు, తక్కినపూర్ణపక్షములు, ప్రత్యేకమైన అధికమాసము – ఇది కాలము.

13. ఆయముఅంచన, సిద్ధాయము, బకాయి (పడిన ఆయము), ఆయము, వ్యయము, శేషము – (ఇవి లెక్కలలో నమోదుచేయవలసిన పద్దులు).

14. స్థానము,[11] ప్రచారము,[12] శరీరావస్థాపనము,[13] వసూళ్ళు, పద్దులలో ఒక్కొకదానిమొత్తము,[14] అన్నిటిమొత్తము – ఇది అంచన.

---

[5] వ్యాజిఅనిమూలము. తూకములోగాని కొలతలోగాని తరుగుఉన్నప్పుడు చెల్లించవలసిన రుసుము.

[6] పరిఘఅనిమూలము. గుత్తవ్యాపారముగాని ఉత్పత్తినిగాని చేయువారు చెల్లించవలసినపన్ను.

[7] ఆయముఖమనగా ఆయముల ప్రధానశీర్షికలు.

[8] వేదాధ్యయనముచేసిన బ్రాహ్మణులకు ఇచ్చువార్షికములవంటివి ఈవ్యయములో చేరును.

[9] ఇదిఆషాఢబహుళపాడ్యమితో ప్రారంభమై ఆషాఢశుద్ధపౌర్ణమితో ముగియునట్టిది. లెక్కలను వ్రాయుటలో ఇట్టిసంవత్సరము అనుసరింపబడుచుండెను.

[10] వర్షఋతువులో శరత్తు, హేమంతములో శిశిరము, గ్రీష్మములో వసంతము కలిసియున్నట్లు గ్రహించవలెనని వ్యాఖ్యాతలు. ఈఒక్కొకజంటఋతువులలో (కౌటిల్యునినాటి కాలమాన ప్రకారము) మూడవ ఏడవపక్షములందు 14 రోజులు, తక్కినవాటిలో 15 రోజులు ఉండినవి. అనగా భాద్రపదము-కార్తీకముల (మొదలైన ఒకటివిడిచి దానితర్వాతమాసములలో) మొదటిపక్షమున 14 రోజులు రెండవపక్షమున 15 రోజులు ఉన్నట్లుగ్రహింపవలెను.

[11] అంచనకుసంబంధించినగ్రామము, మండలములవంటి ప్రదేశము.

[12] ప్రచారమనగా ఆయాఅధ్యక్షుల కార్యరంగము.

[13] ఆయశరీరమనగా ఏమిటియో పైన 9వ సూత్రములో చెప్పబడినది.

[14] దుర్గము, రాష్ట్రము మొదలైన ఆదాయమూలములలో ఒక్కొక్కదానికిసంబంధించిన పద్దుల మొత్తము.

15. కోశమందు అర్పించబడినట్టిది. రాజుచేగ్రహింపబడినట్టిది. చెల్లింపబడిన పురవ్యయము, మాపుచేయని గతసంవత్సరపునిలవ, రాజశాసనముద్వారా విధింపబడినట్టిది, నోటిమాటద్వారా విధింపబడినట్టిది – ఇది సిద్ధాయము.

16. కార్యముపూర్తిఅగుటచే రాదగినఫలితము, వసూలుకావలసిన దండశేషము, బలప్రయోగకారణముగ వసూలుకానట్టిది, ఉద్యోగులచే వినియోగింపబడి (తిరిగి) వసూలుచేయుటకు వీలైనట్టిది—ఇదిబకాయి (పడిన ఆదాయము). ఇందులో ఎక్కువవిలువగల వస్తుసామగ్రిని చేర్చకూడదు. చేర్చినను వాటి మొత్తము స్వల్పముగనుండవలెను.

17. వర్తమానము, పర్యుషితము, అన్యజాతములు (కలిసినట్టిది) ఆదాయము. 18. ఏరోజుకుఆరోజు వచ్చునట్టిదివర్తమానము. 19. గతసంవత్సరమునకు సంబంధించినట్టిదియు ప్రచారాంతరమునుండిలభించినట్టిదియు పర్యుషితము. 20. నష్టమై విస్మరింపబడినట్టిది, ఉద్యోగులపై విధింపబడిన దండములు, (అంచనాకంటె) అధికమైనఆయము, నష్టపరిహారము, ఉపాయనములు, తిరుగుబాటులో చేరినవానిఆస్తి, సంతానహీనుని ఆస్తి, నిధి–ఇవి అన్యజాతములు, 21. సైన్యవిక్షేపము (తగ్గించుట) మూలమున ఖర్చులోమిగులు, వ్యాధికారణమున మధ్యవదలి పెట్టిన కార్యములఖర్చులలో మిగులు – ఇవి వ్యయసంబంధములగు ఆయము. 22. విక్రయకాలమునాటికి పణ్యముల ధరలలో పెరుగుదల, తూకములయు మానములయు లోపమువలన లభించినవ్యాజి, కొనువారిపోటీ మూలమున ధరలో పెరుగుదల – ఇది (కూడ) ఆయము.

23. నిత్యము, నిత్యోత్పాదికము, లాభము, లాభోత్పాదికము అని వ్యయము (నాలుగువిధములు). 24. రోజుచేయవలసిన వ్యయము నిత్యము. 25. పక్షము, మాసము, సంవత్సరముతర్వాత (ఉద్యోగులకులభించు) ఆదాయము లాభము.[15] 26. ఈరెండింటిమూలమున చేయవలసినవ్యయము వరుసగ నిత్యోత్పాదికము లాభోత్పాదికము – ఇది వ్యయము.

27. మొత్తపుఆయమునుండి ఆయవ్యయములను లెక్కించిన తర్వాత మిగిలినది, ప్రాప్తించినట్టియు మరుసటిసంవత్సరపులెక్కలలో నమోదుచేయవలసినట్టియు శేషము నీవి.

28. (శ్లో) ఈవిధముగ ప్రాజ్ఞుడు (సమాహర్త) ఆయమును నిర్ణయించి ఆయములో వృద్ధిని వ్యయములో తగ్గింపును చూపవలెను ; విపర్యయము కలిగినప్పుడు ప్రతిక్రియ చేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండోఅధికరణమున సమాహర్త ఆయమును సమకూర్చు విధానముఅనే ఆరోఅధ్యాయము.

---

[15] ఉద్యోగులు ఇతరభృత్యులు వారివారిఉద్యోగధర్మమునుబట్టి పక్షమునకో మాసమునకో సంవత్సరమునకో జీతములను పుచ్చుకొనుచుందురు. వారి దృష్ట్యా అదివారికిలాభము ; కాని సమాహర్తలెక్కలదృష్ట్యా వ్యయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 25 : అక్షపటలమందు లెక్కల సంవిధానము

1. అక్షపటలాధ్యక్షుడు రికార్డుపుస్తకములను ఉంచుటకు వేర్వేరు చావడులతో తూర్పుముఖముగగాని ఉత్తరముఖముగగాని (అక్షపటలమును)[1] రికార్డుల కచ్చేరీని కట్టించవలెను.

2. అందలి నిబంధపుస్తకములలో : పరిపాలన శాఖలసంఖ్య, వాటిప్రచారము, మొత్తపుఆదాయము; కర్మాగారములలో వాడబడు ద్రవ్యముల వృద్ధిక్షయములు, ఖర్చులు, చేర్పులు,[2] వ్యాజి, ద్రవ్యములసంయోగము,[3] స్థానము,[4] వేతనప్రమాణము, విష్టిప్రమాణము ;[5] రత్నములు, ఎక్కువతక్కువవిలువగల వస్తుసామగ్రి, కుప్యములు – వీటిఖరీదు, పన్నె, బరువు, మానము, ఎత్తు, లోతు, భాండము,[6] దేశములు, గ్రామములు, జాతులు, కులములు, సంఘములు—వీటి ధర్మములు, వ్యవహారములు,[7] అచారములు, (వీటికి సంబంధించిన) రాజశాసనములు ; రాజునుఆశ్రయించి జీవించువారికి లభించిన అనుగ్రహములు, భూములు, భోగములు, పరిహారములు, భోజనపదార్థములు, వేతనములు ; రాజు, రాజపత్నులు, రాజపుత్రులు అనుభవించు రత్నములు, భూములు ప్రత్యేకలాభములు

---

[1] అక్షపటలమనగా ఈకాలపు రికార్డు ఆఫీసువంటిది.

[2] చేర్పులనగా కర్మాగారములో ఎక్కువగదులను శాలలను చేర్చుట.

[3] రెండుమూడు ద్రవ్యములనుకలిపి క్రొత్తవస్తువునొకదానిని తయారుచేయుట. నూలు, జరీ, రంగు కలిపి చీరెను నేయుటఇట్టిది.

[4] కర్మాగారముఉండు ప్రదేశము.

[5] విష్టి అనగా కూలిజనము.

[6] వీటినిదాచుటకు ఉపయోగించు కుండ, పెట్టె, పాత్రము వగైరా.

[7] వీటిమధ్యజరుగు ఒప్పందములు. ఇవి అక్షపటలమున రిజిస్టరు చేయబడు చుండెడివి.

ఉత్పాతప్రతీకారములు;[8] మిత్రులతోను శత్రువులతోను చేసుకొనిన సంధి విగ్రహములకు సంబంధించిన ప్రదానదానములు[9] వ్రాసి ఉంచవలెను.

3. ఈ రికార్డునుండి అతడు అన్ని శాఖలకు : ఆయముఅంచన, సిద్ధాయము, శేషము, ఆయవ్యయములు, నిలవ, లెక్కలతణిఖీకి హాజరుకావలసిన కాలము, ప్రచారము, ఆచారములు, రాజశాసనములు లిఖితపూర్వముగ తెలియపరచవలెను.

4. ఉత్తమమధ్యమాధమములగు కార్యములకు ఆయాఅర్హతలు కల అధ్యక్షుని నియమించవలెను. లాభదాయకములగు కార్యములకు ఎవడు శిక్షింపబడినప్పటికి రాజు ఆగ్రహము చెందడో, అట్టివాడు (అధ్యక్షు డగుటకు) అర్హుడు.[10] 5. అతని భాగస్వాములు, అతనికి జామీను ఉండినవారు, అతనికార్యము మూలమున జీవించువారు, అతనిపుత్రులు సోదరులు భార్యలు పుత్రికలు భృత్యులు నష్టమును భరించవలెను.

6. మూడువందల ఏభైనాలుగు అహోరాత్రములు కలసి ఒక కర్మ సంవత్సరము.[11] 7. అది న్యూనమైనను అధికమైనను[12] ఆషాఢశుద్ధపౌర్ణమితో ముగియునట్లుగ (రాజు) నిర్ణయించవలెను. 8. అధికమానమునకు ప్రత్యేకాధికారిని నియమించవలెను.

9. (పరిపాలనశాఖల) కార్యమును గూఢ పురుషులసాధనమున శోధింపవలెను. 10. ఏలయన, ఆ అధికారి ప్రచారము ఆచారములు శాసనములు తెలిసినవాడు కానిపక్షమున అజ్ఞానము మూలముననూ, కార్యక్లేశమును సహింపలేనివాడైన పక్షమున సోమరితనము మూలముననూ, శబ్దాది ఇంద్రియసుఖములకు మరిగినవాడైన పక్షమున ప్రమాదము మూలముననూ, (ప్రజల) ఆక్రోశమునకు అధర్మమునకు అనర్థమునకు భీరుడైన పక్షమున భయము మూలముననూ, కార్యార్థులయెడ అనుగ్రహ బుద్ధికలవాడైన పక్షమున కామము మూలముననూ, హింసించుటయందు బుద్ధి కలవాడైన పక్షమున కోపముమూలముననూ, విద్యపైని ధనముపైని రాజవల్లభుల సహాయముపైని ఆధారపడినవాడైన పక్షమున దర్పము మూలముననూ, కొలతల మానముల ధరల నిర్ణయములను లెక్కపెట్టుటలలో మోసముచేయువాడైన పక్షమున లోభము మూలముననూ నష్టమును కలిగించును.

---

[8] భూకంపములవంటి ఉత్పాతములు సంభవించి నష్టము కలిగినప్పుడు వారికి ఇచ్చునట్టి వస్తు సామగ్రి, హిరణ్యము వగైరా.

[9] ప్రదానములు : ఇతరులకు ఇచ్చినట్టి హిరణ్యాదులు ; ఆదానములు : ఇతరులనుండి లభించిన హిరణ్యాదులు.

[10] అట్టి కార్యములలో నష్టము కలిగించిన అధ్యక్షుడు శిక్షార్హుడు. కాని ఒక్కొక్కప్పుడు అతడు రాజునకు కావలసినవాడుగ ఉండవచ్చును. అట్టివానిని శిక్షించుట ప్రమాదము. అందుచేత రాజులతో సంబంధములేనివానిని అధ్యక్షునిగ నియమించుట మంచిదని గ్రహించవలెను.

[11] ప్రభుత్వకార్యకలాపములకై నిర్ణయించబడిన సంవత్సరము—ప్రస్తుతము మనదేశమున ఏప్రిలు 1 తేదీతో ప్రభుత్వ సంవత్సరము ప్రారంభమగుచున్నది.

[12] అప్పటికి కార్యములు పూర్తియైనను కాకపోయినను అని గ్రహించునది.

11. "వాటికి (ఆదాయనష్టమునకు గలకారణములకు) నష్ట మెంతయో అంతటిదండము. పైనిచెప్పబడిన క్రమములో ముందుదానికంటె తర్వాతిదానికి ఒక రెట్టింపు—ఇంత ఎక్కువదండమును విధించవలెను" అని మానవులు.[13] 12. "సర్వత్ర నష్టమునకు ఎనిమిదిరెట్లదండము," అనిపారాశరులు. 13. "పది రెట్లు," అని బార్హస్పత్యులు. 14. "ఇరవైరెట్లు" అని ఔశనసులు. 15. "దండము అపరాధమునకు తగినట్టిదిగ ఉండవలెను," అని కౌటిల్యుడు.[14]

16. లెక్కలన్నిటిని ఆషాఢపౌర్ణమినాటికి (అక్షపటలమున) సమర్పించవలెను. 17. ముద్రవేసిన లెక్కలపుస్తకములతోను, ముద్రవేసిన ఆదాయశేష భాండములతోను వచ్చిన అధికారులను పరస్పరము సంభాషించనీయక ఒకచోట ఉండునట్లు నియమించవలెను. 18. ఆయవ్యయనీవుల మొత్తమును విని నీవిని కోశములో చేరవేయవలెను. 19. లెక్కల పుస్తకములోని లోపలిఅకులోని ఆయమును ఎంతవరకు హెచ్చించవచ్చునో దానికి ఎనిమిదిరెట్లు, వ్యయమును ఎంతవరకు తగ్గించవచ్చునో దానికి ఎనిమిదిరెట్లు అధికారివద్దనుండి వసూలు చేయవలెను. 20. దీనికి భిన్నమైన పరిస్థితిలో లాభమును అధికారి ఉంచుకొనవచ్చును.

21. నకాలమున హాజరుకాని అధికారులు, హాజరైనను లెక్కల పుస్తకములను నీవులను తీసికొనిరాని అధికారులు వారియ్యవలసినదానికంటె పదిరెట్లు ఎక్కువగ దండము చెల్లించవలెను.

22. కార్యాధికారులు హాజరైనప్పుడు వారిలెక్కలను పరీక్షించుటకు అక్షపటలాధ్యక్షుడు సిద్ధముగ లేనియెడల కనిష్ఠ సాహసదండము విధించవలెను. 23. విపర్యయ పరిస్థితిలో కార్యాధికారి రెండింతల దండమునకు పాత్రుడగును.

24. ఉన్నతాధికారులు పరస్పర వైరుధ్యములేనివారై వారివారి ప్రచారమునకు అనుగుణముగ వారిలెక్కలను సమగ్రముగ నివేదించవలెను. 25. వారిలో పరస్పర విరుద్ధముగ నివేదించువాడు, అసత్యవాదము చేయువాడు ఉత్తమసాహస దండమును చెల్లించవలెను.

26. రోజువారీ లెక్కలపుస్తకమును తీసుకొనిరాని అధికారికై ఒకనెలరోజులు నిరీక్షించవలెను. 27. నెలరోజులు తర్వాత నెలనెలకు రెండువందల పణముల వృద్ధితో అతడు దండమును చెల్లించవలెను. 28. లిఖితమగు నీవిలో స్వల్పభాగమును తీసుకొనిరాని అధికారికి అయిదురోజుల గడువు ఇయ్యవలెను. 29. దానిని అతడు ముందుగకోశములో చెల్లించి, రోజువారీ లెక్కలను అయిదురోజులు గడచిన తర్వాత తీసుకొనివచ్చిన పక్షమున (అనుమానాస్పదమగు) అతని వ్యవహారమును

---

[13] అజ్ఞానమునకు ఒకపణమైన యెడల సోమరితనమునకు రెండుపణములు, ప్రమాదమునకు మూడుపణములు అని వరుసగా గ్రహించునది.

[14] కౌటిల్యుడు అతిని వర్జించి మధ్యమార్గము ననుసరించు స్వభావము కలవాడనుటకిది నిదర్శనము.

ధర్మమును వ్యవహారమును ఆచారమును రాజశాసనములను అనుసరించియు, అతడు వాస్తవముగ చేసిన పనినిబట్టియు, ఊహాగానముచేసియు, గూఢచారుల ఉపయోగించియు శోధించవలెను.

30. అతడు ఒక్కొకరోజు, అయిదేసిరోజులు, ఒక్కొకపక్షము, ఒక్కొక నెల, నాలుగేసినెలలు, సంవత్సరముల వారిగా లెక్కలను తనిఖీ చేయవలెను. 31. రోజువారీలెక్క, దేశము, కాలము, ముఖము, ఉత్పత్తి, అనువృత్తి,[15] ప్రమాణము, చెల్లించువాడు, చెల్లించవలసినవాడు, వ్రాయసగాడు, పుచ్చుకొనువాడు— వీటినిబట్టి ఆయమును తనిఖీచేయవలెను. 32. రోజువారీలెక్క, దేశము, కాలము, ముఖము, లాభము, కారణము, ఇయ్యబడినవస్తువు, దాని వినియోగము, ప్రమాణము, (ఇయ్యవలసినదని) ఆజ్ఞాపించువాడు, దానిని (కోష్ఠాగారమునుండి) తీయువాడు, ఇచ్చువాడు, తీసుకొనువాడు—వీటినిబట్టి వ్యయమును తనిఖీ చేయవలెను. 33. రోజువారీలెక్క, దేశము, కాలము, ముఖము, అనువర్తనము, వస్తువు, దాని లక్షణములు, ప్రమాణము, నిక్షేపభాండము, దానిరక్షకుడు—వీటినిబట్టి నీవిని తనిఖీ చేయవలెను.

34. రాజవ్యవహారమందు (కారణికుడు) లెక్కల అధికారి లెక్కల తనిఖీకి సిద్ధముగ లేనప్పుడును, రాజాజ్ఞను ఉల్లంఘించినప్పుడును, లిఖితమైన ఆజ్ఞకు విరుద్ధముగ ఆయవ్యయములను మార్చినప్పుడును పూర్వసాహస దండమును విధించవలెను.

35. పద్దును క్రమహీనముగగాని, తప్పుక్రమమునగాని, అక్షరములు తెలియనట్లుగగాని, పునరుక్తముగగాని వ్రాసినవానికి దండము పండ్రెండు పణములు. 36. నీవిని ఈవిధముగ వ్రాయువానికి దండము రెండింతలు. 37. దానిని అపహరించువానికి ఎనిమిదింతలు. 38. దానిని పోగొట్టినవాడు ప్రత్యామ్నాయమునేగాక ఖరీదులో అయిదవవంతునుకూడ ఇచ్చుకొనవలెను. 39. అసత్యమాడినవాడు దొంగతనమునకు విధించుదండమును ఇచ్చుకొనవలెను. 40. తర్వాత తనతప్పును ఒప్పుకొనిన పక్షమునను, మరచినపద్దును తర్వాత వ్రాసినపక్షమునను దండము రెండింతలు.[16]

41. (శ్లో) అపరాధము స్వల్పమైనప్పుడు రాజు దానిని సహించవలెను; ఆదాయము అల్పమైనను తృప్తి చెందవలెను. అధికలాభమును చేకూర్చిన అధ్యక్షుని అనుగ్రహించి గౌరవించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున అక్షపటలమందు లెక్కల సంవిధానము అనే ఏడో అధ్యాయము.

---

[15] అనువృత్తి : లెక్కల పుస్తకములో ఒకపుటలోని ఆఖరిపద్దును తర్వాతిపుటలోని మొదటిపద్దుగ వ్రాయుట. దీనికి (Bringing Forward) అని ఈకాలపు వ్యవహారము.

[16] సాహసదండమునకు రెండింతలని గ్రహించవలెను.

# రెండో అధికరణము

## అధ్యాయము 8

### ప్రకరణము 26 : ఉద్యోగులు అపహరించిన ధనమును తిరిగిరాబట్టుకొనుట

1. సమస్త కార్యములకు కోశము మూలము. 2. అందుచేత రాజు ప్రప్రథమమున కోశమును గురించి జాగ్రత్తపడవలెను.

3. (ఆరంభించిన) కార్యముల సమృద్ధి,[1] ఆచారములయందు గౌరవము. చోరుల నిర్మూలనము, ఉద్యోగులను అదుపులో ఉంచుట, సస్యసంపద, పణ్యవస్తువుల బాహుళ్యము, ఈతిబాధల నుండి రక్షణ, పరిగ్రహములను తగ్గించుట, రొక్కమురూపమగు కానుకలు — ఇవికోశవృద్ధి సాధనములు.

4. ప్రతిబంధము, ప్రయోగము, వ్యవహారము, అవస్తారము, పరిహాపణము, ఉపభోగము, పరివర్తనము, అపహారము—ఇవి కోశక్షయ కారణములు.

5. (ఆరంభించిన) కార్యమును పూర్తిచేయకపోవుట, దానిఫలితమును రాబట్టక పోవుట, కోశములో (దానిని) చేర్చకుండుట—ఇది ప్రతిబంధము. 6. దీనికి దండము (మొత్తములో) పదోవంతు.

7. కోశములోని వస్తుసామగ్రిని వడ్డీకి అప్పుగ ఇచ్చుట ప్రయోగము. 8. అట్టి వస్తుసామగ్రిని వ్యాపారమునకై వినియోగించుట వ్యవహారము. 9. వీటికి దండము ఫలితమునకు రెండింతలు.

10. (వసూలు) వాయిదాతేదీని వాయిదాతేదీకానట్లును, కాని దానిని అయినట్లును లిఖించుట అవస్తారము. 11. దీనికి దండము అయిదోవంతు.

12. నిర్ణయింపబడిన ఆదాయమును తగ్గునట్లుచేయుట, వ్యయమును హెచ్చగునట్లు చేయుట—ఇది పరిహాపణము. 13. దీనికి దండము నష్టమునకు అయిదింతలు.

---

[1] కార్యముల సమృద్ధి అనగా ఆరంభించిన కార్యములు ఫలించి, ఆదాయము సమృద్ధిగ లభించుట.

14. రాజ ద్రవ్యమును స్వయముగతాను అనుభవించుట, లేదా, ఇతరుల చేత అనుభవింపజేయుట ఉపభోగము. 15. దీనికి దండము రత్నోపభోగముల విషయమున మరణము, ఎక్కువ విలువగల వస్తువులవిషయమున మధ్యసాహస దండము, తక్కువవిలువగల వస్తువులవిషయముననూ కుప్యముల విషయముననూ వాటినితిరిగిఇచ్చివేయుటయు, వాటిఖరీదుకు సమానముగ దండమును.

16. రాజ ద్రవ్యముల స్థానమందు ఇతర ద్రవ్యములను తెచ్చిపెట్టుట పరివర్తనము. 17. ఉపభోగముల దండనియమములే ఇచ్చటకూడ పాటించవలెనని గ్రహించునది.

18. లభించిన ఆయమును (కోశములో) చేర్చకపోవుట, లిఖితపూర్వకమైన వ్యయమును చెల్లించకపోవుట, నీవిని గ్రహించలేదనుట—ఇది అపహారము. 19. దీనికి దండము మొత్తమునకు పండ్రెండింతలు.

20. (రాజ ద్రవ్యమును) అధికారులు హరించు మార్గములు నలభై. 21. ముందు లభింపవలసినదానిని తర్వాత సమకూర్చుట, తర్వాత రావలసినదానిని ముందుగనే సమకూర్చుట, సాధించవలసిన కార్యమును సాధించక పోవుట, సాధించకూడనిదానిని సాధించుట, సిద్ధించినదానిని సిద్ధించనట్లు, సిద్ధించనిదానిని సిద్ధించినట్లు, అల్పముగ సిద్ధించినదానిని అధికముగ సిద్ధించినట్లు, అధికముగ సిద్ధించినదానిని అల్పముగ సిద్ధించినట్లు, ఒక సాధనమున సిద్ధించినదానిని వేరొక సాధనమున సిద్ధించినట్లు చెప్పుట ; చెల్లించవలసినదానిని చెల్లించకపోవుట, చెల్లింప కూడనిదానిని చెల్లించుట, సకాలములో చెల్లించకపోవుట, అకాలమందు చెల్లించుట, చెల్లించినది స్వల్పమైనను అధికముగను, అధికమైనదానిని అల్పముగను, ఒకటి ఇచ్చి ఇంకొకటి ఇచ్చినట్లును, ఒకనికిఇచ్చి వేరొకనికి ఇచ్చినట్లును, కోశములో చేర్చినదానిని చేర్చనట్లును, చేర్చనిదానిని చేర్చినట్లును చెప్పుట ; ఖరీదు పుచ్చుకొన్న కుప్య ద్రవ్యమును (కొన్నవానికి) ఇయ్యక పోవుట, పుచ్చుకొననిదానిని ఇచ్చివేయుట, ఒకచోట ఉన్న ద్రవ్యమును పలుచోట్ల ఉన్నట్లు, పలుచోట్ల ఉన్నదానిని ఒకేచోట ఉన్నట్లుచెప్పుట ; ఎక్కువవిలువగలవస్తువును తక్కువ విలువగలదానికి మార్చుట, తక్కువ విలువగలదానిని ఎక్కువ విలువగలదానిగామార్చుట, ధరను పెంచుట, దానినితగ్గించుట, సంవత్సరములోని మాసములలో ఒకదానికి ఇంకొకటి వ్రాయుట, మాసములోని రోజులలో ఒకదానికి ఇంకొకటి వ్రాయుట ; ఆయ మూలమును గురించి వైషమ్యము,[2] ముఖమునుగురించి వైషమ్యము, కార్యమును గురించి వైషమ్యము, కార్మికులగురించి వైషమ్యము, కార్యనిర్వాహకముగురించి వైషమ్యము, మొత్తమును గురించి వైషమ్యము, గుణవైషమ్యము, ధరలలో

[2] వైషమ్యమనగా సత్యమునకు విరుద్ధమగు వ్రాత. లెక్కల పుస్తకములలో ఈవిధముగ అధికారులు ఒక దానికి బదులు ఇంకొకటి వ్రాసి రాజద్రవ్యమును అపహరించుచుండువారు.

వైషమ్యము, తూకములలో వైషమ్యము, మానములలో వైషమ్యము, భాండము లలో వైషమ్యము.

22. ఇట్టి విషయములలో అతడు క్రింది అధికారిని, భండారిని, వ్రాయస గానిని, పుచ్చుకొనువానిని, చెల్లించువానిని, చెల్లింపుమని ఆజ్ఞాపించువానిని, సలహా దారుని, సహాయకారుని వేర్వేరుగ ప్రశ్నించవలెను. 23. వీరిలో మిథ్యావాదము చేయువారికి అధికారిపై విధించు దండమునే విధించవలెను. 24. "ఆ అధికారి మూలమున నష్టపడినవారందరు నాకు తెలియపరచవలెను," అని తన ప్రచార సంబంధముగ ప్రకటించవలెను. 25. తెలియపరచినవారికి నష్టానుసారము పరిహార మియ్యవలెను.

26. అధికారిపై ఆరోపణలు అనేకములున్నప్పుడు అతడు తానునిర్దోషి యనివాదించినను వాటిలో ఏఒకటిఅయినను రుజువైనయెడల అన్నిటికినీ బాధ్యుడు కావలెను. 27. కొన్నిటిని ఒప్పుకొన్నను అన్నిటివిషయమై అతనిని విచారణ చేయవలెను. 28. అత్యధికధనము నపహరించినప్పుడు స్వల్పభాగము రుజువైనను మొత్తమునకంతకు అతడు బాధ్యుడగును.

29. (అపహరణ) రహస్యమును బయలుపెట్టినవానికి అధికారికోపమునకు గురికాకుండునట్లు హామీఇచ్చి, అపహరణము రుజువైనపక్షమున అరవవంతును, అతడు ప్రభుత్వభృత్యుడైనయెడల పండ్రెండవవంతును బహూకరించవలెను. 30. అధికధనాపహరణ విషయమున అల్పభాగముమాత్రమే అపహరించినట్లు రుజువైనయెడల ఆభాగములో ఒకవంతు అతనికి చెందవలెను. 31. రుజువుకాని పక్షమున శరీరదండమునకుగాని ధనదండమునకుగాని అతడుపాత్రుడగును. అతనిని ఏవిధమునకూడ అనుగ్రహించరాదు.

32. (శ్లో) కాని, అపహరణాభియోగము రుజువగుచున్న సమయములో అతడు అధికారి ప్రోత్సాహమునకు లొంగి అభియోగమును వదలినను, కనుపించ కుండుటకు ప్రయత్నించినను మరణదండమునకు పాత్రుడగును.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున ఉద్యోగులు[3] అపహరించిన ధనమును తిరిగిరాబట్టుకొనుట అనే ఎనిమిదో అధ్యాయము.

---

[3] ఉద్యోగులను నమ్మరాదు. వారు లంచగొండులు. రాజద్రవ్యము నపహరించుటకు నిన్నెన్ని మార్గములుండునో వానినన్నిటిని అనుసరించువాడు—ఇదీ కౌటిల్యుని అభిప్రాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 9

### ప్రకరణము 27 : ఉద్యోగులపై పర్యవేక్షణ

1. అమాత్యులకుండవలసిన అర్హతలన్నిటిని గలవారై అధ్యక్షులందరు వారి వారి సామర్థ్యమునుబట్టి కార్యములలో నియోగింపబడవలెను. 2. మానవులు చంచలచిత్తులు కనుక, రాజు నిత్యము వీరి కార్యములను పర్యవేక్షించుచుండవలెను. 3. మనుష్యులు గుర్రముల లక్షణములు కలవారుగదా? అందుచేత కార్యములందు నియుక్తులైనప్పుడు వికారమును పొందెదరు. 4. కనుక అతడు కార్యముల విషయములో కార్యకర్త, కార్యశాఖ, ప్రదేశము, కాలము, కార్యస్వభావము, పెట్టుబడి, లాభము––(వీటిని అన్నిటినీ) తెలుసుకొనవలెను.

5. వీరందరు కలియక, తమలోతాము కలహించక, రాజాజ్ఞానుసారము వారి కార్యములను కొనసాగించవలెను. 6. అందరు కలిసిన పక్షమున ఫలితమును భక్షించివేయుదురు; కలహించిన పక్షమున నాశము గావించెదరు. 7. రాజునకు తెలియపరచక ఆపత్ప్రతీకారములను తప్ప తక్కిన కార్యములలో దేనినికూడ వారు ప్రారంభించరాదు.

8. వారిలో జాగరూకత లోపించినప్పుడు వారి దినవేతనమునకును ఇతరములైన ఖర్చులకును రెండింతల దండమును విధించవలెను. 9. వారిలో ఆజ్ఞానుసారముగ గాని అంతకంటె లాభకరముగ గాని కార్యమును నిర్వహించినవాడు (ఉన్నత) స్థానగౌరవములను పొందవలెను.

10. స్వల్పజీతపు ఉద్యోగి అధికవ్యయము చేయుచున్న పక్షమున[1] (రాజ

---

[1] ప్రస్తుతకాలమున ఇట్టివారనేకులున్నారు. ఉద్యోగులుగ వారి జీతములు స్వల్పమైనను వారనుభవించు భోగములు అత్యధికములు. వారలు లంచగొండు లని ప్రభుత్వధనమును అపహరించువారని భావించుటకు ఇది ప్రబల నిదర్శనము. ఇది ఇప్పటి అనుభవము మాత్రమే కాదు. కౌటిల్యునినాటి అనుభవము కూడ.

ద్రవ్యమును) భక్షించుచున్నాడు. 11. "దీనికి విరుద్ధముగ ప్రవర్తించువాడును జీతమున కనుగుణముగ వ్యయముచేయువాడును భక్షించడు" అని ఆచార్యులు. 12. "గూఢపురుషుల సాధనముననే దీనిని తెలుసుకొనవలె"నని కౌటిల్యుడు.

13. ఎవడు రాజాయమునకు నష్టము కలిగించుచున్నాడో వాడు రాజద్రవ్యమును భక్షించుచున్నాడు. 14. వాడు అజ్ఞానాదులవలన నష్టము కలిగించిన పక్షమున, (రాజు) తగువిధమున (నష్టమునకు) కొన్నిరెట్లు ఎక్కువగ అతడు (పరిహారమును) చెల్లించునట్లు చేయవలెను. 15. ఎవడు రాజాయమును రెండురెట్లు పెంచుచున్నాడో వాడు జనపదమును[2] భక్షించుచున్నాడు. 16. వసూలుచేసిన దంతను అతడు రాజునకు చేర్చినయెడల అతడుచేసిన అపరాధము స్వల్పమైనప్పుడు వానిని మందలించవలెను; అధికమైనయెడల అపరాధానుసారము శిక్షించవలెను. 17. ఎవడు లభించిన ఆదాయమునంతను వ్యయమైనట్లు చూపుచున్నాడో వాడు మనుష్యుల కార్యములను భక్షించుచున్నాడు. 18. పనిచేయవలసిన రోజులలోను వస్తువుల ఖరీదులలోను కార్మికుల వేతనములలోను నష్టము కలిగించినప్పుడు అపరాధానుసారము అతనిని శిక్షించవలెను.

19. కనుక, ఎవడు రాజాజ్ఞానుసారము ఏదైన ఒక ప్రత్యేక శాఖలో అధికారిగ నియమింపబడుచున్నాడో అతడు వానికి (రాజునకు) ఆ పనియొక్క సత్యస్వభావము, దానికి సంబంధించిన ఆయవ్యయములను విడివిడిగాను మొత్తముగాను తెలియపరచవలెను.

20. మూలహరుని, తాదాత్వికుని, కదర్యుని అతడు ప్రతిషేధించవలెను. 21. తండ్రితాతలనుండి సంక్రమించిన ధనమును న్యాయవిరుద్ధముగ ఖర్చుపెట్టువాడు మూలహరుడు. 22. గడించినదానినంతను వెంటనే ఖర్చుపెట్టువాడు తాదాత్వికుడు. 23. ఎవడు తనమీద ఆధారపడినవారినీ తన్నూ బాధలకు పాలుచేసి ధనమును కూడబెట్టుచున్నాడో వాడు కదర్యుడు (పిసినికొట్టు). 24. ఇట్టివానిమీద అనేకులు ఆధారపడియున్నయెడల ఇతని ఆస్తిని తీసుకొనరాదు; ఇట్లుకానిపక్షమున తీసుకొనవలెను.

25. ఎవడు అధికాయమునకు అధికారిగ నియమింపబడినను కదర్యుడై ఆయమును తనఇంటియందు దాచుకొనుచున్నాడో; లేదా, పౌరజానపదులకు నిలవలుగ ఇచ్చుచున్నాడో; లేదా, శత్రుదేశములకు పంపివేయుచున్నాడో, వాని సలహాదారులను, మిత్రులను, భృత్యులను, బంధువులను, అతని వస్తువుల రాకపోకలను ఒక గూఢచారి కనుగొనవలెను. 26. శత్రుదేశమందు సంచరించు అతని (ఆ అధికారి) భృత్యునికి విశ్వాసపాత్రుడై అతని రహస్యమును తెలుసుకొనవలెను. 27. సమస్తము

---

[2] అట్టివాడు రాజును మెప్పించు ఉద్దేశముతో శాసన విరుద్ధముగ పన్నులను వసూలుచేసి జనపదములోని ప్రజలను పీడించును. అందుచేత అతడు శిక్షార్హుడు.

తెలిసిన తర్వాత, శత్రువు (అధికారికి) ఉత్తరమును పంపెనను మిషతో అతనిని చంపించవలెను.

28. కావున, సంఖ్యాయకులు (లెక్కల తయారుచేయువారు), లేఖకులు, రూపదర్శకులు (నాణెములను పరీక్షించువారు), నీవీగ్రాహకులు (శేషించిన నిలవలను కోశములో గ్రహించువారు), ఉత్తరాధ్యక్షులు (పర్యవేక్షణ చేయువారు) మున్నగువారితోకూడి అధ్యక్షులు వారి పనులను నిర్వహించవలెను. 29. ఏనుగులను, గుర్రములను, రథములను ఆరోహించువారు ఉత్తరాధ్యక్షులు.[3] 30. శిల్పశౌచసంపన్నులగు వారి సహచరులు గూఢచారులై సంఖ్యాయకాదులను శోధించుచుండవలెను.

31. అనేక ముఖ్యులతో కూడినట్లుగ ఒక్కొక్క పరిపాలన శాఖను స్థాపించవలెను. వారి ఉద్యోగము శాశ్వతమైనట్టిది కారాదు.

32. (శ్లో) నాలుకపైఉండు తేనెనుగాని విషమునుగాని రుచిచూడకుండుట ఎట్లు సాధ్యముకాదో, అట్లే రాజద్రవ్యముతో సంబంధముకలవానికి దానిలో అల్పభాగమునైనను రుచి చూడకుండుట సాధ్యము కాదు.

33. (శ్లో) నీటిలో చరించు చేపలు ఎప్పుడు నీటిని త్రాగునో తెలుసుకొనుట సాధ్యముకానట్లు, కార్యముల నిర్వహణకై నియోగింపబడిన అధికారులు ఎప్పుడు (రాజ) ద్రవ్యమును అపహరింతురో తెలుసుకొనుట సాధ్యము కాదు.

34. (శ్లో) ఆకాశమున ఎగురుచుండు పక్షుల గమనమునైనను తెలుసుకొనవచ్చునుగాని, ప్రచ్ఛన్నభావములతో సంచరించు అధికారుల మార్గములను తెలుసుకొనుట సాధ్యము కాదు.

35. (శ్లో) (శాసనవిరుద్ధముగ) ధనమును కూడబెట్టినవారు దానిని తిరిగి ఇచ్చివేయునట్లు చేసి, వారిని కార్యాంతరములలో నియోగించవలెను. వారు రాజధనమును భక్షించకుండుటకును, భక్షించినదానిని వమనము చేయుటకును ఇదియే సాధనము.

36. (శ్లో) ఎవరు (రాజు) ధనమును భక్షించరో, ఎవరు దానిని న్యాయానుసారముగ వృద్ధిచేయుదురో, అట్టివారు రాజునకు ప్రియమును హితమును చేయుటయందు అనురక్తులు; కావున, వారిని వారి అధికారపదవులందు శాశ్వతముగ నియమించవలెను.

ఇది అధ్యక్ష ప్రచారమను రెండో అధికరణమున ఉద్యోగులపై పర్యవేక్షణ అనే తొమ్మిదో అధ్యాయము.

---

[3] ఇవి అట్టి పదవులలో నుండువారుమాత్రమే అనుభవించదగిన రాజమర్యాదలు.

# రెండో అధికరణము

## అధ్యాయము 10

### ప్రకరణము 28 : శాసనాధికారము[1]

1. శాసనమనగా రాజాజ్ఞ అని పెద్దలు చెప్పెదరు. 2. ఏలయన, సంధినిగ్రహములకు శాసనములు మూలమగుటచేత రాజులు శాసనప్రధానులు.

3. కనుక, అమాత్యునికి ఉండవలసిన అర్హతలు ఉన్నవాడు, ఆచారములన్నిటిని ఎరిగినవాడు, వడిగా వాక్యరచనము చేయగలవాడు, మంచివ్రాయసగాడు, ఉత్తరముల చదువుటయందు సమర్థుడు—ఇట్టివాడు లేఖకుడు కావలెను.

4. ఇతడు రాజాజ్ఞను శ్రద్ధగావిని, (వినినదాని) అర్థము స్పష్టముగ తెలియునట్లు లేఖను వ్రాయవలెను. రాజునకు[2] వ్రాయులేఖలో దేశము, స్వామ్యము, వంశము, నామధేయములను, రాజుకానివానికి వ్రాయులేఖలో దేశము నామధేయములను పేర్కొనవలెను.

5. ప్రతివిషయములో జాతి, కులము, స్థానము, వయస్సు, విద్య, వృత్తి, ఆస్తి, శీలము, దేశము, కాలము, వివాహసంబంధము మున్నగువాటిని సమీక్షించి పురుషానుగుణముగ లేఖనువ్రాయవలెను.

6. అర్థక్రమము, సంబంధము, పరిపూర్ణత, మాధుర్యము, ఔదార్యము, స్పష్టత్వము—ఇవి లేఖకు ఉండవలసిన గుణములు. 7. ప్రధానవిషయమును మొదటవివరించి, విషయములన్నిటిని చక్కగ క్రమబద్ధము చేయుటయే అర్థక్రమము. 8. లేఖలో మొదటినుండి ఆఖరువరకు పూర్వాపరవిషయములలో పరస్పర వైరుధ్యములేకుండుట సంబంధము. 9. విషయమందు, మాటలందు,

---

[1] అధ్యాయమునకు శాసనాధికారమను పేరు పెట్టబడినను ఇందు 'లేఖను' అనగా రచనా పద్ధతిని గురించి వివరింపబడినది. రచన ఎట్టిదైనను దానికి ఉండవలసిన గుణములు (సంపదలు) ఉండరాని దోషములు చెప్పబడినవి.

[2] ఈశ్వరుడు అనిమూలము.

అక్షరములందు హెచ్చుతగ్గులు లేకుండుట, చెప్పవలసినవిషయమును హేతువు లయు ఉదాహరణములయు దృష్టాంతములయు మూలమునను, మాటలఅర్థస్ఫూర్తి మూలమునను పూర్తిగ వివరించుట పరిపూర్ణత. 10 రంజింపజేయు అర్థమును సులభముగ తెలియపరచుమాటలతో చెప్పుట మాధుర్యము. 11. గ్రామ్యములుకాని మాటలనువాడుట ఔదార్యము. 12. ప్రతీతిగల మాటలను వాడుట స్పష్టత్వము.[3]

13. అకారాదివర్ణములు అరవైమూడు. 14. వర్ణసముదాయము పదము. 15. అది నామము, ఆఖ్యాతము, ఉపసర్గ, నిపాత అని నాలుగువిధములు. 16. వీటిలో నామము ఉన్నదానిని చెప్పునట్టిది. 17. విశిష్టమైనలింగములేనిదై, కార్యమును సూచించునది ఆఖ్యాతము (క్రియాపదము). 18. క్రియావిశేషకము లగు 'ప్ర' మొదలైనవి ఉపసర్గలు. 19. 'చ' మొదలైన అవ్యయములు నిపాతలు. 20. అర్థసమాప్తితో కూడిన పదసమూహము వాక్యము. 21. ఒకమాటకు తగ్గక మూడుమాటలకు మించక తక్కిన మాటల అర్థముతో వైరుధ్యములేకుండునట్లు వర్గమును కూర్చవలెను.[4]

22. లేఖను "ఇతి" అను మాటతోను, "వాచికం అస్యేతి" అను మాటల తోను[5] పూర్తిచేయవలెను.

23-24. నింద, ప్రశంస, పృచ్ఛ (ప్రశ్న), ఆఖ్యానము (చెప్పుట), అర్థన (ప్రార్థన), ప్రత్యాఖ్యానము (లేదనుట), ఉపాలంభము (దూషణ), ప్రతిషేధము (నిషేధము), చోదన (ఆజ్ఞ), సాంత్వనము, అభ్యుపపత్తి (సహాయము), అభిభర్త్స నము (బెదరింపు), అనునయము—లేఖలోనివిషయములు ఈ పదమూడింటికి సంబంధించినవి.

25-37. ఒకని వంశశరీరకార్యములోని లోపములను చూపెట్టుట నింద; వాటిలోని గుణములను చూపెట్టుట ప్రశంస; "ఇది ఏలాగు?" అనుట పృచ్ఛ; "ఈలాగు," అనుట ఆఖ్యానము; "ఇమ్ము," అనుట అర్థన; "ఇయ్యను," అనుట ప్రత్యాఖ్యానము; "ఇది నీకుతగదు," అనుట ఉపాలంభము; "అలాగుచేయకు," అనుట ప్రతిషేధము; "ఈలాగుచేయవలెను," అనుట చోదన; "నేను నీవాడను, నాదిఅంతయు నీది," అనుట సాంత్వనము; కష్టకాలములందు సహాయము

---

[3] 6–12 సూత్రములను అలంకార శాస్త్ర గ్రంథములనుండి కౌటిల్యుడు గ్రహించెననియు, ఇట్టి గ్రంథములు మధ్యయుగమునాటి వనియు, అందుచేత కౌటిల్యుడుకూడ మధ్యయుగమువాడే గాని ప్రాచీనుడుకాడనియు కొందరు పాశ్చాత్యులవాదము. కాని ఈ సూత్రములలోని విష యములు అలంకార గ్రంథములనుండి గ్రహించినవనుటకు ఆధారములులేవు. ఇవి బహు ప్రాచీనములు.

[4] వర్గమనగా సమాసమని కొందరు వ్యాఖ్యాతలు. 15 వ సూత్రములోని విభాగము పాణిని నుండి గాక అతనికంటె ప్రాచీనమగు బృహద్దేవత, నిరుక్తములనుండి గ్రహింపబడినది.

[5] లేఖతోపాటు నోటికబురును పంపినప్పుడు ఈ మాటలను వాడవలెనని కొందరు వ్యాఖ్యాతలు.

అభ్యుపపత్తి; భవిష్యత్తులో సంభవించనున్న ప్రమాదములను సూచించుట అభిభర్త్సనము; కార్యార్థమై చేసినది, వాగ్దానమును చెల్లించలేక పోయినప్పుడు చేసినది, కష్టకాలములందు చేసినది—అని అనునయము మూడువిధములు.

38. ప్రజ్ఞాపనము, ఆజ్ఞ, పరిదానము, పరిహారము, నిసృష్టి, ప్రావృత్తికము, ప్రతిలేఖ, సర్వత్రగము—అని లేఖలు వివిధములు.

39. "ఈతడు విజ్ఞాపనము చేసుకొన్నాడు; ఇతడు ఇట్లు చెప్పినాడు. ఇందులో సత్యమున్న పక్షమున వీనికి దీని నియ్యవలెను." "రాజసమక్షమున ఇతడు మంచికార్యమొకదానిని గురించి పలికినాడు"—ఇట్టిది ప్రజ్ఞాపనలేఖ. ఇది అనేక విధములు.

40. నిగ్రహానుగ్రహములను గురించిన—అందును ప్రధానముగ భృత్యులకు సంబంధించిన—రాజాజ్ఞతో కూడినట్టిది ఆజ్ఞాలేఖ.

41. కష్టకాలమందుగాని, దానముచేయునప్పుడుగాని, వారివారి గుణములకు తగినట్లుగ రాజుచేత చేయబడిన సత్కారమును తెలియపరచులేఖ పరిదానలేఖ.

42. రాజాజ్ఞాసాధనమున వివిధములగు జాతులు, పురములు, గ్రామములు, దేశములు పొందిన అనుగ్రహమును ప్రకటించులేఖను విజ్ఞులు పరిహారలేఖ అని పేర్కొనుచున్నారు.

43. కార్యనిర్వహణ విషయమునగాని, ఆజ్ఞలను జారీచేయు విషయమునగాని, ఉద్యోగులకు రాజుచేయు అధికారదానమును ప్రకటించులేఖ నిసృష్టిలేఖ.

44. వివిధములగు దైవసంఘటనల మూలమునను మనుష్యప్రవృత్తుల మూలముననుసంభవించునట్టివి—అనిప్రమాదములురెండురకములు. వీటిని ఎదుర్కొనుటకై రాజుచే చేయబడిన ప్రతిక్రియలను ప్రకటించులేఖ ప్రావృత్తికము.

45. (ఇతరులువ్రాసిన) లేఖను ఉన్నది ఉన్నట్లుగాచూచి, తర్వాత దానిని చదివి, రాజుచెప్పినమాటలలోనే దానికి జవాబులు వ్రాయవలెను. అట్టిలేఖ ప్రతిలేఖ.

46. ప్రయాణికులకు రక్షణను ఇతరసదుపాయములను కల్పించవలయునని రాజపుత్రులకును అధికారులకును రాజుచేయు ఆదేశము సర్వత్రగము. అది రహదారులయందును దేశమందును సర్వత్ర తెలియతగ్గది.[6]

47. సామము, ఉపప్రదానము, భేదము, దండము—అనిఉపాయములు.

---

[6] ఈ అధ్యాయములో వివరింపబడిన విషయములన్నియు సంస్కృతభాషకు సంబంధించిన వనియు, మౌర్యచక్రవర్తుల కాలమున ప్రాకృతభాష అధికార భాషగనుండెననియు, తర్వాతి కాలముననే సంస్కృతము రాజభాషఅగుట జరిగెననియు, అందుచేత కౌటిల్యుడు చంద్రగుప్త మౌర్యుని కాలమునకు చెందినవాడు కాడనియు, తర్వాతివాడనియు కొందరివాదము. కాని ఇది బలములేని వాదము. మౌర్యుల కాలమునకు పూర్వమునకూడ సంస్కృతము అధికార భాషగ నుండెను. ధర్మశాస్త్ర గ్రంథములన్నికాలములలో సంస్కృతముననే వ్రాయబడెను. అశోకుడు గౌతమబుద్ధునివలె మతప్రచారమునకు మాత్రమే ప్రాకృతమును వాడినట్లు తోచుచున్నది

48. వాటిలో గుణసంకీర్తనము, సంబంధోపాఖ్యానము, పరస్పరోపకార సందర్శనము, ఆయతిప్రదర్శనము, ఆత్మోపనిధానము—అని సామము అయిదు విధములు. 49. వీటిలో, (ఇతరుని) వంశము, శరీరము, కార్యనిర్వహణము, స్వభావము, విద్య, ఆస్తి మొదలగువాటియొక్క గుణగ్రహణము, ప్రశంస, స్తుతి— ఇట్టిది గుణసంకీర్తనము. 50. జ్ఞాతిసంబంధము, వివాహసంబంధము, ఒకే గురువుల మూలమునను పురోహితుల మూలమునను ఏర్పడినసంబంధము, (సమానమైన) కులము, హృదయము (అభిమానము), (సమానమైన) మిత్రుడు – ఈ అన్నిటినిగురించిన) ప్రశంస సంబంధోపస్థానము. (సామములో రెండోవిధము). 51. స్వపక్షపరపక్షముల అన్యోన్యోపకార సంకీర్తనము పరస్పరోపకార సందర్శనము (సామములో మూడోవిధము). 52. "దీనిని ఇట్లు చేసినయెడల మన ఇద్దరికి ఇట్టిఫలితము లభించును," అని భవిష్యత్తునుగురించి ఆశను లేవదీయుట ఆయతి ప్రదర్శనము (సామములో నాలుగోవిధము). 53. "నేను నీవాడను. నాసర్వస్వము నీవు నీపనులయందు ఉపయోగించుకొనవచ్చును," అనుట ఆత్మోపనిధానము (సామములో అయిదోవిధము).

54. ధనరూపమైన ఉపకారము ఉపప్రదానము.

55. శంకను కలిగించుట, బెదరించుట—ఇది భేదము.

56. వధ, బాధించుట, అర్థమును హరించుట—ఇది దండము.

57. అకాంతి, వ్యాఘాతము, పునరుక్తము, అపశబ్దము, సంప్లవము— అనునవి లేఖాదోషములు. 58. వీటిలో నల్లటిపత్రముపై వ్రాయుట, అక్షరములను అనాకర్షణీయముగను, హెచ్చుతగ్గులతోడను,కనుపించకుండునట్లుగను వ్రాయుట— అకాంతి. 59. పూర్వోత్తరవిషయములమధ్య వైరుధ్యముండుట వ్యాఘాతము. 60. ఒకపర్యాయము చెప్పినదానిని ఎట్టివిశిష్టతలేక ఇంకొక పర్యాయము చెప్పుట పునరుక్తి. 61. లింగవచనకాలకారికముల తప్పుప్రయోగము అపశబ్దము. 62. వర్గము చేయకూడనిచోట చేయుట, చేయవలసినచోట చేయక పోవుట, (శాసనమునకు ఉండవలసిన) ఇతర గుణములకు విపర్యాసము కలిగించుట— సంప్లవము.

63. (శ్లో) సమస్తశాస్త్రములను సమగ్రముగ పరిశోధించి, ప్రయోగమును కూడ పరిశీలించి, కౌటిల్యుడు రాజులకొరకు ఈ శాసనవిధిని రచించినాడు.[7]

ఇది అధ్యక్షప్రచారమను రెండోఅధికరణమున శాసనాధికారమనే పదో అధ్యాయము.

---

[7] అర్థశాస్త్రమును రచించినవాడు కౌటిల్యుడే అనుటకు ఈశ్లోకమొక ప్రధానాధారము.

# రెండో అధికరణము

## అధ్యాయము 11

### ప్రకరణము 29 : కోశములో దాచదగిన రత్నముల పరీక్ష

1. ఆయా వస్తువులవిషయమున నిపుణులైన అధికారులపై అధ్యక్షత వహించి, కోశాధ్యక్షుడు కోశములో దాచదగిన రత్నములను, ఎక్కువ విలువ గల వస్తువులను (సారములను), తక్కువవిలువగల వస్తువులను (ఫల్గులను), కుప్యములను ప్రతిగ్రహించవలెను.

2. తామ్రపర్ణి, పాండ్యకవాటము,[1] పాసిక,[2] కుల,[3] చూర్ణి,[4] మహేంద్రము కర్దమము,[5] స్రోతసి,[6] హ్రదము,[7] హిమవంతము—ఇవి ముత్తెములు లభించు ప్రదేశములు. 3. చిప్ప, శంఖము, ప్రకీర్ణకములు[8]—ఇవి ముత్తెముల జన్మస్థానములు.

4. మసూరాకారమున ఉండునవి, ముక్కోణమైనవి, తాబేటి ఆకారమున ఉండునవి, అర్ధచంద్రాకారమైనవి, పొరలుకలవి, రెండుగా కనిపించునవి, గీతలు పడ్డవి, నునుపులేనివి, మచ్చలున్నట్టివి, కమండలు రూపముకలవి, నల్లనివి, నీలివి, దుష్టరంధ్రములుకలవి—ఇవి అప్రశస్తములు. 5. పెద్దవి, గుండ్రమైనవి సమతలములేనట్టివి, కాంతిమంతమైనవి, తెల్లనివి, బరువైనవి, నున్నవైనవి, ఉండవలసినచోట రంధ్రములున్నవి—ఇవి ప్రశస్తములు.

---

1 ఇది పాండ్యదేశములోని మలయకోటిపర్వతము.

2 ఇది పాండ్యదేశములోని నది.

3 ఇది సింహళమున మయూరగ్రామ సమీపమున ఉండు నది.

4 ఇది కేరళదేశములోని నది.

5 ఇది ఉత్తరాపథములోని కర్దమానది అనికొందరు వ్యాఖ్యాతలు.

6 ఇది బర్బరదేశములోని నది.

7 ఇదికూడ బర్బరదేశములోని సరస్సు.

8 ఇతరములని అర్థము.

6. శీర్షకము,[9] ఉపశీర్షకము,[10] ప్రకాండకము,[11] అవఘాటకము,[12] తరళ ప్రతిబద్ధము,[13]—ఇవి సరములలోని భేదములు.

7. వేయిఎనిమిదిసరములుగలది ఇంద్రచ్ఛందము (అనుహారము). 8. అందులో సగము విజయచ్ఛందము. 9. అరవై నాలుగు సరములు అర్ధహారము. 10. ఏభైనాలుగు సరములు రశ్మికలాపము. 11. ముప్పైరెండు గుచ్ఛము. 12. ఇరవైఏడు నక్షత్రమాల. 13. ఇరవైనాలుగు అర్ధగుచ్ఛము. 14. ఇరవై సరములు మాణవకము. 15. అందులో సగము అర్ధమాణవకము. 16. మణిమధ్యమములు ఆయామాణవకములు అగుచున్నవి.[14]

17. శీర్షకములు మాత్రమే ఉన్న హారము శుద్ధము.[15] 18. తక్కినవి ఇట్టివే.[16] 19. మణిమధ్యమైనది అర్ధమాణవకము.

20. మూడో అయిదో పలకలుగలహారము పలకహారము.

21. ఒకటేసరముగలది శుద్ధఏకావళి. 22. అదే మణిమధ్యమైనప్పుడు యష్టి (అగుచున్నది). 23. బంగారము, మణులతోకూడినప్పుడు రత్నావళి.[17] 24. మధ్యమధ్య బంగారము, మణులు, ముత్తెములు ఉన్నప్పుడు అపవర్తకము. 25. బంగారుతీగెలో గ్రుచ్చినప్పుడు సోపానకము. 26. మణిమధ్యమైనప్పుడు మణిసోపానకము.

27-28. కోటి[18] (అనేప్రదేశము) నుండి, మాల [19] నుండి, సముద్రమునకు ఆవలనుండి మణులు లభించుచున్నవి.

29. ఎఱ్ఱతామరపువ్వురంగు, కుంకుమపువ్వురంగు, పారిజాతపుష్పపురంగు, బాలసూర్యునిరంగుగలకెంపు (సౌగంధికము). 30. నీలితామరపువ్వురంగు, దిరిసెన (శిరీష) పువ్వురంగు, నీలిరంగు, (పచ్చి) వెదురురంగు, చిలుకరెక్క రంగు, పసుపురంగు, గోమూత్రపురంగు, ఆవుకొవ్వురంగు గలది వైడూర్యము.

---

[9] మధ్య ఒకపెద్దముత్తెము, తక్కినవి ఒకేప్రమాణమైన చిన్నవి.

[10] మధ్య ఒక పెద్దముత్తెము, దానికి ఒక్కొకవైపున ఒకచిన్నది.

[11] ఒక పెద్దముత్తెము, దానికి ఒక్కొకవైపున రెండుచిన్నవి.

[12] మధ్య ఒక పెద్దముత్తెము, ప్రమాణములోతగ్గుచు తక్కినవి.

[13] ఒకే ప్రమాణమైన ముత్తెములతో కూడినట్టిది.

[14] మణిమధ్యమగు ఇంద్రచ్ఛందమునకు ఇంద్రచ్ఛందమాణవకము అనిపేరు.

[15] శీర్షకములు మాత్రమేఉన్న ఇంద్రచ్ఛందమునకు ఇంద్రచ్ఛందశీర్షకశుద్ధహారము అనిపేరు.

[16] అట్టి విజయచ్ఛందమునకు విజయచ్ఛందశీర్షక శుద్ధహారము అనిపేరు. తక్కిన వాటిని ఈవిధముగనే పేర్కొనవలెను.

[17] బంగారములో ముత్తెములనుగాని మణులనుగాని పొదిగినట్టిది.

[18] ఇది మలయమునకు సముద్రమునకు మధ్య ఉన్నది.

[19] 'మాల' మలయ దేశములోని ఒక భాగము.

కలది, పాత్రలపై గీతలుగీయకలది, కదురువలె గిరగిరతిరుగునది, ధగధగ మెరయునది—ఇట్టిది ప్రశస్తమగు వజ్రము. 41. కోణములులేనిది, అంచులులేనిది, ఒకవైపు ఒరిగినది—ఇట్టిది అప్రశస్తము.

42. అలకంద[27] వైవర్ణముల[28] నుండి లభించునట్టివి, ఎరుపుపద్మముల రంగులు కలవి, పుచ్చిపోనివి, సమమైన మధ్యభాగముకలవి — ఇట్టి పగడములు ప్రశస్తములు.

## చందనములు

43. సాతనదేశపు చందనము రక్తవర్ణము, భూమిగంధములు కలది. 44. గోశీర్షకచందనము నలుపుఎరుపు కలిసినట్టిది, చేపలవాసనవేయునట్టిది. 45. హరిచందనము చిలుకరెక్కరంగు, మామిడివాసన కలది; తర్ణసచందనముకూడ ఇట్టిదే. 46. గ్రామేరు చందనము రక్తవర్ణమో, రక్తకాళవర్ణమో కలదై మేక మూత్రము వాసనవేయును. 47. దేవసభనుండి లభించు చందనము ఎర్రనై తామర పువ్వు వాసనవేయును; జాపదేశపుచందనముకూడ ఇట్టిదే. 48. జోగదేశపుచంద నము రక్తవర్ణమో రక్తకాళవర్ణమో కలదై, నున్నగఉండును; తురూప చంద నముకూడ ఇట్టిదే. 49. మాలేయక చందనము తెలుపుఎరుపు కలిసినట్టిది. 50. కు చందనము మోటుగాను, అగురువలె నల్లగనో, ఎర్రగనో, ఎరుపు నలుపు కలిసి నట్టిదిగనో ఉన్నది. 51. కాళపర్వతచందనము ఎరుపు నలుపు కలిసినట్టిదిగనో, కుంకుమపువ్వురంగు కలదిగనో ఉన్నది. 52. కోశాగార పర్వతపు చందనము నల్ల గనో, రకరకపునల్లదనము కలదిగనో ఉన్నది. 53. శీతోదకప్రాంతపు చందనము పద్మపురంగుననో, నల్లగనో ఉన్నది. అది నున్నగ (కూడ) ఉండును. 54. నాగ పర్వతపు చందనము మోటుగానో, పాచిరంగుననో ఉండును. 55. శాకల ప్రాంతపు చందనము కపిలవర్ణము.

56. తేలికగనుండుట, నునుపు, ఎండిపోకుండుట, వెన్నవలె ఒంటికి రాచు కొనుటకు ఉపయోగపడుట, సువాసన, చర్మములోపలికి ఇంకిపోవుట, రంగును వాసనను కోల్పోకుండుట, వేడిని సహించుశక్తి, వేడిని తగ్గించుశక్తి, స్పర్శ సుఖము—ఇవి చందనగుణములు.

57. జోంగదేశపు అగురు నల్లగనో, రకరకములైన నలుపు రంగుతోనో, రకరకములైన గుండ్రని మచ్చలతోను ఉండును. 58. దోంగదేశపు అగురు శ్యామవర్ణముకలది. 59. సముద్రమునకు అవలనుండివచ్చు అగురు చిత్ర రూపము, ఉసిరికవాసననో, నవమాలిక వాసననో కలిగిఉండును.

60. బరువుగనుండుట, నునుపు, సువాసన, కడుదూరము వ్యాపించువాసన,

[27] లక్షద్వీపములని కొందరు.

[28] యవద్వీప ప్రాంతమని కొందరు.

అగ్నిని సహించగలుగుట, దట్టమైనపొగలేకుండుట, సమమైనవాసన గలిగియుండుట మర్దనమును సహించుట—ఇవి అగురు గుణములు.

61. తైలపర్ణికమను పరిమళద్రవ్యము—అశోక గ్రామమునకు చెందినది—మాంసవర్ణమును పద్మగంధమును కలిగినట్టిది. 62. జోంగకము రక్తపీత వర్ణము, ఉత్పలగంధమో గోమూత్రగంధమో కలిగినట్టిది. 63. గ్రామేరుకము నున్ననై గోమూత్రగంధము కలిగినట్టిది. 64. సువర్ణకుడ్యమునకు చెందినది రక్తపీత వర్ణమును మోతులుంగగంధమును కలిగినట్టిది. 65. పూర్ణకద్వీపమునకు చెందినది పద్మగంధమో నవనీత (వెన్న) గంధమో కలిగినట్టిది.

66. లౌహిత్యమునకు ఆవలనుండి లభించు భద్రశ్రీయము[29] జాతీపుష్పరంగుకలది. 67. అంతర్వతినుండి లభించునది ఉసిరికరంగుకలది. 68. ఈ రెండును కుష్ఠ[30] గంధముకలవి.

69. సువర్ణభూమినుండి లభించు కాలేయకము[31] నున్ననై పసుపురంగు కలది. 70. ఉత్తరపర్వతమునుండి లభించునది రక్తపీతవర్ణములు కలది.

ఇవి ఎక్కువ విలువగల వస్తువులు (సారములు).

71. ముద్దగాచేసినను, ఉడికించినను, వెలిగించినను, సువాసనను కోల్పోకుండుట, రంగు పోగొట్టుకొనకుండుట, ఇతరవస్తువులతో కలుపుటకు యోగ్యత కలిగియుండుట ; 72. చందనాగురు లక్షణములతో కూడియుండుట—ఇవి వీటి గుణములు.

73. కాంతనావకము, ప్రయ్యకము ఉత్తరపర్వతములనుండి లభించు చర్మములు. 74. కాంతనావకము నెమలికంఠపు రంగుకలది. 75. ప్రయ్యకము నీలి, పసుపు, తెల్లరేఖలతోను మచ్చలతోను చిత్రితమైనట్టిది. 76. ఈ రెండును ఎనిమిదిఅంగుళములపొడవు కలవి.

77. బిసియు, మహాబిసియు[32] ద్వాదశ గ్రామములకు చెందినవి. 78. బిసి అవ్యక్తమైనరంగును, రోమములనుకలది, లేదా చిత్రితమైనట్టిది. 79. మహాబిసి మోటుగాను, ప్రాయికముగా తెల్లగాను ఉన్నట్టిది. 80. ఈ రెండును పండ్రెండు అంగుళముల పొడవుకలవి.

81. శ్యామిక, కాలిక, కదలి, చంద్రోత్తర, శాకుల అనుచర్మములు ఆరోహ ప్రాంతములోనివి. 82. శ్యామిక కపిలవర్ణమునో, చిత్రితమైనమచ్చలనో కలిగినట్టిది. 83. కాలిక కపిలవర్ణమునో, పావురమువర్ణమునో కలది. 84. ఈ రెండును

[29] భద్రశ్రీయము కర్పూరమని కొందరు, తక్కోలమని కొందరు, శ్రీవాసకమని కొందరు, రక్తచందనమని కొందరు వ్యాఖ్యానించిఉన్నారు.

[30] కుష్ఠము ఒక ఓషధి.

[31] కాలేయకము ఒకపరిమళ ద్రవ్యము.

[32] జంతువులపేర్లు. వీటిచర్మములకుకూడ ఇవియేపేర్లు.

ఎనిమిది అంగుళములపొడవు కలిగిఉండును. 85. కదలి మోటుగను హస్తము పొడవుకలదిగను ఉండును. 86. చంద్రచిత్రితమైన కదలియే చంద్రోత్తర. 87. శాకులపొడవు కదలిపొడవులో మూడోవంతు. అది గుండ్రనిమచ్చల తోనో, జింకచర్మములో సహజముగ కనిపించు ముడులవంటి ముడులతోనో చిత్రితమై ఉండును.

88. సామూరము, చీనసి, శామూలి చర్మములు బాహ్లవదేశమునకు[33] చెందినవి. 89. సామూరము పొడవు ముప్పైఆరు అంగుళములు. దానిరంగు కాటుకరంగు. 90. చీనసిరంగు ఎర్రనినలుపో, లేతనలుపో. 91. శామూలి గోధుమవర్ణముకలది.

92. సాతిన, నలతూల, వృత్తపృచ్ఛ చర్మములు ఓఢ్రదేశమునకు[34] చెందినవి. 93. సాతినరంగు నలుపు. 94. నలతూల (రెల్లు) రంగుతోకూడి నది. 95. వృత్తపృచ్ఛ కపిలవర్ణముకలది.

ఇవి చర్మజాతులు

96. చర్మములలో మృదువైనవి, నున్ననివి, బహుళరోమములు కలవి శ్రేష్ఠములు.

97. రంగు అద్దకుండుట, పూర్తిగరంగు అద్దుట, కొంతభాగము మాత్రమే రంగు అద్దుట, సూదితోకుట్టుట, చిత్రించిననేత, ముక్కలను కలుపుట, దారములను వదలివేయుట—ఇవి ఉన్నినరకుల లక్షణములు. 98. కంబళము, కౌచపకము కులమిత్తిక, సామితిక, తురగాస్తరణము, వర్ణకము, తలిచ్ఛకము, వారవాణము, పరిస్తోమము, సమంత్రభద్రకము—ఇవి (వివిధములగు) అవికములు. 99. జారి పోవునట్లు, తడిసినట్లు అగుపడునవి, సన్ననివి, మృదువైనవి శ్రేష్ఠములు.

100. ఎనిమిది పడుగు పేకలతో నేసిన నల్లభృంగిసి, వర్షమును నివారించు అపసారికము—ఇవి నేపాలమున తయారగునట్టివి.

101. సంపుటిక, చతురశ్రిక, లంబర, కటవానక, ప్రావరక, సత్తలికము అనునవి మృగరోమములనుండి తయారగుచున్నట్టివి.

102. వంగదేశపు దుకూలము తెల్లగను నున్నగను ఉండును. 103. పుండ్రక దేశపు దుకూలము నల్లగను మణివలె నునుపుగను ఉండును. 104. సువర్ణకుడ్య మున తయారైనట్టిది సూర్యవర్ణముగను, మణివలె నున్నగను, నీటి నేతగను,[35] చతురస్రపు నేతగను,[36] మిశ్రమమైన నేతగను[37] ఉండును. 105. వీటిలో ఒక

[33] ప్రాచీనకాలపు బాక్ట్రియా దేశము.

[34] ఇది బహుశః ఇప్పటి ఒరిస్సా కావచ్చును.

[35] నీటివలె ప్రతిఫలించునట్టిది.

[36] హెచ్చుతగ్గులులేక ఒకేమోస్తరుగ ఉన్నట్టిది.

[37] పట్టు, నూలు కలిపినట్టిది ; లేదా, వివిధ వర్ణములు కలిసినట్టిది.

పోగు, ఒకటిన్నర పోగులు, రెండు, మూడు, నాలుగు పోగులు అను భేదములతో కూడిన నేతలు ఉన్నవి.

**106.** దీనినుండి కాశీ, పుండ్రకములలో నేయు క్షౌమములను గురించి గ్రహించునది.

107. పత్రోర్ణ (అనుపట్టు) మగధ, పుండ్ర, సువర్ణకుడ్యములనుండి వచ్చుచున్నది. 108. నాగవృక్షము, లికుచము, బకుళము, వటము దీనికి జన్మస్థానము. **109.** నాగవృక్షమునుండి తయారగుదానిరంగు పసుపు. 110. లికుచము (నుండి తయారగుదాని) రంగు గోధుమవర్ణము. 111. బకుళమురంగు తెలుపు. **112.** తక్కినదాని రంగు వెన్నరంగు. 113. వీటిలో సువర్ణకుడ్యమున తయారైనది శ్రేష్ఠము.

114. దీనినుండి చీనాదేశములో తయారగు కౌశేయము,[38] చీనపట్టములు అను వానినిగురించి గ్రహించునది.

115. మధుర, అపరాంతము, కలింగము, కాశ, వంగము, వత్సము, మహిషము——ఈ దేశములలోని నూలువస్త్రములు శ్రేష్ఠములు.

116–17. (శ్లో) కావున, ఇవిగాక తక్కిన రత్నముల ప్రమాణము, మూల్యము, లక్షణములు, జాతి, రూపము, నిధానము (దాచుట), (వాటినుండి) క్రొత్తవస్తువులను తయారుచేయుట, పాతవాటిని సంస్కరించుట, రహస్యముగ చక్కబరుచుట, దేశకాలానుసారముగ వాటికిగల వినియోగము, వినాశమునకు ప్రతిక్రియ—వీటినన్నిటిని కోశాధ్యక్షుడు ఎరిగిఉండవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండవ అధికరణమున కోశములో దాచదగిన రత్నముల పరీక్ష అనే పదకొండో అధ్యాయము.

---

[38] చీనాదేశము ఇప్పటి చీనాదేశమనియు, దీనికీ పేరు చిన్‌జాతివారు క్రీ.పూ. 250 ప్రాంతమున జయించిన తర్వాతనే వచ్చినదనియు ; అందుచేత కౌటిల్యుడు దీనికి తర్వాతివాడుగ నుండవలెననియు కొందరి వాదము. కాని చీనాదేశము చిన్‌జాతివారి తొలినివాసప్రదేశమో, లేక గిల్గిట్‌లోని ప్రాంతమో కావచ్చుననియు, వీనితో భారతీయులకు ప్రాచీనకాలమున పరిచయముండెననియు మరికొందరి అభిప్రాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 12

### ప్రకరణము 30 : గనులపరిశ్రమను, ఇతరపరిశ్రమలను ఏర్పాటుచేయుట

1. శుల్బశాస్త్రమూ,[1] ధాతుశాస్త్రమూ, రసపాకమూ, మణిరాగమూ[2] ఎరిగిన ఆకరాధ్యక్షుడు (గనుల అధ్యక్షుడు) వీటియందు నిపుణులైనవారి సహాయమును పొంది, గనులలో పనిచేయుటయందు నేర్పుగల కార్మికులతోడను (అందుకు కావలసిన) పనిముట్లతోడను చిట్టెలు, మూసలు, బొగ్గు, బూడిదల గుర్తుల సహాయమున పాతగనులను, అత్యధికమైన రంగు, బరువు, ఘాటగువాసన, రుచుల సహాయమున భూమిలోపలను పర్వతపార్శ్వములయందును ఉండు క్రొత్త గనులను పరిశోధించవలెను.

2. (బంగారము ఉన్నట్లు) ప్రతీతిగాంచిన పర్వతప్రాంతములలోని బిలము, గుహ, సానువు, కొండగుహ, రహస్యమగు త్రవ్వకములు అనువానిలో ప్రవహించునట్టియు ; నేరేడు, మామిడి, తాటిపండు, పండిన (పక్వమైన) పసుపుకొమ్ము లోపలి భాగము, బెల్లము, హరితాళము, మనశ్శిల, తేనె, ఇంగిలీకము, పద్మము, చిలుక రెక్క, నెమలిఈకె—వీటిలో ఏదైన ఒకదాని రంగును కలిగినట్టియు ; సమీపమున అదే రంగుగల జలము ఓషధులు ఉన్నట్టియు ; జిడ్డుతోకూడి విశదముగాను బరువుగాను ఉన్నట్టియు ద్రవములలో బంగారము ఉండును. 3. (ఈ ద్రవములు) నీటిపై చల్లినప్పుడు పైభాగమందంతట వ్యాపించి, అందులోని బురదను మాలిన్యమును హరించి, రాగిని, వెండిని నూరురెట్లు (బంగారముగ) మార్చగలవి అగును.[3]

---

[1] రాగిని వెండిగను బంగారముగను మార్చు విధానమును తెలియజేయుశాస్త్ర మని కొందరు వ్యాఖ్యాతలు.

[2] రంగువేసి, కృత్రిమమైన బంగారమును మణులను తయారుచేయు విధానమును తెలియజేయు శాస్త్రము.

[3] ద్రవములో ఒకమాత్ర నూరుమాత్రల రాగిని వెండిని మార్చగలదని గ్రహించవలెను.

4. రూపమందు అట్టిదే అయినను; అంతకంటె ఘాటుగనుండు గంధరసములతో కూడినట్టిది శిలాజిత్తు అని ఎరుగవలెను.

5. పసుపూ, రాగివలె ఎరుపూ, ఎరుపూపసుపూ కలిపినట్టివి; పగిలినప్పుడు నీలిరేఖలనుగాని పెసలు మినుములు నువ్వులు అనువాని రంగులనుగాని ప్రదర్శించునట్టివి; పెరుగులోని బిందువులవలెనో ముద్దలవలెనో చిత్రితమైనట్టివి; పసుపు, కరక్కాయ, తామరాకు, పాచి, పిత్తకోశము, ప్లీహము, అనవద్యము అనువాని రంగు కలిగినట్టివి; పగులకొట్టినప్పుడు ఇసుకపొరలూ వలయాకారములూ స్వస్తికాకారములూ కనబడునట్టివి; గులకరాళ్ళతోకూడి ప్రకాశించునట్టివి; కాల్చినప్పుడు పగులక, నురుగునూ పొగనూ క్రక్కనట్టివి—ఇట్టివి (సువర్ణ) ధాతువులు. ఇవి రాగిని వెండిని మార్చుటలో ప్రతీవాపార్థములుగ[4] వినియోగింపతగినవి.

6. శంఖము, కర్పూరము, స్ఫటికము, వెన్న, గువ్వపావురము, విమలకమణి, నెమలికంఠము—వీటి రంగులు; లేదా, సస్యకమణి, గోమేధికము, బెల్లము, ఖండశర్కర అనువానిరంగులు; కోవిదార పుష్పము, పద్మము, పాటలీ పుష్పము, కలాయపుష్పము, గోగుపువ్వు, నల్ల అవిసెపువ్వు—వీటి రంగులు కలిగినట్టివి; సీసముతోను ఇనుముతోను కలిసినట్టివి; పచ్చిమాంసపు వాసనవేయునట్టివి; పగలకొట్టినప్పుడు తెలుపురేఖతోకూడిన నలుపు, నలుపురేఖతోకూడిన తెలుపు, లేదా పూర్తిగా రేఖలు చుక్కలు కలిగినట్టివి; మృదువై, కాల్చినప్పుడు పగులక నురుగును పొగను విశేషముగ కక్కనట్టివి—ఇట్టివి వెండిధాతువులు.

7. అన్ని ధాతువుల విషయములో బరువు ఎక్కువ కానుకాను వాటిలోని లోహము వృద్ధియగును.

8. వీటిలో అశుద్ధములైనట్టియు లోపలకాంతిహీనములైనట్టియు ధాతువులు తీక్ష్ణమైన మూత్రముతోను క్షారముతోను కలిపి కరగించినప్పుడును, రాజవృక్షము, వటవృక్షము, పీలువృక్షముల చూర్ణమును ఆవుపిత్తముతోగాని, దున్నపోతు గాడిద చిన్నఒంటె అనువానిమూత్రము, లేక, వీనిపేడలతోగాని కలిపి, ముద్దచేసి, దానితో కరగించినప్పుడును శుద్ధములగును.

9. కదళీవజ్రివృక్షముల వ్రేళ్ళను యవలపొట్టూ మినుములచొప్పా నువ్వుల చొప్పా పలాశపీలువృక్షముల కట్టెలూ—వీటి బూడిదెతో కలిపి ధాతువులను కరగించినయెడల వాటికి మృదుత్వము లభించును. ఈ బూడిదకుబదులు ఆవుపాలను మేకపాలను వ్రేళ్ళతో కలపవచ్చును.

10. (శ్లో) తేనె, మధూకము, మేకపాలు, నూనె, నెయ్యి, బెల్లము, సారాయి పొంగు, కందలి—వీటిని కలిపి దానిలో మూడుపర్యాయములు భావన చేసినయెడల లక్షపగుళ్ళుగల ధాతువుకూడ మృదువగును.

---

[4] ధాతువులను కరిగించునప్పుడు పరిశుద్ధమగుటకు గట్టిపడుటకు వినియోగింపబడు చూర్ణములు.

11. ఆవుపళ్లూ, కొమ్ములూ — వీటి భస్మ ప్రతీవాపము మృదుత్వమును పోగొట్టును.

12. కొండలనుండిగాని భూమిలోపలినుండిగాని త్రవ్వబడిన ధాతువు బరువుగను జిడ్డుగను మెత్తగను గోరోజనపురంగు ఆకుపచ్చరంగు పాటలివర్ణము ఎరుపురంగు కలదిగను ఉన్నయెడల అది రాగిధాతువు.

13. కాకివలె నలుపో, గువ్వరంగో, పసుపురంగో కలిగి, తెల్లని గీరలతో కూడి, పచ్చిమాంసపు వాసనవేయు ధాతువు సీసము.

14. ఊషరక్షేత్రమువలె కర్బురవర్ణమో, కాల్చిన మట్టిరంగో కలది తగరపు ధాతువు.

15. ఎక్కువగా నున్నని రాళ్ళతోకూడి, తెలుపు ఎరుపురంగుగాని, సిందువారపుష్పపురంగుగాని కలది ఇనుముధాతువు.

16. కాకాండపురంగో భుజపత్రపురంగో కలది వైకృంతకధాతువు.

17. స్వచ్ఛమై, నున్ననై, కాంతిమంతమై, శబ్దముతోకూడినట్టిదై, చల్లనిదై, కాఠిన్యముకలదై, లేతరంగుతోఉన్నట్టిది మణిధాతువు.

18. సంపాదించినధాతువులను ఆయాలోహముల కర్మాగారములలో వినియోగించవలెను. 19. తయారైన వస్తుసామగ్రుల వ్యాపారమును ఒకేచోట స్థాపించవలెను.[5] ఇతర ప్రదేశములందు తయారుచేయువారిపైని, క్రయవిక్రయముల చేయువారిపైని దండము విధించవలెను.

20. రత్నములమినహాగా గనులలోని ఇతరవస్తువులను అపహరించువానికి ఎనిమిదిరెట్లు దండమును విధించవలెను. 21. దొంగను, రాజాజ్ఞపొందక గనుల త్రవ్వకముద్వారా జీవించువానిని, బంధించి గనులలో (వారిచేత) పని చేయించవలెను. దండమును చెల్లించలేక దానికిబదులు పనిచేయగోరువానిచేతకూడ ఇట్లే చేయించవలెను.[6]

22. అధికవ్యయముతోను కష్టముతోను కూడిన గనుల త్రవ్వకమును భాగవిధానమునగాని శిస్తు చెల్లించువిధానమునగాని సాగించవలెను. సులభమగు దానిని స్వయముగ సాగించవలెను.

23. లోహాధ్యక్షుడు రాగి, సీసము, తగరము, వైకృంతకము, ఇత్తడి, ఉక్కు, కంచు, తాలము, ఇనుము పరిశ్రమలను స్థాపించవలెను. లోహవస్తుసామగ్రి వ్యాపారమునుకూడ నెలకొల్పవలెను.

---

[5] ఏకముఖమని మూలము. ఇంగ్లీషులో monopoly అనుమాటకు ఇది పర్యాయపదము.

[6] సాధారణముగ గనులలోపని కష్టముతోకూడినట్టిది, నేరముచేసినవారిలో కొందరు వారిపై విధింపబడిన జరిమానాలను చెల్లింపశక్తిలేక గనులలో పనిచేయుట కంగీకరించుచుండిరి.

24. లక్షణాధ్యక్షుడు[7] నాలుగోవంతు రాగి, (నాణెములు గట్టిపడుటకు)[8] ఒకమాషము ఎత్తు ఇనుమో, తగరమో, సీసమో, అంజనమునో కలిపి వెండి నాణెములను పణము,[9] అర్ధపణము, పావుపణము, పరకపణము అను పేర్లతో ముద్రించవలెను. నాలుగోవంతు గట్టిచేయు లోహమును కలిపి మాషకము, అర్ధ మాషకము, కాకణి, అర్ధకాకణి అను రాగినాణెములను ముద్రించవలెను.

25. రూపదర్శకుడు (నాణెములను పరీక్షించు అధికారి) వ్యాపారము నకును కోశములో చెల్లించుటకును పణముల చెలామణిని నిర్ణయించవలెను. 26. అన్యప్రదేశములలో నాణెముల ముద్రించువారినుండియు క్రయవిక్రయముల చేయువారినుండియు పరీక్షకులనుండియు నూటికి ఎనిమిదిచొప్పున రూపికమును అయిదుచొప్పున వ్యాజిని, నూటిలో ఎనిమిదవవంతు పరీక్షకమును, ఇరవై అయిదు పణముల దండమును వసూలుచేయవలెను.

27. ఖన్యధ్యక్షుడు శంఖములు, వజ్రములు, మణులు, ముత్తెములు, పగడములు, క్షారముల పరిశ్రమలను, వ్యాపారమును స్థాపించవలెను.

28. లవణాధ్యక్షుడు పాకమునుండి విడుదలఅయిన ఉప్పులో (రాజ) భాగమును, ప్రక్రయమును,[10] విక్రయమూల్యమును, రూపమును,[11] వ్యాజిని వాయిదాకాలమున వసూలుచేయవలెను. 29. (విదేశమునుండి) దిగుమతి అయినఉప్పు ఆరవవంతు శుల్కమును చెల్లించవలెను. 30. రాజభాగమును, నూటికి అయిదుచొప్పున వ్యాజిని, రూపమును, రూపికమును[12] చెల్లించినతర్వాతనే దానిని విక్రయించవలెను. 31. కొన్నవాడు శుల్కమును, రాజపణ్యమునకు కలిగిననష్టమునకు తగినట్లు వైధరణమును చెల్లించవలెను; ప్రదేశాంతరమున కొన్నవాడు ఆరువందలపణముల దండమును చెల్లించవలెను. 32. కల్తీఉప్పును అమ్మువాడు, అజ్ఞనుపొందక ఉప్పునుతయారుచేసి జీవించువాడు ఉత్తమదండ మును చెల్లించవలెను. ఇది వానప్రస్థులకు వర్తించదు. 33. వేదవిదులైన బ్రాహ్మ ణులు, తాపసులు, కార్మికులు భోజనమునకుకావలసిన ఉప్పును (ఉచితముగ) తీసుకొనవచ్చును. 34. తక్కినలవణములు క్షారములు శుల్కమును (మాత్రమే) చెల్లించవలెను.

---

7 నాణెముపై ముద్రించు రాజచిహ్నమునకూ రాజ్యచిహ్నమునకూ లక్షణమని పేరు.

8 గట్టిపడుటకై ఉపయోగించులోహమునకు బీజమని పేరు.

9 పణముఎత్తు 16 మాషకములు. ఇందులో 4 మాషకముల రాగి, 1 మాషకము బీజము, 11 మాషకముల వెండి ఉండును.

10 ప్రక్రయము : భూమిని కౌలుకు పుచ్చుకొనువాడు చెల్లించుశిస్తు లేదా అద్దె.

11 రూపము : పర్యవేక్షణకై చెల్లించవలసిన రుసుము.

12 రూపికము : వస్తువును తయారుచేయ అనుజ్ఞనుపొందుటకు ఇయ్యవలసిన రుసుము.

**35–36.** (శ్లో) ఈవిధముగ అతడుగనులనుండి మూల్యమును, భాగమును, వ్యాజిని, పరిఘమును, అత్యయమును, శుల్కమును, వైధరణమును, దండమును, రూపమును, రూపికమును, వసూలుచేసి పండ్రెండువిధములగు ధాతువులను, పణ్యములను సేకరించవలెను. ఇదేవిధముగ పణ్యములన్నిటి విషయమున వివిధములగు పద్దులక్రింద ఆయమును నిర్ణయించవలెను.

37. (శ్లో) కోశమునకు గనులు జన్మస్థానము; కోశమునుండి సైన్యము రూపొందుచున్నది; కోశసైన్యముల సాధనమున కోశభూషణమగు భూమి ప్రాప్తించుచున్నది.

ఇది అధ్యక్షప్రచారము అను రెండోఅధికరణమున గనుల పరిశ్రమను, ఇతర పరిశ్రమలను ఏర్పాటుచేయుట అనే పన్నెండో అధ్యాయము.

## రెండో అధికరణము



### అధ్యాయము 13

### ప్రకరణము 31 : అక్షశాలయందలి సువర్ణాధ్యక్షుడు

1. బంగారు వెండి సరకులను తయారుచేయుటకు సువర్ణాధ్యక్షుడు పరస్పర సంబంధములేని నాలుగు శాలలును ఒకే ద్వారమును గల ఆవేశనముతోకూడిన అక్షశాలను కట్టించవలెను. 2. బజారువీధినడుమ శిల్పవంతుడును, మంచి వంశమున పుట్టినవాడును, విశ్వాసపాత్రుడును అయిన సువర్ణకారుని నియమించ వలెను.

3. జంబూనదినుండి, శతకుంభపర్వతమునుండి, హాటకమునుండి, వేణువు నుండి,[1] శృంగశుక్తి[2] నుండి లభించినట్టిదీ, సహజముగ ఉత్పత్తిఅయినట్టిదీ, రసములనుండి తయారుచేయబడినదీ, గనులనుండి త్రవ్వబడినదీ—ఇవి బంగారము నందలి రకములు. 4. పద్మకేశరముల వర్ణముకలదీ, మృదువైనదీ, నున్ననైనదీ, నాదములేనిదీ, ప్రకాశించునట్టిదీ అగు బంగారము శ్రేష్ఠము. ఎరుపును పసుపును కలిసినది మధ్యమము ; ఎర్రనైనది అధమము.

5. శ్రేష్ఠమైనదానిలో పాండువర్ణమును తెలుపును కలది అపరిశుద్ధము. 6. దేనిమూలమున అది అపరిశుద్ధమైనదో దానికి నాలుగురెట్లు సీసముతో దానిని తొలగించవలెను. 7. సీసముతో కలిపినప్పుడు పగుళ్ళు కనిపించినయెడల ఎండిన ఆవుపేడతో దానిని కరగించవలెను. 8. స్వభావముచేతనే పగుళ్ళు కనిపించిన యెడల ఆవుపేడ కలిపిన నువ్వులనూనెలో దానిని (కాచి) పడవేయవలెను.

9. గనులనుండి తీసిన బంగారములో సీసము కలిసియుండుటచేత పగుళ్ళు కనిపించినయెడల దానిని కాల్చి, రేకులు చేసి, కొయ్యదిమ్మమీద (సుత్తెతో) కొట్ట వలెను ; లేదా, కదళీ వజ్ర వృక్షముల వేళ్ళ చూర్ణముతో భావనచేయవలెను.

---

[1] ఒక పర్వతమో నదియో కావచ్చును.

[2] సువర్ణభూమికి నామాంతరమని కొందరు వ్యాఖ్యాతలు.

10. తుత్త (పర్వతము) నుండి, గౌడదేశమునుండి, కంబు (పర్వతము) నుండి, చక్రవాల (పర్వతము) నుండి వెండి లభించుచున్నది. 11. తెలుపైనది, నునుపైనది, మృదువైనది (వెండి) శ్రేష్ఠము. 12. దీనికి విరుద్ధమైనది, పగిలే స్వభావముకలది దుష్టము. 13. నాలుగోవంతు సీసమును కలిపి దానిని శుద్ధి చేయవలెను. 14. పై భాగమున చూలిక[3] కలది, స్వచ్ఛమైనది, ప్రకాశించునట్టిది పెరుగువర్ణముకలది శుద్ధమైన వెండి.

15. శుద్ధమై పసుపువర్ణముగల (పదహారువన్నె) బంగారము సువర్ణము. 16. అట్టి (పదహారు మాషకముల ఎత్తుగల) సువర్ణములో నాలుగు (మాషకముల ఎత్తు) వరకూ ఒక్కొక కాకణి (రాగి) చొప్పున వృద్ధిచేయుచు రాగిని కలిపినయెడల వన్నెలలో పదహారు భేదములు ఏర్పడును.

17. (శోధించవలసిన) బంగారముతో గీటురాతిపైన మొట్టమొదట గీసి తర్వాత సువర్ణముతో దానిపై గీయవలెను. 18. గీటురాయిమీది హెచ్చుతగ్గులు లేని సమప్రదేశములందు వర్ణము విషయమున (శోధింపవలసిన బంగారపు) రేఖ అట్టిదే (సువర్ణపురేఖవంటిదే) అయినయెడల పరిశోధనము నిర్దుష్టముగ జరిగినట్లు ఎరుగవలెను. గట్టిగా గీసినప్పుడుగాని, తేలికగా గీసినప్పుడుగాని, గోటిక్రింద దాచిన గైరికచూర్ణము గీతపై కనిపించినప్పుడుగాని మోసము జరిగినట్లు ఎరుగవలెను. 19. గోమూత్రములో భావనచేసిన జాతిహింగులికమునుగాని, పుష్పకాసీసమును గాని అరచేతికి పూసుకొని బంగారమును స్పృశించినయెడల అది తెల్లపడును. 20. కేసరములతో కూడినది, నున్ననైనది, మృదువైనది, ప్రకాశించునది అయిన గీటురాతిమీది గీత శ్రేష్ఠమైనట్టిది.

21. కళింగదేశమునుండిగాని, తాపీనదీప్రాంతమునుండిగాని లభించినట్టియు, పెసలవర్ణము కలిగినట్టియు గీటురాయి శ్రేష్ఠమైనది. 22. (హెచ్చుతగ్గులు లేక) వర్ణమును సమముగ చూపెట్టునది క్రయవిక్రయముల రెండింటిలో లాభకారి.

23. కొంచెము ఆకుపచ్చతోకూడిన ఏనుగువర్ణముకలిగినట్టిదీ, వర్ణాధిక్యమును చూపునట్టిదీ విక్రయములో లాభకారి. 24. స్థిరమైనదీ, కాఠిన్యముకలదీ, సమ వర్ణము కానట్టిదీ, వర్ణాధిక్యమును చూపనట్టిదీ క్రయములో లాభకారి.

25. జిడ్డుతోకూడినట్టిది, సమవర్ణముకలది, నున్ననైనట్టిది, మృదువైనది, ప్రకాశించునది—అగు గీత శ్రేష్ఠము. 26. లోపలను బయటను సమమైనట్టిది, కేసరవర్ణముకలది, లేదా, కురండకపుష్పవర్ణముకలది—అగు తాపనము శ్రేష్ఠము. 27. నలుపుగాని నీలిమగాని దోషమును తెలియపరుచును.

28. తులామానములు "పౌతవాధ్యక్ష" అధ్యాయమందు వివరింపబడును.

---

[3] ఒకవిధమైన బుడుప.

29. అందులోని నియమముల ప్రకారము, వెండి బంగారములను ఇచ్చిపుచ్చుకొనవలెను.

30. అనుజ్ఞలేనివాడు అక్షశాలను ప్రవేశించరాదు. 31. ప్రవేశించినవానిని వధించవలెను. 32. (అనుజ్ఞపొందక) వెండిబంగారములతో ప్రవేశించినవాడు ఉద్యోగిఅయినను వాటిని స్వాధీనము చేసుకొనవలెను.

33. వెండిబంగారములలో మణులను పొదుగువారు, పూసలుచేయువారు, పూత పూయువారు, ఆభరణములు చేయువారు, కొలిమిని ఊదువారు, నౌకర్లు, దుమ్మును దులిపివేయువారు—వారివారివస్త్రములును చేతులును గుహ్యాంగములును శోధింపబడిన తర్వాతనే ప్రవేశనిర్గమనములను చేయవలెను. 34. వారి పనిముట్లు, పూర్తిగాని వస్తువులు అచటనేఉంచి పోవలెను. 35. తీసుకొన్న బంగారమును తయారైన వస్తువులను వారు కార్యాలయమందు అప్పగించవలెను. 36. సాయంకాలమునను ఉదయమునను పనిచేయువానియొక్కయు, చేయించుకొనువానియొక్కయు ముద్రలువేసి వాటిని దాచవలెను.

37. క్షేపణము, గుప్తము, క్షుద్రకర్మ అని (బంగారు) పనులు మూడు విధములు. 38. మణులను బంగారములో పొదుగుట మొదలైన పనులు క్షేపణము. 39. తీగలుతీసి అల్లుట మొదలైనవి గుప్తము. 40. గట్టిపని, గుల్లపని, పూసలతోకూడినపని – ఇట్టివి క్షుద్రకము.

41. పొదుగుటలో అయిదవవంతు బంగారమును అడుగుభాగమును బిగించుటకును, పదియవవంతును ప్రక్కభాగముల బిగించుటకును ఉపయోగించవలెను. 42. నాలుగోవంతు రాగి కలిసిన వెండియు, నాలుగోవంతు వెండి కలిసిన బంగారమును కృత్రిమములు. అట్టివి జరుగకుండ పర్యవేక్షించవలెను. 43. మణులను బిగించుటలో పార్శ్వములందు మూడువంతులు అడుగున రెండువంతులుగాని, అడుగున నాలుగువంతులు పార్శ్వములందు మూడువంతులుగాని (బంగారము) ఉండవలెను.

44. పూతపనులలో రాగివస్తువునకు అదే పరిమాణముగల బంగారముతో పూత వేయవలెను. 45. గట్టిదిగాని గుల్లదిగాని అయిన వెండివస్తువునకు అర్ధ పరిమాణముగల బంగారముతో పూత వేయవలెను. 46. లేదా, ఇసుక ఇంగిలీకరసముతోగాని, చూర్ణముతోగాని కలిపి, నాలుగోవంతు బంగారముతో పూతపూయవచ్చును.

47. ఆభరణములకు ఉపయోగించు ఉత్తమమైన బంగారము, మంచి రంగుతో కూడినట్టిదై సమపాలు సీసముతో కలిసి కాల్చబడి రేకులుగా రూపొంది సింధువుమట్టితో మెరుగువేయబడినప్పుడు నీలి, పసుపు, తెలుపు, ఆకుపచ్చన, చిలుకరెక్కరంగుల ప్రకృతులకు ఆధారమగుచున్నది. 48. నెమలికంఠపు రంగును, ఛేదించినచోట తెలుపును కలిగినట్టియు, కాంతిమంతమైనట్టియు, కాల్చి

పొడిచేయబడినట్టియు కాకణి బరువుగల ఇనుము సువర్ణమునకు రంగువేయుటలో ఉపయోగించు ద్రవ్యము.

49. ఎముకలమూసలో నాలుగుమార్లు, సమసీసముతో కలిసినదానిలో నాలుగుమార్లు, ఎండిన మూసలో నాలుగుమార్లు, కుండపెంకులో మూడుమార్లు, గోమయములో రెండుమార్లు—మొత్తము పదిహేడుమార్లు—పుటము పెట్టబడినట్టియు, సింధువుమట్టితో మెరుగువేయబడినట్టియు వెండి (రంగువేయుటకు మంచి ద్రవ్యము). 50. ఇట్టిదానిని ఒక కాకణినుండి రెండుమాషముల ప్రమాణము వరకు సువర్ణముతో కలుపవలెను. తర్వాత రంగుపదార్థముతో కలిపినయెడల అది శ్వేతతార (తెల్లనివెండి) అను పేరుకలది అగుచున్నది.

51. మూడుపాళ్ళు తపనీయము[4] (ఆభరణములకై ఉపయోగింపబడు బంగారము) ముప్పైరెండుపాళ్ళ శ్వేతతారతో కలిసి, గట్టిపడినప్పుడు శ్వేతలోహితకము (తెలుపూ ఎరుపూ కలిసినట్టి లోహము) అగుచున్నది. 52. అది రాగిని పసుపువర్ణము కలదిగా చేయుచున్నది. 53. తపనీయమునకు మెరుగుపెట్టి, మూడోవంతు రాగద్రవ్యమును కలిపినయెడల అది పసుపును ఎరుపును కలిసినట్టిది అగుచున్నది. 54. రెండుపాళ్ళు శ్వేతతార, ఒకపాలు తపనీయము కలిసినయెడల పెసరరంగు ఏర్పడుచున్నది. 55. అర్ధభాగము ఇనుము కలిసినయెడల నల్లపడుచున్నది. 56. తపనీయమును రెండుపర్యాయములు పూతద్రావకములో ముంచినయెడల చిలుకరెక్కలరంగుకలది అగును. 57. అట్టి (వివిధములగు బంగారములతో) పనులను ప్రారంభించుటకు పూర్వము వివిధములగు రంగులను (గీటురాయి సాధనమున) శోధించవలెను.

58. అతడు ఇనుమును రాగిని సంస్కరించుటను తెలిసియుండవలెను. 59. కావున అతడు వజ్రములు, మణులు, ముత్తెములు, పగడములు, మున్నగు వానితో చేయబడు వస్తువులలో కలుగు తరుగును, వెండి బంగారు వస్తువులను తయారుచేయుటకు కావలసిన ప్రమాణములను తెలిసియుండవలెను.

60-61. (శ్లో) (హెచ్చుతగ్గులులేక) సమమైన రంగు, సమమైన అనురూపత్వము, ఒకదానితో ఇంకొకటి ముడిపడక వేరువేరుగఉండు పూసలు, స్థిరత్వము, చక్కటి మెరుగు, కల్తీ లేకుండుట, (తగినట్లు) భాగములుగ చేయబడుట, ధరించుటయందు సుఖము, డాంబికముగ కనబడకుండుట, కాంతి, మధురమైన రూపము, సమత్వము, మనోనేత్రములకు ఇంపుగనుండుట—ఇవి ఆభరణములకు ఉండవలసిన గుణములు అని చెప్పుదురు.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున అక్షశాలలయందలి సువర్ణాధ్యక్షుడు అనే పదమూడో అధ్యాయము.

---

[4] 'తపనీయము' అను మాటను ఆభరణములు చేయుటకు ఉపయోగింపబడు బంగారము అనే అర్థములో వాడుట గ్రంథమందంతట కనిపించుచున్నది.

# రెండో అధికరణము

## అధ్యాయము 14

### ప్రకరణము 32 : విపణివీథియందలి సౌవర్ణికుని కార్యకలాపము

1. సౌవర్ణికుడు పౌరులయు జానపదులయు వెండిబంగారపు పనులను పనివాండ్రచేత చేయించవలెను.[1]

2. వారు వారిపనిని నిర్దేశించినట్లు నిర్దేశించిన కాలములో పూర్తిచేయవలెను. పనియొక్క స్వభావమునుబట్టి ఒక్కొక్కప్పుడు కాలనిర్ణయమును చేయక ఉండవచ్చును. 3. కార్యమును అన్యథాగా చేసినప్పుడు వేతనమును కోల్పోవుటయే కాక దానికి రెండింతల దండమును కూడ ఇచ్చుకొనవలెను. 4. కాలాతిపాతము చేసినప్పుడు వేతనములో నాలుగోవంతును కోల్పోయి దానికి రెండింతల దండమును ఇచ్చుకొనవలెను.

5. ఎట్టి వర్ణప్రమాణములుగల లోహమును తీసుకొనుచున్నారో అట్టి వర్ణప్రమాణములుగలదానినే తిరిగి ఇచ్చివేయవలెను. 6. కాలయాపనము జరిగినప్పుడు కూడ తరుగు విరుగుల మినహాగా దానిని ఇచ్చివేయవలెను.

7. బంగారముయొక్కయు పనివాండ్రచేత చేయించవలసిన బంగారు వస్తువులయొక్కయు లక్షణముల గురించిన వివరములన్నిటిని అతడు ఎరిగియుండవలెను.

8. వెండిబంగారముల విషయమున ఒక సువర్ణమునకు ఒక కాకణి చొప్పున తరుగు విధించవచ్చును. 9. (బంగారమునకు) రంగువేయుటకు ఒక కాకణి, ఇనుము వెండి విషయములో రెండు కాకణులు ఉపయోగించవలెను. అందులో అరవవంతు తరుగుక్రింద తీసుకొనవలెను.

10. మాషమునకంటె తక్కువగాక వన్నెను తగ్గించినప్పుడు పూర్వసాహస

---

[1] అంతఃపురమునకు సంబంధించిన పనులనే గాక ప్రజల పనులను కూడ చేయించుట గమనించదగిన విశేషము.

దండము, ప్రమాణము తగ్గించినప్పుడు మధ్యమదండము, తులామానములలోను తయారుచేసిన వస్తువులలోను మోసము చేసినప్పుడు ఉత్తమదండము విధించవలెను.

11. సౌవర్ణకుని అప్రత్యక్షముగను, అన్యప్రదేశమందును వస్తువులను తయారుచేయించువానికి దండము పండ్రెండు పణములు. 12. చేసినవానికి—చేసినందుకు ఏదైన కారణమున్నపక్షమున—(దండము) రెండింతలు. 13. కారణములేనిపక్షమున వానిని న్యాయస్థానమునకు తీసుకొనివెళ్ళవలెను. 14. (నేరము రుజువైన పక్షమున) శిక్ష రెండువందలపణముల దండమో, వ్రేళ్ళను ఛేదించుటయో.

15. తులామానప్రమాణముల అధికారినుండి వారు త్రాసులను తూకములను కొనవలెను. 16. అట్లు చేయనియెడల పండ్రెండుపణముల దండము.

17. ఘనము (గట్టివస్తువులను చేయుట), సుషిరము (గుల్లవస్తువులను చేయుట), సంయూహ్యము (దట్టమైనరేకులతో కప్పుట), అవలేప్యము (సన్నని రేకులతో కప్పుట), సంఘాత్యము (బిగించుట), వాసితకము (పూతపూయుట)—ఇవి వివిధములైన పనులు.

18. తులావిషమము (త్రాసులో హెచ్చుతగ్గులు), అపసారణము (కొంత బంగారమును అపహరించి దానిస్థానే మరియొక లోహమును చేర్చుట), విస్రావణము (బంగారువస్తువునకు బదులు మరియొకదానిని చేర్చుట), పేటకము (రేకుతో కప్పుట), పింకము (పొదిగిన వస్తువులలో మోసము)—ఇవి అపహరించుటకు ఉపాయములు.

19. వంగినకాడ, ఎత్తైనచూపుడుముల్లు, విరిగినముల్లు, గుల్లబారినమెడ, తప్పుడుత్రాళ్ళు, తప్పుడుపళ్ళెములు, ముందువెనుకకు కదలిక, అయస్కాంత స్వభావము—ఇవి దుష్టమైన త్రాసు లక్షణములు.

20. రెండుపాళ్ళు వెండియు ఒకపాలు రాగియు కలిసి త్రిపుటక మగుచున్నది. 21. గనినుండి తీసిన బంగారమును కొంత అపహరించి దానిస్థానమున దీనిని (త్రిపుటకమును) చేర్చుట త్రిపుటకాపసారణము. 22. రాగిని చేర్చిన యెడల రాగిఅపసారణమని, వెల్లకమును చేర్చినయెడల వెల్లకాపసారణమని, సగముపాలు రాగితో కలిసిన బంగారమును చేర్చినయెడల హేమాపసారణమని ఎరుగవలెను.

23. కృత్రిమమగు అడుగుభాగముకల మూస, దుష్టమైన చిట్టెము, కొంగముక్కు,[2] ఊదేగొట్టము, పటకారు, సువర్చికాలవణము, అదేవన్నె బంగారము—ఇవికూడ అపసారణ సాధనములు. 24. లేదా, (కొలిమిలో) ముందే గండు ఇసుకను వేసిఉంచి, మూస విరిగిపోయినవెంటనే ఆ ఇసుకను బయటికి తీయుట కూడ అపసారణ సాధనమే.

[2] ఇది ఒకవిధమైన పటకారు.

25. బిగించిన తర్వాతగాని, కప్పినరేకును శోధించుసమయమునగాని, బంగారు వస్తువు స్థానమందు వెండివస్తువును ఉంచుట, లేక, బంగారముతో కలిసిన ఇసుక స్థానమున ఇనుముతో కలిసిన ఇసుకను (కొలిమిలో) ఉంచుట—దీనికి విస్రావణ మని పేరు.

26. సంయూహ్యము, అవలేప్యము, సంఘాత్యములలో దట్టమైనట్టిన్ని, తీసివేయుటకు సాధ్యమైనట్టిన్ని మూత (పేటకము) తయారుచేయబడును. 27. మూత (పేటకము) లోపలి లక్కలో బంగారురేకుతో కప్పబడిన సీసపు ముక్కను బిగించినయెడల దట్టమైన మూత ఏర్పడుచున్నది. 28. అదే మూతలో కొన్ని పొరలు ఉన్నప్పుడు తీసివేయుటకు సాధ్యమైన మూత ఏర్పడుచున్నది. 29. సన్ననిరేకుతో కప్పవలసినప్పుడు రేకు ఒకవైపునగాని రెండువైపులగాని అమర్చబడును. 30. బిగించవలసినప్పుడు రేకుల లోపలిభాగమును రాగితోగాని వెండితోగాని చేయవలెను. 31. బంగారురేకుతో బిగించి మెరుగుపెట్టబడిన రాగి వస్తువు సుపార్శ్వము (మంచిపార్శ్వము కలది). జంటరేకులతో బిగించి మెరుగు పెట్టబడినదియు అదేవిధముగ సంస్కరింపబడిన రాగి వెండి వస్తువులు ఉత్తర వర్ణకములు (వెలుపలిభాగమున వర్ణముకలవి).

32. తాపనము మూలమునగాని, గీటురాయి సాధనమునగాని, నిశ్శబ్దసాధన మునగాని, వస్తువుపై గీతనుగీసిగాని ఈ రెండు లక్షణములను శోధించవలెను. 33. తీసివేయతగిన మూతను బదరామ్లమందుగాని ఉప్పునీటియందుగాని ముంచి శోధించెదరు—ఇదియే పేటకము.

34. బంగారముతో కలిసిన మట్టిగాని, మూలకేంగిలికముల చూర్ణము గాని, గట్టివస్తువుతోనో గుల్లవస్తువుతోనో వేడిచేసినప్పుడు దానికి అతుకుకొనిపోవును. 35. లేదా, దృఢమగు మరియొక వస్తువులో ఇసుకతో కలిసిన లక్కగాని గాంధార పంకముగాని తాపనము చేసినప్పుడు ఇవి దానికి అంటుకొనిపోవును. 36. ఈ రెంటిని తాపనమునగాని సుత్తితో కొట్టుటమూలమునగాని శుద్ధిచేయవచ్చును.

37. చుట్టుటకుపయోగించు లోహము ఉన్నట్టి వస్తువులో గండుఇసుకతో కలిసిన ఉప్పు కాల్చబడినప్పుడు అది దానికి అంటుకొనిపోవును. 38. ఉడకబెట్టి దానిని శుద్ధిచేయవచ్చును.

39. జంటరేకులతో కప్పబడిన ఒక వస్తువులో లక్కలో పొదిగిన అభ్రకమును ఉంచవలెను. 40. అట్టివస్తువును నీటిలో వేసినప్పుడు ఒకభాగము మాత్రము మునిగిపోవును; లేదా, రెండురేకులమధ్య సూదితో పొడవవలెను.

41. (కృత్రిమములగు) మణులను, వెండిని, బంగారమును గట్టివస్తువు లలోగాని, గుల్లవస్తువులలోగాని పొదుగవచ్చును. 42. కాల్చిగాని, సమ్మెటదెబ్బ సాధనమునగాని దీనిని కనుగొనవచ్చును—ఇది పింకము.

43. కావున సౌవర్ణికుడు వజ్రములు, మణులు, ముత్తెములు, పగడములు మున్నగువానితో చేయబడిన వస్తువుల జాతిని, రూపమును, వర్ణమును, ప్రమాణమును, పుద్గల లక్షణమును ఎరిగియుండవలెను.

44. తయారైన వస్తువులను పరీక్షించు సమయమునను, ప్రాతవస్తువుల సంస్కరించు సమయమునను అపహరించు ఉపాయములు పరికుట్టనము, అవచ్ఛేదనము, ఉల్లేఖనము, పరిమర్దము అని నాలుగు విధములు. 45. పేటకమును పరీక్షించేమిషతో ఒకపూసనుగాని, తీగనుగాని, కప్పునుగాని ఛేదించుట పరికుట్టనము. 46. రెండు రేకులతో కూడిన వస్తువు లోపల సీసపుముక్కను ప్రవేశపెట్టి లోపలి భాగమును ఛేదించుట అవచ్ఛేదనము. 47. పదునుగల సాధనముతో గట్టి వస్తువును గీరుట ఉల్లేఖనము. 48. హరితాళమునుగాని, మనఃశిలనుగాని, ఇంగిలీకమునుగాని, కురువిందచూర్ణమునుగాని ఒక గుడ్డపీలికకు పూసి, దానితో వస్తువును గట్టిగా రుద్దుట పరిమర్దనము. 49. దీనిమూలమున వెండి బంగారు వస్తువుల తూకము తగ్గునేకాని మరి ఎట్టిలోపమును సంభవించదు.

50. విరుగుటమూలమునగాని, ఛేదింపబడినకారణమునగాని, రాపిడిమూలమునగాని సంయూహ్యవస్తువులకు కలిగిన నష్టమును (నష్టమునకు గురికాని) సమానవస్తువుల సహాయమున ఊహించవలెను. 51. అవలేప్యవస్తువుల విషయమున ఎంత ఛేదింపబడినదో అంత పరిమాణమును ఛేదించి నష్టమును ఊహించవలెను. 52. రూపమును కోల్పోయిన వాటివిషయమున కాల్చియు, అనేకపర్యాయములు నీటిలో ముంచి రుద్దియు ఊహించవలెను.

53. తూకములు, నిప్పు, దిమ్మె, సామానుల పెట్టె, కూర్చున్న పీట, నెమలి పింఛము, దారము, వస్త్రము, మాట, తల, ఒడి, ఈగె, తన శరీరము, కొలిమితిత్తి, నీళ్ళకుండి, కుంపటి—అనువానియందు అసాధారణమగు శ్రద్ధను ప్రదర్శించుటయు, ఉన్నట్లుండి తన చేతులను ఇటు అటు త్రిప్పుటయు—అపహరించు కంసాలి లక్షణములని గ్రహించవలెను.

54. పచ్చిమాంసపు వాసన వేయునట్టివి, సులభముగ మాలిన్యమును గ్రహించునట్టివి, పరుషమైనట్టివి, కఠినమైనట్టివి, వర్ణమును కోల్పోయినట్టివి అయిన వెండివస్తువులలో మోసమున్నట్లు తెలుసుకొనవలెను.

55. (శ్లో) ఈ విధముగ క్రొత్తవస్తువులను, ప్రాతవస్తువుల విరూపములైనను, వస్తువులను పరీక్షించి, యథోక్తదండములను విధించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండోఅధికరణమున విపణివీథియందలి సౌవర్ణికుని కార్యకలాపము అనే పధ్నాలుగో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 15

### ప్రకరణము 33 : కోష్ఠాగారాధ్యక్షుడు

1. కోష్ఠాగారాధ్యక్షుడు సీత, రాష్ట్రము, క్రయమము, పరివర్తకము, ప్రామిత్యకము, సంహతిక, అన్యాజాతము, వ్యయప్రత్యాయము, ఉపస్థానము—వీటిని ఎరిగి ఉండవలెను.

2. సీతాధ్యక్షుడు తెచ్చు వివిధములగు ధాన్యములు సీత.

3. పిండకరము (సమష్టిగ చెల్లింపబడుపన్ను),[1] ఆరోవంతు (పన్ను), సేనాభక్తము (సైనిక ఖర్చులకై చెల్లింపబడునట్టిది), బలి (కప్పము), కరము (పన్ను), ఉత్సంగము (శుభసమయములలో రాజునకు ఇచ్చు కానుకలు), పార్శ్వము (మామూలు పన్నులపై విధింపబడు రుసుము), పరిహీణికము (నష్టపరిహారముగ చెల్లింపబడునట్టిది), ఔపాయనికము (కానుకలు), కౌష్ఠేయకము (చెరువులు వనములు మొదలగువాటినుండి లభించు ఆదాయము)— ఇవి రాష్ట్రమునకు సంబంధించిన ఆయములు.

4. ధాన్యముల ఖరీదు,[2] కోశ వినియోగము, ఋణముల వసూలు—ఇవి క్రయమమునకు సంబంధించినవి.

5. వివిధములైన ధాన్యములను ధరలనుబట్టి వినిమయముచేయుట పరివర్తకము.

6. ఇతరులనుండి ధాన్యములను యాచించుట ప్రామిత్యకము. 7. తిరిగి ఇచ్చివేయు ఉద్దేశముతో వాటిని తీసుకొనుట అపమిత్యకము.

8. దంచుట, పప్పలుచేయుట, వేయించుట, మద్యముల తయారుచేయుట,

---

[1] గ్రామములోని ఒక్కొక్క రైతు చెల్లించుటకు బదులు గ్రామమంతయుకలిసి సమష్టిగ చెల్లించు పన్ను.

[2] ఖరీదు ఇచ్చి ధాన్యములను కొనుట.

పిండివిసరుట మొదలైన పనులను ఆ యా వృత్తులవలన జీవించువారిచేత చేయించుట, గానుగను ఆడు తెలికవాండ్రచేత గానుగను ఆడించుట, చెరకునుండి రసమును తీయించుట[3]—ఈ బాపతు పనులు సంహతికకు సంబంధించినవి.

9. పోగొట్టుకొన్నది, మరచిపోయినది—మొదలైనవి అన్యజాతమునకు సంబంధించినవి.[4]

10. సైన్యమును తగ్గించుటవలన లభించిన ఆయము, వ్యాధికారణమున మధ్యలో విరమింపబడిన కార్యములనుండి లభించిన ఆయము—ఇవి వ్యయ ప్రత్యాయమునకు సంబంధించినవి.

11. తులామానములలోని వ్యత్యాసము, హస్తపూరణము,[5] ధాన్యపురాశిలో మిగులు, వ్యాజి, పర్యుషితము, ప్రార్జితము[6]—ఇవి ఉపస్థానమునకు సంబంధించినవి.

12. ధాన్యములు, క్రొవ్వుపదార్థములు, క్షారములు, లవణములు—వీటిలో ధాన్యములగురించిన నిబంధములను వ్యవసాయాధ్యక్షప్రకరణమున వివరించుచున్నాము.

13. వెన్న, నూనె, వస, ఎముకలలోని క్రొవ్వు—ఇవి క్రొవ్వుపదార్థములు.

14. కషాయము, బెల్లము, తెల్లగచేయబడని చక్కెర, కలకండ, చక్కెర—ఇవి క్షారవర్గములోనివి.

15. సైంధవలవణము, సముద్రలవణము, బిడక్షారము,[7] సూరేకారము, సౌవర్చలము, పరలఉప్పు—ఇవి లవణవర్గములోనివి.

16. తేనె, ద్రాక్షరసము మధువర్గములోనివి.

17. చెరకురసము, బెల్లము, తేనె, తియ్యనికషాయము, జంబురసము, పనసపండురసము—వీటిలో ఒకదానిని మేషశృంగపిప్పలుల కషాయముతో కలిపి ఒకనెలగాని, ఆరునెలలుగాని, సంవత్సరముగాని గడచినతర్వాత చిర్భిటము, ఉర్వారుకము, చెరకుగడ, మామిడిపండు, ఉసిరిక అనువానితో కలిపియో, కలపకయో ఉంచినయెడల మధువర్గములోని పదార్థములు ఏర్పడును.

---

[3] వీరందరు పన్నులను చెల్లించుటకు బదులు వారివారికి అర్హములైన పనులనుచేసి తమ బాకీని తీర్చువారు.

[4] ప్రజలలో ఎవరైనను పోగొట్టుకొన్న వస్తువును, మరచిపోయిన వస్తువును ప్రభుత్వము వశముచేసుకొను సంప్రదాయమును సూచించుచున్నది.

[5] ధాన్యమును కొలుచునపుడు కొలిచేవాడు కొలమానములోని ధాన్యముపై చేతులుపెట్టి ఎక్కువ ధాన్యమును వశపరుచుకొనుట.

[6] వ్యాపారము మూలమున లభించిన ఆదాయము.

[7] బిడక్షారము : సోడా, సున్నము, గంధకము మొదలైనవాటి కలయికవలన ఏర్పడిన ఒకవిధమైన ఉప్పు.

18. చింతపండు, కలివెపండు, మామిడిపండు, దానిమ్మ, ఉసిరిక మాదీఫలము, రేగు, గంగరేగు, సౌవీరకము, పరూషకము మొదలైనవి అమ్లఫల వర్గములోనివి.

19. పెరుగు, పులిసినగంజి మొదలైనవి ద్రవామ్లవర్గములోనివి.

20. పిప్పలి, మిరియాలు, అల్లము, జాజి, నేలవేము, తెల్లఆవాలు, ధనియాలు, చోరకము, దవనము, మరువము, శిగ్రుకాండము మొదలైనవి కటుక (కటు) వర్గములోనివి.

21. ఎండినచేపలు, ఎండినమాంసము, కందమూలములు, పండ్లు, కాయ గూరలు మొదలైనవి శాకవర్గములోనివి.

22. వీటిలో అర్ధభాగము ప్రజల ఆపదర్థమై ప్రత్యేకించి ఉంచవలెను; తక్కినభాగమును వినియోగించవలెను. 23. ప్రాతవాటిస్థానే కొత్తవాటిని సేకరించ వలెను.

24. దంచినప్పుడు, పప్పులుచేసినప్పుడు, విసిరినప్పుడు, వేయించినప్పుడు, నానబెట్టినప్పుడు, ఎండబెట్టినప్పుడు, వండినప్పుడు ధాన్యములలో కలుగు హెచ్చు తగ్గులను అతడు స్వయముగ చూడవలెను.

25. అళ్ళు వ్రీహిధాన్యములలో సారము (ఆహారయోగ్యము) అర్ధభాగము;[8] శాలిధాన్యములో అంతకంటె అర్ధభాగము తక్కువ,[9] వరకధాన్యములో మూడోవంతు తక్కువ. 26. ప్రియంగుధాన్యములో సారము అర్ధభాగము, కాని తొమ్మిదోవంతు వృద్ధికావచ్చును. 27. ఉద్రకము యవలు గోధుమలు పిండిచేసినప్పుడు పూర్వపు పరిమాణము కలిగియుండును. పప్పులుగ చేసినప్పుడు నువ్వులు, యవలు' పెసలు,మినుములు అదేపరిమాణము కలవిగనుండును. 28. వేయించినప్పుడు గోధుమలు యవలు అయిదోవంతు వృద్ధిగాంచును. 29. కలాయము నాల్గోవంతు తగ్గిపోవును. 30. పెసలు మినుముల సారము ఎనిమిదోవంతు తగ్గిపోవును. 31. శైబ్యముల సారము అర్ధభాగము, మసూరముల సారము అందులో మూడో వంతు తగ్గును.

32. పిండికుల్మాషములు ఒకటిన్నరవంతు వృద్ధిగాంచును. 33. యవల అన్నము పులాకము ఉడకబెట్టినపిండి రెండువంతులు వృద్ధిగాంచును.

34. వండినప్పుడు కోద్రవము, వరకము, ఉదారకము, ప్రియంగులు మూడురెట్లును, వ్రీహి నాలుగురెట్లును, శాలి అయిదురెట్లును వృద్ధిగాంచును.

35. ధాన్యములు నానవేసినప్పుడు రెండురెట్లు, మొవులు వచ్చువరకు నానవేసినప్పుడు రెండున్నరరెట్లు వృద్ధిగాంచును.

---

[8] ధాన్యములను దంచినతర్వాత ఊక, పొట్టు పోగా మిగిలేది సారము.

[9] ఎనిమిదోవంతు ($\frac{1}{8}$) తక్కువ అని కొన్నిపాఠములు.

36. వేయించినప్పుడు అయిదవవంతు వృద్ధికలుగును. 37. (కాని) కలాయము, పేలాలు, యవలు రెండురెట్లు వృద్ధిగాంచును.

38. అవిసెనుండి ఆరవవంతు నూనె లభించును. 39. వేప, కుశామ్ర, కపిత్థములనుండి అయిదవవంతు లభించును. 40. నువ్వులు, కుసుమలు, ఇప్ప, గార— వీటినుండి నాలుగోవంతు లభించును.

41. అయిదుపలముల దూదినుండియు, క్షౌమమునుండియు ఒకపలము నూనె తీయవచ్చును.

42. అయిదుద్రోణముల శాలిధాన్యమునుండి పండ్రెండుఆఢకముల బియ్యము సిద్ధపరచి పిల్లఏనుగునకు, పదకొండుఆఢకములు దుష్టమైనఏనుగునకు, పది ఆఢకములు స్వారికిఉపయోగించు ఏనుగునకు, తొమ్మిదిఆఢకములు యుద్ధములో ఉపయోగించు ఏనుగునకు, ఎనిమిదిఆఢకములు పదాతిసైనికులకు, ఏడుఆఢకములు ముఖ్యులకు, ఆరుఆఢకములు రాణులకు రాజపుత్రులకు, అయిదుఆఢకములు రాజునకు—లేదా, విరుగనట్టియు పరిశుద్ధమైనట్టియు ఒక ప్రస్థము బియ్యము ఆహారముగ వినియోగించవలెను.[10]

43. ఒక ప్రస్థము బియ్యము, అందులో నాల్గవవంతు పప్పు, పప్పులో పదహారవవంతు ఉప్పు, నాల్గవవంతు నెయ్యి, నూనె—ఇవి ఆర్యునికి ఒకపూట ఆహారము. 44. ప్రస్థములో ఆరవవంతు పప్పు, అందులో అర్ధభాగము నూనె తక్కువ వర్ణములవారి ఆహారము. 45. (పురుషుల ఆహారములో) నాల్గవవంతు తగ్గించి స్త్రీలకు. 46. అర్ధభాగము తగ్గించి పిల్లలకు (ఇయ్యవలెను).

47. ఇరవైపలముల మాంసమునకు అర్ధకుడుబము నూనె, ఒకపలము ఉప్పు, ఒకపలము చక్కెర, రెండుధరణముల కటుపదార్థములు (మసాలా ద్రవ్యములు), అర్ధప్రస్థము పెరుగు ఉపయోగించవలెను. 48. దీనినుండి ఎక్కువ ప్రమాణముల విషయము గ్రహించునది. 49. కూరగాయలకు (పై ప్రమాణములలో) ఒకటిన్నరరెట్లు, ఎండినవాటికి (మాంసాదులకు) రెండురెట్లు అదేపదార్థములను వాడవలెను.

50. హస్త్యశ్వముల ఆహారప్రమాణము ఆయా అధ్యక్షులకు సంబంధించిన అధ్యాయములలో వివరింపబడును.

51. ఎడ్లకు గుర్రముల ఆహారపదార్థములలో ఒకద్రోణము మినుములు, లేదా, యవలపులాకము కలుపవలెను. 52. ఎడ్లకు విశిష్టమైన ఆహారము ఒక తులము గానుగపిండి, లేదా, పదిఆఢకముల నూకలును, పొట్టును. 53. దున్నపోతు

[10] ధాన్యముల నాణెము అధికము కానుకాను వాటిని దంచినప్పుడు మిగిలే బియ్యము తగ్గుచు ఉండునను సూత్రము దీనికంతకు ఆధారము. లేదా, ఎక్కువ తెల్లగా ఉండవలెనను ఉద్దేశముతో బియ్యమును ఎక్కువగా దంచినప్పుడు తరుగు అధికమగును.

లకు, ఒంటెలకు దీనికి రెండింతలు. 54. గాడిదలకు, మచ్చలలేళ్ళకు, ఎర్ర లేళ్ళకు అర్ధద్రోణము (మినుములుగాని యవపులాకముగాని). 55. ఏణములకు, కురంగములకు ఒకఆఢకము. 56. మేకలకు, పొట్టేళ్ళకు, పందులకు, అర్ధాఢకము. 57. కుక్కలకు ఒకప్రస్థము అన్నము. 58. హంసలకు, క్రౌంచములకు, నెమళ్ళకు అర్ధప్రస్థము. 59. తక్కిన లేళ్ళకు మృగములకు పక్షులకు అడవిజంతువులకు అవి తిను ఒకపూట ఆహారమును గమనించి అంచనావేయవలెను.

60. బొగ్గును ఊకను లోహకర్మాగారములకు (సున్నపురాళ్ళు కాల్చు) బట్టీలకు పంపవలెను. 61. నూకలను దాసజనమునకు, కార్మికులకు, సూపకారులకు ఇయ్యవలెను. మిగిలినదానిని[11] అన్నమును, అపూపములను[12] విక్రయించువారికి ఇయ్యవలెను.

62. త్రాసు, తూకములు, మానములు, తిరుగళ్ళు, రోకళ్ళు, రోళ్ళు, దంచుటకు విసరుటకు ఉపయోగించు యంత్రములు, తూర్పారపట్టు చేటలు, గంపలు, జల్లెడలు, బెత్తపుగంపలు, పెట్టెలు, చీపుళ్ళు—ఇవి ఉపకరణములు.

63. ఊడ్చువాడు, కావలికాచువాడు, తూచువాడు, కొలుచువాడు, కొలిపించు అధికారి, ఇచ్చువాడు, ఇప్పించు అధికారి, తులామానముల మూలమున కలిగిన నష్టమునకు పరిహారము వసూలుచేయువాడు, దాసవర్గము, కార్మికవర్గము—వీరందరు విష్టివర్గము.

64. (శ్లో) ధాన్యములు దాచుటకు కోష్ఠాగారము[13] ఉన్నతప్రదేశమందుండవలెను. క్షారములు దాచుటకు గడ్డిసంచులు, నూనెలను దాచుటకు మట్టికుండలు, కర్రపీపాలు ఉండవలెను. ఉప్పును భూమిలో (పాతరలలో) దాచవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండోఅధికరణమున కోష్ఠాగారధ్యక్షుడు అనే పదిహేనో అధ్యాయము.

[11] వంటశాలలో మిగిలిపోయిన అన్నమూ, వంటకములూ అని కొందరు వ్యాఖ్యాతలు.

[12] వివిధములైన తినుబండారములు.

[13] రాజుయొక్క కోష్ఠాగారమందు వాడకముకావలసిన పదార్థములన్నియు దాచబడుచుండెను. వానిని సేకరించుటకు, గుణదోషముల పరీక్షించుటకు, వినియోగముచేయుటకు ఎందరో ఉద్యోగుల అవసరముండెను. వారందరిపై పెత్తనము వహించినవాడు కోష్ఠాగారధ్యక్షుడు.

# రెండో అధికరణము

## అధ్యాయము 16

### ప్రకరణము 34 : పణ్యాధ్యక్షుడు

1. పణ్యాధ్యక్షుడు నేలమీదగాని నీటిలోగాని ఉత్పత్తియగునట్టియు, మెట్ట మార్గములద్వారాగాని, నీటిమార్గములద్వారాగాని వచ్చినట్టియు, ఎక్కువవిలువగల వస్తువులయొక్కయు, తక్కువవిలువగల వస్తువులయొక్కయు ఖరీదులలోని వ్యత్యాసములనూ, ప్రజలలో వాటికిగల ప్రియత్వాప్రియత్వములను, వాటిని కేంద్రీకరించుటకును, వికేంద్రీకరించుటకును, కొనుటకును, అమ్ముటకును తగిన కాలములను ఎరిగియుండవలెను.

2. ఎక్కువ ప్రచురముగల వస్తువును[1] ఒకచోట చేర్చి దాని ఖరీదును హెచ్చించవలెను. 3. హెచ్చు ఖరీదు నిచ్చి అందరు కొనుచున్నప్పుడు అంతకంటె హెచ్చుగు మరియొక ధరను నిర్ణయించవలెను.

4. స్వరాజ్యములో ఉత్పత్తిఅయిన రాజపణ్యములను ఒకచోట చేర్చి[2] వ్యాపారమును సాగించవలెను ; పరరాజ్యములనుండి వచ్చినవాటిని అనేక ప్రదేశములలో చేర్చి[3] వ్యాపారమును సాగించవలెను. 5. రెండువిధములైన సరకులను ప్రజల లాభమును గుర్తించి విక్రయించవలెను. 6. (రాజునకు) లాభము తెచ్చునట్టివి అయినను ప్రజలకు హానికరములుగనుండు ధరలను విసర్జించవలెను. 7. నిత్యమును వాడకమునకు కావలసిన వస్తువుల విషయమున[4] (విక్రయ కాల నిర్ణయమునుగాని, అత్యధికముగగాని సమకూర్చుటనుగాని చేయరాదు.

---

[1] అధికముగ లభించు వస్తువు అని కొందరు వ్యాఖ్యాతలు.

[2] ఏకముఖము అని మూలము.

[3] బహుముఖము అని మూలము.

[4] పాలు, కూరగాయలు మొదలైనవి. ఇవి ఏరోజుకు ఆరోజు కొనవలసినట్టివి ; అందుచేత అత్యధికముగ సమకూర్చరాదు.

8. లేదా, నిర్ణయించిన ధరలమేరకు రాజపణ్యములను వర్తకులు అనేక ప్రదేశములందు విక్రయించవలెను. 9. నష్టానుసారము పరిహారమును చెల్లించవలెను.[5]

10. కొలిచి అమ్మునట్టి వస్తువులపై పదహారోవంతూ, తూచి అమ్మువాటిపై ఇరవైయోవంతూ, లెక్కపెట్టి అమ్మువాటిపై పదకొండోవంతూ వ్యాజి (ఒక పన్ను).

11. పరరాజ్యములలో ఉత్పత్తియగు సరకుల దిగుమతిని ప్రత్యేక సదుపాయములద్వారా ప్రోత్సహించవలెను. 12. వాటిని తెచ్చు నావికులకును, సార్థవాహులకును లాభకరమగునట్లు పన్నుల పరిహారమును కల్పించవలెను. 13. పరరాజ్యములనుండి వచ్చిన వర్తకులపై అర్థవిషయకములగు దావాలు చేయరాదు. స్వరాజ్యవర్తకసంఘములలో సభ్యులగువారి విషయమునను, సహకారులుగ నుండువారి విషయమునను ఈ సూత్రము వర్తించదు.

14. రాజపణ్యములను అమ్ము అధికారులు వస్తువుల విక్రయధనమును ఒకే రంధ్రముగల మూతతోకూడిన పెట్టెలో పెట్టి ఒకచోట చేర్చవలెను. 15. దినముయొక్క ఎనిమిదవభాగమున, "ఇంత అమ్మకము అయినది ; ఇంత మిగిలినది." అనిచెప్పుచు దానిని పణ్యాధ్యక్షునివశము చేయవలెను. 16. తులామానములను కూడ అతని వశము చేయవలెను.

17. ఇది స్వరాజ్యములోని విక్రయముల వివరణము.

18. పరరాజ్యములో కొనవలసిన వస్తువుయొక్కయు (తన రాజ్యమునుండి తీసుకొనిపోయి) విక్రయించుటకు వీలైన వస్తువుయొక్కయు ధరను మూల్యమును తెలుసుకొని, శుల్కము, రహదారిరుసుము, కావలికాచువారి ఖర్చు, గుల్మము (ఒక విధమైన పన్ను), బల్లకట్టుఖర్చు, భోజనపుఖర్చు, పశుగ్రాసపుఖర్చు—వీటినన్నిటిని లెక్కవేసి లాభమును తేల్చవలెను. 19. లాభము లేనిపక్షమున తన రాజ్యమునుండి సరకులను ఎగుమతిచేయుటగాని, సరకుల నిచ్చి పరరాజ్యపు సరకులను తీసుకొనుటగాని ప్రయోజనకరమా అను విషయమును ఆలోచించవలెను. 20. అటుతర్వాత నాల్గవవంతు ఎక్కువ విలువగల సరకులతో క్షేమకరమైన మెట్టమార్గముమీదుగా వ్యాపారమును ప్రారంభించవలెను.[6] 21. వారి అనుగ్రహమును సంపాదించుటకై అటవికముఖ్యులతోను, అంతపాలురతోను, పురముఖ్యులతోను, రాష్ట్రముఖ్యులతోను స్నేహము చేయవలెను. 22. ప్రమాదము సంభవించినప్పుడు

---

[5] రాజపణ్యములను పణ్యాధ్యక్షుడు అమ్ముటకు బదులు వర్తకులు అమ్మునప్పుడు రాజునకు నష్టము కలుగును. దానిని పూరించుటకై వారు పరిహారము నిచ్చుకొనవలెను. దానికి వైధరణికమని పేరు.

[6] పరరాజ్యములో వ్యాపారముచేయుటకై తీసుకొనిపోవు సరకులలో నాల్గవవంతు సారములుగను తక్కినది ఫల్గుగను ఉండవలెను. ఈ వ్యాపారము నంతను పణ్యాధ్యక్షుడు స్వయముగ సాగించునట్టిది.

సారవస్తువులనూ, తన్నూ విడుదల చేసుకొనవలెను. 23. లేదా, గమ్యస్థానమును చేరగలిగిన యెడల శుల్కము లన్నిటిని చెల్లించి వ్యాపారమును సాగించవలెను. 24. నీటి మార్గమున వెళ్ళునప్పుడు పడవ ఖర్చులు, ప్రయాణకాలమున భోజనపు ఖర్చులు, తన సరుకుల ఖరీదూ ప్రమాణమును, తాను మార్చదలచిన సరుకుల ఖరీదూ ప్రమాణమును, ప్రయాణమునకు తగినకాలములు, ప్రమాదములకు ప్రతిక్రియలు, రేవుపట్టణములకు సంబంధించిన నియమములు—వీటి నన్నిటిని కనుగొనవలెను.

25. (శ్లో) నదీమార్గములందు రేవుపట్టణముల నియమముల సహాయమున వ్యాపారపరిస్థితులను తెలుసుకొని, లాభముండు ప్రదేశమునకు వెళ్ళవలెను; లాభములేని ప్రదేశమును పరివర్జించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున పణ్యాధ్యక్షుడనే పదహారో అధ్యాయము.

ఈ అధ్యాయమువలన కౌటిల్యుని కాలములో ప్రభుత్వము స్వయముగ వర్తక వ్యాపారములను చేయుచుండినట్లు స్పష్టమగుచున్నది. ప్రస్తుతకాలమున ప్రభుత్వము వర్తకవ్యాపారము చేయవచ్చునా చేయకూడదా అను విషయమునుగురించి వాదోప వాదములు జరుగుచున్నవి. సోషలిస్టు సమాజమును రూపొందించుటకు ఇది యొక సాధనమని అనేకుల వాదము. ఈ సందర్భమున ప్రాచీన సంప్రదాయము ఎట్టిదో మనకు ఈ అధ్యాయమున తెలియుచున్నది.

## అధ్యాయము 17

### ప్రకరణము 35 : కుప్యాధ్యక్షుడు

1. కుప్యాధ్యక్షుడు[1] ద్రవ్యవనములను పాలించువారిద్వారా కుప్యములను తెప్పించవలెను. 2. అట్టి ద్రవ్యములకు సంబంధించిన కర్మాగారములను స్థాపించి నడిపించవలెను. 3. ద్రవ్యవనములను ఛేదించువారు, ఆపత్కాలములందు తప్ప, తక్కినకాలములందు చెల్లించవలసిన రుసుములను దండములను నిర్ణయించవలెను.

4. కుప్యవర్గము ఈ క్రిందివిధముగ నుండును : శాక (టేకు), తినిశ, ధాన్వన, అర్జున (మద్ది), మధూక (ఇప్ప), తిలక, సాల, శింశప, అరిమేద, రాజాదన, శిరీష, ఖదిర, సరళ, తాల, సర్జ, అశ్వకర్ణ, సోమవల్క, కుశ, ఆమ్ర, ప్రియక, ధవ మొదలైన వృక్షములు సారమగు దారు (కలప) వర్గమునకు చెందినవి.

5. ఉటజ, చిమియ, చాప, వేణు, వంశ, సాతిన, కంటక, భాల్లూక మొదలైనవి వేణు (వెదురు) వర్గమునకు చెందినవి.

6. వేత్ర, శికవల్లి, వాశి, శ్యామలత, నాగలత మొదలైనవి వల్లీ (తీగెల) వర్గమునకు చెందినవి.

7. మాలతి, మూర్వ, అర్క, శణ, గవేధుక, అతసి మొదలైనవి వల్క (నారల) వర్గమునకు చెందినవి.

8. ముంజ, బల్బజ మొదలైనవి రజ్జుభాండములు (త్రాళ్ళసామగ్రి).

9. తాలి, తాల, భూర్జపత్రములు.

10. కింశుకము, కుసుంభము, కుంకుమము—వీటి పుష్పములు.

11. కందమూలములు, ఫలములు మొదలైనవి ఔషధవర్గమునకు చెందినవి.

12. కాలకూటము, వత్సనాభము, హాలాహలము, మేషశృంగము, ముస్త, కుష్ఠము, మహావిషము, వేల్లితకము, గౌరార్ద్రము, వాలకము, మార్కటము,

[1] కుప్య మనగా అడవులనుండి లభించు ద్రవ్యముల సముదాయము.

హైమవతము, కాళింగకము, దారదకము, అంకోలసారము, ఔష్ట్రకము మొదలైనవి విషములు ; సర్పములు, కీటకములు, కుండలలో దాచబడిన ఇట్టివి[2] విషవర్గమునకు చెందినవి.

13. గోధ (మొసలి), సేరక, ద్వీపి (చిరుతపులి), శింశుమారము, సింహము, వ్యాఘ్రము, ఏనుగు, మహిషము, చమరము, సృమరము, ఖడ్గమృగము, గోమృగము, గవయము మొదలైన మృగములయొక్కయు, ఇతర మృగపశుపక్షి వ్యాళములయొక్కయు చర్మములు, ఎముకలు, పిత్తములు, నరములు, కన్నులు, పండ్లు, కొమ్ములు, డెక్కలు, తోకలు.

14. ఇనుము, రాగి, ఉక్కు, కంచు, సీసము, తగరము, వైక్రంతకము, ఆరకూటము మొదలైనవి లోహములు.

15. వెదుళ్ళతోను, మట్టితోను చేయబడిన సామగ్రి.

16. బొగ్గు, ఊక, బూడిద ; మృగపశుపక్షి వ్యాళముల స్థావరములు ; కట్టెలయు తృణములయు స్థావరములు.

17. (శ్లో) నగర రక్షణార్థమును, నగరములోని ప్రజల జీవనార్థమును నగరమునకు బయటను లోపలను అన్నిరకములైన సామగ్రిని తయారుచేయగల కర్మాగారములను వేరువేరుగ కుప్యాధ్యక్షుడు స్థాపించవలెను.[3]

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున కుప్యాధ్యక్షుడు అనే పదిహేడో అధ్యాయము.

---

[2] 'ఇట్టివి' అనగా సర్పములు మొదలైనవి.

[3] అడవులనుండి ఎన్నెన్నిరకముల పదార్థములు లభించుచుండెనో ఈ అధ్యాయము స్పష్టము చేయుచున్నది. కుప్యాధ్యక్షుడు ప్రస్తుతకాలపు అటవీశాఖ ప్రధానాధికారికంటె ఎక్కువ బాధ్యతలను వహించినట్టివాడు. అడవుల రక్షణ, వానినుండి వివిధములగు పదార్థములను సేకరించుట, ముడిపదార్థములనుండి వివిధములగు వస్తుసామగ్రిని తయారుచేయుటకు కర్మాగారముల స్థాపించుట, కర్మాగారములలో తయారగు వస్తువులను విక్రయించుట మున్నగునవి అతని బాధ్యతలలో చేరియుండును.

# రెండో అధికరణము

## అధ్యాయము 18

### ప్రకరణము 36 : ఆయుధాగారాధ్యక్షుడు

1. ఆయుధాగారాధ్యక్షుడు ఆయా ఆయుధములను తయారుచేయుటయందు నిపుణులైనవారితో వారు చేయవలసిన కార్యములను, పరిమాణమును, కాలమును, వేతనములనుగురించి నిర్ణయముల గావించుకొని, వారిచేత యుద్ధమందు ఉపయోగించదగినట్టియు, దుర్గముల రక్షింపశక్తిగలిగినట్టియు, శత్రుపురముల భేదింపగలవియు అయిన యంత్రములను, ఆయుధములను, కవచములను, ఇతరోపకరణములను చేయించి వాటివాటికి తగినస్థానములలో దాచిఉంచవలెను.[1] 2. వాటిని ఒకచోటనుండి మరియొకచోటునకు మార్చుచూ ఎండా గాలి తగులునట్లుగా చేయవలెను. 3. వేడివలనగాని, తడివలనగాని, క్రిములవలనగాని చెడిపోవువాటిని మార్గాంతరమున దాచిఉంచవలెను. 4. వాటి జాతిని, రూపమును, లక్షణమును, ప్రమాణమును, ఉత్పత్తిస్థానమును, మూల్యమును, దాచినప్రదేశమును (అధ్యక్షుడు) ఎరిగియుండవలెను.

5. సర్వతోభద్రము, జామదగ్న్యము, బహుముఖము, విశ్వాసఘాతి, సంఘాతి, యానకము, పర్జన్యకము, బాహువు, ఊర్ధ్వబాహువు, అర్ధబాహువు—ఇవి స్థిత (కదలక ఒకేచోట స్థిరముగ ఉంచవలసిన) యంత్రములు.

6. పాంచాలికము, దేవదండము, సూకరికము, ముసలయష్టి, హస్తివారకము, తాలవృంతము, ముద్గరము, గద, స్పృక్తల, కుట్టాలము, ఆస్ఫాటిమము, ఉత్పాటిమము, ఉద్ఘాటిమము, శతఘ్ని, త్రిశూలము, చక్రము—ఇవి చలయంత్రములు.

---

[1] ఆయుధముల విషయమున రాజ్యము స్వయంపోషకముగ నుండవలెనని ప్రాచీనులు పూర్తిగ గుర్తించిరి. ప్రస్తుతకాలపు ప్రభుత్వమువలె విదేశములపై ఆధారపడి ఉండువారుకారు.

7. శక్తి, ప్రాసము, కుంతము, హాటకము, భిండిపాలము, శూలము, తోమరము, వరాహకర్ణము, కణయము, కర్పణము, త్రాసికము మొదలైనవి హలముఖములు (పొడుచుటకు తగిన మొనలు కలవి).

8. తాలచాపములతోను[2] కర్రతోను, కొమ్ములతోను చేయబడి, కార్ముకము, కోదండము, ద్రోణము అను పేర్లుగలవి ధనుస్సులు. 9. మూర్వ, అర్కము, రణము, గవేధు, వేణువు—వీటితోను, స్నాయువులతోను చేయబడినట్టివి అల్లెత్రాళ్ళు. 10. వేణువు, శరము, శలాక, దండాసనము, నారాచము—ఇవి ఇషువులు (బాణములు). 11. ఛేదించుటకును, భేదించుటకును, కొట్టుటకును వీలగునట్లుగ వాటి మొనలు ఇనుము, ఎముక, కర్రలతో చేయబడును.

12. నిస్త్రింశము, మండలాగ్రము, అసియష్టి—ఇవి ఖడ్గములు. 13. ఖడ్గమహిషముల కొమ్ము, ఏనుగుదంతము, కర్ర, వెదురువేరు—ఇవి వీటి పిడులు.

14. పరశువు, కుఠారము, పట్టసము, ఖనిత్రము, కూహలము, క్రకచము, కాండచ్ఛేదనము—ఇవి క్షౌరపుకత్తులవంటివి.

15. యంత్రములలోను, గోష్పణములలో (ఉచ్చులు)ను ఉపయోగించునట్టియు, చేతితో విసరుటకు సాధ్యమైనట్టియు రాళ్ళు, తిరుగళ్ళు—ఇవి రాతి ఆయుధములు.

16. లోహజాలికము,[3] పట్టము,[4] కవచము, సూత్రకము[5] అనునవి ఇనుముతోను, శింశుమారకము, ఖడ్గమృగము, ధేనుకము, గజము, గోవు మున్నగువాటి చర్మములతోను డెక్కలతోను కొమ్ములతోను చేయబడిన వర్మములు (కవచములు). 17. శిరస్త్రాణము, కంఠత్రాణము, కూర్పాసము,[6] కంచుకము,[7] వారవాణము,[8] పట్టము,[9] నాగోదారికము,[10] పేటి,[11] చర్మము, హస్తికర్ణము, తాలమూలము, ధమనిక,

---

[2] ఈ అధ్యాయములలో కౌటిల్యుడు వివరించిన ఆయుధములకును మధ్యయుగపు భోజుని "యుక్తికల్పతరువు," వైశంపాయనుని "నీతిప్రకాశిక" మున్నగు గ్రంథములలో వివరింపబడిన వానికిని ఎంతో భేదమున్నది. కౌటిల్యు డనుసరించిన సంప్రదాయము భిన్నమైనట్టిదనియు, మధ్యయుగము నాటికది ప్రాధాన్యమును కోల్పోయెననియు ఊహించదగును.

[3] ఇనుపఉంగరముల కవచము—శరీరమును తలను చేతులను రక్షించునది.

[4] ఇనుప పట్టముతో చేయబడినట్టిది.

[5] నూలుబట్టతో చేయబడినట్టిది.

[6] శరీరము మధ్యభాగమును మాత్రమే కప్పునట్టిది.

[7] మోకాళ్ళవరకు రక్షించునది.

[8] కాలిమడిమలవరకు రక్షించునది.

[9] చేతులు మినహాగా తక్కిన అవయవములను రక్షించునది.

[10] చేతిప్రేళ్ళను రక్షించునది.

[11] కోష్టవల్లి అను తీగెతో చేయబడినది.

కపాటము, కిటిక, అప్రతిహతము, బలాహకాంతము[12]—ఇవి ఆవరణములు (ఆయా అంగములను రక్షించు సాధనములు).

18. ఏనుగులకు రథికులకు గుఱ్ఱములకు శిక్షణ ఇచ్చుటలో ఉపయోగింపబడు సాధనములు, వాటి అలంకరణసామగ్రి, వాటి సన్నాహసాధనములు—ఇవి ఉపకరణములు.

19. ఇంద్రజాలము, రహస్యచర్యలు—ఇవి (రహస్య) కర్మ.[13]

20. కర్మాగారముల విషయమున (శ్లో) ఆయుధాగారాధ్యక్షుడు (రాజు యొక్క) ఇచ్ఛను, కార్యనిర్వహణమును, (ఆయుధములు) చేయు విధమును, అందులో జరుగు మోసమును, కుప్యములకు సంబంధించిన లాభము, నష్టము, వ్యయము[14]—వీటి నన్నిటిని ఎరిగియుండవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున ఆయుధాగారాధ్యక్షుడు అనే పద్దెనిమిదో అధ్యాయము.

---

[12] హస్తికర్ణము మొదలైనవి రక్షకసాధనములను చేయుటకై ఉపయోగింపబడు చర్మము, కఱ్ఱ మొదలైన సామగ్రులలోని భేదములబట్టి ఏర్పడిన పేర్లు.

[13] ఇవి 14వ అధికరణమున వివరింపబడియున్నవి.

[14] ఆయుధములు చేయుటకు కావలసిన ముడిపదార్థములన్నియు అడవులనుండి లభించునట్టివి గనుక కుప్యముల గురించిన జ్ఞానము అధ్యక్షునికి ఉండుట అవసరము.

## రెండో అధికరణము

### అధ్యాయము 19

### ప్రకరణము 37 : పౌతవాధ్యక్షుడు

1. పౌతవాధ్యక్షుడు[1] ప్రామాణికములగు తూకములను, మానములను తయారుచేయుటకై కర్మాగారములను స్థాపించవలెను.

2. 10 మినుపగింజలు, లేదా, 5 గురిగింజలు ఒక సువర్ణమాషకము. 3. 16 సువర్ణమాషకములు ఒక సువర్ణము, లేదా, ఒక కర్షము. 4. 4 కర్షములు ఒక పలము.

5. 88 తెల్లఆవాలగింజలు ఒక వెండిమాషకము. 6. 16 వెండిమాషకములు, లేదా, 20 శైబ్యపుగింజలు ఒక ధరణము.[2]

7. 20 బియ్యపు గింజలు ఒక వజ్రధరణము (ధరణము ఎత్తుగల వజ్రము 20 బియ్యపుగింజల బరువుకలది).

8. అర్ధమాషకము, ఒకమాషకము, రెండు, నాలుగు, ఎనిమిది మాషకములు, ఒకసువర్ణము, రెండు, నాలుగు, ఎనిమిది, పది, ఇరవై, ముప్పై, నలభై, నూరు సువర్ణములు—ఇవి తూకముల పేర్లు. 9. ధరణముల విషయము కూడ ఇట్టిదే అని గ్రహించవలెను.

10. తూకపుగుళ్ళను ఇనుముతోగాని, మగధలోను, మేకల[3] పర్వతములలోను దొరకు రాళ్ళతోగాని తయారుచేయవలెను ; లేదా, తడుపుటవల్లను పూతపూయుట వల్లను బరువు ఎక్కువకానట్టియు, వేడిమివలన బరువు తక్కువకానట్టియు మరి దేనినైనా వాడవచ్చును.

11. పొడవులో ఆరుఅంగుళములతో ప్రారంభించి ఎనిమిదేసి అంగుళముల

[1] పౌతవ మనగా తూకములయు, మానములయు సరియైన ప్రమాణమును నిర్ణయించుట.

[2] ఈ మానముల మూలమున ఒక వెండిమాషకము $\frac{2}{5}$ బంగారమాషకమునకు సమాన మగును.

[3] ఇవి మధ్యప్రదేశములో ఉన్నవి.

చొప్పున వృద్ధిచేయుచును, బరువులో ఒక పలము లోహముతో ప్రారంభించి ఒక్కొక్క పలముచొప్పున వృద్ధిచేయుచును పది రకముల త్రాసులను తయారు చేయవలెను. ముల్లుకు రెండువైపులా రెండు తట్టలుగాని, (ఒకేవైపు) ఒకే తట్టగాని అమర్చవచ్చును.[4]

12. సమావృత్త (అను పేరుగల త్రాసు) ను ముప్పైఅయిదు పలముల బరువును డెబ్బైరెండు అంగుళముల పొడవునుగల లోహముతో తయారుచేయించవలెను. 13. దానికి ఒక కొనయందు అయిదు పలముల బరువుగల గుండ్రపు లోహమును కట్టి సమకరణమును[5] చేయవలెను. 14. తర్వాత ఒక కర్షము బరువును (సూచించుటకు) ఒక్కొక్క కర్షముచొప్పున పలమువరకు వృద్ధిచేయుచు, తర్వాత పది పలములవరకును ఒక్కొక్క పలముచొప్పున వృద్ధిచేయుచు, అటు తర్వాత పండ్రెండు, పదిహేను, ఇరవై పలాల బరువువరకును గీతలు గీయవలెను. 15. అటుతర్వాత పది పలముల చొప్పున వృద్ధిచేయుచు, నూరు పలముల బరువును సూచించు గీతలు గీయవలెను. 16. అయిదులను సూచించు స్థానాలలో నంది విగ్రహమును చెక్కించవలెను.

17. దీనికి రెండింతల లోహముతో తొంబైఆరు అంగుళముల పొడవుగల పరిమాణి అను త్రాసును చేయించవలెను. 18. ఇందులో నూరు పలముల బరువును సూచించు గీతను గీసి, అటుతర్వాత 20, 50, 200 పలముల బరువును సూచించు గీతలు గీయవలెను.

19. 20 తులములు ఒక భారము.

20. 10 ధరణములు ఒక పలము. 21. ఇట్టి నూరు పలములు రాజాయమానము.[6] 22. దీనిని క్రమముగ అయిదు పలముల చొప్పున తగ్గించిన పక్షమున వ్యావహారికమానము, భాజనీమానము, అంతఃపురభాజనీమానము ఏర్పడును. 23. వీటిలో ఒక్కొక్క పలము ఆయమానీపలముకంటె (క్రమముగ) అర్ధధరణము తగ్గియుండును; కాడలోని లోహము క్రమముగ రెండు పలములచొప్పునను, పొడవు ఆరు అంగుళములచొప్పునను తగ్గుచు వచ్చును.

24. మొదటి రెండు త్రాసులలో (సమావృత్త, పరిమాణి) తూచినపుడు మాంసము, లోహములు, లవణము, మణులు తప్ప తక్కిన వస్తువుల విషయమున

[4] ఈ త్రాసుల పొడవు 6, 14, 22...78 అంగుళములు, బరువు 1, 2, 3...10 పలములు ఉండును.

[5] సమకరణ మనగా సున్న. ఈ త్రాసులో ఒక కొనయందు 5 పలముల గుండు. రెండవ కొనయందు తూచవలసిన వస్తువు వేలాడునట్లు కట్టబడును. గుర్తులబట్టి వస్తువుల బరువు తెలునుకొనవచ్చును.

[6] రాజుకు చెందవలసిన ఆయమును నిర్ణయించుటకు ఒక మానము. తక్కినవాటికి మరియొక మానము.

అయిదు పలముల ప్రయామమును (అధ్యక్షుడు) వసూలుచేయవలెను.[7]

25. ఒక కర్రతో చేయబడిన త్రాసు ఎనిమిది హస్తముల పొడవైనదిగను, గీతలతోగాని, తూకపుగుండ్లతోగాని కూడినట్టిదిగను, నెమలిపాదముల ఆకారముగల పీఠముపై అధిష్టింపబడినట్టిదిగను ఉండవలెను.

26. ఒక ప్రస్థము బియ్యమును ఉడికించుటకు ఇరవైఅయిదు పలముల వంటచెరకు కావలెను. 27. దీనినిబట్టి ఎక్కువతక్కువలను లెక్కవేసుకొనవలెను.

28. ఇది తులామానముల వివరణము.

29. 200 పలముల మినుపగింజలు ఒక ఆయమానద్రోణము; $187\frac{1}{2}$ పలములు వ్యావహారికద్రోణము; 175 పలములు భాజనీయద్రోణము; $162\frac{1}{2}$ పలములు అంతఃపురభాజనీయద్రోణము.

30. వీటిలో ఆఢకము, ప్రస్థము, కుడుబములు పై వాటిలో నాల్గవవంతు తగ్గియుండును. 31. 16 ద్రోణములు ఒక ఖారి. 32. 20 ద్రోణములు ఒక కుంభము. 33. 10 కుంభములు ఒక వహము.[8]

34. కొలపాత్రలను ఎండినట్టియు, సారమైనట్టియు కట్టెలతో, కొలవవలసిన పదార్థములో నాలుగోవంతు శిఖయందు నిలుచునట్లుగాగాని, అది లోపల పట్టునట్లుగా గాని నిర్మించవలెను. 35. కాని, రసములు, మద్యములు, పుష్పములు, ఫలములు, ఊక, బొగ్గు, సున్నము—వీటి విషయమున శిఖామానము రెండింతలు ఉండవలెను.

36. ఒక ద్రోణము ఖరీదు $1\frac{3}{4}$ పణములు; ఆఢకము ఖరీదు $\frac{3}{4}$ పణము; ప్రస్థము ఖరీదు 6 మాషకములు; కుడుబము ఖరీదు ఒక మాషకము. 37. రసముల కొలపాత్రల ఖరీదు దీనికి రెండింతలు. 38. తూకపుగుండ్ల ఖరీదు 20 పణములు. 39. త్రాసు ఖరీదు దీనిలో మూడోవంతు.

40. నాలుగు నెలలకు ఒక పర్యాయము తులామానములకు ముద్రలు వేయించవలెను.[9] 41. ముద్రలు లేనివాటికి ఇరవైఏడుంబావు పణముల దండము. 42. రోజుకు కాకణిచొప్పున వర్తకులు అధ్యక్షునికి ముద్రణ రుసుమును చెల్లించ వలెను.

43. వెన్నను కాచినందుకు ముప్పైరెండవభాగము, నూనెను కాచినందుకు అరవైనాల్గవభాగము వ్యాజిని చెల్లించవలెను.[10] 44. ద్రవముల విషయములో

---

[7] సరియైన తూకము తూచినందుకు రాజున కియ్యవలసిన రుసుమునకు ప్రయామమని పేరు.

[8] ఒక బండిలో తీసుకొనిపోవుటకు సాధ్యమైన పరిమాణము.

[9] ముద్రలు మాసిపోకుండుటకై ఈ ఏర్పాటు.

[10] వీటిని కోష్ఠాగారమునకు తెచ్చువారు ఇచ్చుకొనవలెను. కాచినప్పుడు కలుగు తరుగును పూర్తిచేయుటకు ఇది అవసరము.

మానస్రావము[11] ఏభైయోభాగము.

45. అర్ధకుడుబము, పాతికకుడుబము, ఎనిమిదోనంతు కుడుబములను (ఈమానములను) చేయించవలెను.

46. (శ్లో) 84 కుడుబముల నెయ్యి ఒక వారకము ; కాని 64 కుడుబముల నూనె ఒక వారక మగుచున్నది. వీటిలో నాల్గవవంతునకు ఘటిక అని పేరు.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమున పౌతవాధ్యక్షుడు అనే పందొమ్మిదో అధ్యాయము.

---

[11] ద్రవములను కొలిచినప్పుడు కొంతభాగము కొలపాత్రకు అంటుకొనిపోవును. ఆ నష్టమును పూర్తిచేయుటకు దీనిని ఇచ్చుకొనవలెను.

రెండో అధికరణము

## అధ్యాయము 20

### ప్రకరణము 38 : దేశకాలమానము

1. మానాధ్యక్షుడు దేశకాలమానములను తెలిసినవాడుగ ఉండవలెను.

2. 8 పరమాణువులు ఒక రథచక్రవిప్రుటు. 3. 8 విప్రుటులు ఒక లిక్ష. 4. 8 లిక్షలు ఒక యూక. 5. 8 యూకలు ఒక యవమధ్యము. 6. 8 యవ మధ్యములు ఒక అంగుళము. 7. లేదా, (పొడవుగాని పొట్టిగాని కానట్టి) మధ్యమ పురుషుని నడిమివ్రేలు నడిమిభాగవు అత్యధికమగు వెడల్పు ఒక అంగుళము.

8. 4 అంగుళములు ఒక ధనుర్గ్రహము. 9 8 అంగుళములు ఒక ధనుర్ముష్టి. 10. 12 అంగుళములు ఒక వితస్తి, లేదా, ఒక ఛాయాపౌరుషము. 11. 14 అంగుళములు ఒక శమము, ఒక శాల, ఒక పరిరయము, ఒక పదము.

12. 2 వితస్తులు ఒక అరత్ని (లేదా), ఒక ప్రజాపతిహస్తము. 13. ఒక ధనుర్గ్రహముతో కూడిన హస్తము తూకములయు, మానములయు, పశువుల బయళ్లయు కొలమానము. 14. ఒక ధనుర్ముష్టితో కూడిన హస్తము ఒక కిష్కువు, లేదా, ఒక కంసము. 15. 42 అంగుళములు ఒక వడ్రంగి రంపపుకిష్కువు. శిబిరము, దుర్గము, రాజప్రాసాదముల కొలమానముకూడ ఇదే. 16. కుప్య వనముల కొలమానము 54 అంగుళముల హస్తము.

17. 84 అంగుళములు ఒక వ్యామము. ఇది త్రాళ్ళకు, ఖాతములకు కొలమానము.

18. 4 అరత్నులు ఒక దండము, ఒక ధనుస్సు, ఒక నాలిక, ఒక గార్హాపత్య పౌరుషము. 19. 108 అంగుళములు ఒక ధనుస్సు—ఇది రహదార్లయు, దుర్గములయు, ప్రాకారములయు కొలమానము. (యజ్ఞయాగాదుల) అగ్నికుండ ముల కొలమానమగు పౌరుషము ఇదే. 20. 6 కంసములు ఒక దండము. బ్రహ్మదేయ భూములయు, అతిథుల భూములయు కొలమానము ఇదే.

21. 10 దండములు ఒక రజ్జువు. 22. రెండు రజ్జువులు ఒక పరిదేశము. 23. 3 రజ్జువులు ఒక పార్శ్వపునివర్తనము.[1] 24. దీనికి రెండు దండములు కలిపినయెడల ఒక బాహువు.

25. 2,000 ధనుస్సులు ఒక గోరుతము. 26. 4 గోరుతములు ఒక యోజనము. 27. ఇంతవరకు దేశమానములు వివరింపబడినవి.

28. ఇటుతర్వాత కాలమానములు వివరింపబడును.

29. తుటము, లవము, నిమిషము, కాష్ఠ, కల, నాలిక, ముహూర్తము, పూర్వాహ్ణము, మధ్యాహ్నము, పగలు, రాత్రి, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము, యుగము—ఇవి కాలములు. 30. రెండు తుటములు ఒక లవము. 31. రెండు లవములు ఒక నిమిషము. 32. అయిదు నిమిషములు ఒక కాష్ఠ. 33. ముప్పై కాష్ఠలు ఒక కళ. 34. నలభై కలలు ఒక నాలిక. 35. లేదా, నాలుగు మాషకముల బంగారమునుండి నాలుగు అంగుళముల పొడవుగల తీగెను తీసి, ఆ తీగెయొక్క యామమంత పరిమాణముగల రంధ్రమును ఒక భాండములో చేసి, దానిద్వారా ఒక అథకము నీరు దిగిపోవుటకు పట్టుకాలము ఒక నాలిక. 36. రెండు నాలికలు ఒక ముహూర్తము.

37. చైత్రఆశ్వయుజమాసములందు పదిహేను ముహూర్తములుగల పగలు, పదిహేను ముహూర్తములుగల రాత్రి ఉండును. 38. అటుతర్వాత, వీటిలో ఒకటి ఆరు మాసములలో మూడు ముహూర్తములచొప్పున మొదట వృద్ధిగాంచి తర్వాత క్షీణించును (రెండవదానిలో దీనికి విరుద్ధములగు మార్పులుండును).

39. నీడ పొడవు ఎనిమిది పౌరుషములైనప్పుడు పగటిలో 1/18 భాగము, ఆరు పౌరుషములైనప్పుడు 1/14 భాగము, మూడు పౌరుషములైనప్పుడు 1/8 భాగము, రెండు పౌరుషములైనప్పుడు 1/6 భాగము, ఒక పౌరుషమైనప్పుడు 1/4 భాగము, ఎనిమిది అంగుళములైనప్పుడు 3/10 భాగము, నాలుగు అంగుళములైనప్పుడు 3/8 భాగము గడచినట్లును, నీడలేనప్పుడు మధ్యాహ్నమనియు (తెలుసుకొనవలెను.) 40. అపరాహ్ణమందు తక్కిన భాగములనుగురించి, ఇదేవిధముగ తెలుసుకొనవలెను.

41. ఆషాఢమాసమందు మధ్యాహ్నమున నీడ ఉండదు.[2] 42. అటుతర్వాత శ్రావణమాసము మొదలు ఆరు మాసముల పర్యంతము మధ్యాహ్నపునీడ నెలకు రెండు అంగుళముల ప్రకారము వృద్ధిగాంచును. మాఘమాసము మొదలు ఆరు మాసముల పర్యంతము నెలకు రెండు అంగుళముల ప్రకారము తగ్గుచుండును.

43. పదిహేను అహోరాత్రములు ఒక పక్షము.

---

[1] నివర్తనము : విస్తీర్ణపు కొలత. దానికి పొడవు వెడల్పు అని రెండు పార్శ్వములు.

[2] ఇది వింధ్యపర్వతములకు ఉత్తరమునుండు ఆర్యావర్తపు లక్షణము.

44. వృద్ధిచంద్రుడుకల పక్షము శుక్లము. 45. క్షీణచంద్రుడుకలది బహుళము.

46. రెండు పక్షములు ఒక మాసము. 47. ముప్ఫై అహోరాత్రములు ఒక కర్మమాసము.[3] 48. దీనికి సగము కలిపినయెడల సౌరమాసము. 49. సగము తగ్గించినయెడల చాంద్రమాసము. 50. ఇరవైఏడు అహోరాత్రములు నక్షత్రమాసము. 51. ముప్ఫైరెండు అహోరాత్రములు సైనికమాసము.[4] 52. ముప్ఫైఅయిదు అహోరాత్రములు అశ్వపోషకులమాసము. 53. నలభై అహోరాత్రములు గజపోషకులమాసము.[5]

54. రెండు మాసములు ఒక ఋతువు. 55. శ్రావణప్రోష్ఠపదములు వర్షఋతువు. 56. అశ్వయుజకార్తికములు శరత్తు. 57. మార్గశీర్షపౌషములు హేమంతము. 58. మాఘఫాల్గుణములు శిశిరము. 59. చైత్రవైశాఖములు వసంతము. 60. జ్యేష్ఠామూలీయాషాఢములు గ్రీష్మము.

61. ఉత్తరాయణము శిశిరముతో ప్రారంభమగుచున్నది. 62. దక్షిణాయనము వర్షఋతువుతో ప్రారంభమగుచున్నది. 63. రెండు అయనములు ఒక సంవత్సరము. 64. అయిదు సంవత్సరములు ఒక యుగము.

65. (శ్లో) సూర్యుడు దినములో 1/60 భాగమును హరించుచు ఋతువులో ఒక దినమును నష్టపరచుచున్నాడు. చంద్రుడు కూడ ఇట్లే చేయుచున్నాడు.

66. (శ్లో) ఇట్లు రెండున్నర సంవత్సరముల కొకపర్యాయము వారొక అధికమాసమును కల్పించుచున్నారు. అందులో మొదటిది గ్రీష్మములోను రెండవది అయిదు సంవత్సరముల అంతమందును వచ్చుచున్నవి.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు దేశకాలమానము అను ఇరవైయో అధ్యాయము.

[3] నెలజీతములు పుచ్చుకొనువారి విషయమున వర్తించునట్టిది. ముప్ఫైరోజులు పని చేసినప్పుడే వారికి నెలజీతము ఇయ్యవలెను.

[4] సైనికులకు ముప్ఫైరెండు రోజుల కొకపర్యాయము జీతము.

[5] గుర్రములకు సంబంధించిన పనులనుచేయు నౌకర్లకు ముప్ఫైఅయిదురోజుల కొకపర్యాయము, ఏనుగుల నౌకర్లకు నలభై రోజుల కొకపర్యాయము జీతము.

# రెండో అధికరణము

## అధ్యాయము 21

### ప్రకరణము 39 : శుల్కాధ్యక్షుడు

1. శుల్కాధ్యక్షుడు నగరపు మహాద్వారముల[1] సమీపమున దూర్పుముఖముగ గాని, ఉత్తరముఖముగగాని శుల్కశాలను, ధ్వజమును స్థాపించవలెను.

2. శుల్కములను వసూలుచేయు అధికారులు నలుగురైదుగురు సార్థముతో వచ్చిన వర్తకులను గురించి వారెవరైనది, ఎక్కడనుండి వచ్చినది, ఎంతటి వర్తక సామగ్రితో వచ్చినది, అభిజ్ఞానపత్రమును ఎక్కడ వారికిచ్చినది, ఎచ్చట వారి సరకులకు ముద్ర వేయబడినది, వ్రాసి పెట్టవలెను.

3. ముద్రలేని వస్తువులపై దండము మూల్యమునకు రెండు రెట్లు. 4. దొంగముద్ర వేసినవాటిపై దండము శుల్కమునకు ఎనిమిదిరెట్లు. 5. చెదరిపోయిన ముద్రలుకల వస్తువులను ఒకరోజు[2] ఘటికాస్థానములో (గిడ్డంగిలో) దాచవలెను. 6. రాజముద్రనుగాని, తనపేరునుగాని[3] మార్చిన వర్తకునిపై $1\frac{1}{4}$ పణము దండమును విధించవలెను.

7. వర్తకులు తాము తెచ్చిన సరకులను ధ్వజస్తంభమువద్ద చేర్చి, వాటి ప్రమాణమును మూల్యమును ప్రకటించి "ఇంత ప్రమాణము, ఇంతటి ఖరీదుకల ఈ సామగ్రిని కొనువారు ఎవరు," అని అడుగవలెను.[4] 8. ముమ్మారు ఘోషించిన తర్వాత ముందుకు వచ్చినవారికి దానిని ఇచ్చివేయవలెను. 9. క్రేతల పోటీ మూలమున ఖరీదు పెరిగినప్పుడు పెరుగుదల శుల్కముతో కోశమునకు చెందవలెను.

---

[1] నగరపు నాలుగు ప్రధానద్వారములు.

[2] ప్రమాదమువలన ముద్రలు చెదరిపోవచ్చును. విచారణచేసి నిజము బయటపడువరకు సామగ్రి అధ్యక్షుని వశమందుండవలెను.

[3] ప్యాసుపోర్టులో నమోదైన పేరు, వర్తకుని పేరు భిన్నముగా ఉన్నప్పుడు ఇదే శిక్ష.

[4] ఇది ఒకమోస్తరు వేలముపాట.

10. శుల్కభయము వలన వస్తువు ప్రమాణమునుగాని మూల్యమునుగాని తగ్గించి చెప్పినప్పుడు భేదమును రాజు స్వాధీనము చేసుకొనవలెను. 11. లేదా, వర్తకుడు శుల్కమునకు ఎనిమిదిరెట్లు దండమును చెల్లించవలెను. 12. లేదా, తక్కువ మూల్యముగల సరకును నమూనాగా చూపించి ఎక్కువ మూల్యముగల సరకుల సంచుల ఖరీదును తగ్గించినప్పుడును, తక్కువ మూల్యముగలవాటిని ముందుగాబెట్టి వాటివెనుక ఎక్కువ మూల్యముగలవాటిని దాచినప్పుడును, ఇదే దండమును విధించవలెను.

13. లేదా, పోటీలోకి దిగిన క్రేతమూలమున కలిగిన భయమువలన వర్తకుడు మూల్యమును వృద్ధిచేసినప్పుడు వృద్ధాని రాజు స్వాధీనము చేసుకొనవలెను. లేదా, రెండింతల శుల్కమును వసూలు చేయవలెను. 14. వర్తకుని మోసములను దాచు అధ్యక్షునిపై దీనికి ఎనిమిదింతల దండమును విధించవలెను.

15. కావున, (వచ్చిన) సరకులను తూచి, కొలిచి, లెక్కపెట్టి (న తర్వాతనే) అమ్మవలెను. ఫల్గు (తక్కువ విలువగల) వస్తువులయు, అనుగ్రహమునకు పాత్రము లైన వస్తువులయు మూల్యమును అంచనా కట్టవలెను.

16. శుల్కమును చెల్లించక ధ్వజస్థానమును దాటి తీసుకొనిపోబడిన సరకులపై శుల్కమునకు ఎనిమిదిరెట్ల దండమును విధించవలెను. 17. రహదారులమీదను, రహదారులు లేని ప్రదేశములందును సంచరించు చారులు దానిని కనిపెట్టవలెను.

18. వివాహసామగ్రి, పెండ్లికుమార్తె పుట్టింటినుండి తీసుకొనిపోవు కానుకలు, ఇతరములగు కానుకలు, యజ్ఞాదికృత్యములందును, ప్రసవములందును, దేవతాపూజలయందును, చౌలోపనయనగోదానములందును, వ్రతదీక్షలందును, వినియోగింపదగిన వస్తుసామగ్రిపై శుల్కము లేదు. 19. ఈ సందర్భములో అన్యథాగా పలికినవానికి దొంగలపై విధించు దండమును విధించవలెను.

20. శుల్కము చెల్లించని వస్తువును చెల్లించిన వస్తువులతోకూడ తీసుకొనిపోవు వర్తకునకును, ఒకే ముద్రక్రింద (ముద్ర లేని భాండమును విప్పి అందులో ఉన్న) రెండవవస్తువును తీసుకొనిపోవు వర్తకునకును ఆ వస్తువులను స్వాధీనముచేసుకొని అంతటి దండమును విధించవలెను. 21. శుల్కస్థానమునుండి గోమయమునూ గడ్డినీ ప్రమాణముగ చూపించి, ఎక్కువ విలువగల వస్తువులను పైకితీసుకొనివెళ్ళు వానికి ఉత్తమసాహసదండము.

22. ఎగుమతి చేయకూడని వస్తువులలో దేనినైనను—అనగా, శస్త్రములు, వర్మములు, కవచములు, లోహములు, రథములు, రత్నములు, ధాన్యములు, పశువులు—బయటకు తీసుకొనిపోవువానికి ప్రకటింపబడిన దండమును విధించి, వస్తువులను స్వాధీనపరచుకొనవలెను. 23. వీటిలో దేనినైనను లోపలికి

తెచ్చినప్పుడు శుల్కరహితముగ నగరద్వారమునకు ఆవలనే విక్రయించవలెను.[5]

24. అంతపాలుడు ఒక బండెడు సరకులకు ఒకటింబావు పణమును, ఒక డెక్కగల జంతువునకు పణమును, పశువులకు అర్ధపణమును, సన్నజంతువులకు పావుపణమును, నెత్తిబరువునకు ఒక మాషకము, రహదారిరుసుమును వసూలు చేయవలెను. 25. మార్గమధ్యమున నష్టమైనవాటికిని, అపహరింపబడినవాటికిని (అతడు) పరిహార మిచ్చుకొనవలెను. 26. విదేశమునుండి వచ్చిన సార్థములోని ఎక్కువవిలువగల వస్తువులను, తక్కువవిలువగల వస్తువులను పరీక్షించి, వాటి వివరములను తెలుపు పత్రము నిచ్చి, వాటిపై ముద్రవేసి, శుల్కాధ్యక్షునివద్దకు పంపవలెను.[6]

27. లేదా, వర్తకవేషమును ధరించిన గూఢచారి సార్థప్రమాణమును రాజునకు తెలియజేయవలెను. 28. రాజు, దాని సహాయముతో, తన సర్వజ్ఞత్వమును ప్రకటించుటకై, శుల్కాధ్యక్షునికి సార్థప్రమాణమును తెలియపరుపవలెను. 29. అటుతర్వాత, అధ్యక్షుడు సార్థమును సమీపించి, ఆ యా వర్తకుల సారభాండములు ఫల్గుభాండములు—ఇవి దాపరికము ఉండరాదు ; ఇది మా రాజు ప్రభావము—అని చెప్పవలెను. 30. ఫల్గుభాండములను దాచువానికి శుల్కమునకు ఎనిమిదిరెట్లు దండము ; సారభాండముల దాచువానికి సర్వాపహరణమే శిక్ష.

31. (శ్లో) దేశమునకు పీడను కలిగించునట్టియు, ఫలహీనములైనట్టియు వస్తువులను లోపలికి రానీయకూడదు. మహోపకారము గావించు వస్తువులను, దుర్లభములగు విత్తనములను శుల్కరహితముగ లోపలికి రానియ్యవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు శుల్కాధ్యక్షుడు అనే ఇరవైఒకటో అధ్యాయము.

[5] ఇట్టి వస్తువులను విదేశములనుండి తెచ్చుట లాభకరము. వీటిని విదేశములకు ఎగుమతి చేయుట నష్టదాయకము. ప్రస్తుతకాలమునగూడ యుద్ధపరికరముల విషయమై ఇట్టి నిబంధన లనేకము లున్నవి.

[6] విదేశములనుండి వచ్చు ప్రతివస్తువును మొదట అంతపాలుడు పరీక్షించవలెను. తర్వాతనే అది నగరద్వారము చేరవలెను.

# రెండో అధికరణము

## అధ్యాయము 22

### ప్రకరణము 39 : (మిగులు) శుల్కవ్యవహారము[1]

1. గ్రామములందు ఉత్పత్తి అయినవి, నగరములో ఉత్పత్తి అయినవి, విదేశములో ఉత్పత్తి అయినవి అని సరకులు (మూడు విధములు). 2. బయటకు వెళ్ళిపోవువాటిపైన, లోపలికివచ్చువాటిపైన శుల్కము (విధించవలెను).

3. లోపలికివచ్చువాటిపైన శుల్కము మూల్యములో అయిదోవంతు.

4. పుష్పములు, ఫలములు, కాయగూరలు, కందమూలములు, (ద్రాక్ష మొదలగు) తీగజాతి పండ్లు, విత్తనములు, ఎండిన చేపలు, ఎండిన మాంసము— వీటిపైన ఆరోవంతు శుల్కము[2] తీసుకొనవలెను.

5. శంఖములు, వజ్రములు, మణులు, ముత్తెములహారములు, పగడముల హారములు—వీటి విషయమున చేసిన పని, చేయుటకుపట్టిన కాలము, వేతనములు, ఫలితము మున్నగువాటిని ఆధారముగజేసుకొని, నిపుణులచేత ఖరీదును కట్టించవలెను.

6. క్షౌమములు, దుకూలములు, పట్టునూలు, కవచములు, హరితాళము మనఃశిల, అంజనము, ఇంగిలీకము, వివిధములగు లోహములు, ధాతువులు, చందనము, అగురు, కటువులు, కిణ్వములు, తక్కువజాతి వస్తువులు, చర్మములు, దంతములు, ఆస్తరణములు, ఆవరణములు, పట్టువస్త్రములు, మేకలనుండియు, పొట్టేళ్ళనుండియు ఉత్పత్తిఅయిన సామగ్రి—వీటిపై శుల్కము పదోవంతో, పదిహేనోవంతో.

7. వస్త్రములు, చతుష్పాదులు, ద్విపాదులు, నూలు, పత్తి, పరిమళ

---

[1] 39వ ప్రకరణములో ఇదివరకు వివరించక మిగిలిపోయిన విషయములు.

[2] బయటికి తీసుకొనిపోబడు పుష్పములు మొదలగువాటిపైన ఎగుమతి శుల్కము అని కొందరు వ్యాఖ్యాతలు.

ద్రవ్యములు, ఔషధములు, కట్టెలు, వెదుళ్ళు, నారలు, చర్మవస్తువులు, కుండలు, ధాన్యములు, నూనెలు, క్షారములు, లవణములు, మద్యములు, పక్వాన్నము మొదలైనవాటిపైన శుల్కము ఇరవైయోవంతో, ఇరవైఅయిదోవంతో.

8. ద్వారాదేశమైన శుల్కము[3] అయిదోవంతు. లేదా, దేశమునకు లభించు ఉపకారమునుబట్టి ఇందులో అనుగ్రహమును[4] చూపించవచ్చును.

9. ఏ వస్తువునుగాని, ఉత్పత్తిఅయినచోట విక్రయించరాదు.[5] 10. గనుల వద్దనుండి ధాతుపణ్యములను తీసుకొనిపోవువారిపై దండము ఆరువందల పణములు. 11. పువ్వులతోటలనుండి పువ్వులను, పండ్లతోటలనుండి పండ్లను కొనువారిపై దండము ఏభైనాలుగు పణములు. 12. కాయగూరలతోటలనుండి కాయగూరలను, కందమూలములను కొనువారిపైన దండము ఏభైఒకటి ముప్పావు ($51\frac{3}{4}$) పణములు. 13. పొలములనుండి సస్యములను కొనువారిపై దండము ఏభైమూడు పణములు. 14. వ్యావసాయకములపై దండము ఒక పణమో, లేక ఒకటింబాతిక పణమో.

15. (శ్లో) ఈ విధముగ అతడు దేశాచారములను, ఆ యా జాతుల ఆచారములను అనుసరించి కొత్తసరకులపైనను పాతసరకులపైనను శుల్కమును విధించి, నేరము ననుసరించి దండమును వసూలుచేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు శుల్కవ్యవహారము అనే ఇరవైరెండో అధ్యాయము.

---

[3] గ్రామములనుండి నగరములోనికివచ్చు వస్తువులపై శుల్కము.

[4] కొన్ని వస్తువులపై శుల్కమును తగ్గింపవలసిన అవసరము ఉన్నట్లు ఇది సూచించుచున్నది.

[5] అన్ని వస్తువుల క్రయవిక్రయములు బజారులోనే జరుగవలెను. ఇట్టి కేంద్ర మున్నప్పుడే పన్నుల వసూలు సులభమగును.

## రెండో అధికరణము

### అధ్యాయము 23

### ప్రకరణము 40 : సూత్రాధ్యక్షుడు

1. సూత్రాధ్యక్షుడు ఆయా పనులను తెలిసినవారి సహాయముతో నూలు, వర్మములు, వస్త్రములు, త్రాళ్ళు మొదలైనవాటిలో వ్యాపారమును సాగించవలెను.

2. అతడు ఉన్ని, చెట్లపట్టలు, నారలు, పత్తి, బూరుగుదూది, శణము, క్షౌమములనుండి విధవలు, అంగవికలలగు స్త్రీలు, కన్యలు, ప్రవ్రాజితలు, దండ ప్రతీకారిణులు,[1] వేశ్యమాతలు, రాజదాసీజనములోని వృద్ధురాండ్రు, సేవచేయలేని దేవదాసీజనము—వీరిచేత నూలుతీయించవలెను.[2]

3. వారు తీసిన నూలుయొక్క సన్నదనము, ముదుగుదనము, మధ్యమత్వము అనువానినిబట్టియు, అధికాల్ప పరిమాణములనుబట్టియు, వేతనములను నిర్ణయించవలెను. 4. నూలు పరిమాణములను తెలుసుకొని వారికి తైలములను, ఆమ్లకనూనెలను ప్రసాదించవలెను. 5. పండుగ రోజులలో బహుమాన గౌరవముల ద్వారా వారిచేత పనిచేయించవలెను. 6. వారు తక్కువ నూలును తెచ్చినప్పుడు తగ్గుదలనుబట్టి వారి వేతనములను తగ్గించవలెను.

7. సరకులను తయారుచేయు పనివాండ్రతో పనియొక్క ప్రమాణ కాల వేతనములను గురించి ఖరారు చేసుకొని వారిచేత పనిచేయించుకొనుచు, వారితో సన్నిహితసంబంధము పెట్టుకొనవలెను. 8. క్షౌమము, దుకూలము, పట్టునూలు, రంకుజాతిలేళ్ళ రోమములు, పత్తి మొదలగువాటినుండి వస్త్రముల నేయుటకు కర్మాగారములను స్థాపించు సమయములలో గంధమాల్యములచేతను ఇతరములగు అనుగ్రహములచేతను వారిని సంతోషపెట్టవలెను. 9. వివిధములగు వస్త్రములను,

---

[1] నేరము చేసినందుకై విధింపబడిన దండమును చెల్లించుటకు శక్తిలేక, దానికి బదులు ఏదైన పనిచేయుటకు సిద్ధపడినవారు.

[2] నూలువడుకు పనిని స్త్రీలే ఎక్కువగ చేయువారు.

ఆస్తరణములను,[3] ప్రావరణములను[4] తయారుచేయించవలెను. 10. ఆ యా పనులను చక్కగ చేయగల పనివాండ్రు, శిల్పులద్వారా కంకటములను[5] తయారు చేయు కర్మాగారములను స్థాపించవలెను.

11. ఇల్లు విడిచి బయటికిరానట్టి స్త్రీలు, (భర్తలను వదలి) వేరుగ జీవించు స్త్రీలు, విధవలు, అంగవికలలు, కన్యకలు తమ్ము తామే పోషించుకొనవలసినప్పుడు తన దాసీజనమును వారి ఇండ్లకు పంపి వారికి వృత్తిని కల్పించి పోషించవలెను. 12. లేదా, వారే స్వయముగ సూత్రశాలకు వచ్చినపక్షమున ఉషఃకాలమునందే వారివద్దనుండి నూలు తీసుకొని వారి వేతనములను ఇచ్చివేయవలెను. 13. నూలును పరీక్షించుటకు మాత్రమే అచ్చట దీపము ఉండవలెను. 14. (అక్కడికి వచ్చిన) స్త్రీ ముఖమును చూచినందులకును అన్యవిషయములగురించి ఆమెతో మాటాడినందుకును పూర్వసాహసదండము, వేతనమును ఇచ్చుటయందు ఆలస్యము గావించినయెడలను, పనిచేయకపోయినను వేతనము ఇచ్చినయెడలను మధ్యమ సాహసదండము.

15. వేతనమును పుచ్చుకొని పనిచేయని స్త్రీకిని, ఇచ్చిన ముడిసరకును అపహరించినవారికిని, లేదా, దానిని తీసుకొనిపారిపోయినవారికిని బొటనవ్రేలు, నడిమి వ్రేలుమొనను ఛేదించుటయే శిక్ష.

16. వేతన విషయములో అపరాధము ననుసరించి పనివాండ్రను శిక్షించ వలెను.

17. త్రాళ్ళను పేనువారితోను, వర్మములను చేయు పనివాండ్రతోను స్వయ ముగ సంబంధము కల్పించుకొనవలెను. 18. వరత్రములు మొదలగు సామగ్రిని తయారుచేయించవలెను.

19. (శ్లో) యుద్ధములందు బంధములుగ ఉపయోగింపదగినట్టియు, బండ్లను లాగు జంతువులకును బండ్లకును కట్టుటకు యోగ్యమైనట్టి త్రాళ్ళను నూలుతోను, నారలతోను, వరత్రములను పేములతోను, వెదుళ్ళతోను చేయించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు సూత్రాధ్యక్షుడు అనే ఇరవైమూడో అధ్యాయము.

---

[3] ఆస్తరణము లనగా పరుచుట కుపయోగించు దుప్పట్లు.

[4] ప్రావరణము లనగా కప్పుకొనుట కుపయోగించు దుప్పట్లు.

[5] కంకటము లనగా కవచములు. ఇవి నారలతో చేయబడునట్టివి.

# రెండో అధికరణము

## అధ్యాయము 24

### ప్రకరణము 41 : సీతాధ్యక్షుడు[1]

1. వ్యవసాయవిధానమును, శుల్బమును,[2] వృక్షాయుర్వేదమును తెలిసిన సీతాధ్యక్షుడు ఈ శాస్త్రములలో నిపుణులైనవారి సహాయముతో సకాలమున సమస్త ధాన్యములయు, పుష్పములయు, ఫలములయు, కాయగూరలయు, కందమూలములయు, తీగెజాతిపండ్లయు, క్షౌమములయు విత్తనములను, పత్తిగింజలను సేకరించవలెను.

2. ఆయా పంటలకు అనుగుణములైన భూములను అనేక పర్యాయములు దున్నించి వాటిలో ఈ విత్తనములను దాసులు, కార్మికులు, దండప్రతికర్తలు అనువారిచేత నాటించవలెను. 3. కరణయంత్రములు, ఉపకరణములు, ఎద్దులు మున్నగువాటిమూలమునగాని కమ్మరులు, వడ్రంగులు, మేదరులు, త్రాళ్ళుపేనువారు, పాములవాండ్రు మున్నగు పనివాండ్రమూలమునగాని వీరి (విత్తనములు నాటువారి) పనులలో ఆలస్యము కాకుండా చూడవలెను. 4. వీరి (అజాగ్రత్త) మూలమున కర్మఫలమునకు నష్టము సంభవించినప్పుడు ఫలనష్టమునకు సమానమగు దండమును విధించవలెను.

5. జాంగల ప్రదేశములో[3] వర్షపాతము పదహారు ద్రోణములు. విత్తనముల చల్లకము దేశానుగుణముగనుండు అనూప ప్రదేశములలో[4] దీనికి ఒకటిన్నరరెట్లు;

[1] 'సీత' అనగా వ్యవసాయోత్పత్తి. సీతాధ్యక్షుడు వ్యవసాయమును పర్యవేక్షించు ప్రధానాధికారి. కాని ఈ ప్రకరణములో రాజ్యములోని వ్యవసాయ మంతను గాక రాజు సొంత భూములలోని వ్యవసాయమును మాత్రమే అతడు పర్యవేక్షించువాడని సూచింపబడియున్నది.

[2] భూగర్భమున ఎంతలోతున నీళ్ళు ఉండునదియు తెలియపరచు శాస్త్రము.

[3] జాంగలము : ఉష్ణాధిక్యముగల ప్రదేశము.

[4] అనూపము : నీటివసతులుగల ప్రదేశము.

అశ్మకదేశములో పదమూడున్నర ద్రోణములు; అవంతిదేశములో ఇరవైమూడు ద్రోణములు; అపరాంత దేశమందును; మంచు ప్రదేశములందును అమితము; కాలువలు ఆధారముగా విత్తనములు చల్లబడు ప్రదేశములలో కాలముతో నిమిత్తము లేని వర్షపాతము.

6. మొదటి నెలలోను కడపటి నెలలోను కలిసి మూడోవంతు, నడుమ రెండు నెలలలో తక్కిన రెండువంతులు—ఇట్టి వర్షపాతము పరమశుభము.[5]

7. వర్షము పడుట, పడకపోవుట బృహస్పతి స్థానగమన గర్భాదానముల నుండియు, శుక్రుని ఉదయాస్తమయ సంచారములనుండియు, సూర్యుని ప్రకృతి లోని మార్పులనుండియు తెలుసుకొనవలెను. 8. విత్తనములు మొలకలెత్తుట సూర్యునినుండి, సస్యములు కాద గట్టుట బృహస్పతినుండి, వర్షపాతపరిమాణము శుక్రునినుండి తెలుసుకొనవలెను.

9. (శ్లో) తెరిపిలేక వారము రోజులు వర్షించు మేఘములు మూడు; బిందువులుగా వర్షించు మేఘములు ఎనభై; సూర్యరశ్మితో కూడి వర్షించునవి అరవై—ఇట్టి మేఘముల వర్షపాతము సమము, హితము.

10. (శ్లో) గాలిని, సూర్యరశ్మిని తగువిధముగ విభాగము చేయుచు, పిడుకలు ఎండుటకు తగినట్లు మూడు వ్యవధులను కల్పించుచు[6] వర్షము పడిన యెడల సస్యవృద్ధి తప్పక జరుగును.

11. దీని ననుసరించి అధ్యక్షుడు ఎక్కువ తక్కువ నీళ్ళు కావలసిన సస్యములకు విత్తనములు చల్లింపవలెను. 12. శాలి, వ్రీహి, కోద్రవము, నువ్వులు, ప్రియంగు, ఉదారకము, వరకము—ఇవి ముందు[7] చల్లవలసినవి. 13. పెసలు, మినుములు, శైబ్యములు నడుమ చల్లవలసినవి. 14. కుసుమలు, మసూరములు, కుళుత్థములు, యవలు, గోధుమలు, కలాయము, అవిసె, ఆవాలు—ఇవి ఆఖరున చల్లవలసినవి. 15. లేదా, ఋతువుల ననుసరించి విత్తనములను చల్లవలెను.

16. చల్లక మిగిలిపోయిన భూమిని పంటలో అర్ధభాగమునిచ్చు రైతులుగాని నాలుగోవంతో అయిదోవంతో ఇచ్చు స్వయంకృషిచేత జీవించు కూలిజనముగాని సాగుచేయవలెను. 17. బీడుపొలములకు ఆపత్కాలములు మినహాగా రాజు కోరిన భాగమును ఇయ్యవలెను.[8]

18. సొంతజలాధారములనుండి చేతిసహాయమున[9] నీటిని పారుదలచేసికొను

---

[5] శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తికములు వర్షకాలమని వ్యాఖ్యాతలు.

[6] వర్షము అవ్యవధిగ పడకూడదు. మధ్య మధ్య తెరిపి ఉండవలెను. పిడుకలు ఎండుటకు ఎంతవ్యవధికావలెనో, అంతవ్యవధి ఒకవర్షపాతమునకును, ఇంకొకదానికిని మధ్య ఉండవలెను.

[7] వర్షఋతువులో మొదటిభాగమందు.

[8] బీడుపొలములను సాగులోనికి తెచ్చిన ప్రథమదశలో నిర్ణీతభాగమెట్టిదియు ఉండదు.

[9] కొన్నిప్రాంతములలో గూడలువేసి నీళ్ళను పారించుట చేతిసహాయమునకు దృష్టాంతము.

రైతులు అయిదవవంతును; భుజముల సహాయమున[10] పారుదలచేసుకొనువారు నాలుగోవంతును; కాలువలద్వారా యంత్రసహాయమున పారుదలచేసుకొనువారు మూడోవంతును; నదులు, సరస్సులు, తటాకములు, బావులనుండి ఏతములతో ఎత్తి పారుదలచేసుకొనువారు నాలుగోవంతును నీటిపన్ను చెల్లించవలెను.

19. పనులకు కావలసిన నీటి సదుపాయములనుబట్టి పల్లపుసాగు పంటలు, చలికాలపు పంటలు, వేసవికాలపు పంటలు అధ్యక్షుడు నిర్ణయించవలెను. 20. శాల్యాదులు శ్రేష్ఠములు; కాయగూరలు మధ్యమములు; చెరకు అధమము. 21. ఏలయన, చెరకుజాతులు అనేక ప్రమాదములకు గురియైనవి; ఎక్కువ ఖర్చుతో కూడినట్టివి.

22. నురుగుదెబ్బతగులు ప్రదేశములు (నదీతీరములు) తీగెజాతి పండ్లకును, ప్రవాహములకు గురియైనవి పిప్పలి, ద్రాక్ష, చెరకు మున్నగువానికిని, బావుల సమీపమందుండునవి శాకములకును, గడ్డలకును, సరోవరప్రాంతములు పచ్చిగడ్డి జాతులకును, సస్యముల మధ్యనుండు ప్రదేశములు సుగంధములు, ఓషధులు, ఉశీరము, హ్రీవేరము, పిండాలుకము మొదలైన లవములగు[11] మొక్కలకును తగినవి. 23. ఆ యా సస్యములకు తగిన భూములలో మెట్టప్రదేశములందు పెరుగు మొక్కలను, పల్లపుభూములలో పెరుగు మొక్కలను పెంచవలెను.

24. ధాన్యబీజములను ఏడురాత్రులు మంచులోను, ఏడుపగళ్ళు ఎండలోను, పప్పుదినుసుల బీజములను మూడుగాని అయిదుగాని రాత్రులు మంచులోను, అన్నియేపగళ్లు ఎండలోను ఉంచవలెను. బీజములుగ ఉపయోగించు కాడలకు కత్తిరించిన భాగమందు తేనె, నెయ్యి, పందికొవ్వు కలిపిన గోమయమును, గడ్డలకు తేనెను నెయ్యిని, పత్తిగింజలకు పేడను పూయవలెను. చెట్లవేళ్ళకింద ఉండు పల్లములలో కాలానుసారముగ ఎముకలను అవు పేడను కాల్చవలెను. 25. అవి మొలకలెత్తిన తర్వాత వాటిని పచ్చిచేపలతోను స్నుహిక్షీరముతోను పోషించవలెను.

26. (శ్లో) పత్తిగింజలను, పాము కుబుసమును సేకరించి, వాటిని కలిపి కాల్చివేయవలెను. ఈ పొగ వ్యాపించిన ప్రదేశమందు పాములు ఉండవు.

27. బీజముల నన్నిటిని మొట్టమొదట నాటునపుడు పిడికెడు బీజములను తీసుకొని బంగారముతో కూడిన నీటిలో ముంచి, "ప్రజాపతియు వర్షదేవతయు అయిన కాశ్యపునికి నమస్కారము, నాబీజములందు నాధాన్యములందు దేవతయగు సీత వర్ధిల్లుగాక" అను మంత్రమును పఠించుచు చల్లవలెను.

---

[10] కుండలతో నీళ్ళను మోసుకొనిపోవుట ఇట్టిది.

[11] లవము లనగా కోసిన తర్వాత కూడ పెరుగునట్టి మొక్కలు వేళ్ళతో నిమిత్తములేక కోసిన కొమ్మను నాటినను పెరుగునట్టిది.

28. కాయగూరలు పండ్లు పువ్వులతోటలలోని కావలివాండ్రకు, పశువుల కాపరులకు, దాసులకు, కార్మికులకు వారి పోషణయందుండువారి సంఖ్యనుబట్టి ఆహారసామగ్రిని, నెలకు ఒకటింబావు పణము జీతమును ఇయ్యవలెను. 29. (తక్కిన) పనివాండ్రకు వారి పనిని అనుసరించి భక్తవేతనముల నియ్యవలెను.

30. శ్రోత్రియులు తాపసులు దైవకార్యములకు నేలమీదపడిన ఫలపుష్పములను, ఆగ్రాయణములకు బియ్యమును యవలును తీసుకొనవచ్చును; ఉంఛవృత్తివలన జీవించువారు రాశి అడుగులో మిగిలినదానిని తీసుకొనవచ్చును.

31. (శ్లో) ఫలించిన సస్యములను తక్కిన ఫలితములను సకాలములో (పొలములనుండి) తీసుకొనిపోవలెను. పండితుడైనవాడు క్షేత్రమందు దేనిని కూడ—పొట్టునుకూడా—వదలివేయకూడదు.

32. (శ్లో) (ధాన్యములను దాచుటకు ఉద్దేశింపబడిన శాలకు) ఎత్తైనగోడలను అదేవిధమైన కప్పులను నిర్మించవలెను. శిరోభాగములు ఒకదానికొకటి అంటి యుండునట్లుగను, తుచ్ఛములుగను నిర్మించరాదు.

33. (శ్లో) ధాన్యపు కుప్పలను మండలాకారమైన కళ్ళపు అంచులందు చేర్చవలెను. కళ్ళములోని పనివాండ్రవద్ద నిప్పు ఉండరాదు. నీళ్ళు సమృద్ధిగ ఉండవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు సీతాధ్యక్షుడు అనే ఇరవై నాలుగో అధ్యాయము.

రెండో అధికరణము

# అధ్యాయము 25

## ప్రకరణము 42 : సురాధ్యక్షుడు

1. సురాధ్యక్షుడు దుర్గమందు జనపదమందు శిబిరమందు సురాకిణ్వ వ్యాపారమును[1] ఏకముఖముగాని, బహుముఖముగాని, క్రయవిక్రయముల కనుకూలించు (మరియొక) విధముగగాని ఆ వ్యాపారమును చేయుటకై పుట్టినవారి ద్వారా సాగించవలెను. 2. ఇతరప్రదేశములలో వాటిని తయారుచేయువారిపైనను క్రయవిక్రయము సాగించువారిపైనను అరువందల పణముల దండము విధించవలెను.

3. పనివాండ్రు వారి వారి పనులలో జాగరూకులు కాకుండెదరను భయముండుటచేతను, ఆర్యులు తమ మర్యాదల నతిక్రమించు భయముండుటచేతను, పోకిరివాండ్రు దుష్కృత్యములలో దిగెదరను భయముండుటచేతను, మద్యములను గ్రామముల బయటికి తీసికొనిపోవుటను, కూడబెట్టుటను నిషేధించవలెను.[2] 4. లేదా, శుచులని పేరుగాంచినవారు ముద్రలతోకూడిన మద్యమును స్వల్పముగ—పావు కుడుబముగాని, అర్ధ కుడుబముగాని, ఒక కుడుబముగాని, అర్ధ ప్రస్థముగాని, ఒక ప్రస్థముగాని—బయటకు తీసుకొనిపోవచ్చును. 5. లేదా, అటు ఇటు సంచరించక పానశాలలోనే త్రాగవలెను.

6. అపహరింపబడిన నిక్షేపములు, ఉపనిధులు, ప్రయోగములు, అవాంఛనీయములగు మార్గములద్వారా సంపాదింపబడిన వస్తువులు[3]—వీటి పోవిడిని[4]

---

[1] కిణ్వ మనగా పొంగుటకై పులియబెట్టిన పదార్థము.

[2] పానశాలలలో తప్ప మరియెక్కడను త్రాగకూడదనుటకు మూడు ప్రధాన కారణములు ఇచ్చట పేర్కొనబడినవి.

[3] ఏదైన వస్తువును తయారుచేయుటకై వస్త్రడంగులు మొదలగు పనివాండ్రకు ఇచ్చు ముడి

*(footnotes 3 and 4 contd. in the next page)*

తెలుసుకొనుటకై తనదికాని వస్తువునుగాని డబ్బునుగాని ఇచ్చి మద్యమును కొనువానిని పానశాలకు బయట ఏదియో ఒకమిషతో పట్టుకొనవలెను. (మద్యమునకై) అతివ్యయము చేయువానిని, ఆదాయమునకు మించి వ్యయము చేయువానినికూడ పట్టుకొనవలెను.

7. చెడిపోయిన మద్యమును తప్ప తక్కినదానిని ఇంకొక వెలకుగాని, అరువుగగాని అమ్మరాదు. 8. చెడిపోయినదానిని మరియొక ప్రదేశమందు అమ్మవలెను. 9. లేదా, దానిని దాసజనమునకు, కార్మికులకు వేతనముక్రింద ఇయ్యవచ్చును. 10. లేదా, దానిని బండ్లనులాగు ఎద్దులకు, పందులకు పోషణార్థముగ వినియోగించవచ్చును.

11. అతడు పానశాలను అనేక కక్ష్యలతోను, వేరువేరు శయనాసనములతోను, ఋతుసుఖములగు గంధమాల్యోదకములుగల ప్రదేశములతోను కూడినట్లుగ నిర్మించవలెను.[5]

12. అచ్చటనుండు గూఢచారులు (కాతాదాసుల) సాధారణ ఖర్చులను, అసాధారణ ఖర్చులను, అగంతుకులను తెలుసుకొనవలెను. 13. క్రేతలలో మత్తెక్కినవారియు నిద్రించువారియు అలంకారములను, వస్త్రములను, హిరణ్యమును వారు తెలుసుకొనవలెను. 14. వీటికి నష్టము కలిగినప్పుడు వర్తకులు నష్టపరిహారమును, దానికి సమానమగు దండమును ఇచ్చుకొనవలెను. 15. వర్తకులు సౌందర్యవతులగు తమ సొంత దాసీజనములద్వారా ఆర్యులవలె కనిపించు అగంతుకులయు స్వదేశీయులయు భావములను మత్తెక్కి వారివారి గదులలో ఒంటరిగ నిద్రించుచున్నప్పుడు తెలుసుకొనవలెను.

16. మేదక, ప్రసన్న, ఆసవ, ఆరిష్ట, మైరేయ, మధువుల విషయము— 17. ఒక ద్రోణము నీళ్లు, అర్ధ ఆఢకము బియ్యపుగింజలు, మూడు ప్రస్థముల కిణ్వము (పొంగెడు పులుసు)—వీటి కలయిక మేదకము. 18. పండ్రెండు ఆఢకముల పిండి, అయిదు ప్రస్థముల కిణ్వము, లేదా, క్రముకచెట్టుపట్ట, పండ్లతో కూడిన కషాయము—వీటి సంయోగము ప్రసన్నము. 19. ఒక తులము వెలగ పండు, అయిదు తులముల ప్రాణితము, ఒక ప్రస్థము తేనె—వీటి సంయోగము

*(footnote in continuation of the previous page)*

పదార్థము నిక్షేపము. దాచుకొన్న ధనము ఉపనిధి. తాకట్టుపెట్టిన వస్తువు ప్రయోగము. జూదము మొదలైనవి అవాంఛనీయములగు మార్గములు. ఇతరుల ధనమును అపహరించిన వారు, కుమార్గముల ద్వారా ధనమును సంపాదించినవారు త్రాగుటకు అలవాటుపడుట సహజము. అట్టివారిని పట్టుకొనుటకు పానశాల ఎంతో ఉపయోగకరము.

[4] కనుపించక పోయిన వస్తువును trace చేయుట పోవిడి ఇది నెల్లూరు జిల్లాలో వాడబడు మాట.

[5] ఇవి ప్రస్తుతకాలపు వసతిగృహములవలె ఉండునవి.

ఆసవము. 20. వీటిని నాలుగోవంతు హెచ్చించినయెడల శ్రేష్ఠమైన ఆసవము, తగ్గించినయెడల తక్కువరకపు ఆసవము ఏర్పడును. 21. ఒక్కొక రోగము కుదురుటకు వైద్యులు నిర్ణయించునవియే అరిష్టములు. 22. మేషశృంగపుపట్ట కషాయములో బెల్లము కలిపి, దానిని పిప్పలుల, మిరియాల కషాయముతోగాని, త్రిఫల కషాయముతోగాని సంయోగము చేసినయెడల మైరేయమగును. 23. లేదా, బెల్లముతోకూడిన త్రిఫల కషాయమును అన్నిటిలో కలుపవలెను. 24. ద్రాక్షరసము మధువు. 25. కాపిశాయనము, హారహూరకము అని దానికిగల పేర్లు దాని జన్మస్థానమందుండి లభించినవి.

26. పచ్చిదిగాని, ఉడకబెట్టినదిగాని, ఒక ద్రోణము మినుపపిండి, దానికి మూడోవంతు ఎక్కువగా బియ్యపుపిండి, ఒక కర్షము ఎత్తు మొరాటాదులు—వీటి సంయోగము కిణ్వము.

27. పాఠ, లోధ్ర, తేజోవతి, ఏలకులు, వాలుకము, మధుకము, మధురసము, ప్రియంగువు, దారుహరిద్రము, మిరియాలు, పిప్పలి—అయిదు కర్షకముల ఎత్తుగల వీటిలో ఒక్కొక్కటిని కలిపిన కషాయము మేదక ప్రసన్నములకు కలపవలసిన సంభారము.[6] 28. మధూక కషాయముతో కలిసిన కటుశర్కర స్వచ్ఛమైన రంగును సమకూర్చును.

29. ఒక కర్షము ఎత్తు లవంగపట్ట, చిత్రకము, విలంగము, గజపిప్పలి, రెండు కర్షముల ఎత్తు క్రముకము, మధూకము, ముస్త, లోధ్ర—వీటి కషాయము ఆసవమునకు సంభారము. 30. వీటిలో పదోవంతు బీజబంధ మగును.[7]

31. తెల్లమద్యపు సంభారమే ఆసవసంభారము. 32. ఎక్కువ (మామిడి పండు) రసముతోగాని బీజముతోగాని కూడిన మామిడిసురకు మహాసుర అని పేరు. లేదా, సంభారములతో కూడినప్పుడుకూడ అది మహాసురయే. 33. మోరట, పలాశ, పత్తూర, మేషశృంగి, కరంజి, క్షీరవృక్ష కషాయముతో భావనచేయబడి కాల్చిన కటుశర్కరచూర్ణమును లోధ్ర, చిత్రక, విలంగ, పాఠ, ముస్త, కళింగయవ, దారుహరిద్రేందీవర, శతపుష్పాపామార్గ, సప్తపర్ణ, నింబాస్ఫోతచూర్ణముల అర్ధ భాగములో కలిపి వేళ్ళు కనపడకుండ పిడికిలితో పిడికిలి చూర్ణమును తీసుకొని ఒక కుంభీపరిమాణముగల ఈ మద్యములలో కలిపినయెడల అవి స్వచ్ఛమైన రంగు కలవియై, రాజులు త్రాగుటకు అర్హమగును. 34. రసవృద్ధికై అయిదు పలముల బెల్లమును కలుపవలెను.

35. కుటుంబికులు ఉత్సవదినములలో తెల్లసారాయిని, ఔషధార్థముగ అరిష్టమును తక్కిన మద్యములను స్వేచ్ఛగ తయారుచేసుకొనవచ్చును.

---

[6] రుచిగాని, మత్తెక్కించు లక్షణముగాని వృద్ధి అగుటకు మద్యములో చేర్చబడు కషాయములకు సంభార మని పేరు.

[7] బీజబంధ మనగా నిగ్గుపదార్థము ; సారము.

36. ఉత్సవ, సమాజ, యాత్రాకాలములందు నాలుగురోజులు మద్యమును తయారుచేయుటకును, అమ్ముటకును అనుజ్ఞ ఇయ్యవలెను. 37. అనుజ్ఞను పొందనివారినుండి ఉత్సవము ముగియువరకు రోజునకు ఇంత అని దండము వసూలుచేయవలెను.

38. సురాకిణ్వములకు కావలసిన వస్తుసామగ్రిని స్త్రీలు, బాలురు వెతకి తేవలెను.

39. రాజపణ్యములుకాని[8] సురను, మేదకమును, మధువును, చేదు పండ్ల రసములను, చేదు మద్యములను అమ్మువారు నూటికి ఆయిదు చొప్పున శుల్కము చెల్లించవలెను.

40. (శ్లో) ప్రతిదినము విక్రయపరిమాణమును, మానములమీద హిరణ్యము మీద వసూలుకావలసిన వ్యాజిని కనుగొని దానికి తగినట్లు నష్టపరిహారమును నిర్ణయించి ఆచారము ననుసరించి వ్యాపారమును సాగించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు సురాధ్యక్షుడు అనే ఇరవైఅయిదో అధ్యాయము.

[8] పరిపాలనాధికారులు తయారుచేయించినవి రాజపణ్యములు.

# రెండో అధికరణము

## అధ్యాయము 26

### ప్రకరణము 43 : సూనాధ్యక్షుడు

1. అభయప్రదానము పొందినట్టియు, అభయవనములలో ఉండునట్టియు జింకలను, పశువులను, పక్షులను, చేపలను బంధించువారికిని, వధించువారికిని, హింసించువారికిని సూనాధ్యక్షుడు ఉత్తమసాహసదండమును, అభయవనములలో (ఇట్టి నేరములను చేయు) కుటుంబికులకు మధ్యమసాహసదండమును విధించవలెను.[1]

2. ఏ చేపలను, పక్షులను వధించుట ఆచార విరుద్ధమో అట్టివాటిని బంధించు వారికి వధించువారికి హింసించువారికి దండము 26¾ పణములు ; అట్టి జింకల, పశువుల విషయమున దండము రెండింతలు. 3. వధించుట ఆచార విరుద్ధము కానివాటి విషయమునను, అభయవనములలో ఉండనట్టి వాటి విషయమునను, చేపలు పక్షులలో ఆరోవంతును, జింకలు, పశువులలో ఇంతకంటె పదోవంతు ఎక్కువగను శుల్కమును వసూలుచేయవలెను.

4. ప్రాణముతో ఉండు పక్షులలోను, జింకలలోను ఆరోవంతును అభయ వనములలో స్వేచ్ఛగా వదలవలెను.

5. ఏనుగు, గుర్రము, మనుష్యుడు, ఎద్దు, గాడిదె—ఈ ఆకారములుగల సముద్రపు చేపలను, సరస్సులు నదులు తటాకములు కాలువలు—వీటిలోని చేపలను ; క్రౌంచము, ఉత్క్రోశకము, దాత్యూహము, హంస, చక్రవాకము, జీవం జీవకము, భృంగరాజము, చకోరము, మత్తకోకిలము, మయూరము, శుకము, మదనశారిక మొదలగు విహారపక్షులు, మంగళకరములగు ఇతరపక్షులు, ఇవిగాక

[1] కుటుంబికులు వినోదమునకై వేటాడువారు కారు. ఆహారావసరమును తీర్చుకొనుటకు వేటాడువారు. అందుచేత వారు తక్కువ దండమునకు పాత్రులు.

తక్కిన పక్షులు జింకలు అన్నిరకములైన హింసలనుండి రక్షింపదగినవి. 6. రక్షణను అతిక్రమించినవారికి పూర్వసాహసదండము.

7. (వర్తకులు) అప్పటికప్పుడు చంపబడిన జింకలయు పశువులయు మాంసమును ఎముకలులేక విక్రయించవలెను. 8. ఎముకలతో కూడిన మాంసమునకు నష్టపరిహార మియ్యవలెను. 9. తూకమును తగ్గించినవారు తగ్గుదలకు ఎనిమిదిరెట్ల దండమును చెల్లించవలెను.

10. వీటిలో దూడలు, ఎద్దులు, పాలనుఇచ్చు ఆవులు చంపకూడనివి. 11. వీటిని చంపువానికి, చచ్చునట్లు హింసించువానికి దండము ఏభై పణములు.

12. ఉబ్బినట్టి, శిరస్సు పాదములు ఎముకలు లేనట్టి, దుర్గంధపూరితమైనట్టి మాంసమును, స్వయముగ మృతిచెందిన జంతువుల మాంసమును విక్రయించరాదు. 13. అన్యథాగా ప్రవర్తించినవారికి దండము పంన్రెండు పణములు.

14. (శ్లో) అభయవనములలోని పశువులు, జింకలు, అడవిమృగములు, చేపలు దుష్టములైనప్పుడు చంపబడవచ్చును; లేదా, అభయవనములుకాని ప్రదేశములందు బంధింపబడవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు సూనాధ్యక్షుడు[2] అనే ఇరవైఆరో అధ్యాయము.

[2] వేటమృగముల రక్షణము, ఇతర జంతువుల వధను హింసను మాన్పించుట, మాంసవిక్రయమును నియమబద్ధముచేయుట—ఇవి సూనాధ్యక్షుని ప్రధానకర్తవ్యములు. ఇప్పటి మునిసిపాలిటీలలో ఉన్నట్లు కౌటిల్యుని కాలమున జంతువులను మాంసమునకై వధించుటకు ప్రత్యేకశాలలున్నట్లు నిదర్శనములు లేవు.

# రెండో అధికరణము

## అధ్యాయము 27

### ప్రకరణము 44 : గణికాధ్యక్షుడు

1. గణికాధ్యక్షుడు గణిక కులమునుండిగాని, మరియొక కులమునుండిగాని రూప యౌవన శీలసంపన్నురాలిని వేయిపణముల నిచ్చి గణికగను, అర్ధకుటుంబము నకు ఒక ప్రతిగణికను నియమించవలెను.[1]

2. గణిక పారిపోయినప్పుడును చనిపోయినప్పుడును ఆమె కుమార్తెగాని, తోబుట్టువుగాని కుటుంబమును భరించవలెను. లేదా, తల్లి ఒక ప్రతిగణికను గుదుర్చవలెను. 3. వీరు లభించనపుడు రాజు ఆస్తిని స్వాధీనపరచుకొనవలెను.

4. ఛత్ర, భృంగారక, వ్యజనములతో సేవించుటయందును ; పల్లకిని, సింహాసనమును, రథమును అధిష్ఠించుటయందును ; విశిష్టత కలుగునట్లుగ గణిక లకు వారివారి సౌందర్యాలంకారమునుబట్టి వేయి పణముల నిచ్చి, ఉత్తమ మధ్యమ కనిష్ఠకార్యములలో నియోగించవలెను.[2] 5. సౌభాగ్యము కోల్పోయినదానిని గణికా మాతగ నియమించవలెను.

6. గణికకు నష్క్రయము[3] ఇరవైనాలుగువేల పణములు, గణికాపుత్రునికి

---

[1] రాజును ఛత్రచామరాదులతో సేవించుటకై అంతఃపురమందు ఎందరో గణికలు ఉండువారు. వారందరికీ ప్రధానాధికారిణిగ ఒక గణికను, ఒక ప్రతిగణికను నియమించుట ఆకాలపు ఆచారము.

[2] రాజుతో చదరంగమాడుట, అతనికి తాంబూల మిచ్చుట ఉత్తమకార్యములు. అట్టివారికి వేతనము వేయి పణములు. ఛత్రచామరములతోటి కార్యములు మధ్యమములు. ఈ పనులను చేయువారికి వేతనము అయిదు వందలు. పీటలువేయుట, పాదములు కడుగుట మొదలైన కార్యములు అధమములు. ఈ పనులు చేయువారికి వేతనము నూరు పణములు— అని కొందరు వ్యాఖ్యాతలు.

[3] దాస్యమునుండి విడుదలగాంచుటకు ఇయ్యవలసిన ధనమునకు నిష్క్రయమని పేరు.

పన్నెండువేల పణములు. 7. ఇతడు ఎనిమిదో సంవత్సరమునుండి రాజువద్ద కుశీలవుడుగ ఉండవలెను.

8. భోగములకు పనికిరాని గణికాదాసి కోష్ఠాగారమందుగాని, వంటశాల యందుగాని పనిచేయవలెను. 9. అట్టిపనిని చేయుటకు ఇష్టపడనప్పుడు బంధితురాలై నెలకు ఒకటింబావు వేతనము నిచ్చుకొనవలెను.

10. గణికల భోగద్రవ్యము, బహుమానములు, ఆదాయము, వ్యయము—వీటిని వ్రాసిపెట్టవలెను. అతివ్యయముతో కూడిన పనులను నివారించవలెను.

11. తన ఆభరణములను తల్లిచేతికిగాక ఇతరుల కిచ్చిన గణికకు దండము నాలుగుంబావు పణములు. 12. వాటిని విక్రయించినను తాకట్టుపెట్టినను దండము ఏభై పైపావు పణములు. వాక్పారుష్యమునకు దండము ఇరవైనాలుగు పణములు. శరీరహానికి దండము దీనికి రెండింతలు. చెవిని కోసినందుకు దండము ఏభై పైపావు పణములును, ఒకటిన్నర పణములును.[4]

13. ఇష్టములేని కన్యను బలాత్కరించినందుకు దండము ఉత్తమసాహసము; కన్య ఇష్టపడినప్పుడు పూర్వసాహసదండము. 14. ఇష్టపడని గణికను నిర్బంధించువానికి, పారిపోవుటలో సహాయముచేయువానికి, గాయపరచి ఆమె సౌందర్యమునకు లోపము కలిగించువానికి దండము వేయి పణములు. 15. లేదా, ఆమె అంతస్తునుబట్టి నిష్క్రయ ధనమునకు రెండింతలవరకు దండమును వృద్ధి చేయవచ్చును. 16. ఉద్యోగములో నియమింపబడిన గణికను హత్య చేసిన వానికి నిష్క్రయధనమునకు మూడురెట్లు దండము. 17. మాతనుగాని, కుమార్తెనుగాని, సౌందర్యముచే జీవించు దాసినిగాని హత్యచేసినవానికి ఉత్తమసాహస దండము.

18. సర్వత్ర, ప్రథమాపరాధమునకు నిర్ణీతమగు దండము, రెండవవానికి రెండింతలు, మూడవదానికి మూడింతలు, నాల్గవదానికి యథేష్టదండము విధించవలెను.

19. రాజు ఆజ్ఞాపించినపుడు పరపురుషుని తిరస్కరించు గణికకు శిక్ష వేయి కొరడాదెబ్బలు, లేదా, అయిదువేల పణములు.

20. భోగద్రవ్యమును పుచ్చుకొని పురుషుని తిరస్కరించిన గణిక రెండింతల దండమును చెల్లించవలెను. 21. రాత్రిపూట వచ్చినవారిని మోసము చేసిన పక్షమున దండము ఎనిమిదిరెట్లు. తాను వ్యాధిగ్రస్తురాలైనప్పుడు, వచ్చినవానిలో దోషము ఉన్నప్పుడు ఇట్టి దండము లేదు. 22. అతనిని హత్యగావించినయెడల అతనితో సహగమనముగాని, నీటిలో మునిగిపోవుటగాని శిక్ష.

---

[4] మొత్తము $51\frac{3}{4}$ పణములు. ఇందులో $50\frac{1}{4}$ పణములు రాజకోశమునకు, $1\frac{1}{2}$ పణములు గణికాధ్యక్షునికి చెందునని కొందరు వ్యాఖ్యాతలు.

23. గణికల ఆభరణములనుగాని, ధనమునుగాని, భోగద్రవ్యమునుగాని, అపహరించినవారికి దండము ఎనిమిదిరెట్లు.

24. గణికాధ్యక్షునికి (గణిక) భోగద్రవ్యమును, ఆదాయమును, (భోగించు) పురుషుని పేరును తెలియపరుపవలెను.

25. దీనినిబట్టి అతడు నటులు, నర్తకులు, గాయనులు, వాదకులు, వాగ్జీవనులు, కుశీలవులు, ప్లవకులు, సౌభికులు, చారణులు—వీరి స్త్రీలకు, స్త్రీలను తార్చు వ్యాపారముచేయువారికి, రహస్యవృత్తుల ననుసరించు స్త్రీలకు సంబంధించిన విషయములను గ్రహించవలెను.

26. (ప్రదర్శనములకై) విదేశములనుండి వారి వాద్యములు వచ్చినప్పుడు ప్రదర్శనమునకు అయిదు పణముల చొప్పున రుసుమును వసూలుచేయవలెను.

27. సౌందర్యమే జీవనముగకలవారు (గణికలు) నెలకు భోగద్రవ్యమునకు రెండింతలు చెల్లించవలెను.

28. గణికలకు, దాసీజనమునకు, నాటకరంగమువలన జీవించువారికి, సంగీతము, వాద్యము, (పద్య) పఠనము, నాట్యము, అక్షరములవ్రాత, చిత్రలేఖనము, వీణ వాయించుట, వేణుగానము చేయుట, మద్దెల కొట్టుట, పరుల చిత్తమును గ్రహించుట, గంధమాల్యముల తయారుజేయుట, సంభాషణము, ఒళ్ళు పట్టుట, వేశ్యాకళ మొదలైన విద్యలను నేర్పువారిని రాజకోశమునుండి పోషించవలెను.

29. రంగోపజీవులకును, అన్నిరకముల నర్తకులకును ముఖ్యులగునట్లు గణికాపుత్రులకు వీరు శిక్షణ నియ్యవలెను.

30. (శ్లో) వారి స్త్రీలు సర్వవిధములగు సంజ్ఞలను భాషలను ఎరిగినవారై వారి బంధువుల నాయకత్వమున దుష్టుల రహస్యములను తెలుసుకొనుటకు, వారిని చంపుటకు, వారిచేత ప్రమాదకరములగు పనులను చేయించుటకు నియోగింపబడవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు గణికాధ్యక్షుడు అనే ఇరవైఏడో అధ్యాయము.

# రెండవ అధికరణము

## అధ్యాయము 28

### ప్రకరణము 45 : నావధ్యక్షుడు

1. నావధ్యక్షుడు సముద్రయానములను గురించిన వ్యవహారములను, నదీ ముఖములందు, సహజములగు సరస్సులయందు, కృత్రిమములగు సరస్సులందు, నదులయందు, స్థానీయములందు, ఇతర పట్టణములందు ఉండు తరముల[1] గురించిన వ్యవహారములను పర్యవేక్షించవలెను.

2. వాటి తీరములందుండు గ్రామములు క్లుప్తమగు పన్ను నిచ్చుకొనవలెను.

3. చేపలు పట్టువారు పడవల అద్దెక్రింద (పట్టిన చేపలలో) ఆరోవంతును ఇయ్యవలెను.

4. వర్తకులు ఆయా రేవుపట్టణముల ఆచారమును అనుసరించి ఆరోవంతును శుల్కముగ చెల్లించవలెను; రాజనౌకలలో ప్రయాణముచేయువారు ప్రయాణపు అద్దెను ఇచ్చుకొనవలెను.

5. శంఖములను, ముత్తెములను సంగ్రహించువారు పడవ అద్దెను చెల్లించవలెను; లేదా, వారి సొంతపడవలలో ప్రయాణము చేయవచ్చును. 6. వీటిపైన అధ్యక్షుడుగ నుండువాని విధులు గనుల అధ్యక్షుని విధులవంటివే.

7. నావధ్యక్షుడు రేవుపట్టణముల విషయమై పట్టణాధ్యక్షుడు విధించిన నియమముల నన్నిటిని పాలించవలెను.

8. దారితప్పి ప్రయాణము చేయునట్టియు, గాలిదెబ్బ తిన్నట్టియు నౌకలను తండ్రివలె అనుగ్రహించవలెను. 9. నీళ్ళలో మునిగిపోయిన సామగ్రిపై శుల్కము వసూలు చేయరాదు; లేదా, సగము శుల్కము వసూలు చేయవలెను. 10. ఈ నౌకలను నిర్దేశింపబడినట్లు యాత్రాకాలమునకు యోగ్యమైనప్పుడు రేవుపట్టణముల నుండి పంపవలెను.

---

[1] తరములు : దాటుటకు సాధనములు.

11. సముద్రయానముచేయుచుండు నౌకలనుండి తీరమునకు వచ్చినప్పుడు శుల్కమును అడుగవలెను. 12. ప్రమాదమును కలిగించునట్టియు, శత్రు దేశములనుండి వచ్చునట్టియు, పణ్యపట్టణముల ఆచారములకు విరుద్ధముగ ప్రవర్తించునట్టియు నౌకలను నాశముచేయవలెను.

13. హేమంత గ్రీష్మములలోకూడ దాటుటకు సాధ్యముకాని మహానదులలో ప్రయాణముచేయు గొప్ప నౌకలను శాసకుడు (నాయకుడు), నిర్యామకుడు (చుక్కానిపట్టువాడు), దాత్రరశ్మిగ్రాహకుడు (కొడవలిని త్రాళ్ళను పట్టుకొనువాడు), ఉత్సేచకుడు (నీళ్ళను పైకి తోడి పోసేవాడు)—వీరి వశమందుంచవలెను. వర్ష ఋతువునందు మాత్రము ప్రవహించు చిన్నదులలో చిన్నపడవలను ఉపయోగించ వచ్చును. 14. రాజద్వేషులు దాటెడు భయముండుటచేత నౌకలన్నిటికి దాట వలసిన ప్రదేశములు నిర్ణీతములుగ నుండవలెను.

15. అకాలమందుగాని, అతీర్థమందుగాని (దాటకూడని ప్రదేశమందు) దాటువానికి పూర్వసాహసదండము (విధించవలెను). 16. అనుజ్ఞను పొందక సకాలములోను, తీర్థమందును దాటువానికి దండము 26¾ పణములు. 17. చేపలు పట్టువారికి, కట్టెలను గడ్డిని మోసుకొనిపోవువారికి, పువ్వులతోటలలోను, పండ్లతోటలలోను, కాయగూరలతోటలలోను, పనిచేయు నౌకర్లకు, గోపాలురకు, దూతను అనుసరించి వెళ్ళవలసినవారికి, సైనికసామగ్రికి సంబంధించిన కార్య కలాపములకై తమ సొంతపడవలలో దాటువారికి, తీరగ్రామముల ఉపయోగార్థము విత్తనములను భోజనపదార్థములను ఇంటి సామానులను తీసుకొని పోవువారికి దండము లేదు.

18. బ్రాహ్మణులు, ప్రవ్రాజితులు, బాలురు, వృద్ధులు, వ్యాధితులు, రాజశాసనములను తీసుకొనిపోవువారు, గర్భిణీస్త్రీలు, నావధ్యక్షుని ముద్రలతో దాటవలెను.

19. విదేశములనుండి వచ్చువారు అనుజ్ఞను పొందిన తర్వాతగాని, సార్థ ప్రమాణ సాధనమునగాని ప్రవేశించవచ్చును. 20. మరియొకని భార్యనుగాని కుమార్తెనుగాని ధనమునుగాని అపహరించినవానిని, శంకితుని, ఉద్వేగముచెందిన వానిని, బరువైన భాండము వెనుక దాగినవానిని, బరువైన వస్తువులమూటను తలపై ఉంచుకొని దానితో తన ముఖమును కప్పుకొనువానిని, అప్పటికప్పుడే వేషమును ధరించిన ప్రవ్రాజితుని, వేషమేలేని ప్రవ్రాజితుని, వ్యాధితుడని సంశయించుటకు వీలుకానట్టివానిని, భయముచేత వికారముపొందినవానిని, సారములగు వస్తువులను లేఖలను ఆయుధములను అగ్నిసంయోగములను రహస్యముగ తీసుకొనిపోవువానిని, చేతిలో విషముంచుకొన్నవానిని, దీర్ఘప్రయాణము చేసినవానిని, ముద్ర లేనివానిని వశము చేసుకొనవలెను.

21. క్షుద్రపశువునకు, చేతిలో మూటను పెట్టుకొనిన మనుష్యునకు ఒక

మాషకము ; తలపైన మూటకు వీపుమీది మూటకు ఆవుకు గుర్రమునకు రెండు మాషకములు ; ఒంటెకు మహిషమునకు నాలుగు మాషకములు ; చిన్నబండికి అయిదు ; ఎడ్లబండికి ఆరు ; శకటమునకు ఏడు ; బరువు పణ్యమునకు పావు పణము ఇయ్యవలెను. 22. దీనినిబట్టి తక్కిన బరువు సామగ్రిని గురించి తెలుసుకొనవలెను. 23. మహానదులను దాటునపుడు దీనికి రెండింతలు ఇచ్చుకొనవలెను.

24. తీరములందలి గ్రామములు దాటించువారికి క్లుప్తమగు భక్తవేతనము నియ్యవలెను.

25. పొలిమేరలలో దాటించువారు శుల్కమును, అతివాహికమును (దారి చూపినందుకు పన్ను), వర్తనిని (రహదారి పన్ను) వసూలు చేయవలెను. ముద్ర లేనివాడు తీసుకొనివచ్చు ద్రవ్యములను, అకాలమందును అతీర్థమందును అధికమగు బరువుతో దాటువాని ద్రవ్యములను స్వాధీనపరచుకొనవలెను.

26. వాహకులు లేకపోవుట మూలమునగాని, ఉపకరణముల లోపము మూలమునగాని, సంస్కరణము లేకపోవుటవలనగాని నౌకకు ఆపత్తు సంభవించినప్పుడు అధ్యక్షుడు నష్ట వినష్టములకు పరిహార మియ్యవలెను.

27. (శ్లో) ఆషాఢబహుళాష్టమినుండి కార్తికబహుళాష్టమివరకు దాటుటకు వసతులను కల్పించవలెను. (దాటించు) కార్మికుడు జామీను ఇచ్చి ఒక్కొకరోజు ఆదాయమును తీసుకొనిరావలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు నావధ్యక్షుడనే[2] ఇరవై ఎనిమిదో అధ్యాయము.

---

[2] ఇతనికి యుద్ధనౌకలతో సంబంధములేదు. అట్టి నావలుండినట్లు అర్థశాస్త్రములో నిదర్శనములు లేవు. వర్తకవ్యాపారములకు ప్రయాణికులకు ఉపయోగించు నౌకలుమాత్రమే ఇతని పర్యవేక్షణలో నుండెను.

రెండవ అధికరణము

## అధ్యాయము 29

### ప్రకరణము 46 : గోధ్యక్షుడు

1. గోధ్యక్షుడు[1] వేతనోపగ్రాహికములు (జీతము పుచ్చుకొనువారి వశమందుండు పశువులు), కరప్రతికరములు (పన్నులను నిర్ణీత ప్రతిఫలమును ఇచ్చువారి వశమందుండు పశువులు), భగ్నోత్సృష్టకములు (ఉపయోగరహితములని వదలి వేయబడినట్టివి), భాగానుప్రవిష్టకములు (భాగమునిచ్చు పద్ధతిని ప్రవేశించినవి), వ్రజపర్యగ్రములు (మందలలో చేర్చబడినవి), నష్టములు, వినష్టములు, లభించు పాల మొత్తము, నెయ్యి—వీటినిగురించి (లిఖితపూర్వములగు వివరములు) తెలిసియుండవలెను.

2. నూరు ఆవులకు రొక్కము రూపమున జీతము పుచ్చుకొను ఒక గోపాలకుడు, ఒక దున్నపోతులకాపరి, ఒక పాలుపితుకువాడు, ఒక మజ్జిగచిలుకువాడు, ఒక వేటకాడు ఉండవలెను. 3. వీరికి పాల రూపమునను, నెయ్యి రూపమునను జీతమిచ్చిన పక్షమున దూడలను హింసపెట్టెదరు. ఇది వేతనోపగ్రాహికము.

4. ఒక్కొక్కడు సమానసంఖ్యగల ముసలిఆవులు, పాలనుఇచ్చు (పాడి) ఆవులు, చూలుతోఉన్న ఆవులు, మొదటి ఈతను ఈనిన ఆవులు, దూడలు—వీటితోకూడిన నూరు పశువులను తన పాలనలో ఉంచుకొనవలెను. 5. ఇతడు సంవత్సరమునకు ఎనిమిది వారకముల నెయ్యి, తల ఒకటికి ఒక పణము, ముద్రతో కూడిన చర్మము ఇయ్యవలెను. ఇది కరప్రతికరము.

6. ఒక్కొకడు సమానసంఖ్యగల రోగపీడితములు, వికలాంగకములు, మామూలు గొల్లవానికితప్ప ఇతరులకు పాలు ఇయ్యనివి, సులభముగ పితుకనియ్య

[1] రాజుయొక్క పశువులు మాత్రమే ఇతని పర్యవేక్షణలోనివి. ఇతరుల పశువులతో ఇతనికి సంబంధము లేదు.

నివి, దూడలను చంపునట్టివి[2]—వీటితోకూడిన నూరు పశువులను తన పాలనలో ఉంచుకొని ఆయా జాతికి తగిన భాగము ఇయ్యవలెను. ఇది భగ్నోత్సృష్టకము.

7. శత్రువుల దాడుల భయముచేతగాని, ఆటవికుల భయముచేతగాని (రాజు యొక్క) మందలలో ప్రవేశించిన పశువులకై (సొంతదార్లు) పాలనధర్మానుసారము పదోవంతు ఇచ్చుకొనవలెను. ఇది భాగానుప్రవిష్టకము.

8. దూడలు, గిత్తలు, మచ్చికచేయవలసిన కోడెలు, బరువులులాగే ఎద్దులు, ఎద్దులు, ఆబోతులు—ఇవి మొగజాతివి; కాడికట్టిన బండినిగాని శకటమును[3] గాని లాగు దున్నపోతులు, పోతులు, మాంసమునకై వధించదగిన పోతులు, వీపులమీద భుజములమీద బరువులను మోయునట్టివి—ఇవి మహిషములు. ఆడ దూడ, చిన్నఆవు, మొదటిఈతఈనిన ఆవు, చూడిఆవు, పాడిఆవు, ఈననిఆవు,[4] గొడ్డావు—ఇవి గోవులు, గేదెలు.[5] వీటి ఒకటిరెండునెలల దూడలు—ఇవి చిన్నపెద్ద దూడలు. 9. ఒకటిరెండు మాసముల దూడలకు గుర్తులు వేయవలెను. 10. ఒకటిరెండు మాసములు మందలో కలసిపోయినవాటికి గుర్తులు వేయవలెను. 11. వేసిన గుర్తు, సహజలక్షణము, రంగు, కొమ్ముల విశిష్టత—ఇట్టి లక్షణములను మందలో క్రొత్తగా చేరిన పశువుల విషయమై వ్రాసి ఉంచవలెను. ఇది వ్రజ పర్యగ్రము.

12. దొంగలు అపహరించినట్టిది, మరియొక మందలోనికి పారిపోయినట్టిది, అదృశ్యమైనట్టిది—ఇవి నష్టములు. 13. బురదలో దిగబడిపోయినది, తప్పించుటకు సాధ్యముకాని ప్రదేశములకు పారిపోయినది, రోగపీడితమైనది, ముసలిది, నీళ్ళు ఆహారము లేని కారణమున కృశించినది, వృక్షము, నదీతీరము, కాష్ఠముశిల పిడుగు—వీటి దెబ్బలకు గురియైనది, క్రూరమృగము సర్పముల మొసళ్ళ కార్చిచ్చుల మూలమున ఆపద గాంచినది—ఇవి వినష్టములు. 14. అజాగ్రత్త వలన నష్ట వినష్టములను కలిగించినవారు పరిహారము నియ్యవలెను.

15. ఈ విధముగ అతడు పశువుల సంఖ్యను ఎరిగియుండవలెను.

16. (పశువును) స్వయముగ హింసించినవాడు, హింసింపజేసినవాడు, దొంగిలించినవాడు, దొంగిలింపజేసినవాడు మరణశిక్షను పొందవలెను.

17. రాజచిహ్నముకల పశువును మరియొకదానికై మార్చువానికి పూర్వ సాహసదండము.

---

[2] చచ్చిన దూడను ఈనినట్టిది అని వ్యాఖ్యాతలు.

[3] పెద్దబండికి శకటమని పేరు.

[4] భవిష్యత్తులో ఈనగలదను నమ్మకము కలిగించునట్టిది. గొడ్డుది అని నిస్సంశయముగ చెప్పరానిది.

[5] గేదెలలోకూడ ఇట్టి భేదము లుండును.

18. దొంగలు అపహరించిన స్వదేశీయములగు పశువులను (వెదకి) తెచ్చు వానికి నిర్ణయించిన పశువును (బహుమానముగ) ఇయ్యవలెను. 19. పరదేశీయ ముల తెచ్చువానికి అర్ధభాగమును ఇయ్యవలెను.

20. గోపాలకులు చిన్నవాటిని ముసలివాటిని వ్యాధిగ్రస్తములను జాగ్రత్తగ రక్షించవలెను. 21. పక్షుల వేటకాండ్రు, వేటకుక్కలతో వేటాడువారు దొంగల మూలమున క్రూరమృగముల మూలమున శత్రువుల మూలమున సంభవించు అపాయములను తొలగించిన అరణ్యములో వీరు (గోపాలకులు) పశువులను మేప వలెను. 22. సర్పములను క్రూరమృగములను భయపెట్టుటకును గోభూములలో వాటి సంచారములను తెలుసుకొనుటకును, పిరికి పశువుల మెడలకు గంటలు కట్ట వలెను. 23. సమములును విశాలములును అగు రేవులతో కూడినట్టియు, బురద గాని మొసళ్ళుగాని లేనట్టియు ఉదకములకు వాటిని తీసుకొనివెళ్ళి రక్షించవలెను. 24. వారు చోరులచేత అపహరింపబడిన పశువులగురించియు, క్రూరమృగముల చేతను సర్పములచేతను పట్టుకొనబడినవాటినిగురించియు, వ్యాధివలనగాని వార్ధ క్యమువలనగాని చనిపోయినవాటినిగురించియు అధ్యక్షునికి తెలియపరచవలెను. (అట్లు చేయనియెడల) పశువుమూల్యమును చెల్లించవలెను.

25. సకారణముగ చనిపోయిన గోవుయొక్కయు మహిషముయొక్కయు గుర్తుతో కూడిన చర్మమును, మేక గొర్రెల గుర్తుతో కూడిన చెవిని, గుర్రము ఒంటె గాడిదెల తోకను గుర్తుతో కూడిన చర్మమును, (అన్ని పశువుల) రోమములను, చర్మమును, వస్తిని, పిత్తమును, నరములను, దంతములను, గిట్టలను, కొమ్ములను, ఎముకలను అధ్యక్షునికి అందజేయవలెను. 26. మాంసమును పచ్చిగనో, ఎండ బెట్టియో అమ్మవచ్చును.

27. మజ్జిగను కుక్కలకు, పందులకు పెట్టవలెను. 28. పెరుగును సైనికులకు ఆహారార్థముగ ఇయ్యవలెను. 29. విరిగిపోయిన పాలను గానుగుల లోని గానుగపిండిని తడుపుటకు ఉపయోగించవలెను.

30. పశువులను విక్రయించువాడు ఒక్కొకదానికి పణముచొప్పున (పన్నును) చెల్లించవలెను.

31. వర్ష, శరత్, హేమంత ఋతువులలో రెండు పూటలు ; శిశిర, వసంత, గ్రీష్మములలో ఒక పూట—పాలు పితుకవలెను. 32. రెండవపూట పితుకువానికి దండము బొటనవ్రేలిని ఛేదించుటయే. 33. పితుకవలసిన కాలమును అతిక్ర మించినవానికి ఫలనష్టమునకు సమానమైన దండము. 34. దీనినుండి ముక్కు త్రాడును కట్టుట, నాగలికి కాడికి కట్టుట, చుట్టు తిరుగుట మొదలైనవాటి విషయములో కాలాతీతము గావించినందుకు శిక్షలను తెలుసుకొనవలెను.

35. ఒక ద్రోణము ఆవుపాలనుండి ప్రస్థము నెయ్యి, గేదెపాలనుండి దీనికంటె అయిదోవంతు అధికము, మేకపాలనుండి గొర్రెపాలనుండి దీనికంటె అర్ధభాగము

అధికము లభించును. 36. లేదా, చిలికిచూచి ప్రమాణమును నిర్ణయించవలెను. 37. ఏలయన, భూసారమునుబట్టి, గడ్డినిబట్టి, నీటినిబట్టి పాలలోను, నేతిలోను వృద్ధిక్షయములు కలుగును.

38. గుంపులో ఒక ఎద్దును మరియొకదానిపైకి పురికొల్పి పడత్రోయించు వానికి శిక్ష పూర్వసాహసదండము ; చంపించువానికి ఉత్తమసాహసదండము.

39. జాతినిబట్టి పదేసి చొప్పున గుంపులు ఏర్పాటుచేసి రక్షించవలెను. 40. గోవుల సంచారములబట్టిగాని, వాటి బలమునుబట్టిగాని, రక్షించుటలో అనుకూల మునుబట్టిగాని స్థావరములలో వాటినిగురించిన ఏర్పాటులను చేయవలెను.

41. మేకలయు గొర్రెలయు ఉన్నిని ఆరునెలల కొకపర్యాయము సేకరించ వలెను.

42. దీనినుండి గుర్రములు, గాడిదలు, ఒంటెలు, పందులు—వీటి గుంపుల విషయమున అనుసరించవలసిన నిబంధనలను గ్రహించవలెను.

43. ముక్కుత్రాళ్లు కట్టినట్టియు, సామాన్యమగు గుర్రపు వేగమును కలిగి నట్టియు ఎద్దులకు ఆహారము అర్ధభాగము పచ్చిగడ్డి, రెండింతలు గడ్డి, గానుగలోని పిండి ఒక తులము ; లేదా, పది ఆఢకముల నూకలపొట్టు, అయిదు పలముల సైంధవలవణము, ముక్కుమీద పూయుటకు ఒక కుడుబము నూనె, త్రాగుటకు ఒక ప్రస్థము, ఒక తులము మాంసము, ఒక ఆఢకము పెరుగు, ఒక ద్రోణము యవలు; లేదా, సగము ఉడికిన మినుములు, ఒక ద్రోణము పాలు; లేదా, అర్ధాఢకము సారాయి, ఒక ప్రస్థము కొవ్వుపదార్థము, పది పలముల చక్కెర, ఆకలిని పుట్టించుటకు ఒక పలము అల్లము. 44. ఇందులో నాల్గవవంతు తగ్గించి కంచర గాడిదలకు, ఆవులకు, గాడిదలకును, రెండింతలు అధికముగ గేదెలకు దున్న పోతులకు ఒంటెలకు (ఇయ్యవలెను). 45. పనిచేయు ఎద్దులకు, పాలిచ్చు ఆవులకు పనిచేయుకాలమందు, పాలుపితుకు సమయమందు తిండి పెట్టవలెను. 46. అన్నిటికి గడ్డి, నీళ్ళు సమృద్ధిగ ఉండవలెను. 47. ఇది పశువులమందల గురించిన వివరణము.

48. (శ్లో) ఒక వందగాడిదలకు గుర్రములకు అయిదు మగజాతివి, ఒకవంద మేకలకు గొర్రెలకు పదిమగజాతివి, ఒకవంద ఆవులకు, గేదెలకు, ఒంటెలకు నాలుగు మగజాతివి ఉండునట్లు ఏర్పాటుచేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు గోధ్యక్షుడు అనే ఇరవై తొమ్మిదో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 30

### ప్రకరణము 47 : అశ్వాధ్యక్షుడు

1. అశ్వాధ్యక్షుడు[1] కానుకగ యివ్వబడినట్టి, కొన్నట్టి, యుద్ధములో లభించినట్టి, (గుర్రపుశాలలో) పుట్టినట్టి, సహాయముచేసినందుకై లభించినట్టి, ఒడంబడిక మూలముగ లభించినట్టి, తాత్కాలికముగ అరువు తెచ్చుకొన్నట్టి గుర్రముల మొత్తమును కులము వయస్సు వర్ణము చిహ్నములు మున్నగువానిని బట్టి విభాగముచేసి లెక్కపుస్తకములలో వ్రాసి ఉంచవలెను. 2. అప్రశస్తములను, అంగవైకల్యముకలవాటిని, వ్యాధిగ్రస్తములను (రాజునకు) తెలియపరుపవలెను.

3. గుర్రపుకాపరి గుర్రమునకు కావలసిన నెల బత్తెమును కోశమునుండి కోష్ఠాగారమునుండి తీసుకొని గుర్రమును జాగ్రత్తగ సంరక్షించవలెను.

4. గుర్రపుశాలలను గుర్రముల సంఖ్యకు తగినంత పొడవుగను, గుర్రము పొడవునకు రెండింతల వెడల్పుగను, నాలుగు ద్వారములు కలవిగను, మధ్య దొర్లుటకు తగిన ప్రదేశము కలవిగను, చావడితో కూడినట్టివిగను, ద్వారములకు ముందు కూర్చుండుటకు తగిన బల్లలతో కూడినట్టివిగను, కోతులు, నెమళ్లు, మచ్చల జింకలు, ముంగిసలు, చకోరములు, చిలుకలు, గోరువంకలతో నిండియుండు నట్లుగను కట్టించవలెను. 5. ఒక్కొక్క గుర్రమునకు దాని పొడవుతో సమానమైన పొడవుగల చతురస్రశాలను నున్ననిచెక్కలు పరచినట్టిదిగను, గ్రాసమునకు ప్రత్యేక స్థానముకలదిగను, మూత్రపురీషములు వెళ్ళిపోవుటకు ఏర్పాటుకలదిగను తూర్పు ముఖముగగాని ఉత్తర ముఖముగగాని కట్టించవలెను. 6. లేదా, శాలలను

---

[1] అర్థశాస్త్రములోని అశ్వములకు సంబంధించిన వివరములకును, మధ్యయుగమున రచింపబడిన నకులుని 'అశ్వచికిత్సితము', జయదత్తసూరి విరచితమగు 'అశ్వవైద్యకము' మున్నగు గ్రంథములలోని వివరములకును ఎంతో భేద మున్నది. ఇందుచేత కౌటిల్యు డనుసరించిన సంప్రదాయము మధ్యయుగ సంప్రదాయమునకు భిన్నమని స్పష్టమగుచున్నది.

బట్టి దిక్కులను నిర్ధారణ చేయవచ్చును. 7. ఆడుగుర్రములకు, మగగుర్రములకు, పిల్లగుర్రములకు వేరు వేరు శాల లుండవలెను.

8. ఈనినగుర్రమునకు మూడురాత్రులకాలము ప్రస్థము నెయ్యిని పానముగ నియ్యవలెను. 9. తర్వాత పది రాత్రులు ఒక ప్రస్థము ఉడకవేసిన యవలు, మత్తెక్కించు కొవ్వుతోకూడిన పానీయము ఔషధము ఇయ్యవలెను. 10. అటు తర్వాత యవలవులాకము, పచ్చిగడ్డి ఋతువు ననుసరించి ఆహారము ఇయ్యవలెను.

11. గుర్రపుపిల్లకు పది రాత్రుల తర్వాత ఆరు మాసములవరకు ఒక కుడు బము యవలపిండి, నాలుగోవంతు నెయ్యి, ఒక ప్రస్థము పాలు ఆహారముగ ఇయ్య వలెను. 12. అటుపిమ్మట మూడుసంవత్సరములవరకు మొదటినెలలో ఒక ప్రస్థము యవలు, తర్వాత నెలనెలకు అర్ధప్రస్థముచొప్పున పెంచుచు, తర్వాత నాలుగో సంవత్సరము పూర్తిఅగువరకు ఒక ద్రోణము తిండి పెట్టవలెను. 13. అటుతర్వాత—నాలుగు సంవత్సరములుగాని అయిదుగాని వచ్చినతర్వాత—పూర్ణ ప్రమాణముకలదియై పనిచేయుటకు యోగ్యమగును.

14. ఉత్తమాశ్వపు ముఖము ముప్పైరెండు అంగుళములు ; దాని పొడవు ముఖమునకు అయిదురెట్లు ; దాని జంఘ ఇరవై అంగుళములు ; దాని ఎత్తు జంఘకు నాలుగురెట్లు.[2] 15. మధ్యమ కనిష్ఠముల ప్రమాణము క్రమముగ పైవానికి మూడేసి అంగుళములు తక్కువ. 16. ఉత్తమాశ్వపు చుట్టుకొలత (పరిణాహము) నూరు అంగుళములు. 17. మధ్యమ కనిష్ఠల చుట్టుకొలత క్రమముగ అయిదవవంతు తక్కువ.

18. ఉత్తమాశ్వమునకు ఆహారము : సగమునానినవిగాని ఉడికినవిగాని రెండు ద్రోణముల శాలి, లేక, వ్రీహి, లేక, యవలు, లేక, ప్రియంగువు ; లేదా, సగముఉడికిన మినుములుగాని పెసలుగాని, ఒక ప్రస్థము కొవ్వుపదార్థము, అయిదు పలముల ఉప్పు, ఏభై పలముల మాంసము, ముద్దలు నానుటకు ఒక ఆఢకము రసము ; లేదా, రెండింతల పెరుగు, మత్తెక్కుటకు అయిదు పలముల చక్కెరతో కలిసిన ఒక ప్రస్థము సారాయి ; లేదా, దానికి రెండింతల పాలు. 19. దూర ప్రయాణమువలనగాని ఎక్కువ బరువును మోయుటవలనగాని అలసినదానికి అకలిని వృద్ధిచేయుటకు అనువాసనముగ ఒక ప్రస్థము కొవ్వుపదార్థమును త్రాగించి, ఒక కుడుబము నూనె ముక్కుకు రుద్ది, అర్ధభద్రము పచ్చిగడ్డిగాని, రెండింతల గడ్డినిగాని, ఆరు అరత్నుల చుట్టుకొలతగల గడ్డిమోపులుగాని తినిపించవలెను. 20. మధ్యమ కనిష్ఠాశ్వములకు ఇందులో నాల్గవవంతు తక్కువ.

21. (ఆహార విషయములో) రథాశ్వము మధ్యమవృషాశ్వము ఉత్తమా శ్వముతో సమానములు. 22. కనిష్ఠవృషాశ్వములు మధ్యమముతో సమానములు.

---

[2] అశ్వవైద్యక గ్రంథములో ఉత్తమాశ్వముల ఎత్తు 96 అంగుళములని, మధ్యమముల ఎత్తు 84 అంగుళములని, కనిష్ఠముల ఎత్తు 76 అంగుళములు అని చెప్పబడినది.

**23.** ఆడగుఱ్ఱములకు కంచరగాడిదలకు నాలుగోవంతు తక్కువ. **24.** పిల్ల గుఱ్ఱములకు అర్ధభాగము తక్కువ. **25.** ఇవి ఆహార నియమములు.

**26.** (గుఱ్ఱముల) ఆహారమును వండువారు, కళ్ళెములను పట్టుకొనువారు, చికిత్సకులు ఆహారమును ముందుగ రుచి చూడవలెను.

**27.** యుద్ధము, వ్యాధి, వార్ధక్యముల మూలమున పనిచేయు శక్తిని కోల్పోయిన గుఱ్ఱములకు ఆహారము పెట్టి పోషించవలెను. **28.** యుద్ధమునకు ఉపయోగించని గుఱ్ఱములను పౌరులయు జానపదులయు ప్రయోజనార్థము ఆడగుఱ్ఱములతో కలుపుటకు వినియోగించవలెను.

**29.** ఉపయోగార్హములగు గుఱ్ఱములలో ఉత్తమములు కాంభోజ, సింధు, ఆరట్ట, వనాయుదేశములలో[3] పుట్టినవి; మధ్యమములు బాహ్లిక, పాపేయ, సౌవీర, తితలదేశములలో పుట్టినవి. తక్కినవి తక్కువజాతివి.[4] **30.** వాటి తీక్ష్ణము, భద్రము, మందములబట్టి యుద్ధమునకుగాని, స్వారికిగాని ఉపయోగించవలెను.

**31.** గుఱ్ఱమునకు సర్వతోముఖమగు (ప్రధాన) కర్మ యుద్ధము చేయుటయే.

**32.** వల్గనము (పైకి ఎగిరి పరుగెత్తుట), నీచగతి (మెల్లగ ఎగురుట), లంఘనము (దూకుట), ధోరణము (కదము తొక్కుట), నారోష్ట్రము (సంజ్ఞలబట్టి నడచుట)— ఇవి స్వారిగుఱ్ఱముల రీతులు.

**33.** వీటిలో ఉపవేణుకము, వర్ధమానకము, యమకము, ఆలీఢప్లుతము, పృథుగము, త్రికచాలి—ఇవి వల్గనములోని భేదములు.

**34.** తల, చెవులు, కదలికలేని వల్గనము నీచగతి. ఇందులో పదహారు భేదములు. **35.** ప్రకీర్ణకము, ప్రకీర్ణోత్తరము, నిషణ్ణము, పార్శ్వానువృత్తము, ఊర్మిమార్గము, శరభక్రీడితము, శరభప్లుతము, త్రితాలము, బాహ్యానువృత్తము, పంచపాణి, సింహాయతము, స్వాధూతము, క్లిష్టము, శ్లింగితము, బృంహితము, పుష్పాభికీర్ణము—ఇవి నీచగతిలోని అడుగులు.

**36.** కోతిదూకు, కప్పదూకు, జింకదూకు, ఒకపాదముతోదూకు, కోకిల సంచారము, ఉరస్యము (రొమ్ముతోదూకు), కొంగదూకు—ఇవి లంఘనములు (దూకులు).

**37.** కాంకము (డేగ నడక), వారికాంకము (నీటిడేగ నడక), మాయూరము (నెమలి నడక), అర్ధమాయూరము, నాకులము (ముంగిస నడక), అర్ధనాకులము, వారాహము (పంది నడక), అర్ధవారాహము—ఇవి ధోరణములు.

---

[3] వనాయు దేశము ఇప్పటి అరేబియా.

[4] నకులుని గ్రంథము గుఱ్ఱముల జన్మస్థానములబట్టి వాటిని తాజికములు, ఖారశానములు, కెకాణములు, సింధుపారము లనియు, జీవదత్తసూరి గ్రంధము వానిని తాజికములు, పారసీకములు, తురుష్కజాతములు, సింధుదేశోద్భవములు అని చెప్పుచున్నవి. సింధుదేశము తప్ప తక్కిన దేశములను కౌటిల్యుడు పేర్కొనలేదు.

38. సంజ్ఞలనుబట్టి నడచుట నారోష్ట్రము.

39. రథాశ్వముల దిన గమనము ఆరు, తొమ్మిది, పన్నెండు యోజనములు, స్వారిగుర్రములకు బరువులు మోయగల గుర్రములకు అయిదు, ఏడున్నర, పది యోజనములు.

40. విక్రమము (తెరిపిలేక నడచుట), భద్రాశ్వాసము (నెమ్మదిగ నడచుట), భారవాహ్యము (బరువుతో నడచుట)—ఇవి నడకలు.

41. విక్రమము, వల్గితము, ఉపకంఠము (దూకుట), ఉపజవము (కొంచెము వేగము), జవము—ఇవి వేగములు.

42. శిక్షణ నిచ్చువారు కళ్ళెములు, ఇతర పనిముట్లను గురించియు, సూతులు యుద్ధములో అవసరములైన రథాశ్వముల అలంకరణముల గురించియు ఏర్పాటుచేయవలెను. 43. గుర్రముల వైద్యులు వాటి శరీరముల (బరువులోని) వృద్ధిక్షయములకు ప్రతిక్రియలు, ఋతువులకు అనుగుణమైన ఆహారము నిర్ణయించవలెను.

44. కళ్లెముల పట్టువాడు, గుర్రములను కట్టివేయువాడు, దానా (తిండి) పెట్టువాడు, దానా ఉడికించువాడు, శాల కాపరి, జూలు కత్తిరించువాడు, విష వైద్యుడు, వారివారి పనులద్వారా గుర్రములను సంరక్షించవలెను. 45. వారు పనులను జాగరూకతతో చేయనప్పుడు వారి దినవేతనములను కోసివేయవలెను. 46. నీరాజనోత్సవమునకు ప్రత్యేకింపబడిన గుర్రమునుగాని, చికిత్సను పొందుచున్న గుర్రమునుగాని ఎక్కినవానికి పన్నెండు పణముల దండము. 47. చికిత్స చేయని కారణమునగాని ఔషధము ఇయ్యని కారణమునగాని రోగము వృద్ధిగాంచిన యెడల రోగము కుదుర్చుటకు ఖర్చుకు రెండింతల దండము. 48. వారి లోపము వలన ప్రమాదము సంభవించినప్పుడు గుర్రము ఖరీదుకు సమానమగు దండము.

49. దీనినిబట్టి గోవుల మందలు, గాడిదలు, ఒంటెలు, దున్నపోతులు, గేదెలు, మేకలు, గొర్రెల విషయమున అనుసరించవలసిన నియమములను తెలుసుకొనవలెను.

50. (శ్లో) గుర్రములకు దినమునకు రెండు పర్యాయములు స్నానమును గంధమాల్యములను ఏర్పాటుచేయవలెను. కృష్ణపక్ష సంధికాలములందు భూత యజ్ఞములను, శుక్లపక్ష సంధికాలములందు స్వస్తివాచనములను చేయించవలెను.

51. (శ్లో) అశ్వయుజ నవమినాడు, (యుద్ధ) యాత్రారంభమందు అవసానమందు వ్యాధిగ్రస్తమైనప్పుడు గ్రహశాంతియందు అనురక్తుడై గుర్రములకు నీరాజనమును ఇప్పించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు అశ్వాధ్యక్షుడు అనే ముప్పైయో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 31

### ప్రకరణము 48 : హస్త్యధ్యక్షుడు[1]

1. హస్త్యధ్యక్షుడు హస్తివనములను రక్షించుచు, శిక్షణపొందుచున్నట్టియు పనిచేయుచున్నట్టియు, మగ ఆడ పిల్లఏనుగుల శాలలు, పరుండు ప్రదేశములు, చేయు పని, ఆహారము, గడ్డి, చేయవలసినపని, బంధించుటకు కావలసిన ఉపకరణములు, యుద్ధసంబంధములగు అలంకారములు, చికిత్సకులు, శిక్షకులు, నౌకర్లు—దీని నంతను పర్యవేక్షించవలెను.

2. ఏనుగు పొడవునకు రెండింతల ఎత్తును వెడల్పును పొడవును కలిగి నట్టియు, ఆడఏనుగులకు ప్రత్యేకస్థానములతోకూడినట్టియు, చావడికలిగినట్టియు, దూలముతోకూడినట్టియు, శాలను తూర్పుముఖముగగాని, ఉత్తరముఖముగగాని, కట్టించవలెను. 3. ఒక్కొక ఏనుగునకు దాని పొడవునకు అనుగుణమైన చతురస్ర శాలను నున్నని స్తంభముతోను పలకలతోను మూత్రపురీషముల విసర్జనస్థానములతోను కూడినట్టిదిగ కట్టించవలెను. 4. యుద్ధకార్యములందు స్వారిచేయుటయందు ఉపయోగించు ఏనుగులకు దుర్గము లోపల, తర్ఫీదు పొందుచుండునట్టివాటికిని, క్రూరములగువాటికిని దుర్గము బయట పండుకొనుటకు యోగ్యమైన స్థానముండ వలెను. విస్తీర్ణములో అది శాలతో సమానముగను ఎత్తులో అర్ధముగను ఉండవలెను.

5. పగటి ఎనిమిది భాగములలో మొదటిది ఏడవది (ఏనుగుల) స్నాన కాలములు. దానితర్వాత తిండి. 6. పూర్వాహ్ణము వ్యాయామకాలము, అపరాహ్ణము మత్తెక్కించు పదార్థముల నుపయోగించుటకు కాలము. 7. రాత్రిలో రెండు

[1] అర్థశాస్త్రములోని ఏనుగుల గురించిన వివరములకును మధ్యయుగమునాటి మానసోల్లాసాది గ్రంథములలోనివానికిని భేదము లనేకము లున్నవి. అందుచేత కౌటిల్యు డనుసరించిన సంప్రదాయము మధ్యయుగపు రచయితల సంప్రదాయమునకు భిన్నమైనట్టిదని చెప్పదగి యున్నది.

భాగములు నిద్రకు, మూడవభాగము పండుకొనుటకు లేచుటకు (కాలములు).

8. ఏనుగులను పట్టుటకు కాలము గ్రీష్మము. 9. ఇరవైసంవత్సరముల వయస్సుకలదానిని పట్టుకొనవలెను. 10. కూన, చిన్నదంతములు కలది, దంతములు లేనిది, వ్యాధిగ్రస్తమైనది, గర్భిణి, పిల్లకు పాలిచ్చుచుండునది—వీటిని పట్టుకొనరాదు.

11. ఎనిమిది అరత్నుల ఎత్తు, తొమ్మిది అరత్నుల పొడవు, పది అరత్నుల పరిణాహము (చుట్టుకొలత) కలిగిన నలభైఏండ్ల వయస్సు ఏనుగు శ్రేష్ఠమైనది; ముప్పైసంవత్సరముల వయస్సుది మధ్యమము; ఇరవైఅయిదు సంవత్సరముల వయస్సుది అవరము (అధమము). 12. ఈ రెంటికి మొదటిదాని ఆహారములో నాల్గవవంతు తక్కువ.

13. ఏడు అరత్నుల ఎత్తుగల ఏనుగుకు ఒక ద్రోణము బియ్యము, అర్ధాఢకము నూనె, మూడు ప్రస్థముల నెయ్యి, పది పలముల ఉప్పు, ఎండిన ముద్దలను తడిపి మెత్తగచేయుటకు ఒక ఆఢకము రసము, లేదా, రెండింతల పెరుగు మత్తెక్కించు పానీయముగ పది పలముల చక్కెర కలిపిన ఒక ఆఢకము సారాయి, లేదా, రెండింతల పాలు, శరీరముపై రుద్దుటకు ఒక ప్రస్థము నూనె తలకు దీపమునకు ఇందులో ఎనిమిదోవంతు, రెండుంబావు భారముల పచ్చిగడ్డి, రెండున్నర భారముల ఎండుగడ్డి, ఇష్టమువచ్చినన్ని మొక్కల ఆకులు. 14. ఎనిమిది అరత్నుల ఎత్తుగల మదపుటేనుగునకుకూడ ఇదియే ఆహారపరిమాణము. 15. తక్కిన అయిదు-ఆరు అరత్నుల ఎత్తుగలవాటికి వాటి హస్తపరిమాణమునుబట్టి ఆహారము.

16. పాలు త్రాగుచు, పచ్చిగడ్డి మేయుచు ఉండు కూనను క్రీడార్థము పట్టుకొనవచ్చును.

17. ఎరుపురంగు, నునుపైన పార్శ్వములు, సమమైన కక్ష్య, సమముగ వ్యాపించిన మాంసము, సమమైన వెనుకభాగము, వంగిన శరీరము—ఇవి ఏనుగుల చిహ్నములు.

18. (శ్లో) ఈ చిహ్నములబట్టి, ఋతుధర్మములబట్టి భద్రజాతి, మందజాతి, మిశ్రజాతి ఏనుగులకు వ్యాయామమును కల్పించి తగిన పనులను వాటిచేత చేయించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు హస్త్యధ్యక్షుడు అనే ముప్పైఒకటో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 32

### ప్రకరణము 48 : (మిగులు) హస్త్యధ్యక్షుడు, హస్తిప్రచారము

**1.** అవి చేయు పనులనుబట్టి ఏనుగులు దమ్యాములు (శిక్షణపొందు చున్నట్టివి), సాంనాహ్యాములు (యుద్ధమునం దుపయోగింపబడునవి), ఔపవాహ్యాములు (స్వారికి ఉపయోగింపబడునవి), వ్యాళములు (క్రూరస్వభావము కలవి) అని నాలుగు విధములు.

**2.** వీటిలో దమ్యాములు అయిదు విధములు : స్కంధగతములు (మనుష్యుని ఎక్కించుకొని స్వారి చేయుటకు అలవాటుపడినవి), స్తంభగతములు (స్తంభమునకు కట్టుటకు అలవాటుపడినవి), వారిగతములు (ఏనుగులను పట్టుకొను ప్రదేశములకు అలవాటుపడినవి), అపవాతగతములు (గోతులలో నిలబడుటకు అలవాటుపడినవి), యూథగతములు (గుంపులలో కలిసి ఉండుటకు అలవాటుపడినవి) అని. 3. దీనికి ఉపవిచారముగ పిల్లఏనుగును సంరక్షించునట్లు సంరక్షించవలెను.

**4.** సాంనాహ్యాములు ఏడు విధములగు పనులను చేయవలెను : ఉపస్థానము (దగ్గిర నిలబడియుండుట), సంవర్తనము (చుట్టు తిరుగుట), సంయానము (కలిసి ప్రయాణముచేయుట), వధావధము (చంపుట, తొక్కుట), హస్తియుద్ధము (ఏనుగులతో యుద్ధముచేయుట), నాగరాయణము (నగరములపైపడి పట్టుకొనుట), సాంగ్రామికము (యుద్ధము చేయుట). **5.** దీనికి ఉపవిచారములు కక్ష్యాకర్మ (చుట్టు గొలుసులువేయుట), గ్రైవేయకర్మ (మెడచుట్టు గొలుసులు వేయుట), యూథకర్మ (గుంపులో కలిసి నడుచుట).

**6.** ఔపవాహ్యములు ఎనిమిది విధములు : ఆచరణములు (మరియొక ఏనుగు వెనుక వెళ్ళునవి), కుంజరోపవాహ్యములు (ఇంకొకదాని సహాయమున స్వారి చేయబడునట్టివి), ధోరణములు (కదము తొక్కునవి), ఆధానగతికములు (రకరకములగు గతులు కలవి), యష్టివ్యత్రోపవాహ్యములు (కర్రల సంజ్ఞలబట్టి

నడుచునవి), తోత్రోపవాహ్యములు (బరిగోల సహాయమున నడుచునవి), శుద్ధోపవాహ్యములు (దేనిసహాయములేక నడుచునవి), మార్గయుక్తములు (వేటలో ఉపయోగించునవి) అని. 7. వీటికి ఉపవిచారములు శారదకర్మ (మంచిస్థితిలో ఉంచుట), హీనకర్మ (లోపములను సంస్కరించుట), నారోష్ట్రకర్మలు (సంజ్ఞలకు అలవాటుపడుట).

8. వ్యాళము (మొండిపట్టుపట్టి) ఒకేమార్గమున వెళ్ళునట్టిది: అది శంకితము (భయమునకు గురియైనది), అవరుద్ధము (కట్టబడినది), విషమము (అసాధారణప్రకృతి కలది), ప్రభిన్నము (మదించినది), ప్రభిన్నవినిశ్చయము (స్థిమితము లేనిది), మదహేతువినిశ్చయము (మదించిన కారణమున స్థిమితము లేనిది). 9. దీనికి ఉపవిచారము ఒంటరిగ బంధించి సంరక్షించుట. 10. క్రియాశూన్యమగు వ్యాళము శుద్ధము (శుద్ధమగు మొండిది), సువ్రతము (తెలివితో కూడిన మొండిది), విషమము (అసాధారణప్రకృతి కలది), సర్వదోషప్రదుష్టము (అన్ని దోషములు కలది) కావచ్చును.

11. వాటిని బంధించుటకు కావలసిన ఉపకరణములు ఇతరములగు ఉపకరణములు శిక్షణ ఇచ్చువారు నిర్ణయించవలెను. 12. కట్టివేయుటకు స్తంభము, మెడగొలుసు, చుట్టుగొలుసు, రికాబుగొలుసు, పాదములగొలుసు, పైభాగపుగొలుసు మొదలైనవి బంధనోపకరణములు. 13. అంకుశము, వేణువు, యంత్రము మొదలైనవి ఉపకరణములు. 14. వైజయంతిమాల, క్షురప్రమాల, ఆస్తరణము, తివాసి మొదలైనవి ఆభరణములు. 15. కవచము, తోమరము, శరావాపము, యంత్రము మొదలైనవి యుద్ధాలంకారములు.

16. చికిత్సకుడు, శిక్షకుడు, స్వారిచేయువాడు, నడిపించువాడు, రక్షకుడు, అలంకారికుడు, వంటవాడు, జీనిపెట్టువాడు, పాదములకు గొలుసువేయువాడు, శాలకాపరి, రాత్రిపూట కాపలాకాచువాడు—మొదలైనవారు ఉపచారవర్గము. 17. చికిత్సకుడు, శాలకాపరి, వంటవాడు ఒక ప్రస్థము అన్నము, ఒక ప్రస్థము కొవ్వు పదార్థము, రెండు పలముల చక్కెర ఉప్పు తీసుకొనవలెను. చికిత్సకుడు తప్ప తక్కిన ఇద్దరు పది పలముల మాంసమును తీసుకొనవలెను. 18. దూరప్రయాణము చేసిన ఏనుగులకు, వ్యాధితములకు, పనులమూలమున అలసినవాటికి, మదించిన వాటికి, ముసలివాటికి చికిత్సకులు చికిత్స చేయవలెను.

19. శాలను శుభ్రపరచకపోవుట, ఆహారపదార్థములను తీసుకొనకుండుట, కటికనేలమీద పరుండబెట్టుట, కొట్టుట, మరియొకనిచేత స్వారిచేయించుట, అకాలమందు స్వారిచేయుట, అక్షముకాని ప్రదేశములో స్వారిచేయుట, దిగుటకు సాధ్యము కాని నీటిపట్టులకు కొనిపోవుట, క్రిక్కిరిసిన చెట్లతోకూడిన అడవులకు తీసుకొని వెళ్ళుట—ఇవి నేరములు. 20. (ఇట్టి నేరములు) చేయువారి భక్తవేతనముల నుండి నష్టపరిహారమును వసూలు చేయవలెను.

21. (శ్లో) చాతుర్మాస్య ఋతుసంధులందు మూడుమార్లు నీరాజనమును, కృష్ణపక్షసంధులందు భూతయజ్ఞములను, శుక్లసంధులందు సేనాని పూజలను చేయించవలెను.

22. (శ్లో) నదీతీరములందలి ఏనుగుల దంతములను రెండున్నర సంవత్సరముల కొకపర్యాయము, పర్వత ప్రదేశముల ఏనుగుల దంతములను అయిదు సంవత్సరముల కొకపర్యాయము, దంతములమూలముల చుట్టుకొలతకు రెండింతల పొడవును వదలి తక్కినభాగమును ఛేదించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు హస్త్యధ్యక్ష ప్రకరణమున హస్తిప్రచారమనే ముప్పైరెండో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 33

### ప్రకరణము 49 : రథాధ్యక్షుడు

### ప్రకరణము 50 : పత్త్యధ్యక్షుడు

### ప్రకరణము 51 : సేనాపతి ప్రచారము

1. అశ్వాధ్యక్షుని పనులనుబట్టి రథాధ్యక్షుని పనులను తెలుసుకొనవలెను. 2. ఇతడు రథములను తయారుచేయుటకు కర్మాగారములను స్థాపించవలెను.

3. పది పురుషముల ఎత్తు, పండ్రెండు పురుషముల వెడల్పు కలిగిన రథము (అన్నిటికంటె పెద్దది). 4. దాని వెడల్పులో ఒక్కొక్క పురుషము చొప్పున ఆరు పురుషములవరకు తగ్గించుచు వచ్చినయెడల ఏడు రకముల రథములు ఏర్పడును.

5. అతడు దేవరథము, ఉత్సవరథము, యుద్ధరథము, ప్రయాణమునకు అనుకూలించు రథము, శత్రుపురములపై దాడిచేయుట కుపయోగించు రథము, శిక్షణ ఇచ్చుట కుపయోగించు రథము—మున్నగువాటిని తయారుచేయించవలెను.

6. ధనుస్సులు, ప్రహరణాస్త్రములు, కవచములు, ఉపకరణములు, వివిధకార్యములందు నియుక్తులైన సారథులు, రథికులు, రథాశ్వములు—ఈ విషయముల నన్నిటిని అతడు ఎరిగియుండవలెను. శాశ్వతముగాను తాత్కాలికముగాను నియమింపబడిన భృత్యులకు వారివారి పనులు పూర్తియగువరకు లభించవలసిన భక్తవేతనములను పర్యవేక్షించుచు, వారికి అవసరమైన అనుభవమును, రక్షణను కల్పించి గౌరవించవలెను.

7. దీనినిబట్టి పత్త్యధ్యక్షుని పనులను తెలుసుకొనవలెను. 8. మూలబలము, భృతబలము, శ్రేణీబలము, మిత్రబలము, శత్రుబలము, ఆటవికబలము—వీటి గుణదోషములు ; జలములందు ఎత్తైనప్రదేశములందు చేయవలసిన యుద్ధకర్మలు ;

ప్రకాశయుద్ధము, కూటయుద్ధము ; గోతులలోగాని ఆకాశమందుండిగాని చేయు యుద్ధము ; పగటియందుగాని రాత్రిపూటగాని చేయవలసిన యుద్ధము ; వివిధము లగు పనులయందు సైనికుల నియోగించుటకు అవకాశము ఉన్నదీ లేనిదీ—వీటి నన్నిటిని ఎరిగియుండవలెను.

9. సర్వయుద్ధములకు ఆయుధములకు సంబంధించిన శాస్త్రములందు ప్రవీణుడును, హస్త్యశ్వరథచర్యలయందు నిపుణుడును అయిన సేనాపతి చతురంగ బలముల కార్యకలాపములను పర్యవేక్షించుచుండవలెను. 10. తన బలముల విడుచుటకు తగిన ప్రదేశము, యుద్ధకాలము, శత్రుసైన్యములపైకి పంపవలసిన సైన్యముల వ్యూహము, భిన్నముకాని సైన్యములను భిన్నముచేయుట, భిన్నములగు వాటిని కలుపుట, సంహతసైన్యములను భేదించుట, భేదింపబడిన సైన్యములను నాశముగావించుట, దుర్గముల నాశముగావించుట, యాత్రాకాలము—వీటి నన్నిటిని ఎరిగియుండవలెను.

11. (శ్లో) సైనికశిక్షణయందు శ్రద్ధకలవాడై అతడు స్థానయానప్రహరణ కాలములందు వాద్యములు ధ్వజములు పతాకముల ద్వారా వ్యూహములకు పంపదగిన సంజ్ఞలను కల్పించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, సేనాపతిప్రచారము అనే ముప్పైమూడో అధ్యాయము.

# రెండో అధికరణము

## అధ్యాయము 34

### ప్రకరణము 52 : ముద్రాధ్యక్షుడు

### ప్రకరణము 53 : వివీతాధ్యక్షుడు

1. ముద్రాధ్యక్షుడు ఒక మాషకము తీసుకొని ముద్రవేసిన పత్రమును ఇయ్యవలెను.[1]

2. ముద్రాపత్రము ఉన్నవాడుమాత్రమే జనపదప్రవేశముగాని నిష్క్రమణము గాని చేయవలెను. 3. ముద్రాపత్రములేని స్వదేశీయుడు పండ్రెండు పణముల దండమును చెల్లించవలెను. 4. కూటముద్రాపత్రమునకు పూర్వసాహసదండము. విదేశీయునికి ఉత్తమసాహసదండము.

5. వివీతాధ్యక్షుడు ముద్రాపత్రములను పరిశోధించవలెను.

6. గ్రామగ్రామముల మధ్య పచ్చికబయళ్ళను స్థాపించవలెను. 7. పల్లపు ప్రదేశములందు అరణ్యములందు చోరభయము, క్రూరమృగముల భయము లేకుండునట్లు జాగ్రత్తపడవలెను.

8. ఉదకములేని ప్రదేశములందు బావులను, జలాధారములను, ఊటలను పువ్వులతోటలను, పండ్లతోటలను నిర్మించవలెను.

9. పక్షుల వేటకాండ్రు, కుక్కల వెంటబెట్టుకొని వేటాడువారు అరణ్యము లందు సంచారము చేయవలెను. 10. దొంగలుగాని శత్రువులుగాని సమీపించి నపుడు తాము వారి వశముకాకుండ కొండలనుగాని, చెట్లనుగాని, వడిగప్రయాణము చేయు వాహనములనుగాని ఎక్కి శంఖదుందుభినినాదముల గావింపవలెను.

11. (వివీతాధ్యక్షుడు) శత్రువుల సంచారములను ఆటవికుల సంచారము

[1] ఒక మాషకము నిచ్చి ముద్రాపత్రమును కొనినవాడు యథేచ్ఛగ జనపదములో సంచారము చేయవచ్చును. ఇది ఒకవిధమైన పన్ను.

లను ముద్రవేసిన లేఖలను తెచ్చు పెంపుడుపావురముల ద్వారాగాని, ధూమాగ్ని పరంపరద్వారాగాని[2] రాజునకు తెలియజేయవలెను.

**12.** (శ్లో) అతడు ద్రవ్యహస్తివనములలోనివారికి జీవనవృత్తిని కల్పించి, రహదారిపన్ను వసూలుచేసి, చోరులమూలమున ప్రమాదము లేకుండునట్లు సార్థవాహులను, పశువులను, వ్యాపారమును రక్షించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు ముద్రాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు అనే ముప్పైనాలుగో అధ్యాయము.

[2] పగటిపూట ధూమపరంపర, రాత్రిపూట అగ్నిపరంపర.

# రెండో అధికరణము

## అధ్యాయము 35

### ప్రకరణము 54 : సమాహర్తృ ప్రచారము

### ప్రకరణము 55 : గృహపతికుల, వర్తకుల, సన్యాసుల వేషములను ధరించిన గూఢచారులు

1. సమాహర్త జనపదమును నాలుగుభాగములుగ విభాగముచేసి, గ్రామములను జ్యేష్ఠములని, మధ్యమములని, కనిష్ఠములని వర్గీకరణము గావించి, వాటిలో పరిహారకములు ఏవియో, ఆయుధీయములు ఏవియో, ఆయమును ధాన్య రూపమునను, పశువుల రూపమునను, హిరణ్య రూపమునను, కుప్య రూపమునను, విష్టి రూపమునను, ప్రతికర రూపమునను చెల్లించునవి ఏవియో[1] పుస్తకములలో వ్రాసి ఉంచవలెను. 2. అతని అధీనములో అయిదు గ్రామములకుగాని పది గ్రామములకుగాని గోపుడను అధికారి ఉండవలెను.

3. పొలిమేరల నిర్ణయించి గ్రామముల సంఖ్యను, సాగుబడియగు పొలములను, సాగుబడికానివాటిని, మెట్టలను, మాగాణులను, ఆరామములను, కాయగూరల పువ్వుల పండ్ల తోటలను, వనములను, కట్టడములను, చైత్యములను, దేవాలయములను, జలాధారములను, శ్మశానములను, సత్రములను, చలిపందిరులను, పుణ్యస్థానములను, వివీతములను, రహదారులను గ్రంథస్థము గావించి, తదనుగుణముగ క్షేత్రముల పొలిమేరలయు అడవులయు రహదారులయు ప్రమాణమును; దానములు, విక్రయములు, అనుగ్రహములు పన్నులనుండి పరిహారములు; గ్రామములు, పొలములు, పన్నులు చెల్లించవలసినవారు, చెల్లించు అవసరములేనివారు—దీనినంతను వ్రాసి ఉంచవలెను. 4. వీరిలో ఎందరు నాలుగు వర్ణము

[1] పరిహారక గ్రామములు పన్నులు చెల్లించు అవసరములేనివి. ఆయుధీయములు సైనికులను సరఫరాచేయునవి. ప్రతికరమనగా శాశ్వతముగ నిర్ణీతమైన పన్నులు చెల్లించునవి.

లకు చెందినవారో, ఎందరు కర్షకులో, గోరక్షకులో, వర్తకులో, చేతిపనులను చేయువారో, కూలిపని చేయువారో, దాసులో, ఎన్ని ద్విపాత్తులు చతుష్పాత్తులు ఉన్నవో, వీరందరినుండి ఎంత హిరణ్యము విష్టి శుల్కము దండము వసూలు కాదగియున్నదో వ్రాసిఉంచవలెను. 5. ఆ యా కులములలోని స్త్రీ పురుషులలో ఎందరు బాలురో, ఎందరు వృద్ధులో, వారు చేయుపని, వారి ఆచారములు, వారి ఆయవ్యయములు ఎట్టివో అతనికి తెలిసియుండవలెను.[2]

6. ఇదేవిధముగ జనపదములో నాల్గవభాగమునకు అధికారి అయినవాడు దానికి సంబంధించిన వివరములను తెలిసియుండవలెను.

7. గోపస్థానికస్థానములందు ఉండు ప్రదేష్టలు వారివారి విధులను నెరవేర్చుచు పన్నులు వసూలుచేయవలెను.

8. గృహస్థులవలె వేషము ధరించిన గూఢపురుషులు సమాహర్త ఆదేశమును పొందినవారై గ్రామములలో నివాసముల నేర్పరుచుకొని ఆ యా గ్రామములలో క్షేత్రముల ప్రమాణమును, పంటలను, కుటుంబముల భోగపరిహారములను, కులముల వర్ణకర్మములను తెలుసుకొనవలెను. 9. వీటిలోని స్త్రీపురుషుల వివరములను ఆయవ్యయములను వారు తెలుసుకొనవలెను. 10. వచ్చివెళ్ళేవారి రాకపోకలకు కారణములను, ఇతరులను హింసించు స్త్రీపురుషులగురించియు, గూఢచారుల కార్యకలాపముగురించియు వారు తెలుసుకొనవలెను.

11. ఇదేవిధముగ వర్తకుల వేషము ధరించిన గూఢపురుషులు స్వదేశమందు ఉత్పత్తియగు రాజపణ్యములను, గనులు, జలాధారములు, కర్మాగారములు, పొలములు మొదలగువాటినుండి తయారగు సామగ్రుల పరిమాణములను తెలుసుకొనవలెను. 12. పరదేశములలో ఉత్పత్తిఅగునట్టియు, స్థలజలమార్గముల మీదుగ ప్రవేశించునట్టియు, సామగ్రులలో సారాసారములను అవి చెల్లించవలసిన శుల్కమును, వర్తని, ఆతివాహికము, గుల్మము,[3] తరదేయము, భాగములు మున్నగువానిని ఆహారపదార్థములయు కానుకలయు ప్రమాణములను తెలుసుకొనవలెను.

13. ఇదేవిధముగ సమాహర్తచే నియోగింపబడిన సన్యాసివేషధారులగు గూఢపురుషులు కర్షకులయు గోరక్షకులయు వర్తకులయు అధ్యక్షులయు శౌచాశౌచములను తెలుసుకొనవలెను.

---

[2] ప్రస్తుతకాలమున జనాభాశాఖవారు, గణాంకశాఖవారు సేకరించు వివరము లన్నిటిని ఆ కాలములో గోపులు సేకరించుచుండిరి.

[3] వర్తని అనగా రహదారిరుసుము (road cess); ఆతివాహికము అనగా రహదారులలో ప్రయాణముచేయునపుడు రక్షణార్థము రక్షకభటుల కియ్యవలసిన రుసుము; గుల్మము అనగా పోలీస్‌స్టేషన్. అచ్చట చెల్లించవలసిన రుసుముకూడ గుల్మమే.

14. చోరుల వేషమును ధరించిన గూఢచారులు చైత్యములు, చతుష్పథములు, శూన్యప్రదేశములు, బావులు, నదులు, మడుగులు, తీర్థప్రదేశములు, దేవాలయావరణములు, ఆశ్రమములు, అరణ్యములు, కొండలు, వనములు, పొదలు మొదలగువాటియందు పొంచిఉండి శత్రుదేశముల దొంగలు సాహసికులు వచ్చుటకు వెళ్ళిపోవుటకు ఉండుటకు గల కారణములను తెలుసుకొనవలెను.

15. (శ్లో) ఇట్లు సమాహర్త జాగరూకుడై జనపదమును గురించి శ్రద్ధ వహించవలెను. ఇదేవిధముగ గూఢచారులు ఇతర సంస్థలు శ్రద్ధ వహించవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు సమాహర్తృ ప్రచారము గృహపతికుల, వర్తకుల, సన్యాసుల, వేషముల ధరించిన గూఢచారులు అనే ముప్పైఅయిదో అధ్యాయము.

## అధ్యాయము 36

### ప్రకరణము 56 : నాగరికుని విధులు

1. సమాహర్తవలె నాగరికుడు నగరమును పర్యవేక్షించవలెను. 2. పది కుటుంబములకుగాని, ఇరువదికిగాని నలుబదికిగాని ఒక గోపు డుండవలెను. 3. అతడు అందులోని స్త్రీపురుషుల సంఖ్యను, వారి జాతి గోత్ర నామ కర్మలను, ఆయవ్యయములను తెలుసుకొనవలెను.

4. ఇదేవిధముగ స్థానికుడు దుర్గములోని నాల్గవభాగమును పర్యవేక్షించవలెను.

5. ధర్మసత్రముల అధికారులు స్థానికునికి తెలియపరచి పాషండులకును, ప్రయాణికులకును బసలను ఇయ్యవలెను. (అతనికి తెలియపరచవలసిన అవసరము లేక) తామే విచారణచేసి తాపసులకు, శ్రోత్రియబ్రాహ్మణులకు బసలు ఇయ్యవచ్చును. 6. చేతిపనివాండ్రు, శిల్పులు, తమ తమ వృత్తులకు సంబంధించిన (పరాయి) వారిని తాము పనులుచేయు ప్రదేశములందు ఉంచుకొనవచ్చును. వర్తకులు కూడ తాము పనిచేయు ప్రదేశములందు వర్తకులకు బసలు ఏర్పాటు చేయవచ్చును. 7. పణ్యములను కూడని ప్రదేశములందుగాని వేళలందుగాని విక్రయించువానిని, తనవికాని వస్తువులను విక్రయించువానిని (వీరు నాగరికునికి) తెలియపరుపవలెను.

8. మద్యములను విక్రయించువారు, వండిన మాంసమును విక్రయించువారు, అన్నమును విక్రయించువారు, వేశ్యలు, పూర్తిగ పరిచయమున్నవారికే బసలు ఇయ్యవలెను. 9. అతివ్యయము చేయువానిని, ప్రమాదకరముగు పనులను చేయువానిని వీరు (నాగరకునికి) తెలియపరుపవలెను.

10. రహస్యముగ వ్రణచికిత్స చేయించుకొన్నవానిని, దుష్కార్యము చేసిన వానిని గోపునికి స్థాపకునికి తెలియపరచిన చికిత్సకుడు, గృహస్థుడు అపరాధులు

కాజాలరు ; తెలియపరుపనియెడల వారు దోషులు. 11. గృహస్థుడు వచ్చినవారిని గురించి వెళ్ళిపోయినవారినిగురించి తెలియపరుపవలెను. చేయనిపక్షమున రాత్రి దోషము[1] చేసినట్లు పరిగణింపబడవలెను. 12. క్షేమరాత్రులయందు[2] అతడు మూడుపణములను చెల్లించవలెను.

13. రహదారులలోను వెలుపలను పనిచేయు రాజభృత్యులు నగరము లోపలను బయటను దేవాలయములలో, పుణ్యస్థానములలో, వనములలో, శ్మశానము లలో, సంచరించు వ్రణబాధితుని, ప్రమాదమగు ఉపకరణముకలవానిని, బరువైన మూటవెనుక దాగినవానిని, ఆవేదనతో ఉన్నవానిని, దీర్ఘనిద్రలో ఉన్నవానిని, మార్గాయాసముతో ఉన్నవానిని, కొత్తవానిని పట్టుకొని (అధికారులకు) అప్పగించ వలెను. 14. ఇదేవిధముగ నగరములోపలి శూన్యప్రదేశములందు, కర్మాగారము లందు, కల్లుపాకలందు, వండిన అన్నవిక్రయ మాంసవిక్రయశాలలందు, ద్యూత శాలలందు,[3] పాషండగృహములందు ఇట్టివారిని వెతకవలెను.

15. వేసవికాలమందు (పౌరులు) అన్ని ప్రమాదములకు ప్రతిక్రియలు గావించవలెను. 16. పగటిపూట మధ్యభాగముల రెండింటిలో అగ్గిని ముట్టించిన వారికి దండము ఒక పణము. 17. లేదా, వారు వారి వంటను ఇంటివెలుపల చేయవలెను. 18. అయిదు కుండలు, ఒక పెద్దబాన, దోనె, నిచ్చెన, గొడ్డలి, దూర్వారపట్టుగంప, సురకత్తి, 'కచగ్రహణము,'[4] తోలుసంచి—వీటిని సిద్ధముగ ఉంచనివానికి దండము పావుపణము. 19. గడ్డి చాపలతో కప్పబడిన వస్తువులను (నాగరికుడు) తీసివేయించవలెను. 20. అగ్నిజీవుల నందరిని ఒకేప్రదేశమందు నివసించునట్లు చేయవలెను.

21. ఇంటివారు వారివారి ఇండ్ల ముఖద్వారముల సమీపమున నివసించ వలెను. రాత్రిపూట అందరు కలసి ఒకేచోట నిద్రించరాదు.

22. రహదారులందు, చతుష్పథములందు, ద్వారములందు రాజగృహ సమీపమందు వేలాది నీటికుండలను చేర్చియుండవలెను.

23. నిప్పుఅంటుకొన్న ఇంటిని రక్షించుటకు వెళ్ళని గృహస్థునకు పండ్రెండు పణముల దండము ; అద్దెకాపురమువానికి ఆరు పణముల దండము.

24. అజాగ్రత్తవలన నిప్పు అంటుకొన్నప్పుడు దండము ఏభైనాలుగు పణములు. 25. నిప్పు అంటించినవానికి మరణదండము.

26. వీథిలో చెత్త పారవేసినవానికి దండము పణములో ఎనిమిదోవంతు ;

---

[1] రాత్రియందు చేసిన నేరము.

[2] ఎట్టినేరము జరుగని రాత్రి క్షేమరాత్రి.

[3] ఆ కాలమున శాకాహారశాలలు మాంసాహారశాలలు వేరువేరుగ ఉన్నట్లు దీనినుండి స్పష్టము.

[4] కొడవలివంటి పనిముట్టుతో అమర్చబడిన ఒక పొడుగైన కర్ర.

బురదనీటితో అడ్డగించినవానికి దండము పావుపణము. 27. రాజమార్గములో ఇట్లుచేసినవానికి దండము రెండింతలు.

28. పుణ్యస్థానములందు, ఉదకస్థానములందు, దేవాలయములందు, రాజపరిగ్రహమందు, పురీషోత్సర్జనమునకు దండము ఒక పణమునుండి పణముచొప్పున వృద్ధికావలెను. 29. వీటికి ఔషధము, వ్యాధి, భయము కారణములైనప్పుడు దండము లేదు.

30. నగరములోపల చచ్చిన పిల్లి, కుక్క, ముంగిస, పాములను పారవేసినందుకు దండము మూడు పణములు; గాడిద, ఒంటె, కంచరగాడిద, గుర్రము, పశువుల ప్రేతములను పడవేసినందుకు దండము ఆరు పణములు; మనుష్య ప్రేతమునకు ఏభై పణములు.[5]

31. మామూలును తప్పించి వేరుమార్గమునగాని, వేరుద్వారమునుండిగాని, శవమును తీసుకొనిపోయినందుకు పూర్వసాహసదండము. 32. (దీనికి సమ్మతించిన) ద్వారపాలకునికి రెండువందల (పణముల) దండము. 33. శ్మశానము కాని ప్రదేశములలో దహన ఖననములు చేసినందుకు పన్రెండు పణముల దండము.

34. ఆరునాలికలు మినహాగా[6] రాత్రుల ప్రారంభమున అంత్యమున తూర్యనినాదము గావించవలెను. 35. తూర్యశబ్దము తర్వాత మొదటియామములోగాని కడపటియామములోగాని రాజగృహసమీపమందు సంచరించువానికి, ప్రాకారమును ఎక్కువానికి, ఒకటింబావు పణము దండము; మధ్యయామములో సంచరించువానికి రెండింతల దండము; రాజగృహములోపల సంచరించువానికి నాలుగింతలు.

36. అనుమానించదగిన ప్రదేశమందుగాని, అనుమానించదగిన లక్షణములతో గాని ఉన్నట్టివానిని, ఇంతకుపూర్వము అపరాధముగావించినవానిని, పట్టుకొన్నప్పుడు ప్రశ్నించవలెను. 37. రాజపరిగ్రహమును సమీపించినవానికి, దుర్గప్రాకారమును ఎక్కినవానికి, మధ్యమసాహసదండము. 38. ప్రసవకారణమునగాని, చికిత్సనిమిత్తమునగాని, ప్రేతకారణమునగాని వెళ్ళువానిని, దీపముతోను బండిలోను వెళ్ళువానిని, (ప్రమాదమును సూచించు) నాగరికుని తూర్యనినాదము నిమిత్తముగగాని, ప్రదర్శనమునకుగాని, అగ్నిని ఆర్పుటకుగాని వెళ్ళువానిని, ముద్రాపత్రముతో సంచరించువానిని పట్టుకొనరాదు.

39. స్వేచ్ఛగ సంచరించదగు రాత్రులలో మారువేషమందున్నవారిని, విపరీత వేషమందున్నవారిని, ప్రవ్రజితులను, చేతులలో కర్రలు శస్త్రములు కలవారిని,

---

[5] ఈ ఏర్పాటులు ప్రస్తుతకాలమున మునిసిపాలిటీవారు చేయువానిని పోలియున్నవి.

[6] సూర్యాస్తమయము తర్వాత ఆరు నాలికలు సూర్యోదయమునకు పూర్వము ఆరు నాలికలు— ఈ రెంటికి మధ్యనుండు రాత్రికాలము ప్రారంభమున అంత్యమున అని గ్రహించవలెను.

వారివారి నేరముల కనుగుణముగ శిక్షించవలెను.

**40.** వారింపకూడనివాటిని వారించునట్టియు, వారింపవలసినవాటిని వారించనట్టియు రక్షకభటులకు సంచరించకూడని రాత్రులలో సంచరించువారిపై విధించు దండమునకు రెండింతల దండము. **41.** దాసీస్త్రీని బలాత్కరించువానికి (రక్షకభటునికి) పూర్వసాహసదండము ; దాసీకానట్టి స్త్రీని బలాత్కరించువానికి మధ్యమసాహసదండము ; మరియొకడు ఉంచుకొన్న స్త్రీని బలాత్కరించువానికి ఉత్తమసాహసదండము ; కులస్త్రీని బలాత్కరించినవానికి మరణదండము.

42. రాత్రిపూట చేతనములుగాని అచేతనములుగాని చేసిన నేరమును నాగరికునికి తెలియపరుపని రక్షకభటునికిని, ప్రమత్తుడైన భటునికిని, నేరమునకు తగినట్టి దండము.

**43.** ఉదకస్థానములను, రహదారులను, కాలువలను, రహస్యమార్గములను, వప్రములను, ప్రాకారములను, ఇతర రక్షణప్రదేశములను సదా పర్యవేక్షించుటయు, నష్టములను ప్రస్మృతములను అపస్మృతములను వెతకి రక్షించుటయు నాగరికుని విధులు.

**44.** రాజు జన్మనక్షత్రదినమునను అమావాస్యా పూర్ణిమా దినములందును కారాగారములోని బాల వృద్ధ వ్యాధితులను అనాథలను వదలివేయవలెను. **45.** పుణ్యశీలురు, మాటప్రకారము నడువవలసినవారు, దోషమునకు తగిన పరిహారద్రవ్యమును ఇయ్యవలెను.

46. (శ్లో) ప్రతిదినముగాని, అయిదురోజుల కొకపర్యాయముగాని, కారాగారములో బంధింపబడినవారిని పనిచేయించిగాని, దెబ్బలుకొట్టిగాని, అనుగ్రహద్రవ్యమును పుచ్చుకొనిగాని బయటికి పంపివేయవలెను.

47. (శ్లో) కొత్తదేశమును వశపరచుకొనినపుడును, యువరాజాభిషేకసమయమునను, పుత్రజన్మమునను, బంధితుల నందరిని వదలివేయవలెను.

ఇది అధ్యక్షప్రచారమను రెండో అధికరణమందు నాగరికుని విధులు అనే ముప్పైఆరో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు అధ్యక్షప్రచారమనే రెండో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## మూడో అధికరణము

## ధర్మస్థీయము

### అధ్యాయము 1

### ప్రకరణము 57 : వ్యవహారస్థాపనము

### ప్రకరణము 58 : వివాదపదనిబంధము

1. అమాత్యుల పదవికి అర్హులైన ముగ్గురు ధర్మస్థులు[1] జనపదసంధులలోను సంగ్రహణములలోను ద్రోణముఖములలోను స్థానీయములలోను వ్యవహారములకు[2] సంబంధించిన వివాదములను విచారణ చేయవలెను.

2. తిరోహితములగు[3] వ్యవహారములు, ఇంటిలోపల జరిగినవి, రాత్రి కాలమందు జరిగినవి, అరణ్యములలో జరిగినవి, మోనముతోకూడినవి, రహస్యముగ చేయబడినవి — వీనిని (చెల్లవని) ప్రతిషేధించవలెను. 3. ఇట్టి వ్యవహారములోనికి దిగినవానికి, దింపినవానికి పూర్వసాహసదండము. 4. సాక్షులలో ఒక్కొక్కనికి సగము దండము. 5. (తెలియక అందులో దిగిన) శ్రద్ధేయులకు ద్రవ్య నష్టమే దండము.

6. తాకట్టు వస్తువుగాని తాకట్టు పెట్టినవాడుగాని లేకపోయినను ఉన్నట్లు

[1] ధర్మస్థులనగా ప్రస్తుతకాలపు జడ్జీలవంటివారు. ధర్మస్థులను పేరు ధర్మశాస్త్రాది గ్రంథము లందు కానరాదు. దీనికిబదులు ప్రాడ్వివాకులనునది ప్రచారమందుండెను. ప్రతి న్యాయ స్థానమున ముగ్గురు ధర్మస్థులు కలిసి ధర్మమును (న్యాయమును) పరిష్కరించుచుండిరి. వీరి తీర్పులపై అప్పీళ్ళు రాజునకే.

[2] వ్యవహారములనగా ఇద్దరిమధ్య జరుగు ఒప్పందములు.

[3] తాకట్టువస్తువుగాని తాకట్టుపెట్టినవాడుగాని లేని వ్యవహారములు తిరోహితములు.

వ్రాసి పుచ్చుకొన్న ఋణము చెల్లతగినదని విజ్ఞులు అంగీకరించినయెడల అది చెల్లగలదు.

7. దాయవిభాగము, నిక్షేపము, ఉపనిధి, వివాహము—వీనికి సంబంధించిన వ్యవహారములు ; ఇల్లువదలి బయటికిరాని స్త్రీలు, అస్తిమితమనస్కులుకాని వ్యాధిగ్రస్తులు వ్రాసిఇచ్చిన ఒడంబడికలు ఇంటిలోపల జరిగినను చెల్లగలవు.

8. సాహసము, బలాత్కరించి వశపరుచుకొనుట, దురుద్దేశముతో ఇంటిలోపలికి ప్రవేశించుట, కలహము, వివాహము, రాజశాసనము—వీనికి సంబంధించిన వ్యవహారములు, రాత్రిలోని పూర్వభాగమందు వ్యవహరించువారి వ్యవహారములు,[4] రాత్రికాలమందు జరిగినను చెల్లగలవు.

9. అరణ్యములలో సంచరించు సార్థవాహులు, మందకాపరులు, ఆశ్రమవాసులు, వేటకాండ్రు, చారణులు అరణ్యములలో చేసుకొను వ్యవహారములు చెల్లగలవు.

10. రహస్యముగ జీవించువారు చేసుకొనిన వ్యవహారములు మోసముతో కూడినవైనను చెల్లగలవు.

11. రహస్యసంఘముల వ్యవహారములు రహస్యముగ జరిగినను చెల్లగలవు.[5]

12. ఇవితప్ప తక్కిన వ్యవహారములు చెల్లవు. ఇవిగాక ఇతరుల అధీనమందుండువారు చేసుకొను వ్యావహారములుకూడ చెల్లవు. తండ్రి అధీనమందుండు కుమారుడు, కుమారుని అధీనమందుండు తండ్రి, కుటుంబమందుండి తొలగింపబడిన సోదరుడు, దాయములో తన భాగము ప్రత్యేకింపబడని కనిష్ఠకుమారుడు, భర్త అధీనమందుగాని కుమారుని అధీనమందుగాని ఉండు స్త్రీ, తాకట్టుగ ఉంచబడిన దాసుడు, తదితరుడు, వ్యవహారయోగ్యతలేని మైనరు, వ్యవహారయోగ్యతను కోల్పోయిన వృద్ధుడు, దోషి అని పట్టుకొనబడినవాడు, పరివ్రాజకుడు, అంగవికలుడు, వ్యసని—ఇట్టివారు చేసుకొనిన వ్యవహారములు ప్రత్యేకముగ అధికారము పొందినప్పుడు తప్ప సామాన్యముగ చెల్లవు. 13. వీరిలోకూడ, కోపావేశములోఉన్నవాడు, ఆర్తిలోఉన్నవాడు, మత్తులోఉన్నవాడు, ఉన్మత్తుడు, ఇతరుని వశమందున్నవాడు—వీరు చేసుకొనిన వ్యవహారములు చెల్లవు. 14. ఇట్టి

[4] వేశ్యలు మొదలగువారి వ్యవహారములు.

[5] 2వ సూత్రములో కొన్ని వ్యవహారములు చెల్లవని చెప్పబడినది. కాని కొన్ని పరిస్థితులలో అవి చెల్లునని 6-11 సూత్రములు చెప్పుచున్నవి. గాంధర్వవివాహము రహస్యముగ ఇద్దరు కలసి చేసుకొనునట్టిది. 11వ సూత్రము అట్టిది చెల్లునని చెప్పుచున్నది—ఇట్టి వ్యవహారమునకు రహస్యమే ఆధారము గనుక.

వ్యవహారములను చేయువారు, చేయించువారు, సాక్షులు,[6] వేరువేరుగ యథోక్త దండమును చెల్లింపవలెను.

15. కాని, ఆయా వర్గములకు చెందిన వ్యవహారములన్నియు తగిన దేశ కాలములందు మర్యాదలన్నిటితోకూడినట్లుగను, శుద్ధమగు సాక్షుల ఆధారము కలిగి నట్లుగను, అవసరమైన రూపము, లక్షణములు, ప్రమాణములు, గుణములు కలిగి నట్లుగను న్యాయమగు హక్కు కలవారిచేత పూర్తిగావింపబడినవి చెల్లును. 16. వీని విషయములో ఆదేశములందు తాకట్టులందు తప్ప తక్కిన సందర్భములందు ఆఖరుపత్రము[7] ప్రమాణమగును.

ఇది వ్యవహారస్థాపనము[8]

17. (న్యాయస్థానములోని లేఖకుడు) తగిన జామీను ఇచ్చిన వాదిప్రతివాదుల విషయమున సంవత్సరము, ఋతువు, మాసము, పక్షము, దినము, కరణము (పరిపాలనశాఖాస్థానము), అధికరణము (కచ్చేరీ ఉన్న ప్రదేశము), ఋణము, దేశము, గ్రామము, జాతి, గోత్రము, నామము, వృత్తి—వీనిని వ్రాసుకొని, వ్యవహార క్రమము ననుసరించి ప్రశ్నలువేసి సమాధానములను తెలుసుకొనవలెను. 18. వ్రాసిన తర్వాత వానిని పరిశీలించవలెను.

19. వ్రాయబడిన వాదమును వదలి మరియొక వాదమును ఆశ్రయించిన వాడు, మొదట చెప్పినదానితో తర్వాత చెప్పినదానిని సమన్వయము చేయలేనివాడు, ఎదుటిపక్షమువాని ఆక్షేపణీయముకాని మాటను ఆక్షేపించి నోరు మూసుకొని ఉండు వాడు, ఒకమాటచెప్పి దానికి సాక్ష్యము తేలేనివాడు, బలములేని సాక్ష్యమును తెచ్చువాడు, సాక్ష్యము చూపించలేనివాడు, అడిగిన సాక్ష్యమునకు బదులు మరియొక దానిని తెచ్చువాడు, (ఎదుటివాడు) సాక్ష్యము తెచ్చినప్పుడు "అది అలాగు కాదు" అని ప్రత్యాఖ్యానము చేయువాడు, సాక్షులు రుజువుచేసినదానిని కాదనిచెప్పువాడు, సాక్షులతో మాటాడకూడనిచోట మాటాడువాడు—ఇట్టివాని వాదము కొట్టివేయతగినది.

20. దావా కొట్టివేసినపుడు దావా మొత్తములో అయిదవవంతు దండము. 21. స్వయముగ ఒప్పుకొనినవానికి పదియవవంతు దండము.

22. నౌకరునకు వేతనము[9] పణములో ఎనిమిదవవంతు. 23. దారిబత్తెము ధరల ననుసరించి యుండవలెను. 24. ఓడిపోయినవాడు ఈ రెండు ఖర్చులను భరించవలెను.

25. కలహమునందు, సాహసమునందు, సార్థవాహ సముదాయములందు తప్ప అభియుక్తుడు ప్రత్యభియోగమును తేకూడదు. 26. అభియుక్తునిపై మరి

[6] సాక్షులుకూడ దండమును చెల్లించవలెననుట విశేషము.

[7] కరణము అని మూలము.

[8] ఏ వ్యవహారములు చెల్లునో ఏవి చెల్లవో నిర్ణయించుట వ్యవహారస్థాపనము.

[9] న్యాయస్థానములోని నౌకరు.

ఎవడుగాని అభియోగము తేకూడదు.[10]

27. ప్రతివాది చెప్పిన సమాధానమునకు ఆ దినమే వాది తిరుగు సమాధానము చెప్పనిపక్షమున దావాను కొట్టివేయవలెను. 28. ఏలయన, ఏదిచేయవలెనో మొదటనే నిశ్చయించుకొనినవాడు వాదిగాని ప్రతివాది కాదు. 29. ప్రతివాది సమాధానము చెప్పనప్పుడు మూడురోజులుగాని, ఏడురోజులుగాని వాయిదా ఇయ్యవచ్చును. 30. అటుతర్వాత మూడు పణములకు తక్కువగాక పండ్రెండు పణములకు మించక దండము విధించవలెను. 31. మూడు పక్షములు దాటినతర్వాత (కూడ) సమాధానము చెప్పనప్పుడు అతనిపై పరోక్తదండమును విధించి, వృత్త్యుపకరణముల మినహాగా, అతని ఆస్తినుండి వాదికి పరిహార మియ్యవలెను. 32. పారిపోయిన ప్రతివాదికికూడ ఇదే దండము. 33. వాది పారిపోయిన పక్షమున వెంటనే దావాను కొట్టివేయవలెను.

34. సాక్ష్యమిచ్చి చనిపోయినవాని సాక్ష్యము, వ్యసనమందున్నవాని సాక్ష్యము సారహీనములు.

35. గెలిచిన వాది, దండమును చెల్లించి, ప్రతివాదిచేత పనిచేయించుకొనవచ్చును. 36. లేదా, ప్రతివాది తాకట్టు పెట్టుటకు అంగీకరించవచ్చును. 37. బ్రాహ్మణుడు తప్ప తక్కినవాడు రక్షలచే[11] రక్షింపబడినవాడై పనిచేసి నష్టపరిహారము నిచ్చుకొనవచ్చును.

38. (శ్లో) సర్వధర్మములకు నాశము సంభవించినప్పుడు ధర్మప్రవర్తకుడై చతుర్వర్ణ చతురాశ్రమములతో కూడిన ఈ లోకమును రాజు రక్షించుచున్నాడు.

39. (శ్లో) వివాద విషయమునకు ధర్మము, వ్యవహారము, చరిత్రము, రాజశాసనము అనునవి నాలుగు పాదములు. వీనిలో ముందుదానికంటె తరువాతిది బలవత్తరము.

40. (శ్లో) వీనిలో ధర్మమునకు సత్యము, వ్యవహారమునకు సాక్షులు, చరిత్రమునకు పురుషుల అభిప్రాయములు, శాసనమునకు రాజాజ్ఞ ఆధారములు.[12]

41. (శ్లో) స్వధర్మమును నిర్వహించుచు ప్రజలను రక్షించు రాజు స్వర్గ సుఖము ననుభవించును ; ప్రజలను రక్షించని రాజు, ధర్మవిరుద్ధముగ దండించు రాజు విపరీతఫలము ననుభవించును.

42. (శ్లో) కుమారునియెడల, శత్రువునెడల, సమానముగ దోషము ననుసరించి

---

[10] ఒక అభియోగము విచారణలో ఉన్నప్పుడు మరియొక అభియోగము తేకూడదు.

[11] రక్ష అనగా మంత్రశక్తిగల తాయెతులు మొదలైనవి.

[12] ధర్మమనగా న్యాయము. సత్యము దాని కాధారమని అనుటలో అది శాశ్వతమగునట్టిదనియు, కాలానుసారముమారునట్టిది కాదనియు అభిప్రాయము. ఈ అధికరణములోని తక్కిన అధ్యాయములలో అది వివరింపబడియున్నది. చరిత్రమనగా కులాచార దేశాచారములు.

రాజు విధించు దండమొక్కటే ఇహపరలోకముల రెంటిని రక్షించుచున్నది.

**43.** (శ్లో) ధర్మము, వ్యవహారము, సంస్థ, నాల్గవదియగు న్యాయము[13]— వీటి ననుసరించి వివాదముల పరిష్కరించు రాజు నాలుగుదిక్కులవరకు వ్యాపించిన ప్రపంచ మంతటిని జయించుచున్నాడు.

**44.** (శ్లో) ఆచారాధారమైన వివాదముగాని, వ్యవహారాధారమైన వివాదముగాని, ధర్మమునకు విరుద్ధమైనప్పుడు, ధర్మమునుబట్టియే దానిని పరిష్కరించవలెను.

**45.** (శ్లో) (కాని) న్యాయవిషయమందు ధర్మశాస్త్రమునకు రాజశాసనముతో వైరుధ్యము ఏర్పడినప్పుడు రాజశాసనమే ప్రమాణము. ఏలయన, అట్టి సందర్భములో శాస్త్రపాఠమునకు బలము ఉండదు.

**46.** (శ్లో) ప్రత్యక్షముగ చూచిన దోషము, స్వయముగ ఒప్పుకొనిన దోషము, స్వపక్షపరపక్షములకు ప్రశ్నల సమాధానముల విషయమున పొందిక, హేతువాదము, శపథము—ఇవి వివాదపరిష్కారమునకు సాధనములు.

**47.** (శ్లో) మొదట చెప్పినదానికి తర్వాత చెప్పినదానికి మధ్య వైరుధ్యము, సాక్షుల మాటలలోని లోపము, కారాగారాధికారి అధీనమునుండి పారిపోవుట—ఇట్టి సందర్భములో దావాను కొట్టివేయవలెను.

ఇది ధర్మస్థీయము అను మూడో అధికరణమందు వ్యవహారస్థాపనము, వివాదపదనిబంధము అనే మొదటి అధ్యాయము.

---

[13] సంస్థ అనగా చరిత్రము ; న్యాయ మనగా రాజశాసనము.

## అధ్యాయము 2

### ప్రకరణము 59 : వివాహసంయుక్తము

(అందు వివాహధర్మము, స్త్రీధనకల్పము, ఆధివేదనికము)

1. వ్యవహారములన్నియు వివాహముతో ప్రారంభమగుచున్నవి.[1]

2. కన్యను అలంకరించి, కన్యాదానము చేయుట బ్రాహ్మవివాహము. 3. కలిసి ధర్మమును అచరించుట ప్రాజాపత్యము.[2] 4. (వరునినుండి) పశువుల జతను తీసుకొనుట ఆర్షము. 5. యజ్ఞవాటమందు ఋత్విజునికి కన్య నిచ్చుట దైవము. 6. (ప్రేమికుల) పరస్పరసమాగమము గాంధర్వము. 7. శుల్కమును పుచ్చుకొనుట ఆసురము. 8. (కన్యను) బలాత్కరించి పట్టుకొనిపోవుట రాక్షసము. 9. నిద్రలో ఉన్నట్టి కన్యనుగాని, మత్తుతో ఉన్నట్టి కన్యనుగాని ఎత్తుకొనిపోవుట పైశాచము.

10. (పైవానిలో) మొదటి నాలుగు తండ్రి సమ్మతించినపుడు ధర్మ్యములు ; తక్కినవి తల్లిదండ్రు లిద్దరు సమ్మతించినపుడు ధర్మ్యములు. 11. ఏలయన, కుమార్తె శుల్కమును గ్రహించువారు వారే, లేదా, వారిలో ఒకరు లేనప్పుడు రెండవవారు. 12. రెండవ శుల్కమును స్త్రీయే గ్రహించవలెను.[3]

13. అన్ని వివాహములలో (కట్నము లిచ్చి వధువును) సంతోషపెట్టుట నిషిద్ధము కాదు.

ఇది వివాహధర్మము

14. భరణము, అలంకారములు (ఈ రెండు) స్త్రీధనము. 15. రెండువేల

---

[1] సమాజములో అందరు సన్యాసులై వివాహమే లేనిపక్షమున వ్యవహారము లుండవుగదా ?

[2] ధర్మమునకు సంబంధించిన మంత్రమును వివాహకాలమున దంపతు లిద్దరు కలిసి పఠించెదరు.

[3] పునర్వివాహపు శుల్కము అని కొందరు వ్యాఖ్యాతలు.

పణములకు మించని దానము భరణము. అలంకారముల విషయమున పరిమితి లేదు.

16. భార్య దానిని పుత్రులను కోడండ్రను సంరక్షించుటకు వినియోగించుట గాని, కుటుంబ పోషణమునకు ఏర్పాటుచేయక వెళ్ళిపోయిన భర్తయొక్క ప్రవాస కాలమందు వినియోగించుటగాని దోషము కాదు. భర్త దానిని దొంగతనము, వ్యాధి, దుర్భిక్షము, ఇతరప్రమాదములు, సంభవించినపుడు ప్రతీకారముగను ధర్మకార్యము లకును వినియోగించుట దోషము కాదు. దంపతు లిద్దరును కలిసి దానిని పుత్ర సంతానము పుత్రికాసంతానము కలిగిన తర్వాత వినియోగించుట దోషము కాదు. 17. వినియోగము మూడు సంవత్సరముల కాలము జరిగినపక్షమున ధర్మిష్ఠములగు వివాహముల విషయమున భార్య దానిని ఆక్షేపించరాదు. 18. గాంధర్వాసురముల సందర్భమున భర్త వడ్డీతో వాటిని ఇచ్చివేయవలెను. రాక్షసపైశాచ వివాహముల సందర్భమున దొంగతనమునకు ఇచ్చుకొనవలసిన దండమును ఇచ్చుకొనవలెను.

19. భర్త చనిపోయినప్పుడు ధర్మకామ అయిన పక్షమున భరణద్రవ్యమును అలంకారములను శుల్కశేషమును తీసుకొనవచ్చును. 20. తీసుకొనిన తర్వాత వివాహమాడిన యెడల వడ్డీతో ఆ రెంటిని యిచ్చివేయవలెను. 21. కుటుంబకామ[4] అయిన పక్షమున పునర్వివాహకాలమందు (మొదటి) మామగారు భర్త ఇచ్చిన దానిని తీసుకొనవచ్చును. 22. పునర్వివాహకాలము గురించి దీర్ఘప్రవాసమునకు సంబంధించిన అధ్యాయమందు వివరించుచున్నాము. 23. మామగారి అనుమతి లేక వివాహమాడిన పక్షమున అతడును మొదటి భర్తయు ఇచ్చినదానిని ఆమె వదలుకొనవలెను.

24. బంధువుల రక్షణనుండి ఆమెను బలాత్కరించి తీసుకొనిపోయిన పక్షమున రెండవ వివాహమునకు సంబంధించినవారు మొదటి వివాహమునకు సంబంధించిన ఆస్తిని ఇచ్చివేయవలెను. 25. న్యాయానుసారముగ ద్వితీయ వివాహమును ఆమె కోరినయెడల, దానికి సమ్మతించినవాడు ప్రథమవివాహ ధనమును రక్షించవలెను.

26. పునర్వివాహము చేసుకొనిన స్త్రీ మొదటి భర్త ఇచ్చిన స్త్రీధనమును వదలుకొనవలెను. 27. ధర్మకామ అయినప్పుడు దానిని అనుభవించవచ్చును. 28. పుత్రసంతానము కలిగి పునర్వివాహము చేసుకొనినయెడల స్త్రీధనమును కోల్పోవలెను. 29. అట్టి స్త్రీధనము పుత్రులకు చెందును. 30. పుత్రులను సంరక్షించుకొనుటకై పునర్వివాహము చేసుకొన్నప్పుడు పుత్రార్థమై స్త్రీధనమును వృద్ధిచేసుకొనవచ్చును.

31. బహుభర్తలవలన పుత్రసంతానము గాంచిన స్త్రీ వారివారి తండ్రుల

---

[4] పుత్రసంతానమునకై ప్రథమభర్తయొక్క సహోదరుని వివాహమాడు స్త్రీ.

మూలమున లభించిన స్త్రీధనమును ఆయా పుత్రులకు ఇచ్చివేయవలెను.

32. పునర్వివాహము చేసుకొనిన స్త్రీ ఇష్టానుసారము అనుభవించుటకు హక్కుగల తన ఆస్తిని పుత్రులకే ఇచ్చివేయవలెను.

33. పుత్రులు లేని విధవ పతివ్రతగ జీవించదలచినప్పుడు జీవితాంతము వరకు (బంధువులగు) పెద్దల సమక్షమున కాలము గడుపుచు స్త్రీధనమును అనుభవించవచ్చును. 34. స్త్రీధనము ఆపదకొరకేగదా? 35. మరణానంతరము అది దాయాదులకు సంక్రమించును.

36. భర్తకు ముందుగ భార్య చనిపోయినపుడు ఆమె స్త్రీధనమును పుత్రులు పుత్రికలు పంచుకొనవలెను. పుత్రులు లేనపుడు అది పుత్రికలకు చెందును. వీరు కూడ లేనపుడు భర్తకు చెందును. 37. శుల్కము, వివాహానంతరము లభించిన కానుకలు, బంధువు లిచ్చిన ఇతర వస్తువులు బంధువులు తీసుకొనవలెను.

ఇది స్త్రీధనకల్పము

38. భార్య ప్రసవించనప్పుడు,[5] అపుత్ర అయినప్పుడు, గొడ్రాలు అయినప్పుడు ఎనిమిది సంవత్సరముల కాలము, (గర్భములోనే) చచ్చినపిల్లలను ప్రసవించినపుడు పది సంవత్సరముల కాలము, పుత్రికాసంతానమే కలిగినపుడు పండ్రెండు సంవత్సరముల కాలము భర్త వేచియుండవలెను. 39. అటుతర్వాత, పుత్రసంతానమునకై రెండవభార్యను వివాహమాడవచ్చును. 40. దీనికి అన్యథాగా ప్రవర్తించినవాడు శుల్కమును, స్త్రీధనమును అందులో అర్ధభాగము నష్టపరిహారముగను భార్యకు ఇచ్చి, ఇరువైనాలుగు పణములవరకు దండమును చెల్లించవలెను.

41. శుల్కమును, స్త్రీధనమును, శుల్క స్త్రీధనములు లేని భార్యకు వానికి సమానమగు నష్టపరిహారమును, యుక్తమగు భరణమును ఇచ్చి బహుభార్యలను కూడ వివాహమాడవచ్చును. 42. ఏలయన, పుత్రులను బడయుటకు భార్యలు అవసరము.

43. వీరందరు ఏకకాలమున ఋతుమతులైనప్పుడు, అతడు వివాహకాలము ననుసరించి ప్రథమభార్యనుగాని, సజీవముతో ఉన్న పుత్రులుకల భార్యనుగాని మొదట కలియవలెను.

44. ఋతుకాలమును దాచినప్పుడు (భార్యకు), ఋతుకాలమున కలియనప్పుడు (భర్తకు), తొంభైఆరు పణముల దండము.

45. భార్య అనుమతిలేక భర్త పుత్రవతియగు భార్యను, ధర్మకామయగు భార్యను, గొడ్రాలిని, చచ్చిన పిల్లలనుకన్నదానిని, రతికాలము దాటినదానిని కలియరాదు. 46. ఇష్టములేని భర్త కుష్ఠవ్యాధిగల భార్యను, ఉన్మత్తురాలగు భార్యను,

[5] గర్భము ధరించినను గర్భస్రావమువంటి కారణములవలన ప్రసవించనట్టి భార్య.

కలియవలసినది లేదు. **47.** కాని పుత్రార్థినిఅగు భార్య ఇట్టి భర్తను కలియవచ్చును.

48. (శ్లో) నీచుడైనట్టి భర్తను, పరదేశమునకు వెళ్ళిపోయినవానిని, రాజద్రోహము చేసినవానిని, తన ప్రాణమునకు ప్రమాదము కలిగించినవానిని, పతితుడైనవానిని, నపుంసకుని భార్య వదలివేయవచ్చును.

ఇది ధర్మస్థీయము అను మూడో అధికరణమందు వివాహసంయుక్తము, వివాహధర్మము, స్త్రీధనకల్పము, ఆధివేదనికము[6] అనే రెండో అధ్యాయము.

[6] మొదటిభార్య సజీవముగఉన్నప్పుడు రెండవభార్యను వివాహమాడు భర్త చెల్లించవలసిన నష్టపరిహారాదులకు ఆధివేదనికము అని పేరు.

# మూడో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 59 : (మిగులు) వివాహసంయుక్తము

### (అందు శుశ్రూష, భర్మ, పారుష్యము, ద్వేషము, అతిచారము, ఉపకారవ్యవహారప్రతిషేధము)

1. స్త్రీకి వ్యవహారప్రాప్తి[1] పన్నెండు సంవత్సరములకు, పురుషునికి పదహారు సంవత్సరములకు. 2. ఆ వయస్సు వచ్చినతర్వాత వివాహవిధులను నిర్వహించని స్త్రీకి దండము పన్నెండు పణములు, పురుషునికి రెండింతలు.

ఇది శుశ్రూష[2]

3. భరణమును చెల్లించుటకు నిర్దిష్టకాలము నిర్ణయింపబడనప్పుడు భర్త భార్యకు ఆహారాచ్ఛాదనములను ఆమె సంరక్షణలో ఉండు వారి సంఖ్యకు అనుగుణముగగాని, అంతకంటె విశేషముగగాని ఇయ్యవలెను. 4. కాలము నిర్దేశింపబడినప్పుడు అతడు దానిని లెక్కవేసి, వాయిదామేరకు చెల్లించవలెను. 5. శుల్కము, స్త్రీధనము, ఆధివేదనికములు లభించనప్పుడు ఈ నియమములనే అనుసరించవలెను.

6. భార్య అత్తవారి ఇంటనే ఉన్నప్పుడు, లేదా, భర్తను వదలి వెళ్ళిపోయినప్పుడు భర్తపై అభియోగము తేకూడదు.

ఇది భర్మము[3]

7. (భార్యకు) వినయము నేర్పవలసినప్పుడు "ఓసీ, అన్నిటికీ చెడినదానా," "నాశనమైనదానా," "కురూపీ," "తండ్రిలేనిదానా," "తల్లిలేనిదానా" మొదలైన (తిట్టు) మాటలను వాడరాదు. 8. లేదా, వెదురుబెత్తముతోనో, త్రాడుతోనో,

---

[1] వ్యవహారప్రాప్తి అనగా మైనారిటీ తీరిపోవడము.

[2] శుశ్రూష అనగా దాంపత్యవిధులు.

[3] భర్మమనగా భరణము, లేదా, మనోవృత్తి.

చేతితోనో వీపుమీద మూడుదెబ్బలు కొట్టవచ్చును. 9. ఇంతకు మించినప్పుడు వాగ్దండ పారుష్య దండములలో అర్ధభాగము దండముగ చెల్లింపవలెను.

10. భర్తపై ఇట్టి అపచారము గావించినట్లు ప్రతీతి గాంచిన స్త్రీకి ఇదే దండము. 11. ఈర్ష్యామూలమున[4] ఇంటికి వెలుపలతిరుగు భార్యకు యథానిర్దిష్టమగు దండము.

ఇది పారుష్యము

12. భర్తను ద్వేషించునట్టియు, ఏడు ఋతుకాలములు అలంకరించుకొననట్టియు, భార్య తన భరణద్రవ్యమును, ఆభరణములను ఇచ్చివేసి, భర్త మరియొక స్త్రీతో శయనించుటకు అంగీకరించవలెను.

13. భార్యను ద్వేషించు భర్త ఆమె ఒంటరిగ ఒక భిక్షుకితోగాని, సంరక్షకునితోగాని, జ్ఞాతికులమందుగాని ఉండుటకు అంగీకరించవలెను.

14. గుర్తులు స్పష్టముగ కనిపించినను అబద్ధములాడువాడు, సంగమమునకు ఇచ్చగించనివాడు, రహస్యపురుషునిద్వారా మరియొక సవర్ణురాలిని సమీపించినవాడు పండ్రెండు పణముల దండము ఇచ్చుకొనవలెను.

15. భర్తను ద్వేషించు భార్య భర్తయొక్క అంగీకారములేక విడాకులు పొందరాదు ; భార్యను ద్వేషించు భర్తయొక్క స్థితికూడ ఇట్టిదే. 16. పరస్పర ద్వేష మున్నప్పుడు మాత్రమే విడాకులు. 17. లేదా, భార్య నేరము చేసిన కారణమున భర్త విడాకులు కోరినపక్షమున ఆమె ఇచ్చినదంతయు ఆమెకు తిరిగి ఇచ్చివేయవలెను. 18. లేదా, భర్త నేరముచేసిన కారణమున భార్య విడాకులు కోరినపక్షమున ఆమె ఇచ్చినదంతయు తిరిగి ఆమెకు ఇచ్చివేయవలసినది లేదు.

19. ధర్మవివాహములలో విడాకులు లేవు.

ఇది ద్వేషము

20. ప్రతిషేధింపబడినను తీవ్రమైన త్రాగుడుకు మరిగిన భార్య మూడు పణముల దండము నియ్యవలెను. 21. పగటిపూట స్త్రీల ప్రదర్శనమునకుగాని స్త్రీలతో విహారయాత్రకుగాని వెళ్ళిన భార్యకు దండము ఆరు పణములు ; పురుషుల ప్రదర్శనమునకుగాని, పురుషులతో విహారయాత్రలకుగాని వెళ్ళినదానికి దండము పండ్రెండు పణములు. 22. రాత్రిపూటయందు (ఇట్లు చేసినందుకు) దండము రెండింతలు.

23. భర్త నిద్రించునప్పుడుగాని, మత్తులో ఉన్నప్పుడుగాని, ఇల్లు వదలి బయటికి వెళ్ళు భార్యకు, భర్తకు తలుపుతెరవని భార్యకు, దండము పండ్రెండు పణములు. 24. రాత్రిపూట వెళ్ళినయెడల దండము రెండింతలు.

---

[4] ఇతర భార్యలు కారణముగగాని, వేశ్యలు కారణముగగాని, ఈర్ష్యనొందిన భార్య.

**25.** సంగమము నపేక్షించు స్త్రీ పురుషులు సంజ్ఞలతో అంగవిన్యాసము చేసినప్పుడు, రహస్యముగ సంభాషణ సాగించినప్పుడు, స్త్రీకి దండము ఇరవైనాలుగు పణములు, పురుషునికి రెండింతలు.

**26.** జుట్టును, నడుముకు కట్టుకొనిన వస్త్రము ముడిని, పండ్లను, గోళ్ళను ముట్టుకొనినందుకు పూర్వసాహసదండము ; పురుషునికి రెండింతల దండము.

**27.** అనుమానాస్పదమైన ప్రదేశములో సంభాషణకు పణదండమునకు బదులు కొరడాదెబ్బలు కొట్టవచ్చును. **28.** అట్టి స్త్రీలను గ్రామమధ్యమందు చండాలునిచేత వీపుమీద అయిదు కొరడాదెబ్బలు కొట్టించవలెను. **29.** లేదా, ఒక్కొక్క దెబ్బకు ఒక పణము చొప్పున దండము నిచ్చి వదలించుకొనవచ్చును.

ఇది అతిచారము

**30.** ప్రతిషేధింపబడిన స్త్రీపురుషులు అన్యోన్యోపకారముగ స్వల్పమూల్యము లగు వస్తువులను ఇచ్చిపుచ్చుకొన్నప్పుడు దండము పండ్రెండు పణములు ; హెచ్చు మూల్యములగు వస్తువులైనప్పుడు దండము ఇరువైనాలుగు పణములు ; హిరణ్యా[5] సువర్ణములైనప్పుడు స్త్రీకి ఏబైనాలుగు పణములు, పురుషునకు రెండింతలు. **31.** ఒండొరులతో కలియకూడని వారి విషయమున దండము ఇందులో సగము ; ప్రతిషేధింపబడిన పురుష వ్యవహారముల విషయమునకూడ ఇట్లే.

ఇది ప్రతిషేధము

**32.** (శ్లో) రాజును ద్వేషించుటమూలమునను, అతిచారముమూలమునను, ఐచ్ఛికముగ పారిపోవుటమూలమునను స్త్రీధనముపైని, బంధువులిచ్చిన ధనముపైని, శుల్కముపైని, స్త్రీ తన ఆస్తిహక్కులను పోగొట్టుకొనును.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు వివాహసంయుక్తము. అందు శుశ్రూష, భర్మ, పారుష్యము, ద్వేషము, అతిచారము, ఉపకారవ్యవహార ప్రతిషేధము అనే మూడో అధ్యాయము.

---

[5] హిరణ్య మనగా నాణెములు.

# మూడో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 59 : (మిగులు) వివాహసంయుక్తము
### (అందు నిష్పతనము, పథ్యనుసరణము, హ్రస్వప్రవాసము, దీర్ఘప్రవాసము)

1. భర్త ఇంటిని వదలివెళ్ళిపోయిన స్త్రీకి దండము ఆరు పణములు. అపకారము జరిగినపుడు దండము లేదు. 2. ప్రతిషేధింపబడినతర్వాత వెళ్ళిన యెడల దండము పండ్రెండు పణములు.

3. పొరుగింటికి వెళ్ళినయెడల దండము ఆరు పణములు. 4. పొరుగువాడు గాని, భిక్షుకుడుగాని, వర్తకుడుగాని ఆమెకు బస, ఆహారము, పణ్యములు ఇచ్చిన యెడల దండము పండ్రెండు పణములు. 5. ప్రతిషేధింపబడినతర్వాత ఇచ్చిన యెడల పూర్వసాహసదండము.

6. పరుని ఇంటికి వెళ్ళినయెడల దండము ఇరవైనాలుగు పణములు. 7. పరుని భార్యకు ఆశ్రయమిచ్చినవానికి దండము నూరు పణములు. అపత్కాల మందు దండము లేదు. 8. ఆమెను వారించిన పక్షమునను, ఆమె రాక తెలియని పక్షమునను అతడు నిర్దోషి.

9. "భర్త అపకారము చేసినపుడు భార్య భర్తయొక్క బంధువులయు, ధర్మకర్తయు, గ్రామికునియు, సంరక్షకునియు, భిక్షుకియు, తన బంధువులయు పురుషులు లేని ఇండ్లకు వెళ్ళుట దోషము కాదు," అని ఆచార్యులు.

10. "పురుషులున్నను బంధువుల ఇంటికి వెళ్ళుట (దోషము కాదు). 11. పతివ్రతలు మోసమునకు పాల్పడెదరా ? 12. ఇది సులభగ్రాహ్యము," అని కౌటిల్యుడు.

13. మరణము జరిగినప్పుడు, రోగిని చూడవలసి వచ్చినప్పుడు, అపత్కాల మందు, ప్రసవ సమయమున బంధువుల ఇంటికి వెళ్ళుట నిషిద్ధము కాదు. 14. అట్టి సమయములలో నిషేధించిన భర్తకు పండ్రెండు పణముల దండము. 15.

అప్పుడు కూడ ఆమె (భర్త ఇంటికి తిరిగిరాక) దాగుకొనినయెడల స్త్రీధనమును కోల్పోవును ; ఆమెను దాచిన బంధువులు శుల్కమును కోల్పోయెదరు.

ఇది నిష్పతనము[1]

16. పతిగృహమును వదలి గ్రామాంతరమునకు లేచిపోయిన స్త్రీ పంద్రెండు పణముల చెల్లించి, తన భరణద్రవ్యమును ఆభరణములను కోల్పోవలెను. 17. సంగమము నిషిద్ధము కానివానితో కలిసి లేచిపోయినయెడల ఇరవైనాలుగు పణముల దండము నిచ్చుకొనుటయేకాక భరణమును ఋతుకాలగమనమును తప్ప తక్కిన హక్కులను కోల్పోవలెను. 18. పురుషుడు సమవర్ణమువాడో ఎక్కువవర్ణమువాడో అయినయెడల పూర్వసాహసదండమును, తక్కువవర్ణమువాడైన యెడల మధ్యమసాహసదండమును చెల్లింపవలెను. 19. బంధువైనయెడల దండము లేదు. 20. ప్రతిషేధింపబడినపుడు అర్ధదండము.

21. దారి నడుమ ఆమె రహస్యప్రదేశమునకు వెళ్లినను, లేదా, సంగమేచ్ఛతో శంకితుడును నిషిద్ధుడును అగు పురుషుని అనుసరించినను అది వ్యభిచారముగ గుర్తించవలెను.

22. నర్తకుల, చారణుల, చేపలపట్టువాండ్ర, వేటకాండ్ర, గొల్లల, మద్యము తయారుచేయువారల స్త్రీలు, స్త్రీలకు స్వేచ్ఛను ఇచ్చు ఇతరుల స్త్రీలు మరియొక పురుషునితో కలిసి వెళ్ళుట దోషము కాదు. 23. లేదా, నిషేధింపబడినపుడు స్త్రీని తీసుకొనిపోవు పురుషునికి, అతని వెంట వెళ్ళు స్త్రీకి అర్ధదండము.

ఇది పథ్యనుసరణము[2]

24. కొలదికాలములో తిరిగి వచ్చెదనని చెప్పి దేశాంతరమునకు వెళ్ళిన పురుషునికొరకు శూద్ర వైశ్య క్షత్రియ బ్రాహ్మణుల భార్యలు సంతానము లేనప్పుడు క్రమముగ ఒకటి, రెండు, మూడు, నాలుగు సంవత్సరములును, సంతానమున్నప్పుడు ఇంకొక సంవత్సరము ఎక్కువగను నిరీక్షించవలెను. 25. జీవనాధారము కల్పింప బడినవారు రెండింతల కాలము నిరీక్షించవలెను. 26. జీవనాధారము కల్పింప బడనివారిని ధర్మకర్తలు పోషించవలెను ; అటుతర్వాత నాలుగు సంవత్సరములు గాని ఎనిమిది సంవత్సరములుగాని బంధువులు పోషించవలెను. 27. అటుతర్వాత తాము ఇచ్చినదానిని తీసుకొని ఇతరులను వివాహమాడు స్వేచ్ఛతో వారిని వదలివేయ వలెను.

28. అధ్యయనమునకై ప్రవాసము వెళ్ళిన బ్రాహ్మణుని భార్య సంతానము లేనప్పుడు పది సంవత్సరములు, సంతాన మున్నప్పుడు పంద్రెండు సంవత్సరములు, రాజోద్యోగి అయినప్పుడు యావజ్జీవము నిరీక్షించి ఉండవలెను. 29. ఆమె సవర్ణుని

[1] ఇల్లు విడిచి పరాయివారి ఇంటికి వెళ్ళుట నిష్పతనము.

[2] పరపురుషునితో లేచిపోవుట.

వలన సంతానవతి అయినయెడల దోషము లేదు. 30. లేదా, కుటుంబము కష్టదశలో ఉన్నప్పుడు ధర్మకర్తల అనుజ్ఞను పొంది ఇష్టానుసారము తిరిగి వివాహ మాడవచ్చును; లేదా, తానే కష్టదశలో ఉన్నప్పుడు జీవనార్థము తిరిగి వివాహ మాడవచ్చును.

31. ధర్మవివాహమాడిన కుమారి[3] తనతో చెప్పక వెళ్ళిపోయిన భర్తకై అతనినిగురించి వార్త తెలియనప్పుడు ఏడు తీర్థముల కాలము,[4] వార్త తెలిసినప్పుడు ఒక సంవత్సరము నిరీక్షించవలెను. 32. తనతో చెప్పి వెళ్ళిపోయినయెడల వార్త తెలియనప్పుడు అయిదు తీర్థముల కాలము, తెలిసినప్పుడు పది తీర్థముల కాలము నిరీక్షించవలెను. 33. అతడు శుల్కములో కొంతభాగమును మాత్రమే ఇచ్చి వెళ్ళిపోయినప్పుడు వార్త తెలియనియెడల మూడు తీర్థముల కాలము, వార్త తెలిసిన యెడల ఏడు తీర్థముల కాలము నిరీక్షించవలెను. 34. శుల్కమును పూర్తిగ ఇచ్చి వెళ్ళిపోయినయెడల వార్త తెలియనప్పుడు అయిదు తీర్థముల కాలము, తెలిసినప్పుడు పది తీర్థముల కాలము నిరీక్షించవలెను. 35. అటుతర్వాత ధర్మస్థుల అనుజ్ఞ పొంది ఇష్టానుసారము వివాహమాడవచ్చును. 36. ఏలయన, ఋతుకాలసమాగమము లేకపోవుట ధర్మనాశనమేకదా?—అని కౌటిల్యుడు.

ఇది హ్రస్వప్రవాసము

37. దీర్ఘకాల ప్రవాసియైన భర్తకై, ప్రవ్రాజితుడైన భర్తకై, చచ్చిపోయినట్లు వినవచ్చిన భర్తకై ఏడు తీర్థముల కాలము, సంతానవతి అయినయెడల ఒక సంవత్సరము నిరీక్షించవలెను. 38. అటుతర్వాత ఆమె వివాహార్థమై పతి సోదరుని చేరవచ్చును. 39. సోదరు లనేకులున్నప్పుడు భర్తకు దగ్గరివాడు,[5] ధార్మికుడు, పోషించుటకు సమర్థుడైనవాడు, అవివాహితుడైన కనిష్ఠుడు—వీరిలో ఒకరిని చేరవచ్చును. 40. సోదరులు లేనప్పుడు సోదరుడు కానివానినిగాని, సపిండునిగాని, సమీప బంధువునుగాని చేరవచ్చును. 41. వీరిలో వరుసక్రమము ఇదియే.

42. (శ్లో) ఇట్టి దాయాదులను తిరస్కరించి మరియొకనిని వివాహమాడినను, ప్రేమికు నొకనిని వివాహమాడినను, ప్రేమికుడు, అట్టి స్త్రీ, ఆమెను దత్తము చేసినవాడు, ఆమెను వివాహము చేసుకొనినవాడు వ్యభిచారదండమును చెల్లించ వలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు వివాహసంయుక్తమున

[3] పతితో సంగమము జరుగనట్టిది.

[4] తీర్థ మనగా ఋతుకాలము.

[5] వయస్సులో దగ్గరివాడు.

నిష్పతనము, పథ్యనుసరణము, హ్రస్వప్రవాసము, దీర్ఘప్రవాసము అనే నాలుగో అధ్యాయము.[6]

[6] వివాహసంబంధముగ కౌటిల్యుడు చేసిన వివరణము ధర్మశాస్త్రములలోని వివరణముకంటె సమగ్రముగ నున్నది. ద్వేషము, ధర్మ, నిష్పతనము, పథ్యనుసరణము మున్నగు విషయములు ధర్మశాస్త్రములలో సవివరముగ వివరింపబడనివి. ధర్మశాస్త్రముల వివరణము ప్రధానముగ అగ్రవర్ణములవారికి సంబంధించినట్టిది. కౌటిల్యుని వివరణ మంతకంటె విశాలమైనది.

# మూడో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 60 : దాయవిభాగము—దాయక్రమము

1. పితృమంతులగు—సజీవులగు తల్లిదండ్రులుకల—పుత్రులు అనీశ్వరులు (ఆస్తిపై స్వతంత్రహక్కు లేనివారు). 2. తండ్రి గతించినతర్వాత అతని ఆస్తిని వారు విభాగము చేసుకొనవచ్చును.

3. తండ్రి ఆస్తినుండి వృద్ధిగాంచినది తప్ప తక్కిన స్వార్జితము విభాగము చేయవలసినది లేదు.

4. అవిభక్తమైన పితృద్రవ్యమునుండి లభించిన ఆస్తినంతను కుమాళ్లు మనుమలు నాల్గవతరమువరకు పంచుకొనదగిన వారు. 5. అప్పటివరకు పిండము అవిచ్ఛిన్నము. 6. పిండము విచ్ఛిన్నమైనతర్వాత వీరందరు ఆస్తిని సమముగ పంచుకొనవలెను.

7. తండ్రినుండి ఆస్తిని తీసుకొనకుండినవారు, తండ్రిఆస్తిని పంచుకొనిన తర్వాత సమష్టిగజీవించువారు, తిరిగి విభాగము చేసుకొనవచ్చును. 8. ఎవనికృషి మూలమున ఆస్తి వృద్ధిగాంచునో, అతడు రెండుభాగములకు హక్కుకలవాడగును.

9. పుత్రులులేనివాని ఆస్తిని సోదరులు, సహజీవులు, కుమార్తెలు పంచుకొనవలెను.

10. పుత్రవంతుడగువానిపుత్రులు వాని ఆస్తిని పంచుకొనవలెను; లేదా, ధర్మవివాహములవలన పుట్టిన కుమార్తెలు పంచుకొనవలెను.[1] 11. వీరు లేనప్పుడు సజీవుడైన తండ్రికి చెందును. 12. తండ్రిలేనప్పుడు సోదరులకు సోదరుల కుమాళ్ళకు చెందును.

13. తండ్రిలేనిసోదరపుత్రులు అనేకులైనను సోదరులందరివలె ఒక భాగమునకే అధికారులు.

---

[1] తక్కిన వివాహములవలన పుట్టిన కుమార్తెలకు ఇట్టిహక్కు లేదని వ్యాఖ్యాతలు.

14. ఒకేగర్భమున పలువురు తండ్రులవలన పుట్టినసోదరులు వారివారి తండ్రులనుబట్టి దాయవిభాగము చేసుకొనవలెను.

15. తండ్రి, సోదరుడు, కుమారుడు—వీరిలో ముందుచెప్పబడినవాని జీవితకాలములో తర్వాత చెప్పబడినవారిపై ఆధారపడవలసినదిలేదు ; జ్యేష్ఠుని జీవితకాలములో కనిష్ఠుడు ధనమును సంపాదించినను అతనిపై (కనిష్ఠునిపై) ఆధారపడవలసినది లేదు.

16. తండ్రి తాను బ్రతికిఉండగనే దాయవిభాగముచేసిన పక్షమున ఏ కుమారునికిగాని ఎక్కువభాగ మియ్యరాదు. 17. అకారణముగ ఎవనికిగాని వంతు లేకుండ చేయరాదు.

18. తండ్రి ఆస్తిలేనప్పుడు కనిష్ఠులను, దుష్ప్రవర్తనకలవారైనప్పుడు తప్ప, తక్కిన పరిస్థితులలో జ్యేష్ఠుడు సంరక్షించవలెను.

19. యుక్తవయస్సువచ్చినవారికే దాయములోభాగము. 20. యుక్త వయస్సు రానివారి భాగమును వారికి వయస్సు వచ్చువరకు వారిమాతృబంధువుల వద్దగాని, గ్రామవృద్ధులవద్దగాని, ఋణవిశుద్ధముగ దాచిఉంచవలెను. ప్రవాసములో ఉన్నవారి భాగమువిషయమునకూడ ఇట్లే చేయవలెను.

21. వివాహముకాని సోదరులకు వివాహమైన సోదరుల వివాహపు ఖర్చుకు సమముగ ద్రవ్యము నియ్యవలెను. కన్యలకు కూడ ప్రదానధనమును కేటాయించ వలెను.

22. ఆస్తి అప్పులు సమముగ పంచుకొనవలెను.

23. "ఏమీలేనివారు వారి ఉదకపాత్రలనైనను పంచుకొనవలెను," అని ఆచార్యులు. 24. "ఇదిమాటలతో చెర్లాటము," అని కౌటిల్యుడు. 25. ఉన్నదానిని పంచుకొనవలెనేగాని లేనిదానిని కాదు.

26. (ధర్మస్థుడు) సాక్షులఎదుట "ఇది ఉమ్మడి ఆస్తి ; ఇందులో ఒక్కొకని వంతు ఇది," అని ప్రత్యేకముగ చెప్పుచు విభాగము చేయవలెను.

27. న్యాయవిరుద్ధముగ విభాగము చేయబడినదానిని, అన్యోన్యము అప హరింపబడినదానిని, దాచబడినదానిని, ఇదివరకు తెలియక తర్వాత తెలియవచ్చిన దానిని పునర్విభాగము చేసుకొనవలెను.

28. దాయాదులులేని ఆస్తిని, స్త్రీభరణమును ప్రేతఖర్చులను మినహాయించి, రాజు వశపరచుకొనవలెను. శ్రోత్రియ బ్రాహ్మణుల ద్రవ్యము విషయమున ఇది వర్తించదు. 29. దానిని అతడు వేదవిదులగు బ్రాహ్మణులకు దానము చేయవలెను.

30. పతితుడు, పతితునికి పుట్టినవాడు, నపుంసకుడు, జడుడు, ఉన్మత్తుడు, అంధుడు, కుష్ఠరోగి—వీరికి దాయములో భాగము లేదు. 31. వీరికి భార్యలు,

ఇట్టిలోపములేని సంతతి, ఉన్నపక్షమున వారికి భాగమునియ్యవలెను. 32. పతితులు తప్ప తక్కినవారికి గ్రాసాచ్ఛాదము లియ్యవలెను.

33. (శ్లో) వివాహానంతరము పుంస్త్వమును కోల్పోయినయెడల వారివంశమును నిలబెట్టుటకు వారిబంధువులు వారి భార్యలను సంతానవతులుగ చేయవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దాయవిభాగము—దాయక్రమము అనే అయిదో అధ్యాయము.

## అధ్యాయము 6

### ప్రకరణము 60 : (మిగులు) దాయవిభాగము (అందు అంశవిభాగము)

1. ఒకేభార్యవలన కలిగినపుత్రులలో బ్రాహ్మణుల విషయమున మేకలు, క్షత్రియుల విషయమున గుర్రములు, వైశ్యుల విషయమున పశువులు, శూద్రుల విషయమున గొర్రెలు జ్యేష్ఠుని ప్రత్యేకభాగము. 2. వీటిలో ఒక కన్నుకలవి కుంటివి మధ్యముని భాగము, మిశ్రవర్ణములుకలవి కనిష్ఠుని భాగము. 3. చతుష్పాత్తులు లేనప్పుడు, ఆభరణములు మినహాగా, తక్కిన వస్తువులలో పదింటికి ఒకటిచొప్పున జ్యేష్ఠునికి చెందవలెను. 4. ఏలయన, జ్యేష్ఠుడు పితృతర్పణము లను పాశములతో కట్టబడినవాడుకదా ? 5. ఇది ఔశనసులు ప్రతిపాదించిన విభాగము.

6. వ్యక్తిగతమైన తండ్రిఆస్తిలో యానాభరణములు జ్యేష్ఠునివి ; శయనము, ఆసనము, కంచుకంచములు మధ్యమునివి, ఇంటిసామానులు, ఎడ్లబండి కనిష్ఠునివి. 7. ఇవితప్ప తక్కినవస్తువులు—ఒకవస్తువైనను సరే—సమముగ పంచుకొనవలెను.

8. కుమార్తెలకు భాగములేదు. కంచుకంచములు, తల్లి ఆభరణములు— వీటిలో మాత్రము వారికి భాగము.

9. మానుషహీనుడైన[1] జ్యేష్ఠునికి జ్యేష్ఠాంశములో మూడవభాగము మాత్రమే లభించును. అన్యాయముగప్రవర్తించినవానికి, (మతసంబంధమైన) ధర్మకార్యముల విడనాడినవానికి నాల్గవభాగము మాత్రమే. 10. కామచారునికి భాగమే లేదు.

11. దీనినుండి మధ్యమ కనిష్ఠుల విషయమును గ్రహించవలెను. 12. వీరిలో మానుషోపేతుడు జ్యేష్ఠాంశములో అర్ధభాగమును పొందవలెను.

13. (యథావిధిగ వివాహమాడిన) భార్యలు పలువురున్నప్పుడు ముందు పుట్టినవాడు జ్యేష్ఠుడు ; కాని, సంస్కారసహితముగను సంస్కార రహితముగను

[1] మానుషమనగా ఆదాయమును సంపాదించు యోగ్యత.

వివాహమాడిన భార్యలలో[2] సంస్కారసహితయగు భార్యకు పుట్టినవాడు జ్యేష్ఠుడు; (వివాహకాలమందు) కన్యగను క్షతయోనిగను ఉన్నవారిలో కన్యకు పుట్టినవాడు జ్యేష్ఠుడు; కవలలో మొదట పుట్టినవాడు జ్యేష్ఠుడు.

**14.** సూతులు, మాగధులు, వ్రాత్యులు, రథకారులు—వీరిలో ఆయావృత్తులందు నైపుణ్యమునుబట్టి విభాగము. **15.** తక్కినవారు వానినిఆశ్రయించిజీవించవలెను. **16.** ఎవరికిగాని నైపుణ్యము లేనప్పుడు విభాగము సమముగ ఉండవలెను.

**17.** నాలుగువర్ణములకు చెందినస్త్రీలు (బ్రాహ్మణునికి) భార్యలైనప్పుడు, బ్రాహ్మణభార్యకు పుట్టినవానికి నాలుగుఅంశములు, క్షత్రియభార్యకు పుట్టినవానికి మూడుఅంశములు, వైశ్యభార్యకు పుట్టినవానికి రెండుఅంశములు, శూద్రభార్యకు పుట్టినవానికి ఒకఅంశము లభించవలెను. **18.** దీనినిబట్టి, క్షత్రియుని మూడు వర్ణములకు చెందినట్టియు, వైశ్యుని రెండువర్ణములకు చెందినట్టియు భార్యలకు పుట్టినవారి దాయభాగమును తెలుసుకొనవలెను.

**19.** బ్రాహ్మణునికి క్షత్రియభార్యవలన పుట్టిన కుమారునికి సమభాగము. **20.** క్షత్రియవైశ్యులకు అనంతర భార్యలవలన కలిగినకుమాళ్ళకు అర్ధాంశము; వారు మానుషోపేతులైన పక్షమున సమభాగము.[3]

**21.** తుల్యాతుల్యవర్ణములకు చెందిన ఇద్దరిభార్యలవలన ఒకేపుత్రుడుకలిగినప్పుడు సర్వము అతనిదే. అతడు బంధువులను పోషించవలెను.

**22.** బ్రాహ్మణునివిషయములోమాత్రము శూద్రభార్యవలనకలిగిన కుమారునికి మూడోవంతు మాత్రమే లభించును; సపిండునికి గాని, దగ్గరబంధువునకు గాని తక్కినరెండువంతులు చెందవలెను. ఏలయన, అతడు పితృకర్మలు చేయవలసినవాడు. **23.** వీరులేనప్పుడు, తండ్రిగురువుగాని తండ్రిశిష్యుడుగాని వానిని పొందవలెను.

**24.** (శ్లో) లేదా, అతనిచే నియుక్తుడై[4] మాతృబంధువుగాని, సగోత్రుడుగాని వానిక్షేత్రమందు క్షేత్రజపుత్రుని కనవచ్చును. అట్టిపుత్రునికి తన ఆస్తిని ఇచ్చివేయవలెను.

ఇది ధర్మస్థీయము అను మూడో అధికరణమందు దాయవిభాగము; అందు అంశవిభాగము అనే ఆరో అధ్యాయము.

---

[2] ధర్మవివాహములు నాలుగు: సంస్కారసహితములు. గాంధర్వాదులు అట్టివి కావు.

[3] 19–20 సూత్రములలోనివి 17–18 లోనివానికి బదులు.

[4] అత్యధనగా శూద్రభార్యవలన మాత్రమే కుమారుడుగల బ్రాహ్మణుడు.

# మూడో అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 60 : (మిగులు) దాయవిభాగము (అందు పుత్రవిభాగము)

1. "పరునిక్షేత్రమందు వేయబడినవిత్తనము క్షేత్రస్వామిదే," అని (కొందరు) ఆచార్యులు. 2. "తల్లి ఒకతోలుసంచివంటిది ; బీజము ఎవనిదో అతనిదే సంతానము," అని మరికొందరు ఆచార్యులు. 3. "ఉభయులకు చెందినదిఅని తెలుసుకొనవలెను," అని కౌటిల్యుడు.[1]

4. ధర్మానుసారము వివాహమాడిన భార్యయందుకలిగిన పుత్రుడు ఔరసుడు. 5. దౌహిత్రుడు అతనికి సమానము.

6. నియుక్తుడైన సగోత్రునివలనగాని అగోత్రునివలనగాని భార్యయందు కలిగినపుత్రుడు క్షేత్రజుడు. 7. వీనిని కనినవానికి మరియొక పుత్రుడు లేనప్పుడు ఇతడు ఇద్దరుతండ్రులకు పుత్రుడు ; రెండుగోత్రములకు చెందినవాడు, ఇద్దరికి పితృకర్మలు చేయవలసినవాడు, ఇద్దరి ఆస్తులకు హక్కుదారుడు. 8. బంధువుల గృహమందు రహస్యముగ పుట్టిన గూఢజుడు ఇతనితో సమానధర్మములుకలవాడు.

9. బంధువులచే వదలివేయబడినవాడు అతనికి సంస్కారములుచేయువాని పుత్రుడు. 10. కన్యకుపుట్టినవాడు కానీనుడు. 11. వివాహకాలమందు గర్భిణిగ నుండు స్త్రీకి పుట్టినవాడు సహోఢుడు.

12. పునర్వివాహమాడినస్త్రీకి పుట్టినవాడు "పౌనర్భవుడు." 13. అతడు కన్నతండ్రియు బంధువులయు ఆస్తికి హక్కుదారుడు. 14. పరజాతుడు[2] సంస్కారములుచేసినవానికే వారసుడు ; బంధువులకు వారసుడుకాడు. 15. తల్లిదండ్రులచే ధారాదత్తము చేయబడినదత్తుడు ఇట్టి ధర్మములుకలవాడు.

---

[1] క్షేత్రము బీజము—ఈరెండునుకూడ అవసరము. అందుచేత సందర్భాను సారముగ ఎవరికి చెందవలెనో నిర్ణయించవలెను. అన్నిసందర్భములలో ఒకే సూత్రము వర్తించదు.

[2] మొదటి భర్తవలన పుట్టినవాడు.

16. తానుస్వయముగగాని బంధువులమూలముగగాని పుత్రుడుగ గ్రహింపబడినవాడు ఉపగతుడు. 17. పుత్రస్థానమందు నియుక్తుడైనవాడు కృతకుడు. 18. కొనబడినవాడు క్రీతుడు.

19. కాని, ఔరసపుత్రుడు పుట్టినప్పుడు తక్కిన పుత్రులు సవర్ణులైనపక్షమున మూడవవంతు, సవర్ణులు కానప్పుడు ఆహారాచ్ఛాదనములను పొందవలెను.

20. బ్రాహ్మణక్షత్రియులకు అనంతర భార్యలవలన[3] కలిగినపుత్రులు సవర్ణులు ; ఏకాంతర భార్యలవలనకలిగినవారు అనవర్ణులు. 21. బ్రాహ్మణునికి వైశ్యభార్యవలనకలిగినపుత్రుడు అంబష్ఠుడు. శూద్రభార్యవలనకలిగినవాడు నిషాదుడు, లేదా, పారశవుడు. 22. క్షత్రియునికి శూద్రభార్యవలనకలిగిన పుత్రుడు ఉగ్రుడు. 23. వైశ్యునికి శూద్రభార్యవలన కలిగిన పుత్రుడు శూద్రుడే. 24. ఈ మూడువర్ణములలో వర్ణధర్మముల ననుసరించనివారికి సవర్ణభార్యలవలన కలిగినపుత్రులు వ్రాత్యులు. 25. వీరందరు అనులోములు (సక్రమముగపుట్టినవారు).

26. శూద్రునికి వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణభార్యలవలన కలిగిన పుత్రులు (క్రమముగ) అయోగవులు, క్షత్తలు, చండాలురు. 27. వైశ్యునికిపుట్టినవారు (క్షత్రియభార్యవలన) మాగధులు ; (బ్రాహ్మణభార్యవలన) వైదేహకులు. 28. క్షత్రియునికి (బ్రాహ్మణభార్యవలన పుట్టినవారు) సూతులు. 29. పురాణములలో చెప్పబడిన సూతమాగధులు వీరు కారు. వారు అన్యులు. బ్రాహ్మణక్షత్రియులనుండి పుట్టిన ప్రత్యేకజాతులు.

30. వీరందరు ప్రతిలోములు (క్రమవిరుద్ధముగ పుట్టినవారు). రాజు స్వధర్మమును అతిక్రమించుటమూలమున పుట్టినవారు.

31. ఉగ్రునికి నిషాదభార్యవలన పుట్టినవాడు కుక్కుటుడు. నిషాదునికి ఉగ్రభార్యయందు పుట్టినవాడు పుల్కసుడు. 32. అంబష్ఠునికి వైదేహకభార్యయందుపుట్టినవాడు వైణుడు ; వైదేహకునికి అంబష్ఠభార్యయందుపుట్టినవాడు కుశీలవుడు. 33. ఉగ్రునికి క్షత్తభార్యయందు పుట్టినవాడు శ్వపాకుడు. 34. వీరు, తక్కినవారు మధ్యమజాతులు (అంతరాలులు).[4]

---

[3] అనంతరమనగా వరుసక్రమములో తర్వాతిది. ఏకాంతరమనగా అంతరమునకు తర్వాతిది.

[4] 26—34 సూత్రములలో వివరింపబడిన సంకరజాతుల ఉత్పత్తి సహేతుకము కాదు. మాగధులు వైదేహకులు అనుపేర్లు దేశమునుండి వచ్చినవి ; క్షత్తలు, చండాలురు ఆదిమనివాసులు : వైణులు, సూతులు, కుశీలవులు అను పేర్లు వృత్తులనుబట్టి వచ్చినవి. వర్ణసంకరము వలన ఈజాతులన్నియు పుట్టినట్లు మనము విశ్వసించినయెడల ప్రతిలోమవివాహములు సర్వసాధారణములుగ నుండెనని చెప్పవలసివచ్చును. అనగా, ధర్మశాస్త్రములలోని నియమములను పాటించిన వారెవ్వరులేరని అనుకొనవలసివచ్చును. ఇట్లనుకొనుట సమంజసము కాదు.

35. రథకారుడు వృత్తిచేత వైశ్యుడు.

36. వీరిలో స్వవర్ణములలోనే వివాహములు (జరుగవలెను). (స్వవర్ణముల ననుసరించి) ముందు వెనుకలకు సంబంధించిన మర్యాదలు, వంశానుగతములగు వృత్తులు. 37. లేదా, చండాలురు తప్ప తక్కినవారు శూద్ర ధర్మములను అను సరించవలెను.

38. ఈవిధముగ ప్రవర్తించు రాజు మాత్రమే స్వర్గమును చెందుచున్నాడు; ప్రవర్తించని వానికి నరకప్రాప్తి.

39. మధ్యమజాతులలో సమముగ దాయవిభాగము జరుగవలెను.

40. (శ్లో) దేశమునకు, జాతికి, సంఘమునకు, గ్రామమునకు ఏది (ఆచార విహితమగు) ధర్మమో దానిని బట్టియే అతడు (రాజు) దాయవిభాగము చేయ వలెను.[5]

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దాయవిభాగము: అందు పుత్రవిభాగము అనే ఏడో అధ్యాయము.

[5] సూత్రములన్నిటిలో ఆచారము ప్రధానము.

# మూడో అధికరణము

## అధ్యాయము 8

### ప్రకరణము 61 : **వాస్తుకము** (అందు గృహవాస్తుకము)

**1.** స్థిరాస్తిని గురించిన వివాదములను ఇరుగుపొరుగువారి సాక్ష్యమును బట్టి పరిష్కరించవలెను.

**2.** ఇల్లు, పొలము, ఆరామము, కట్ట, తటాకము, జలాధారము—ఇవి వాస్తువు (స్థిరాస్తిలో చేరినవి).

**3.** ఇంటిచుట్టు మూలలలోని స్తంభములకు కట్టబడిన ఇనుపతీగెలతో కూడిన హద్దు ఉండవలెను. **4.** హద్దునకు (నడుమ ఉన్న ప్రదేశమునకు) తగినట్లు అతడు ఇంటిని కట్టించవలెను. **5.** పొరుగింటి గోడకు రెండుఅరత్నులలో మూడు పాదములలో దూరమున కొత్తహద్దు నొకదానిని ఏర్పరుపవలెను.

**6.** ఇంటికి తగిన ప్రదేశమందుగాక మరియొకదానియందు పేడదిబ్బను, మురుగుకాలువను, బావిని ఏర్పాటుచేయరాదు. ప్రసవించిన స్త్రీనిమిత్తము పది రోజులవరకు ఏర్పాటుచేయబడిన కూపమునకు ఈ సూత్రమువర్తించదు. **7.** దీనిని అతిక్రమించినవానికి పూర్వసాహసదండము.

**8.** దీనినిబట్టి కట్టెలుకొట్టుట, పండుగ సమయములందు స్నానాదులకు కావలసిన నీటికాలువల ఏర్పాటు—వీటిని గ్రహించవలెను.

**9.** పొరుగింటి గోడకు మూడు పాదములదూరమునగాని ఒకటిన్నర అరత్నుల దూరమునగాని లోతైనట్టియు, ఏటవాలుగ ప్రవహించునట్టియు నీటి కాలువను కట్టవలెను. **10.** దీనిని అతిక్రమించినవానికి ఏబైనాలుగు పణముల దండము.

**11.** పొరుగింటి గోడకు ఒకపదముగాని ఒకఅరత్నిగాని దూరమున బండ్లకు, పశువులకు, పొయ్యికి, నీటిబానకు, తిరుగలికి, రోటికి ప్రత్యేకస్థానములను కల్పించవలెను. **12.** దీనిని అతిక్రమించినవానికి ఇరువైనాలుగు పణముల దండము.

13. రెండిండ్లకు మధ్యను, ముందుకువచ్చునట్లు కట్టిన రెండుశాలల మధ్యను ఒకకిష్కువుగాని మూడుపాదములుగాని వెడల్పుగల ఖాళీప్రదేశముండవలెను.

14. వాటిమధ్య కప్పులచూరులు నాలుగంగుళముల దూరమందుండవలెను; లేదా, ఒకటిపైన ఇంకొకటి ఉండవచ్చును.

15. ఈ ఖాళీప్రదేశములో చెడిపోయినవాటిని మరమ్మతు చేయుటకై ఒక ప్రక్కద్వారమును సమ్మర్దము కాకుండునట్లు ఏర్పాటు చేయవలెను. 16. వెలుతురునకు ఊర్ధ్వభాగమున ఒకచిన్న కిటికీని పెట్టవలెను. 17. గృహప్రవేశమైన తర్వాత దానిని (బట్టతో) కప్పిఉంచవలెను.

18. లేదా, ఇంటియజమానులు కలిసి ఇష్టానుసారము ఏర్పాటులు చేసుకొనవచ్చును. ఇష్టము కానిదానిని చేయరాదు.

19. వర్షబాధనుండి తప్పించుకొనుటకు ఇంటికిముందుండు అవరణము పైభాగమును ఒక చాపతోగాని, (వెన్నువరకు) ఒక గోడతోగాని కప్పివేయవలెను. 20. దీనిని అతిక్రమించినవానికి, ద్వారముల మూలమునగాని కిటికీల మూలమునగాని రాజమార్గములు రహదారులు మినహాగా బాధకలిగించినవానికి పూర్వసాహస దండము. 21. ఇంటికి వెలుపల గోతులు, మెట్లు, నీటికాలువ, నిచ్చెన, చెత్తదిబ్బలు అనువానిమూలమున ఆటంకము కలిగించువానికి, ఇతరుల అనుభవమునకు అడ్డుపడువానికి ఇదేదండము.

22. పరునిఇంటిగోడకు నీళ్ళచే నష్టము కలిగించువానికి పండ్రెండు పణముల దండము. మూత్రపురీషములచేత నష్టము కలిగించువానికి రెండింతల దండము.

23. వర్షము కురియుచుండునపుడు కాలువలను ధారాళముగ వదలివేయవలెను. అట్లుచేయనిపక్షమున పండ్రెండుపణముల దండము.

24. ప్రతిషేధింపబడినను కాపురముచేయువానికీ; పారుష్యము, దొంగతనము, సాహసము, వ్యభిచారము, వాడుకొనుటయందు అజాగ్రత్త—ఇట్టివిలేనప్పుడు అద్దెకున్నవానిని వెళ్ళగొట్టువానికీ ఇదేదండము. 25. స్వయముగ వెళ్ళిపోయినప్పుడు సంవత్సరముఅద్దెలో శేషమును చెల్లింపవలెను.

26. నలుగురుకలిసి నివసించు ఇంటియందు సహాయము చేయనివానికి, కలిసిఉపయోగించుకొనవలసినదానిని ఆటంక పరుచువానికి, క్రమమైన వినియోగమునకు అడ్డుతగులువానికి పండ్రెండుపణముల దండము. 27. వినాశముచేయువానికి రెండింతల దండము.

28. (శ్లో) కోష్ఠకములు, అంగణములు, పాయిఖానాలు, పొయ్యిలు, దంపుడు

శాలలు, బయలు ప్రదేశములు—ఇవిఅన్నియు అందరుకలిసి ఉపయోగించుకొన వలసినవి.[1]

ఇది ధర్మస్థీయము అను మూడో అధికరణమందు వాస్తుకము (అందు) గృహవాస్తుకము అనే ఎనిమిదో అధ్యాయము.

[1] రెండుమూడు కుటుంబములు ఒకేయింటిలో అద్దెకు ఉండినట్లు దీనినుండి తెలియవచ్చుచున్నది.

# మూడో అధికరణము

## అధ్యాయము 9

### ప్రకరణము 61 : (మిగులు) వాస్తుకము (అందు వాస్తువిక్రయము)

1. అమ్మజూపిన స్థిరాస్తిని కొను హక్కు మొదట జ్ఞాతులది, వారి తర్వాత ఇరుగుపొరుగువారిది ; వారితర్వాత అప్పిచ్చినవారిది. 2. తక్కినవారు వీరి తర్వాతనే బేరములోకి దిగవలెను.

3. ఇంటిని అమ్మదలచినవాడు ఇంటిముందు నలభై ఇరుగుపొరుగు కుటుంబీకుల సమక్షముననుు ; పొలమును, ఆరామమును, నీటికట్టను, తటాకమును, జలాధారమును అమ్మదలచినవాడు పొలిమేరయందు ఇరుగుపొరుగు గ్రామవృద్ధుల సమక్షముననుు, విస్తీర్ణానుసారముగ, "ధర ఇది ; కొనదలచినవారెవరు," అని ప్రకాశముగ వేలముపాటను ప్రారంభించవలెను. 4. ముమ్మారు పాటపెట్టిన మొత్తమును ఆక్షేపింపబడక[1] ఇచ్చి, కొనదలచినవాడు కొనుటకు హక్కుగలవాడగును.

5. లేదా, పోటీమూలమున ధర పెరిగినయెడల శుల్కముతోసహా పెరుగుదల రాజకోశమును చేరవలెను. 6. వేలములో కొనినవాడు శుల్కమును చెల్లించవలెను. 7. ఆస్తి లేనివాడు[2] పాట పాడినయెడల ఇరవైనాలుగు పణముల దండము. 8. పాట పాడినవాడు ఏడు రోజులలో ఆస్తిని స్వాధీనపరుచుకొనని పక్షమున భూస్వామి దానిని తిరిగి వేలము వేయవచ్చును. 9. భూస్వామి అన్యథాగా ప్రవర్తించిన యెడల స్థిరాస్తి విషయములో నూరు పణములు, తక్కిన సందర్భములలో ఇరవైనాలుగు పణములు దండము నిచ్చుకొనవలెను.

ఇది వాస్తువిక్రయము

---

[1] తాకట్టు పెట్టుకొన్నవాడు ఆక్షేపించవచ్చును.

[2] దళారులెవరును పాలబాడరాదు.

10. రెండు గ్రామముల సరిహద్దుల గురించి వివాదము సంభవించినప్పుడు ఇరుగుపొరుగు అయిదు గ్రామములలోనివారుగాని, పది గ్రామములవారుగాని, సహజములగు కృత్రిమములగు గుర్తుల సహాయమున దానిని పరిష్కరింపవలెను.

11. కర్షకులలోను గోపాలకులలోను పెద్దలైనవారు, లేదా, ఒకప్పుడు అచ్చట భూస్వాములుగ నుండిన బయటివారు—అనేకులుగాని, ఒకడుగాని—హద్దుల గుర్తులను ప్రకటించి మారువేషములు వేసుకొని హద్దులను చూపించవలెను. 12. ప్రకటించిన గుర్తులు కనుపించని పక్షమున వేయి పణముల దండమును చెల్లించవలెను. 13. హద్దులను చూపించిన తర్వాత వాటిని తొలగించువారు, హద్దుల గుర్తులను నాశముచేయువారు, ఇట్టి దండమునే చెల్లించవలెను.

14. లేదా, రాజే యథాలాభముగ హద్దులను, కనిపించకపోయిన గుర్తులను ఏర్పరుపవచ్చును.

15. పొలముల గురించిన వివాదములను ఇరుగు పొరుగు గ్రామవృద్ధులు పరిష్కరించవలెను. 16. వారిలో అభిప్రాయభేదము లున్నప్పుడు అధికసంఖ్యాకులుగాని, శుచులుగాని, గౌరవపాత్రులుగాని చెప్పినట్లో, లేదా, మధ్యమార్గముననో నిర్ణయము జరుగవలెను. 17. ఇద్దరికిని హక్కు లేనట్లు నిశ్చయింపబడిన ఆస్తిని, సొంతదారుడు కనిపించని ఆస్తిని రాజు వశపరుచుకొనవలెను. 18. లేదా, లాభకరముగ దానిని మరియొకనికి ఇచ్చివేయవచ్చును.

19. బలాత్కారముగ స్థిరాస్తిని వశపరుచుకొనినవానికి దొంగతనమునకై విధించు దండమును విధించవలెను. 20. సకారణముగ వశపరుచుకొనినపుడు సొంతదారునికి శ్రమక్రిందను, లాభముక్రిందను చెందవలసిన మొత్తమును లెక్కవేసి దాని కనుగుణముగ పరిహారము నియ్యవలెను.

21. హద్దుల గుర్తులను తొలగించువానికి పూర్వసాహసదండము. 22. హద్దులను మార్చువానికి ఇరవైనాలుగు పణముల దండము.

23. దీనినిబట్టి తపోవనములు, పచ్చికబయళ్ళు, రహదారులు, శ్మశానములు, దేవాలయములు, యజ్ఞశాలలు, పుణ్యస్థానములు—వీటికి సంబంధించిన వివాదములను పరిష్కరించవలసిన పద్ధతిని తెలుసుకొనవలెను.[3]

ఇది హద్దులస్థాపనము

24. వివాదముల నన్నిటిని ఇరుగుపొరుగువారి సాక్ష్యమునుబట్టి పరిష్కరించవలెను.

25. పచ్చికబయలు, మెట్టపొలము, మాగాణిపొలము, కాయగూరల తోట, కళ్ళము, శాల, బండ్లశాల—వీటిలో ముందుదానిపై తర్వాతిది ఆక్రమణ చేయ

[3] వివాదముల నన్నిటిని సాధ్యమైనంతవరకు గ్రామవృద్ధుల ద్వారా పరిష్కరించుట ఆ కాలపు ఆచారము. ఇది గమనింపదగ్గ విషయము.

వచ్చును. 26. వేదాధ్యయనవాటములు, యజ్ఞవాటములు, దేవాలయములు, పుణ్యస్థానములు మినహాగా తక్కినవి అన్నీ మెట్టప్రదేశములు.

27. జలాధారములు, కాలువలు, నీటితో నిండిన పొలములు—వీటి మూలమున పారుగువాని పొలము సాగునకుగాని విత్తనములకుగాని నష్టము కలిగించినప్పుడు నష్టమునకు తగిన పరిహారమును చెల్లించవలెను. 28. నీటితో నిండిన పొలములు, ఆరామములు, నీటికట్టలు—వీటి మూలమున పరస్పరము నష్టము సంభవించినయెడల నష్టమునకు రెండింతల దండము చెల్లించవలెను.

29. తర్వాత త్రవ్వబడిన పల్లపుచెరువు నీళ్ళు మిట్టచెరువునుండి పారుదలగల పొలమునకు ముంపు కలిగించరాదు. 30. పల్లపుప్రదేశములోని చెరువు వరుసగ మూడు సంవత్సరములు నిరుపయోగముగ ఉన్నప్పుడుతప్ప పైఎత్తులోఉన్న చెరువు దాని నీటికి నష్టము కలిగించరాదు. 31. దీనిని అతిక్రమించినందుకు, చెరువు నీళ్ళను ఖాళీచేసినందుకు పూర్వసాహసదండము.

32. ఆపత్కాలమందుతప్ప అయిదు సంవత్సరములు ఉపయోగములోలేని జలాధారముపై సొంతహక్కు రద్దగును.

33. తటాకములను, జలాధారములను కొత్తగ నిర్మించినప్పుడు అయిదు సంవత్సరములవరకును ; పాడుపడినవాటిని ఉద్ధరించినప్పుడు నాలుగు సంవత్సరములవరకును ; పొదలతో నిండినవాటిని శుభ్రము చేసినప్పుడు మూడు సంవత్సరములవరకును ; మెట్టసాగును పల్లపుసాగుగ మార్చినప్పుడు రెండు సంవత్సరముల వరకును పన్నులను మినహాయించవలెను. 34. భూస్వామికి తన భూమిని తాకట్టు పెట్టుటకు, విక్రయించుటకు హక్కు కలదు.

35. సొంతదార్లు తమ కాలువలు, నదుల కట్టలు, జలాధారములనుండి పొలములయు ఆరామములయు తోటలయు సాగుకు నీళ్ళను ఇచ్చి పంటలో ఒక భాగమును తీసుకొనవచ్చును. ఇతరులకు కూడ లాభము కలిగించి ఇట్లే తీసుకొనవచ్చును.

36. వీటిని శిస్తు, అద్దె, తాకట్టు, భాగము, ఉపభోగము మొదలైన పద్ధతులలో ఉపయోగించువారు అవసరమైన మరమ్మత్తులు చేసి మంచిస్థితిలో ఉంచవలెను. 37. మరమ్మతు చేయని పక్షమున నష్టమునకు రెండింతల దండము.

38. (శ్లో) వంతునకు విరుద్ధముగ జలాధారములనుండి నీటిని పారుదల చేసుకొనువానికి, ఇతరుల పారుదలను అడ్డగించువానికి ఆరు పణముల దండము.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు వాస్తుకము—అందు వాస్తు విక్రయము, హద్దుల వివాదము, పొలముల వివాదము, హద్దుల స్థాపనము, బాధాబాధికము అనే తొమ్మిదో అధ్యాయము.

# అధ్యాయము 10

## ప్రకరణము 61 : (మిగులు) వాస్తుకము (అందు వివీతక్షేత్రపథహింస)

## ప్రకరణము 62 : సమయస్యానపాకర్మ (ఒడంబడికల ఉల్లంఘించుట)

1. వాడుకలో ఉన్న నీటికాలువకు భంగముకలిగించువానికి, ఆచారమునకు విరుద్ధముగ క్రొత్తదానిని నిర్మించువానికి, ఇతరులభూమియందు నీటికట్టను, బావిని, పుణ్యస్థానమును, చైత్యమును, దేవాలయమును నిర్మించువానికి పూర్వసాహస దండము. 2. తానుగాని ఇతరులద్వారాగాని పూర్వకాలమందుండిఉన్న ధర్మ జలాధారమును తాకట్టుపెట్టినను అమ్మినను మధ్యమసాహసదండము నిచ్చుకొన వలెను. సాక్షులు ఉత్తమదండము నిచ్చుకొనవలెను. పాడుబడినట్టియు ఉపయో గములేనట్టియు జలాధారము విషయమున దండము లేదు.

3. సొంతదారుడు లేనప్పుడు గ్రామములుగాని, పుణ్యశీలురుగాని వీటికి మరమ్మతులుచేసి మంచిస్థితిలో ఉంచవలెను.

4. దుర్గనివేశప్రకరణమందు రహదారులప్రమాణము వివరింపబడి యున్నది. 5. క్షుద్రపశువులు వెళ్ళు మార్గమునుగాని మనుష్యులు నడుచుమార్గమును గాని అక్రమణచేసినవానికి పంన్రెండుపణముల దండము. పెద్దజంతువుల మార్గము అక్రమణకు ఇరువైనాలుగుపణములు ; ఏనుగులమార్గము అక్రమణకు ఏభైనాలుగు పణములు ; సేతుపథము వనపథముల అక్రమణకు నూటఆరుపణములు ; శ్మశాన గ్రామ మార్గముల అక్రమణకు రెండువందలపణములు ; ద్రోణముఖ మార్గముల అక్రమణకు అయిదువందలపణములు ; స్థానీయ రాష్ట్ర వివీతమార్గ ముల అక్రమణకు వేయిపణములు (దండము).

6. ఈ మార్గములప్రమాణమును తగ్గించినయెడల పైదండములలో నాల్గవ వంతుదండము. 7. వాటిని సాగుచేసినయెడల పైదండములే.

8. భూస్వామి కౌలుదారునినుండి భూమిని తీసివేసికొనినందుకు, సాగు

చేయవలసిన సమయములో కౌలుదారుడు దానినివదలినందుకు దండముపం్రెండు పణములు. (భూమిలో) దోషమున్నప్పుడు, అపత్కాలములో, భరింపరాని ఇతర పరిస్థితులలో దండము లేదు.

9. పన్నులుఇచ్చుకొనవలసినవారు అట్టివారికే వారిభూములను తాకట్టు పెట్టవలెను; లేదా, అమ్మవలెను. బ్రాహ్మదేయభూములను బ్రాహ్మణులకే తాకట్టు పెట్టవలెను; లేదా, అమ్మవలెను. 10. అతిక్రమించినయెడల పూర్వసాహసదండము. 11. పన్నులను చెల్లించవలసిన అవసరములేని గ్రామమందు పన్నులను చెల్లించ వలసినవాడు నివానమేర్పరచుకొనినయెడల ఇదే దండము. 12. పన్నులుచెల్లించ వలసిన గ్రామమందు అట్టి అవసరములేనివాడు చేరినయెడల ఇంటినితప్ప తక్కిన వస్తువులన్నిటినిసంపాదించవచ్చును. 13. (గ్రామికుడు) ఇంటినికూడఇయ్యవచ్చును.

14. అన్యాక్రాంతముచేయరానిభూమిని సొంతదారుడు సాగుచేయనప్పుడు అయిదుసంవత్సరములకాలము మరియొకడు దానిని సాగుచేసి, అటుతర్వాత తన కష్టమునకు తగిన పరిహారము పొంది ఇచ్చివేయవచ్చును.

15. పన్నులుచెల్లించవలసిన అవసరములేనివారు గ్రామాంతరములందు నివసించుచున్నవారి పొలములనుండి పండినపంటను అనుభవించవచ్చును.

16. గ్రామముపనిమీద ప్రయాణముచేయు గ్రామికునికి సహాయముగ గ్రామములోని ఉపవాసకులు[1] వంతులువారీగా వెంబడించవలెను. 17. వెంబడించనివారు యోజనదూరమునకు పణమో, అర్ధపణమో చెల్లించవలెను.

18. గ్రామమునుండి దొంగకానివానిని, వ్యభిచారికానివానిని, తొలగించు గ్రామికునికి ఇరువై నాలుగుపణములదండము. గ్రామమునకు ఉత్తమసాహస దండము. 19. తొలగింపబడినవాడు పునః ప్రవేశముగావించువిషయము అభి గమనముగురించి చెప్పినదానినిబట్టి తెలుసుకొనవలెను.

20. గ్రామముచుట్టు నూరుధనుస్సుల దూరమున స్తంభములతో కూడిన కంచెను నిర్మించవలెను.

21. (గడ్డికోయువారు) పశువులఉపయోగమునకై ఉద్దేశింపబడిన వివీత ములో గడ్డినికోయుట జీవనాధారముగ నివసించవలెను.

22. వారు వివీతములో మేసివెళ్ళిపోయిన ఒక్కొకఒంటెకు మహిషము నకు పావుపణము, పశువులు గుర్రములు గాడిదెలలో ఒక్కొకదానికి పణములో ఎనిమిదవవంతు, క్షుద్రపశువులలో ఒక్కొక్కదానికిపణములో పదహారవవంతు తీసుకొనవలెను. 23. మేసినతర్వాత అక్కడనేఉండినపక్షమున దీనికిరెండింతల దండము, రాత్రికూడఉండినపక్షమున నాలుగింతలదండము చెల్లించవలెను.

---

[1] ఉపవాసకులనగా భూస్వాములుకాని కౌలుదార్లు అనికొందరు వ్యాఖ్యాతలు.

24. గ్రామదేవాలయఎద్దులు, పదిరోజులలోపల ఈనగలఆవులు, ఆబోతులు దండము నిచ్చుకొనవలసినదిలేదు.

25. పశువులు పైరులనుమేసి నష్టముకలిగించినప్పుడు పంటనుబట్టిలెక్కవేసి నష్టమునకురెండింతలపరిహారమును వసూలుచేయవలెను. 26. భూస్వామితో చెప్పక పశువులను అతనిపొలములో మేపించువానికి దండము పం(డ్రెండుపణములు, విశృంఖలముగ వదలివేయువానికి దండము ఇరవైనాలుగుపణములు. 27. మందకాపరులకు ఇందులో సగముదండము. 28. తోటలలో మేయుపశువులకు కూడ ఇదే దండము. 29. కంచెను భగ్నముచేసినను, పశువులశాలలోని ధాన్యమును గాని కళ్ళములోనిధాన్యమును గాని తినివేసినను దండముదీనికి రెండింతలు.

30. పశువులకు కలిగినహింసకు ప్రతీకారము చేయవలెను. 31. అభయవనములలోని జంతువులుగాని రక్షితములగు జంతువులుగాని నష్టముకలిగించినప్పుడు భూస్వామికి తెలియపరచి వాటినిబాధించక తరిమివేయవలెను.

32. పశువులను త్రాడుతోగాని కొరడాతోగాని తరిమివేయవలెను. 33. వాటిని మరియొకవిధముగ హింసించువానికి దండపారుష్యదండము. 34. పాడిచే పశువులను, స్పష్టమైన అపరాధముగావించు పశువులను అన్ని ఉపాయములద్వారా వారించ వచ్చును.

ఇది వివీతక్షేత్రపథహింస

35. గ్రామమందు నివాసమేర్పరచుకొనిన తర్వాత గ్రామసముదాయకార్యములలో పాల్గొనని కర్షకుడు చెల్లించు దండమును గ్రామమే తీసుకొనవలెను. 36. పనిచేయుటను మానినందుకు కూలికిరెండింతలు హిరణ్యము[2] నియ్యనియెడల ఇయ్యవలసినవంతుకు రెండింతలు ; ఉత్సవసమయములందు ఇయ్యవలసిన భక్ష్యములను పానీయములను ఇయ్యనందుకు ఇయ్యవలసినవంతుకు రెండింతలు (దండము) ఇయ్యవలెను.

37. నాటక ప్రదర్శనమునకై ఇయ్యవలసినవంతును ఇయ్యనివాడు తాను గాని తనజనముగాని ప్రదర్శనమును చూడరాదు. 38. రహస్యముగ దానినిచూచినప్పుడు వినినప్పుడు తనవంతుకు రెండింతలు ఇచ్చుకొనవలెను. అందరికి హితమగు కార్యములన్నిటియందు ఇట్లే చేయవలెను.

39. అందరికిని హితమగు కార్యమును సూచించువాని ఆజ్ఞలకు అందరును లోబడవలెను. 40. ఆ పనులను చేయనివారికి పం(డ్రెండుపణముల దండము. 41. అట్లుగాక, అందరుకలిసి అతనిని కొట్టినయెడల వారిలో ఒక్కొకరు రెండింతల

---

[2] హిరణ్య మనగా నాణెము, లేదా, చెలామణిద్రవ్యము.

అపరాధమును చెల్లించవలెను. 42. అతనిని హింసించినవారికి శిక్ష మరింత కఠిన ముగ నుండవలెను.

43. వారిలోపెద్దరికమును బ్రాహ్మణునినుండి (వరుసగ) నిర్ణయించ వలెను. 44. ఉత్సవములలో చేయవలసినపనులను బ్రాహ్మణుడు చేయకపోయి నను (లాభములోని) అంశమును పొందవలెను.

45. దీనినిబట్టి దేశము, జాతి, కులము, సంఘము మొదలగు వాటి విషయమున ఒడంబడికలను ఉల్లంఘించుటను తెలుసుకొనవలెను.

46. (శ్లో) దేశహితములగు జలాధారములను, రహదారులపై వంతెన లను, గ్రామములకు శోభతెచ్చు కట్టడములను, రక్షణసాధనములను నిర్మించువారి యెడల రాజు ప్రియుడుగను హితుడుగను ఉండవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు వాస్తుకము—అందు వివీత క్షేత్రపథహింస, వాస్తుకము (సమాప్తము) సమయస్యానపాకర్మ (ఒడంబడికల ఉల్లంఘించుట) అనే పదో అధ్యాయము.

# మూడో అధికరణము

## అధ్యాయము 11

### ప్రకరణము 63 : ఋణాదానము (తీసుకొనిన అప్పును చెల్లించకపోవుట)

1. నూరు పణములకు నెలకు ఒకటింబావు పణము ధర్మవడ్డీ, వ్యాపారము నకు అయిదు పణములు, అడవులలో సంచరించువారికి పది పణములు, ఓడలలో ప్రయాణముచేయువారికి ఇరవై పణములు. 2. ఇంతకంటె ఎక్కువ వడ్డీ వసూలు చేయువానికి చేయించువానికి పూర్వసాహసదండము. సాక్షులలో ఒక్కొకరికి ఇందులో సగము (దండము). 3. రాజు రక్షణను కలిగించలేని సందర్భములలో[1] అప్పు ఇచ్చిపుచ్చుకొనువారల ఆచారమునుబట్టి (ధర్మస్థుడు) నడుచుకొనవలెను.

4. పంటలు వచ్చువరకు ధాన్యముపై వడ్డీ (అప్పులో) సగము, అటుతర్వాత రొక్కములోనికి మారి వృద్ధిపొందవలెను. 5. మూలధనముపై వడ్డీ లాభములో సగము. దీనిని కోష్ఠములో దాచి సంవత్సరమున కొకపర్యాయము చెల్లించవలెను. 6. దీర్ఘప్రవాసముచేయువాడు, మొండిపట్టుపట్టినవాడు మూలధనమునకు రెండింతలు చెల్లించవలెను.

7. వడ్డీని ముందుగ నిర్ణయించక తర్వాత వసూలుచేయువానికి, నిర్ణయించిన వడ్డీని పెంచువానికి, సాక్షుల సహాయముతో అసలుకు వడ్డీని కలిపి మొత్తమును వసూలుచేయువానికి (వడ్డీకి) నాలుగు రెట్లు దండము. 8. (కూట) సాక్షుల సహాయముతో ఎన్నడు ఇచ్చి ఉండని అప్పును వసూలుచేయువానికి అప్పునకు నాలుగురెట్లు దండము. 9. అందులో మూడవవంతును అప్పును వసూలుచేసిన వాడు, తక్కినదానిని వానికి సహాయపడినవారు చెల్లించవలెను.

10. దీర్ఘసత్రయాగము చేయువానికి, వ్యాధితునికి, గురుకులవాసములో ఉండువానికి, మైనరుగా ఉన్నవానికి, దివాలా తీసినవానికి ఇచ్చిన అప్పు వృద్ధి

---

[1] ఓడలలో సముద్రముమీద ప్రయాణముచేయువారు దీనికి దృష్టాంతము.

కాకూడదు.[2]

11. పుచ్చుకొన్న ఋణమును చెల్లించినప్పుడు దానిని గ్రహించనివానికి దండము పంన్రెండు పణములు. 12. గ్రహించకపోవుటకు కారణమున్నప్పుడు దానిని వడ్డీలేక మరియొకనివద్ద దాచవలెను.

13. మైనరు, వృద్ధుడు, వ్యాధితుడు, ఆపదలో ఉన్నవాడు, ప్రవాసమందున్న వాడు, దేశత్యాగము చేసినవాడు, అరాజకమువలన దేశభ్రిమ్మరి అయినవాడు—వీరు తప్ప తక్కినవారు చేసిన అప్పులు పది సంవత్సరములు ఉపేక్ష చేయబడిన యెడల చెల్లనేరవు.

14. చచ్చినవాని ఋణమును అతని కుమాళ్ళుగాని, అతని ఆస్తివారసులు గాని, అతనితో కలిసి అప్పు తీసుకొన్నవారుగాని, జామీను ఉన్నవారుగాని వడ్డీతో చెల్లించవలెను. 15. ఇంకొక జామీను ఉండరాదు. 16. మైనరు జామీను న్యాయ దృష్ట్యా చెల్లదు.

17. చెల్లించవలసిన ప్రదేశముగాని కాలముగాని సూచింపబడని ఋణమును, కుమాళ్ళుగాని, మనుమలుగాని, ఆస్తికి వారసులుగాని చెల్లించవలెను.

18. దేశకాలములతో నిమిత్తములేనట్టి జామీను జీవితమునకు వివాహమునకు భూమికి సంబంధించినపుడు కుమాళ్లు మనుమలు దానికి బాధ్యులు.

19. అనేక ఋణములు ఒకే వాయిదాకాలమున చెల్లించవలసివచ్చినప్పుడు ఋణదాత లిద్దరు ఏకకాలమున దావా చేయకూడదు; ఋణము చేసినవాడు దేశమునుండి వెళ్ళిపోవు సందర్భమున ఇట్టి నియమము లేదు. 20. అప్పుడుకూడ, ఋణములను తీసుకొనిన కాలక్రమమునుబట్టి వసూలు జరుగవలెను. లేదా, మొదట రాజున కియ్యవలసినది, శ్రోత్రియుల కియ్యవలసినది చెల్లవలెను.

21. భార్యాభర్తలు, తండ్రీకొడుకులు, అవిభక్తులగు అన్నదమ్ములు పరస్పరము తీసుకొనిన ఋణములు (ధర్మస్థీయముల ద్వారా) వసూలుచేయుట సాధ్యము కానట్టివి.

22. కర్షకులును, రాజోద్యోగులును వారివారి పనులలో ఉన్నప్పుడు ఋణము లకై పట్టుకొనబడకూడదు. 23. భార్య సమ్మతిలేక భర్త చేసిన అప్పులకు ఆమె బాధ్యురాలు కాజాలదు; ఇది గోపాలకులు, పంటలో సగభాగము ఇచ్చు కర్షకులు—వీరి విషయమున చెల్లదు. 24. భార్యకు వసతిని కల్పించక ప్రవాసియైన భర్త భార్య చేసిన ఋణములకు బాధ్యుడు.

25. ఒప్పుకొనబడిన ఋణము ఉత్తమము. 26. ఒప్పుకొనబడనప్పుడు

---

[2] ఇట్టి అప్పులపై వడ్డీ ఉండదు.

విశ్వాసపాత్రులు, శుచులు, అనుమతులు[3] అయిన ముగ్గురికి తక్కువకాని సాక్షులు పరిష్కారము చేయవలెను. 27. ఉభయులు అనుమతించినయెడల ఇద్దరు సాక్షులు చాలును ; కాని, ఏసందర్భములోగాని ఋణ విషయములో ఒక్క సాక్షియే ఉండుట కూడదు.

28. భార్య సోదరుడు, కలిసి పనిచేయువాడు, అధీనములో ఉండువాడు, ఋణదాత, ఋణమును తీసుకొనినవాడు, శత్రువు, వికలాంగుడు, నేరమునకై దండింపబడినవాడు, వ్యవహారయోగ్యత లేనట్లు పైని చెప్పబడినవారు—సాక్షులు కారాదు. 29. రాజు, శ్రోత్రియబ్రాహ్మణుడు, గ్రామసేవకుడు, కుష్ఠరోగి, గాయముచే బాధపడువాడు, పతితుడు, చండాలుడు, నీచవృత్తి ననుసరించువాడు, గుడ్డివాడు, చెవిటివాడు, మూగ, (ఆహ్వానములేక సాక్ష్యమిచ్చుటకు) తనంతటతానై వచ్చినవాడు, స్త్రీ, రాజోద్యోగి—వీరు వారివారి వర్గములకు చెందిన వివాదముల మినహా సాక్ష్యము చెప్పుటకు అర్హులుకారు. 30. కాని, పారుష్యము, దొంగతనము, వ్యభిచారము అనువాని విషయమున శత్రువు, భార్య సోదరుడు, కలిసి పనిచేయు వాడు తప్ప తక్కినవారు సాక్ష్యము చెప్పవచ్చును. 31. రహస్య వ్యవహారములందు వాటిని గురించి విన్నట్టిగాని చూచినట్టిగాని పురుషుడో, స్త్రీయో—రాజు, తాపసుడు మినహా ఒకే సాక్షి సాక్ష్యము చెప్పవచ్చును.

32. యజమానులు సేవకుల పక్షమునను, ఋత్విగాచార్యులు శిష్యుల పక్షమునను, తల్లిదండ్రులు పుత్రుల విషయమునను బలాత్కరింపబడని సందర్భములో సాక్ష్యము చెప్పవచ్చును ; లేదా, మొదటివారి పక్షమున రెండవవారు సాక్ష్యము చెప్పవచ్చును. 33. వీరిలో వీరికి వివాదము సంభవించినప్పుడు ఓడిపోయిన ఉత్తములు పదియవవంతును, తక్కువవారు అయిదవవంతును దండము చెల్లించవలెను.

ఇది సాక్ష్యాధికారము

34. (ధర్మస్థులు) సాక్షులను బ్రాహ్మణులు, నీటికుండలు, అగ్ని—వీని ఎదుట నిలబెట్టి సాక్ష్యమును చెప్పించవలెను. 35. ఈ సందర్భములో సాక్షి బ్రాహ్మణు డైనప్పుడు, "సత్యము పలుకుము" అని చెప్పవలెను. 36. క్షత్రియుడో, వైశ్యుడో అయినప్పుడు, "(నీవు అసత్య మాడినయెడల) నీ కిష్టాపూర్తిఫలము కాకుండుగాక ; పుర్రెను చేతులో బెట్టుకొని భిక్షార్థివై శత్రుకులమునకు పోయెదవుగాక," అని చెప్పవలెను. 37. శూద్రుడైనప్పుడు, "అసత్య మాడినయెడల జన్మమరణముల మధ్య నీ పుణ్యఫలమంతయు రాజును చెందుగాక ; రాజు కిల్బిషము నిన్ను చెందుగాక ; దండమును నీవు అనుభవించెదవు. (క్రమక్రమముగ) తర్వాత చూడబడిన సత్యము వినబడిన సత్యము బయల్పడక తప్పదు. (కనుక) చంచల

[3] వాది, ప్రతివాది—ఇద్దరు అనుమతించినవారు.

మనస్సు లేనివాడవై సత్యము చెప్పుము," అని చెప్పవలెను.[4] 38. సాక్ష్యమును చెప్పుటకు ఏడు దినములవరకు నిరాకరించువానికి దండము పండ్రెండు పణములు ; మూడు పక్షములు గడచిన తర్వాత దావా మొత్తమును చెల్లించవలెను.

39. సాక్షుల (మాటల) లో భేదము లున్నప్పుడు బహుసంఖ్యాకులుగాని, శుచులుగాని, అనుమతులుగాని, చెప్పినదానినిబట్టి పరిష్కరించవలెను ; లేదా, మధ్యమార్గమును అనుసరించవలెను. 40. లేదా, వివాదద్రవ్యమును రాజు తీసుకొనవలెను.

41. సాక్షులు దావా మొత్తమును తగ్గించవలసినదిగ సాక్ష్యము చెప్పినప్పుడు వ్యత్యాసములో ఒక భాగమును దండముగ వాది చెల్లించవలెను. 42. అట్లుగాక మొత్తమును హెచ్చించి సాక్షులు చెప్పినప్పుడు వ్యత్యాసమును రాజు తీసుకొనవలెను.

43. వాదిలోని లోపమువలన వినినదిగాని వ్రాసినదిగాని లోపముతో కూడినప్పుడు, సాక్ష్యము చెప్పినతర్వాత మరణించినవాని వాఙ్మూలములో లోపమున్నప్పుడు వ్యవహారమును పునఃపరిశీలన గావించి సాక్షుల సహాయమును పొందిన పిమ్మటనే పరిష్కరించవలెను.

44. సాక్షుల అజాగ్రత్తవలన దేశ కాల వ్యవహారములను గురించిన ప్రశ్నలకు వారు చెప్పిన సమాధానములలో వైరుధ్య మున్నప్పుడు వారిపై వరుసగ పూర్వ, మధ్యమోత్తమ సాహసదండములను విధించవలెను" అని ఔశనసులు. 45. "లేనిదానిని ఉన్నట్లు, ఉన్నదానిని లేనట్లు చెప్పినసాక్షులకు దావామొత్తమునకు పదిరెట్లుదండమును విధించవలెను" అని మానవులు. 46. లేదా, "అజాగ్రత్తవలన సాక్షులు అనుచితమైన పరిష్కారమునకు దారితీసినప్పుడు చిత్రవధయే శిక్ష" అని బార్హస్పత్యులు. 47. "ఇది ఏదియుకాదు," అనికౌటిల్యుడు. 48. ఏలయన, సాక్షులు సత్యమునే పలుకవలెను. 49. సత్యమును పలుకనివారికి దండము ఇరువైనాలుగుపణములు ; సాక్షమే చెప్పనివారికి అందులో సగము.[5]

50. (శ్లో) దేశకాలములదృష్ట్యా ఎక్కువదూరమందుండనివారిని (వాదిగాని ప్రతివాదిగాని) సాక్షులుగవేసుకొనవలెను. దూరమందుండువారిని, వచ్చుటకు ఇష్టపడనివారిని రాజాజ్ఞద్వారా పిలిపించుకొనవలెను.

ఇది ధర్మస్థీయమను మూడోఅధికరణమందు ఋణాదానము (తీసుకొనిన అప్పును చెల్లించకపోవుట) అనే పదకొండో అధ్యాయము.

---

[4] ప్రస్తుతకాలపు న్యాయస్థానములలో సాక్షులు సాక్ష్యము చెప్పుటకు ముందు ప్రమాణము చేయవలసియున్నది. సాక్షులు ఏవర్ణమునకు చెందినవారైనను వారొకేవిధముగ ప్రమాణము చేయుచున్నారు. కాని, ప్రాచీనకాలమున వర్ణములనుబట్టి ప్రమాణ విధానము నిర్ణయమగుచుండెను.

[5] కౌటిల్యుడు అతివాది కాడనుట కిది యొక నిదర్శనము.

మూడో అధికరణము

## అధ్యాయము 12

### ప్రకరణము 64 : ఔపనిధికము

1. ఔపనిధికమునకు[1] సంబంధించిన ధర్మము ఋణమునకు సంబంధించిన ధర్మమునుండి తెలుసుకొనవలెను.

2. దుర్గమునుగాని జనపదమునుగాని శత్రువులు ఆటవికులు ధ్వంసము చేసినప్పుడు, గ్రామమునుగాని సార్థవాహమునుగాని పశువులమందలనుగాని దొంగలు దోపిడిచేసినప్పుడు, చక్రములతో కూడిన బండి నాశనమైనప్పుడు, గ్రామముమధ్య సంభవించిన అగ్నిప్రమాదమువలనగాని వరదలమూలముగాని దాచబడిన వస్తువునకు (ఔపనిధికమునకు) ప్రమాదము కలిగినప్పుడు, నావ మునిగిపోయినప్పుడు, లేదా, దోచుకొనబడినప్పుడు, వస్తువును గ్రహించినవానికి స్వయముగ నష్టముసంభవించినప్పుడు—ఇట్టిసందర్భములలో అతడు ఉపనిధికి బాధ్యుడు కాడు.

3. ఉపనిధిభోక్త దేశకాలాచారములకు అనుగుణముగ భోగద్రవ్యము నిచ్చి పండ్రెండుపణములదండమును చెల్లించవలెను. 4. ఉపభోగమువలన నష్టవినష్టములు కలిగినప్పుడు అతడు బాధ్యుడై (పరిహారమునిచ్చుకొనుటయేగాక) ఇరువైనాలుగు పణముల దండము చెల్లించవలెను. కారణాంతరమువలన ఉపనిధి పతితమైనప్పుడు[2] ఇట్లే చేయవలెను. 5. చనిపోయినట్టిగాని, అపదనుపొందినట్టిగాని ఉపనిధికి అతడు బాధ్యుడు కాడు.

---

[1] ఒకనివస్తువును ఇంకొకని వశమందుంచుట. ఇది న్యాయదృష్ట్యా అనేక రూపములలో ఉండవచ్చును. ఉపనిధి, జాకట్టు, నిక్షేపము—అనునవి వీటిలో కొన్ని. ఈ ప్రకరణమందు ఇవి అన్నియు వివరింపబడినవి.

[2] పశువులనుకూడ ఉపనిధులుగ పరులవశము చేయవచ్చును. కాలగతిచేత అవి వార్ధక్యము పొంది పతితములు (క్షీణించినవి) కావచ్చును.

6. ఉపనిధిని తాకట్టుపెట్టినను, అమ్మినను, ఉపనిధి తనవద్ద పెట్టనేలేదని చెప్పినను అతడు దానిమూల్యములో అయిదోవంతునకు నాలుగురెట్లు దండమును చెల్లించవలెను. 7. దానిని మార్చినను పతితమగునట్లు చేసినను మూల్యమునకు సమానమైన దండమును చెల్లించవలెను.

8. దీనినిబట్టి ఉపనిధికి సంబంధించిన నష్టము, ఉపభోగము, విక్రయము, తాకట్టు, అపహరణములను తెలునుకొనవలెను.

9. ప్రత్యేకముగ ఒప్పందల ఉన్నప్పుడుతప్ప లాభకారియగు తాకట్టుద్రవ్యమును[3] స్వాధీనపరచుకొనరాదు; దానిపైన వడ్డీని వసూలుచేయరాదు. 10. లాభకారి కానట్టిదానిని స్వాధీనముచేసుకొనవచ్చును; దానిపైవడ్డీ వసూలుచేయవచ్చును.

11. తాకట్టును వదలించుకొనుటకు సొంతదారు వచ్చినప్పుడు దానిని వదలనివానికి పన్నెండుపణముల దండము. 12. లేదా, తాకటునుపెట్టుకొన్నవాడు హాజరులోలేనప్పుడు తాకట్టుపెట్టినవాడు నిష్క్రయధనమును గ్రామవృద్ధుల వశముచేసి తాకట్టువస్తువును తీసుకోవచ్చును. 13. లేదా, తాకట్టుకు ఆనాటి మూల్యమును నిర్ణయించి; అప్పటినుండి వడ్డీలేకుండ, అచ్చటనే ఉంచవచ్చును; లేదా, నష్టవినష్టములను నివారించు అధికారస్థానమందు[4] ఉంచవచ్చును. 14. తాకట్టుపెట్టినవాడు హాజరులోలేనప్పుడు పెట్టుకొన్నవాడు తాకట్టువస్తువుమూల్యము తగ్గుననుభయమున్నయెడల ధర్మస్థుల అనుజ్ఞతో గరిష్టమగు ధరకుగాని, అధిపాలునికి[5] తృప్తికలిగించు ధరకుగాని అమ్మివేయవచ్చును.

15. కష్టించి అనుభవించదగిన స్థిరాస్తిగాని, కష్టించకపోయినను ఫలితమునిచ్చు స్థిరాస్తిగాని[6] తాకట్టుపెట్టుకొనినవానికి వడ్డీకిమించి లాభమును చేకూర్చవచ్చును; ఆస్తిమూల్యమునకు ఎట్టిభంగము లేకపోవచ్చును. 16. (తాకట్టుపెట్టినవాని) అనుజ్ఞలేక దానిని అనుభవించువాడు వడ్డీని, (దండముక్రింద) మూల్యములోకొంత భాగమును మినహాయించి లాభమును ఇచ్చివేయవలెను.

17. తక్కిన విషయములన్నియు ఉపనిధి ధర్మమువంటివే.

18. దీనినుండి ఆదేశమును,[7] అన్వాధికములను[8] తెలునుకొనవలెను.

19. తాకట్టువస్తువును తాకట్టుపెట్టుకొనువానివద్దకు తీసుకొనిపోవువాడు సార్థవాహముతో ప్రయాణముచేయుచు గమ్యస్థానమును చేరలేనప్పుడుగాని,

---

[3] పాలనుఇచ్చుఅవు, పంటలుపండు పొలము ఇట్టివి.

[4] ఇవి పరిపాలనశాఖలలో ఒకటి. నష్టవినష్టములనునివారించుట వీనికర్తవ్యము.

[5] ఇతడు ప్రభుత్వముచే నియమింపబడిన అధికారి.

[6] సాగుబడిపొలము, ఫలవృక్షములు ఇందులోచేరినవి.

[7] ఆదేశమనగా ఒకవస్తువును ఒకనిచేతికిచ్చి మరియొకని వశము చేయవలసినదిగకోరుట.

[8] అన్వాధికమనగా కమీషన్ (commission).

మార్గములో దొంగలచే దోపిడిచేయబడి వదలివేయబడినప్పుడుగాని, తనవశమందున్నవస్తువునకు బాధ్యుడుకాడు. 20. మార్గములో చనిపోయినపక్షమున (దానివిషయమై) వారసులకు ఎట్టిబాధ్యతయు లేదు.

21. తక్కినదంతయు ఉపనిధిధర్మమునుండి గ్రహించవలెను.

22. అరువుగ తీసుకొనిన దానినిగాని, అద్దెకు తీసుకొనినదానినిగాని తీసుకొనినవిధముగనే తిరిగి ఇచ్చివేయవలెను. 23. దేశకాలనియమములకు లోబడి తీసుకొనిన వాటివిషయములో నష్టముగాని, కాలగతిచేతను ప్రమాదముమూలమునను వినష్టముగాని సంభవించినప్పుడు దానికి బాధ్యతవహించవలసినది లేదు.

24. తక్కినదంతయు ఉపనిధిధర్మమునుండి తెలుసుకొనవలెను.

25. ప్రతినిధుల (ఏజెంట్ల) మూలముగ[9] విక్రయించువిషయము : అర్ఘములగు ప్రదేశములందును కాలములందును విక్రయించుఏజెంట్లు విక్రయమూల్యమును లాభమును సొంతదారునికి చేర్చవలెను. 26. లేదా, దేశకాలవిపర్యయమువలన ధరలుతగ్గినప్పుడు (విక్రయమునకై వస్తువులను తమఆధీనము చేసినప్పుడు) నిర్ణయించుకొన్న మూల్యమును లాభమును ఇచ్చివేయవలెను. 27. లేదా, అనుకొనిన ప్రకారము లాభము రానప్పుడు మూల్యమునుమాత్రమే ఇచ్చివేయవలెను. 28. లేదా, ధరలు పడిపోవుటవలన మూల్యముతగ్గినప్పుడు, తగ్గినమూల్యమును ఇయ్యవలెను. 29. లేదా రాజునకు సంబంధించినంతవరకు విశ్వాసపాత్రులుగను నిర్దోషులుగను భావింపబడినవారు నష్టమైనట్టియు, కాలగతిచేగాని అకస్మాత్తుగ సంభవించిన ప్రమాదముచేగాని వినష్టమైనట్టియు వస్తువులమూల్యమును కూడ ఇచ్చుకొనవలసినదిలేదు. 30. దేశాంతరములందును కాలాంతరములందును విక్రయించవలసిన వస్తువులవిషయములో వారు నష్టములను ఖర్చులను మినహాయించి మూల్యమును లాభమును ఇచ్చివేయవలెను ; ఒక్కొక్క వర్గమునకు చెందిన వస్తువులవిషయములో వారు ప్రత్యేకాంశమును ఇయ్యవలెను.

31. తక్కినది ఉపనిధి ధర్మమునుండి తెలుసుకొనవలెను. 32. ఇది ఏజెంట్ల మూలముగ (వైయావృత్య) విక్రయము.

33. నిక్షేపములగురించిన ధర్మము ఉపనిధి ధర్మమువంటిదే.

34. ఒకడు తనపరముచేసినదానిని ఇంకొకని పరముచేసినయెడల అది నష్టమైనట్లే (భావించవలెను).

35. వశపరుపబడిన నిక్షేపమును అపహరించినప్పుడు, అంతకుపూర్వము

[9] వైయావృత్య విక్రయమని మూలము. ఒకనితరపున ఇంకొకడు విక్రయించుట ఇట్టిసందర్భములో విక్రయించినవస్తువుల మూల్యము, విక్రయము వలన కలిగినలాభము ఏజెంటు సొంతదారునికి అందజేయవలెను. వాటిని గురించి సంభవించు వివాదముల పరిష్కారము ఇచట వివరింపబడినది.

అతడుగావించిన నేరమునుబట్టి, నిక్షేపమును ఉంచినవానినిబట్టి పరిష్కారము జరుగవలెను. 36. ఏలయన, కర్మకరులు (చేతిపనులనుచేయువారు) శుచులు కారు. 37. సాక్ష్యమునుబట్టి పరిష్కారము జరుగవలెనను సూత్రము వారివశము చేయబడిన నిక్షేపముల విషయమున వర్తించదు.

38. సాక్ష్యములేదను కారణమున నిక్షేపము తనవశము చేయబడలేదని అతడు వాదించిన పక్షమున నిక్షేపమును వశపరచినవాడు సాక్షులను తయారుచేయ వచ్చును; అందుకై అతడు వారిని గోడలవెనుక నిలబెట్టిగాని, వనములలో మద్య గోష్ఠులద్వారా వారిని మభ్యపెట్టిగాని, రహస్యముగ వారికి విషయమును తెలియ పరుపవచ్చును.

39. వృద్ధుడు వ్యాధితుడు అగు వర్తకుడొకడు గుర్తులుగల వస్తువునొక దానిని రహస్యముగ ఇతనివశముచేసి వెళ్ళిపోవలెను. 40. అతని ఆదేశముతో అతని కుమారుడుగాని సోదరుడుగాని వచ్చి నిక్షేపవస్తువును ఇమ్మని అడుగ వలెను. 41. అతడు దానిని ఇచ్చివేసినయెడల శుచి (అని అనుకొనవచ్చును); అన్యథాప్రవర్తించినప్పుడు నిక్షేపమునుఇచ్చి, స్తేయదండమును (దొంగిలించి నందుకు విధించుదండము) చెల్లించవలెను.[10]

42. లేదా, ప్రయాణముచేయుటకు సిద్ధముగనుండు ఒకవిశ్వాసపాత్రుడు గుర్తులుగల ఒకవస్తువును అతనివశమందుంచి వెళ్ళిపోవలెను. 43. కొంత కాలముగడచినతర్వాత అతడు తిరిగివచ్చి దానిని ఇయ్యవలసినదిగ కోరవలెను. 44. ఇచ్చినపక్షమున అతడు శుచి, అన్యథా ప్రవర్తించినయెడల నిక్షేపమునిచ్చి స్తేయదండమును చెల్లించవలెను.

45. లేదా, అతడే గుర్తులుగల వస్తువుల ద్వారా అతనిని శోధించి జాగ్రత్త పడవచ్చును.

46. లేదా, బాలిశునివలె నటించుచు ఒకడు పన్నులుచెల్లించలేదను కార ణమునగాని రాత్రిపూట సంచారముచేయుచున్నాడను కారణమునగాని రాజభటులు పట్టుకొనబోవుచున్నారని భయమును ప్రదర్శించుచు ఎక్కువ విలువగల వస్తువు నొకదానిని అతనివశముచేసి వెళ్ళిపోవలెను. 47. తర్వాత ఖైదుచేయబడినవాడై వస్తువును ఇమ్మని అడుగవలెను. 48. ఇచ్చినయెడల అతడు శుచి; అన్యథా ప్రవర్తించినయెడల అతడు నిక్షిప్తవస్తువును ఇచ్చి స్తేయదండమును చెల్లించ వలెను.

49. లేదా, గుర్తులసాధనమున అతడు కుటుంబములోని వారిని రెండు

---

[10] నిక్షేపములగురించిన వివరణము ధర్మశాస్త్ర గ్రంథములలో కనిపించదు. కౌటిల్యుని గ్రంథములో ఇట్టివివరణముండుట విశేషము.

వస్తువులను[11] ఇయ్యవలసినదిగ కోరవలెను. 50. ఒకవానినికూడ ఇయ్యనిపక్ష మున పైనిచెప్పబడినట్లు చేయవలెను.

51. (ధర్మస్థుడు) ప్రతివాది అనుభవములో ఉండువస్తువు అతనికి ఎట్లు లభించినది, వ్యవహారకారణమైన వస్తువులకు గుర్తులు, నిక్షేపవస్తువును సంపాదించుటకు వానికిగల శక్తి—వీటినన్నిటిని పరీక్షించి తెలుసుకొనవలెను.

52. దీనినుండి రహస్యసంపములగురించి తెలుసుకొనవలెను.

53. (శ్లో) కావున, ఎవడుగాని బంధువులతోను ఇతరులతోను చేయ దలచుకొను వ్యవహారములను సాక్షులసమక్షమున, బహిరంగముగ, దేశము, కాలము, ప్రమాణము, వన్నెలకుసంబంధించిన వివరములను స్పష్టపరచి చేసు కొనవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు ఔపనిధికమనే పన్నెండో అధ్యాయము.

[11] మొదటదాచినది ఒకవస్తువు. గుర్తులతోకూడినది రెండవవస్తువు. నిక్షేపమును వశమందుంచు కొనినవాడు చనిపోయినయెడల కుటుంబములోని వారు బాధ్యులగుదురు.

## మూడో అధికరణము

## అధ్యాయము 13

### ప్రకరణము 65 : దాసకర్మ కరకల్పము

1. ఉదరదాసునితప్ప[1] తక్కినఆర్యజాతి[2] మైనరును విక్రయించు బంధువుగాని తాకట్టుపెట్టుబంధువుగాని శూద్రుడైనయెడల పండ్రెండుపణములు, వైశ్యుడైనయెడల మూడింతలు, బ్రాహ్మణుడైనయెడల నాలుగింతలు దండమును చెల్లించవలెను. 2. (బంధువుకాని) ఇతరుడు వరుసగ పూర్వమధ్యమ ఉత్తమ సాహస దండమునకును మరణదండమునకును పాత్రుడగును.

3. సంతానమును విక్రయించుటగాని తాకట్టుపెట్టుటగాని మ్లేచ్ఛులకు[3] దోషముకాదు. 4. కాని, ఎట్టిసందర్భములలోకూడ ఆర్యునికి దాసత్వము ఉండరాదు.

5. లేదా, ఆపత్కాలమందు ఆర్యకుటుంబము ధనమును తీసుకొని ఆర్యుని తాకట్టుపెట్టినపక్షమున నిష్క్రయధనము లభించిన వెంటనే వారుమొదట మైనరగు బాలుని, సహకారముచేసినవానిని[4] విడుదల చేయవలెను.

6. తన్నుతాను తాకట్టుపెట్టుకొనినవాడు ఒకపర్యాయము పరారిఅయిన పక్షముననను, ఇతరులు తాకట్టుపెట్టినప్పుడు రెండుపర్యాయములు పరారిఅయిన పక్షముననను నిష్పతితుడగును.[5] విదేశమునకు పారిపోవు ప్రయత్నములో ఉన్నవాడు

---

[1] ఆపత్కాలమందు పిల్లలను పోషించలేనిస్థితిలో పోషణార్థమై తాత్కాలికముగ ఇతరులవశము చేయబడినవాడు.

[2] శూద్రుడుకూడ ఆర్యజాతికి చెందినట్లు ఇది స్పష్టము చేయుచున్నది.

[3] మ్లేచ్ఛులు గ్రీకులు మొదలైన పరాయిదేశములవారు. దాసత్వమును దురాచారముగ వారు పరిగణించి యుండలేదు. అది సహజధర్మమని వారి సిద్ధాంతము.

[4] నిష్క్రయధనమును సేకరించుటయందు సహాయపడిన వాడని కొందరు వ్యాఖ్యాతలు.

[5] తాకట్టులోఉన్నవాని స్థితి దాసుని స్థితికంటె మెరుగైనది. అట్టివానికి కొన్ని హక్కులు ఉండును. పరారిఅయినవాడు ఆ హక్కులను కోల్పోయి (నిష్పతితుడై) దాసుని స్థితిలోకి వచ్చును.

రెండు సందర్భములలోను మొదటిపర్యాయముననే నిష్కృతితుడగును.

7. లేదా, దొంగతనముచేసిన కారణముగ[6] దాసుని ఆర్యత్వమును అపహరించువానికి (ప్రైవాటిలో) అర్ధదండము.

8. తాకట్టులోఉన్నవాడు పరారియైనను, మృతిచెందినను, ఆపదగాంచినను మూల్యమును భరించవలసిన బాధ్యత తాకట్టుపెట్టుకున్నవానిది.

9. తాకట్టులోఉన్నవారిచేత ప్రేతమును మోయించుట, మూత్రపురీషములను ఎంగిలిఆకులను ఎత్తించుట, తాకట్టులోఉన్న ఆడమనిషిచేత నగ్నుడగు వానికి స్నానముచేయించుట, వారిపై చేయిచేసుకొనుట, వారికి మానభంగము గావించుట—ఇవి మూలధననష్టమునకు దారితీయును; పాలతల్లి, పరిచారిక, అర్ధభాగమునిచ్చు పద్ధతిని సాగుచేయునట్టి స్త్రీ, ఉపచారిక—వీరి విషయమున స్వేచ్ఛకు కారణములగును.[7] 10. సంతానమును కనిన పరిచారిక వెళ్ళిపోవుట ధర్మసమ్మతము.

11. తనవద్ద తాకట్టులోఉన్న స్త్రీని ఆమె ఇష్టపడనపుడు పొందినవానికి పూర్వసాహసదండము; పరునివద్ద తాకట్టులోఉన్నదాని విషయములో మధ్యమ సాహసదండము. 12. తాకట్టులోఉన్న కన్యను తానుగాని మరియొకనిద్వారాగాని భంగపరిచినప్పుడు మూలధనము నాశనమగుటయేగాక[8] శుల్కమును, దానికి రెండింతల దండమును ఇచ్చుకొనవలెను.

13. ఆత్మవిక్రయము చేసుకొనిన ఆర్యుని సంతానము ఆర్యజాతికి చెంది యుండును.[9] 14. యజమానుని పనులకు భంగములేక స్వయముగ కష్టించి ఆర్జించినదానికి తానే సొంతదారుడు; పితృదాయముకూడ తనదే. 15 మూల్యమిచ్చి ఆర్యత్వమును పొందవచ్చును.

16. దీనినిబట్టి ఉదరదాసుడు, తాకట్టులోఉన్నవాడు—వీరినిగురించిన విషయములను తెలుసుకొనవచ్చును. 17. ఇతని నిష్క్రయధనము మూల్యమునకు అనుగుణముగ నుండవలెను.

18. దండము విధింపబడినవాడు పనిచేసి దండమును చెల్లించినవాడు కావచ్చును.

---

[6] తాకట్టులోఉన్నవానిపై ఇట్టి నేరము మోపి, వానిని దాసునిగ చేయువానికి ఇట్టి శిక్ష.

[7] తాకట్టులోని స్త్రీలచేత ఇట్టి పనులను చేయించినప్పుడు వారు స్వేచ్ఛగ వెళ్ళిపోవచ్చును; అట్లు వెళ్ళిపోవుట నేరము కాదు.

[8] మూలధనమును కోల్పోవుట అనగా తాకట్టులోఉన్న స్త్రీని (లేక పురుషునిగాని) విడుదల చేయుట.

[9] తండ్రి దాసుడైన కారణముగ సంతానము ఆర్యత్వమును పోగొట్టుకొనదు.

19. ధ్వజముక్రింద బంధితుడైన ఆర్యుడు[10] నిర్ణీతకాలమువరకు అర్హమైన పనిచేసిగాని, నిష్క్రయధనములో సగముఇచ్చిగాని స్వేచ్ఛను పొందవచ్చును.

20. ఇంటిలో పుట్టినవారు, దాయము ద్వారా లభించినవారు, బహుమానముగ లభించినవారు, క్రయమిచ్చి కొనబడినవారు—ఈ నాలుగురకముల దాసులలో బంధువులులేనట్టియు, ఎనిమిది సంవత్సరములకు లోబడినట్టియు ఉండువానిని వాని ఇష్టములేక నీచకార్యములందుగాని విదేశములందుగాని వినియోగించువానికిని, గర్భిణియగు దాసిని గర్భపోషణమునకు ఏర్పాటుచేయక విక్రయించువానికిని, తాకట్టుపెట్టువానికిని పూర్వసాహసదండము విధించవలెను. కొనినవారు, సాక్షులు ఇట్టి దండమునే చెల్లించవలెను.

21. తగిన నిష్క్రయధనమిచ్చినను ఆర్యుడగు దాసుని విడుదలచేయని వానికి పండ్రెండు పణముల దండము, కారాగారశిక్ష.

22. దాసుని ద్రవ్యమునకు జ్ఞాతులు వారసులు; వారు లేనప్పుడు అది యజమానునికి చెందును.

23. యజమానునివలన దాసికి కలిగిన పుత్రుడు తల్లితో కూడ స్వేచ్ఛను పొందినట్లు ఎరుగవలెను. 24. తల్లి ఇంటితో సంబంధముకలదియై, కుటుంబ వ్యవహారములను చూచుకొనునట్టిదియైన పక్షమున ఆమె సోదరుడు సోదరియు స్వేచ్ఛను పొందెదరు.

25. నిష్క్రయధనమును పుచ్చుకొనినతర్వాత దాసునిగాని దాసినిగాని తిరిగి విక్రయించినను తాకట్టుపెట్టినను దండము పండ్రెండు పణములు; వారు ఇష్టపడి ఇట్లు జరిగినయెడల దండము లేదు.

ఇది దాసకల్పము

26. ఆసన్నులైనవారు కార్మికుని కర్మసంబంధములగు విషయములను తెలిసియుండవలెను.

27. ఒప్పందము ప్రకారము అతనికి వేతనము ముట్టవలెను; లేదా, అది పనికి కాలమునకు తగినట్టిదిగ ఉండవలెను. 28. వేతనముగురించి ముందుగ ఒప్పందము జరుగని సందర్భములో కర్షకుడు పంటలోను, గోపాలకుడు నెయ్యిలోను, వర్తకుడు పణ్యములలోను పదియవవంతును తీసుకొనవలెను. 29. ఒప్పందము జరిగినపుడు వేతనము దానిననుసరించి ఉండవలెను.

30. కారువులు, శిల్పులు, కుశీలవులు, చికిత్సకులు, వాగ్జీవనులు, పరిచారకులు, తదితరులు, బహుమానము లభించునను ఆశతో పనిచేయు ఇట్టివారు, వారితో సమానముగువారు సంపాదించునట్టిదానితో సమానమగు ఆదాయమును

---

[10] యుద్ధములో పట్టుకొనబడినవాడు.

పొందవలెను ; లేదా, కుశలులు నిర్ణయించినదానిని పొందవలెను.

**31.** వివాదములన్నియు సాక్షుల సాక్ష్యమునుబట్టి పరిష్కారము కావలెను. **32.** సాక్షులు లేనప్పుడు పనిచేసిన చోటునకు వెళ్ళి ధర్మస్థులు విచారణ చేయవలెను.

**33.** వేతనము నియ్యనివానికి అందులో పదోవంతుగాని, ఆరు పణములుగాని దండము. **34.** పనిచేయించుకొనలేదని చెప్పినప్పుడు అయిదవవంతుగాని పండ్రెండు పణములుగాని దండము.[11]

**35.** నదీవేగములోగాని, నిప్పుమంటలలోగాని, దొంగలచేతులలోగాని, క్రూర మృగములమధ్యలోగాని, చిక్కుకొని వాటినుండి తప్పించుకొను సందర్భములో తన్ను రక్షించినవానికి తన సర్వస్వమును, తన భార్యాపుత్రులను, తన్నును కూడ ఇచ్చివేయునట్లు వాగ్దానముచేసి రక్షింపబడినప్పుడు కుశలులు నిర్ణయించిన మొత్తమును రక్షకునికి బహుమానముగ నియ్యవలెను. **36.** ఆపత్కాలమందు చేయబడు వాగ్దానములన్నిటి విషయమున ఇట్లేఅని గ్రహించవలెను.

**37.** (శ్లో) వేశ్యలు సంగమభోగచిహ్నములకు అనుగుణముగ ధనమును తీసుకొనవలెను ; కాని, మితిమీరి కోరునట్టివారు అంతను వదలుకొనవలెను. దుర్బుద్ధిని అవినయమును ప్రదర్శించువారి విషయమున కూడ ఇట్లే జరుగవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దాసకర్మ కరకల్పమున దాస కల్పము కర్మకరకల్పమున స్వామ్యాధికారము అనే పదమూడో అధ్యాయము.

---

[11] 26-33 సూత్రములలోని నియమములు ప్రస్తుతకాలపు కార్మిక శాసనములతో (labour legislation) పోల్చతగినవి.

# మూడో అధికరణము

## అధ్యాయము 14

### ప్రకరణము 65 : (మిగులు) దాసకర్మ కరకల్పము (అందు భృతకాధికారము)[1]

### ప్రకరణము 66 : సంభూయసముత్థానము

1. వేతనము పుచ్చుకొనిన తర్వాత పనిచేయని భృత్యునికి పండ్రెండు పణముల దండము, పనిచేయువరకు నిర్బంధములో ఉంచబడుట (శిక్ష).

2. అతడు అశక్తుడైనప్పుడు. నీచకర్మలయందు నియుక్తుడైనప్పుడు, వ్యాధితుడైనప్పుడు, ఆపదలో ఉన్నప్పుడు, ఒప్పందము రద్దుచేసుకొనవచ్చును. లేదా, మరియొకనిచేత పనిచేయించవచ్చును. 3. లేదా, యజమాని వ్యయమును అతనినుండి వసూలుచేసి, మరియొకనిచేత పనిని చేయించుకొనవచ్చును.

4. (ఒప్పందములో) "ఈ పనిని నీవు మరియొకనిచేత చేయించరాదు; నేను మరియొకని పనిని చేయను," అను షరతు ఉన్నదను కారణముచేత యజమాని అతనినుండి పనిపుచ్చుకొనకపోయినను, భృత్యుడు పనిచేయకపోయినను దండము పండ్రెండు పణములు. 5. యజమానికాక మరియొకనినుండి అతడు వేతనమును పుచ్చుకొనినపుడు, పని పూర్తియైనతర్వాత అతడు ఇష్టములేనియెడల (ఎక్కువ) పనిచేయవలసినదిలేదు.

6. "భృత్యుడు హాజరైనప్పుడు యజమాని పనిచేయించుకొనని పక్షమున పనిచేసినట్లే భావించవలెను," అని ఆచార్యులు. 7. "కాదు," అని కౌటిల్యుడు. 8. వేతనము చేసినపనికిగాని చేయనిపనికి కాదు. 9. పనిలో కొంతభాగమును చేయించుకొనినతర్వాత మిగిలిన పనిని చేయించుకొనని పక్షమున పని పూర్తిగ చేసినట్లే భావించవలెను.

---

[1] యజమానుని పనిని పూర్తిచేసి మరియొకనివద్ద పనిచేయుటకు ఒప్పుకొనినవాడు అనుసరించదగిన విధానము.

10. భృత్యుడు ఒప్పుకొనిన ప్రదేశమందుగాని, కాలమందుగాని, పనినిచేయ నప్పుడు, ఒప్పుకొనినదానికంటె భిన్నముగ దానిని చేసినప్పుడు (యజమానికి) ఇష్టములేనియెడల అది చేయబడినట్లు భావింపవలసినదిలేదు. 11. అనుకొనినదాని కంటె ఎక్కువ పనిచేసినప్పుడు కష్టమును వ్యర్థపుచ్చరాదు.

12. దీనినిబట్టి సంఘములలో చేరి పనిచేయు భృత్యుల విషయమును తెలుసుకొనవలెను.[2] 13. సంఘముయొక్క ఆదేశము ననుసరించి పనిచేయుటకు వచ్చినవాడు ఏడు రోజులు పనిచేయవలెను. 14. అటుతర్వాత సంఘము మరియొకనిని పంపి పనిని పూర్తిచేయించవలెను.

15. యజమానికి తెలియపరుపక సంఘము పనివానిని తొలగించుటగాని, కొత్తవానిని ప్రవేశపెట్టుటగాని చేయరాదు. 16. దీనిని అతిక్రమించినయెడల ఇరవైనాలుగు పణముల దండము. 17. సంఘముచే తొలగింపబడినవానికి ఇందులో సగము దండము.

ఇది భృతకాధికారము

18. సంఘములోని భృత్యులు, వ్యవహారమందు కలిసిపనిచేయు భాగ స్వాములు, ఒప్పందము ప్రకారముగగాని, సమముగగాని, వేతనమును విభాగము చేసుకొనవలెను.

19. లేదా, (కలిసిపనిచేయు) కర్షకులు వ్యాపారస్థులు పంటలకు పణ్య వస్తువులకు సంబంధించిన పనుల ప్రారంభావసాన కాలముల మధ్య వ్యాధితుడై వారిలో ఒకడు పనిచేయలేనప్పుడు వాడుచేసిన పనినిబట్టి అతనికి భాగమియ్యవలెను. 20. తన బదులుగ మరియొకనిచేత పనిచేయించినప్పుడు వానికి భాగమును పూర్తిగ ఇయ్యవలెను. 21. పణ్యములన్నియు సంసిద్ధములై ఫలితమిచ్చినప్పుడు అతడు వ్యాధితుడైనయెడల అతని భాగమును అచటనే అప్పటికప్పుడు ఇచ్చివేయ వలెను. 22. ఏలయన, మార్గమధ్యమున సిద్ధిగాని అసిద్ధిగాని సహజము.

23. కాని, పని ప్రారంభమైనతర్వాత ఆరోగ్యవంతుడుగ ఉన్నను పనిచేయని భాగస్వామి పన్రెండు పణముల దండము నియ్యవలెను.

24. పని మానివేయుటకు అతనికి స్వేచ్ఛ ఉండరాదు.

25. పణ్యములను అపహరించిన భాగస్వామిని పనిచేసినందుకు భాగమును అభయమును ఇచ్చినట్లుచెప్పి, వాటినిఇచ్చి, పట్టుకొనవలెను. 26. అతడు తిరిగి అపహరించినను ప్రదేశాంతరమునకువెళ్ళినను ప్రవాసమే శిక్ష. 27. మహాపరాధము చేసినయెడల రాజద్రోహివలె భావించవలెను.[3]

---

[2] దీనినిబట్టి ఆ కాలములో కార్మికసంఘము లుండుట స్పష్టము.

[3] బహుశః ఇది భాగస్వాములగు రాజోద్యోగుల విషయమునకు సంబంధించి యుండవచ్చును.

28. యజ్ఞములను (కలసి) చేయించు అధ్వర్యులు ప్రత్యేకముగ వారివారికి ఇయ్యబడిన దక్షిణలను తప్ప తక్కిన మొత్తమును ఒప్పందము ప్రకారముగగాని సమముగగాని పంచుకొనవలెను.

29. అగ్నిష్టోమము మొదలగు క్రతువులందు దీక్ష తర్వాత వ్యాధితుడైన యాజకుడు అయిదవ భాగమును, సోమవిక్రయము తర్వాత నాల్గవభాగమును, మధ్యమోపసదమున ప్రవర్గ్యోద్వాసనానంతరము మూడవభాగమును, మధ్యమోపసదము తర్వాత అర్ధభాగమును, ప్రాతఃసవనానంతరము ముప్పాతిక భాగమును తీసుకొనవలెను. 30. మధ్యందిన సవనానంతరము వ్యాధితుడైనయెడల పూర్తిగ (తన భాగమును) పొందవలెను. 31. ఏలయన, అది దక్షిణలిచ్చు సమయము. 32. బృహస్పతి సవనమందుతప్ప తక్కిన యాగములలో ప్రతి సవనమందు దక్షిణ లియ్యబడును.

33. దీనినిబట్టి అనేకదినములు జరుగు యాగదక్షిణల విషయము తెలుసుకొనవలెను.

34. వ్యాధితులైన యాజకుల పనిని తక్కిన యాజకులు పది అహోరాత్రములవరకు చేయవలెను;[4] లేదా, విశ్వాసపాత్రులైనవారెవరైన చేయవచ్చును.

35. యజమానుడు యాగకర్మ పూర్తికాకముందు వ్యాధితుడైనయెడల ఋత్విక్కులు దానిని పూర్తిచేసి దక్షిణలను తీసుకొనవలెను.

36. యాగము పూర్తికాకముందు యజమానునిగాని యాజ్ఞికులనుగాని వదలివెళ్ళిపోయినవానికి పూర్వసాహసదండము.

37-38. (శ్లో) నూరు గోవులున్నను ఆహితాగ్నులులేనివాడు, వేయి గోవులున్నను యజ్ఞము చేయనివాడు, సురాపానము చేయువాడు, వృషలస్త్రీని పెండ్లాడినవాడు, బ్రహ్మహత్య చేసినవాడు, గురుతల్పగతుడు, పట్టకూడని దానములను పట్టువాడు, దొంగ, కుత్సితనిచే యాగముచేయించు అధ్వర్యుడు—ఇట్టివారిని అన్యోన్యము విసర్జించుట దోషము కాదు. ఇట్టివారి యజ్ఞకర్మలో సంకరము నిశ్చయమగుటయే దీనికి కారణము.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దానకర్మ కరకల్పము; అందు భృతకాధికారము, సంభూయసముత్థానము అనే పధ్నాలుగో అధ్యాయము.

---

[4] బహుశః ఇది పది రోజుల అశౌచనమునకు సంబంధించినది కావచ్చును.

# మూడో అధికరణము

## అధ్యాయము 15

### ప్రకరణము 67 : విక్రీత క్రీతానుశయము[1]

1. పణ్యమును విక్రయించినతర్వాత దానిని వశపరుపనివానికి పంద్రెండు పణముల దండము ; దోషము, ఉపనిపాతము, అవిషహ్య విషయములలో దండము లేదు. 2. దోషమనగా వస్తువులోని దోషము. 3. ఉపనిపాతమనగా రాజువలన గాని, దొంగవలనగాని, అగ్నివలనగాని, ఉదకమువలనగాని అకస్మాత్తుగ సంభవించిన ప్రమాదము. 4. అవిషహ్యమనగా అనేకగుణములు లేనట్టిది ; లేదా, ఆపదలో ఉన్నవానిచేత తయారుచేయబడినది.

5. (విక్రయమును) రద్దుచేయుటకు వర్తకులకు ఒకరోజు, కర్షకులకు మూడురోజులు, గోపాలకులకు అయిదురోజులు (గడువు) ఇయ్యవచ్చును. 6. వృత్తికి సంబంధించిన వస్తువుల అమ్మకము విషయములో మిశ్రమవర్ణముల వారికి ఉత్తమవర్ణములవారికి ఏడురోజులగడువు ఇయ్యవచ్చును.

7. చెడిపోవువస్తువుల విషయములో[2] "వీటిని మరియొక ప్రదేశమందు అమ్మరాదు," అని ఆదేశించి గడువు ఇయ్యవచ్చును. 8. దీనిని అతిక్రమించిన యెడల ఇరువైనాలుగు పణములదండము ; లేదా, వస్తువుల మూల్యములో పదోవంతు.

9. వస్తువును కొనిన తర్వాత దానిని తీసుకొననివానికి పంద్రెండుపణముల దండము ; దోషము, ఉపనిపాతము, అవిషహ్య విషయములలో దండము లేదు. 10. కొనినవాటిని రద్దుచేయుటలో నియమములు అమ్మినవాటిని రద్దుచేయు నియమములవంటివే.

11. వివాహముల విషయములో మొదటి మూడువర్ణములవారు పాణి

[1] క్రయవిక్రయములరద్దుచేయుట.

[2] చేపలు, మాంసము, ఆకుకూరలు మొదలైనవి.

గ్రహణ సమయమువరకును, శూద్రులు పునస్సంధానమువరకును రద్దుచేయవచ్చును. 12. పాణిగ్రహణముతర్వాతకూడ శయనమునకు[3] సంబంధించిన దోషము కనిపించినయెడల రద్దుచేయవచ్చును. 13. సంతానము కలిగినతర్వాత ఏసందర్భములలోకూడ రద్దుచేయురాదు.

14. శయనమునకు సంబంధించినలోపమును తెలియపరుపక కన్యాదానముచేసినవానికి తొంబై ఆరుపణములదండము ; అతడు శుల్క స్త్రీధనములను కూడ ఇచ్చివేయవలెను. 15. వరునిలోని దోషమునుచెప్పక వివాహమాడువానికి రెండింతల దండము ; దీనితోపాటు శుల్క స్త్రీధనముల నష్టము.

16. ద్విపాత్తులయు చతుష్పాత్తులయు విషయములో మందములు వ్యాధితములు అశుద్ధములు అగువాటిని ఉత్సాహవంతములు ఆరోగ్యవంతములు శుద్ధములు అని చెప్పి అమ్మినవానికి పన్నెండుపణములదండము. 17. అమ్మకమును రద్దుచేయుటకు చతుష్పాత్తుల విషయములో మూడుపక్షములు ; మనుష్యుల విషయములో ఒక సంవత్సరము. 18. ఏలయన, అప్పటికిగాని గుణదోషములు తెలియరావు.

19. (శ్లో) దాతగాని ప్రతిగ్రహీతగాని నష్టపడకుండునట్లు సభాసదులు[4] దానములను క్రయవిక్రయములను రద్దుచేయుటకు సమ్మతించవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు విక్రీతక్రీతానుశయము అనే పదిహేనో అధ్యాయము.

[3] నపుంసకత్వము, పరపురుషునితో సంగమము మొదలైనవి.

[4] తక్కిన వివాదములలో సభాసదులతో సంప్రదించవలసిన అవసరములేదు.

# మూడో అధికరణము

## అధ్యాయము 16

### ప్రకరణము 68 : దత్తస్యానపాకర్మ[1]

### ప్రకరణము 69 : అస్వామివిక్రయము[2]

### ప్రకరణము 70 : స్వస్వామిసంబంధము[3]

1. దానములను వశపరచకపోవు విషయమును[4] ఋణాదానమునుండి తెలుసుకోవలెను.

2. వ్యవహారయోగ్యముకాని దానము ఏకత్ర రద్దయినట్లుగనే భావింపబడవలెను.

3. తనసర్వస్వమును, దారపుత్రులను, తన్నును దానముచేయునట్లుచెప్పి రద్దుచేసినయెడల ధర్మస్థులు దానికి సమ్మతించవలెను. 4. అసాధువులకుగాని, అధర్మకార్యములకుగాని చేసిన ధర్మదానమును, ఉపకారముచేయనివారికిని, అపకారముచేయువారికిని చేసిన అర్థదానమును, అనర్హులగువారికిచేసిన కామదానమును (ధర్మస్థుడు) రద్దుచేయవలెను.[5]

5. దాతయు ప్రతిగ్రహీతయు నష్టపడకుండునట్లు కుశలులు[6] రద్దువిషయమును నిర్ణయించవలెను.

6. దండభయమువలనగాని, ఆక్రోశభయమువలనగాని, అనర్థభయము

---

[1] ఇచ్చినదానమును చెల్లింపకపోవుట.

[2] తనదికానివస్తువును విక్రయించుట.

[3] సొంతమును గురించిన విషయము.

[4] చేసినదానము ఋణమువంటిదే.

[5] ధర్మార్థకామములకు సంబంధించని దానములు.

[6] ధర్మస్థులు స్వతంత్రముగగాక కుశలుల అభిప్రాయము ననుసరించి తీర్పు చెప్పలెను.

వలనగాని చేసినదానమును ప్రతిగ్రహించువానికిని చేయువానికిని స్తేయదండము. 7. ఇతరుని హింసించుటకై కోపముతో చేసినదానము, రాజులగర్వమునకు మించినగర్వముతో చేసినదానము ఇట్టిదే. 8. వీటివిషయములో ఉత్తమసాహస దండము.

9. అస్తికివారసుడైన కుమారుడుగాని, దాయాదులుగాని ఇష్టములేనియెడల జామీను బాధ్యతను వహించవలసినది లేదు. దండశేషమునుగాని, శుల్కశేష మునుగాని, జూదమునకు త్రాగుడుకు చేయబడినఋణమునుగాని, కామదానమును కాని చెల్లించవలసినదిలేదు.

ఇది దత్తస్యానపాకర్మ

10. అస్వామివిక్రయము : పోగొట్టుకొనినవస్తువుగాని అపహరించినది గాని దొరకినపుడు సొంతదారుడు దానిని ధర్మస్థుడు వశముచేసుకొనవలసినదిగ కోరవలెను. 11. లేదా, దేశకాలములు కారణముగ ప్రమాదముజరుగునని తోచి నప్పుడు తానే దానినివశపరుచుకొని ధర్మస్థునివద్దకు తేవలెను. 12. ధర్మస్థుడు వానిని "ఇది నీ కెక్కడ లభించినది," అనిఅడుగవలెను. 13. అతడు సక్రమ ముగకొన్నట్లు రుజువుచేసినను విక్రయించినవానిని చూపలేనప్పుడు వస్తు వునుతీసుకొని అతనిని వదలివేయవలెను. 14. విక్రయించినవాడు దొరకినపుడు అతడు కొన్నవానికి కొన్నఖరీదునుఇచ్చి స్తేయదంతమునుకూడ చెల్లించవలెను. 15. తాను అపరాధములేదని రుజువుచేసి తప్పించుకొనుటకు వీలున్నప్పుడు ఉపాయములన్నింటిని ప్రయోగించి తప్పించుకొనవచ్చును. 16. ఉపాయములు సార్థకములుకానప్పుడు అతడు ఖరీదును స్తేయదండమును చెల్లించవలెను.

17. పోయినవస్తువుదొరకినపుడు పోగొట్టుకొన్నవాడు అది తనదని రుజువుచేసి దానిని తీసుకొనవలెను. 18. సాక్ష్యము తీసుకొనిరానప్పుడు అయిదో వంతుదండము చెల్లించవలెను. 19. అప్పు డావస్తువు రాజునకు చెందును.

20. ధర్మస్థునికి తెలియపరుపక నష్టాపహృతమును సొంతదారుడు వశ పరుచుకొనినప్పుడు పూర్వసాహసదండము (చెల్లించవలెను).

21. నష్టాపహృతములు దొరికినపుడు వాటిని శుల్కస్థానములో పెట్టవలెను. 22. మూడు పక్షములవరకు సొంతదారు డెవడో తెలియని పక్షమున వాటిని రాజు వశపరుచుకొనవచ్చును; లేదా, తగిన సాక్ష్యమును తెచ్చి సొంతదారుడు వాటిని తీసుకొనవచ్చును. 23. ద్విపాత్తులకు అయిదు పణములు, ఒక గిట్టగల జంతువు లకు నాలుగు పణములు, గోమహిషములకు రెండు పణములు, క్షుద్రపశువులకు పాతిక పణము నిష్క్రయము నిచ్చుకొనవలెను. 24. రత్నములకు సారఫల్గు కుప్యములకు నూటికి అయిదు చొప్పున (నిష్క్రయము) ఇచ్చుకొనవలెను.

25. శత్రుసేనలుగాని ఆటవికులుగాని దోచుకొనినవాటిని రాజు రాబట్టి

సొంతదారులకు చేర్చవలెను. 26. చోరులు అపహరించిన వస్తువులు కనిపించ నపుడుగాని వాటిని రాబట్టలేనప్పుడుగాని రాజు తన ద్రవ్యములనుండి సొంతదారు లకు ముదరా ఇయ్యవలెను. 27. (రాజవల్లభులు మొదలైనవారు) వశపరచు కొనినవాటిని రాబట్టి సొంతదారులకు ఇచ్చివేయవలెను ; లేదా, నష్టపరిహారము నియ్యవలెను.

28. శత్రుదేశమునుండి పరాక్రమమును ప్రదర్శించి తెచ్చినవాటిలో ఆర్యులు దేవబ్రాహ్మణతపస్వుల ద్రవ్యములు తప్ప తక్కినవాటిని రాజాజ్ఞానుసారము అనుభవించవచ్చును.

ఇది అస్వామివిక్రయము

29. స్వస్వామిసంబంధము : సొంతమని రుజువుచేయుటకు సాక్ష్యము[7] నష్టమైనప్పుడు దీర్ఘకాలానుభవమే సాక్ష్యము. ఒకని అధీనమందుండు వస్తువులపై దీనినిబట్టియే స్వామ్యమును నిర్ణయించవలెను.

30. తన ఆస్తిని ఇతరులు అనుభవించుచుండినను పది సంవత్సరముల కాలము ఉపేక్షించినయెడల దానిపై ఆస్తిహక్కు రద్దగును ; కాని, ఇది (మైనర్లగు) బాలురు, వృద్ధులు, వ్యాధితులు, ఆపదలలో చిక్కుకొన్నవారు, ప్రోషితులు, దేశత్యాగము చేసినవారు, అరాజకమునకు గురియైనవారు—వీరి విషయములో వర్తించదు.

31. ఇరవై సంవత్సరముల కాలము స్వాధీనములోలేని స్థిరాస్తి విషయమై హక్కు ఉన్నట్లు చెప్పరాదు.

32. రాజులులేని కాలములో[8] ఇతరుల ఇండ్లయందు నివసించు జ్ఞాతులకు, శ్రోత్రియబ్రాహ్మణులకు, పాషండులకు అనుభవమునుబట్టి (ఇండ్లపై) ఆస్తి హక్కు సంక్రమించదు ; ఉపనిధులు, తాకట్టులు, నిధులు, నిక్షేపములు, స్త్రీలు, (స్థిరాస్తి) హద్దులు, రాజద్రవ్యము, శ్రోత్రియుల ద్రవ్యము—వీటి విషయము కూడ ఇట్టిదే.

33. ఆశ్రమవాసులు, పాషండులు ఒకరినొకరు బాధించుకొనక పెద్దదియగు ఒకే ప్రదేశమందు నివాసము చేయవచ్చును. 34. అల్పమగు బాధలను వారు సహించవలెను. 35. ముందువచ్చినవారు వెనుకవచ్చినవారికి (వంతులువారిగ) అవకాశమియ్యవలెను. 36. అవకాశమియ్యనివానిని తొలగించవచ్చును.

37. వానప్రస్థుల యతుల బ్రహ్మచారుల ఆస్తికి క్రమముగ ఆచార్యులు, శిష్యులు, ధర్మభ్రాత, సహవాసి హక్కుదార్లు.

38. వీరిమధ్య వివాదములు సంభవించి వాదమును కోల్పోయినవారు

---

7 సాక్ష్యమను మాటకు మూలమందు "దేశ" అను మాట ఉపయోగింపబడియున్నది.

8 అరాజకపరిస్థితులలో అని కొందరు వ్యాఖ్యాతలు.

దండముగ ఎన్నిపణములు చెల్లించవలెనో అన్నిరోజులు ఉపవాసము, అభిషేకము, అగ్నికార్యము, రాజునకై మహాకచ్ఛవ్రతము మొదలగువాటిని చేయవలెను. 39. పాషండులు హిరణ్య సువర్ణములు లేనివారు. 40. వారు వారివారి మతాచారముల ప్రకారము ఉపవాసవ్రతములను చేయవలెను; కాని, పారుష్యము, దొంగతనము, సాహసము, వ్యభిచారము మొదలైన నేరముల విషయమున ఇది కూడదు. 41. వీటి విషయమున యథోక్తదండములను చెల్లించవలెను.

42. (శ్లో) దురాచారములకు పాల్పడిన ప్రవ్రజితులను రాజు దండించి వారించవలెను. ఏలయన, అధర్మమునకు లొంగిపోయిన ధర్మము ఉపేక్షింపబడిన యెడల శాసనకర్తయగు రాజును నాశముచేయును.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దత్తస్యానపాకర్మ, అస్వామి విక్రయము, స్వస్వామిసంబంధము అనే పదహారో అధ్యాయము.

# మూడో అధికరణము

## అధ్యాయము 17

### ప్రకరణము 71 : సాహసము

1. (సొంతదారుని) సమక్షముననే బలప్రయోగముచేసి (వాని వస్తువులను) వశపరచుకొనుట సాహసము. 2. అతడు లేనప్పుడు వశపరచుకొనుటయు, వశపరచుకొనినట్లు ఒప్పుకొనకపోవుటయు దొంగతనము.

3. "రత్నముల, సారముల, ఫల్గువుల, కుప్యముల విషయమున సాహసమునకు వాటి మూల్యముతో సమానమగు దండము," అని మానవులు. 4. "మూల్యమునకు రెండింతలు," అని ఔశనసులు. 5. "అపరాధమునకు అనుగుణముగ," అని కౌటిల్యుడు.

6. పువ్వులు, పండ్లు, కాయగూరలు, కందలు, మూలములు, పక్వాన్నము, చర్మములు, వెదుళ్ళు, మట్టికుండలు— వీటి విషయమున దండము పన్రెండు పణములకు తగ్గక, ఇరవైనాలుగు పణములకు మించక ఉండవలెను. 7. ఇనుము, కాష్ఠము త్రాళ్ళు, క్షుద్రజంతువులు, వస్త్రములు, స్థూలద్రవ్యములు—ఇట్టివాని విషయమున దండము ఇరవైనాలుగు పణములకు తగ్గక, నలభైఎనిమిది పణములకు మించక ఉండవలెను. 8. రాగి, ఉక్కు, కంచు, గాజు, దంతములు అనువానితో చేయబడిన వస్తువుల విషయముననను, స్థూలములగు ఇతర ద్రవ్యముల విషయముననను దండము నలభైఎనిమిది పణములకు తగ్గక, తొంభైఆరు పణములకు మించక ఉండవలెను ; ఇదియే పూర్వసాహసదండము. 9. భారీపశువులు, మనుష్యులు, పొలములు, ఇండ్లు, హిరణ్యము, సువర్ణము, సన్నని వస్త్రములు, స్థూలికద్రవ్యములు—వీటి విషయమున దండము రెండువందల పణములకు తగ్గక, అయిదు వందల పణములకు మించక ఉండవలెను. ఇదియే మధ్యమసాహసదండము. 10. స్త్రీనిగాని పురుషునిగాని బలప్రయోగముచేసి బంధించువానికి, బంధింపజేయువానికి, బంధమునుండి విడిపించువానికి విడిపింపజేయువానికి దండము అయిదు

వందల పణములకు తగ్గక వేయి పణములకు మించక ఉండవలెను; ఇదియే ఉత్తమసాహసదండము," అని ఆచార్యులు.

11. "బాధ్యతనంతను నేను వహించెదను," అని చెప్పి మరియొకనిచేత బలప్రయోగముచేయించువానికి రెండింతల దండము. 12. "నీకు కావలసినంత హిరణ్యమును ఇచ్చెదనని చెప్పి" చేయించువానికి నాలుగింతల దండము. 13. "నేను ఇంత హిరణ్యము నిచ్చెదను," అని మొత్తమును తానే నిర్ణయించి చేయించువాడు పై దండమునే కాక ఇంతటి ధనమును కూడ చెల్లించవలెను. 14. "అతడు కోపమదమోహములకు లోబడి ఇట్లు చేసినట్లు చెప్పినయెడల యథోక్తమగు దండము (మాత్రమే)," అని కౌటిల్యుడు.

15. (శ్లో) దండములన్నిటి విషయములో నూటికి ఎనిమిది చొప్పున రూపమను పన్ను, నూటికి మించిన దండముల విషయములో దీనితోపాటు నూటికి అయిదు పణములు వ్యాజియు ఉన్నట్లు తెలుసుకొనవలెను.

16. (శ్లో) ప్రజలు చేయు అపరాధములు బహుళములగుటచేతను, రాజుల భావములో కూడ దోషముండుటచేతను ధర్మిష్ఠములుకాని రూపవ్యాజి అను పన్ను లుండును; కాని, ప్రకృతిసిద్ధమైన దండము మాత్రమే ధర్మమైనట్టిది.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు సాహసము అనే పదిహేడో అధ్యాయము.

# మూడో అధికరణము

## అధ్యాయము 18

### ప్రకరణము 72 : వాక్పారుష్యము

1. వాక్పారుష్యము[1] ఉపవాదము, కుత్సనము, అభిభర్త్సనము అనిమూడు విధములు.

2. ఉపవాదము శరీరము, యోగ్యత, చదువు, వృత్తి, జనపదములకు సంబంధించి ఉండవచ్చును. శరీరమునకు సంబంధించి ఒకనిని ఏకాక్షఅని, కుంటిఅని, పలికినయెడల ఈలోపములు సత్యములైనప్పుడు దండము మూడు పణములు ; సత్యములు కానప్పుడు దండము అరుపణములు.

3. గ్రుడ్డివారిని కుంటివారిని నిందాస్తుతిగ "సొగసైన కన్నులుకలవాడా," అని పిలుచువానికి దండము పండ్రెండుపణములు.

4. కుష్ఠురోగులు, ఉన్మాదులు, నపుంసకులు అని సమానులను హేళన చేసినప్పుడు వారు నిజముగ ఇట్టివారైనపుడు పండ్రెండు పణములు ; కానప్పుడు ఇరవైనాలుగుపణములు, నిందాస్తుతివిషయమున ముప్పైఆరుపణములు దండము.

5. అధికుల విషయమున దీనికి రెండింతలు. హీనులవిషయమున సగము దండము ; పరస్త్రీల విషయమున రెండింతలు ; ప్రమాదమునకు మదమునకు మోహమునకు లోబడి ఇట్లుచేసినప్పుడు అర్ధదండము.

6. కుష్ఠురోగులు, ఉన్మాదులు—నిజముగ ఇట్టివారగుదురా కారా అను విషయములో—వైద్యులు, సన్నిహితులు ప్రమాణము ; నపుంసకత్వ విషయమున స్త్రీలు, మూత్రములో నురుగు, పురీషము నీటిలో మునిగిపోవుట ప్రమాణములు.

7. యోగ్యతను గురించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర చండాలురలో ముందుచెప్పినవారిని తర్వాత చెప్పినవారు నిందించినయెడల దండము మూడుపణ

[1] పరుషములగు మాటలమూలమున పరువునష్టము కలిగించుట.

ములతో ప్రారంభమై మూడేసి పణములచొప్పున వృద్ధికావలెను; తర్వాత చెప్పిన వారు ముందుచెప్పినవారిని నిందించినయెడల రెండేసిపణములచొప్పున రెండు పణములవరకు తగ్గవలెను. "కుబ్రాహ్మణుడు" మొదలైన నిందల విషయమున కూడ యింతే.

8. దీనినిబట్టి వాగ్జీవనుల చదువునుగురించి, కారు కుశీలవుల వృత్తినిగురించి, ప్రాజ్జూణదేశ గాంధారదేశములవారి జన్మభూమిని గురించి నిందావాక్యములకు దండమును తెలుసుకొనవలెను.

9. ఒకడు ఇంకొకనిని, "నిన్ను ఈలాగుచేసెదను," అని బెదరించినప్పుడు ఆవిధముగచేయకపోయినను చేసినప్పుడు చెల్లించవలసిన దండములో సగమును చెల్లించవలెను. 10. అట్లు చేయుటకు శక్తిలేనివాడును కోపమదమోహములవలన బెదరించినవాడును, పన్రెండుపణములదండము చెల్లించవలెను. 11. వైరి భావముకలవాడై అపకారముచేయగలవాడు యావజ్జీవము జామీను ఇయ్యవలెను.

12. (శ్లో) తనదేశమును గ్రామమును నిందించినవాడు పూర్వసాహస దండమును, తనజాతిని సంఘమును నిందించినవాడు మధ్యమసాహసదండమును దైవములను చైత్యములను నిందించువాడు ఉత్తమసాహసదండమును చెల్లించ వలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు వాక్పారుష్యమనే పద్దెని మిదో అధ్యాయము.

# మూడో అధికరణము

## అధ్యాయము 19

### ప్రకరణము 73 : దండపారుష్యము

1. స్పర్శనము, అవగూర్ణము,[1] ప్రహతము,[2] అని దండపారుష్యము మూడువిధములు.

2. ఒకడు ఇంకొకని బొడ్డుక్రింది శరీరభాగమును చేతితోగాని, బురదతో గాని, బూడిదతోగాని, దుమ్ముతోగాని తాకినయెడల దండము మూడుపణములు ; వీటితో మలినము కలిపిగాని, పాదముతోగాని, ఉమ్మితోగాని తాకినయెడల దండము ఆరుపణములు ; వమనముతోను, మూత్రపురీషములతోను తాకినయెడల దండము పండ్రెండుపణములు. 3. బొడ్డునకు పైభాగమును తాకినయెడల దండము రెండింతలు. నములను తలపై తాకినయెడల దండము నాలుగింతలు. 4. అధికులను తాకినయెడల రెండింతలు ; హీనులను తాకినయెడల సగము దండము ; పరస్త్రీలను తాకినయెడల రెండింతలు ; ప్రమాద మద మోహములు కారణముగ ఇట్లుచేసినయెడల సగము దండము.

5. ఒకడు ఇంకొకని పాదములను, వస్త్రమును, చేతిని, వెంద్రుకలను పట్టుకొనిన యెడల దండము ఆరుపణములతో ప్రారంభమై ఆరేసిపణముల చొప్పున వరుసగవృద్ధికావలెను.

6. అణచుట, చేతులతో పట్టుకొని నలుపుట, వంచుట, లాగుట, (ఒకనిపై) కూర్చుండుట—వీటికి పూర్వసాహసదండము. 7. క్రిందపడవేసి పారిపోయిన యెడల సగము దండము.

8. శూద్రుడు ఏ అంగముతో బ్రాహ్మణుని కొట్టునో ఆ అంగమును (ధర్మస్థుడు) ఛేదింపజేయవలెను. 9. బెదరించిన పక్షమున నిష్క్రయము

---

[1] కొట్టెదనని బెదరించుట.

[2] కొట్టుట.

విచ్చుకొనవచ్చును ; స్పర్శనమునకు సగము దండము. **10.** దీనినిబట్టి చండాలురు మొదలైన అశుచుల విషయమును తెలుసుకొనవలెను.

**11.** చేతితో అపగూర్ణమునకు మూడుపణములుతగ్గక పం|డెండుపణము లకు మించక దండమును విధించవలెను ; పాదముతో అవగూర్ణమునకు రెండింతల దండము ; బాధనుకలిగించు వస్తువుతో అవగూర్ణమునకు పూర్వసాహస దండము ; మరణమును కలిగించు వస్తువుతో అవగూర్ణమునకు మధ్యమసాహస దండము,

**12.** కట్టె, మట్టిపెళ్ళ, రాయి, లోహము, కఱ్ఱ, త్రాడు—వీటిలో దేనితొనైనను నెత్తురురానట్లు కొట్టినయెడల దండము ఇరువైనాలుగుపణములు ; నెత్తురు కారునట్లుకొట్టినయెడల దండము రెండింతలు ; నెత్తురు దుష్టమైనయెడల ఇట్లు దండములేదు. **13.** నెత్తురు రాకుండ చచ్చువరకు కొట్టుట, చేతులఎముకలు గాని కాళ్ళఎముకలుగాని కదలిపోవునట్లు కొట్టుట, చేతులను పాదములను పండ్లను విరుగగొట్టుట, చెవినిగాని ముక్కునుగాని కోసివేయుట, వ్రణములను పగులునట్లుచేయుట—వీటికి పూర్వసాహస దండము ; వ్రణము దుష్టమైనప్పుడు దండము లేదు. **14.** తొడనుగాని మెడనుగాని విరుచుట, కంటిని పొడుచుట, మాటలాడుశక్తికి, కదిలేశక్తికి, తినేశక్తికి అటంకము కలిగించుట—వీటికి మధ్యమసాహసదండమును చెల్లించి, చికిత్సకు కావలసిన ఖర్చులను భరించవలెను. **15.** మరణము సంభవించినప్పుడు అపరాధునివలె న్యాయాధీశుని విచారణకు తీసుకొనిపోవలెను.

**16.** అనేకులుకలిసి ఒకనిని కొట్టినప్పుడు వారిలో ఒక్కొక్కరు రెండింతల దండము నిచ్చుకొనవలెను.

**17.** "దీర్ఘకాలమునాటి కలహముగాని నేరముచేయు ఉద్దేశముతో లోపలికి ప్రవేశించుటగాని దావాకు కారణము కాకూడదు," అని అచార్యులు. **18.** "అపకారముచేసినవానిని విడిచిపెట్టరాదు," అని కౌటిల్యుడు.

**19.** "కలహముసంభవించినప్పుడు న్యాయస్థానమునకు ఎవడు ముందుగ వచ్చునో వానికే గెలుపు. ఏలయన, బాధను భరించలేనివాడే పరుగెత్తివచ్చును," అని ఆచార్యులు, **20.** "ఇదికూడదు," అని కౌటిల్యుడు. **21.** ఒకడు ముందుగ వచ్చినను తర్వాత వచ్చినను సాక్షులనుబట్టియే వివాదము పరిష్కారము కావలెను ; సాక్షులు లేనప్పుడు గాయమునుబట్టిగాని కలహమునకు సంబంధించిన గుర్తులను బట్టిగాని పరిష్కారము జరుగవలెను.

**22.** అభియోగముతేబడినపుడు వెంటనే జవాబుచెప్పని ప్రతివాదికి ఆరోజుననే శిక్షవిధించవలెను.

**23.** కలహములో ఒకనివస్తువును అపహరించినందుకు దండము పది

పణములు ; క్షుద్రవస్తువును నాశముచేసినందుకు దండమునేగాక దానికి సమాన మగు మొత్తమును ; స్థూలద్రవ్యమును నాశముచేసినందుకు దండముతోపాటు రెండింతల మొత్తమును ; వస్త్రములను ఆభరణములను హిరణ్యమును సువర్ణ వస్తువులను నాశముచేసినందుకు దండముతోపాటు పూర్వసాహస దండమును చెల్లించవలెను.

24. ఇంకొకని ఇంటిగోడను కొట్టి కదలించినయెడల దండము మూడు పణములు ; ఛేదించినను భేదించినను ఆరుపణముల దండమును మరమ్మత్తుఖర్చు లను ఇచ్చుకొనవలెను. 25. ఇంకొకని ఇంటిలోనికి బాధనుకలిగించు వస్తువు లను పడవేసినయెడల దండము పండ్రెండుపణములు ; మరణమును కలిగించు వస్తువులను పడవేసినయెడల పూర్వసాహసదండము.

26. కట్టెలు మొదలైనవాటితో క్షుద్రపశువులకు బాధనుకలిగించినప్పుడు దండము ఒకటిరెండు పణములు ; నెత్తురుకారునట్లు గాయపరచినప్పుడు దండము రెండింతలు. 27. భారీపశువుల విషయమున ఇట్టి నేరములకు రెండింతల దండ మును చెల్లించి వైద్యఖర్చులనుకూడ భరించవలెను.

28. నగరములోని ఉద్యానములందుండు పుష్పములను ఫలములను నీడను ఇచ్చు చెట్లరెమ్మలను కొట్టివేయువానికి దండము ఆరుపణములు ; సన్నని కొమ్మలను కొట్టివేయువానికి దండము పండ్రెండుపణములు ; లావుకొమ్మలను కొట్టివేయువానికి దండము ఇరువైనాలుగుపణములు ; బోదెలకు నష్టముకలిగించు వానికి పూర్వసాహసదండము ; చెట్టునుపడగొట్టినవానికి మధ్యమసాహసదండము. 29. పుష్పములను ఫలములను నీడను ఇచ్చుపొదలు లతల విషయమున సగము దండము ; పుణ్యస్థానములందు, తపోవనములందు, శ్మశానములందు ఉండుచెట్ల విషయమునగూడ సగము దండము.

30. (శ్లో) సరిహద్దులలోను, చైత్యములందును ఉన్న వృక్షముల విష యమునను, ప్రాధాన్యముగాంచిన వృక్షముల విషయమునను, రాజవనములలోని వృక్షముల విషయమునను రెండింతల దండమును చెల్లించవలెను.

ఇది ధర్మస్థీయమను మూడో అధికరణమందు దండపారుష్యమనే పందొమ్మిదో అధ్యాయము.

## మూడో అధికరణము

### అధ్యాయము 20

### ప్రకరణము 74 : ద్యూతసమాహ్వయము[1]

### ప్రకరణము 75 : ప్రకీర్ణకము

1. ద్యూతాధ్యక్షుడు ద్యూతమంతయు ఒకేప్రదేశమున జరుగునట్లు చేయవలెను. 2. రహస్య వృత్తులను అనుసరించువారెవరో తెలుసుకొనుటకై ఇతర ప్రదేశములలో జూదమాడువారికి పండ్రెండుపణముల దండము విధించవలెను.

3. "జూదమునకు సంబంధించిన వివాదములన్నిటిలో గెలిచినవానికి పూర్వసాహసదండము ; ఓడినవానికి మధ్యమసాహసదండము విధించవలెను. 4. ఏలయన, వీడు (ఓడినవాడు) జ్ఞానహీనుడై ఏలాగుననైన గెలువగోరువాడు, అందుచేత నష్టమును భరింపజాలనివాడు," అని ఆచార్యులు. 5. "ఇట్లుచేయరాదు," అని కౌటిల్యుడు. 6. ఏలయన, ఓడినవానిపై రెండింతల దండమును విధించిన పక్షమున న్యాయమునకై ఎవరుకూడ రాజువద్దకు రాజాలరు. 7. ప్రాయశముగ జూదగాండ్రందరు మోసములోనికి దిగువారేగదా !

8. ద్యూతశాలల యజమానులు జూదగాండ్రకు శుద్ధమైనగవ్వలను పాచికలను సర్ఫరాచేయవలెను. 9. అట్టివికాని గవ్వలను పాచికలను సర్ఫరాచేయు వారికి దండము పండ్రెండుపణములు ; కూటద్యూతము చేయువాడు పూర్వసాహస దండమును చెల్లించి గెలుపొందినధనమును ఇచ్చివేయవలెను. మోసముచేసిన వానికి దీనితోపాటు స్తేయదండముకూడ విధించవలెను.

10. ద్యూతశాలయజమాని గెలిచినధనములో నూటికి అయిదును, గవ్వ

[1] జూదము జూదమని సమాహ్వయమని రెండువిధములు. సమాహ్వయ మనగా పందెము వేసి సవాలుచేయుట అనియు ; కోళ్ళు పొట్టేళ్ళు మొదలగు సజీవములసాధనమున జరుగు పందెములనియు కొందరు వ్యాఖ్యాతలు.

లకు పాచికలకు, తోలుసంచులకు, దంతశలాకలకు అద్దెయు, నీటికి నేలకు ద్యూత కర్మకు ఖర్చులను తీసుకొనవలెను. 11. ద్రవ్యములతాకట్టును విక్రయమును జాగ్రత్తగ చూచుకొనవలెను. 12. పాచికలకు నేలకు చేతులకు సంబంధించిన దోషములను నివారించనియెడల దండము రెండింతలు.

13. దీనినిబట్టి విద్యకును శిల్పమునకును సంబంధించిన సవాళ్ళను తప్ప తక్కిన సవాళ్ళను తెలుసుకొనవలెను.

14. ప్రకీర్ణకముల విషయము: అరువుగ తీసుకొనినదానిని, అద్దెకు తీసు కొనినదానిని, తాకట్టుపెట్టినదానిని, స్వాధీనపరచినదానిని, ఒప్పుకొనిన దేశకాలాను సారముగ తిరిగిఇచ్చివేయనందుకు ; రాత్రియామమునుబట్టిగాని, పగలుఛాయను బట్టిగాని, సమావేశమునకును కలసిఉండుటకును ఏర్పరచుకొనిన దేశకాలములను అతిక్రమించినందుకు ; బ్రాహ్మణునివద్దనుండి శుల్కమును బల్లకట్టురుసుమును వసూలుచేసినందుకు ; పొరుగింటివారిలో పెత్తనదారులను వారితర్వాతివారిని కాదని మరియొకరిని ఆహ్వానించినందుకు దండము పంద్రెండుపణములు.

15. ఇంకొకనికి అందజేయవలసినదిగ తనచేతికిచ్చినవస్తువును అంద జేయకపోయినందుకు, సోదరునిభార్యను ముట్టుకొనినందుకు, ఇతరుని అధీనమం దున్న వేశ్యను పొందినందుకు, పరుడు ఒప్పందముచేసుకొనిన వస్తువును కొని నందుకు, ముద్రవేసిన ఇంటిని తెరచినందుకు, ఇంటిపొరుగునందుండు నలభై కుటుంబములవారికి బాధకలిగించినందుకు దండము నలభై ఎనిమిదిపణములు.

16. కుటుంబనిక్షేపమును తీసుకొని తీసుకొనలేదని అబద్ధములాడినందుకు, స్వతంత్రముగ జీవించు విధవను చెరచినందుకు, ఆర్యస్త్రీని ముట్టుకొనిన చండాలు నకు, సమీపమందు ఆపదలోఉన్నవానిని రక్షించుటకు పరుగెత్తనందుకు, అకారణ ముగ పరుగెత్తువానికి, దేవపితృకార్యములలో శాక్యులకు, ఆజీవకులకు, వృషలు లగు ప్రవ్రాజితులకు[2] భోజనము పెట్టువానికి దండము నూరుపణములు.

17. శపథము తీసుకొనిన అనుమానాస్పదులగువారిని అధికారములేక ప్రశ్నలువేయువానికి, ఉద్యోగికాకుండ ఉద్యోగిపనులను చేయువానికి, క్షుద్రపశు వులలో పోతుల పుంస్త్వమును భగ్నముచేయువానికి, ఔషధమిచ్చి దాసీకి గర్భ పాతము గావించువానికి పూర్వసాహసదండము.

18. తండ్రి కుమారుడు, భర్త భార్య, సోదరుడు సోదరి, మేనమామ

---

[2] శాక్యులు బౌద్ధసన్యాసులు ; ఆజీవకులు జైది కేతరులగు సన్యాసులు ; కాని వీరు మౌర్య చక్రవర్తులకాలమందు గౌరవపాత్రులై అశోకుడు మున్నగు వారినుండి అనేకదానముల గ్రహించిరి. మౌర్యులతర్వాత వీరుప్రసిద్ధిని కోల్పోయిరి. కౌటిల్యుడు వీరినిపేర్కొనుటచేత నతడు మౌర్యులకాలము వాడని చెప్పదగియున్నది. వృషలులు పాషండులు పర్యాయపదములు. వైదికేతరులగు సన్యాసులందరికిని అన్వయించు పేర్లు.

మేనల్లుడు, గురువు శిష్యుడు—వీరితో పతితులు కానప్పుడు ఒకరు ఇంకొకరిని విడనాడినందుకు, సార్థవాహముతో కలిసివెళ్ళువారిద్దరిలో ఒకడు ఇంకొకనిని గ్రామమధ్యమున విడనాడినందుకు, పూర్వసాహసదండము ; అరణ్యములో విడ నాడినందుకు మధ్యమసాహసదండము ; అందుమూలమున వానికి హింసకలిగించి నందుకు ఉత్తమసాహసదండము ; సార్థముతోవెళ్ళు ఇతరులకు సగముదండము.

19. బంధింపకూడనివానిని బంధించువానికి బంధింపజేయువానికి, బంధితుని విడుదలచేయువానికి, అప్రాప్తవ్యవహారుడగు బాలుని బంధించువానికి బంధింప జేయువానికి దండము వేయిపణములు.

20. పురుషవిశేషమునుబట్టియు, అపరాధవిశేషమునుబట్టియు విశిష్టములగు దండములను విధించవలెను.

21. మతపీఠాధిపతి, తాపసుడు, వ్యాధితుడు, ఆకలిచేత దప్పిచేత ప్రయా ణముచేత అలిసిపోయినవాడు, దేశాంతరమందుండి వచ్చినవాడు, దండభారముచే క్రుంగినవాడు, దరిద్రుడు—వీరు అనుగ్రహించదగినవారు.

22. దేవతలు, బ్రాహ్మణులు, తాపసులు, స్త్రీలు, బాలురు, వృద్ధులు, వ్యాధితులు, అనాథలు—వీరు న్యాయస్థానమునకు రాకున్నను ధర్మస్థులు స్వయ ముగ వీరికార్యములను చక్కబెట్టవలెను ; దేశకాలాతీతములైనవనిగాని, అనుభ వములేదనిగాని వీరి వ్యవహారములను కొట్టివేయరాదు[3]

23. పురుషులు విద్య, బుద్ధి, పౌరుషము, ఉన్నతకులము, కార్యదక్షత అనువానినిబట్టి పూజ్యులగుచున్నారు.

24. (శ్లో) ఇట్లు ధర్మస్థులు మోసమునకు పాల్పడక, అందరియందు సమభావముకలవారై, విశ్వాసపాత్రులై, లోకప్రియులై వారివిధులను నిర్వ హించవలెను.

ఇది ధర్మస్థీయమను మూడోఅధికరణమందు ద్యూతసమాహ్వయము, ప్రకీర్ణకము అనే ఇరవైయో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు ధర్మస్థీయమను మూడోఅధికరణము సమాప్తము.

---

[3] ఎవడోఒకవాది తనంతటతాను ధర్మస్థుల యెదుట అభియోగము తెచ్చినప్పుడే వారు దానిని విచారించుట సాధారణవిధానము. కాని, దేవాలయములు, బ్రాహ్మణులు మొదలగువానికి సంబంధించిన వివాదములను ధర్మస్థులు అభియోగముతో అవసరములేక తామే జోక్యము కలిగించుకొని విచారణ చేయవచ్చును.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## నాలుగో అధికరణము

## కంటక శోధనము

### అధ్యాయము 1

### ప్రకరణము 76 : కారుక రక్షణము

1. ముగ్గురు అమాత్యుల హోదాగల ముగ్గురు ప్రదేష్టలు[1] కంటకశోధనము[2] చేయవలెను.

2. వస్తువులను నాణెముగ తయారుచేయగల కారువుల యజమానులు, నిక్షేపముల దాచుటయందు విశ్వాసపాత్రులు, సొంతపెట్టుబడితో పనిచేయు కారువులు[3] శ్రేణియొక్క పూచీతో నిక్షేపములను స్వీకరించవలెను. 3. కారువు మృతిచెందినయెడల నిక్షేపమునకు శ్రేణి బాధ్యతవహించవలెను.

4. వారు వారిపనిని నిర్దేశింపబడిన ప్రదేశమందు నిర్దేశింపబడిన కాలము నతిక్రమించక నిర్దేశింపబడిన విధమున పూర్తిచేయవలెను. పనియొక్క స్వభావమునుబట్టి (ఒక్కొక్కప్పుడు) దేశకాలములు నిర్దేశింపబడక ఉండవచ్చును.

---

[1] ప్రదేష్టలు ఈకాలపు మ్యాజిస్ట్రేట్ల వంటివారు. నేరముచేసినవా రెవరో తెలుసుకొని అట్టి వారిని శిక్షించుటకై నియమింపబడినవారు. రాజునకు చెల్లవలసిన రుసుములు మొదలగు వాటిని వసూలుచేయుటలో తోడ్పడుట కూడ వీరి విధి. వీరు సన్నిధాతకు లోబడి పనిచేయుచుండువారు.

[2] కంటకులనగా నేరముచేయువారు. సంఘములో ముళ్ళవంటివారు. దొంగలు, దోపిడిచేయువారు, హంతకులేగాక ప్రజలను మోసముచేయు చేతిపనివాండ్రు, కూలివాండ్రు, వర్తకులు మొదలైన వారుకూడ ఈవర్గములో చేరినవారు. ఇట్టివారిని గురించిన చర్యలు ఈ అధికరణమున వివరింపబడియున్నవి.

[3] కారువులనగా చేతిపనులను చేయువారు. సాలెవాండ్రు, కుట్టుపనివారు, కంసాలులు చాకళ్ళు—వీరందరు ఇట్టివారు.

5. కాలాతిక్రమణము జరిగినప్పుడు వేతనములో నాలుగోవంతు తగ్గించి దానికి రెండితల దండమును విధించవలెను. 6. తరుగుగాని అపత్తుగాని సంభవించినప్పుడు తప్ప నష్టవినష్టములన్నిటికి వారుబాధ్యులు. 7. నిర్దేశింపబడినదానికి భిన్నముగ పనిచేసినప్పుడు వారు వేతనమును వదలుకొని దానికి రెండింతల దండమును చెల్లించవలెను.

8. సాలెవాండ్రు నూలుతూకమును పదిపలములనుండి పదకొండుకు పెంచవలెను.[4] 9. ఈ పెంపకము తగ్గినయెడల తగ్గుదలకు రెండింతల దండము.

10. నేతకుకూలి నూలుఖరీదుకు సమానముగ ఉండవలెను; క్షౌమకౌశేయములనేతకు నూలుఖరీదుకు ఒకటిన్నరరెట్లు; పత్రోర్ణము, కంబళము, దుకూలము మున్నగువానికి రెండురెట్లు.

11. కొలతలో తగ్గినపుడు తగ్గుదలతో సమానముగ కూలినితగ్గించి దానికి రెండింతల దండమును విధించవలెను; తూకము తగ్గినపుడు దానికి నాలుగింతల దండము; నూలును మార్చినప్పుడు దాని మూల్యమునకు రెండింతల దండము. 12. దీనినుండి జంటనేతకు సంబంధించిన విషయములను తెలుసుకొనవలెను.

13. ఒకతులముఉన్నిని ఏకినప్పుడు అయిదుపలముల తరుగురావచ్చును. రోమములలోకూడ అంతేతరుగు.

14. చాకళ్ళు కర్రపలకలమీదగాని, నున్నని రాతిపలకలమీదగాని బట్టలను ఉతుకవలెను. 15. మరియొకవిధముగ ఉతికిన వారుబట్టలకు కలిగిన నష్టమును భరించి ఆరుపణముల దండమును చెల్లించవలెను.

16. ముద్గరము గుర్తుగాగల బట్టలను[5] తప్ప తక్కినవాటిని ధరించు చాకళ్ళు మూడుపణములదండము చెల్లించవలెను. 17. ఇతరులబట్టలను అమ్మినను, అద్దెకుఇచ్చినను, తాకట్టుపెట్టినను దండము పండ్రెండు పణములు; బట్టలను మార్చినయెడల ఖరీదుకు రెండింతల దండమును చెల్లించి అసలు బట్టను తెచ్చి ఇయ్యవలెను.

18. మొగ్గవలె తెల్లగ ఉండు బట్టను ఒక దినములోను, రాతిపలకమీద ఉతుకవలసినదానిని రెండు దినములలోను, శుభ్రముచేయబడిన నూలురంగుగల బట్టలను మూడు దినములలోను, తెలుపుచేయవలసినవాటిని నాలుగు దినములలోను ఉతికి తేవలెను. 19. లేతఎరుపురంగు వేయవలసిన బట్టను అయిదు రోజుల

---

[4] నూలుకు గంజిపెట్టుటచే తూకము అధికమగును.

[5] ఉతుకుటకు వేసిన బట్టలను కట్టుకొనుట చాకళ్ళకుమామూలు. ఇట్లుచేయుట నేరముగ ఆకాలమున పరిగణింపబడెను. వారు కట్టుకొనవలసిన బట్టలకు ముద్గరము గుర్తు ప్రత్యేకముగ ఏర్పరుపబడి యుండెను.

తర్వాతను, కుంకుమరంగు లక్కరంగు మంజిష్ఠపురంగు వేసి అతికష్టముతోను ఎక్కువ జాగ్రత్తగను ఉతుకవలసినవాటిని ఏడు రోజుల తర్వాతను ఇయ్యవలెను. 20. అంతకంటె ఆలస్యము చేసినయెడల కూలిని వదలుకొనవలెను. 21. రంగును గురించిన వివాదములను కుశలులు పరిష్కరించి కూలిని నిర్ణయించవలెను.

22. శ్రేష్ఠమగు బట్టలు ఉతుకుటకు ఒక పణము కూలి; మధ్యరకము వాటికి అర్థ పణము; తక్కువరకమువాటికి పాతిక పణము; ముదుగు బట్టలకు ఒకటో రెండో మాషకములు; రంగుబట్టలకు రెండింతలు.

23. మొదటి ఉతుకులో (మూల్యములో) నాలుగోవంతు నష్టము, రెండవ ఉతుకులో అయిదవవంతు నష్టము. 24. దీనినిబట్టి తర్వాతి ఉతుకులలోని నష్టమును ఊహించుకొనవలెను.

25. చాకళ్ళ నియమములనుండి కుట్టుపనివారి నియమములను తెలుసుకొనవలెను.

26. స్వర్ణకారులు అధికారులకు తెలియపరుపక అశుచులవద్దనుండి[6] వెండి బంగారములను ఉన్నవి ఉన్నట్లు[7] (యధారూపముగ) కొనినయెడల దండము పన్రెండు పణములు; మార్చిన రూపములో కొనినయెడల ఇరవైనాలుగు పణములు; దొంగలవద్దనుండి కొనినయెడల నలభైఎనిమిది పణములు. 27. రహస్యముగ తక్కువ ధరకు కొన్నప్పుడు రూపమును మార్చి కొన్నప్పుడు స్తేయ దండము; వస్తువులను తయారుచేయుటలో మోసము చేసినప్పుడు కూడ ఇదే దండము.

28. ఒక సువర్ణమునుండి ఒక మాషకమును అపహరించిన స్వర్ణకారునికి దండము రెండువందల పణములు; ఒక ధరణము వెండినుండి ఒక మాషకమును అపహరించినవానికి దండము పన్రెండు పణములు. 29. దీనినుండి ఎక్కువ మూల్యముగలవాటి అపహరణమును ఊహించుకొనవలెను.

30. కృత్రిమముగ వన్నెను వృద్ధిచేయువానికి, తీసివేయువానికి, కలితీ చేయువానికి దండము అయిదువందల పణములు. 31. ఈ రెండు లోహములకు సంబంధించిన మోసము వన్నెను తీసివేయు నేరమువంటిదిగ పరిగణించవలెను.

32. ఒక ధరణము వెండికి కూలి ఒక మాషకము; ఒక సువర్ణమునకు పణములో ఎనిమిదోవంతు. 33. శిల్పనైపుణ్యమునుబట్టి రెండింతల కూలిని ఇయ్యవచ్చును. 34. దీనినుండి తక్కిన కూలి విషయములను తెలుసుకొనవలెను.

---

[6] అశుచులనగా దొంగలు మొదలైనవారు.

[7] ఉన్నవి ఉన్నట్లనగా పాత్రలు, ఆభరణరూపములో ఉన్నట్టివి. వాటిని కరగించుకొనుట, మార్చినరూపములో కొనుట.

35. రాగి, ఉక్కు, కంచు, వైకృంతకము, ఇత్తడి—వీటికి నూరు పణము లకు అయిదు పణముల కూలి.

36. రాగికి పదోవంతు తరుగు. 37. దీనికి మించి ఒక పలమువరకు తరుగు కలిగినప్పుడు తరుగునకు రెండింతల దండము. 38. తక్కిన విషయములు దీనినుండి తెలుసుకొనవలెను. 39. సీసమునకుగాని తగరమునకుగాని తరుగు ఇరవైయోవంతు. 40. వీటిలో ఒక పలమునకు ఒక కాకణి కూలి. 41. ఇనుమునకు తరుగు అయిదోవంతు. 42. దానిలో ఒక పలమునకు రెండు కాకణుల కూలి. 43. తక్కిన విషయముల దీనినుండి తెలుసుకొనవలెను.

44. పణ నాణెములలో చెల్లవగినవానిని చెల్లవనియు, చెల్లకూడనివానిని చెల్లదగినవనియు శాసించు రూపదర్శకునికి[8] పం(డెండు పణములు దండము. 45. వ్యాజిని చెల్లించిన తర్వాత పణ నాణెము లన్నియు చెల్లుబడికావలెను. 46. ఒక పణమునకు ఒక మాషకము (లంచము) పుచ్చుకొనినవానికి పం(డెండు పణముల దండము. 47. తక్కిన విషయములు దీనినుండి తెలుసుకొనవలెను.

48. దొంగ నాణెములను తయారుచేయించువానికి, పరిగ్రహించువానికి, ప్రచారములోనికి తెచ్చువానికి దండము వేయి పణములు. వాటిని కోశములో చేర్చువానికి మరణశిక్ష.

49. భృత్యులు, ఊడ్చువారు తమకు దొరికిన సారవస్తువులలో (సువర్ణము మొదలైనవి) మూడోవంతు ఉంచుకొని రెండు వంతులను రాజున కియ్యవలెను. రత్నములను రాజున కియ్యవలెను. 50. రత్నమును దొంగిలించినవానికి ఉత్తమ సాహసదండము.

51. గనులు, రత్నములు, నిధులు—వీటిని కనుగొని తెలియపరచువారికి ఆరవవంతు నియ్యవలెను; రాజభృత్యులైనయెడల పం(డెండవవంతు నియ్యవలెను. 52. లక్ష పణములకు మించిన నిధి పూర్తిగ రాజునకు చెందవలెను. 53. అంతకు తగ్గినదానిలో ఆరవవంతు (తెలియపరచినవానికి) ఇయ్యవలెను. 54. శుచియగు జానపదుడు[9] తగిన సాక్ష్యమును చూపి తన పూర్వులు దాచిన నిధి నంతను తానే తీసుకొనవచ్చును. 55. సాక్ష్యము లేక తీసుకొనినవానికి అయిదువందల పణముల దండము; రహస్యముగ తీసుకొనినవానికి వేయి పణములు.

56. ప్రాణాపాయకరమగు రోగమును అధికారులకు తెలియపరుపక కుదుర్చుటకు ఒప్పుకొనిన వైద్యుడు రోగి చనిపోయినయెడల పూర్వసాహస దండమును, చికిత్సలోని లోపము మూలమున చనిపోయినయెడల మధ్యమసాహస దండమును చెల్లించవలెను. 57. ప్రధానావయవములకు భగ్నము కలిగించి

---

[8] రూపదర్శకుడు నాణెములపై అధికారమును వహించిన ఉద్యోగి.

[9] జానపదు డనగా స్వదేశమువాడు.

నప్పుడు, లేదా, రూపమునకు లోపము కలిగించినప్పుడు దండపారుష్యదండమును భరించవలెను.

58. వర్షాకాలమందు కుశీలవు లందరు ఒకే ప్రదేశమందు నివసించవలెను. 59. ఎవరివలనగాని మితిమీరిన కామదానమును ప్రశంసను వారు విసర్జించవలెను. 60. దీని నతిక్రమించినవారికి పండ్రెండు పణముల దండము. 61. ఇష్టానుసారము వారు దేశములను జాతులను గోత్రములను చరణములను స్త్రీ పురుషుల రహస్య విలాసములను పరిహసించి వినోదము కలిగించవచ్చును.

62. కుశీలవుల విషయములనుండి చారణులయు బిక్షుకులయు విషయములను ఊహించుకొనవలెను. 63. ధర్మస్థులు వారిపై ఎన్ని పణముల దండమును విధించెదరో, అన్ని దెబ్బలను ఇనుపబెత్తముతో కొట్టవలెను.

64. తక్కిన పనుల విషయములో వారు వారు ఉత్పత్తిచేసినదానినిబట్టి వేతనమును నిర్ణయించవలెను.

65. (శ్లో) ఈ విధముగ రాజు దేశమునకు పీడను కలిగించు వర్తకులు, కారువులు, కుశీలవులు, భిక్షుకులు, ఇంద్రజాలికులు మొదలగు దొంగలు అనుపేరు లేకున్నను దొంగిలించువారిని[10] నివారించవలెను.

ఇది కంటకశోధనము అను నాలుగో అధికరణమందు కారుకరక్షణము[11] అనే మొదటి అధ్యాయము.

---

[10] వీరికి దొంగలని పేరు ప్రచారములో లేదు ; కాని, వీరు నిజముగ దొంగలని కౌటిల్యుని అభిప్రాయము.

[11] కారుక రక్షణమనగా కారువులను రక్షించుటకాదు. కారువుల మూలముగ కలుగు నష్టమునుండి ప్రజలను రక్షించుట. పనివాండ్రు ఎట్టిపనిని చేయవలెనో నిర్ణయించుట మూలముననుు, వారికి లభించవలసిన వేతనమును నిర్ణయించుట మూలముననుు ఈ రక్షణ జరుగుచుండెను. కొంతవరకు ఇది ఈ కాలపు కార్మికశాసనావళిని పోలియున్నది.

## నాలుగో అధికరణము

### అధ్యాయము 2

### ప్రకరణము 77 : వైదేహక రక్షణము

1. సంస్థాధ్యక్షుడు[1] సొంతములని రుజువైన[2] పాతవస్తువుల తాకట్టును విక్రయమును పణ్యస్థానములో (మార్కెట్టులో) ఏర్పాటుచేయవలెను. 2. తులా మానములయందు (సాధారణముగ) మోసముజరుగును; కావున, అతడు వాటిని పరీక్షించవలెను.

3. పరిమాణి, ద్రోణములలో[3] అరపలము తగ్గినను హెచ్చినను దోషము కాదు. 4. పలము తగ్గినను హెచ్చినను పండ్రెండు పణముల దండము. 5. ఇంత కంటె పలము హెచ్చినప్పుడు తగ్గినప్పుడు విధించవలసిన దండమును దీనినుండి తెలుసుకొనవలెను. 6. ఒక తులములో[4] ఒక కర్షము తగ్గినను హెచ్చినను దోషము కాదు. 7. రెండుకర్షములు తగ్గినను హెచ్చినను దండము ఆరుపణములు. 8. అటు తర్వాత కర్షముచొప్పున హెచ్చుతగ్గుల విషయమును దీనినుండి తెలుసుకొన వలెను. 9. ఒక ఆఢకములో అర్ధకర్షము తగ్గినను హెచ్చినను దోషములేదు. 10. ఒకకర్షము తగ్గినను హెచ్చినను దండము మూడుపణములు. 11. అటు తర్వాత కర్షముచొప్పున హెచ్చుతగ్గుల విషయమును దీనినుండి తెలుసుకొన వలెను. 12. దీనినుండి తక్కిన తులామానముల హెచ్చుతగ్గులకు సంబంధించిన దండములను ఊహించుకొనవలెను.

---

[1] సంస్థాధ్యక్షుడనగా పణ్యసంస్థను పర్యవేక్షించు అధికారి. పణ్యసంస్థ అనగా బజారు; లేదా, మార్కెట్టు.

[2] సాధారణముగ పాతవస్తువులు దొంగిలించబడినవిగ ఉండును. అందుచేత వాటిలో సొంతములని రుజువైనవాటి విక్రయమే జరుగవలెనను నియమము.

[3] పరిమాణి, ద్రోణము—ఇవి రెండువందల పలముల తూచుత్రాసులు. (2–19–17.18,29)

[4] తులమనగా నూరుపలములు.

13. హెచ్చుతులామానములతోగాని తక్కువవానితోగాని అమ్ము వర్తకునికి వీటికి రెండింతలు దండము. 14. లెక్కపెట్టి అమ్ము వస్తువుల విషయములో మూల్యములో ఎనిమిదోవంతువరకు మోసముచేయువానికి తొంబైఆరుపణముల దండము.

15. తక్కువరకపుకట్టె, లోహములు, రత్నములు, త్రాళ్ళు, చర్మములు, మట్టి, నూలు, పట్టు, రోమములతో చేయబడిన వస్తువులను మేలు రకములని అమ్మినవర్తకునికి మూల్యమునకు ఎనిమిదిరెట్లు దండము. 16. సారహీనమగు వస్తువును సారవంతమనియు, ఒకజాతికి చెందినదానిని ఇంకొకజాతికి చెందిన దనియు, ఒకవస్తువునకు కృత్రిమమగు రంగువేసియు, అందులో ఏదియో ఒక మోసముచేసియు, ఒకవస్తువుమూతను మార్చియు, విక్రయించు వర్తకుడుగాని తాకట్టుపెట్టువర్తకుడుగాని స్వల్పమూల్యముగల వస్తువువిషయమున ఏభైనాలుగు పణములు, ఒకపణము విలువగలవాటి విషయమున దీనికి రెండురెట్లు, రెండుపణ ముల విలువగలవాటి విషయమున రెండువందలపణములు దండము నిచ్చుకొన వలెను. 17. విలువ ఇంతకంటె హెచ్చినప్పుడు ఇచ్చుకొనవలసిన దండము దీని నుండి ఊహించుకొనవలెను.

18. కారువులు, శిల్పులు కలిసి పనియొక్క నాణెమునకు లోపముకలిగించి నను, లాభము నధికముగావించినను, క్రయవిక్రయములకు అడ్డుపడినను వేయిపణ ములదండము చెల్లించవలెను.

19. ఇదేవిధముగ వర్తకులుకలిసి (బజారుకు రావలసిన) వస్తువులను రాకుండజేసినను, వాటిని అధికధరలకు అమ్మినను వేయిపణముల దండము చెల్లించవలెను.

20. తూనికలోగాని కొలతలోగాని ధరలోగాని వన్నెలోగాని వ్యత్యాస ముల విషయమున తూకమువేయువాడుగాని కొలగారిగాని హస్తలాఘవమూల మున ఒకపణము విలువగల వస్తువులో ఎనిమిదవవంతు వ్యత్యాసమును కలిగిం చినయెడల దండము రెండువందల పణములు. 21. దీనినుండి రెండేసివందల పణముల చొప్పున దండమును వృద్ధిచేయవలసిన సందర్భములు ఊహించుకొన వలెను. 22. ధాన్యములు నూనెలు క్షారములు లవణములు గంధములు ఔషధ ములు మొదలగు ద్రవ్యములతో సమవర్ణముగల వస్తువులను[5] కలిపిన యెడల దండము పండ్రెండు పణములు.

23. వర్తకుడు తనకు ప్రతిదినమువచ్చు మొత్తపుఆదాయమును లెక్కవేసి (పణ్యాధ్యక్షుని) అంగీకారముతో ఏజంట్లు[6] అనుభవించదగిన దినబత్తెమును

[5] బియ్యములో సన్ననితెల్లరాళ్ళు, చక్కెరలో తెల్లఇసుక—ఇట్టివి సమవర్ణముల కలయిక.

[6] ఏజంట్లు కమీషన్‌పుచ్చుకొని ఒకనితరఫున వ్యాపారము చేయువారు.

నిర్ణయించవలెను.

24. కొనువాడు అమ్మువాడు–వీరిమధ్య ఉండిపోయినది ఆదాయములో చేరదు.[7] అది ఆదాయమునకంటె భిన్నమైనది. 25. (పణ్యాధ్యక్షుడు) అనుమతించినపుడు ధాన్యములను పణ్యములను వారు కూడబెట్టవచ్చును. 26. మరియొక విధమున వారు కూడబెట్టినయెడల దానిని పణ్యాధ్యక్షుడు స్వాధీనపరుచుకొనవచ్చును. 27. ప్రజలు లాభము పొందునట్లు ధాన్యములను పణ్యములను విక్రయించుచు నతడు వ్యాపారము చేయవచ్చును.[8]

28. అతడు కొనుగోలు ధరను నిర్ణయించి స్వదేశవస్తువుల విషయమున నూటికి అయిదుచొప్పునను, పరదేశవస్తువులవిషయమున నూటికిపదిచొప్పునను లాభమువచ్చునట్లు అమ్ముటకు అనుమతించవలెను. 29. అంతకంటె ఎక్కువ ధరకు అమ్మినప్పుడుగాని, క్రయవిక్రయములలో ఎక్కువలాభము సంపాదించినప్పుడుగాని నూటికి అయిదుపణముల అధికలాభమునకు దండము రెండువందల పణములు. 30. ధరను ఎక్కువచేసినప్పుడు చెల్లించవలసిన దండమును దీనిని బట్టి ఊహించుకొనవలెను.

31. వీరు (వర్తకులు) కలిసి కొనినట్టి వస్తువు అమ్మకము కానప్పుడుమరి ఎవరైన కలిసికొనుటకు[9] అనుజ్ఞ నియ్యకూడదు. 32. అట్టి వస్తువులు చెడిపోయినప్పుడు (పన్నులవిషయములో) అతడు వారిని అనుగ్రహించవలెను.

33. వస్తువులసర్ఫరా మితిమీరినప్పుడు వాటిని పణ్యాధ్యక్షుడు ఏకముఖముగజేసి ఒకేచోట అమ్మవలెను. 34. వీటి అమ్మకము పూర్తికానంతవరకు మరెవరును అట్టివస్తువులను అమ్మరాదు. 35. దినకూలిని పుచ్చుకొని ఏజంట్లు వీటిని ప్రజలలాభమునకై అమ్మవలెను.

దేశాంతరములనుండి, కాలాంతరములనుండి వచ్చిన సరకుల విషయమున ;

36. (శ్లో) పణ్యాధ్యక్షుడు పెట్టుబడి, ఉత్పత్తి, శుల్కము, వడ్డి, అద్దె, ఇతరములైన ఖర్చులు లెక్కవేసి నిపుణులసహాయముతో ధరను నిర్ణయించవలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు వైదేహక రక్షణమనే రెండోఅధ్యాయము.

---

[7] కొనినవస్తువులనుండి అమ్మినవి తీసివేయగా మిగిలినవి : అమ్మకముకానివస్తువులు. ఏజంట్లకు కమీషన్ ఇచ్చునప్పుడు అమ్మకముకాని వాటినికూడ గుర్తించవలెను.

[8] అమ్మకము కాక మిగిలిపోయిన ధాన్యములను ఇతరపణ్యములను మాత్రమే కూడబెట్టి కాలాంతరమున అమ్మవలెను.

[9] ఇద్దరుముగ్గురు వర్తకులు కలిసి వ్యాపారము చేయుట మామూలు. అట్టి వర్తకులసంఘమొకటి దానివస్తువులను అమ్మలేనట్టిసందర్భములో దానికి పోటీగా మరియొకసంఘము రాకూడదు అనునియమము ఉండెడిది.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 78 : **ఉపనిపాత ప్రతీకారము**

**1.** దైవికములగు మహాభయములు ఎనిమిది : అవి అగ్ని, వరదలు, వ్యాధి, దుర్భిక్షము, ఎలుకలు, క్రూరమృగములు, సర్పములు, పిశాచములు. **2.** వాటి నుండి అతడు దేశమును రక్షించవలెను.

3. వేసవికాలమందు గ్రామములోనివారు ఇండ్లకు వెలుపల వంట చేసుకొనవలెను ; లేదా, పది ఇండ్లవారు కలిసి అగ్నిప్రమాదమును నివారించు సాధనములతో సిద్ధముగ నుండవలెను.

**4.** నాగరికప్రణిధి ప్రకరణమందును, నిశాంతప్రణిధి ప్రకరణమందును అగ్ని నివారణము వివరింపబడియున్నది.

5. పర్వదినములందు బలులు హోమములు స్వస్తివాచనములు మున్నగు వానిద్వారా అగ్నిపూజలను చేయించవలెను.

**6.** వర్షాకాలమందు నదీతీర గ్రామములలోనివారు వరదల మట్టమునకు దూరముగ నివసించవలెను. **7.** వారు కాష్ఠములను వెదుళ్ళను పడవలను సిద్ధపరచి ఉంచుకొనవలెను. **8.** వరదలో కొట్టుకొనిపోవువానిని తుంబలు, తోలుసంచులు, తెప్పలు, చెట్లబోదెలు, జడల (వలె అల్లిన) త్రాళ్ళు—వీటి సహాయమున తప్పించవలెను. **9.** అతనిని తప్పించుటలో సహాయము చేయని వారికి దండము పండ్రెండు పణములు ; తెప్పలు లేనివారికి దండము లేదు.

**10.** పర్వదినములందు నదీపూజలను చేయించవలెను. **11.** మాయాయోగ విదులు, వేదవిదులు వర్షముపడకుండ జపించవలెను.

**12.** దుర్భిక్షకాలములలో ఇంద్ర గంగా పర్వత మహాకచ్ఛప పూజలను చేయించవలెను.

13. వ్యాధులు సంభవించినప్పుడు (మాంత్రికులు మొదలైనవారు) మంత్రములచేతను, వైద్యులు ఔషధములచేతను, తాపసులు శాంతిప్రాయశ్చిత్తముల చేతను వాటిని నివారింపవలెను.

14. దీనినుండి మరక (అంటు) వ్యాధుల విషయమును తెలుసుకొనవలెను. 15. అతడు పుణ్యతీర్థములలో అభిషేకము, మహాకచ్ఛపపూజలు, శ్మశానములలో గోవుల పాలు పితుకుట, కబంధదహనము, దేవతల రాత్రిపూజలు—వీటిని చేయించవలెను.

16. పశువులలో వ్యాధులు, మరకములు వ్యాపించినప్పుడు శాలలకు (పశువుల) సామగ్రికి సంబంధించిన నీరాజనోత్సవమును, వాటి వాటి ఇష్టదేవతల పూజను చేయించవలెను.

17. దుర్భిక్షకాలమున రాజు విత్తనములను ధాన్యములను సేకరించి ప్రజల యెడ అనుగ్రహము కలవాడు కావలెను; లేదా, (వారిచేత) దుర్గములనుగాని జలాధారములనుగాని నిర్మాణము గావించి ఆహారమును పంచిపెట్టవలెను; లేదా, తన వస్తుసామగ్రిలో వారికి భాగము నియ్యవలెను; లేదా, తన దేశమును మరియొక రాజు అధీనము చేయవలెను. 18. లేదా, మిత్రుల అండ చేరవలెను; లేదా, జనసంఖ్య తగ్గుటకుగాని దేశాంతరములకు తరలిపోవుటకుగాని ఉపాయముల కనుగొనవలెను. 19. లేదా, అతడు తన ప్రజలతో కలిసి పంటలుపండు ఇతర ప్రదేశములకుగాని, సముద్ర సరస్తటాక తీరములకుగాని వెళ్ళవలెను. 20. లేదా, ధాన్యములు, కాయగూరలు, కందమూలములను నదీతీర ప్రాంతములలో సాగు చేయించవలెను; లేదా, జింకలను, మృగములను, పక్షులను, అడవిజంతువులను, చేపలను వేటాడవలెను.

21. ఎలుకల భయము సంభవించినప్పుడు ముంగిసలను వాటిపైకి పంపవలెను. 22. వీటిని పట్టుకొనువారికి హింసించువారికి దండము పండ్రెండు పణములు; కుక్కలను నివారించనివారికికూడ[1]—అరణ్యములలో సంచారము చేయువారు మినహా— ఇదే దండము. 23. అతడు ధాన్యమును స్నుహి (వృక్ష) క్షీరములో తడిపి నేలమీద చల్లవలెను; లేదా, రహస్యములగు ఇతర విషములతో తడిపిన ధాన్యములను చల్లవలెను. 24. లేదా, ఎలుకల పన్నును[2] విధించవలెను. 25. లేదా, సిద్ధతాపసులు శాంతిక్రియలను చేయవలెను. 26. పర్వదినములందు ఎలుకల పూజలను చేయించవలెను.

27. దీనినుండి మిడుతలు, పక్షులు, క్రిములు మున్నగువాని మూలమున

---

[1] కుక్కలు పిల్లులను ముంగిసలను పట్టుకొనవచ్చును. అందుచేత వాటి నివారణము అవసరము.

[2] కొన్ని ఎలుకలను చంపి తీసుకొనిరావలెనను రూపములో ఉండు పన్ను. ఎలుకలనుండి పంటలకు ఆహారపదార్థములకు ప్రమాదము కలుగకుండ ప్రస్తుతకాలమున అనేక చర్యలు తీసుకొనబడుచున్నవి.

సంభవించు ప్రమాదములకు ప్రతీకారమును తెలుసుకొనవలెను.

**28.** క్రూరమృగముల భయము సంభవించినప్పుడు మత్తురసములతో కూడిన పశుశవములనుగాని, మదనకోద్రవరసముతో నిండిన పశువుల పేగులనుగాని (అరణ్యములలో అచ్చటచ్చట) పడవేయవలెను. **29.** పక్షుల వేటగాండ్రు, కుక్కల సహాయమున వేటాడువారు వలలతో రహస్యసంచారము చేయవలెను; లేదా, గుంటలను త్రవ్వవలెను. **30.** కవచధారులు ఆయుధపాణులై అడవి మృగములను చంపవలెను. **31.** సహాయము చేయనివానికి దండము పండ్రెండు పణములు. **32.** అడవిమృగమును చంపి తెచ్చువానికి బహుమానము పండ్రెండు పణములు. **33.** పర్వదినములందు పర్వతపూజలను చేయించవలెను.

**34.** దీనినుండి జింకలయు మృగములయు మందలు, పక్షుల గుంపులు, మొసళ్లు—వీటి మూలమున కలుగు భయములకు ప్రతీకారము తెలుసుకొనవలెను.

**35.** సర్పభయము కలిగినప్పుడు విషవైద్యులు మంత్రములతోను ఔషధములతోను పనిచేయవలెను. **36.** లేదా, అందరు కలిసి వాటిని చంపవలెను. **37.** లేదా, అథర్వవేదమును ఎరిగినవారు మంత్రములను ఉపయోగించవలెను. **38.** పర్వదినములందు నాగపూజలను చేయించవలెను.

**39.** దీనినుండి జలచరములవలని భయమునకు ప్రతీకారము తెలుసుకొనవలెను.

**40.** పిశాచములవలన భయము సంభవించినప్పుడు అథర్వవేదమును ఎరిగినవారు, మాయాయోగము నెరిగినవారు పిశాచముల వినాశమునకు కావలసిన క్రియలను చేయవలెను. **41.** పర్వదినములందు చైత్యవృక్షములను అరుగులతోను,[3] గొడుగులతోను, నైవేద్యములతోను, చిన్నపతాకములతోను, మేకల దానముతోను పూజ చేయవలెను.

**42.** అన్ని మహాభయములందును అహోరాత్రములలో, "మీకు ఆహుతి ఇచ్చుచున్నాము," అని చెప్పుచు ఆహుతుల చేయించవలెను. **43.** సర్వత్ర అతడు తన ప్రజలను తండ్రివలె రక్షించవలెను.

**44.** (శ్లో) కావున, మాయాయోగవిధులు, దైవికములగు ఆపత్తులనుండి నివారింపగల సిద్ధతాపసులు, రాజుచే పూజింపబడినవారై రాజ్యములో నివసించవలెను.[4]

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు ఉపనిపాత ప్రతీకారమనే మూడో అధ్యాయము.

---

[3] చైత్యవృక్షముల చుట్టూ అరుగులను కట్టుట పుణ్యకార్యమను భావమును ఇది సూచించుచున్నది.

[4] ఉపనిపాతములనుండి రక్షణమునకు మంత్రతంత్రములు ప్రధానసాధనములను భావము ప్రబలియుండెను.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 79 : గూఢజీవనము చేయువారినుండి రక్షణము

1. "సమాహర్తృప్రణిధి" ప్రకరణమున జనపదరక్షణము వివరించబడినది. 2. అందులోని (జనపదములోని) కంటకములను నివారించుటను ఇప్పుడు వివరించుచున్నాము.[1]

3. సిద్ధతాపసులు, ప్రవ్రాజితులు, బండ్లను తోలువారు, చారణులు, ఇంద్రజాలికులు, దేశద్రిమ్మరులు, జ్యోతిషము చెప్పువారు, ముహూర్తములు పెట్టువారు, వైద్యులు, ఉన్మత్తులు, మూగలు, చెవిటివారు, జడులు, గ్రుడ్డివారు, వర్తకులు, కారువులు, శిల్పులు, కుశీలవులు, వేశ్యాగృహముల యజమానులు, సారాయి తయారుచేయువారు, పిండివంటలను అమ్మువారు, వండినమాంసమును విక్రయించువారు, అన్నవిక్రేతలు—వీరి వేషములను ధరించిన గూఢపురుషులను సమాహర్త జనపదమందు (అచ్చటచ్చట) నిలుపవలెను. 4. వారు గ్రామాధికారులయొక్కయు అధ్యక్షులయొక్కయు శౌచాశౌచములను కనుగొనవలెను. 5. వీరిలో ఎవనిని అతడు రహస్యముగ జీవించు[2]వాడని శంకించుచున్నాడో అతనిని వీరిద్వారా శోధించవలెను.

6. ధర్మస్థుని విశ్వాసమును సంపాదించిన గూఢచారి అతనితో, "నా ఈ బంధువుపై అభియోగము తేబడియున్నది; ఈ అనర్థమునుండి నీవు అతనిని రక్షించవలెను; అందుకై ఈ ధనమును తీసుకొనుము," అని చెప్పవలెను. 7. అతడు అలాగు చేసినయెడల లంచగొండి (ఉపధాగ్రాహకుడు) అను కారణమున దేశమునుండి బహిష్కరించవలెను. 8. దీనినుండి ప్రదేష్టల విషయమును తెలుసుకొనవచ్చును.

---

[1] కంటకనివారణము సమాహర్తకర్తవ్యము.

[2] రహస్యముగ జీవించువాడనగా రహస్యముగ ఆదాయమును సంపాదించువాడు. అట్టివాడు ధర్మవిరుద్ధములగు సాధనములను ఉపయోగించును.

9. గూఢచారి ఒకడు గ్రామాధికారివద్దకుగాని అధ్యక్షునివద్దకుగాని వెళ్ళి, అతనితో, "వీడు దొంగ ; ఎంతయో ధనమును ఆర్జించినవాడు ; వానికి ఇట్టి అనర్థము సంభవించిఉన్నది ; ఈ మిషతో అతని ధనమును అపహరించుము," అని చెప్ప వలెను. 10. అతడు అలాగు చేసినయెడల డబ్బును లాగువాడన్న (ఉత్కోచకుడు) కారణమున దేశమునుండి బహిష్కరించవలెను.

11. తాను అభియోక్తుడైనట్లు నటించి గూఢచారి కూటసాక్షులని పేరుగాంచిన వారిని ధనమిచ్చి మభ్యపెట్టవలెను. 12. వారట్లు చేసినయెడల కూటసాక్షులను కారణమున దేశమునుండి బహిష్కరించవలెను. 13. దీనినుండి కూటసాక్షులందరి విషయమును తెలుసుకొనవలెను.

14. ప్రేమను సంపాదించుటకు మంత్రములు, మూలికలతోటి క్రియలు; శ్మశానములలో క్రియలు మొదలగు రహస్యసాధనములను ఉపయోగించువానివద్దకు గూఢచారి వెళ్ళి, "నేను ఈతని భార్యను, కోడలిని, కుమార్తెను కామించుచున్నాను, ఆమె నన్ను ప్రేమించునట్లుచేసి ఈ ధనమును పుచ్చుకొనుము," అని పలుకవలెను. 15. అతడట్లు చేసినయెడల రహస్యప్రయోగములను చేయువాడు (సంవదనకారకుడు) అను కారణమున దేశమునుండి బహిష్కరించవలెను. 16. దీనినుండి అభిచార క్రియలను చేయువారి విషయమును తెలుసుకొనవలెను.

17. ఎవడైన విషమును తయారుచేయువాడనిగాని, క్రయవిక్రయముల చేయువాడనిగాని అనుమానము కలిగినప్పుడును, ఔషధములను భోజనద్రవ్యములను క్రయవిక్రయముల చేయువాడు విషమును ప్రయోగించువాడు అను అనుమానము కలిగినప్పుడును, గూఢచారి అతనితో, "వీడు నా శత్రువు ; ఇతనిని చంపించుము ; ఈ ధనమును తీసుకొనుము," అని పలుకవలెను. 18. అతడట్లు చేసినయెడల రసదు డనుకారణమున దేశమునుండి బహిష్కరించవలెను. 19. దీనినుండి మదనయోగ వ్యవహారము చేయువారందరి విషయమును తెలుసుకొనవలెను.

20. ఎవడైన వివిధములగు లోహములను, క్షారములను, బొగ్గులను, తిత్తులను, పటకారులను, ముష్టికములను, దిమ్మెలను, అచ్చులను, సుత్తెలను, మూసలను పదేపదే కొనుచు, బొగ్గుబూడిదపొగలతో కప్పబడిన శరీరముగలవాడై కమ్మరి పనిముట్లతో కూడినవాడై ఉన్నప్పుడు దొంగనాణెములను తయారుచేయు వాడను అనుమానము కలుగవచ్చును ; గూఢచారి ఒకడు అతని విశ్వాసమును సంపాదించి అతనికి శిష్యుడై అతనితో వ్యవహారములను సాగించి అతని గుట్టు బయటపెట్టవలెను. 21. బయటపడిన తర్వాత దొంగనాణెములను చేయువాడు అనే కారణమున దేశమునుండి బహిష్కరించవలెను. 22. దీనినుండి (సువర్ణాదుల) వన్నెను తగ్గించువారు, కూటసువర్ణమును తయారుచేయువారు—ఇట్టివారి విషయమును తెలుసుకొనవలెను.

23. (శ్లో) రహస్యమార్గముల ననుసరించి జీవనముచేయు ఈ పదమూడు

రకములవారు ఇతరులను హింసించుచున్నట్లు తెలియవచ్చినప్పుడు దేశమునుండి బహిష్కరింపబడవలెను ; లేదా, వారివారి దోషాధిక్యమునుబట్టి నిష్క్రయమును ఇచ్చుకొనవలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు గూఢజీవనము చేయువారి నుండి రక్షణము అనే నాలుగో అధ్యాయము.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 80 : సిద్ధుల వేషములో ఉన్న గూఢచారుల సాధనమున అపరాధులను కనుగొనుట

1. చారులను వినియోగించిన తర్వాత సిద్ధుల వేషములో ఉన్న గూఢ చారులు అపరాధులకు ప్రియమైన విద్యలద్వారా అపరాధులను లోభపెట్టవలెను. (ఉదాహరణముగ) నిద్రనుతెప్పించు మంత్రములద్వారాను, కనుపించకుండునట్లు చేయు మంత్రములద్వారాను, తలుపులను తెరచునట్లుచేయు మంత్రములద్వారాను దొంగలను, సంవదనమంత్రములద్వారా వ్యభిచారులను లోభపెట్టవలెను.

2. వీరందరికి ఉత్సాహము కలిగినతర్వాత రాత్రిపూట వీరిని ఒక సంఘముగ చేర్చి, ఒక గ్రామమునకు వెళ్ళవలసినట్లు వారితో చెప్పి, ముందుగ సిద్ధము చేయబడిన స్త్రీపురుషులుగల మరియొక గ్రామమునకు వారిని తీసుకొనివెళ్ళి, "ఇక్కడనే మీరు మా విద్యాప్రభావమును చూడగలరు; మనము అనుకొనిన గ్రామమునకు వెళ్ళుట సాధ్యము కాదు," అని చెప్పవలెను. 3. అటుతర్వాత తలుపును తెరచు మంత్రము సహాయమున తలుపులను తెరచి "ప్రవేశింపుడు" అని అనవలెను. 4. కనిపించకుండునట్లుచేయు మంత్రమును ప్రయోగించి, మేలుకొని యున్న రక్షకభటుల మీదుగ అపరాధులను ఎట్టి ఇబ్బంది లేకుండ తీసుకొని పోవలెను. 5. నిద్రను తెప్పించు మంత్రములను ప్రయోగించి రక్షకభటులను వారి పడకలతోసహా అపరాధులచేత మరియొకచోటికి మోయించవలెను. 6. సంవదన మంత్రమును ప్రయోగించి పరుల భార్యలవలె కనిపించు స్త్రీలతో భోగించునట్లు చేయవలెను. 7. తమ విద్యాప్రభావమందు వారికి పూర్తిగ విశ్వాసము కలిగిన తర్వాత వారిని ముందుముందు గుర్తుపట్టుటకై కొన్ని వ్రతములు మొదలైన వాటిని వారికి విధించవలెను.

8. ముందుగ గుర్తులు పెట్టబడిన ద్రవ్యములుగల ఇండ్లలో వారిచేత వారి

పనిని చేయించవలెను.[1] 9. వారి విశ్వాసమును సంపాదించి వారందరిని ఒకచోట పట్టుబడునట్లు చేయవలెను. 10. వారు (వారు దొంగిలించిన) గుర్తులుగల వస్తువుల క్రయవిక్రయముల చేయునప్పుడు తాకట్టు పెట్టునప్పుడు, లేదా, యోగసురా పానముచే మత్తెక్కినప్పుడు (రాజభటులు) వారిని పట్టుకొనవలెను.

11. వారు పట్టుబడిన తర్వాత వారు అంతకుపూర్వము చేసిన నేరముల గురించియు వారి సహాయకుల గురించియు వారిని ప్రశ్నించవలెను.

12. పాతదొంగవలె కనిపించు గూఢచారులు వారి విశ్వాసమును సంపాదించి, వారిచేత ఇదేవిధముగ పనిచేయించి పట్టించవలెను. 13. వారు పట్టుబడినతర్వాత సమాహర్త వారిని పౌరులకు జానపదులకు చూపించి, "రాజు దొంగలను పట్టుకొను విద్యను నేర్చినాడు ; అతని ఉపదేశానుసారముగ వీరిని పట్టుకొనుట జరిగినది ; తక్కినవారిని కూడ పట్టుకొనెదను ; (కావున) మీరు మీ బంధువులలో పాపకార్యముల చేయువారిని వారించవలెను," అని చెప్పవలెను.

14. గూఢచారులు చెప్పిన మాటలనుబట్టి వారిలో ఒకడు ఏదో ఒక కాడి ముల్లునుగాని కర్రనుగాని దొంగిలించిన విషయమును తెలుసుకొని "ఇది రాజు యొక్క ప్రభావము," అని దొంగను గురించి అక్కడే ప్రకటించవలెను.

15. పాతదొంగలయు, గోపాలకులయు, పక్షులవేటకాండ్రయు, కుక్కలతో వేటాడువారియు, అడవిదొంగలయు, ఆటవికులయు, విశ్వాసమును సంపాదించి, కృత్రిమమగు బంగారముతోను కుప్యముతోను కూడిన సార్థవాహమునుగాని మందలనుగాని గ్రామములనుగాని వారిచేత దోపిడి చేయించవలెను. 16. వారట్లు చేయుచుండునప్పుడు రహస్యముగ దాగుకొనియున్న రాజభటులు వారిని చంప వలెను ; లేదా, దారిలో తినుటకు తెచ్చుకొనిన పదార్థములలో మదనరసమును కలిపి వారిని చంపవలెను. 17. లేదా, దోపిడి వస్తువులతో కూడిన బరువైన మూటను మోసుకొని దూరప్రయాణము చేసి అలసిపోయి వారు నిద్రించు చున్నప్పుడుగాని, విందులలో వారు మద్యమును త్రాగి మత్తులోఉన్నప్పుడుగాని (రాజభటులచేత) వారిని పట్టించవలెను.

18. (శ్లో) వారిని పట్టుకొని సమాహర్త ఇదివరకు చెప్పినట్లు వారిని ప్రజలకు చూపించి రాష్ట్రములోని ప్రజలందరికి రాజుయొక్క సర్వజ్ఞత్వమును చాటించ వలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు సిద్ధుల వేషములోఉన్న గూఢచారుల సాధనమున అపరాధులను కనుగొనుట అనే అయిదో అధ్యాయము.

---

[1] ఇట్టి పనులను ప్రస్తుతకాలమున సి.ఐ.డి. పోలీసువారు చేయుచుందురు.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 81 : అనుమానించబడినవారిని (దొంగిలించిన) వస్తువులతోను, (దొంగిలించిన) సమయములలోను పట్టుకొనుట

**1.** సిద్ధుల వేషమును ధరించినవారి వినియోగము తర్వాత, అనుమానించ బడినవారిని దొంగిలించిన వస్తువులతోను దొంగిలించిన సమయములోను పట్టు కొనుటను[1] గురించి వివరించవలసియున్నది.

**2.** క్షీణించిన దాయకుటుంబాదాయములుకలవాడు, స్వల్పమగు వేతనము కలవాడు, తన దేశము జాతి గోత్రము నామ వృత్తులను గురించి నిజము చెప్పనివాడు, తన వృత్తిని పనిని దాచువాడు, మాంసమందును మద్యమందును భక్ష్యములందును భోజనమందును గంధమాల్యవస్త్రవిభూషణములందును అత్యాసక్తి కలవాడు, అపరిమితముగ ఖర్చుపెట్టువాడు, జారత్వమునకు జూదమునకు మద్యమునకు వశుడైనవాడు, సదా ఇల్లు విడిచి ప్రయాణము చేయుచుండువాడు, ఎక్కడ ఉండునది ఎక్కడికి వెళ్ళునది తెలియపరుపనివాడు, ఎవరులేని ప్రదేశ మందుగాని అడవులలోగాని ఇంటితోటలోగాని అవేళలో సంచరించువాడు, రహస్య ప్రదేశములందుగాని దొంగతనమునకు వీలైన ప్రదేశమందుగాని దీర్ఘాలోచనలను చేయుచు ఇతరులను కలుసుకొనుచుండువాడు, కొత్తగాయములకు రహస్యముగ చికిత్సచేయించుకొనువాడు, సదా ఇంటిలోపల ఉండువాడు, దొంగచాటున నడుచు వాడు, కాంతాపరుడు, పరస్త్రీలగురించి పరుల ద్రవ్యములనుగురించి ఇండ్లనుగురించి పేర్లనుగురించి పదేపదే ప్రశ్నలు వేయుచుండువాడు, నింద్యములగు వృత్తులకును విద్యలకును సంబంధించిన ఉపకరణములు కలవాడు, రాత్రులందు అవేళలలో గోడల నీడలయందు రహస్యముగ సంచారముచేయువాడు, విరూపద్రవ్యములను అనుమానించదగిన ప్రదేశములందును అకాలములందును విక్రయించువాడు,

---

[1] శంకారూప కర్మాభిగ్రహము అని మూలము.

వైరమునుచూపువాడు, హీనమగుపని చేయువాడు, హీనజాతికి చెందినవాడు, తన రూపమును దాచుకొనువాడు, సన్యాసి కాకపోయినను సన్యాసి వేషమును ధరించిన వాడు, సన్యాసి అయినను విభిన్నవేషమును ధరించినవాడు, ఇంతకుపూర్వము నేరముచేసినవాడు, స్వకర్మలచే ఎవరిగుట్టు బయటపడునో అట్టివాడు, నాగరికునిగాని మహామాత్రునిగాని చూచినవెంటనే దాగుకొనువాడు, పరుగెత్తువాడు, ఊపిరిపీల్చక కూర్చుండువాడు, ఆవేదనపడువాడు, శుష్కించినట్టియు మారినట్టియు స్వరము ముఖవర్ణముకలవాడు, శస్త్రహస్తులగు గుంపులను చూడగనే భయపడువాడు— ఇట్టివారు ఘాతుకులనియో, దొంగలనియో, నిధినిక్షేపముల అపహరించిగాని శత్రువుల ననుసరించిగాని రహస్యముగ జీవించువారనియో అనుమానించవలెను.

ఇది అనుమానించబడినవారిని (దొంగిలించిన) వస్తువులతో పట్టుకొనుట

3. పోయినట్టిగాని దొంగలచే అపహరింపబడినట్టిగాని వస్తువులు దొరకనపుడు అట్టి వస్తువుల క్రయవిక్రయముల చేయువారికి వాటినిగురించి తెలియపరుపవలెను. 4. అట్టి వస్తువులు లభించినప్పుడు వాటిని దాచిన పక్షమున దొంగలకు సహకరించిన నేరమునకు వారు పాత్రులగుదురు. 5. (దొంగిలించబడిన వస్తువు అని) తెలియక వారు దానిని ఇచ్చివేసినయెడల నిర్దోషులుగ భావింపబడవలెను. 6. వారు సంస్థాధ్యక్షునికి తెలియపరుపక పాతవస్తువులను తాకట్టుపెట్టరాదు, విక్రయించరాదు.

7. తెలియపరచిన వస్తువు లభించినప్పుడు, ఆ వస్తువుతో పట్టుబడినవానిని "ఎక్కడనుండి ఇది నీకు లభించినది?" అని అది లభించిన విధమును గురించి ప్రశ్నించవలెను. 8. "నాకిది దాయభాగమునుండి లభించెను; దానముగ లభించెను; నేను దానిని కొంటిని; దానిని చేయించితిని; ఫలానావానినుండి రహస్యముగ తాకట్టు పెట్టుకొంటిని; నేను దానిని సంపాదించిన ప్రదేశమిది, కాలము ఇది; ఇదీదాని ఖరీదు; దాని ప్రమాణము లక్షణము మూల్యములు ఇవి," అని అతడు చెప్పినదంతయు రుజువైనయెడల వానిని విడిచిపెట్టవలయును. 9. పోగొట్టుకొనినవాడు కూడ అట్లేచెప్పి అది తనది అని వాదించిన పక్షమున, మొదట అది ఎవరివద్ద ఉండినదో, లేదా, ఎవరివద్ద ఎక్కువకాలము ఉండినదో, లేదా, ఎవరి హక్కు శుచిఅయినదో విచారణచేసి దానిని ఇచ్చివేయవలెను. 10. ఏలయన చతుష్పాత్తులలోను ద్విపాత్తులలోను కూడ రూపమందును గుర్తులందును పోలిక ఉన్నది. ఇట్టి సందర్భములో ఒకటే జన్మస్థానమందుగల మూలద్రవ్యమునుండి ఒకేపనివాడు తయారుచేసిన కుప్యములలోను ఆభరణములలోను వస్తుసామగ్రిలోను ఎక్కువ పోలికలు ఉండుటలో ఆశ్చర్యమేమి?

11. అతడు, "ఇది అరువుగ తెచ్చుకొన్నది, అద్దెకు తెచ్చుకొన్నది, తాకట్టు పెట్టినది, నిక్షేపము, ఉపనిధి, వైయావృత్యకము, ఫలానావానినుండి గ్రహించినట్టిది," అని వాదించినయెడల అతడు నేరముచేసినవాడు కాడని రుజువుచేయగలవాని సాక్ష్యముతో అతనిని వదలివేయవలెను. 12. కాని, సాక్షి, "ఇది ఈలాగుకాదు,"

అని చెప్పినయెడల వస్తువుతో పట్టుబడినవాడు సాక్షి అలాగు చెప్పుటకు కారణములను స్పష్టముచేసి, తాను ఆ వస్తువును తీసుకొనినందుకు కారణము చెప్పవలెను ; లేదా, దానిలోని గుర్తులను దానిని తనకు ఇచ్చినవానిచేతగాని, ఇప్పించినవానిచేతగాని, లేఖకునిచేతగాని, గ్రహించినవానిచేతగాని, దానిని చూచినవారిచేతగాని వినినవారిచేతగాని రుజువు చేయించవలెను.

13. వదలివేసినట్టియు, పోయినట్టియు, పోయి తర్వాత లభించునట్టియు వస్తువు విషయములో దేశకాలసంపాదనములకు సంబంధించిన ఆధారముల సహాయమున పరిష్కారము జరుగవలెను. 14. ఇట్టి అధారము లేనప్పుడు అతడు దానిని వదలుకొని దాని మూల్యముతో సమానమగు దండమును చెల్లించవలెను. 15. లేనియెడల అతడు స్తేయదండమునకు పాత్రుడగును.

ఇది వస్తువులతో పట్టుకొనుట

16. (దొంగిలించిన) సమయములో పట్టుకొనుట : ఇంటిలో దొంగతనము జరిగినప్పుడు మామూలు ద్వారమునుండిగాక మరియొకచోటనుండి ప్రవేశ నిష్క్రమణములు, తలుపులో రంధ్రముచేయుట, దానిని (ద్వారబంధమునుండి) తీసివేయుట, మీదిగదిలోని కిటికీనిగాని చూరునుగాని బద్దలుచేయుట, ఎక్కునపుడుగాని దిగునపుడుగాని గోడ పడిపోవుట, వస్తువులను పూడ్చుటకుగాని రహస్యముగ తీసుకొనిపోవుటకుగాని నేలను త్రవ్వుట — ఈ గుర్తులనుబట్టియు, దొంగిలించబడిన వస్తువుల వివరణమునుబట్టియు, గోడలోని పగులు, మట్టి, కన్నము, ఉపకరణములు లోపలివైపున ఉండుటనుబట్టియు దొంగతనము ఇంటిలోపలివానిచే చేయబడినట్లు ఊహించవచ్చును. 17. ఈ గుర్తులు బయటఉన్నప్పుడు దొంగతనము బయటివారి పని అని ఊహించవలెను. లోపల బయట ఉన్నప్పుడు లోపలివారు బయటివారు కలిసి చేసినట్లు ఊహించవలెను.

18. ఇంటిలోపలివారు దొంగతనముచేసినట్లు అనుమానముకలిగినప్పుడు అతడు (కొందరిని) పరీక్షించవలెను. వారెవరనిన : దగ్గరబంధుత్వముకలవాడును, వ్యసనములలో చిక్కుకొన్నవాడును, క్రూరులతో సహచరించువాడును, దొంగతనము చేయుటయందు ఉపకరించు పనిముట్లను కల పురుషుడు ; లేదా, దరిద్రకులమునకు చెందినట్టియు మరియొకనితో సంబంధముకలిగినట్టియు స్త్రీ, లేదా, అట్టి ప్రవర్తనకలవాడును, అత్యధికముగ నిద్రపోవువాడును, నిద్రను అణచుకొనలేనివాడును, ఆవేదనను పొందినవాడును, శుష్కించినట్టియు మారినట్టియు స్వరమును ముఖచిహ్నములు కలవాడును, స్తిమితములేనివాడును, అత్యధికముగ ప్రలాపించువాడును, పైకిఎక్కుటవలన కరడుగట్టిన అవయవములుకలవాడును, కత్తిరించినట్టియు, నలిగినట్టియు చినిగినట్టియు, ఛేదించబడినట్టియు శరీరవస్త్రములు కలవాడును, మచ్చలతోకూడినట్టియు కరడుకట్టినట్టియు చేతులు పాదములు కలవాడును, దుమ్ముతోనిండినట్టిగాని కత్తిరించినట్టిగాని వంగినట్టిగాని వెంట్రుకలు గోళ్లు

కలవాడును, పూర్తిగ స్నానానులేపములు కలవాడును, నూనెను రాచుకొనిన అంగములుకలవాడును, అప్పటికప్పుడే కడుగుకొనిన చేతులు పాదములు కలవాడును, మట్టిలోను తడిసినప్రదేశములందును కనిపించు అడుగుజాడలవంటి అడుగులు కలవాడును. ప్రవేశనిష్క్రమణ ప్రదేశములలో కనిపించినవాటివంటి పువ్వులు, మద్యము, గంధము, బట్టలముక్కలు, తైలములు, చెమట ఉన్నవాడును అగు భృత్యుడు. 19. ఇట్టివాడు దొంగఅనిగాని వ్యభిచారిఅని గాని పట్టుకొనదగినవాడు.

**20.** (శ్లో) గోపస్థానికుల సహాయమున ప్రదేష్ట బయటిదొంగలను, నాగరికుడు దుర్గములోపలి దొంగలను ఈగుర్తులసాధనమున వెదకి పట్టుకొనవలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు అనుమానించబడినవారిని (దొంగిలించిన) వస్తువులతోను (దొంగిలించిన) సమయములలోను పట్టుకొనుట అనే ఆరో అధ్యాయము.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 82 : ఆశు మృతక పరీక్ష

1. హఠాత్తుగ మరణించినవాని శరీరమునకు నూనెను పూసి పరీక్షించవలెను.

2. మూత్రపురీషములు చిమ్మినట్లు వెలువలికివచ్చియున్నప్పుడు, కడుపుపైని చర్మమువాతముతో నిండియున్నప్పుడు, చేతులు కాళ్ళు పొంగియున్నప్పుడు, కండ్లు తెరవబడిఉన్నప్పుడు, కంఠమందు గుర్తులున్నప్పుడు, శ్వాస ఆడకుండ నులిమి చంపబడినట్లు తెలుసుకొనవలెను. 3. ఈలక్షణములతోకూడ బాహువులు తొడలు సంకుచితములై ఉన్నప్పుడు ఉరితీసి చంపబడినట్లు గ్రహించవలెను.

4. చేతులు పాదములు కడుపు పొంగియున్నప్పుడు, కండ్లు గుంటలు పడిఉన్నప్పుడు, బొడ్డు తల్లక్రిందులైనప్పుడు గుదమును పొడిచి చంపినట్లు గ్రహించవలెను.

5. గుదము కండ్లు మూతబడినప్పుడు, నాలుకకొరికినట్లు ఉన్నప్పుడు, కడుపు పొంగియున్నప్పుడు నీటిలో మునిగి చనిపోయినట్లు తెలుసుకొనవలెను.

6. నెత్తురు చిమ్మియున్నప్పుడు, అవయవములు విరిగియున్నప్పుడు, కదలియున్నప్పుడు, కర్రలతోగాని రాళ్ళతోగాని కొట్టిచంపబడినట్లు తెలుసుకొనవలెను.

7. అవయవములు విరిగి నలువైపుల చెదరియున్నప్పుడు ఎత్తైనప్రదేశమునుండి త్రోసి చంపబడినట్లు గ్రహించవలెను.

8. చేతులు పాదములు పండ్లు గోళ్ళు నల్లబడియున్నప్పుడు, కండలు, వెంట్రుకలు, చర్మము శిథిలమైయున్నప్పుడు, నోరు నురుగుతో కప్పబడియున్నప్పుడు విషముతో చంపబడినట్లు తెలుసుకొనవలెను. 9. ఈలక్షణములతో కూడ

కరచినచోట నెత్తురుగుర్తు లున్నప్పుడు పాముగాని పురుగుగాని చంపినట్లు తెలుసుకొనవలెను.

**10.** (కట్టుకొనిన) బట్టలు అవయవములు చెదరియుండునప్పుడు, వాంతులు విరేచనములు ఎక్కువగఉన్నప్పుడు మదనయోగరసముచే చంపబడినట్లు తెలుసుకొనవలెను.

**11.** వీటిలో ఏవిధముగ అతడు చంపబడినది, లేదా, చంపబడిన తర్వాత శిక్షవిధించెదరను భయముచేత ఉరితీయబడినది, కంఠమును కత్తితో నరకినది తెలుసుకొనవలెను.

**12.** విషముచే చంపబడినవాని భోజనశేషమును పక్షులద్వారా పరీక్షించవలెను. **13.** లేదా, గుండెలోపలనుండి తీసినపదార్థము నిప్పులో వేసినపుడు చిటచిటధ్వనికలిగినను, ఇంద్రధనుస్సువర్ణముకలదిఅయినను, విషముచే చంపబడినట్లు తెలుసుకొనవలెను; శరీరమంతయు కాలినను గుండె కాలనపుడుకూడ విషముచే చంపబడినట్లు గ్రహించవలెను.

**14.** చనిపోయినవానిచేత తిట్లనుగాని, దెబ్బలనుగాని తినినభృత్యుని, దుఃఖపరవశయైనట్టిగాని అన్యపురుషునియందు ఆసక్తికలిగినట్టిగాని స్త్రీజనమును, దాయమునుగాని వృత్తినిగాని స్త్రీనిగాని కోరినబంధువును (ప్రదేష్ట) పరీక్షించవలెను.

**15.** చంపబడినతర్వాత ఉరితీయబడినవాని విషయమునకూడ ఇట్లే చేయవలెను. **16.** తన్నుతాను ఉరితీసుకొనిన విషయములో అతని కెవరపకారము చేసిరో కనుగొనవలెను.

**17.** అందరివిషయములో స్త్రీసంబంధమైనట్టిగాని దాయసంబంధమైనట్టిగాని నేరము, వృత్తికి సంబంధించిన స్పర్ధ, ప్రతిపక్షమువానియెడల ద్వేషము, పణ్యప్రదేశమున కలిగినసంబంధము, న్యాయస్థానములోని ఏదియో ఒక వివాదము—ఇవి కోపకారణములు. **18.** హత్యకు కోపము కారణము. **19.** ఎవరైన స్వయముగ వానిని చంపిరా? ఎవరినైన వారు నియోగించి చంపించిరా? అతనిధనమును కోరిన దొంగలు చంపిరా? మరియొకని శత్రువులు సాదృశ్యముచే అతనిని చంపిరా? అను విషయములను అసన్నుల సహాయమున అతడు తెలుసుకొనవలెను. **20.** అతనిని పిలిచినవానిని, ఎవనితో అతడుఉండెనో అతనిని, ఎవనితో ప్రయాణముచేసెనో అతనిని, ఎవడుఅతనిని హత్యజరిగిన ప్రదేశమునకు తీసుకొనివచ్చెనో అతనిని అతడు ప్రశ్నించవలెను. **21.** హత్యజరిగిన ప్రదేశమందు అతనిసమీపమున ఉండినవారిలో ఒక్కొక్కరిని ప్రత్యేకము "అతనిని ఇక్కడికి ఎవరు తీసుకొనినవచ్చిరి? అతనిని చంపినదిఎవరు? చేతిలో ఆయుధము పెట్టుకొనినవానినిగాని, దాగియుండినవానినిగాని, ఆవేదన పొందినవానినిగాని, నీవు ఎవరినైన చూచితివా?" అని అడుగవలెను. **22.** వారు చెప్పిన సమాధానములబట్టి వారిని మరికొన్నిప్రశ్నలు వేయవలెను.

23–24. (శ్లో) దిక్కులేనివాడగు అతనిశరీరముపై ఉన్నవస్తువులను, ఉపభోగములను, వస్త్రములను, వేషమును, భూషణములను పరిశీలించి, వాటిని క్రయవిక్రయముల చేయువర్తకులను వారికి అతనితోఉండిన సంబంధము, వారినివాసము, దానికి కారణము, వారివృత్తి, వ్యవహారములు అనువానినిగురించి ప్రశ్నించవలెను.

25–26. (శ్లో) కామక్రోధములకు వశుడైన పురుషుడుగాని పాపిష్టియగు స్త్రీగాని త్రాడుతోగాని, శస్త్రముతోగాని, విషముతోగాని ఆత్మహత్య చేసుకొనినప్పుడు చండాలునిచే రాజమార్గమందు మృతశరీరమునకు త్రాడుకట్టి ఈడ్పించవలెను. వారికి శ్మశానవిధిగాని (తర్పణాది) బంధుక్రియలుగాని ఉండరాదు.[1]

27. (శ్లో) బంధువు ఎవడైన వారికి ఉత్తరక్రియలు చేసినపక్షమున అతనికికూడ ఇదేగతి. అతనినికూడ బంధువులు వదలివేయవలెను.

28. (శ్లో) పతితులతో సహవాసముచేసి, వారిచేత యాగములను చేయించి, వారికి అధ్యాపకుడై వారితో వివాహసంబంధము పెట్టుకొనినవాడు ఒక సంవత్సరములోపల పతితుడగును. వీరితో వ్యవహారములను పెట్టుకొనినవానిగతి ఇట్టిదె.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు ఆశుమృతకపరీక్ష అనే ఏడో అధ్యాయము.

[1] ఆత్మహత్య మహాపాతకముగ పరిగణింపబడియుండెను.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 8

### ప్రకరణము 83 : వాక్యకర్మానుయోగము[1]

1. ప్రదేష్ట దొంగిలింపబడినవానియొక్కయు బాహ్యాభ్యంతరులగు సాక్షుల యొక్కయు సమక్షమున అభిశస్తుని (దోషిగ శంకింపబడినవానిని) అతని దేశము, జాతి, గోత్రము, నామము, వృత్తి, ఆస్తి, సహాయకులు, నివాసములగురించి ప్రశ్నించవలెను. 2. వీటిని (అతడు చెప్పు సమాధానములను) ఇతరులు చెప్పిన వాటితో సరిపోల్చి చూడవలెను. 3. తర్వాత అతడు ముందురోజున ఎచ్చటెచ్చట ఉండినది, రాత్రియందు పట్టుపడువరకు ఎచ్చట ఉండినది తెలుసుకొనవలెను. 4. అతడు నిర్దోషి అని సాక్షుల సాక్ష్యమువలన స్థిరపడినయెడల అతనిని వదలివేయ వలెను ; స్థిరపడని పక్షమున కర్మను ప్రయోగించవలెను.

5. శంకితునివద్ద (దొంగతనమునకు సంబంధించిన) ఉపకరణములు ఉన్నప్పుడుతప్ప తక్కిన సందర్భములలో ప్రశ్నలు వేయుటకు అవకాశములేని కారణమున మూడురాత్రులు గడచినతర్వాత అతనిని పట్టుకొనరాదు.

6. దొంగ కానివానిని దొంగఅని చెప్పినవానికి, దొంగను దాచినవానికి చోర దండమును[2] విధించవలెను.

7. వైరమువలనగాని ద్వేషమువలనగాని చోరుడను అభియోగము తేబడి నప్పుడు అతనిని వదలివేయవలెను. 8. నిర్దోషి అని రుజువైనతర్వాత ఒకనిని నిర్బంధములో ఉంచినవానికి పూర్వసాహసదండము.

---

[1] ప్రశ్నలు వేసియు కర్మను ప్రయోగించియు విచారణచేయుట. కర్మ అనునది ఆ కాలపు పోలీసుఅధికారులు నేరస్థుని విషయములో తీసుకొనుచుండిన ఒక ప్రత్యేకచర్యను సూచించు మాట. నేరస్థుని బాధించి, నేరముచేసినట్లు అతనిచే ఒప్పించుటయే ఈ చర్య. ఇట్లు బాధించుటను ప్రస్తుతకాలములో torture అని చెప్పెదరు.

[2] దొంగ అని రుజువైనవానిపై విధించు దండము.

9. ఒకనినిగురించి చోరుడను అనుమానము కలిగినపుడు (దానికి సంబంధించిన) ఉపకరణమును సలహాదారులను, సహాయకులను, వస్తువులను, వైయాకృత్యకరులను హాజరుపెట్టవలెను. 10. అతని ప్రవేశము, వస్తువులను తీసుకొనుట, వాటి పంపకము—వీటికి సంబంధించిన అతని పనులను సమన్వయ పరుపవలెను.

11. ఇట్టి కారణముల ద్వారా నేరము చేసినట్లు స్థిరపడనప్పుడు అతడు ప్రలాపించినను[3] చోరుడు కానట్లు భావించి వదలివేయవలెను. 12. ఏలయన, (ఒక్కొకప్పుడు) చోరుడు కానివానిని కూడ దారిలో నడుచు చోరులతో దైవవశమున కలిసిపోయినప్పుడు వేషమందును శస్త్రములందును వస్తువులందును సాదృశ్య మున్నదను కారణముననను దొంగల నివాసమునకు సమీపముగ అతనిని పట్టుకొనుట జరుగును: అణిమాండవ్యుడు చోరుడు కాకపోయినను కర్మక్లేశ భయమువలన 'నేను చోరుడను' అని పలుకుటయే దీనికి దృష్టాంతము.[4] 13. కావున, ఎవని విషయములో సాక్ష్యము సంపూర్ణముగ లభించునో అట్టివానినే శిక్షించవలెను.

14. అల్పమగు అపరాధమును చేసినవాడు, బాలుడు, వృద్ధుడు, వ్యాధితుడు, మత్తుడు, ఉన్మత్తుడు, ఆకలి దప్పి ప్రయాణములవలన అలసినవాడు, అతిగా భోజనము చేసినవాడు, భోజనము జీర్ణించనివాడు, దుర్బలుడు—ఇట్టివారి విషయములో కర్మప్రయోగము చేయరాదు. 15. తుల్యశీలురు, వేశ్యలు, చలివేంద్రలలోని నౌకర్లు, సలహాదారులు, (వారికి) బస ఇచ్చువారు, భోజనము పెట్టువారు—వీరిద్వారా అట్టివారి చర్యలను శోధించవలెను. 16. ఈ విధముగగాని, నిక్షేపాపహార ప్రకరణమందు చెప్పబడిన విధముగగాని, వారి రహస్యములను తెలుసుకొనవలెను.

17. అపరాధము చేసినట్లు గట్టి అనుమానము ఉన్నప్పుడే కర్మప్రయోగము చేయవలెను. కాని ఎట్టి సందర్భములలో కూడ గర్భిణీస్త్రీని, ప్రసవించి నెలరోజులు కానట్టిస్త్రీని కర్మప్రయోగముద్వారా హింసించరాదు. 18. స్త్రీల విషయములో అర్ధకర్మనే ప్రయోగించవలెను; లేదా, వాక్యానుయోగమువలన (ప్రశ్నలు వేసి) వారిని పరీక్షించవలెను.

19. బ్రాహ్మణుని విషయములో అతడు వేదవిదుడైన పక్షమున గూఢచారుల ద్వారా పరీక్ష జరుగవలెను. తాపసుల విషయమున కూడ ఇట్లే చేయవలెను. 20. దీనికి అన్యథాగా ప్రవర్తించి కర్మప్రయోగము చేసినవానికి చేయించినవానికి, దీనిద్వారా మరణము సంభవింపజేసినవానికి ఉత్తమసాహసదండము.

---

[3] భయపడి ఒప్పుకొనినను అని అర్థము.

[4] మాండవ్యునిగురించిన కథ మహాభారతములోని ఆదిపర్వమున కలదుకాని అది దీనికి భిన్నముగ నున్నది.

21. సాధారణమైన నాలుగు రకముల కర్మ : కఱ్ఱతో ఆరు దెబ్బలు ; కొరడాతో ఎనిమిది దెబ్బలు ; రెండు పర్యాయములు మీదనుండి క్రిందికి వ్రేలాడ కట్టుట ; నీటిగొట్టము.

22. అతిదుర్మార్గుల విషయములో బెత్తముతో తొమ్మిది దెబ్బలు, పంద్రెండు కొరడా దెబ్బలు, రెండుతొడల చక్రబంధములు, నక్తమాలకఱ్ఱతో ఇరవై దెబ్బలు, ముప్పైరెండు చెంపదెబ్బలు, రెండు వృశ్చికబంధములు, రెండు తల్రక్రిందుగ వ్రేలాడకట్టుటలు, చేతులలో సూదులు గుచ్చుట, గంజిని త్రాగించి వ్రేలికణుపును కాల్చుట, నూనెను త్రాగించి ఒకరోజు ఎండలో నిలబెట్టుట, చలిరాత్రిలో బల్బజాగ్రములపై పరుండబెట్టుట. 23. ఇవి పద్దెనిమిది రకముల కర్మలు.

24. (కర్మప్రయోగములో ఉపయోగించదగిన) సాధనములు, ప్రమాణము, హింసావిధానము, దాని నిశ్చయము, దాని హద్దులు—వీటిని ఖరపట్టమునుండి[5] తెలుసుకొనవలెను.

25. కర్మప్రయోగమును రోజు విడిచి రోజు, రోజునకు ఒక్క పర్యాయము మాత్రమే చేయవలెను.

26. పాతనేరస్థుడు, నేరమును ఒప్పుకొని తర్వాత మాట తప్పువాడు, దొంగిలింపబడిన వస్తువులు కొన్నిటితో పట్టుబడినవాడు, దొంగిలించిన సమయములో దొంగిలించిన వస్తువులతో పట్టుపడినవాడు, రాజకోశమును దాచినవాడు, రాజశాసన కారణముగ కర్మప్రయోగమునకు వశుడైనవాడు—వీరి విషయములో కర్మ ప్రయోగములన్నియుగాని, ఒక్కొక్కటిగాని, వరుసగగాని ఉపయోగించవచ్చును.

27. అన్ని అపరాధములలో బ్రాహ్మణుడు హింసింపబడరాదు. 28. ఏ వ్యవహారములలో కూడ అతడు పాల్గొనకుండునట్లు అతని లలాటమందు అపరాధ చిహ్నమును ముద్రించవలెను ; దొంగతనమునకు శునక చిహ్నము, మనుష్య వధకు కబంధ చిహ్నము, గురుతల్ప గతునకు భగ చిహ్నము, సురాపానము చేసినవానికి మద్యధ్వజ చిహ్నము.

29. (శ్లో) పాపకర్మల జేసిన బ్రాహ్మణుని ముఖముపైన కాల్చిన ముద్ర వేసి, దేశమునుండి రాజు అతనిని బహిష్కరించవలెను ; లేదా, గనులలో పని చేయించవలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు వాక్యకర్మానుయోగము అనే ఎనిమిదో అధ్యాయము.

---

[5] ఇది ప్రాచీనగ్రంథమని కొందరు వ్యాఖ్యాతలు.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 9

### ప్రకరణము 84 : సర్వాధికరణ రక్షణము[1]

1. సమాహర్త ప్రదేష్టలు అధ్యక్షులను, వారిక్రింద పనిచేయువారిని మొట్టమొదట అదుపులో ఉంచవలెను.

2. గనులనుండిగాని సారకర్మాగారములనుండిగాని సారపదార్థమునుగాని రత్నమునుగాని అపహరించు ఉద్యోగికి శుద్ధమరణమే[2] దండము. 3. ఫల్గుద్రవ్య కర్మాగారములనుండి ఫల్గుద్రవ్యమునుగాని పనిముట్టునుగాని అపహరించినవానికి పూర్వసాహసదండము.

4. పణ్యములను తయారుచేయు ప్రదేశములనుండి ఒక మాషకము మూల్యమునకు తగ్గనట్టియు, పాతిక పణము మూల్యమునకు మించనట్టియు, రాజ పణ్యమును అపహరించువానికి దండము పన్రెండు పణములు ; అర్ధ పణము మూల్యమువరకు దండము ఇరవైనాలుగు పణములు ; ముప్పాతిక పణము మూల్యముపరకు దండము ముప్పైఆరు పణములు ; ఒక పణము మూల్యము వరకు దండము నలభైఎనిమిది పణములు ; రెండు పణముల మూల్యమువరకు పూర్వసాహసదండము ; నాలుగు పణముల మూల్యముపరకు మధ్యమసాహస దండము ; ఎనిమిది పణముల మూల్యమువరకు ఉత్తమసాహసదండము ; పది పణములవరకును అంతకుమించినప్పుడును మరణశిక్ష. 5. కోష్ఠాగార పణ్యాగార కుప్యాగారాయుధాగారములందుండి కుప్యములను, భాండములను, పనిముట్లను అపహరించినపుడు పై విలువలలో సగమునకు అదే దండములను విధించవలెను.

---

[1] అధికరణమనగా పరిపాలనశాఖ. వీటిలో పనిచేయు అధ్యక్షులు వారిక్రింద పనిచేయువారు రాజద్రవ్యమును అపహరించవచ్చును : అట్టివారిపై తీసుకొనవలసిన చర్యలు ఈ ప్రకరణమున వివరింపబడియున్నవి.

[2] కర్మప్రయోగము మూలమున కలుగు హింసలేనట్టి మరణము.

6. కోశము భాండాగారము అక్షశాలలనుండి నాలుగోవంతు మూల్యముగల వస్తువులను అపహరించినయెడల దండము రెండింతలు. 7. కోశమును బద్దలుగొట్టి వస్తువులను దొంగిలించువారికి చిత్రవధయే శిక్ష.

8. ఇవి రాజువస్తువులకు సంబంధించిన నేరములు.

9. బాహ్యవస్తువుల విషయము: పగటిపూట పొలమునుండి, కళ్ళమునుండి, ఇంటినుండి, దుకాణమునుండి ఒక మాషకమునకు పైబడి పాతికపణమువరకు మూల్యముగల కుప్యమునుగాని, భాండమునుగాని, పనిముట్లనుగాని అపహరించు ఉద్యోగికి దండము మూడు పణములు; లేదా, అతని శరీరమునకు ఆవుపేడపూసి అతని దోషమును చాటించుట; అర్ధపణము మూల్యమువరకు దండము ఆరు పణములు; లేదా, శరీరమునకు బూడిదతో కలిపిన ఆవుపేడనుపూసి దోషమును చాటించుట; ముప్పాతికపణము మూల్యమువరకు దండము తొమ్మిది పణములు; లేదా, శరీరమునకు బూడిదతో కలిపిన ఆవుపేడనుపూసి దోషమును చాటించుట; లేదా, అతనికి కుండపెంకుల మొలత్రాడును కట్టుట. ఒక పణము మూల్యము వరకు దండము పన్నెండు పణములు; లేదా, తలగొరిగి దేశబహిష్కారము; రెండు పణముల మూల్యమువరకు దండము ఇరవైనాలుగు పణములు; లేదా, తల గొరిగి ఇటికనుకట్టి దేశబహిష్కారము; నాలుగు పణముల మూల్యమువరకు దండము ముప్పైఆరు పణములు; అయిదు పణముల మూల్యమువరకు దండము నలభైఎనిమిది పణములు; పది పణముల మూల్యమువరకు పూర్వసాహస దండము; ఇరవై పణముల మూల్యమువరకు దండము రెండువందల పణములు; ముప్పై పణముల మూల్యమువరకు దండము అయిదువందల పణములు; నలభై పణముల మూల్యమువరకు దండము వేయి పణములు; ఏభై పణముల మూల్యమువరకును, దానికిమించినపుడును మరణశిక్ష. 10. బలప్రయోగముచేసి పగలుగాని సంచరించగూడని వేళలలో రాత్రిగాని ఇందులో అర్ధమూల్యముగల వస్తువులను అపహరించినవానికి ఇదే దండము. 11. పగలుగాని, రాత్రిగాని ఆయుధములతో బలప్రయోగముచేసి ఇందులో పాతిక మూల్యముగల వస్తువులను అపహరించినవానికి రెండింతల దండము.

12. కుటుంబికులు, అధ్యక్షులు, ముఖ్యులగు ఉద్యోగులు, రాజు—వీరి పత్రముల విషయమునను ముద్రల విషయమునను మోసముచేసి దొంగపత్రములను దొంగముద్రలను సృష్టించినయెడల వరుసగ పూర్వ మధ్య మోత్తమసాహస దండములు, మరణశిక్ష.

13. వివాదపరిష్కారమునకై న్యాయస్థానమునకు వచ్చినవానిని ధర్మస్థుడు బెదరించినను, తిట్టినను, తరిమివేసినను, నోరుమూసుకొనునట్లు చేసినను పూర్వ సాహసదండమును చెల్లించవలెను; వాక్పారుష్యమునకు రెండింతల దండమును చెల్లించవలెను. 14. ప్రశ్నించవలసినవానిని ప్రశ్నించనప్పుడు, ప్రశ్నించకూడని

వానిని ప్రశ్నించినప్పుడు, ప్రశ్నించినతర్వాత చెప్పిన సమాధానమును త్రోసిపుచ్చినప్పుడు, లేదా, వానికి నేర్పినప్పుడు, జ్ఞాపకము చేసినప్పుడు, సూచనచేసినప్పుడు మధ్యమసాహసదండమును చెల్లించవలెను. 15. దాఖలుచేయవలసిన సాక్ష్యమును దాఖలుచేయవలసినదిగ అడగనప్పుడు, అవసరములేని సాక్ష్యమును అవసరమని చెప్పినప్పుడు, సాక్ష్యము లేకపోయినను విచారణ సాగించినప్పుడు, ఏదియో ఒక సాకుచెప్పి దావాను కొట్టివేసినప్పుడు, కాలహరణముతో విసుగెత్తించి న్యాయస్థానమునకు (వాదినిగాని ప్రతివాదినిగాని) రాకుండజేసినప్పుడు, సక్రమముగ నుండు వాక్యములోని క్రమము తప్పించినప్పుడు, సాక్షులకు వారు చెప్పు సాక్ష్యములో సహాయపడినప్పుడు, పూర్తిఅయిన వివాదవిచారణను మరల ప్రారంభించినప్పుడు, ఉత్తమసాహసదండమును చెల్లించవలెను. 16. ఇట్టి అపరాధమును రెండవ పర్యాయము చేసినప్పుడు రెండింతల దండమును చెల్లించవలెను. అట్టి ధర్మస్థుని ఉద్యోగమునుండి తీసివేయవలెను.[3]

17. చెప్పినదానిని వ్రాసికొననట్టియు, చెప్పనిదానిని వ్రాసికొనునట్టియు, చక్కగ చెప్పనిదానిని చక్కగ చెప్పినట్లును, చక్కగ చెప్పినదానిని చక్కగ చెప్పనట్లును వ్రాసికొనునట్టియు, అర్థము మారునట్లు వ్రాసికొనునట్టియు లేఖకునికి పూర్వసాహసదండము ; లేదా, అపరాధమునకు తగిన దండము.

18. ధర్మస్థుడుగాని ప్రదేష్టగాని దండనార్హుడుకానివానికి హిరణ్యదండమును విధించినప్పుడు దానికి రెండింతల దండమును చెల్లించవలెను ; లేదా, న్యాయముగ విధించవలసిన దండమునకును వారు విధించినదానికిని గల హెచ్చుతగ్గులకు ఎనిమిదిరెట్లు చెల్లించవలెను. 19. (న్యాయవిరుద్ధముగ) శరీరదండమును విధించిన పక్షమున (ధర్మస్థుడు) అట్టి దండమునే అనుభవించవలెను ; లేదా, నిష్క్రయము నకు రెండింతల దండమును చెల్లించవలెను.

20. (న్యాయముగ) చెందవలసిన ధనమును చెందకుండగను, చెందరాని ధనమును చెందునట్లుగను తీర్పు చెప్పినప్పుడు దానికి ఎనిమిదిరెట్లు దండమును చెల్లించవలెను.

21. ధర్మస్థీయచారకమందుగాని[4] కారాగారమందుగాని (బంధితుని) నిద్రకు, కూర్చుండుటకు, భోజనమునకు మూత్రపురీషముల విసర్జనమునకు అవరోధము కల్పించినప్పుడు, కట్టివేసినప్పుడు దండము మూడు పణములతో ప్రారంభమై మూడేసి పణముల చొప్పున క్రమముగ వృద్ధికావలెను ; అవరోధము చేసినవాడు

---

[3] వారి విధులను సక్రమముగ నిర్వర్తించని న్యాయాధీశులు తక్కిన నేరస్థులవలె శిక్షను అనుభవించవలసినవారుగ నుండిరి. ప్రస్తుతకాలమున న్యాయాధీశుల కిట్టి శిక్షలు లేవు.

[4] ధర్మస్థీయచారకమనగా విచారణలోఉన్న అపరాధులను తాత్కాలికముగ బంధించిఉంచు ప్రదేశము.

చేయించినవాడు దీనిని చెల్లించవలెను.

22. చారకమునుండి ఖైదీని వదలివేయునట్టియు, అతడు తప్పించుకొనుట యందు సహాయపడునట్టియు అధికారి మధ్యమసాహసదండమును అభియోగ ధనమును చెల్లించవలెను ; కారాగారములోని ఖైదీ విషయమున ఇట్లు జరిగినపుడు (అధికారి) సర్వస్వమును కోల్పోయి మరణశిక్షను అనుభవించవలెను.

23. కారాగారాధ్యక్షుడు (ధర్మస్థునికి) తెలియపరచక ఖైదీకి స్వేచ్ఛగ తిరుగుటకు అవకాశము కల్పించినప్పుడు ఇరవైనాలుగు పణముల దండమును, కర్మప్రయోగము చేసినప్పుడు దీనికి రెండురెట్లు దండమును, అన్యస్థానమునకు మార్చినప్పుడును అన్నపానములకు అవరోధము కల్పించినప్పుడును తొంభైఆరు పణముల దండమును, క్లేశపరిచినప్పుడును అంగవైకల్యము కలిగించినప్పుడును మధ్యమసాహసదండమును, చంపినప్పుడు వేయి పణముల దండమును చెల్లించ వలెను.

24. వివాహితురాలైన దాసినిగాని, తాకట్టుపెట్టబడిన స్త్రీనిగాని, కారాగార మందున్నప్పుడు బలాత్కరించిన అధికారికి పూర్వసాహసదండము ; చోరుని భార్యనుగాని దొమ్మిలో పాల్గొనినవాని భార్యనుగాని బలాత్కరించినప్పుడు మధ్యమ సాహసదండము ; ఆర్యస్త్రీని బలాత్కరించినప్పుడు ఉత్తమ సాహసదండము. 25. ఇట్టిపనులను ఖైదీచేసినయెడల మరణశిక్ష. 26. రాత్రిపూట సంచారనిషేధ సమయములలో పట్టుకొనబడిన ఆర్యస్త్రీని బలాత్కరించినపుడు ఇదేదండము ; అట్టిదాసిని బలాత్కరించినపుడు పూర్వసాహసదండము.

27. చారకమును భగ్నముచేయక ఖైదీని తప్పించుకొనునట్లుచేయువానికి మధ్యమసాహసదండము, భగ్నముచేసినయెడల మరణశిక్ష. బంధనాగారము విషయమున ఇట్లుచేసినయెడల సర్వస్వమును కోల్పోయి మరణశిక్ష ననుభవించ వలెను.

28. ధనముతో సంబంధముగల అధికారులను రాజు ఇట్లు శిక్షించి శుచు లుగ చేయవలెను ; శుచులైన వీరు పౌరులను జానపదులను దండముద్వారా శుచులుగ చేయవలెను.[5]

ఇది కంటకశోధనమను నాలుగోఅధికరణమందు సర్వాధికరణరక్షణ మనే తొమ్మిదో అధ్యాయము.

5 ప్రజలలో నేరముచేసినవారు ఎట్లుశిక్షలకుపాత్రులగుచుండిరో, ఉద్యోగులలో నేరముచేసిన వారుకూడ అట్లే శిక్షలకు పాత్రులగుచుండిరి. అందరివిషయమున ఒకేన్యాయము చెల్లుచుండెను. ఇట్టివిధానమునకు ప్రస్తుతకాలమున Rule of Law అనుపేరు ప్రచారములోఉన్నది.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 10

### ప్రకరణము 85 : ఏకాంగవధ నిష్క్రయము[1]

1. తీర్థప్రదేశములలో దొంగతనముచేసినవారికి, ముడివిప్పి ధనము నపహరించువారికి,[2] చేతులు పైకెత్తి తీసుకొనిపోవువారికి, మొదటిసారి నేరము చేసినప్పుడు దండము నడిమివ్రేలిని బొటనవ్రేలిని ఖండించుట ; లేదా, ఏభైనాలుగు పణములు ; రెండవసారినేరమునకు అయిదువ్రేళ్ళను ఖండించుట ; లేదా, నూరు పణములు ; మూడవసారినేరమునకు కుడిచేతిని ఖండించుట ; లేదా, నాలుగువందల పణములు ; నాలుగవసారినేరమునకు (ప్రదేష్ట) ఇష్టానుసారము మరణశిక్ష.

2. ఇరవైఅయిదు పణములలోపు మూల్యముగల కోళ్ళు, ముంగిసలు, పిల్లులు, కుక్కలు, పందులను దొంగిలించినవానికి చంపినవానికి దండము ఏభై నాలుగు పణములు ; లేదా, ముక్కుకొనను ఖండించుట ; చండాలురకు, అడవులలో తిరుగువారికి అర్ధదండము.

3. త్రాళ్ళలోను, వలలలోను, కృత్రిమములగు గోతులలోను బంధింపబడిన జింకలను పశువులను పక్షులను క్రూరమృగములను చేపలను తీసుకొనిపోవువానికి వాని మూల్యమును దానితో సమానమైన మొత్తమును దండము.
4. మృగవనములనుండియు ద్రవ్యవనములనుండియు మృగములను ద్రవ్యములను అపహరించువానికి దండము నూరుపణములు.

5. ప్రదర్శనములకు విహారములకు వినియోగించు మృగములను పక్షులను దొంగిలించువానికి వధించువానికి రెండురెట్లు దండము.

---

[1] అపరాధముచేసినవారి అంగములను ఛేదించుట కౌటిల్యునికాలమునాటి ఆచారము. కాని, దానికిబదులుగ కొన్నిపణముల దండమును విధించుట జరుగుచుండెను. ఏ అంగచ్ఛేదమునకు ఎన్నిపణములదండము నిష్క్రయమో ఈప్రకరణము వివరించుచున్నది.

[2] కట్టుకొనినవస్త్రములో ముడివేసి డబ్బును దాచుకొనుట మామూలు.

6. కారువులయు శిల్పులయు కుశీలవులయు తాపసులయు క్షుద్రకవస్తువులను అపహరించువానికి దండము నూఱుపణములు ; స్థూలకద్రవ్యములను అపహరించువానికి రెండువందలపణములు ; కృషికి సంబంధించిన ద్రవ్యములను అపహరించువానికికూడ ఇదేదండము.

7. ప్రవేశించుటకు అనుజ్ఞలేనప్పుడు దుర్గమును ప్రవేశించువానికి, నిక్షేపమునుతీసుకొని దుర్గప్రాకారములోని ఒకకంతనుండి నిష్క్రమించువానికి శిక్ష పాదకాండముల వధయే ; లేదా, రెండువందల పణముల దండము.

8. బండిని, పడవను, క్షుద్రపశువును అపహరించువానికి ఒకపాదమును వధించుటగాని, మూడువందలపణములుగాని దండము.

9. కృత్రిమములగు గవ్వలతోను, పాచికలతోను, తోలుత్రాళ్ళతోను, శలాకలతోను, హస్తలాఘవముతోను మోసముచేయువానికి ఒకచేతిని వధించుటగాని నాలుగువందలపణములుగాని దండము.

10. దొంగకును వ్యభిచారికిని సహాయముచేయువానికి, వ్యభిచారము చేయుచున్నసమయములో పట్టుపడినస్త్రీకి చెవిని ముక్కును కోసివేయుట ; లేదా, అయిదువందలపణములు దండము, పురుషునికి రెండింతలపండము.

11. పెద్దదియగు పశువునుగాని దాసునిగాని దాసినిగాని ప్రేతముపైని వస్తువులనుగాని అపహరించువానికి రెండుపాదముల వధగాని ఆరువందల పణములుగాని దండము.

12. ఉత్తమవర్ణములవారినిగాని గురువులనుగాని చేతితోను పాదములతోను కొట్టువానికి, రాజయానమును వాహనమును ఎక్కువానికి ఒకచేతిని పాదమును వధించుటగాని, ఏడువందల పణములుగాని దండము.

13. బ్రాహ్మణుడనని చెప్పుకొను శూద్రునకు, దేవాలయద్రవ్యమును దాచువానికి, రాజద్వేషమును ఆదేశించువానికి, రెండుకన్నులను పొడిచినవానికి యోగాంజనము చేత రెండుకన్నులు గ్రుడ్డిగ చేయుటగాని ఎనిమిదివందల పణములుగాని దండము.

14. చోరుని, పరదారను పొందినవానిని తప్పించువానికి, రాజశాసనమును హెచ్చుతగ్గులతో లిఖించువానికి, కన్యనుగాని దాసినిగాని హిరణ్యముతో అపహరించువానికి, కూటవ్యవహారము చేయువానికి శుద్ధముకాని మాంసమును విక్రయించువానికి, ఎడమచేతిని రెండుపాదములను వధించుటగాని, తొమ్మిదివందల పణములుగాని దండము.

15. మనుష్యమాంసమును విక్రయించువానికి మరణశిక్ష.

16. దేవాలయమునకు చెందినపశువులను విగ్రహములను మనుష్యులను క్షేత్రములను ఇండ్లను హిరణ్యమును సువర్ణమును రత్నములను సస్యములను

అపహరించువానికి ఉత్తమసాహసదండము ; లేదా, శుద్ధవధ.

17-18. (శ్లో) పురుషుడు, అపరాధము, కారణము, అపరాధము సామాన్యమా పెద్దదా, భవిష్యత్తులో దానిఫలితములు, ఇప్పటిఫలితములు, దేశకాలములు — వీనినన్నిటినిగురించి ప్రదేష్ట సమాలోచనముచేసి రాజుయెడలగాని ప్రజలయెడలగాని పక్షపాతము లేక పూర్వమధ్యమోత్తమదండములను విధించవలెను.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు ఏకాంగవధ నిష్క్రయము[3] అనే పదో అధ్యాయము.

[3] అంగవధ అతిక్రూరమైనట్టిది. అందుచేతనే దానికి బదులు హిరణ్యరూప మగు నిష్క్రయము విధింపబడినది.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 11

### ప్రకరణము 86 : శుద్ధచిత్ర దండకల్పము[1]

1. కలహములో ఒకనిని చంపినవానికి చిత్రవధయే దండము. 2. (కలహము తర్వాత) ఏడురోజులలోపల చనిపోయినపక్షమున శుద్ధవధయే దండము; పక్షమురోజులలో చనిపోయినపక్షమున ఉత్తమసాహసదండము; మాసములోపల చనిపోయినపక్షమున అయిదువందలపణములు దండము. (మధ్యకాలములో) వైద్యఖర్చు ఇచ్చుకొనవలెను.[2]

3. ఒకనిని శస్త్రముతో కొట్టినయెడల ఉత్తమసాహసదండము. 4. మత్తెక్కిన కారణమున కొట్టినయెడల హస్తవధ; మోహముచేత కొట్టినయెడల రెండువందలపణముల దండము. 5. వధకు వధయే శిక్ష.

6. కొట్టి గర్భస్రావమును గావించినయెడల ఉత్తమసాహసదండము; ఔషధ మిచ్చి గర్భస్రావమునుగావించినయెడల మధ్యమసాహసదండము; పరిక్లేశముచేత ఇట్లు చేసినయెడల పూర్వసాహసదండము.

7. బలప్రయోగముచేసి పురుషునిగాని స్త్రీనిగాని కొట్టువారిని, వారిపై పడువారిని, వారినిపట్టుకొని క్రిందపడవేయువారిని, చంపెదమని బెదరించువారిని, వారిని అటకాయించువారిని పొడుచువారిని, రహదారులలో దోపిడిచేయువారిని, ఇండ్లను దోచుకొనువారిని, రాజునకు చెందిన ఏనుగునుగాని గుర్రమునుగాని చంపువారిని, లేదా, దొంగిలించి తీసుకొనిపోవువారిని, రాజరథమునకు నష్టము కలిగించువారిని, లేదా, దొంగిలించి తీసుకొనిపోవువారిని శూలము నెక్కించి చంపవలెను. 8. ఎవరైన ఇట్టివారిని (మరణానంతరము) దహనము చేసినను, లేదా,

[1] శుద్ధమగు మరణశిక్ష, హింసతోకూడిన మరణశిక్ష—ఈ రెంటినిగురించి ఈ ప్రకరణములో వివరణ మున్నది.

[2] వైద్యఖర్చు ఏడురోజులైనను పక్షమైనను మాసమైనను భరించవలసినదే.

శూలమునుండి విడిపించినను ఇట్టిశిక్షనే అనుభవించవలెను ; లేదా, ఉత్తమసాహస దండమును చెల్లించవలెను.

9. ఘాతుకులకుగాని దొంగలకుగాని ఆహారము, నివాసము, ఉపకరణ ములు, నిప్పు, సలహాలను ఇచ్చినవానికిని, మరి యేవిధముగనైన సహాయము చేసినవానికిని ఉత్తమసాహసదండము ; తెలియక ఇట్లు చేసినపక్షమున హెచ్చ రికయే దండము. 10. ఘాతుకులయు దొంగలయు భార్యాపుత్రులను (వారితో) కలిసి పనిచేయనప్పుడు వదలివేయవలెను ; కలిసిపనిచేసినప్పుడుపట్టుకొనవలెను.

11. రాజ్యమును కాంక్షించువానిని, అంతఃపురముపై పడువానిని, ఆట వికులకు శత్రువులకు ప్రోత్సాహము కల్పించువానిని, దుర్గములోను రాష్ట్రము లోను సైన్యములోను తిరుగుబాటును పురికొల్పువానిని, హస్తములు శిరస్సును కాల్చి చంపివేయవలెను. 12. (ఇట్టి) బ్రాహ్మణుని చీకటిగదిలోపడవేయవలెను.

13. తల్లిని తండ్రిని పుత్రుని సోదరుని ఆచార్యుని తాపసుని చంపినవాని తలమీది చర్మమును వొలిచి తలకు నిప్పుఅంటించి చంపివేయవలెను. 14. వారిని దూషించినవాని నాలుకను కోసివేయవలెను ; ఏదైన అంగమును బాధించినయెడల వాని అదేఅంగమును ఛేదించవలెను.

15. ప్రమాదవశమున ఒకరిని చంపినవానికిని పశువులమందలను అపహ రించినవానికిని శుద్ధవధయే దండము. 16. మందఅని అనిపించుకొనుటకు అధమ పక్షము పదిపశువులైన ఉండవలెను.

17. నీటితోనిండిన చెరువుగట్టును కోసివేయువానికి అందులో ముంచి వేయుటయే శిక్ష ; నీళ్లులేని చెరువువిషయములో ఉత్తమసాహసదండము ; పాడు పడి ఉపయోగములో లేని చెరువువిషయమున మధ్యమసాహసదండము.

18. విషముపెట్టువానిని నీటిలోముంచివేయవలెను ; పురుషునిచంపిన స్త్రీకి గర్భిణి కానప్పుడు, ప్రసవించి ఒకనెల కానప్పుడు—ఇదే శిక్ష. 19. భర్తనుగాని గురువునుగాని సంతానమునుగాని హత్యచేసినస్త్రీని, ఇంటికి నిప్పు అంటించిన స్త్రీని, విషమిచ్చినదానిని, తలుపులను బద్దలుచేసి ఇంటిలో ప్రవేశించినదానిని, ఎద్దులచే త్రొక్కించవలెను.

20. వివీతములకు, క్షేత్రములకు, కళ్ళములకు, ఇండ్లకు, ద్రవ్యవనము నకు, హస్తివనమునకు నిప్పుపెట్టువానిని నిప్పులో పడవేసి కాల్చివేయవలెను.

21. రాజును దూషించువానియు, రాజరహస్యములను బయటపెట్టు వానియు, రాజద్వేషమును ప్రచారముచేయువానియు, బ్రాహ్మణునివంటఇంటిలోని వస్తువుల రుచిచూచినవానియు నాలుకను మూలమట్టముగ తీసివేయవలెను.

22. ఆయుధములను కవచములను దొంగిలించినవాడు సైనికుడు కాని యెడల మరణశిక్షను అనుభవించవలెను. 23. సైనికుడయినయెడల ఉత్తమ

సాహసదండమును చెల్లించవలెను.

24. పురుషుని పురుషాంగమును వృషణములను ఛేదించినవానికి అట్టి ఛేదనమే శిక్ష.

25. నాలుకనుగాని ముక్కునుగాని హింసించినవాని నడిమివ్రేలును ఖండించవలెను.

26. (శ్లో) మహాత్ములచే శాస్త్రములందు ఇట్టికఠినశిక్షలు విధింపబడినవి. ఘోరములుకాని పాపకార్యములు చేసినపుడు శుద్ధవధయే ధర్మము.[3]

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు శుద్ధచిత్ర దండకల్పము అనే పదకొండో అధ్యాయము.

[3] ఈ శిక్షలన్నియు ఘోరములని కౌటిల్యుని అభిప్రాయము. అందుచేత అతడు చిత్రవధకు బదులు శుద్ధవధను సమర్థించెను.

## అధ్యాయము 12

### ప్రకరణము 87 : కన్యాప్రకర్మ

1. స్వవర్ణమునకు చెందిన రజస్వలకాని కన్యను బలాత్కరించినవానికి హస్తవధగాని, నాలుగువందలపణములుగాని దండము. 2. కన్య చనిపోయిన యెడల మరణశిక్ష.

3. రజస్వల అయినకన్యను బలాత్కరించినవానికి నడిమివ్రేలు చూపుడు వ్రేలు ఖండించడముగాని, రెండువందలపణములుగాని దండము. 4. తండ్రికి కలిగిననష్టమునకు పరిహారము నిచ్చుకొనవలెను. 5. ఆమెకుఇష్టములేనప్పుడు ఆమెను వివాహమాడుహక్కు అతనికిలేదు. 6. ఆమె ఇష్టపడినపక్షమున అతడు ఏబైనాలుగుపణములదండమును, ఆమె అందులో సగముదండమును చెల్లించ వలెను. 7. అంతకుముందే ఆమెకై మరియొకడు శుల్కము చెల్లించి ఉండిన యెడల (బలాత్కరించినవానికి) హస్తవధగాని, నాలుగువందల పణములుగాని దండము ; అతడు శుల్కధనమునుకూడ ఇయ్యవలెను.

8. కన్యావరణము జరిగి ఏడుఋతుకాలములు గడచినపిమ్మటకూడ కన్య తన్ను చేరనప్పుడు ఆమెతో సంబంధముపెట్టుకొనుహక్కు వరునికి కలదు ; అట్టిసందర్భములో తండ్రికి పరిహారమియ్యవలసినదిలేదు. 9. ఆమెఋతుకాలము లను వ్యర్థపుచ్చినకారణమున ఆమెపై తండ్రికి ఎట్టిస్వామ్యము ఉండదు.

10. రజస్వల అయినతర్వాత మూడుసంవత్సరములలోపల సవర్ణుని పొందుట కన్యకు దోషముకాదు ; అటుతర్వాత తనఅలంకారములను వదలుకొని అవర్ణునికూడ పొందవచ్చును. 11. కాని, (అలంకారరూపమగు) పితృద్రవ్య మును తీసుకొనిపోయినయెడల చోరదండమును భరించవలెను.

12. కన్యను ఒకరికని నిశ్చయించి తానే వివాహమాడదలచినవానికి రెండు వందలపణముల దండము. 13. ఆమె ఇష్టపడనప్పుడు ఆమెను వివాహ మాడరాదు.

14. ఒకకన్యను చూపి మరియొకకన్యను ఇచ్చువానికి—కన్య సవర్ణ అయినప్పుడు—దండము నూరుపణములు ; అపరవర్ణమునకు చెందినప్పుడు దండము రెండురెట్లు.

15. నిషేకమునాటికి కన్యాత్వము కోల్పోయినయెడల (ఆమె) ఏభై నాలుగుపణములదండమును చెల్లించి, శుల్కమును వివాహఖర్చులను వాపసు చేయవలెను. 16. కన్యాత్వమును కోల్పోలేదనిచెప్పి దానిని రుజువుచేయలేని పక్షమున దండము రెండింతలు. 17. శోణితమును మార్చినయెడల దండము రెండు వందలపణములు ; కన్యపై (కన్యాత్వముకోల్పోయినట్లు) అపనిందవేయువానికి కూడ ఇదేదండము. 18. అతడు శుల్కమును ఖర్చులను వదలుకొనవలెను.

19. ఆమె ఇష్టపడనప్పుడు ఆమెను కోరరాదు.

20. ఇంకొక స్త్రీచేత కన్యాత్వమును కోల్పోవుటకు అంగీకరించినకన్య సవర్ణఅయినయెడల పండ్రెండు పణముల దండమును చెల్లించవలెను ; కోల్పోవు నట్లు చేసినస్త్రీ రెండింతలదండమును చెల్లించవలెను. 21. కన్యయొక్క అంగీ కారములేనప్పుడు ఆత్మరాగార్థమై ఆమె నూరుపణముల దండమును చెల్లించి శుల్కమును ఇయ్యవలెను.

22. స్వయముగ కన్యాత్వమును కోల్పోయినస్త్రీ రాజదాసి కావలెను.

23. గ్రామమునకువెలుపల కన్యను బలాత్కరించినవానికిని, బలాత్కా రము జరిగినట్లు అసత్యము పలుకువానికిని దండము రెండింతలు.

24. బలప్రయోగముచేసి కన్యను అపహరించువానికి దండము రెండు వందలపణములు ; బంగారము (ఆభరణముల) తో అపహరించువానికి ఉత్తమ సాహసదండము. 25. అనేకులు కలిసి ఒకకన్యను అపహరించినపుడు వారిలో ఒక్కొకరు యథోక్తదండమును చెల్లించవలెను.

26. గణికాకుమార్తెను బలాత్కరించినవానికి దండము ఏభైనాలుగు పణములు ; తల్లికి ఒకభోగమునకు చెల్లించవలసిన ధనమునకు పదహారురెట్లు శుల్కమునుకూడ అతడు ఇచ్చుకొనవలెను. 27. దాసునికుమార్తెనుగాని, దాసి కుమార్తెనుగాని బలాత్కరించినవాడు—కుమార్తె దాసికానప్పుడు—ఇరవైనాలుగు పణములదండమును శుల్కమును ఆభరణముల మూల్యమును చెల్లించవలెను. 28. నిష్క్రయమును చెల్లించి, స్వేచ్ఛను అనుభవించుచున్నదాసినిబలాత్కరించు వాడు పండ్రెండుపణములదండమును, వస్త్రములయు భూషణములయు మూల్య మును ఇయ్యవలెను.

29. సహాయము చేసినను నివాస మిచ్చినను అపరాధిచెల్లించుదండమునే చెల్లించవలెను.

30. భర్త ప్రవాసమందున్నప్పుడు అపచారముచేయుభార్యను పతిబంధువు

గాని భృత్యుడుగాని అదుపులో ఉంచవలెను. 31. అదుపులో ఉంచబడినట్టిదై ఆమె భర్తరాకకై నిరీక్షించవలెను. 32. భర్త క్షమించినపక్షమున ఉభయులు విముక్తులు కావచ్చును. 33. అతడు క్షమించనిపక్షమున ఆమె చెవిని ముక్కును కోసివేయవలెను; జారుని వధించవలెను.

34. జారుని చోరుడని సమర్థించినప్పుడు దండము అయిదువందల పణములు;[1] ధనము నిచ్చి అతనిని విడిపించువానికి దీనికి ఎనిమిదిరెట్లు.

35. వెండ్రుకలను పరస్పరము చరచుకొనుటమూలముననుం, శరీరముపై భోగించిన గుర్తు లుండుటమూలముననుం, కుశలుల అభిప్రాయముమూలముననుం స్త్రీవచనము మూలముననుం వ్యభిచారము జరిగినట్లు గ్రహించవలెను.

36. శత్రుసైన్యములుగాని ఆటవికులుగాని అపహరించి తీసుకొని పోయినస్త్రీనిగాని, ప్రవాహవేగమున కొట్టుకొనిపోయిన స్త్రీనిగాని, అరణ్యమందు వదలివేయబడినస్త్రీని, దుర్భిక్షకాలమందు వదలివేయబడినస్త్రీని, లేదా, చనిపోయి నట్లుభావించి వదలివేయబడినస్త్రీని రక్షించినవాడు ఒప్పందము ప్రకారము ఆమెను అనుభవించవచ్చును. 37. ఆమె అతనికంటె ఉత్తమవర్ణమునకు చెందియుండి నపుడు, లేదా, ఇష్టపడనప్పుడు, లేదా, సంతానవతి అయినప్పుడు నిష్క్రయధన మును పుచ్చుకొని ఆమెను ఇచ్చివేయవలెను.

38-48. (శ్లో) దొంగలనుండి, నదీవేగమునుండి, దుర్భిక్షమునుండి దేశములోని అరాజకమునుండి రక్షించిన పరస్త్రీని, అరణ్యములో వదలివేయ బడినస్త్రీని, మరణించినట్లుభావించివదలివేయబడినస్త్రీని రక్షించినినవాడు ఒప్పం దముప్రకారము అనుభవించవచ్చును. కాని, రాజప్రతాపముచేగాని స్వబంధువు లచేగాని రక్షింపబడినస్త్రీని, ఉత్తమవర్ణమునకు చెందినదానిని, అంగీకరించని దానిని, సంతానముకలదానిని అనుభవించరాదు. తగిన నిష్క్రయధనమును పుచ్చుకొని ఆమెను బంధువులకు ఇచ్చివేయవలెను.

ఇది కంటకశోధనమను నాలుగోఅధికరణమందు కన్యాప్రకర్మ అనే పన్నెండో అధ్యాయము.

---

[1] జారునిపై విధించుదండము చోరునిపై విధించుదానికంటె ఎక్కువ.

# నాలుగో అధికరణము

## అధ్యాయము 13

### ప్రకరణము 88 : అతిచారదండములు

1. అపేయములు అభక్ష్యములు అగుపదార్థములను బ్రాహ్మణునిచే తిని పించువానికి ఉత్తమసాహసదండము; క్షత్రియునిచే తినిపించువానికి మధ్యమ దండము; వైశ్యునిచే తినిపించువానికి పూర్వసాహసదండము; శూద్రునిచే తినిపించువానికి ఏభైనాలుగుపణములదండము. 2. స్వయముగ తినువారికి దేశ బహిష్కారదండము.

3. పగటిపూట ఒకనిఇంటిలోనికి ప్రవేశించువానికి పూర్వసాహస దండము; రాత్రిపూట మధ్యమదండము. 4. రాత్రిపూటగాని పగలుగాని ఆయు ధముతో ప్రవేశించువానికి ఉత్తమసాహసదండము. 5. భిక్షుకులు, వర్తకులు, మత్తులు, ఉన్మత్తులు, బలప్రయోగముచే భయపడిన పొరుగువారు, ఆపత్తులో ఉండుపొరుగువారు, మామూలుగ ఇంటికివచ్చువారు—రాకూడదని చెప్పినప్పుడు తప్ప—వీరికి దండము లేదు. 6. అర్ధరాత్రమందు తనఇంటి ప్రహరీగోడను ఎక్కువానికి పూర్వసాహసదండము; మరియొకని ఇంటిగోడను ఎక్కువానికిని, గ్రామారామముకంచెను భగ్నముచేయువానికిని మధ్యమదండము.

7. సార్థవాహులు (గ్రామాధికారులకు) తమసరకులను తెలియపరచి గ్రామములోపల ఉండవచ్చును. 8. వాటిలో దొంగిలింపబడినవస్తువునకు, చంప బడినప్రాణికి—రాత్రిపూట బయటికి పంపనప్పుడు—గ్రామాధికారి నష్టపరిహార మియ్యవలెను. 9. రెండుగ్రామములకు మధ్య దొంగిలింపబడినవాటికి చంపబడిన వాటికి వివీతాధ్యక్షుడు పరిహారమియ్యవలెను. 10. వివీతములేని ప్రదేశములలో చోరరజ్జుకుడు పరిహారమియ్యవలెను. 11. వానిని రక్షించవలసినబాధ్యతలేని సంద ర్భములోకూడ పొలిమేరలకు విరుద్ధముకానట్లు వాటిని వెదకుటకు గ్రామస్థులు అనుజ్ఞనియ్యవలెను. 12. పొలిమేర నిశ్చయములేనప్పుడు అయిదేసి గ్రామముల

వారుగాని పదేసి గ్రామములవారుగాని వెదకుటకు అనుజ్ఞనియ్యవలెను.

13. దుర్బలముగ కట్టబడిన ఇంటిమూలమునను, ఆధారములేని ఊర్ధ్వ స్తంభముతో తయారయిన బండిమూలమునను, ఆశ్రయములేని శస్త్రముమూల మునను, కప్పబడనిగొయ్యి బావులమూలమునను, రహస్యముగ త్రవ్విన గొయ్యి మూలమునను అపాయముకలిగించినయెడల దండపారుష్యమని ఎరుగవలెను.

14. చెట్టునునరుకునప్పుడు ; మచ్చికపరచబడు జంతువునకు మోకుకట్టి లాగునప్పుడు ; చతుష్పాత్తులలో మచ్చికకానిదానిని ఉపయోగించునప్పుడు, ఎక్కు నప్పుడు ; కట్టెముక్కలను మట్టిపెళ్ళలను, రాళ్ళను, కర్రలను, బాణములను, చేతులను విసరునప్పుడు ; బండితోగాని ఏనుగుతోగాని ఢీకొట్టుకొన్నప్పుడు "వెళ్ళుడు" అని కేకవేసినయెడల దండము లేదు.

15. రోషముతోనున్న ఏనుగుచే చంపబడవలెనని అనుకొనినవాడు దానికి ఒకద్రోణముఅన్నమును, ఒకపంటెడుమద్యమును, పుష్పమాలను, సుగంధ ద్రవ్యములను, దంతములను శుభ్రపరచుటకు వస్త్రమును ఇయ్యవలెను. 16. ఏను గుచే చంపబడుట అశ్వమేధ యాగపు అవభృథస్నానముతో సమానమైనది ; అందుచేత (ఏనుగు) పాదప్రక్షాళనముచేయుట. 17. అట్టిచావును కోరనివానిని (ఏనుగు పాదముల క్రింద పడవేసి) చంపినయెడల మావటివానికి ఉత్తమసాహస దండము.

18. కొమ్ములు కోరలుకల జంతువులచే హింసింపబడువానిని (ఆ జంతువుల) యజమాని రక్షించనప్పుడు పూర్వసాహసదండము నిచ్చుకొనవలెను ; పిలిచినను రక్షించనప్పుడు రెండింతలదండము. 19. ఇట్టిజంతువులు అన్యోన్యము చంపు కొనినపుడు ఈదండముతోకూడ మరింతదండము.

20. దేవాలయపశువును, ఆబోతును, ఆవుపెయ్యను ఎక్కి స్వారిచేయు వానికి దండము అయిదువందలపణములు ; వీటినిచంపినవానికి ఉత్తమదండము. 21. రోమములకును, పాలకును, స్వారిచేయుటకును ఆబోతులుగను ఉపయోగించు క్షుద్రజంతువులను దొంగిలించువానికి అట్టిదండముతోకూడ దానితో సమానమగు దండము ; దేవపితృకార్యములకు కాక తక్కిన సందర్భములలో వానిని చంపిన వానికికూడ ఇదేదండము.

22. ఎద్దుల ముక్కుత్రాడు తెగినప్పుడు, కాడవిరిగినప్పుడు, పశువులయు మనుష్యులయు సమ్మర్దముకారణముగ బండి అడ్డముగగాని వెనుకకుగాని తిరిగి నప్పుడు అపాయము కలిగినయెడల బండితోలువానికి దండములేదు. 23. అట్లు కానప్పుడు మనుష్యులకు ఇతరప్రాణులకు హింసకలిగించినందులకు ఇయ్యవల సిన దండమును భరించవలెను. 24. మనుష్యేతర ప్రాణులు చనిపోయిన యెడల వానిమూల్యమునుకూడ ఇచ్చుకొనవలెను.

25. బండితోలువాడు బాలుడైనప్పుడు బండికి సొంతదారుడు దండము చెల్లించవలెను; సొంతదారుడు హాజరులో లేనప్పుడు బండిలో ఉన్నవాడుగాని, వ్యవహారప్రాప్తికల బండితోలువాడుగాని చెల్లించవలెను. 26. బాలుని వశమందుండుబండిని, ఎవరులేనిబండిని రాజు స్వాధీనము చేసుకొనవలెను.

27. మంత్రములవలనగాని అభిచారములవలనగాని ఒకడు ఇంకొకనికి ఎట్టి ఆపదను కలిగించునో అట్టిఆపదనే అతడు అనుభవించునట్లు శిక్షింపబడవలెను. 28. భర్తనుకామించని భార్యవిషయమునను, భార్యార్థి అయినవాడు కన్యవిషయమునను, భార్య భర్తవిషయమునను సంవదనకర్మము[1] వినియోగించవచ్చును. 29. (ఇతరసందర్భములలో వినియోగించి) హింసించినపుడు మధ్యమసాహస దండము.

30. తల్లిసోదరినిగాని, తండ్రిసోదరినిగాని, మేనమామభార్యనుగాని, ఆచార్యునిభార్యనుగాని, కోడలినిగాని, కుమార్తెనుగాని, సోదరినిగాని, కామించినవానికి త్రిలింగచ్ఛేదనము; తత్కారణముగ వధయు దండములు. 31. వీరిలోఎవరైన అతనిని కామించినయెడలను, దాసునిగాని పరిచారకునిగాని తాకట్టులోనిపురుషునిగాని కామించినయెడలను ఇట్టిశిక్షయే.

32. రక్షణలేని బ్రాహ్మణస్త్రీని కూడిన క్షత్రియునికి ఉత్తమసాహస దండము; వైశ్యునికి సర్వస్వదండము; శూద్రునికి గడ్డిమంటలో దహనము దండము.

33. రాజభార్యను కూడినవానికి అన్నిసందర్భములందు పాత్రలో ఉడికించుటయే దండము.

34. శ్వపాకిని కూడినవాడు కబంధముద్రను ధరించి దేశాంతరమునకువెళ్ళిపోవలెను; శూద్రుడైనపక్షమున శ్వపాకత్వమును పొందవలెను. 35. ఆర్యస్త్రీని కూడిన శ్వపాకునికి మరణశిక్ష; స్త్రీకి కర్ణనాసాచ్ఛేదనము.

36. ఇల్లువదలి వెళ్ళిపోయినస్త్రీని కూడినవానికి ఇరవైనాలుగు పణముల దండము. 37. సకామఅయినయెడల ఆమెకు అదేదండము.

38. బలాత్కరించి వేశ్యనుకూడినవానికి దండము పండ్రెండుపణములు. 39. అనేకులుకలిసి బలాత్కరించినయెడల ఒక్కొకరు ఇరువైనాలుగుపణముల దండమును చెల్లించవలెను.

40. యోని కాక ఇంకొక అవయవమందు స్త్రీని కూడిన పూర్వసాహస దండము; పురుషుని మోహించువానికికూడ ఇదేదండము.

[1] పురుషుడు స్త్రీనిగాని, స్త్రీ పురుషునిగాని వశముచేసుకొనుటకై ఉపయోగ మందుండిన మంత్రవిధానము.

41. (శ్లో) ఆత్మజ్ఞానములేక తిర్యగ్యోనులయందు క్రీడించువానికి దండము పంద్రెండుపణములు; దేవతాప్రతిమలను పొందువానికి రెండింతల దండము.

42. (శ్లో) నిర్దోషులను దండించినరాజు దానికి ముప్ఫైరెట్లదండమును వరుణదేవుని ఉద్దేశించి నీటిలోపడవేసి దానిని తర్వాత బ్రాహ్మణులకు పంచిపెట్టవలెను.

43. (శ్లో) అన్యాయముగా విధించినదండమువలన కలుగు పాపమునుండి ఈవిధముగ రాజు పునీతుడగుచున్నాడు; ఏలయన, మనుష్యులయెడ ధర్మవిరుద్ధముగ ప్రవర్తించురాజులను శాసించువాడు వరుణదేవుడు.

ఇది కంటకశోధనమను నాలుగో అధికరణమందు అతిచారదండములు అనేపదమూడో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు కంటకశోధనమను నాలుగో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## అయిదో అధికరణము

## యోగవృత్తము[1]

### అధ్యాయము 1

### ప్రకరణము 89 : దాండకార్మికము[2]

1. దుర్గమునుండియు రాష్ట్రమునుండియు కంటకములను తొలగించు విషయము వివరింపబడినది. 2. ఇప్పుడు రాజునకు రాజత్వమునకు ప్రమాదము కలిగించు కంటకములను తొలగించు విషయము వివరించవలసియున్నది.

3. రాజును తమఅధీనములో ఉంచుకొని జీవించినట్టియు, శత్రురాజులతో కలిసి జీవించునట్టియు, ప్రధానాధికారులు కలిగించు ప్రమాదములనుండి రక్షించుకొనుటకు గూఢపురుషుల వినియోగము, కృత్యపక్షములవారిని చేరదీయుట, సాధనములని ఇదివరకే చెప్పియున్నాము ; (ఇవి గాక) ఉపజాపము ఉపసర్పములు కూడ దీనికి సాధనములను విషయము శత్రుదుర్గములను వశపచుకొనుటనుగురించిన అధ్యాయములో వివరించుచున్నాము.

4. రాజ్యమునకు హానిచేయునట్టియు, రాజవల్లభులయినట్టియు, (ఇద్దరు ముగ్గురు) కలిసి పనిచేయునట్టియు, ప్రధానాధికారులను బహిరంగముగ అణచివేయుట సాధ్యముకానప్పుడు[3] ధర్మమందాసక్తిగలరాజు వారిపై రహస్యదండమును ప్రయోగించవలెను.

---

1 యోగవృత్తమనగా రహస్యప్రవర్తనము.

2 దాండకార్మికమనగా రహస్యముగ శిక్షను విధించుట.

3 బహిరంగముగ వారిని న్యాయస్థానములలో విచారణచేసి శిక్షించుట సాధ్యముకాని పరిస్థితులుండవచ్చును. ప్రస్తుతకాలపు ప్రజాస్వామికము లందు తప్ప తక్కినపరిపాలన విధానములలో రహస్యశిక్షణ న్యాయసమ్మతమని పరిగణింపబడుచున్నది.

5. (రాజును) ద్వేషించిన మహామాత్రునిగౌరవమునకు దూరుడైన (అతని) సోదరుని గూఢచారి ప్రోత్సహించి రాజునకు చూపించవలెను. 6. ద్వేషించినవాని ఆస్తిని సోదరుడు అనుభవించవచ్చునని రాజు అతనికి చెప్పి, మహామాత్రునిపై కలహించవలసినదిగ అతనిని ఆదేశించవలెను. 7. శస్త్రము చేతగాని విషముచేతగాని అతడు (మహామాత్రుని) చంపిన వెంటనే "భ్రాతృ ఘాతుకు" డని ప్రకటించి అతనిని అచ్చటనే శిరశ్ఛేదము చేయించవలెను. 8. పారశవ[4] పరిచారికా పుత్రులవిషయమున కూడ ఇట్లేచేయవలసినదని దీని నుండి తెలుసుకొనవలెను.

9. లేదా, గూఢచారునిచే ప్రోత్సహింపబడిన సోదరుడు తనదాయమును పంచిఇయ్యవలసినదిగ దూష్యుడైన మహామాత్రుని కోరవలెను. 10. దూష్యుని ఇంటిముందు రాత్రిపూట పడుకొనియున్నప్పుడుగాని, మరియొకప్రదేశమం దున్నప్పుడుగాని ఘాతుకుడొకడు అతనిని చంపి. "దాయములో భాగమును కోరిన ఈతడు చంపబడెను." అని ప్రకటించవలెను. 11. రాజు చనిపోయినవాని బంధువులపక్షమును బలపరిచి మహామాత్రుని అణచివేయవలెను.

12. లేదా, గూఢపురుషులు దూష్యుని సమీపమందుచేరి దాయభాగమును కోరుసోదరుని బెదరించవలెను. 13. తక్కిన దంతయు పైనిచెప్పబడిన విధము గనే జరుగవలెను.

14. ద్వేషించిన మహామాత్రులిద్దరు కలిసినప్పుడు పుత్రుడు తండ్రిభార్య లలో నొకతెను, తండ్రి పుత్రునిభార్యను, సోదరుడు సోదరునిభార్యను కామించె నని గూఢపురుషుడు ప్రకటించి వారిమధ్య కలహమును కల్పించి పైవిధముగ చేయవలెను.

15. లేదా, ద్వేషించిన మహామాత్రుని పుత్రులలో తానుమిక్కిలి గొప్ప వాడనని భావించువానిని గూఢపురుషుడు చేరదీసి వానితో, "నీవురాజపుత్రుడవు. శత్రుభయమువలన రక్షణకై ఇచట దాచబడితివి" అని చెప్పవలెను. 16. అత డా మాటలను విశ్వసించినయెడల రాజు రహస్యముగ అతనిని గౌరవించి, "యువ రాజుగ పట్టాభిషిక్తుడవు కావలసినకాలము వచ్చినను మహామాత్రుని భయము వలన నేనునీకుపట్టాభిషేకముచేయలేకున్నాను" అనిచెప్పవలెను. 17. (తర్వాత) గూఢపురుష డతనిని మహామాత్రునివధకు పురికొల్పవలెను. 18. అత డాపనిని చేసినతర్వాత, "ఇతడు పితృఘాతుకుడు," అని అతనిని చంపివేయవలెను.

19. లేదా, భిక్షుకివేషములోనున్న గూఢచారి మహామాత్రుని భార్యను సంవాదనికము లగు ఔషధములచే వశపరచుకొని విషప్రయోగము గావించి వారిని మోసము చేయవలెను.

---

[4] పారశవుడనగా బ్రాహ్మణునికి శూద్రస్త్రీవలన కలిగిన పుత్రుడు.

20. ఇంతటితో బంధువులద్వారా చేయదగిన రహస్యోపాయములు సమాప్తము.

21. ద్వేషించిన మహామాత్రునికి సారహీనమైనదియు రహస్యహంతకులతో కూడినదియు అగుసైన్యమునిచ్చి ఆటవికులనుగాని శత్రుగ్రామములనుగాని నాశముచేయుటకో, అరణ్యప్రవేశములతో వేరుచేయబడిన ప్రాంతమందు రాష్ట్రపాలునిగాని అంతపాలునిగాని స్థాపించుటకో, తిరుగుబాటుచేసిన నాగరికుని స్థానమును వశపరచుకొనుటకో, శత్రువునకు సులభసాధ్యమగు ప్రదేశపు పొలిమేరలోని సార్థవాహుల రహదారిని ఆక్రమించుటకో పంపవలెను. 22. రాత్రిగాని పగలుగాని యుద్ధము జరుగుచుండగా రహస్యఘాతుకులుగాని దారిదోపిడిగాండ్ర వేషములోఉండు గూఢపురుషులుగాని అతనిని చంపి "యుద్ధములో అతడు చంపబడినాడు" అని ప్రకటించవలెను.

23. రాజు యాత్రకో విహారమునకో వెళ్ళి ద్వేషించిన మహామాత్రులను తనదర్శనమునకు రావలిసినట్లుగ ఆహ్వానించవలెను. 24. రహస్యముగ దాచుకొనిన శస్త్రములతో కూడినహంతకులు కొందరు వీరితో కలిసి మధ్యమకక్ష్యను ప్రవేశించు సమయమున దౌవారికులు వీరిఅనుజ్ఞతో ప్రవేశించు వారినందరిని శోధించవలెను. 25. అప్పుడు దౌవారికులకు పట్టుబడిన ఘాతుకులు, "ద్వేషించిన మహామాత్రులు మమ్ములను పిలుచుకొని వచ్చినారు" అని ప్రకటించవలెను. 26. అట్లు ప్రకటించి, వారు దూష్యులని చంపవలెను. 27. ఘాతుకులకు బదులు మరికొందరు మరణశిక్షను పొందవలెను.

28. లేదా, (నగరమునకు) అవల విహారార్థము వెళ్ళినరాజు తన నివాసమునకు సమీపముననే దూష్యులగు మహామాత్రులకు నివాసములేర్పరచి గౌరవించవలెను. 29. రాజమహిషివేషమును ధరించిన దుర్మార్గురాలి నొకతెను రాత్రిపూట వారినివాసములలో పట్టుకొని, అటుతర్వాత వారివిషయమై పైన చెప్పినట్లు ప్రవర్తించవలెను.

30. లేదా, దూష్యమహామాత్రునితో రాజు "నీవంటివాడు భక్ష్యముల చేయువాడు నేర్పరులు," అని స్తుతించి విందునకు ఆహ్వానించవలసినదిగ కోరవలెను; లేదా, ప్రయాణసమయములో పానీయమునకు ఆహ్వానించవలసినదిగ కోరవలెను. 31. అరెంటిని విషముతోకలిపి వారిద్దరు[5] మొదట రుచిచూడవలసినదిగ కోరవలెను. 32. అమాటలనుచెప్పి వారిద్దరు విషప్రయోగము చేసినట్లు ప్రకటించి వారిని చంపివేయవలెను.

33. సిద్ధునివేషము ధరించిన గూఢచారి అభిచారమంత్ర ప్రయోగమందు విశ్వాసముగల మహామాత్రునితో, "బల్లి, తాబేలు, ఎండ్రకాయ, విరిగినకొమ్ము

[5] ఇద్దరనగా కలిసి కుట్రచేయు ఇద్దరుమహామాత్రులు.

లను (ఇతరములగు) మంచి లక్షణములనుగల ఎద్దు—వీటిలో దేనినైనను తినిన యెడల నీమనోరథము సిద్ధించును," అనిచెప్పి వశపరుచుకొనవలెను. 34. అత డంగీకరించిన తర్వాత అభిచారకర్మ జరుగుచుండగా విషప్రయోగముచేగాని ఇనుపరోకలితోగాని అతనిని చంపించి, "అభిచారకర్మలోని లోపము మూలమున అతడు చనిపోయెను," అని ప్రకటించవలెను.

35. లేదా, వైద్యునివేషముధరించిన గూఢచారి కష్టసాధ్యమగు మహా వ్యాధివలన మహామాత్రుడు బాధపడుచున్నట్లు నమ్మకముకలిగించి ఔషధములో గాని ఆహారములోగాని విషమును కలిపి యొసగించవలెను.

36. లేదా, వంటవారుగను వడ్డించువారుగను నియోగింపబడిన గూఢ చారులు విషప్రయోగముచేసి దూష్యుని తుదముట్టించవలెను.

37. దీనితో రహస్యసాధనములద్వారా అణచివేయుట అను విషయము సమాప్తము.

38. ఇద్దరుదూష్యులను అణచివేయుట: 39. వారిలో ఒకనికి సారహీన మైనట్టియు ఘాతుకలతోకూడినట్టియు సైన్యమునిచ్చి రెండవవానిని అణచవలసిన ప్రదేశమునకు ఈక్రిందిమాటలనుచెప్పి పంపవలెను: "వెళ్ళి, ఆ దుర్గమందుగాని రాష్ట్రమందుగాని సైన్యమునుగాని హిరణ్యమునుగాని సమకూర్చుము; వల్లభుని నుండి హిరణ్యమును లాగుము; వల్లభుని కుమార్తెను పట్టితీసుకొనిరమ్ము; దుర్గనిర్మాణము, సేతునిర్మాణము, రహదారినిర్మాణము, శూన్యప్రదేశములందు నివేశముల నిర్మాణము, గనులత్రవ్వకము, ద్రవ్యవనములయు హస్తివనము లయు ఏర్పాటు—వీటిలో ఒకదానినిచేయుము; రాష్ట్రపాలుని కార్యమునుగాని అంత పాలుని కార్యమునుగాని నిర్వహించుము; నీకుఅడ్డమువచ్చినవానిని, సహాయము చేయనివానిని నిర్బంధించుము." 40. ఇదేవిధముగ తక్కినవారికి, "ఈ మహామాత్రుని అవినయమును మీరు నివారించవలెను," అని కబురుపంపవలెను. 41. అతడు వీరితో కలహించుసమయములోగాని, తనపనిని సాగించుటలో వారు ఆటంకములను కలి గించుసమయములోగాని, తమఆయుధములను ఉపయోగించి ఘాతుకులు రహస్య ముగ అతనిని పరిమార్చవలెను. 42. ఆ నేరమునకు ఇతరులు శిక్షింపబడవలెను.

43. రాజును ద్వేషించిన పురములలోగాని గ్రామములలోగాని కులము లలోగాని గ్రామములయు క్షేత్రములయు కళ్ళములయు ఇండ్లయు హద్దులకు సంబంధించిన ద్రవ్యములకు ఉపకరణములకు సస్యములకు వాహనములకు నష్టముకలిగించు కలహములు ఉత్పన్నమైనప్పుడును తీక్ష్ణులచే ప్రోత్సహింప బడినప్పుడును; లేదా, ప్రదర్శనములు క్రతువులు ఉత్సవములలో ఇట్లుజరిగినప్పు డును తీక్ష్ణులు వారిశస్త్రములను (హత్యలకై) ఉపయోగించి, "ఇతనితోకలహించు వారందరిని ఇట్లేచేసెదము," అని ప్రకటించవలెను. 44. ఆ నేరమునకు ఇతరులు

శిక్షింపబడవలెను.

45. ఏయే దూష్యులమధ్య కలహములు వేళ్ళు తన్నుకొనియున్నవో, అట్టి వారి క్షేత్రములకు, కళ్ళములకు, ఇండ్లకు, నిప్పుపెట్టియో, వారిబంధువులపైని సంబంధులపైని వాహనములపైని శస్త్రములను ప్రయోగించియో తీక్ష్ణులు, "మమ్ము ఈపనులను చేయుమని వీరునియోగించిరి," అని ప్రకటించవలెను. 46. ఆ నేరము నకు ఇతరులు శిక్షింపబడవలెను.

47. దుర్గములలోను రాష్ట్రములలోను ఉండు దూష్యులగు మహామాత్రు లను గూఢచారులు పరస్పరము విందుల నారగించుటకై వారిఇండ్లకు ఆహ్వా నించునట్లుచేయవలెను. 48. విషప్రయోగముచేయువారు అచ్చట విషప్రయో గము చేయవలెను. 49. ఆ నేరమునకు ఇతరులు శిక్షింపబడవలెను.

50. భిక్షుకి యొకతె దూష్యుడగు రాష్ట్రముఖ్యునితో, "ఆ దూష్యుడగు రాష్ట్రముఖ్యునిభార్య, కోడలు, కుమార్తె నిన్ను కామించియున్నది," అని సూచించవలెను. 51. వాడు అంగీకరించినయెడల ఆమె (అతని) ఆభరణము లను తీసుకొని రెండవవానివద్దకు వెళ్ళి, "యౌవనగర్వితుడైన ఆ ముఖ్యుడు నీభార్యను, నీకోడలిని, నీకుమార్తెను కామించియున్నాడు" అని చెప్ప వలెను. 52. వారికి కలహము సంభవించినప్పుడు రాత్రిపూట ఇదివరకు చెప్పినట్లు జరుగ వలెను.

53. సైన్యములతో లోబడిన దూష్యసామంతుల విషయము: యువ రాజుగాని, సేనాపతిగాని ఏదియో ఒకచిన్నతప్పునుచేసి పారిపోయి విక్రమించ వలెను. 54. అప్పుడు అతనిని అణచుటకు సారహీనమగునట్టియు తీక్ష్ణులతోకూడి నట్టియు సైన్యమునిచ్చి దూష్యసామంతులనే పంపవలెను; అటుతర్వాత పైని చెప్పిన ఉపాయములన్నిటిని ప్రయోగించవలెను. 55. వారిపుత్రులలో ఎవరు రాజభక్తిగలవారో వారికి పితృదాయము నియ్యవలెను.

56. ఈ విధముగ ముఖ్యపురుషుల ద్వేషములనుండి రక్షింపబడినదై రాజ్యము పుత్రపౌత్రానుగత మగుచున్నది.

57. (శ్లో) రాజు వర్తమాన భవిష్యత్తుల విషయమై ఓర్పుకలిగి, స్వపక్ష పరపక్షములలోనివారిపట్ల ఎట్టిసంశయము లేక రహస్యదండమును ప్రయోగించ వలెను.

ఇది యోగవృత్తమను అయిదో అధికరణమందు దాండకార్మికము అనే మొదటి అధ్యాయము.

## అధ్యాయము 2

### ప్రకరణము 90 : కోశాభిసంగ్రహణము[1]

1. కోశములేనిరాజు అర్థమునుగురించిన కష్టములు సంభవించినప్పుడు కోశమును సమకూర్చుకొనవలెను.

2. వర్షముపై ఆధారపడనట్టియు, అధికములగు పంటలుకలిగినట్టియు జనపదము పెద్దదైనను చిన్నదైనను దానినుండి పంటలో మూడోభాగమునుగాని నాలుగోభాగమునుగాని కోరవలెను. మధ్యమములు తక్కువరకములు అగువాటి నుండి పంటలకు తగినట్లు కోరవలెను. 3. దుర్గము, సేతువు, రహదారులు, శూన్యనివేశములు, గనులు,తప్పకము, ద్రవ్యవనములు, హస్తివనములు మున్నగు వాటిని నిర్మాణముచేయుటకు అనుకూలించు ప్రాంతములనుండిగాని, పొలిమేరలలో అల్పప్రమాణముగల ప్రాంతములనుండిగాని ఏమియుకోరరాదు.

4. క్రొత్తగ నివేశనమును ఏర్పరుచుకొనువానికి ధాన్యమును, పశువులను హిరణ్యాదులను ఇయ్యవలెను.

5. విత్తనములకును కుటుంబపోషణమునకును కావలసినదానిని మినహాయించి తక్కినపంటలో నాలుగోవంతును[2] (కర్షకులనుండి) క్రయమిచ్చి రాజుకొనవలెను. 6. ఆటవికద్రవ్యములలోను, వేదవిదుడైన బ్రాహ్మణుని ఆదాయములోను అంశమును కోరరాదు. 7. వీటినికూడ వారిలాభము నుద్దేశించి కొనవచ్చును.

8. ఇట్టిచర్యలమూలమున కోశసంగ్రహణము నెరవేరనప్పుడు సమాహర్త

[1] ఈ అధ్యాయములో చాలభాగము అధికారుల రహస్యశిక్షణకు సంబంధించినట్టిది కాదు. కష్టకాలమందు కోశమును నింపుటకు అధికారులు కౌటిల్యుని కాలమున అనుసరించిన సాధనములిందు వివరింపబడియున్నవి. వీటిలోకొన్ని ప్రశంసనీయములైనను తక్కినవి మోసముతోను కపటముతోను క్రౌర్యముతోను కూడుకొన్నట్టివి.

[2] ఇది కొంతవరకు ప్రస్తుతకాలపు ధాన్యము సేకరించు విధానమును పోలియున్నది.

క్రింద పనిచేయు ఉద్యోగులు వేసవికాలమున కర్షకులచే పొలములను సాగు చేయించవలెను. 9. విత్తనములు నాటుకాలమందు అజాగ్రత్తగ పనిచేయువారు నష్టమునకురెండింతల దండమును ఇచ్చునట్లు ఒప్పందపత్రములను వ్రాయించు కొనవలెను. 10. పైర్లుపండినతర్వాత దేవపితృపూజలకును దానముచేయుటకును గోవులకును కావలసినంత కాయగూరలను పిడికెడు ధాన్యములనుతప్ప మరిదేనిని తీసుకొనిపోకుండునట్లు వారు (ఉద్యోగులు) నివారించవలెను. 11. కళ్ళపురాశి లోని అడుగుభాగమును భిక్షుకులకును గ్రామసౌకర్లకును వారు వదలివేయవలెను.[3]

12. (ఉద్యోగులకు తెలియపరచక) తనపంటను తీసుకొనిపోవువాడు ఎనిమిది రెట్ల నష్టపరిహారము ఇయ్యవలెను. 13. మరియొకని పంటను తీసుకొని పోవు వాడు సవర్ణుడైనయెడల ఏబదిరెట్ల నష్టపరిహారము ఇయ్యవలెను; బాహ్యుడైనయెడల మరణశిక్ష.

14. వారుధాన్యములో నాలుగోవంతును; వన్యద్రవ్యములు, బూరుగుదూది, లక్క, క్షౌమము, నార, దూది, రోమములు, పట్టు మొదలగువాటితో తయారయిన వస్తుసామగ్రి, ఔషధములు, గంధములు, పుష్పములు, ఫలములు, శాక ములు, పణ్యములు, కాష్ఠములు, వెదుళ్ళు, పచ్చిమాంసము, ఎండుమాంసముల లోను ఆరవవంతు; దంతములు చర్మములలో అర్ధభాగము (ఉద్యోగులు) వసూలు చేయవలెను. 15. ఆజ్ఞను పొందక వీటిని విక్రయించువానికి పూర్వసాహసదండము.

16. దీనితో కర్షకులనుండి వసూళ్ళు అను విషయము సమాప్తము.

17. బంగారము, వెండి, వజ్రములు, రత్నములు, ముత్తెములు, పగడ ములు, గుర్రములు, ఏనుగులు—వీటివ్యాపారము చేయువారు ఏభై (పణములు) చెల్లించవలెను. 18. నూలు, వస్త్రములు, రాగి, ఉక్కు, కంచు, పరిమళ ద్రవ్య ములు, ఔషధములు, మద్యములు—వీటి వ్యాపారము చేయువారు నలభై పణములు చెల్లించవలెను. 19. ధాన్యములు, రసములు, లోహముల వ్యాపారులు, బండ్లతో వ్యాపారము చేయువారు ముప్పైపణములు చెల్లించవలెను. 20. గాజువర్తకులు, మహాకారువులు ఇరవైపణములు చెల్లించవలెను. 21. క్షుద్రకారువులు, వేశ్యాగృహాధి కారులు పదిపణములు చెల్లించవలెను. 22. కట్టెలు, వెదుళ్ళు, రాళ్ళు, కుండలు, అన్నము, ఆకుకూరలు విక్రయించువారు అయిదుపణములు చెల్లించవలెను. 23. కుశీలవులు. వేశ్యలు వేతనములో సగము చెల్లించవలెను.

24. కర్మకరులనుండి హిరణ్యరూపమగుపన్నును వసూలుచేయవలెను; వారి అపరాధమును క్షమించరాదు. 25. వీరు తమది కాదనిచెప్పి ఏవస్తువునైన విక్రయించవచ్చును.

---

[3] ఆహారపుకొరతఏర్పడిన ప్రస్తుతకాలమందు ఇట్టి చర్యలను ప్రభుత్వము తీసుకొనుచుండుట గమనించతగిన విషయము.

26. దీనితో వ్యాపారముచేయువారినుండి వసూళ్ళు అనువిషయము సమాప్తము.

27. కోళ్ళలో, పందులలో అర్ధభాగము, క్షుద్రపశువులలో ఆరోవంతు ; గోవులు మహిషములు కంచరగాడిదలు గాడిదలు ఒంటెలు మున్నగువానిలో పదోవంతు (ఆయా సొంతదార్లు!) ఇయ్యవలెను.

28. వేశ్యాగృహపోషకులు పరమరూపయౌవనులగు రాజదాసీజనముద్వారా కోశమును నింపవలెను.

29. దీనితో యోనిపోషకుల (జంతువుల పెంచువారు) నుండి వసూళ్ళు సమాప్తము.

30. ఇట్టివసూళ్ళు ఒకపర్యాయమేగాని రెండుపర్యాయములు చేయరాదు.

31. ఇవి చాలనపుడు సమాహర్త ఏదియో ఒకపనిని తలపెట్టినట్లు చెప్పి పౌరులనుండియు జానపదులనుండియు చందాలు వసూలుచేయవలెను. 32. గూఢ పురుషులు మొదట గొప్పచందాలను వేయవలెను. 33. దీనిని చూపి, రాజు పౌరులను జానపదులను చందాలనియ్యవలసినదిగ కోరవలెను. 34. కొద్దిమొత్తముల నిచ్చువారిని గూఢచారులు నిందలపాలు చేయవలెను.

35. లేదా, ధనికులను వారిధనమున కనుగుణముగగాని, (రాజుమూలమున) వారుపొందిన ఉపకారమున కనుగుణముగగాని ఇష్టము వచ్చినంతగాని ఇయ్యవలసినదిగ కోరవలెను. 36. వారు ఇచ్చినచందాలనుబట్టి వారికి స్థానము, ఛత్రము, తలపాగ, భూషణముల రూపమున గౌరవించవలెను.[4]

37. పాషండసంఘముల ద్రవ్యమును, శ్రోత్రియబ్రాహ్మణుల అనుభవములోలేని దేవాలయద్రవ్యమును, చనిపోయినవానివద్ద నిక్షేపముగ ఉంచబడినట్లు సాకుచెప్పియో, లేదా, నిక్షేపమును ఉంచుకొన్నవాని ఇల్లు కాలిపోయినదని సాకు చెప్పియో వశపరుచుకొనవలెను.

38. దేవాలయాధ్యక్షుడు దుర్గములోని దేవాలయములయు, రాష్ట్రములోని దేవాలయములయు ద్రవ్యమును వేరువేరుగ సంగ్రహించి ఒకచోటికి తెచ్చి దానిని అదేవిధముగ కోశములో చేర్చవలెను.

39. రాత్రికిరాత్రి అతడు ఒకదేవాలయమునుగాని[5] సిద్ధాశ్రమమునుగాని నిర్మాణముచేసి, అది యొకఅద్భుతసంఘటనమని ప్రకటించి, యాత్రలకును సమాజములకును అక్కడికి వచ్చువారినుండి ద్రవ్యము వసూలుచేయవలెను.

[4] ఇవి ప్రస్తుతకాలపు బిరుదులవంటివి.

[5] 39 నుండి ప్రజలమూఢనమ్మకములను ఆధారముగజేసుకొని అధికారులు వారివద్దనుండి ధనమును వసూలు చేయుచుండిన విధము వివరింపబడినది.

40. ఆకాలమున పుష్పించినట్టియు ఫలించినట్టియు చైత్యవనములోని వృక్షమందు దేవత ఏదియో ప్రవేశించినట్లు చాటించవలెను. 41. సిద్ధపురుషుల వేషమును ధరించినగూఢపురుషులు వృక్షములో నివాసము చేయుచుండు భూతము నరబలిని కోరుచున్నదనియు, దానిని శమింపజేయుటకు పౌరులు జానపదులు ధనమునియ్యవలెననియు ప్రచారముగావించవలెను. 42. సురంగమార్గముతో సంబంధముగల ఒకకూపమందు పడగ లనేకములుగల నాగసర్పములను చూపించి,వానినిచూచుటకు వచ్చినవారివద్దనుండి ధనమును వసూలుచేయవలెను. 43. చైత్యమందలి కన్నములోగాని పుట్టలోగాని ఉన్న నాగప్రతిమ క్రింద ఒకనాగుపామును దాచి, దానిని పైకితీసి, ఆహారముచే దానిని వశపరచుకొనినట్లునటించి, అమాయకులగు ప్రజలకు చూపించవలెను. 44. నమ్మనివారికి వారు త్రాగునీళ్ళలోగాని స్నానము చేయు నీళ్ళలోగాని విషముకలపి (వారిమరణమునకు) దైవమహిమయే కారణమని చెప్పవలెను; లేదా, మరణశిక్షవిధింపబడినవానిని పాముచే కరపించవలెను.

45. లేదా, అతడు అమానుషములగు ఉపద్రవములకు ప్రతీకారము చేసెదననిచెప్పి కోశమును నింపవలెను.

46. లేదా, వర్తకవేషమును ధరించిన గూఢపురుషుడు అపరిమితములగు వస్తుసామగ్రితోను సహాయకులతోను కూడి వ్యాపారముచేయవలెను. 47. ఉపనిధులమూలముననను పణ్యముల తాకట్టుకుసంబంధించిన ఋణముల మూలముననను అతడు ధనమును కూడబెట్టినప్పుడు (సమాహర్త) రాత్రిపూట దొంగతనము చేయించి ధనము నపహరించవలెను.

48. దీనినుండి నాణెముల ముద్రించి పరిక్షించువాడు సువర్ణకారుడు చేయవలసిన పనులను తెలుసుకొనవలెను.[6]

49. లేదా, వర్తకవేషమును ధరించిన గూఢపురుషుడు వర్తకవ్యాపారములకు ప్రసిద్ధిగాంచినవాడై, గొప్పవిందుసమయమందు బంగారువెండివస్తువులను అత్యధికముగ ఋణముగనో తాకట్టుగనో సంపాదించవలెను. 50. లేదా, ఉత్సవమునకని అనేకులు సమావేశమైనప్పుడు తనసరకులన్నిటిని ప్రదర్శించి వాటినిఆధారముగ హిరణ్యమును సువర్ణమును ఋణముగ తీసుకొని, అదే సమయమున వాటిని అమ్మి మూల్యమును సంగ్రహించవలెను. 51. అటుతర్వాత ఈ రెంటిని రాత్రిపూట చోరు లపహరించునట్లు చేయవలెను.

52. పతివ్రతల వేషముధరించిన స్త్రీలయెడ దూష్యులను మోహించునట్లుచేసి, ఆ స్త్రీలఇండ్లలోనే వారున్నప్పుడు పట్టుకొని, వారిఆస్తినంతను స్వాధీనపరచుకొనవలెను.

53. దూష్యకుటుంబములోనివారిమధ్య కలహముసంభవించినప్పుడు అచట

[6] 46 నుండి మోసముద్వారా అధికారులు కోశమును నింపు విధము వివరింపబడినది.

పనిచేయుచుండు రసదులు విషప్రయోగము చేయవలెను. 54. ఆ నేరమునకు ఇత రులఆ స్తిని స్వాధీనముచేసుకొనవలెను.

55. మరణశిక్ష ననుభవించువాడొకడు నమ్మదగిన కారణమునుచూపి దూష్యునొకనినుండి ఒకవస్తువునో, హిరణ్యమునో, నిక్షేపమునో, ఇచ్చినఋణ మునో, దాయమునో అడుగవలెను. 56. లేదా, దూష్యుని దాసుడనియు, దూష్యుని భార్యను కోడలిని కుమార్తెను దాసిఅనియు పిలువవలెను. 57. దూష్యునిఇంటి ముందు రాత్రిపూట అతడు నిద్రించునప్పుడుగాని, మరియొకచోటఉన్నప్పుడుగాని తీక్ష్ణుడొకడు అతనిని చంపి, "ధనమునుకోరిన వీడు చంపబడెను" అని ప్రక టించవలెను. 58. అట్టినేరమునకై ఇతరులఆ స్తిని వశపరుచుకొనవలెను.

59. సిద్ధునివేషము ధరించిన గూఢచారి దూష్యునొకనిని ఇంద్రజాల విద్యతో వశముచేసుకొని, "అక్షయహిరణ్యమును సంపాదించుటలోను, రాజ ప్రాసాదపు తలుపులను తెరచుటలోను, స్త్రీహృదయమును వశముచేసుకొనుట లోను, శత్రువును రోగపీడితునిగ చేయుటలోను, దీర్ఘాయుష్మంతునిగ చేయుట లోను, పుత్రునిగాంచుటలోను ఉపయోగపడు క్రతువు నాకు తెలియును" అని చెప్పవలెను. 60. అతడు సమ్మతించినతర్వాత, రాత్రిపూట చైత్యస్థానమొకదాని యందు అపరిమితముగ మద్యమును మాంసమును పరిమళ ద్రవ్యములను ఉప హారముగ నివేదించునట్లు చేయవలెను. 61. (చైత్యమందు) ఒకచోట పూడ్చి పెట్టబడిన ఒకనాణెమును ప్రేతాంగమును ప్రేతశిశువును పైకితీసి, నాణెము నతనికి చూపించి, "ఇది చాలస్వల్పము" అని చెప్పవలెను. 62. తర్వాత అతడు, "ఎక్కువధనమును నీవుకోరుపక్షమున మరియొక పర్యాయము ఉపహారమును నివేదించవలెను; కావున, ఈనాణెమును తీసుకొనిపోయి, దీనితోనే నీవు స్వయ ముగ నివేదనమునకు కావలసినవస్తువులను మరింతఅధికముగ రేపు కొనుము" అని మరికొన్నిమాటలు పలుకవలెను. 63. ఆ నాణెముతో మరికొన్నివస్తువుల నతడు కొనుచున్నప్పుడు (రాజభటులు) వానిని పట్టుకొననలెను.

64. తల్లివేషముధరించిన ఒకస్త్రీ ఒకదూష్యునితో "నీవు నాకుమారుని చంపితివి," అనికోపముతో పలుకవలెను. 65. అతడు రాత్రియాగమునుగాని, వనయాగమునుగాని, వనక్రీడనుగాని ప్రారంభించినవెంటనే, మరణశిక్ష ననుభ వించవలసినవాని నొకనిని మాతుకులు చంపి అతనిని లోపలికి ప్రవేశపెట్టవలెను.

66. భృత్యునివేషములోనున్నవాడు దూష్యుడు ఇచ్చిన వేతనములో ఒక దొంగనాణెమును చేర్చి, దానిని ప్రకటించవలెను.

67. కార్మికుని వేషములోనున్నవాడు దూష్యునిఇంటిలో పనిచేయుచు, దొంగల ఉపకరణములను దొంగనాణెములచేయువారి ఉపకరణములను అచ్చట చేర్చవలెను; లేదా, వైద్యునివేషములో ఉన్నవాడు ఔషధమునకు మారుగ విషమును అక్కడ ఉంచవలెను.

68. గూఢపురుషుడొకడు దూష్యునివద్ద పట్టాభిషేకమునకు కావలసిన వస్తుసామగ్రి ఉన్నట్టు మరియొక గూఢపురుషునికి తెలియపరిచి, శత్రువు వ్రాసిన లేఖనొకదానిని అక్కడచేర్చి దానిఉద్దేశమును ప్రకటించవలెను.

69. ఈవిధముగ అతడు దూష్యులపట్లను, అధార్మికులపట్లను ప్రవర్తించ వలెను ; ఇతరులపట్ల ఇట్లు ప్రవర్తించరాదు.

70. (శ్లో) తోటలనుండి పక్వములగు ఫలములనుమాత్రమే కోయు నట్లు రాజ్యమునుండికూడ పక్వములగు పండ్లనే తీసుకొనవలెను ; ప్రజలకు కోప మును కలిగించునట్టియు ఆత్మవినాశమునకు దారితీయునట్టియు పండనివానిని అతడు వర్జించవలెను.[7]

ఇది యోగవృత్తమను అయిదోఅధికరణమందు కోశాభిసంగ్రహణము అనే రెండోఅధ్యాయము.

[7] దూష్యులని స్పష్టముగతెలిసిన తర్వాతనే వారినిర్మూలనమునకు ప్రయత్నించవలెను అప్పుడది పండిన పండ్లతో పోల్చతగినది అగును.

# అయిదో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 91 : భృత్యభరణీయము[1]

1. దుర్గజనపదముల శక్తిననుసరించి (రాజు) ఆదాయములో నాలుగో వంతును ఉద్యోగులవేతనముకొరకై వినియోగించవలెను ; లేదా, రాజకార్యములు నెరవేరుట సాధ్య మగునట్లు వేతనముల నిర్ణయించవలెను. 2. (ఆదాయ) శరీరమందు అతడు శ్రద్ధవహించవలెను ; ధర్మార్థములకు హాని కలిగించరాదు.

3. ఋత్విజునకు, ఆచార్యునికి, మంత్రికి, పురోహితునికి, సేనాపతికి, యువరాజునకు, రాజమాతకు, రాజమహిషికి నలభైఎనిమిది వేల పణములు. 4. ఇంతటిభరణమును పుచ్చుకొనినవారై, వారు కుట్రదారులకు లోబడకయు, తిరుగుబాటు చేయుటకు ఇష్టపడకయు ఉండెదరు.

5. దౌవారికుడు, అంతర్వంశికుడు, ప్రశాస్త, సమాహర్త, సన్నిధాతలకు ఇరవైనాలుగు వేల పణములు. 6. దీనిని పుచ్చుకొనిన వారై, వారు వారిపనుల యందు శ్రద్ధవహించెదరు.

7. రాజపుత్రులు, రాజపుత్రులతల్లులు, నాయకుడు, పౌరవ్యావహారికుడు, కార్మాంతికుడు,[2] మంత్రిపరిషత్తు (సభ్యులు), రాష్ట్రపాలుడు,[3] అంతపాలుడు—వీరికి పండ్రెండు వేల పణములు. 8. ఈ వేతనముతో వారు రాజునెడల అనురాగబద్ధులై అట్టి బలమునకు[4] సహాయపడెదరు.

9. శ్రేణీముఖ్యులు, హస్త్యశ్వరథముఖ్యులు, ప్రదేష్టలు—వీరికి ఎనిమిది

---

[1] రాజోద్యోగులకు ఇయ్యవలసిన జీతబత్తెములు.

[2] కర్మాగారముల అధికారి.

[3] రాష్ట్రపాలుడే స్థానికుడను ఉద్యోగిఅని కొందరు వ్యాఖ్యాతలు.

[4] అనురక్తులగువారితో కూడినబలము.

వేల పణములు. 10. ఈవేతనముతో వారు వారివర్గములచే అనుసరించబడిన వారగుదురు.

11. పత్త్యశ్వరథహస్త్యధ్యక్షులు, ద్రవ్య వనపాలురు, హస్తి వనపాలురు—వీరికి నాలుగు వేల పణములు.

12. రథికునకు, ఏనుగులకుశిక్షణనిచ్చువానికి, వైద్యునకు, గుర్రములకు శిక్షణనిచ్చువానికి, వర్ధంగికి, జంతువులను పెంచువారికి రెండువేల పణములు.

13. కార్తాంతికుడు, నైమిత్తికుడు, మౌహూర్తికుడు, పౌరాణికుడు, సూతుడు, మాగధుడు, పురోహితపురుషులు,[5] అందరు అధ్యక్షులు—వీరికి వేయి పణములు.

14. శిల్పవంతులగు పదాతులు, సంఖ్యాయకులు, లేఖకులు మొదలగు వర్గములవారికి అయిదుపందల పణములు.

15. (కాని) కుశీలవులకు రెండువందలయేభై పణములు ; వాద్యములను తయారుచేయువారికి దీనికి రెండురెట్లు.

16. కారువులకు శిల్పులకు నూటఇరవై పణములు.

17. చతుష్పాత్తులయు ద్విపాత్తులయు పరిచారకులు, పారికర్మికులు, నౌకరులు, పాలకులు, విష్టివర్గములనాయకులు, ఆర్యులపర్యవేక్షణలోనుండు ఆరోహకులు, మాణవకులు, కొండల త్రవ్వువారు, అన్ని రకములైన సేవకులు—వీరికి అరవై పణములు.

18. ఆచార్యులకు విద్యావంతులకు వారివారి అర్హతలనుబట్టి గౌరవ వేతనములు అయిదు వందల పణములకు తగ్గక వేయి పణములకు మించక ఉండవలెను.

19. సాధారణుడగు దూతకు యోజనమునకు పది పణములను, పది యోజనములనుండి నూరుయోజనములవరకు రెండింతలను ఇయ్యవలెను.

20. రాజసూయాది క్రతువులందు రాజస్థానమందుండువానికి సమాన విద్యలుగలవారి వేతనములకు మూడింత లియ్యవలెను.

21. రాజసారథికి వేయి పణములు.

22. కాపటికులు, ఉదాస్థితులు, గృహపతులయు వర్తకులయు తాపసులయు వేషములధరించిన గూఢపురుషులు—వీరికి వేయి పణములు.

23. గ్రామభృత్యులు, గూఢచారులు, తీక్ష్ణులు, రసదులు, స్త్రీభిక్షుకులు—వీరికి అయిదు వందల పణములు.

24. సంచారముచేయు చారులకు రెండువందలయేభై పణములు ; లేదా, వారి కష్టములకు తగినటు వేతనమును వృద్ధిచేయవచ్చును.

---

[5] పురోహితునికి సహాయముగ పనిచేయువారు.

25. నూరేసి సైనికవర్గముల అధ్యక్షులు, వేయేసి సైనికవర్గముల అధ్యక్షులు సైనికులకు భక్తవేతనముల నిచ్చి, వారిని ఆదేశించుచు, వారు ఏయేప్రదేశములలో ఉండవలెనో నిర్ణయించవలెను. 26. రాజప్రాసాదము, దుర్గములు, రాష్ట్రములు– వీటిని రక్షించువారివిషయమున విక్షేపము (ఒక ప్రదేశమునుండి ఇంకొకప్రదేశమున కుమార్చుట) ఉండరాదు. 27. వీటినిరక్షించుముఖ్యులు అనేకులుగ నుండ వలెను; వారు ఖాయముగ ఈఉద్యోగములలో ఉండవలెను.

28. ప్రభుకార్యములుచేయుచు చనిపోయినవారి భార్యలకు పుత్రులకు భక్త వేతనముల నియ్యవలెను. 29. వారికుటుంబములలోని బాలురకు వృద్ధులకు వ్యాధి తులకు సహాయము చేయవలెను. 30. ప్రేతకార్యములందు, రోగములు సంభ వించినప్పుడు, ప్రసవసమయములందు వీరికి ధనసహాయముచేసి ఇతర విధములుగ గౌరవించవలెను.[6]

31. అల్పకోశుడైనయెడల కుప్యములను పశువులను క్షేత్రములను స్వల్ప మగు హిరణ్యములు ఇయ్యవలెను. 32. శూన్యప్రదేశములందు నూతన నివేశము లను స్థాపించవలసినప్పుడు హిరణ్యము నియ్యవలెనుగాని గ్రామము నంతను దానము చేయరాదు; గ్రామములోని వ్యవహారములు స్థిరములగుటకు ఇది అవసరము.

33. ఈవిధముగ స్థిరభృత్యులకు స్థిరులుకాని భృత్యులకు వారివారివిద్యల బట్టియు పనులబట్టియు భక్తమును, వేతనమును ఏర్పాటుచేయవలెను.[7]

34. అరవై పణములవేతనముగలవానికి ఒకఆఢకముచొప్పున వారివారి వేతనములబట్టి వారికియ్యవలసిన భోజనపరిమాణమును నిర్ణయించవలెను.

35. సంధి దివసములందు తప్ప తక్కిన దివసములలో పత్త్యశ్వరథ ద్విప ములకు సంబధించిన సైనికులు సూర్యోదయమున నగరమువెలుపల కవాతుచేయ వలెను. 36. రాజు దీనియందు సర్వదా శ్రద్ధగలవాడై వారిశిల్పప్రదర్శనములను పర్యవేక్షించవలెను.

37. రాజముద్రలువేసిన శస్త్రములను కవచములను ఆయుధములను (మాత్రమే) అతడు ఆయుధాగారములోనికి రానియ్యవలెను.

38. ముద్రలతోకూడిన అనుజ్ఞాపత్రములున్నవారుతప్ప తక్కినవారెవ్వరు శస్త్రములతో నడవకూడదు. 39. (ఆయుధాగారాధ్యక్షుడు) నష్టవినష్టములకు రెండింతల పరిహారము నియ్యవలెను. 40. వినష్టములైనవాని వివరములను వ్రాసిపెట్టవలెను.

---

[6] ఇట్టి సదుపాయములు ప్రస్తుతకాలపు ఉద్యోగులకు లభించుటలేదు. ప్రాచీన కాలపు రాజుల ఔదార్యమున కిది నిదర్శనము.

[7] ఈప్రకరణములోని వేతనములు సంవత్సరమున కొకపర్యాయము లభించునట్టివి.

41. సార్థవాహకుల శస్త్రావరణములను అంతపాలుడు స్వాధీనపరుచు కొన వలెను ; లేదా, వానికి ముద్రలువేసి సార్థవాహకులతో పంపించవచ్చును.

42. విజయయాత్రను నిశ్చయించుకొనినప్పుడు సేనను సిద్ధపరచుకొనవలెను. 43. అప్పుడు వర్తకవేషములను ధరించిన చారులు యాత్రాకాలమం దుపయో గించుకొని, యాత్ర ముగిసినతర్వాత రెండురెట్లు ఇచ్చుషరతుమీద సైనికులకు కావలసిన సామగ్రినంతను ఇయ్యవలెను. 44. దీనిమూలమున రాజపణ్యముల రహస్యధిక్రయమును సైనికులకు ముందుగఇచ్చు వేతనములను తర్వాత రాబట్టు టయును సాధ్యమగును.

45. ఇట్లు ఆయవ్యయములను పర్యవేక్షించురాజునకు కోశమునకుగాని సైన్యమునకుగాని సంబంధించిన ప్రమాదము సంభవింపజాలదు.

46. భక్తవేతనములోని తరతమభేదముల వివరణ దీనితోసమాప్తము.

47. (శ్లో) గూఢచారులు, వేశ్యలు, కారువులు, కుశీలవులు, సైన్యములోని వృద్ధులు జాగరూకులై సైనికుల శౌచాశౌచములను తెలుసుకొనవలెను.

ఇదియోగవృత్తమను అయిదో అధికరణమందు భృత్యభరణీయము అనే మూడో అధ్యాయము.

# అయిదో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 92 : అనుజీవివృత్తము

1. లోకానుభవముగల పురుషుడు రాజునకు ప్రియులును హితులును అగువారి ద్వారా ఆత్మసంపన్నుడును ద్రవ్యప్రకృతిసంపన్నుడును అగురాజు కొలువులో చేరవలెను. 2. ప్రకృతిసంపన్నుడు కాకపోయినను, "నేనుకొలువును ఏలాగుకోరుచున్నానో అలాగే ఈరాజు వినయమును (శిక్షణను) కోరుచున్నాడు ; ఇతరులను చేరదీయుగుణములు ఇతనియందున్నవి," అని తోచినప్పుడు అట్టి రాజుకొలువులో ప్రవేశించవచ్చును ; కాని, ఎన్నడును ఆత్మసంపన్నుడు కానివాని కొలువులో చేరరాదు. 3. ఏలయన, ఆత్మసంపదలేనివాడు మహైశ్వర్యమును పొందినప్పటికి నీతిశాస్త్రమును ద్వేషించుకారణముననను అప్రయోజకులతోడి సాంగత్యకారణముననను నాశముగాంచును.

4. ఆత్మసంపన్నుడగు రాజదర్శనము లభించినతర్వాత (ఆశ్రితుడు) నీతిశాస్త్ర ప్రసంగము చేయవలెను. 5. శాస్త్రమునకు విరుద్ధముగ ప్రవర్తించని వాడు స్థానస్థైర్యమును పొందును. 6. బుద్ధిసూక్ష్మత నుపయోగించవలసినట్లు ప్రశ్నింపబడినపుడు వర్తమానములోను భవిష్యత్తులోను ధర్మార్థలాభములను చేకూర్చు సమాధానములను సభాకంపములేక ప్రావీణ్యముతో చెప్పవలెను.[1]

7. తనకోరికసిద్ధించిన పక్షమున, "విశిష్టమగు ప్రజ్ఞలేనివానిని ధర్మార్థముల గురించి నీవు ప్రశ్నించరాదు ; బలవంతులతో కలిసియున్నవారిని దండించరాదు ; నాతోసంబంధము కలవారిని అప్పటికప్పుడు దండించకూడదు ; నాపక్షములోని వారినిగాని నావృత్తినిగాని నారహస్యములనుగాని నీవు హింసించరాదు ; కామ

[1] ఉద్యోగమును సంపాదించుటకు రాజదర్శనము శాస్త్రప్రావీణ్యము అవసరమని దీనినుండి స్పష్టమగుచున్నది. ప్రస్తుతకాలపు పోటీపరీక్షలు ఇంటర్వ్యూలతో ఈ విధానమును పోల్చ వచ్చును.

క్రోధములకు వశుడవై నీవు దండమును విధించునప్పుడు సంజ్ఞలద్వారా నేను నిన్ను వారించెదను," అనిచెప్పి దీనికంతకు అతనిని ఒప్పించవలెను.

8. ఉద్యోగమిచ్చినయెడల రాజానుజ్ఞనుపొంది అతడు సూచించిన ప్రదేశమును ప్రవేశించి, అతని ఆసనమునకు మిక్కిలి దగ్గరగ నుండనట్టియు దూరమున నుండనట్టియు ఆసనమందు అతనికిప్రక్కగ కూర్చుండవలెను. 9. అతనితో కలహకారణమగు మాటను చెప్పరాదు; అసభ్యములైనట్టియు, ప్రత్యక్షజ్ఞానమాధారముకానట్టియు, నమ్మదగనట్టియు, సత్యముకానట్టియు వాక్యములను వచింపరాదు; హాస్యకారణము లేనప్పుడు గట్టిగనవ్వరాదు; అపాననిష్ఠీవనములను ఇతరులకు వినబడనియ్యరాదు. 10. మరియొకనితో రహస్యముగ మాటాడుట; చర్చలుజరుగునపుడు కలహకారణములగు మాటలను; రాజవేషమును డాంబికుని వేషమును హాస్యగానివేషమును; రత్నమునుగాని ప్రత్యేకమగు అనుగ్రహమును గాని బహిరంగముగ కోరుట; ఒకకంటినిగాని పెదవినిగాని మూసుకొనుట; కనుబొమలను చిట్లించుట; ఇతరుల మాటలకు అడ్డమువచ్చుట; బలవంతులతో సాంగత్యముగలవారి యెడల విరోధముచూపుట; స్త్రీలతోను, స్త్రీలనుతరుచుగ కలుసుకొనుచుండువారితోను, సామంతదూతలతోను, శత్రుపక్షమునకు చెందినవారితోను, ఉద్యోగమునుండి తొలగించబడినవారితోను, అనర్థకారకులతోను సంసర్గము, ఏకోద్దేశమును నెరవేర్చుటకు చర్యలు సన్నిహితసంబంధము—వీటినన్నిటిని విసర్జించవలెను.

11. (శ్లో) రాజునకేది లాభకరమో దానిని వెంటనే తెలియపరుపవలెను; తనకేది లాభకరమో దానిని (రాజునకు) ప్రియులును హితులును అగువారితో కలిసి తెలియపరుపవలెను; శత్రువులకు ఏదిలాభకరమో దానిని దేశకాలానుసారముగ తెలియపరుపవలెను; ధర్మార్థములకు సంబంధించిన విషయమును (కాలముతోనిమిత్తములేక ఎల్లప్పుడు) తెలియపరుపవలెను.

12. (శ్లో) ప్రశ్నింపబడినప్పుడు ప్రియమును హితమును చెప్పవలెను గాని ప్రియమైనను హితముకానిదానిని చెప్పరాదు; రాజు వినుటకిష్టపడినపుడు రహస్యముగ అప్రియమైనను హితమును బోధించవలెను.

13–14. (శ్లో) లేదా, జబాబుచెప్పవలసినప్పుడు నోరుమూసుకొనియుండవలెనేగాని శత్రువులగురించిగాని ఇతరులగురించిగాని వర్ణించరాదు. అతని అభిమానమును కోల్పోయినవారు దక్షులైనను అప్రియులగుచున్నారు. అతనిచిత్తమును తెలిసి ప్రవర్తించువారు అనర్థముల తెచ్చువారైనను ప్రియులగుచున్నారు. నవ్వదగినప్పుడు నవ్వవలెను. బిగ్గరగ నవ్వరాదు.

15. (శ్లో) రాజు ఘోరములగు మాటలను పలికినపుడు చెవిలోవేసుకొనరాదు. అతడెన్నడును పరునిఎదుట ఘోరములగు మాటలను పలుకరాదు. తన్ను

గురించి అట్టిమాటలు పలికినపుడు భూమితో సమానమగు ఓర్పుకలవాడై వాటిని సహించవలెను.

16. (శ్లో) విజ్ఞులు ఎల్లప్పుడు ఆత్మరక్షణ చేసుకొనవలెను. రాజసేవకుల వృత్తి నిప్పుమీద ఉండుటయే.

17. (శ్లో) నిప్పు ఒకనిని అంటుకొనినపుడు శరీరములో ఒకభాగమును గాని శరీరమంతనుగాని కాల్చివేయవచ్చును. రాజు అనినసో భార్యాపుత్రులతో కూడ కాల్చివేయును; లేదా, ఒకనిని ఐశ్వర్యవంతునిగ చేయవచ్చును.

ఇది యోగవృత్తమను అయిదో అధికరణమందు అనుజీవివృత్తము అనే నాలుగో అధ్యాయము.

# అయిదో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 93 : సమయాచారికము[1]

1. కార్యములందు నియోగింపబడిన ఉద్యోగి ఖర్చులకుమించిన నికరా దాయమును చూపించవలెను. 2. తనకు ఒప్పగించిన వ్యవహారము లోపలిదా, వెలుపలిదా,[2] బహిరంగముగ చేయతగినదా, రహస్యముగ చేయతగినదా, వెంటనే చేయవలసినదా, ఆలస్యముగ చేయతగినదా అనువిషయమును, "ఇది ఇట్టిస్వభా వము కలది," అని చెప్పి స్పష్టపరుపవలెను.

3. అతడు (రాజు) వేట, జూదము, త్రాగుడు, స్త్రీలు మొదలగు వ్యస నములకు వశుడైనప్పుడు ప్రశంసించు మాటలతో అతనిని మభ్యపెట్టరాదు. 4. అతని సమీపమందే ఉండి వ్యసనములకు దూరుడగునట్లు ప్రయత్నించ వలెను; శత్రువుల ప్రేరేపణలనుండియు, మోసములనుండియు, కుట్రలనుండియు అతనిని రక్షించవలెను.

5. అతని ఇంగితాకారములను కనిపెట్టుచుండవలెను. 6. ఏలయన, ప్రాజ్ఞుడు తనలోని ద్వంద్వభావములను—అనగా, ఇష్టానిష్టములు, సంతోష విచారములు, పట్టుదల భయములు—కప్పిపుచ్చుకొనుటకు ప్రయత్నించినను ఇంగితాకారముల మూలమున వాటిని బయటపెట్టుచున్నాడు.

7. రాజు అతనిని (ఆశ్రితుని) చూచినపుడు సంతోషించును; అతని మాటలకు సమ్మతించును; అతనికి ఆసనమునిచ్చును; ఒంటరిగ దర్శనమిచ్చును; శంకించవలసినపుడుకూడ ఎక్కువగ శంకించడు; అతడు మాటాడునపుడు సంతో షముచూపును; అతడు విజ్ఞాపనము చేయువిషయముల శ్రద్ధతో వినును; పథ్యము

[1] రాజుకొలువులో ఉన్నవాని ప్రవర్తనము.

[2] లోపలిది అనగా దుర్గములోపలగాని రాజప్రాసాదములోపలగాని చేయవలసినది. వెలుపలిదనగా దుర్గమునకు వెలుపల రాష్ట్రములో చేయవలసినది.

లగు మాటలను సహించును; మందహాసముచేయుచు కార్యములలో నియోగించును; చేతితో ముట్టుకొనును; శ్లాఘింపదగిన విషయములలో పరిహసించడు; పరోక్షమందు అతనిగుణములను పేర్కొనును; భోజనకాలమందు అతనిని స్మరించును; అతనితో కలసి విహారయాత్ర చేయును; ఆపత్కాలమందు సహాయము చేయును; అతనియందు భక్తిగలవారిని గౌరవించును; తనరహస్యములను అతనికి తెలియపరుచును; అతనికి ఎక్కువగౌరవములను ప్రసాదించును; అతనికి లాభమునిచ్చు పనులను చేయును; నష్టమును కలిగించు పనులను నిషేధించును— వీటి అన్నిటిమూలమున రాజు అతనియెడల తృప్తిపొందినవాడని తెలుసుకొనవచ్చును.

8. రాజు దీనికివిరుద్ధముగ ప్రవర్తించునప్పుడు అతని (ఉద్యోగి) యెడల తృప్తిపొందినవాడు కాడని తెలుసుకొనవలెను; అట్టిరాజులో మరికొన్ని చిహ్నములుకూడ కనిపించును; 9. అతనిని చూడగనే కోపగించుకొనుట; మాటలను వినకుండుట; వాని ప్రతిషేధము; ఆసనము నియ్యకుండుట; అతనివైపు చూడకుండుట; ముఖమును స్వరమును మార్చుట; ఒకకంటిని సగముమూసుకొనుట; కనుబొమను కొంత చిట్లించుట; పెదవిని కొంత మూసుకొనుట; కారణములేక చెమటపట్టుట, శ్వాసను విడుచుట, హాస్యము చేయుట; మరియొకనితో ఆలోచన చేయుట; అకస్మాత్తుగా వెళ్ళిపోవుట; ఇంకొకనిఅభివృద్ధికి తోడ్పడుట; నేలనుగాని అంగములనుగాని గీరుట; మరియొకనిని అతనిపైకి పురికొల్పుట; అతని విద్యను వర్ణమును దేశమును అసహ్యించుకొనుట; సమదోషముగలవారిని నిందించుట; ఒక్కొక దోషమును గురించి తప్పుపట్టుట; అతని విరోధులను ప్రస్తుతించుట; అతని మంచిపనులను గుర్తించకుండుట; దుష్టకార్యములను గురించి వదేపదే చెప్పుట; వెనుకవైపు శ్రద్ధతో చూచుట; అమితముగు ఔదాసీన్యముతో అసత్యమాడుట; తరచుగ రాజును దర్శించువారు అతనిపట్ల ప్రవర్తించుటలో భేదమును చూపుట.

10. మనుష్యేతరములగు ప్రాణుల ప్రవృత్తిలోని వికారమును అతడు గమనించవలెను. 11. "అతడు పైభాగమునుండి (నీటిని) చల్లుచున్నాడు," అను ఆలోచనతో కాత్యాయనుడు (రాజకొలువును) వదులుకొనెను;[3] "క్రౌంచపక్షి అపసవ్యముగ ఎగురుచున్నది," అని కణింక భరద్వాజుడు వదులుకొనెను; "ఇది గడ్డి," అనిచెప్పుచు దీర్ఘచారాయణుడు వదులుకొనెను; "ఈవస్త్రము తడిసియున్నది," అని ఘోటముఖుడు, "ఏనుగు నీళ్ళను చిమ్మినది," అని కింజల్కుడు,

---

[3] ఈసూత్రములో చెప్పినవన్నియు ఆకాలమందు ప్రచారములో వుండినకథలు. రాజునకు ఆశ్రితునిపై కోపము కలిగినదని సూచించు చిహ్నములు ఇందు పేర్కొనబడినవి. చెట్లకు నీళ్ళుపోయువాడు ఉద్యోగిపై నీళ్ళుచల్లుట ఇట్టి సూచన. గడ్డి పెరుగని ప్రదేశములో గడ్డి కనిపించుట, రాజు మంచివస్త్రమును బహూకరించుటకు బదులు తడివస్త్రము నిచ్చుట ఇట్టివి.

"అతడురథమును అశ్వమును ప్రశంసించెను,"[4] అని పిశునుడు, "కుక్క మొరిగె" నని పిశునపుత్రుడు వదలుకొనిరి.

12. (రాజు) అర్థమానములకు నష్టముకలిగించినప్పుడు కొలువునువదులు కొనవలెను. 13. లేదా, రాజుయొక్క శీలమును తనలోని దోషమును తెలుసుకొని దోషమును పరిహరించుకొనవలెను. 14. లేదా, అతని సన్నిహితుడగు మిత్రుని ఆశ్రయించవలెను.

15. (శ్లో) అచ్చట ఉండి, భర్తయెడల తాను గావించిన దోషమును మిత్రులసహాయమున పరిహరించుకొనవలెను. తరువాత రాజు సజీవుడై ఉన్నను చనిపోయినను యథాస్థానమునకు రావలెను.

ఇది యోగవృత్తమను అయిదో అధికరణమందు సమయాచారికము అనే అయిదో అధ్యాయము.

---

[4] రథాశ్వములను ప్రశంసించి సారథిని ప్రశంసించకపోవుట రాజుయొక్క అతృప్తికి చిహ్నము.

## అధ్యాయము 6

### ప్రకరణము 94 : రాజ్యప్రతిసంధానము[1]
### ప్రకరణము 95 : ఏకైశ్వర్యము

రాజున కాపద సంభవించునపుడు అమాత్యు డీక్రిందివిధముగ ప్రవర్తించ వలెను.

1. రాజునకు మరణప్రమాదము సంభవించనున్నదను భయము ఉత్పన్నము కాకపూర్వమే అమాత్యుడు రాజునకు ప్రియులును హితులునగువారి సహాయమును సంపాదించి, "దేశమునకు పట్టిన పీడలను నివారించుటకో, శత్రువులను నాశము చేయుటకో, దీర్ఘాయుష్మంతుడగుటకో, పుత్రార్థముగనో ఒక క్రతువును చేయు చున్నాడు," అనుమిషతో నెల కొకపర్యాయమో రెండునెలల కొకపర్యాయమో రాజదర్శనము చేయుచుండవలెను. 3. రాజుపోలికలుగల పురుషునొకనికి రాజు వేషమునువేసి పోలికలలోని భేదమును కనిపెట్టుటకు సాధ్యముకాని వేళలలో అతనిని ప్రజలకు మిత్రామిత్రుల దూతలకు చూపించుచుండవలెను. 4. అతడు అమాత్యుని ద్వారా వారితో యథోచితముగ సంభాషణచేయవలెను. 5. దౌవారికుని ద్వారమునను అంతర్వంశికుని ద్వారమునను అతడు రాజుయొక్క దినచర్యలను యథోక్తముగ జరిపించుచుండవలెను. 6. అపకారము చేయువారి యెడల ప్రజల కోరికల ననుసరించి అపకారమునో ఉపకారమునో చేయుచు, ఉపకారముచేయు వారియెడలమాత్రము ఉపకారమే చేయుచుండవలెను.

7. కోశమును సైన్యమును దుర్గములోగాని పొలిమేరలోగాని ఒకేచోటచేర్చి, ఆప్తపురుషుల అధీనమందుంచవలెను ; ఏదో ఒక కారణమును చూపిరాజకుటుంబ

[1] రాజ్యాధికారము వంశానుగతముగ జ్యేష్ఠపుత్రునికి లభించవలెనను ధర్మముండిన కాలములో గూడ ఒకరాజు మరణించి మరియొకడు సుస్థిరముగ రాజ్యాధికారమును వహించుటకు పూర్వము ప్రమాదములనేకములు సంభవించుచుండెను. ఈ అధ్యాయములో అవి వివరింపబడినవి.

ములోనివారిని, రాజపుత్రులను ముఖ్యోద్యోగులను[2] ఒకేచోటికి పిలిపించవలెను.

8. బలమైనపక్షముగలవాడును దుర్గములో గాని అటవీప్రదేశములో గాని ఉన్న వాడును అగు ముఖ్యుడెవడైన విరోధభావమును చూపినయెడల అతనిని తన వైపునకు వచ్చునట్లు చేయవలెను. 9. లేదా, అనేక ప్రమాదములతోకూడిన దండయాత్రను సాగించుటకుగాని మిత్రకుటుంబమునకుగాని పంపివేయవలెను.

10. ప్రమాదము కలిగించునని తోచు సామంతుని ఒక ఉత్సవమునో, వివాహమునో, ఏనుగులవేటనో, గుర్రములవ్యాపారమునో, భూదానమునో కారణ ముగ జూపి వశపరుచుకొనవలెను; లేదా, అతనిమిత్రులద్వారా వశపరచుకొన వలెను. 11. అటుతర్వాత నతనితో స్థిరమగు సంధినిచేసుకొనవలెను. 12. లేదా, ఆటవికులతోగాని శత్రువులతోగాని వైరము సంభవించునట్లు పన్నుగడ చేయ వలెను. 13. లేదా, అతనిరాజ్యములో కొంతభాగము నిచ్చెదనని చెప్పి అతని కుటుంబములో నొకనినిగాని అతనిఅభిమానమును కోల్పోయిన రాజపుత్రునిగాని తనపక్షములో చేరునట్లు చేయవలెను.[2]

14. లేదా, రాజకుటుంబమునకు చెందినవారియు రాజపుత్రులయు ముఖ్యు లయు సహకారముతో ఇంతకుపూర్వమే అభిషిక్తుడైనట్లు కుమారులలో ఒకనిని (ప్రజలకు) చూపించవలెను.

15. లేదా, దాండకార్మిక ప్రకరణమందు వివరింపబడినట్లు రాజ్యములోని కంటకముల నన్నిటిని పెకలించి పరిపాలనమును సాగించవలెను.

16. ముఖ్యులలో ఎవడైనను, సామంతాదులలో ఎవడైనను, తిరుగుబాటు చేసినయెడల, "నీవు ఇక్కడికి రమ్ము; నిన్నే రాజుగ చేసెదను," అనిచెప్పి (అతనిని పిలిపించి) చంపించవలెను. 17. లేదా, అపత్ప్రతీకార ప్రకరణమందు చెప్పినట్లు అతనిని సాధించవలెను.

18. లేదా, క్రమక్రమముగ రాజ్యభారమునంతను యువరాజు పైవేసి రాజమరణవార్తను ప్రకటించవలెను.

19. శత్రురాష్ట్రములో ఉన్నప్పుడు రాజునకు మరణము సంభవించిన యెడల శత్రుపక్షమునుచేరినట్లు నటించు మిత్రునిద్వారా శత్రువుతో సంధి జేసు కొని వెనుకకు మరలిరావలెను. 20. లేదా, వానిదుర్గములో సామంతునొకనిని ప్రతిష్ఠాపనముజేసి వెనుకకు మరలిరావలెను. 21. లేదా, యువరాజునకు పట్టాభి షేకముగావించి యుద్ధమును సాగించవలెను. 22. లేదా, శత్రువే దండయాత్ర చేసినయెడల అపత్ప్రతీకారప్రకరణమందు చెప్పినట్లు చేయవలెను.

---

[2] రాజు మరణించినతర్వాత అధికారమునకు పెనుగులాడువారిలో ముఖ్యోద్యోగులు, సామంతులు పేర్కొనదగియున్నారు.

23. ఈవిధముగ అమాత్యుడు ఏకైశ్వర్యమును (అంతరాయములేని రాజ్యాధికారమును) సాధించవలెనని కౌటిల్యుడు.[3]

24. "ఇట్లు కాదు," అని భారద్వాజుడు. 25. "రాజు మరణశయ్యలో నున్నప్పుడు రాజకుటుంబములోనివారు రాజపుత్రులు ముఖ్యులు మొదలగువారి మధ్య పరస్పరకలహమును రేకెత్తించవలెను; లేదా, తక్కినముఖ్యులతో యుద్ధము ప్రారంభించునట్లు చేయవలెను. 26. యుద్ధము చేయువానిపై ప్రజలు తిరుగు బాటుగావించి చంపునట్లు ప్రోత్సహించవలెను. 27. లేదా, రహస్యదండముద్వారా రాజకుటుంబమువారిని రాజపుత్రులను ముఖ్యులను సాధించి తానే స్వయముగ రాజ్యమును వశపరుచుకొనవలెను. 28. ఏలయన, రాజ్యకాంక్షచే తండ్రి కుమాళ్ళతోను, కుమాళ్ళు తండ్రితోను యుద్ధము చేసెదరుగదా? అట్టిసందర్భములో రాజ్యమునకు ఏకాధారుడై నట్టియు సప్తప్రకృతులలో ఒకడై నట్టియు అమాత్యుడు రాజ్యమును వశపరచుకొనుటలో చెప్పవలసినది ఏమి కలదు? 29. స్వయముగ నది తనకువశమైనప్పుడు దానిని నిరాకరించరాదు. 30. "స్వయముగ కాంక్షించివచ్చిన స్త్రీని త్యజించినవానిని ఆమె శపించుచున్నది అను లోక ప్రవాదము కలదు."

31. (శ్లో) "కాలమును కాంక్షించువానికి కాలము ఒకపర్యాయము మాత్రమే లభించును; పని చేయదలచిన వానికి కాలము ఇంకొకమారు వచ్చుట సాధ్యము కాదు."[4]

32. "ఇది ప్రజలతిరుగుబాటునకుకారణ మగుచున్నది; ఇది అధర్మము; దీనివలన కలుగు ఫలితముకూడ అనిశ్చితము," అని కౌటిల్యుడు. 33. అతడు ఆత్మసంపన్నుడగు రాజపుత్రుని సింహాసనాధిష్ఠితునిగ చేయవలెను. 34. అట్టి వాడు లేనప్పుడు మహామాత్రులనందరిని, సమావేశపరిచి, అవ్యసనుడగు (మరి యొక) కుమారునిగాని, రాజపుత్రికనుగాని, గర్భిణియగు రాజమహిషినిగాని వారికి చూపి, "ఇది మీ నిక్షేపము; ఇతనితండ్రియందును మీనుగుణములందును వంశ మందును మీరు గౌరవమును ప్రదర్శించవలెను; ఇతడు ధ్వజముమాత్రమే; నిజ ముగ మీరే పరిపాలకులు; (ఇదిగాక) మన మిప్పుడు చేయవలసిన దేమిటి?" అని పలుకవలెను. 35. అత డట్లు చెప్పినవెంటనే (వారిలోకలిసిపోయిన) గూఢ చారులు, "మార్గదర్శకుడవైన నీతోకూడిన ఈ రాజుతప్ప మరియొకడు నాలుగు వర్ణములవారినిపాలించుటకు అర్హుడగునా?" అని అనవలెను. 36. "అట్లేకానిండు"

[3] ఎట్టివిప్లవములేక రాజ్యాధికారమును సుస్థిరపరచు బాధ్యతను అమాత్యుడు వహించుచుండు వాడు. అందుకై అతడు పన్నిన పన్నాగములన్నియు ఇచ్చట వివరింపబడినవి.

[4] అమాత్యుడే అధికారమును హస్తగతము చేసుకొని నూతనరాజవంశమును స్థాపించవలెనని భరద్వాజునిమతము. మనదేశచరిత్రమందు ఇట్టినిదర్శనములనేకము లున్నవి. కాని కౌటిల్యుడు దీనిని సమర్థించలేదు.

అని అమాత్యుడు చెప్పుచు కుమారునిగాని రాజపుత్రికనుగాని గర్భిణియగు దేవిని గాని అధికారమందు స్థాపించి బంధువులకును సంబంధులకును మిత్రామిత్రుల దూతలకును చూపించవలెను.

37. అమాత్యులయు సైనికులయు జీతబత్తెములనుపెంచి, "పెద్దవాడైన తర్వాత ఇతడు మరింతపెంచును," అని వారితో చెప్పవలెను. 38. ఇట్లు అతడు దుర్గరాష్ట్రముఖ్యులతో అభిభాషణము గావించి, మిత్రామిత్రపక్షములవారితో యథార్థముగ మాటాడవలెను.

39. కుమారునికి పరిపాలనకార్యములందు శిక్షణనిచ్చుటకు ప్రయత్నించ వలెను.

40. లేదా, సవర్ణుడగు బంధువుచే రాజపుత్రికను పుత్రవంతురాలుగచేసి, అట్టిపుత్రునికి పట్టము గట్టవలెను. 41. తల్లి మనస్సును మార్చుకొను భయమున్న ప్పుడు అల్పసత్త్వుడగు బంధువును శుభలక్షణములుగల ఒకబాలుని ఆమెవద్ద నుంచవలెను. 42. ఋతుకాలములందు ఆమెను కనిపెట్టియుండవలెను.[5]

43. సొంత ఉపయోగమునకై ప్రశస్తమగు భోగద్రవ్యము దేనిని అతడు చేయించరాదు. 44. కాని రాజునకై యానములు, వాహనములు, ఆభరణములు, వస్త్రములు, స్త్రీలు, ఇండ్లు మున్నగువాటిని ఏర్పాటుచేయవలెను.

45. (శ్లో) అతడు యౌవనవంతుడైనప్పుడు (వ్యవహార యోగ్యుడైనప్పుడు) అతని మనస్సును తెలుసుకొనుటకై తనకు విశ్రాంతి నియ్యవలసినదిగ కోరవలెను; అతడు తృప్తిచెందినవాడు కాని యెడల అతనిని వదలుకొనవలెను; తృప్తిచెందినవా డైనయెడల అతనిని రక్షించుచుండవలెను.

46. (శ్లో) అతని అభిమానమును కోల్పోయినయెడల అమాత్యుడు అరణ్యమునకు వెళ్ళిపోవలెను. లేదా, దీర్ఘసత్రయాగమును ప్రారంభించవలెను. (ఈపనులను చేయుటకు పూర్వము) రాజపుత్రుని రక్షించుటకై నిపుణులగు గూఢ పురుషులను నియోగించవలెను.

47. (శ్లో) లేదా, రాజు ముఖ్యులవశములో ఉన్నయెడల అమాత్యుడు అర్థశాస్త్రము నెరిగినవాడై అతనికి (రాజునకు) ప్రియులైనవారి సహాయముతో ఇతిహాసపురాణములమూలమున అతనికి ప్రబోధము చేయవలెను.

48. (శ్లో) లేదా, సిద్ధునివేషమును ధరించి, రహస్యక్రియల సాధనమున రాజును వశపరుచుకొని, అటుతర్వాత రాజద్రోహులపై దాండకార్మికమును ప్రయోగించవలెను.

---

[5] ఆమెకు మరియొకసంతానము కలుగకుండ జాగ్రత్తపడుట అవసరమని ఇది సూచించు చున్నది.

ఇది యోగవృత్తమను అయిదోఅధికరణమందు రాజ్యప్రతిసంధానము, ఏకైశ్వర్యము అనే ఆరో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు యోగవృత్తము అనే అయిదో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## ఆరో అధికరణము

## మండలయోని

### అధ్యాయము 1

### ప్రకరణము 96 : ప్రకృతిసంపదలు

1. రాజు, అమాత్యుడు, జనపదము, దుర్గము, కోశము, సేన, మిత్రుడు—ఇవి రాజ్యమునకు ఉండవలసిన అంగములు (ప్రకృతిసంపదలు).[1]

2. వీటిలో రాజునకు ఉండవలసిన సుగుణములు :

3. గొప్పవంశములో జననము, దైవసంపద, బుద్ధిసంపద, బలసంపద, వృద్ధులను దర్శనముచేసుకొనుట, ధర్మమందాసక్తి, సత్యవాక్కు, అవిసంవాదకత్వము, కృతజ్ఞత, విశాలదృష్టి, మహోత్సాహము, అనాలస్యముగ కార్యములను కొనసాగించుట, వశపడిన సామంతులుగలవాడగుట, దృఢబుద్ధి, క్షుద్రులు కానివారితో కూడిన మంత్రిపరిషత్తు గలవాడగుట, వినయమందు ఇష్టము—ఇవి ఆకర్షణగుణములు.

4. నేర్చుకొనుటయందాసక్తి, ఇతరులుచెప్పినదానిని వినుట, గ్రహించగలశక్తి, ధారణాశక్తి విజ్ఞానము, ఊహించగలశక్తి. అపోహలను విడనాడగలశక్తి, తత్వమందభినివేశము—ఇవి ప్రజ్ఞాగుణములు.

5. శౌర్యము, అమర్షము, శీఘ్రత, దక్షత—ఇవి ఉత్సాహగుణములు.

[1] రాజ్యము ఏడుఅంగములు, లేదా, ప్రకృతులతో కూడినట్టిది అనిమహాప్రాచీన రాజనీతి. ఇప్పటి రాజనీతిలో రాష్ట్రము, ప్రజలు, ప్రభుత్వము, సర్వ స్వామ్యము, లేక, స్వాతంత్ర్యములను నాలుగుఅంగములుమాత్రమే గుర్తింప బడుచున్నవి. ఏడుఅంగములలో ఒక్కొకదానికి ఉండవలసిన సుగుణములు (సంపదలు) ఎట్టివో ఈఅధ్యాయము వివరించుచున్నది.

6. వాగ్మిత్వము, ప్రాగల్భ్యము, జ్ఞాపకశక్తి, బుద్ధిబలము, దేహబలము, ఉదాత్తత, స్వవగ్రహము, శిల్పనైపుణ్యము, వ్యసనములకు వశుడుకాకుండుట, సైన్యమును నడుపగలశక్తి, ఉపకారాపకారములకు ప్రతీకారము చేయగలశక్తి,[2] హ్రీమంతుడగుట, ఆపత్తులలోను సాధారణకాలములోను అవసరములగు చర్యలను తీసుకొనగలశక్తి. దీర్ఘదర్శిగను దూరదర్శిగను ఉండుట, దేశకాలానుగుణముగను పురుషకారానుగుణముగను కార్యములకు ప్రాధాన్యముకల్పించుశక్తి; సంధివిక్రమములమధ్య, త్యాగసంయమములమధ్య,[3] పణపరిచ్ఛిద్రములమధ్య[4] విచక్షణ చేయగలశక్తి, చక్కనిరక్షణము, అదీనముగ నవ్వకుండుట, సూటిగను కోపములేకుండగను చూడగలుగుట, కామము క్రోధము లోభము స్తంభము చాపల్యము ఉపతాపము పైశున్యము లేకుండుట, తియ్యగను మందహాసముతోను గాంభీర్యముగను మాటలాడుశక్తి, వృద్ధోపదేశములననుసరించిన ప్రవర్తనము— ఇది ఆత్మసంపద.

7. అమాత్యులకు ఉండవలసినగుణములు (అమాత్యసంపద) ఇంతకు పూర్వమే వివరింపబడినవి.

8. మధ్యభాగమందు, పొలిమేరలందు బలిష్ఠములగు స్థానములు; ఆపత్కాలమందు తనవారిని ఇతరులను పోషించగలశక్తి; రక్షణసౌలభ్యము; జీవనాధారముల విషయమున స్వయంసమృద్ధి; శత్రువులను ద్వేషించు ప్రజ; వశులైన సామంతులు; బురద, రాళ్లు, ఊసరప్రదేశములు, విషమప్రదేశములు, ముండ్లు, శ్రేణులు[5] క్రూరమృగములు ఆటవికులు లేకుండుట; కాంతి; వ్యవసాయమునకు కావలసిన భూమి, గనులు, ద్రవ్యవనములు. హస్తివనములు సమృద్ధిగనుండుట; గోవులకు అనుకూలములు; మనుష్యులకుకావలసిన వసతులు రక్షింపబడిన గోభూములు, పశుసంపద, దైవమాతృకము కాకుండట[6] అనేకములగు స్థలజలమార్గములు; సారములు వివిధములగు పణ్యములసమృద్ధి; దండములను పన్నులను భరింపగలశక్తి; తమపనులయందు శ్రద్ధగలకర్షకులు,

---

[2] అపకారము చేసినవాని విషయముననే ప్రతీకారము చేయవలసిన అవసరముందును. ఉపకారము చేసినవానిపట్ల అనుసరించవలసిన ప్రవర్తనకూడ ఇది సూచించుచున్నది.

[3] త్యాగ మనగా శత్రువునకు దేనినైన ఇచ్చుట; సంయమ మనగా ఇయ్యకుండుట.

[4] పణ మనగా సంధిషరతులు. పరిచ్ఛిద్ర మనగా సంధిషరతులను ఉల్లంఘించి మైనను శత్రువులోని ఛిద్రమును (బలహీనతను) తన లాభమునకై ఉపయోగించుకొనుట.

[5] శ్రేణులుగ (సంఘములుగ) ఏర్పడినవారు సులభముగ రాజుపై తిరుగుబాటుచేయగలవారగుదురు. అట్టిశ్రేణులు లేకుండు జనపదము వాంఛింపదగినది.

[6] ఒక వర్షముపైనే ఆధారపడుట ప్రమాదము. అట్లు గాక మానవనిర్మితములగు జలాధారములతో జనపదము కూడియుండుట మంచిది.

వివేకముగల యజమానులు, అసంఖ్యాకులైన అవరవర్ణములవారు, భక్తులును శుచులును అగు మనుష్యులు—ఇది జనపదసంపద.

9. దుర్గసంపద ఇంతకుపూర్వమే వివరింపబడెను.

10. పూర్వులచేతను తనచేతను ధర్మానుసారముగ సంపాదింపబడినది ; ఎక్కువగ వెండిబంగారములతో కూడినట్టిది ; వివిధములును స్థూలములును అగు రత్నములుకలది ; హిరణ్యముతో కూడినది ; ఆదాయములభించని దీర్ఘకాలపు ఆపత్తులనుకూడ ఎదుర్కొనగలది—ఇది కోశసంపద.

11. పితృపైతామహము ; స్థిరభక్తి ; ఆజ్ఞానుసరణము, తృప్తిగాంచిన భార్యాపుత్రులు, నిర్వివాదముగ దీర్ఘయాత్రలు చేయునట్టిది, సర్వత్రఅడ్డులేనిది, కష్టములను సహించగలది, అనేకయుద్ధములలో పాల్గొనినట్టిది, అన్నిరకముల యుద్ధములకు ఆయుధములకు సంబంధించిన విద్యలందు నేర్పుగలది, వృద్ధి క్షయములలో రాజుతో భాగముకలది యగుటచేత ద్వైధీభావములేనట్టిది, క్షత్రియ ప్రాయమైనట్టిది—ఇది సైనికసంపద.

12. పితృపైతామహము, స్థిరత్వము, వశ్యము, ద్వైధీభావము లేకుండుట, గొప్పది, సులభముగ పనిచేయగలది—ఇది మిత్రసంపద.

13. రాజవంశములో జన్మించకుండుట, లోభము, క్షుద్రులతో కూడిన మంత్రిపరిషత్తు, అనురాగములేని ప్రజ, అన్యాయప్రవర్తనము, కార్యదీక్ష లేకుండుట, వ్యసనములకు లోబడుట, నిరుత్సాహము, విధివ్రాతయందు మూఢవిశ్వాసము, (అనాలోచితముగ) ఇష్టప్రకారము పనులనుచేయుట, అనుసరించువారు లేకుండుట, క్లీబత్వము, (ఇతరులకు) ఎల్లప్పుడపకారము చేయుట—ఇది శత్రుసంపద.

14. ఏలయన, ఇట్టిశత్రువును నిర్మూలించుట సులభసాధ్యము.

15. (శ్లో) శత్రువుని మినహాగా ప్రకృతులు ఏడు. వాటి ప్రత్యేక సంపదచే అవి ఇచ్చట వివరింపబడినవి. (కాని) అవి రాజసంపదలకు లోబడి పని చేయునట్టివి.[7]

16. (శ్లో) ఆత్మసంపన్నుడగురాజు సంపదలులేని ప్రకృతులకుకూడ సంపదలను చేకూర్చగలడు. కాని ఆత్మసంపదలేనిరాజు సంపదలుకలిగినట్టియు తనయందు అనురాగముకలిగినట్టియు ప్రకృతులను నాశముచేయును.

17. (శ్లో) ఆత్మసంపన్నుడుకానిరాజు చతుర్దిగంతములవరకు పరిపాలకుడైనను సంపదలులేని ప్రకృతులతో కూడుకొనినవాడై ప్రజలచే వధింపబడును; లేదా, శత్రువులచే జయింపబడును.

[7] సంపదలన్నింటిలో రాజునకు ఉండవలసినవి అగ్రస్థానము వహించునట్టివి. రాజు సంపదుపేతుడైనయెడల తక్కిన ప్రకృతులలోని లోపములను పూరించ గలవాడగును.

18. (శ్లో) కాని, ఆత్మసంపదగల రాజు అల్పవిస్తీర్ణముగల దేశమును పాలించువాడైనను ప్రకృతిసంపదలతో కూడి రాజనీతివిదుడై భూమినంతను జయించగలడు ; ఎప్పుడుగాని నష్టముపొందడు.

ఇది మండలయోని అను ఆరో అధికరణమందు ప్రకృతిసంపదలు అనే మొదటి అధ్యాయము.

# ఆరో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 97 : శమవ్యాయామికము[1]

1. శమవ్యాయామములు యోగక్షేమములకు మూలములు. 2. ఆరంభించిన కార్యములను పూర్తిచేయుటయే వ్యాయామము. 3. కార్యఫలముల ననుభవించుటయందు క్షేమమును చేకూర్చునది శమము.

4. శమవ్యాయామములకు మూలము షాడ్గుణ్యము. 5. క్షయము, స్థానము, వృద్ధి— ఈ మూడును దానిఫలితములు.

6. నయాపనయములు మానవాధీనములు ; అయానయములు దైవాధీనములు. 7. ఏలయన, దైవమానుషములగు కార్యములు లోకమును నడిపించుచున్నవి. 8. కంటికి కనిపించని సాధనము కారణముగ జరుగునది దైవము. 9. దాని మూలమున వాంఛించిన ఫలప్రాప్తి అయము. వాంఛించనిది అనయము. 10. కంటికికనుపించు సాధనముకారణముగ జరుగునది మానుషము. 11. దాని మూలమున ప్రాప్తించిన యోగక్షేమము నయము : అది ప్రాప్తించకపోవుట అనయము. 12. ఊహించతగినది మానుషము ; ఊహాతీతమైనది దైవము.

13. ఆత్మగుణసంపన్నుడును ప్రకృతిగుణసంపన్నుడును అగురాజు నయమునధిష్ఠించి విజిగీషువని చెప్పదగియున్నాడు. 14. అతనిని నలువైపుల చుట్టి, పొరుగురాజ్యమును పాలించువాడు శత్రువు (అరి) అను ప్రకృతి. 15. అదే విధముగ దీనికి తర్వాతిరాజ్యమును పాలించువాడు మిత్రుడను ప్రకృతి.

---

[1] శమ మనగా శాంతి. ఇతరరాజులతో శాంతియుతమగు సంబంధము కలిగి యుండుట. వ్యాయామ మనగా పని, దూతలను పంపుట, రాయబారములను జరుపుట, యుద్ధముచేయుట మొదలగునవి అన్నియు వ్యాయామములో చేరినట్టివి. అధ్యాయమునకు శమవ్యాయామికమను పేరు పెట్టబడినను వీటినిగురించిన వివరణము ఇందు ఎక్కువగ కనిపించదు ; ఇందులో వివరింపబడిన విషయము రాజమండలము.

16. శత్రుసంపదతోకూడిన సామంతుడు (పొరుగురాజు) శత్రువు (అని పేర్కొనదగినవాడు); ఆపదలో చిక్కుకొనినవాడు యాతవ్యుడు; ఆశ్రయము లేనివాడును దుర్బలుని ఆశ్రయముకలవాడును ఉచ్ఛేదనీయుడు; దీనికి విరుద్ధమగు స్థితిలోనున్నవాడు పీడనీయుడు; లేదా, కర్శనీయుడు. 17. ఇవి శత్రువులలోని భేదములు.

18. అతని కావల ఎదటిభాగమున వారివారిరాష్ట్రముల సామీప్యమును బట్టి మిత్రుడు, అరిమిత్రుడు, మిత్రమిత్రుడు, అరిమిత్రమిత్రుడు ఉండెదరు; వెనుకటి భాగమున పార్ష్ణిగ్రాహుడు,[2] ఆక్రందుడు,[3] పార్ష్ణిగ్రాహాసారుడు,[4] ఆక్రందాసారుడు ఉండెదరు.

19. పొరుగు రాజ్యమును పాలించువాడు సహజశత్రువు; సమానమగు వంశమునకు చెందినవాడు జన్మముచే శత్రువు; విరోధింపబడినవాడు, విరోధించినవాడు కృత్రిమశత్రువులు.

20. ఒకరాజ్యమున కావలనుండువాడు సహజమిత్రుడు; తండ్రివంకగాని తల్లివంకగాని బంధువైనవాడు జన్మముచే మిత్రుడు; ధనమునుకోరిగాని జీవితమునుకోరిగాని ఆశ్రయించినవాడు కృత్రిమమిత్రుడు.

21. అరి విజిగీషుల రాజ్యములకు పొరుగునందుండు రాజ్యమును పాలించువాడై వారిద్దరు కలిసినప్పుడుగాని వేరుపడినప్పుడుగాని వారికి సహాయ పడు సామర్థ్యముగలవాడు, వారు వేరుపడినప్పుడు వారిని అణచుసామర్థ్యము గలవాడు మధ్యముడు.

22. అరి విజిగీషు మధ్యములకు బాహ్యుడై వారిప్రకృతులకంటె బలవత్తరుడై వారుముగ్గురు కలుసుకొనినప్పుడుగాని వేరుపడినప్పుడుగాని వారికి సహాయముచేయు సామర్థ్యముగలవాడు, వారు వేరుపడినపుడు వారిని అణచు సామర్థ్యముగలవాడు ఉదాసీనుడు.[5]

23. వీరు ప్రకృతులు (రాజమండలములోని అంగములు).

24. లేదా, విజిగీషువు, మిత్రుడు, మిత్రమిత్రుడు—వీరు మండలములోని మూడుప్రకృతులు. 25. వీరిలో ఒక్కొకరు వారి అమాత్యుడు, జనపదము, దుర్గము, కోశము, సైన్యము లను అయిదుప్రకృతులతో కూడినవారై పద్దెనిమిది ప్రకృతులుగల మండలముగ ఏర్పడుచున్నారు. 26. దీనినిబట్టి శత్రువు, మధ్య

---

[2] పార్ష్ణిగ్రాహుడు వెనుకనుండి పైబడువాడు.

[3] సహాయమునకై ఆక్రోశించు విజిగీషునికి సహాయము చేయువాడు.

[4] పరుగెత్తువాని సహాయార్థము వచ్చువాడు.

[5] మధ్యముడు, ఉదాసీనుడు మండలములో మిక్కిలి బలవంతులగు రాజులు; వీరిద్దరిలో ఉదాసీనుడు ఎక్కువ బలముకలవాడు.

ముడు, ఉదాసీనుడు—వీరిలో ఒక్కొకరికి సంబంధించిన మండలమునుగురించి తెలుసుకొనవలెను.

27–28. ప్రకృతులలో రాజులు పండ్రెండుగురు; ద్రవ్యప్రకృతులు అరవై; మొత్తము డెబ్బైరెండు. 29. వీటిలో ఒక్కొకటియు దానికి సంబంధించిన ప్రత్యేక సంపదలను కలిగినట్టిది.

30. శక్తి, సిద్ధి—ఈరెండింటిని వివరించవలసియున్నది. 31. శక్తి అనగా బలముతో కూడియుండుట. 32. సిద్ధి అనగా సుఖమును సంపాదించుట.

33. శక్తి మూడువిధములు: జ్ఞానసాధనమున కలుగుబలము మంత్రశక్తి; కోశదండముల సాధనమునకలుగుబలము ప్రభుశక్తి; విక్రమసాధనమున కలుగు బలము ఉత్సాహశక్తి.

34. ఇట్లే సిద్ధికూడ మూడువిధములు: మంత్రశక్తిచే సాధించదగినది మంత్రసిద్ధి; ప్రభుశక్తిచే సాధించదగినది ప్రభుసిద్ధి; ఉత్సాహశక్తిచే సాధించ దగినది ఉత్సాహసిద్ధి.

35. ఈ శక్తులను అధికముగ గలవాడు అధికుడగుచున్నాడు,[6] తక్కువగ గలవాడు హీనుడగుచున్నాడు; సమముగగలవాడు సముడగుచున్నాడు. 36. కావున, అతడు తనశక్తిని సుఖమును వృద్ధిచేసుకొనుటకు సర్వదా ప్రయత్నించ వలెను. లేదా, సమానమైనప్పుడు వాటిసామీప్యమును శౌచమును అనుసరించి ద్రవ్యప్రకృతిసంపదలను వృద్ధిచేసుకొనవలెను. 37. లేదా, దూష్యుల నుండియు శత్రువులనుండియు వీటిని పరిగ్రహించుటకు ప్రయత్నించవలెను.

38. లేదా, అతడు ఈవిధముగ ఆలోచించవచ్చును "నాశత్రువు శక్తి యుక్తుడైనను వాగ్దండముచేతను, పారుష్యదండముచేతను, అర్థనష్టము కలిగించియు ప్రజలను కష్టపెట్టును; కార్యసిద్ధికలవాడైనను వేట, జూదము, మద్యము, స్త్రీవ్యసన ములకు వశుడై ప్రమాదములను పొందును; ఇట్లు ప్రజానురాగమును కోల్పోవుటచే తను, స్వబలము క్షీణించుటచేతగాని, ప్రమత్తుడగుటచేతగాని నాకు సులభసాధ్యు డగును; యుద్ధమందెదుర్కొనబడినవాడై తనబలమునంతను ఒకేచోటచేర్చి ఒక చోటగాని దుర్గమందుగాని ఉండిపోవును; ఇట్లు సైన్యమునంతను ఒకచోటచేర్చి, మిత్రుడుగాని దుర్గమునుగాని లేనివాడై నాచే సులభముగ సాధింపదగిన వాడ గును;" లేదా, "బలవంతుడగు రాజు నాశత్రువును మరియొకచోట నిర్మూలము చేయ ప్రయత్నించుచున్నాడు; అతనిని నిర్మూలము చేసినతర్వాత నన్నుకూడ నిర్మూలము చేయవచ్చును," అని అనుకొని "బలవంతుడు నాపైపడినప్పుడు నాకు సహాయపడవచ్చును; లేదా, నాప్రయత్నములు సఫలములు కానప్పుడు నాకు సహాయపడవచ్చును; లేదా, నేను మధ్యమునిపై పడినప్పుడు శత్రువు సహా

[6] శత్రువుకంటె నధికు డగుచున్నాడు.

యము అవసరముకావచ్చును.” ఈ విధముగ ఆలోచించి ఇట్టికారణములున్నప్పుడు విజిగీషువు శత్రువుయొక్క శక్తియు సిద్ధియు వృద్ధియగుటకు సమ్మతించ వచ్చును.

39. (శ్లో) ప్రకృతిమండలమునకు ఏకాంతరులగు రాజులను నేమిగను, అనంతరులగు రాజులను ఆకులుగను, నేతయగు (విజిగీషువు) తన్ను నాభిగను చేసుకొని నలుదిక్కుల వ్యాపించవలెను.

40. (శ్లో) నేత, మిత్రుడు అను ఇద్దరిమధ్య చిక్కుకొనిన శత్రువు బలవంతుడైనప్పటికిని పెకిలించదగినవాడో పీడించదగినవాడో అగును.

ఇది మండలయోని[7] అను ఆరో అధికరణమందు శమవ్యాయామికమనే రెండో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు మండలయోని అను ఆరో అధికరణము సమాప్తము.

[7] యోని యనగా మూలము లేక ఆధారము. మండలయోని అనగా షాడ్గుణ్యమునకు మూలాధారమగు రాజమండలము. అట్టి రాజమండల మీ యధికరణమందు వివరింపబడినది.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## ఏడో అధికరణము

## షాడ్గుణ్యము

### అధ్యాయము 1

### ప్రకరణము 98 : షాడ్గుణ్య సముద్దేశము
### ప్రకరణము 99 : క్షయస్థాన వృద్ధి నిశ్చయము

1. ప్రకృతిమండలము షాడ్గుణ్యమునకు మూలము.

2. "సంధి, విగ్రహము, ఆసనము, యానము, సంశ్రయము, ద్వైధీభావము అనునవి షాడ్గుణ్యము (నకుఅంగములు)" అని ఆచార్యులు.

3. "గుణములు రెండే" అని వాతవ్యాధి. 4. "ఏలయన, గుణములు ఆరును సంధి విగ్రహములనుండియే జన్మించుచున్నవి."

5. వీటిమధ్య అవస్థాభేదములుండుటచేత గుణములు ఆరు అని కౌటిల్యుడు.

6. వాటిలో సంధి అనగా పణబంధము (షరతులతో ఒప్పందము చేసుకొనుట). 7. విగ్రహమనగా అపకారము (విరోధము). 8. ఆసనమనగా ఉపేక్షణము. 9. యాన మనగా[1] శక్తులను వృద్ధిచేసుకొనుట. 10. సంశ్రయ మనగా పరార్పణము (ఒకనికి వశమగుట). 11. ద్వైధీభావమనగా (ఒకనితో) సంధియు మరియొకనితో యుద్ధమును. 12. ఇవి (విదేశాంగనీతికి) ఆరుగుణములు (అంగములు).

13. శత్రువుకంటె బలహీనుడుగనున్నప్పుడు సంధి చేసుకొనవలెను.

---

[1] యానమనగా సైన్యములతో శత్రువుపైకి వెళ్ళుట. శక్తులను వృద్ధిచేసుకొన్నప్పుడే యానము సాధ్యమగును.

14. (అతనికంటె) అభివృద్ధిలో నున్నప్పుడు విగ్రహము (విరోధము) 15. "నాపై పడుటకు శత్రువునకు శక్తిలేదు; శత్రువుపై పడుటకు నాకు శక్తి లేదు," అని తోచినప్పుడు అసనము. 16. గుణాతిశయము కలిగినప్పుడు యానము. 17. శక్తిహీనుడైనప్పుడు ఆశ్రయము. 18. కార్యము సహాయసాధ్యమైనప్పుడు ద్వైధీభావము. 19. ఇదిగుణముల అవస్థాపనము.[2]

20. ఏ గుణము ననుసరించుటవలన తనకు ఈక్రిందివిధముగ తోచునో ఆ గుణము ననుసరించవలెను. "ఈగుణము ననుసరించుటవలన దుర్గములు, సేతుకర్మలు, వణిక్పథములు, శూన్యనివేశములు, గనులు, ద్రవ్యవనములు, హస్తివనములు మొదలగువాటికి సంబంధించిన నాకార్యముల నభివృద్ధి జేసుకొనగలవాడ నగుదును; శత్రుకార్యములను భంగపరిచినవాడను కాగలను," అని. 21. అదియే వృద్ధి. 22. "నావృద్ధి ఎక్కువవేగముగను, ఎక్కువపరిమాణము గలదిగను, భవిష్యత్తులో ఎక్కువ అభ్యుదయమునకు దారితీయునట్టిదిగను ఉన్నది; శత్రువువృద్ధి దీనికి విరుద్ధముగ నున్నది," అని తోచినపుడు శత్రువువృద్ధిని గురించి ఉపేక్షించవలెను. 23. ఉభయులవృద్ధికి ఒకేకాలముపట్టునని తోచినప్పుడును, ఉభయులవృద్ధికి ఒకేఫలితము లభించునని తోచినప్పుడును సంధి చేసుకొనవలెను.

24. ఏ గుణము ననుసరించుటవలన తనకార్యములకు భంగముకలుగుటయు, శత్రువు కార్యములకు భంగములేకపోవుటయు సంభవించునో దాని ననుసరించరాదు. 25. అదే క్షయము. 26. "నాక్షయము ఎక్కువకాలము పట్టునట్టిది; పరిమాణములో అది తక్కువ; క్షయముకలిగినను (భవిష్యత్తులో) నేను వృద్ధి కాగలను; శత్రువు క్షయము దీనికి విరుద్ధము," అని తోచినపుడు అతని క్షయము పట్ల ఉపేక్షవహించవలెను. 27. ఉభయులక్షయము తుల్యకాల తుల్యఫలములతో కూడినప్పుడు సంధి చేసుకొనవలెను.

28. ఏ గుణము ననుసరించుటవలన తనకార్యములకు వృద్ధిగాని క్షయముగాని సంభవించదో అట్టిస్థితికి స్థాన మనిపేరు. 29. నాస్థానము తక్కువకాలము కలది; దానిమూలమును ఎక్కువవృద్ధిలభించును. శత్రువువిషయమున స్థానము దీనికి విరుద్ధము", అని తోచినపుడు అతని స్థానమునుగురించి ఉపేక్షించవలెను. 30. "స్థానము ఇద్దరి విషయములో తుల్యకాలము తుల్యఫలము కలదిగనున్నప్పుడు సంధి చేసుకొనవలెను," అని ఆచార్యులు. 31. ఈవిషయములో వివాదము లేదని కౌటిల్యుడు.

32. "సంధిమూలమున నాకార్యములు ఫలవంతములగును, అది కారణముగ శత్రుకార్యములకు భంగముకలుగును; లేదా, మహాఫలవంతములగు నా

[2] ఏ సందర్భమున ఏ గుణమును ఆశ్రయించవలెనో ఇచ్చట సంక్షిప్తముగ చెప్పబడినది.

కార్యములనేగాక శత్రుకార్యఫలములనుకూడ నేను అనుభవించగలను; లేదా, సంధియని నమ్మించి, యోగముద్వారా, రహస్యచర్యలద్వారా, గూఢచారుల ద్వారా, శత్రుకార్యములను భంగపరుపగలను; లేదా, శత్రుకార్యములను నిర్వహించుటయందు సమర్థులగువారికి నాకార్యలాభములనుండి ఎక్కువవేతనములను అనుగ్రహములను పరిహారములను ఇచ్చెదనని చెప్పి వారిని అతనికార్యములను వదలి నాకార్యములలోనికి వచ్చునట్లు చేయగలను; లేదా, శత్రువు అతిబలవంతుడగు మరియొకరాజుతో కలిసినకారణమున స్వకార్యములను భంగపరుచుకొనును; లేదా, (శత్రువు) ఎవనితో యుద్ధమును ప్రారంభించి నాతో సంధి చేసుకొనెనో అట్టివానితో యుద్ధమును పొడిగించెదను; లేదా, (పైకి) నాతోకలిసియున్నను నన్ను ద్వేషించు రాజుయొక్క జనపదమును శత్రువు పీడించగలడు; లేదా, శత్రువుచే నుపహతమైన అతని దేశము నన్ను ఆశ్రయించుట మూలమున నా కార్యములు వృద్ధిగాంచును; లేదా, శత్రువు తన కార్యములందు నష్టపడి, కష్టములపాలైన కారణమున నాకార్యములకు భంగముకలిగించజాలడు; లేదా, నేను నాకార్యములను మరియొకచోట ప్రారంభముగావించి, వారిద్దరితో కలిసినవాడనై[3] నాకార్యములందు వృద్ధిగాంచెదను; లేదా, శత్రువుతో సంధిచేసుకొని అతనిని కలిసియుండు రాజమండలములో విభేదములను ప్రవేశపెట్టి దానిని నావైపునకు త్రిప్పుకొనెదను; లేదా, రాజమండలమును పట్టుకొనుటకు శత్రువు ప్రయత్నించినపుడు నాసైన్యముతో నతనికి సహాయముచేసి, వారిమధ్య ద్వేషమును కల్పించి, వారతనిపై ద్వేషించినపుడు వారిచేతనే అతనిని భంగపరుపగలను," ఈవిధముగ చేయవచ్చునని తోచినపుడు సంధిద్వారా వృద్ధిని సాధించవలెను.

33. "నాదేశము యుద్ధముచేయుటయందు సమర్థులైనవారితోడను అట్టి శ్రేణులతోడను కూడినట్టిది; శైల వన నదీ దుర్గములద్వారా ఏకప్రవేశము కలదియగుటచేత సులభముగ రక్షింపతగియున్నది. కావున శత్రువులదండయాత్రను ఎదుర్కొనగలదు; లేదా, నారాజ్యపు పొలిమేరలో దుర్భేద్యమగు దుర్గమునాశ్రయించి నేను శత్రుకార్యముల నన్నిటిని భంగపరుచుటయందు సమర్థుడను; శత్రువు గొప్పఆపదచే పీడింపబడినవాడై ఉత్సాహమును కోల్పోయి తన కార్యములన్నియు నష్టమగు కాలమం దున్నాడు; మరియొక ప్రదేశమం దతడు యుద్ధముచేయుచున్నప్పుడు అతనిజనపదమును సులభముగ వశపరుచుకొనగలను," అని అనుకొనినపుడు విగ్రహముద్వారా వృద్ధిని సాధించవలెను.

34. "నాకార్యములను భంగపరచు సామర్థ్యము శత్రువునకులేదు; శత్రు

[3] శత్రురాజ్యమునకు దూరముగను మరియొకనిరాజ్యమునకు దగ్గరగను కార్యములను ప్రారంభించి వారిద్దరితో కలిసియుండుట అనికొందరు వ్యాఖ్యాతలు.

కార్యములను భంగపరుచు సామర్థ్యము నాకు లేదు; లేదా, అతడు ఆపదలోనున్న ప్పుడుగాని, వేటకుక్క, అడవిపందులమధ్య యుద్ధమువంటి యుద్ధములో నతడు చిక్కుకొని యున్నప్పుడుకాని నేను నాకార్యములను చేసుకొనుటలో శ్రద్ధవహించి వృద్ధినిసాధించెదను,'' అని అనుకొనినపుడు ఆసనముద్వారా వృద్ధిని సాధించ వలెను.

35. "యానముచేత శత్రుకార్యములను భంగపరుచుట సాధ్యము, (యాన కాలములో) నాకార్యములను రక్షించుకొనుటకు కావలసిన చర్యలను తీసుకొన గలను," అని అనుకొనినప్పుడు యానముద్వారా వృద్ధిని సాధించవలెను.

36. "నేను శత్రుకార్యములను భంగపరుపలేకున్నాను. నాకార్యములకు కలిగిన భంగపాటును నివారించలేకున్నాను,'' అని అనుకొనినపుడు అతడు బలవంతు నాశ్రయించి తన కార్యములను చక్కబెట్టుకొని క్షయమునుండి స్థానము నకును స్థానమునుండి వృద్ధికిని చేరవలెను.

37. "ఒకనితో సంధి చేసుకొని నాకార్యముల వృద్ధిని సాధించెదను; యుద్ధముచేసి శత్రుకార్యములకు విఘాతము కలిగించెదను,'' అని అనుకొని నపుడు ద్వైధీభావముద్వారా వృద్ధిని సాధించవలెను.

38. (శ్లో) ఈ విధముగ ప్రకృతిమండలమున నుండువాడై ఆరుగుణముల ననుసరించి తన కార్యములను క్షయమునుండి స్థానమునకును స్థానమునుండి వృద్ధికిని తీసుకొని రావలెను.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు షాడ్గుణ్యసముద్దేశము క్షయ స్థానవృద్ధినిశ్చయము అనే మొదటి అధ్యాయము.

## ఏడో అధికరణము

### అధ్యాయము 2

### ప్రకరణము 100 : సంశ్రయవృత్తి

1. సంధి విగ్రహములవలన సమమగు వృద్ధికలుగనున్నప్పుడు సంధిచేసుకొనవలెను. 2. ఏలయన, యుద్ధము మూలమున క్షయము, వ్యయము, దూరప్రాంతములందు ప్రవాసము, ఇతరప్రయాసలు సంభవించును.[1] 3. దీనినిబట్టి ఆసన యానములలో ఆసనమే వరించదగినదని తెలుసుకొనవలెను.

4. ద్వైధీభావ సంశ్రయములలో ద్వైధీభావమునే వరించవలెను. 5. ఏలయన, ద్వైధీభావము ననుసరించువాడు తన కార్యములకుమాత్రమే ప్రాధాన్యము కల్పించుచు తనకే ఉపకారము చేసుకొనుచున్నాడు; సంశ్రయి అట్లుగాక తన కుపకారము చేసుకొనుటకుబదులు ఇతరుని కుపకారము చేయుచున్నాడు.

6. తనపొరుగువానికంటె ఎక్కువబలముకలవానినే ఆశ్రయించవలెను. 7. అట్టిబలవంతుడు లేనప్పుడు శత్రువగు పొరుగువానినే ఆశ్రయించి, కోశముతోగాని సైన్యముతోగాని భూమి (ప్రదానము)తోగాని అప్రత్యక్షముగ నతని కుపకరించుటకు ప్రయత్నించవలెను. 8. శత్రువుతో యుద్ధముచేయుచుండునపుడు తప్ప ఎక్కువబలము గలవానితో కలియుట మహాదోషము.

9. ఇది సాధ్యముకానప్పుడు దండోపనతునివలె[2] ప్రవర్తించవలెను. 10 శత్రువు ప్రాణహరమగు రోగముతో బాధపడుచున్నప్పుడుగాని, అంతఃకలహము నెదుర్కొనునప్పుడుగాని, అతనిశత్రువు వృద్ధిదశలో నున్నప్పుడుగాని, అతని మిత్రుడు వ్యసనములలో నున్నప్పుడుగాని తనవృద్ధిని సాధించుకొనవచ్చునను నమ్మకము కలిగినపక్షమున తన్నేదో వ్యాధిపీడించుచున్నదను మిషతోగాని తానేదో

---

[1] యుద్ధముకంటె సంధియే వాంఛితమని కౌటిల్యుని అభిప్రాయము.

[2] దండోపనతుని ప్రవర్తనము 7–15–21లో వివరింపబడినది.

క్రతువును చేయవలసియున్నదనుమిషతోగాని అతనిని విడిచి (తనరాష్ట్రమునకు) వెళ్ళిపోవలెను. 11. లేదా, స్వరాష్ట్రమందే ఉన్నపక్షమున అతనివద్దకు వెళ్ళ రాదు. 12. లేదా, అతనిసమీపమందున్నప్పుడు అతని ఛిద్రములను తెలుసుకొని అతనిపై దెబ్బతీయవలెను.

13. ఇద్దరు బలవంతులమధ్య తానున్నప్పుడు వారిలో తన్ను రక్షింప సమర్థుడగువాని నాశ్రయించవలెను ; లేదా, ఎవరికితాను అంతర్ధి[3] నుండవచ్చునో వానినిగాని, ఉభయులనుగాని ఆశ్రయించవలెను. 14. వారిలో నొకడు తనకు మూలాధారమగు రాజ్యమును స్వాధీనము చేసుకొనుటకు ప్రయత్నించుచున్నాడని రెండవవానితోచెప్పి కపాలసంశ్రయుడు[4] కావచ్చును. 15. లేదా, వారిద్దరిమధ్య ఒకడింకొకనిపై కుట్రను పన్నుచున్నాడని భేదముకల్పించి, విడిపోయినతర్వాత వారిపై రహస్యదండమును ప్రయోగించవలెను.

16. లేదా, ఇద్దరుబలవంతుల పార్శ్వమందున్నప్పుడు ఆసన్నమగు భయమునకు ప్రతీకారచర్యలు తీసుకొనవలెను. 17. లేదా, దుర్గమొకదానినాశ్ర యించి ద్వైధీభావము ననుసరించవలెను. 18. సంధివిగ్రహముల గురించిన మంచిచెడ్డల నాలోచించవలెను. 19. వారిద్దరి దూష్యులకు శత్రువులకు ఆటవికు లకు సహాయముచేయవలెను. 20. వారిలో నొకనిపక్షమందుచేరి రెండవవాని దూష్యాదులసాధనమున ఆపత్కాలమం దతనిని కొట్టవలెను.

21. లేదా, ఇద్దరును తన్నుపీడించినప్పుడు రాజమండలము నాశ్రయించ వలెను ; లేదా, మధ్యమోదాసీనులలో నొకరి నాశ్రయించవలెను. 22. అతనితో కలిసి వారిలోనొకనికి సహాయపడి రెండవవానిని నిర్మూలించవలెను ; లేదా, ఇద్ద రిని నిర్మూలించవలెను.

23. ఇద్దరిచేత తాను నిర్మూలించబడినపుడు మధ్యమోదాసీనులలోగాని వానిపక్షములోనివారిలోగాని ఎవడున్యాయప్రవర్తనముకలవాడో వాని నాశ్రయించ వలెను. 24. అందరు సమానమగున్యాయప్రవర్తనము కలవారైనప్పుడు వారిలో ఎవని ప్రకృతులు తన్ను సుఖింపజేయుదురో, ఎవనిని ఆశ్రయించినయెడల తన్ను ఉద్ధరించుకొనుట కవకాశముండునో, ఎవనిని తనపూర్వులు ఆశ్రయించిరో ఎవనివద్ద తనసంబంధులున్నారో, ఎవనివద్ద తనమిత్రులు ఎక్కువగను శక్తికల వారుగను ఉన్నారో అట్టివాని నాశ్రయించవలెను.

---

[3] అంతర్ధిఅనగా ఒకగొప్పరాజ్యమునకు పొరుగుననుండి మరియొకగొప్ప రాజ్యమునుండి దానికి ప్రమాదమునంభవించకుండ రక్షించునట్టిరాజ్యము, ప్రస్తుతకాలమున ఇట్టిరాజ్యమునకు బఫర్ రాజ్యమని పేరు.

[4] కపాల మనగా భిక్షాపాత్ర. కపాలసంశ్రయు డనగా భిక్షాపాత్రతో ఇతరుని చేరువాడు.

25. (శ్లో) ఎవనికి తాను ప్రియుడో, ఎవడు తనకు ప్రియుడో—వీరిద్దరిలో ఎవని నాశ్రయించవలెను? ఎవనికి తాను ప్రియుడో వాని నాశ్రయించవలెను. సంశ్రయమున కిదియే ఉత్తమమార్గము.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు సంశ్రయవృత్తి అనే రెండో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 101 : సమహీనజ్యాయుల గుణాభినివేశము[1]

### ప్రకరణము 102 : హీనసంధులు[2]

1. విజిగీషువు తనశక్తి కనుగుణముగ షాడ్గుణ్యమును వినియోగించవలెను. 2. సమునితోను అధికునితోను సంధి చేసుకొనవలెను ; హీనునితో యుద్ధముచేయవలెను. 3. ఏలయన, బలవంతునితో యుద్ధముచేయుట ఏనుగుతో తనపాదమును సాధనముగ వినియోగించి యుద్ధముచేయుటయే. 4. సమునితో యుద్ధము పచ్చికుండను పచ్చికుండతో బ్రద్దలుకొట్టినట్లు ఉభయుల క్షయమునకు దారితీయును. 5. రాతితో కుండను కొట్టినట్లు హీనునితో యుద్ధముచేసిన సంపూర్ణ విజయమును సాధించును.

6. అధికుడు సంధి కిష్టపడనియెడల దండోపనతవృత్తి[3] ననుసరించవలెను ; లేదా, బలహీనుని విషయమున చెప్పినట్లు ప్రవర్తించవలెను.

7. సముడు సంధికిష్టపడనియెడల ఎంతమాత్ర మత డపకారముచేయునో అంతమాత్ర మతనికి ప్రత్యపకారము చేయవలెను. 8. ఏలయన, రెండువస్తువుల నతుకుటకు తేజస్సు (వేడి) సాధనము. 9. కాల్చబడనిలోహము లోహముతో అతుకదు.

10. హీను డన్నివిధముల లోబడినప్పుడు, అతనితో సంధి చేసుకొనవలెను. 11. ఏలయన, దుఃఖమువలనను కోపమువలనను ఉత్తేజితమైన పరా

[1] సముడు, హీనుడు, అధికుడు ఏయేసందర్భములలో నెట్టిగుణముననుసరించవలెనో వివరించు ప్రకరణము.

[2] బలహీనుడు చేసుకొనదగు సంధులు.

[3] సైన్యము నిచ్చి సంధిచేసుకొనువాని వృత్తి దండోపనతవృత్తి.

క్రమము దావాగ్నివలె వానిని యుద్ధములోనికి దిగునట్లుచేయును. 12. అప్పు డతనికి మండలానుగ్రహముకూడ లభించును.

13. సంధిచేసుకొనినతర్వాత, "శత్రుప్రజలలోని లుబ్ధులు, దరిద్రులు, తిరుగుబాటుచేయువారు పట్టుకొనబడవచ్చునను భయముచేత నన్ను చేరకున్నారు" అని తోచినపక్షమున హీనుడుగూడ యుద్ధములోనికి దిగవచ్చును.[4]

14. యుద్ధము ప్రారంభించినతర్వాత, "యుద్ధమునకు భయపడి శత్రు ప్రజలలోని లుబ్ధులు, దరిద్రులు, తిరుగుబాటుచేయువారు నన్ను చేరకున్నారు," అని తోచినపక్షమున అధికుడుకూడ సంధి చేసుకొనవలెను; లేదా, యుద్ధభయ మును పోగొట్టవలెను.

15. ఒకేకాలమున ఉభయులకు ఆపదలు సంభవించినప్పుడు, "నేను ఎక్కువ ఆపదలో నున్నాను; తక్కువ ఆపదలోనున్న శత్రువు దానిని సులభ ముగ తొలగించుకొని నాపై పడును," అని అనుకొనినప్పుడు అధికుడుకూడ సంధి చేసుకొనవలెను.

16. సంధిమూలమునగాని యుద్ధముమూలమునగాని శత్రువు బలహీనుడగు ననియు, తానుబలవంతుడ నగుదుననియు తోచనపుడు అధికుడుకూడ ఆసనము ననుసరించవలెను.

17. శత్రువుయొక్క ఆపదలకు ప్రతీకారమేలేనట్లు తోచినపుడు హీనుడు కూడ నతనిపైకి యానముచేయవలెను.

18. తానెదుర్కొనవలసిన ఆపదకు ప్రతీకారములేనట్లు తోచినపుడు అధికుడుకూడ సంశ్రయము ననుసరించవలెను.

19. ఒక చోట సంధిమూలమునను మరియొకచోట యుద్ధము మూలము నను కార్యసిద్ధియగునని తోచినపుడు అధికుడుకూడ ద్వైధీభావము ననుసరించ వలెను.

20. సముడుకూడ ఇట్లే షాడ్గుణ్యమును అనుసరించవలెను.

21. దాని విషయములోని విశేషములు:

22. (శ్లో) కదలించిన సేనలుగల బలవంతుడగు రాజుచేత నాక్రమించ బడిన బలహీనుడగురాజు తనకోశమును సైన్యమును తన్నును తనభూమిని అర్పించి అతనితో సంధిచేసుకొని వెంటనే లోబడిపోవలెను.

---

[4] ప్రతిరాజ్యమునందు ప్రజలలో కొందరు లుబ్ధులుగను దరిద్రులుగను రాజుపై తిరుగుబాటు చేయువారుగను నుందురు. వీరికి దేశాభిమానముండదు. వీరు సాధారణముగ శత్రువులకు సహాయముచేయు స్వార్థపరులు. ఇట్టివారిని ప్రస్తుత కాలమున పంచమదళమని (Fifth Column) చెప్పెదరు. వీరిసహాయము లభించునను ఆశతో శత్రువు దేశముపై దండెత్తును. అట్టిసహాయము లభించని పరిస్థితులు 13, 14 సూత్రములలో సూచింపబడినవి.

23. (శ్లో) నిర్ణయింపబడిన సంఖ్యగల సైన్యముతోగాని తనసైనికవిభవమునకు తగినట్టి సైన్యముతోగాని స్వయముగ (శత్రువు) కొలువులో హాజరగునట్లు చేసుకొనిన సంధికి "ఆత్మామిషసంధి" అనిపేరు.

24. (శ్లో) సేనాపతిగాని కుమారుడుగాని కొలువులోనికి వెళ్ళునట్లు చేసుకొనినసంధికి "పురుషాంతర సంధి" అనిపేరు. తానువెళ్ళవలసిన అవసరము లేని కారణమున ఆత్మరక్షణము సాధ్యమగుచున్నది.

25. (శ్లో) తానుగాని తనసైన్యముగాని ఒంటరిగ ప్రదేశాంతరమునకు వెళ్ళునట్లు చేసుకొనిన సంధికి "అదృష్టపురుష సంధి" అనిపేరు. ఇందు సేనాధిపతులకు తనకు రక్షణ కలుగుచున్నది.

26. (శ్లో) మొదటి రెండుసంధులలో ముఖ్యులమధ్య వివాహసంబంధమును కల్పించవలెను. ఆఖరుసంధికి ఫలితముగా శత్రువును రహస్యముగ చంపి వేయవలెను. ఇవి అన్నియు దండోపనత సంధులు.[5]

27–28 (శ్లో) కోశము నిచ్చి తక్కిన ప్రకృతులను విడుదలచేసుకొను సంధికి "పరిక్రయసంధి" అనిపేరు. కోశమంత ఒకేపర్యాయముగాక కొంచెము కొంచెముగ పెక్కువాయిదాలలో వీలునుబట్టి చెల్లించుట "ఉపగ్రహ" మని తెలుసుకొనవలెను. కప్పమును చెల్లించవలసిన దేశము కాలము నిర్ణయింపబడుట బలహీనుడగు రాజునకు ఉపగ్రహ మగుచున్నది.[6]

29. (శ్లో) చెల్లించవలసిన మొత్తము సుఖముగ భవిష్యత్తులో చెల్లించదగినది అగుటచేతను దీనితో వివాహసంబంధముకూడ కలిసియుండుటచేతను ఇది సహ్యామై "సువర్ణసంధి" యని చెప్పదగియున్నది. పరస్పర విశ్వాస మాధారమగుటచేత నిది ఐక్యభావమును కల్పించుచున్నది.

30. (శ్లో) "కపాల సంధి"[7] దీనికి విరుద్ధము. ఇందు అత్యధికమగు కోశము చెల్లించవలసియుండును. మొదటిరెండుసంధులలో నతడు కుప్యమునుగాని విషముతోకూడిన ఏనుగులను గుర్రములనుగాని ఇయ్యవలెను.

31. (శ్లో) మూడవదానియం దతడు మొత్తమునంతను చెల్లించవలెను. తనకార్యములు క్షీణించుచున్నవనుమిషతో నాలుగవదానియందు చెల్లించుటను

---

[5] దండోపనత సంధులనగా దండము, సైన్యము నిచ్చు షరతుపై చేసుకొను సంధులు. ఇవి మూడు విధములు.

[6] ఉపగ్రహమనగా పట్టుకొని నిలబడుటకు ఆధారము. చెల్లించవలసిన మొత్తమును వాయిదాలవారీగా చెల్లించుట ఇట్టి ఆధారమగుచున్నది. ఒకేపర్యాయము చెల్లించుటలో ఇట్టి ఆధారము లేదు.

[7] కపాలమనగా భిక్షాపాత్ర. కోశమునంతను చెల్లించవలసినవానిగతి భిక్షాటకుని గతివంటిది. అందుచేత ఇట్టిసంధికి కపాలసంధి అనిపేరు సార్థకము.

అలస్యము గావించవలెను. ఇవి కోశోపనత సంధులు.[8]

32. (శ్లో) భూమిలో కొంతభాగమునిచ్చి తక్కిన ప్రకృతులను రక్షించు కొనుసంధికి "ఆదిష్టసంధి" యనిపేరు. గూఢచారులమూలమునను చోరుల మూలమునను (శత్రువునకు) హానిని కలిగించగోరువా డిట్టిసంధిని చేసుకొన వలెను.

33. (శ్లో) సారద్రవ్యములనన్నిటిని తీసివేసి, మూలమును మినహా యించి తక్కినభూమిని ఇచ్చివేయ వలసినసంధికి "ఉచ్ఛిన్నసంధి" అని పేరు. శత్రువ్యసనమును కాంక్షించువా డిట్టి సంధిని చేసుకొనవలెను.

34. (శ్లో) ఫలితమునిచ్చి భూములను రక్షించుకొనుసంధికి "అవిక్రయ సంధి" అనిపేరు. ఫలితముతో భూములనిచ్చుకొనవలసిన సంధికి "పరిదూషణ సంధి"అనిపేరు.

35. (శ్లో) మొదటి రెండుసంధులవిషయమున కాలవిలంబనము గావించ వలెను. తర్వాతిరెండుసంధులవిషయమున ఫలితము తానే తీసుకొని బలహీనుని ప్రవర్తనము ననుసరించవలెను. ఇవి దేశోపనత సంధులు.[9]

36. (శ్లో) దేశకాలానుసారముగను తనకార్యముల కనుగుణముగను బలహీనుడు చేసుకొనదగిన ఈమూడురకముల సంధులు "హీనసంధులు,"[10] అని పేర్కొనబడుచున్నవి.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు సమహీనజ్యాయుల గుణాభినివే శము, హీనసంధులు అనే మూడోఅధ్యాయము.

[8] కోశమునిచ్చు షరతుపై చేసుకొనుసంధులు. ఇవి నాలుగురకములు.

[9] దేశమునిచ్చు షరతుపైన చేసుకొనుసంధులు. ఇవికూడ నాలుగురకములు.

[10] హీనుడు చేసుకొనవలసినసంధులు. ఇవిదండోపనతములు, కోశోపనతములు, దేశోపనతములు అని మూడురకములు. ఈభేదము లీప్రకరణమున వివరింపబడినవి.

# ఏడో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 103 : విగృహ్యాసనము
### ప్రకరణము 104 : సంధాయాసనము
### ప్రకరణము 105 : విగృహ్యయానము
### ప్రకరణము 106 : సంధాయయానము
### ప్రకరణము 107 : సంభూయప్రయాణము[1]

**1.** సంధివిగ్రహములకు సంబంధించిన ఆసనయానము లిచ్చట వివరింపబడును.

**2.** స్థానము, ఆసనము, ఉపేక్షణము—ఇవిఆసనమునకు పర్యాయపదములు. **3.** వాటిలోని భేదము : ఉండవలసిన గుణములలో[2] కొన్నిమాత్రమే ఉండుటస్థానము ; స్వవృద్ధికొరకైన యెడల ఆసనము ; ఉపాయములను ప్రయోగించకుండుట ఉపేక్షణము.

**4.** ఒకరికంటె నొకరు అధికులుగ నుండవలెనని వాంఛించు శత్రువులు విజిగీషులు ఒకరినొకరు నష్టపరుచుటకుశక్తి లేనివారైనప్పుడు విగృహ్యాసనమునుగాని సంధాయాసనమునుగాని అనుసరించవలెను.

**5.** లేదా, "నాసైన్యముతోగాని మిత్రునిసైన్యముతోగాని అటవికసైన్యముతోగాని సముని అధికుని నేను బలహీనపరుపగలను," అని అనుకొనినప్పుడు

[1] యుద్ధము తర్వాత ఆసనము, సంధితర్వాత ఆసనము, యుద్ధముతర్వాత యానము, సంధితర్వాత యానము. ఆనేకులు కలిసిన యానము—అను అయిదు విషయము లీయధ్యాయమందు వివరింపబడినవి.

[2] గుణము లనగా ప్రకృతిసంపదలు.

అతడు యుద్ధముగావించి, బాహ్యాభ్యంతరప్రదేశములందు అవసరములగు జాగ్రత్తలను తీసుకొని ఆసనము ననుసరించవలెను.

6. లేదా, "ఉత్సాహయుక్తులును ఐకమత్యముగలవారును అభివృద్ధి గాంచుచున్నవారునగు నాప్రకృతులు స్వకార్యములను నిరాటంకముగ సాగించుకొనగలవారుగను శత్రుకార్యములకు విఘాతము కలిగించువారుగను ఉన్నారు," అని తోచినపుడు యుద్ధముచేసి ఆసనము ననుసరించవలెను.

7. లేదా, "తిరుగుబాటుచేసినట్టియు, క్షీణించినట్టియు, లోభులైనట్టియు స్వసైన్యముచేతగాని చోరులచేతగాని ఆటవికులచేతగాని పీడింపబడినట్టియు శత్రుప్రజలు తమంతటతామైగాని (నాగూఢపురుషుల) ఉపజాపముచేతగాని నన్నుచేరగలరు; నాప్రజలు సంపన్నులై ఉన్నారు, శత్రుప్రజలు విపత్తులకు పాలై దుర్భిక్షముచే పీడింపబడినవారై నన్ను చేరెదరు; నాప్రజలు విపన్నులై ఉన్నారు; శత్రుప్రజలు సంపన్నులైఉన్నారు; కాని, నాప్రజలు శత్రుని చేర జాలరు. నేనతనితో యుద్ధముగావించి అతని ధాన్య పశు హిరణ్యములను దోచుకొనెదను; నాపణ్యములకు హానికలిగించుశత్రుపణ్యములకు ప్రవేశము లేకుండ జేసెదను; లేదా, శత్రువు యుద్ధములో మునిగియున్నప్పుడు అతని వణిక్పథముల నుండి సారములగుద్రవ్యములు నారాజ్యమునుచేరగలవు; నాద్రవ్యము లతనిరాజ్యమును చేరజాలవు; అతడు యుద్ధము చేయుచున్నప్పుడు వానిరాజ్యములోని దూష్యులను, శత్రువులను, ఆటవికులను నిగ్రహించలేకపోవును; లేదా, వారితో యుద్ధము చేయవలసినవాడగును; నాయందు విశ్వాసముగల నామిత్రునిపై దండెత్తి, ఎక్కువ క్షయవ్యయములను పొందక, అతిస్వల్పకాలములో ఎక్కువధనమును సంపాదించి, సారవంతమగు భూమిని సులభముగ ఆక్రమించగలడు; నన్ను కాదని, తనసైన్యమునంతను తరలించి నాపైపడుటకు సిద్ధముగనున్నాడు, ఎట్లైనను అతనినడ్డుకొనవలెను," అని అనుకొనినపుడు శత్రుయానము నడ్డగించుటకును తనప్రతాపమును రుజువుచేయుటకును యుద్ధముగావించి ఆసనము ననుసరించవలెను. 8. "వెనుకకు మరలినయెడల శత్రువు అతనిని కబళించవచ్చును," అనిఆచార్యులు. 9. "అట్టిభయము లేదు," అని కౌటిల్యుడు. 10. ఆపత్తులోలేని విజిగీషువును కొంత బలహీనపరుచుటకుమాత్రమే అతడు సమర్థుడగును. కాని అతనిశత్రువుయొక్క ఐశ్వర్యము మూలమున వృద్ధిగాంచినప్పుడు నిర్మూలించదగినవాడగును. 11. అత డీలాగు ప్రవర్తించినప్పుడు శత్రువునకు యాతవ్యుడైనవాడు అవినష్టుడై అతనికి సహాయముచేయును. 12. కావున అతడు సైన్యములను తరలించినవానిపై యుద్ధము గావించి ఆసనగుణము ననుసరించవలెను.

13. యుద్ధముచేసి ఆసనము ననుసరించదగిన పరిస్థితులు లోపించినపుడు సంధిచేసుకొని ఆసన మనుసరించవలెను.

14. యుద్ధానంతరము ఆసనము ననుసరించినతర్వాత తనశక్తులు వృద్ధి గాంచినపక్షమున అతడు యుద్ధముచేసి యానమును సాగించవలెను. శత్రువు సర్వసైన్యములను సన్నాహపరిచినపు డిట్లుచేయరాదు.

15. లేదా, "శత్రువు ఆపదలలో చిక్కుకొని యున్నాడు; అతని ప్రకృతులలో నొకదానికి సంభవించిన ఆపదలు తక్కినప్రకృతులు తొలగించ లేనిస్థితిలోనున్నవి; అతనిప్రజలు స్వసైన్యములచే పీడితులై విరక్తులుగను కృశించినవారుగను నిరుత్సాహులుగను పరస్పరము ద్వేషించుకొనువారుగను ఉన్నారు; అందుచేత వారిని లోభపరుచుట సులభసాధ్యము. అగ్ని, ఉదకము, వ్యాధి, మరకము, దుర్భిక్షము మొదలగునవి కారణముగ శత్రువుయొక్క దుక్కిపశువులు, ప్రజలు, కోష్ఠాగారములు, దుర్గములు క్షీణించియున్నవి," అనితోచినపుడు విగ్రహించి యానము ననుసరించవలెను.

16. లేదా, "నామిత్రుడు, నాఆక్రందుడు, శూరులు ఐశ్వర్యవంతులు అనురక్తులు అగు ప్రజలను కలవారుగ నున్నారు; నాశత్రువు, పార్ష్ణిగ్రాహి, ఆసారులు దీనికి విరుద్ధమగుప్రజలు కలవారుగనున్నారు; కావున, ఆసారునికి నామిత్రునితోను, పార్ష్ణిగ్రాహికి నాఆక్రందునితోను యుద్ధమునుకల్పించి యానముచేయుట నాకు సాధ్యమగును," అని తోచినపుడు విగ్రహించి యానము ననుసరించవలెను.

17. లేదా, ఒకడే స్వల్పకాలమందు ఫలమునుపొందగలడని తోచినపుడు తాను పార్ష్ణిగ్రాహ్యాసారులతో యుద్ధముచేసి యానము నుపక్రమించవలెను.

18. పరిస్థితులు దీనికి విరుద్ధమగునప్పుడు సంధిచేసుకొని యానము నుపక్రమించవలెను.

19. "నేనుఒంటిరిగ యానముచేయుట సాధ్యముకాకున్నను యానము చేయుట అవసరము" అని అనుకొనినప్పుడు సములు, హీనులు, అధికులుఅగు సామవాయికులతో కలిసి, యానము ఒక ప్రదేశమున కగునప్పుడు వారికిచెందవలసిన భాగమును నిర్ణయించుకొనియు, అనేక ప్రదేశముల కగునపుడు భాగమును నిర్ణయించకయు యానము చేయవలెను. 20. వారందరు కలిసిరానప్పుడువారిలో నొకరికి నిర్ణీతమగుభాగము నిచ్చునట్లు చెప్పి, వానినుండి సైనిక సహాయమునుకోరవలెను. 21. లేదా, లాభము తప్పకవచ్చునప్పుడు భాగమును నిర్ణయించియు, లాభము సందిగ్ధముగనున్నప్పుడు ఏదియోయొక భాగమునిచ్చునట్లుగను అంగీకరించి అందరుకలిసి యానముచేయు షరతుపై వేతనమిచ్చి సైన్యములను సమకూర్చుకొనవలెను.

22. (శ్లో) దండసమమగు భాగము మొదటిరకములోనిది; ప్రయాసకు

సమమగుభాగము ఉత్తమము ; లేదా, ఎవరికి చిక్కినది వారు ఉంచుకొనవచ్చును ; లేదా, పెట్టుబడికి తగినట్లు పంపకము చేసుకొనవచ్చును.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు విగృహ్యాసనము, సంధాయాసనము, విగృహ్యాయానము, సంధాయయానము, సంభూయప్రయాణము అనే నాలుగో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 108 : యాతవ్యా మిత్రుల యభిగ్రహము

### ప్రకరణము 109 : ప్రకృతుల క్షయ లోభ విరాగ హేతువులు

### ప్రకరణము 110 : సామవాయిక విపరిమర్శము

1. పొరుగురాజులిద్దరు సమానములగు నాపదలలో నున్నప్పుడు యాతవ్యుని[1] పైకి వెళ్ళవలెనా, లేక, శత్రువుపైకి వెళ్ళవలెనా ?—అట్టి సందర్భములో మొదట శత్రువుపైకి వెళ్ళి, అతనిని జయించినతర్వాత యాతవ్యునిపైకి వెళ్ళవలెను. 2. ఏలయన, శత్రువును జయించుటలో యాతవ్యుడు సహాయముచేయవచ్చును; యాతవ్యుని జయించుటలో శత్రువు సహాయము చేయజాలడు.

3. గొప్పఆపదలో చిక్కుకొనిన యాతవ్యునిపైకి వెళ్ళవలెనా, లేక, అల్పమగు నాపదలో చిక్కుకొనిన శత్రువుపైకి వెళ్ళవలెనా ? సులభముగ జయించవచ్చును గనుక గొప్పఆపదలో చిక్కుకొనినవానిపైకే వెళ్ళవలెనని ఆచార్యులు. 4. "కూడదు" అని కౌటిల్యుడు. 5. అల్పమగు ఆపదలోనున్న శత్రువుపైకి వెళ్ళవలెను. 6. అల్పమగు ఆపదకూడ సభియుక్తుడైనప్పుడు గొప్పదికావచ్చును. 7. గొప్పఆపదకూడ మరింతగొప్పది యగుటకూడ నిజమే 8. కాని, అల్పమగు ఆపదలోనుండు శత్రువుపైకి వెళ్ళని పక్షమున నతడు దానిని సులభముగ తొలగించుకొని యాతవ్యునికి సహాయముచేయు ప్రమాదముగాని వెనుకనుండి పైనబడు ప్రమాదముగాని సంభవించును.

---

[1] యాతవ్యుడనగా సులభముగ జయించి వశపరుచుకొనదగినవాడు. ఆతడు శత్రువుకావచ్చును, మిత్రుడుకావచ్చును, తటస్థుడు కావచ్చును. శత్రువనగా సహజశత్రువు. వాడెన్నటికి మిత్రుడు కాజాలడు. అందుచేత శత్రువును జయించుట ప్రథమకర్తవ్యమని కౌటిల్యుని అభిప్రాయము. ప్రకరణమందంతట దీనికి ప్రాధాన్యము కల్పించబడినది.

9. ఏకకాలమందు యాతవ్య లనేకులున్నప్పుడు గొప్పఆపదలోనున్నను న్యాయముగప్రవర్తించువానిపైకివెళ్ళవలెనా, లేక, అల్పమగునాపదలో నున్నను, అన్యాయముగ ప్రవర్తించువానిపైకిగాని విరక్తులగు ప్రజలుగలవానిపైకిగాని వెళ్ళవలెనా? 10. గొప్పఆపదలోనున్నను న్యాయముగ ప్రవర్తించువానిపైకి వెళ్ళినప్పుడు ప్రజలతనికి సహాయముచేయుదురు; అన్యాయముగ ప్రవర్తించువా డల్పమగు నాపదలోనున్నప్పుడు ప్రజ లుపేక్షించెదరు; విరక్తులగు ప్రజలు బలవంతుడగు రాజునుకూడ పెకలించి వేయుదురు. 11. కావున, అతడు విరక్తులగు ప్రజ లున్నవానిపైకే వెళ్ళవలెను.

12. క్షీణులు,[2] లుబ్ధులు[3] అగు ప్రజలున్నవానిపైకి వెళ్ళవలెనా, లేక, తిరుగుబాటుచేయు స్వభావముకల ప్రజలున్నవానిపైకి వెళ్ళవలెనా? "క్షీణులు, లుబ్ధులు అగుప్రజలున్నవానిపైకే వెళ్ళవలెను; ఏలయన, ఇట్టిప్రజల నుపజాపముచే లోబరుచుకొనుటయు పీడించుటయు సులభము; తిరుగుబాటుచేయువారి విషయమున ఇట్టిది సులభము కాదు. వారినాయకుల నణచినయెడల వారుకూడ లోబడిపోయెదరు" అని ఆచార్యులు. 13. "ఇట్లు చేయరాదు" అని కౌటిల్యుడు. 14. ఏలయన, క్షీణులు, లుబ్ధులు అగు ప్రజలు తమ ప్రభువునెడల అనురాగము కలవారై అతనిహితమునే కోరెదరు; ఉపజాపమునకు లోబడరు. ఎచ్చట అనురాగముండునో అచ్చట అన్నిగుణములు ఉండగలవు. 15. కావున, తిరుగుబాటు చేయు స్వభావముగల ప్రజలున్నవానిపై కే వెళ్ళవలెను.

16. అన్యాయముగ ప్రవర్తించు బలవంతునిపైకి వెళ్ళవలెనా, న్యాయముగ ప్రవర్తించు దుర్బలునిపైకి వెళ్ళవలెనా? అన్యాయముగ ప్రవర్తించు బలవంతునిపైకి వెళ్ళవలెను. 17. అట్టివానిపైకి వెళ్ళినప్పుడు ప్రజలతనికి సహాయము చేయరు; అతనిని తరిమివేయుదురు; లేదా, అతనిశత్రువుల నాశ్రయించెదరు. 18. న్యాయముగ ప్రవర్తించు దుర్బలుని ప్రజ లిట్లుగాక, అభియుక్తుడైనప్పు డతనికి సర్వవిధముల సహాయముచేసెదరు; అతడు పారిపోవలసిన పక్షమున నతనిని వెంబడించెదరు.

19–26 (శ్లో) మంచివారిని విడనాడుట, దుష్టులను పరిగ్రహించుట, ఇదివరలో లేని ధర్మవిరుద్ధములగు హింసలను ప్రవేశపెట్టుట, ఉచితములును ధర్మసహితములును అనేకతరములనుండి వచ్చుచున్న ఆచారములను నివర్తించుట, అధర్మములందాసక్తి వహించుట, ధర్మమును విడనాడుట, చేయరానికార్యములు చేయుట, చేయవలసినవాటిని చేయకుండుట, ఇయ్యవలసినదానిని ఇయ్యకుండుట, ఇయ్యకూడనిదాని నిచ్చుట, దండించవలసినవారిని దండించకపోవుట, దండించ

---

[2] క్షీణు లనగా దారిద్ర్యబాధ ననుభవించుచుండువారు.

[3] లుబ్ధు లనగా దురాశాపరులు. ఎంతటి ధనమున్నను తృప్తి లేనివారు.

కూడనివారిని దండించుట, పట్టుకొనతగనివారిని పట్టుకొనుట, పట్టుకొనవలసిన వారిని పట్టుకొనకపోవుట, అనర్థములగు కార్యములనుచేయుట, అర్థవంతము లగువాటిని మానుట, చోరులప్రమాదమునుండి రక్షించకుండుట, తానే ప్రజలను దోచుట, పురుషకారములకు విఘాతముకలిగించుట, కార్యములలోని సుగుణము లకు లోపముకలిగించుట, ప్రధానపురుషులకు హానిచేయుట, గౌరవించవలసిన వారి నవమానించుట, వృద్ధులతో విరోధించుట, పక్షపాతముచూపుట, అసత్యమాడుట, (ఇతరులు) చేసినదానికి ప్రతీకారము చేయకుండుట, ఒప్పుకొనిన పనులను చేయకపోవుట, రాజుయొక్క ప్రమాదాలస్యములవలన యోగక్షేమములకు హాని కలిగించుట—వీటి అన్నిటిమూలమున ప్రజలలో క్షయము, లోభము, విరోధము కలుగుచున్నవి.

27. (అర్థ) క్షయమునకు లోబడిన ప్రజలు లోభులగుచున్నారు. లోభ త్వమువలన విరాగమును పొందుచున్నారు. విరక్తులైన ప్రజలు శత్రువును చేరె దరు ; లేదా, తామే తమ ప్రభువును చంపివేయుదురు.

28. కావున, ప్రజలక్షయమునకును లోభమునకును విరోధమునకును గల కారణములను తలయెత్తకుండ జేయవలెను ; తలయెత్తిన పక్షమున వెంటనే వాటికి ప్రతిక్రియలు చేయవలెను.[4]

29. అర్థక్షయముగాంచిన ప్రజలు, లోభులగు ప్రజలు, విరక్తులగుప్రజలు —వీరిలో ఎవరిమూలమున ఎక్కువప్రమాదము సంభవించును ? 30. క్షయము గాంచిన ప్రజలు పీడనభయముచేతను, లేదా, ఉచ్ఛేదనభయముచేతను వెంటనే సంధి జరుగవలెననికాని, యుద్ధము జరుగవలెననికాని, పారిపోవలెననికాని కోరెదరు.

31. లోభులు (దురాశాపరులు) లోభముచేతృప్తిపొందనివారై శత్రువు యొక్క కుట్రలకు సులభముగ వశులగుదురు. 32. విరక్తులు శత్రువు దండెత్తివచ్చినప్పుడు తిరుగుబాటు చేసెదరు.

33. వాటిలో హిరణ్యక్షయము, ధాన్యక్షయము, సర్వక్షయమునకు దారితీ యును; వాటికిప్రతిక్రియలులేవు. కాని కాడిపశువులకు మనుష్యులకు కలుగు క్షయము నకు హిరణ్యముచేతను ధాన్యముచేతను ప్రతీకారము చేయవచ్చును. 34. లోభము కొందరిని మాత్రమే పీడించున దగుటచేతను ముఖ్యపురుషులకు మాత్రమే పరిమిత మగుటచేతను శత్రువుల ద్రవ్యములను దోపిడి చేయుటద్వారాగాని మరియొకవిధమునగాని తొలగింపవచ్చును. 35. ప్రధాన పురుషుల నణచివేయుట

[4] 19-28 సూత్రములలో దుష్టపరిపాలన లక్షణములు, దానివలన కలుగు ఫలితములు వివరింపబడినవి. విజయమును సాధింపదలచిన ప్రభువు తన ప్రజలను తృప్తి పరచి వారి యభిమానమును ప్రప్రథమమున సంపాదించవలెను. ప్రజల సహకారము లేక ప్రభుత్వము సాధ్యము కాదనువిషయమిందు స్పష్టమగుచున్నది.

మూలమున విరాగమును తొలగించవచ్చును. 36. ఏలయన, నాయకులులేని ప్రజలను పాలించుట సులభము,[5] అట్టి ప్రజలు ఇతరుల కుట్రలకు లోబడజాలరు; కాని కష్టములను సహించలేరు. 37. ప్రజానాయకులకు అభిమానము చూపి వారిలో విభేదములను కల్పించవచ్చును; అప్పుడు వారు కష్టములను సహించువారై రక్షింపబడెదరు.

38. సామవాయికుల విషయములోగూడ (విజిగీషువగు రాజు) సంధి విగ్రహకారణములను చక్కగ ఆలోచించినతర్వాతనే శక్తియు శౌచమును గలవారితో కలిసి యానముచేయవలెను. 39. ఏలయన, శక్తిమంతుడగురాజు పార్ష్ణిగ్రాహిగ గాని యాత్రయందు సహాయముచేయువాడుగగాని ఉపయోగించును; శుచియగువాడు మంచికాలమందును చెడుకాలమందును ఒప్పుకొనినదాని ప్రకారము ప్రవర్తించును.

40. వారిలో అధికుడగు నొకనితోనా, లేక, సములగునిద్దరితోనా యానము చేయుట అనువిషయములో సములగు నిద్దరితో యానము చేయుట శ్రేయస్కరము. 41. అధికునితో కలసి యానముచేయునపుడు అతనికి లోబడవలసిన ప్రమాదము కలదు; ఇద్దరు సములతో యానముచేయునప్పుడు వారిని లోబరుచుకొనుట కవకాశముకలదు. 42. ఏలయన, సములమధ్య భేదము కల్పించవచ్చును; వారిలో నొకడు మోసగించినయెడల రెండవవానితో కలిసి తామిద్దరు వానిని అదుపులో పెట్టవచ్చును; లేదా, బేదోపాయముచే నతనిని పట్టి బంధించవచ్చును.

43. సముడగునొకనితోనా, హీనులగునిద్దరితోనా యానముచేయుట అను విషయములో హీనులగు నిద్దరితో కలిసి యానముచేయుట శ్రేయస్కరము. 44. ఏలయన, వారు రెండుకార్యములను సాధించువారుగను వశ్యులుగను నుండెదరు.

45. కాని, కార్యము సిద్ధించినప్పుడు:

(శ్లో) అధికుడు శుచికానిపక్షమున అతని యుద్దేశము నెరవేరినవెంటనే ఏదో ఒకసాకుచెప్పి రహస్యముగ నతనివద్దనుండి వెళ్ళిపోవలెను; శుచిఅయినపక్షమున నతడు పంపించివేయువరకు నిరీక్షించి యుండవలెను.

46. (శ్లో) రహస్యప్రమాదము సంభవించునని తోచినయెడల అంతఃపురస్త్రీలను మొదట పంపివేసి, తాను తర్వాత వెళ్ళిపోవలెను; ఏలయన, కృతార్థుడగు సముని మూలమునకూడ నమ్మకముగలవానికి ప్రమాదము సంభవించవచ్చును.

---

[5] ప్రజలను మంచి మార్గములో గాని చెడుమార్గములో గాని పెట్టువారు నాయకులు. నాయకులను వశపరచుకొనినయెడల ప్రజలు వశులగుదురు. నాయకులలో విభేదము కల్పించినయెడల ప్రజలలో విభేదములు పుట్టును, ఇది అన్ని కాలములలో కనుపించు సత్యము.

47. (శ్లో) కృతార్థుడగు సముడుకూడ అధికుడగుచున్నాడు. (అట్లు) అధికుడైనవానిని నమ్ముట మంచిది కాదు. ఐశ్వర్యము చిత్తవికారకారికదా !

48. (శ్లో) అధికునినుండి అల్పాంశము లభించినను అంశము లభించక పోయినను తృప్తిపొందిన ముఖముతో వెళ్ళిపోవలెను ; (అటుతర్వాత) శక్తి వృద్ధిగాంచినప్పు డతనిని కొట్టి రెండింతలు హరించవలెను.

49. (శ్లో) నేతయగువాడు కృతార్థుడైన తర్వాత సామవాయికుల నందరిని పంపివేయవలెను ; అవసరమైనయెడల తాను నష్టపడవలెనుగాని వారికి నష్టము కలిగించరాదు ; అప్పుడతడు మండలాభిమానమును సంపాదించును.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు యాతవ్యామిత్రుల యభిగ్రహము. ప్రకృతుల క్షయ లోభ విరాగ హేతువులు, సామవాయిక విపరిమర్శము అనే అయిదో అధ్యాయము

ఏడో అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 111 : సంహిత ప్రయాణికము[1]

### ప్రకరణము 112 : పరిపణితాపరిపణితాపసృత సంధులు[2]

1. (మండలములోని) రెండవప్రకృతిని (పొరుగుదేశమును పాలించు ప్రకృతిశత్రువును) విజిగీషునిట్లు మోసగించవలెను. 2. "నీవిటువైపు దండెత్తి వెళ్లుము; నేనటువైపు దండెత్తి వెళ్ళెదను. లాభమును సమానముగ పంచుకొందము," అని ఒప్పందము చేసుకొని అతనిని దండయాత్రకు వెళ్ళునట్లు పురికొల్పవలెను. 3. లాభము సమానమైనప్పుడు సంధి చేసుకొనవలెను; సమముకానప్పుడు యుద్ధమున కుపక్రమించవలెను.

4. సంధి పరిపణితముగను (షరతులతో కూడినట్టిదిగను) అపరిపణితముగను (షరతులు లేనట్టిదిగను) ఉండవచ్చును. 5. "నీ వాదేశముపై దండెత్తివెళ్ళుము; నే నీదేశముపై దండెత్తివెళ్ళెదను," అనిచేసుకొనినసంధి దేశపరిపణితము. 6. "నీ వింతకాలము దండయాత్రను సాగించుము; నే నింత కాలము సాగించెదను," అనిచేసుకొనినసంధి కాలపరిపణితము. 7. "నీవింత కార్యము సాధించుము; నే నింతకార్యము సాధించెదను," అని చేసుకొనిన సంధి అర్థపరిపణితము.

8. "శత్రువుదండెత్తు దేశము పర్వతదుర్గమునో వనదుర్గమునో నదీదుర్గమునో కలిగినట్టిది; అడవులచే వేరుచేయబడినట్టిది; ధాన్యములుగాని మనుష్యులుగాని మిత్రసైన్యములుగాని ప్రవేశించుట సాధ్యముకానట్టిది; పశుగ్రాసము,

---

[1] సంధిచేసుకొనిన రాజు లిద్దరుకలసి దండయాత్రచేయుట.

[2] సంధులు మూడువిధములు: షరతులతో కూడినవి, షరతులు లేనట్టివి, ఆపసృతులతో (విడిచివెళ్లి పోయి తిరిగివచ్చినవారితో—గతాగతికులతో) చేసుకొనునట్టివి.

కట్టెలు, నీళ్ళులేనట్టిది ; అవిజ్ఞాతమైనట్టిది ; దూరమైనట్టిది ; శత్రువుపై విరోధము వహించిన ప్రజలతో కూడినట్టిది ; సైన్యములు ధారాళముగ సంచరించుటకు తగిన ప్రదేశములు లేనట్టిది ; నేను దండెత్తుప్రదేశము దీనికంతకు విరుద్ధమైనట్టిది," అనితోచినపరిస్థితిలో దేశపరిపణితమగు సంధిని చేసుకొనవలెను.

9. "శత్రువు దండయాత్రను సాగించుకాలము అత్యధికమగు వర్షము తోనో ఉష్ణముతోనో చలితోనో కూడినట్టిది ; అధికమగు రోగములకు కారణ మైనట్టిది ; ఆహారము, వాడకమునకు కావలసిన ఇతరవస్తుసామగ్రి దొరక నట్టిది ; సైనికచర్యల కాటంకము కలిగించునట్టిది ; కార్యములను సాధించుట కెక్కువతక్కువలతోకూడి అనర్థమైనట్టిది ; నేను దండయాత్రను సాగించు కాలము దీనికంతకువిరుద్ధమైనట్టిది," అని తోచిన పరిస్థితిలో కాలపరిపణిత సంధిని చేసుకొనవలెను.

10. "దండయాత్రమూలమున శత్రువుసాధించదలచిన ప్రయోజనము (అతనినుండి) తొలగించుటకు సాధ్యమైనట్టిది ; శత్రుప్రజలకు కోపకారణ మైనట్టిది ; ఎక్కువకాలముపట్టునట్టిది ; అధికక్షయ వ్యయములకు కారణమైనట్టిది ; అల్పమైనట్టిది ; భవిష్యత్తులో ననర్థములదెచ్చునట్టిది ; అశుభమైనట్టిది ; అధర్మ మైనట్టిది ; మధ్య మోదాసీనులు విరోధించునట్టిది ; తనమిత్రునికి నష్టముకలిగించు నట్టిది ; నేను సాధించదలచిన ప్రయోజనము దీనికంతకు విరుద్ధమైనట్టిది," అని తోచినపరిస్థితిలో అర్థపరిపణిత సంధిని చేసుకొనవలెను.

11. ఈవిధముగ దేశకాలములను, కాలకార్యములను, దేశకార్యములను నిశ్చయించుకొనుటమూలమున పరిపణిత సంధులు ఏడువిధములగుచున్నవి.

12. ఇట్టిసంధిలో మున్ముందుగనే తనకార్యములను ప్రారంభించి సాధించుకొని శత్రుకార్యములకు విఘాతము కలిగించవలెను.

13. వ్యసనియు తొందరపడునట్టియు అవమానించదగినట్టియు అజ్ఞాని అయినట్టియు శత్రువును మోసగించదలచినపుడు దేశమునుగాని కాలమునుగాని కార్యమునుగాని నిర్ణయించక, "మనమిద్దరము సంధి చేసుకొంటిమి," అనిచెప్పి అతని విశ్వాసమును సంపాదించి, అతని లోపములను తెలుసుకొని, అతనిపై పడవలెను ; ఇట్టి సంధి అపరిపణిత సంధి.

14. ఈసందర్భములో ఇట్లు జరుగును :

15. వివేకముగల విజిగీషువు ఒక సామంతుని (పొరుగువానిని) మరియొక సామంతునితో యుద్ధముచేయునట్లు పురికొల్పి, వారిలో నొక పక్షమువారి నన్ని వైపులనుండి తరిమికొట్టి అతని దేశమును అపహరించవలెను.

16. సంధులవిషయము : క్రొత్తగ సంధినిచేసుకొనుట, చేసుకొనినసంధికి మరింత కట్టుపడియుండుట, చేసుకొనినసంధిని ఉల్లంఘించుట, ఉల్లంఘించిన

దానిని పునరుద్ధరించుట. 17. యుద్ధములు : ప్రకాశయుద్ధము, కూటయుద్ధము, మూకయుద్ధము అనిమూడువిధములు. 18. ఇది సంధి విక్రమములకు సంబంధించిన విషయము.

19. సామాద్యుపాయములదృష్టితోడను, వాటిఫలితముల దృష్టితోడను క్రొత్తగ చేసుకొనదలచిన సంధిని పరీక్షించి, వారిబలమునుబట్టి సమహీనాధికులను నిర్ణయించుటయే క్రొత్తగ సంధిని చేసుకొనుటలో గుర్తించవలసిన విషయములు.

20. ఉభయుల ప్రియమును హితమును గుర్తించి చేసుకొనిన సంధిలోని షరతులను పాలించుటయు, ఒకరినుండి యొకరు వేరుపడకుండునట్లు వాటిని రక్షించుటయు—ఇది చేసుకొనినసంధికి కట్టుబడియుండుట.

21. దూష్యులద్వారా శత్రువును మోసగించి, అతనితో చేసుకొనిన సంధి షరతుల ననుసరించవలసిన అగత్యములేదని రుజువుచేసి దాని నుల్లంఘించ వచ్చును : ఇది సంధిని ఉల్లంఘించుట.

22. తప్పుచేసి విడిపోయిన భృత్యునితోగాని, మిత్రునితోగాని రాజీపడుట ఉల్లంఘించిన సంధిని పునరుద్ధరించుట. 23. విడిపోయి తిరిగివచ్చి చేరువారు నాలుగు రకములు : కారణముండి విడిపోయి కారణముండి తిరిగివచ్చినవారు ; దీనికి విరుద్ధముగ ప్రవర్తించినవారు ; కారణముండి విడిపోయి అకారణముగా తిరిగి వచ్చినవారు ; దీనికి విరుద్ధముగా ప్రవర్తించినవారు.

24. రాజులోని దోషమువలన విడిపోయి అతనిలోని సుగుణమువలన తిరిగివచ్చినవాడు ; లేదా, శత్రువులోని సుగుణమువలన విడిపోయి అతనిలోని దోషమువలన తిరిగివచ్చినవాడు—ఇట్టివాడు కారణముండి విడిపోయి కారణముండి తిరిగివచ్చినవాడు : ఇట్టివాడు సంధిచేసుకొనుటకు తగినవాడు.

25. ఉభయుల గుణములను గుర్తించక స్వదోషమువలన విడిపోయి స్వదోషమువలన తిరిగివచ్చినవాడు ; అకారణముగ విడిపోయి అకారణముగ తిరిగి వచ్చినవాడు : ఇట్టివారు చపలచిత్తులగుటచేత సంధి చేసుకొనుటకు తగనివారు.

26. రాజులోని దోషమువలన విడిపోయి తనలోని దోషముకారణముగ శత్రువును వదలి తిరిగివచ్చినవాడు; కారణముండి విడిపోయి అకారణముగతిరిగి వచ్చినవాడు : ఇట్టివాని విషయములో, "శత్రువు పురికొల్పుటవలనగాని లేక తనలోని దోషమువలనగాని నాకు హానిచేయదలచివచ్చెనా ? లేదా, నాశత్రువు తన శత్రువులను పెల్లగించువాడనితెలిసి ప్రతీకారభయమువలన తిరిగివచ్చెనా ? నన్ను పెల్లగించుటకు ప్రయత్నించు శత్రువునువిడిచి నాయెడల కరుణగలవాడై తిరిగి వచ్చెనా ?" అని ఆలోచించవలెను. 27. ఆలోచించి తెలుసుకొనినతర్వాత సదుద్దేశము కలవానిని గౌరవించవలెను ; దురుద్దేశముకలవానిని దూరమందుంచవలెను.

28. తనలోని దోషమువలన విడిపోయి శత్రువులోని దోషమువలన తిరిగివచ్చినవాడు ; అకారణముగ విడిపోయి కారణముండి తిరిగివచ్చినవాడు : ఇట్టి వానివిషయములో, "నాలోని దోషము నితడు పూరించగలడా ? ఇత డిచట నివాసము చేయుట ఉచితమా ? ఇతని జనము శత్రువువద్ద నివసించుటకు కోరుట లేదా ? ఇతడు నామిత్రులతో కలిసియున్నాడా ? నాశత్రువులతో విగ్రహించువాడా ? లుబ్ధుడును క్రూరుడును అగు శత్రువును చూసి భయపడినవాడా ? లేక, వాని శత్రువునితో కలిసినవానిని చూసి భయపడినవాడా ?" అని ఆలోచించవలెను. 29. ఆలోచించి తెలుసుకొనినతర్వాత నతనియుద్దేశముల ననుసరించి అతనిని చేరదీయవలెను.

30. (రాజు తాను) చేసిన కార్యములకు విఘాతము కలిగించుట, తన శక్తిని కోల్పోవుట, విద్యను పణ్యముగ నుపయోగించుట, నిరాశుడగుట, దేశాటనమందు కాలమును దుర్వినియోగించుట, ఇతరులను విశ్వసించనివాడగుట, బలవంతునితో విరోధముపెట్టుకొనుట—రాజునుపరిత్యజించుట కివి కారణములు," అని ఆచార్యులు. 31. భయము, నిరుద్యోగము, కోపము కారణములని కౌటిల్యుడు.

32. వీరిలో తన కపకారము చేసినవానిని త్యజించవలెను ; శత్రువున కపకారముచేసినవానితో సంధిచేసుకొనవలెను ; ఉభయుల కపకారము చేసినవారిని గురించి పైనచెప్పిన ట్లాలోచించవలెను.

33. సంధి చేసుకొనదగనివానితో సంధి చేసుకొనుట తప్పనప్పుడు ఎందులో నతనికి బలముగలదో దానినిగురించి జాగ్రత్తపడవలెను.

34. (శ్లో) ఉల్లంఘించిన సంధిని పునరుద్ధరించుటలో శత్రుపక్షమునకు చెందినట్టియు, తన కపకారముచేసి తిరిగివచ్చినట్టియు, వానిని జీవితాంతమువరకు దూరమందుంచవలెను.

35. (శ్లో) లేదా, అతని సతనిస్వామిపై యుద్ధముచేయునట్లు పురికొల్పవలెను ; అతనివలన కలుగు ప్రమాదము లన్నిటికి ప్రతీకారముచేసుకొని, శత్రువుపైగాని ఆటవికునిపైగాని పంపవలసిన సైన్యమునకు నాయకునిగా చేయవలెను ; లేదా , పొలిమేరలో నొకవైపునకు పంపవలెను.

36. (శ్లో) (తనయందుభక్తి విషయమై) సంశయించతగినవానిని పణ్యముగ శత్రువునకు విక్రయించవలెను ; లేదా, శత్రువుతో సంధిచేసుకొనవలసివచ్చినప్పుడు సంశయింపరానివానినికూడ సంశయించతగినవానికి బదులుగగాని, వానితోకలిసిగాని అపరాధము చేసినవాడను మిషతో పణ్యముగ విక్రయించవలెను[3].

[3] 35-41 సూత్రములు గతాగతికులకు (విడిచివెళ్లిపోయి తిరిగివచ్చినవారికి) సంబంధించినవి. వారిని సంశయించవలసియుండును. ఒకరిద్దరు సంశయించ తగనివారుగ నుండవచ్చును.

37. (శ్లో) లేదా, భవిష్యత్తును దృష్టిలోనుంచుకొని గతాగతికుని రహస్యముగ చంపి వేయవలెను ; లేదా, అతడు భవిష్యత్తులో తన్ను చంపకోరుచున్నాడని (బహిరంగముగ) చంపివేయవలెను.

38. (శ్లో) శత్రుసహవాసదోషముచేత శత్రువునుండి తిరిగివచ్చినవాడు సర్వదా దోషియే ; సర్పముతోడి సహవాసలక్షణ మతనియందుండుటచేత నతడెల్లప్పుడు ఉద్వేగమునకు స్థానమగుచున్నాడు.

39. (శ్లో) అత్తిపండ్లవిత్తనము లాహారముగాగల పావురాయి బూరుగు చెట్టునకు ప్రమాదము కలిగించునట్లు అత డెల్లప్పుడు భయమును కలిగించుటయే గాక భవిష్యత్తులో అపాయ హేతువు కూడ నగుచున్నాడు.

40–41. నిర్దిష్ట దేశకాలములందు చేయుయుద్ధము ప్రకాశ యుద్ధము ; భయమును కలిగించుట, అకస్మాత్తుగ పైబడుట, ప్రమాదముగాని అపదగాని సంభవించినప్పుడు పైబడి కొట్టుట, ఒకచోట వదలినట్లు కనిపించి మరియొక చోట (సైన్యములతో) తాకుట—ఇవి కూటయుద్ధ మాతృకలు. రహస్యక్రియలు, గూఢపురుషులద్వారా పురికొల్పుట మొదలైనవి మూకయుద్ధ లక్షణములు.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు సంహితప్రయాణికము, పరిపణితాపరిపణితాపసృత సంధులు అనే ఆరో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 113 : ద్వైధీభావికములగు సంధి విగ్రహములు

**1.** విజిగీషువు రెండవప్రకృతిని (పొరుగుదేశమును పాలించు ప్రకృతి శత్రువును) ఈక్రింది సందర్భములో, కలిసిపనిచేయు మిత్రునిగ స్వీకరించ వలెను. **2.** (ఇట్లయినపక్షమున) "అతడు వెనుకవైపునుండి నన్నుకొట్టడు ; నాపార్ష్ణిగ్రాహిని వారించును ; నేను దండయాత్రచేయు రాజునకు సహాయముచేయ జాలడు ; నాకు రెండింతల సైనికబలము లభించును ; ఇతడు నాకుకావలసిన సామగ్రిని సాహాయ్యక సైన్యమును సమకూర్చును ; శత్రువునకిట్టివి చేరకుండ నివారించును ; అనేక ప్రమాదములతోకూడిన నామార్గమందుండు కంటకములను పెల్లగించి వేయును ; దుర్గములకును అడవులకును పారిపోవు శత్రువును తన సైన్యముతో నెదుర్కొనును ; నేను దండయాత్ర చేయురాజును ప్రమాదస్థితిలో పెట్టును లేదా సంధికి వచ్చునట్లు చేయును. లాభములో తనకుచెందవలసిన అంశమును స్వీకరించి నా ఇతర శత్రువులలో నమ్మకముకలిగించును," అని అనుకొనినపుడు పొరుగురాజ్యమందుండు సామంతునొకనితో కలిసి రెండవ సామంతునిపైదండయాత్ర చేయవలెను.

**3.** లేదా, ద్వైధీభావము నాశ్రయించి, సామంతులలో నొకనినుండి కోశమునిచ్చి సైన్యమునుగాని, సైన్యమునిచ్చి కోశమునుగాని, సంపాదించుటకు ప్రయత్నించవలెను. **4.** వారిలో అధికునినుండి అధికాంశమునకు బదులుగను సమునినుండి సమమగునంశమునకు బదులుగను, హీనునినుండి హీనాంశమునకు బదులుగను చేసుకొనినసంధి సమసంధి. **5.** దీనికి విరుద్ధమగునట్టిది విషమ సంధి. **6.** ఈరెంటిలో నత్యధికలాభమును సంపాదించుట అతిసంధి.[1]

[1] సంధులు, సమసంధులు, విషమసంధులు, అతిసంధులు అని మూడువిధములు. అధికునికి

*(footnote contd. in the next page)*

7. వ్యసనియు, ఆపదలో నున్నట్టియు, అనర్థముల నెదుర్కొనినట్టియు హీనుడు సైనికబలమునకు సమమగు అంశమునిచ్చునట్లు అధికునితో సంధిచేసు కొనవచ్చును. 8. సంధి కంగీకరించిన అధికుడు అపకారసమర్థుడైనయెడల నతనితో యుద్ధము చేయవలెను ; అట్లు కానప్పుడు సంధి చేసుకొనవలెను.

9. తగ్గిపోయిన తనశక్తి ప్రతాపములను పూరించుకొనుటకుగాని, సాధించు టకు తగిన ప్రయోజనమును సాధించుటకు వెళ్ళునప్పుడు తనమూలస్థానమును వెనుక భాగమును రక్షించుకొనుటకుగాని హీనుడు సైనికసాహాయ్యముకంటె నధికాంశమునిచ్చునట్లు అధికునితో ఒప్పందము చేసుకొనవచ్చును. 10. ఒప్పందములోనికి దిగినవాడు సదుద్దేశములు కలవానికి సహాయముచేయవలెను, లేనివానితో యుద్ధము చేయవలెను.

11. దుర్గరక్షణమునుగాని మిత్రసహాయమునుగాని సంపాదించినహీనుడు సమీపమందుండు శత్రువుపైకి వెళ్ళదలచినపుడును, యుద్ధముచేయక లాభమును సంపాదించదలచినప్పుడును,లాభముతప్పక లభించునని తలచినప్పుడుమ వ్యసనియు ఛిద్రములతో కూడిన ప్రజలు కలిగినట్టియు అనర్థముల నెదుర్కొనుచుండు నట్టియు నధికునికి సైనికసహాయము కంటె తక్కువ అంశము నిచ్చుషరతుపై ఒప్పందము కుదుర్చుకొనవచ్చును. 12. ఒప్పందములోనికి దిగినవాడు అపకారసమర్థుడైన యెడల యుద్ధము చేయవలెను ; అట్లుకానప్పుడు సంధి చేసుకొనవలెను.

13. ఛిద్రములుగాని వ్యసనములుగాని లేనట్టి అధికుడుకూడ కార్యము లను తృప్తికరముగ నారంభించని హీనునికి మరింతక్షయము సంభవించవలెనని కోరునప్పుడును, తనసైన్యములోని దూష్యులకు మరణము వాటిల్లవలెనని కోరు నప్పుడును, హీనుని సైన్యములోని దూష్యులను తనవైపునకు మరల్చవలెననికోరు నప్పుడును, హీనునిచే పీడితుడును ఛేదనీయుడునగు తనశత్రువును కష్టపెట్ట కోరినప్పుడును, సంధిని కోరుహీనుడు సదుద్దేశములు కలవాడై నప్పుడును తక్కువలాభముతో తృప్తిపడవచ్చును. 14. సదుద్దేశములు కలవానితో కలసి తన యుద్దేశమును కొనసాగించుకొనవచ్చును ; అట్టివాడు కానప్పుడు యుద్ధము చేయవచ్చును.

15. ఇదేవిధముగ సముడు సముని మోసముచేయవచ్చును ; లేదా, అనుగ్రహించవచ్చును.

---

*(footnote in continuation of the previous page)*

అధికాంశము, హీనునికి హీనాంశము, సమునికి సమమగు అంశము ఇచ్చునట్లు చేసుకొనిన సంధి సమసంధి. అధికునికి హీనాంశమును సమమగు నంశమును ఇచ్చునట్లు చేసుకొనినది విషమసంధి. హీనుడు సములవిషయములో ఇట్లే చేయుట విషమసంధి. అందుచేత విషమ సంధులు ఆరురకములు.

16. శత్రువువశమందుండు ప్రత్యేకసైన్యమును మిత్రసైన్యమును ఆటవిక సైన్యమును ఎదుర్కొనగల సైన్యమును, శత్రువునకు ప్రతికూలమగు ప్రదేశములలో మార్గదర్శకముగ నుండదగిన సైన్యమును, మూలస్థానమును వెనుక భాగమును రక్షించగల సైన్యమునుకోరి, సముడు సైన్యమునకు సమానమగు అంశమునిచ్చుషరతున కంగీకరించవచ్చును. 17. కోరువాడు సదుద్దేశములు కలవాడైనఎడల సంధి కంగీకరించవచ్చును; కానప్పుడు యుద్ధము చేయవచ్చును.

18. వ్యసనియు, ఛిద్రముతో కూడినప్రజలు కలిగినట్టియు, రాజులనేకుల విరోధమునకు పాత్రుడైనట్టియు రాజునుండి సముడు సైన్యమునకంటె తక్కువ అంశమునిచ్చుషరతుతో సంధిని కోరవచ్చును. మరియొకనినుండి సహాయము లభించునప్పుడుకూడ నిట్లే చేయవచ్చును. 19. కోరబడినవాడు అపకారసమర్థుడైనయెడల యుద్ధము చేయవలెను; కానియెడల సంధి కంగీకరించవలెను.

20. ఇట్టిస్థితిలోనుండు సముడు తనకార్యములు సామంతునియందాయత్తమైనప్పుడుగాని, తనబలమును వృద్ధిచేసుకొనుటకు కాలవ్యవధి అవసరమైనప్పుడుగాని, సైన్యమునకంటె నెక్కువ అంశమునిచ్చు షరతుతో సంధిని కోరవలెను. 21. కోరినవాడు సదుద్దేశములు కలవాడైనయెడల సంధి చేసుకొనవచ్చును; కానియెడల యుద్ధములు చేయవచ్చును.

22. వ్యసనములలో చిక్కుకొన్నట్టియు ఛిద్రముతో కూడిన ప్రజలు కలిగినట్టియు రాజుపై దండయాత్ర చేయదలచినపుడును, చక్కగప్రారంభించబడి చక్కగపూర్తికానున్న (శత్రు) కార్యములకు విఘాతము కలిగించదలచినప్పుడును, అతని మూలస్థానమునకును దండయాత్రకును నష్టముకలిగించదలచినప్పుడును, తాను దండయాత్రచేయదలచినవానినుండి ఎక్కువ లాభము దొరుకుచున్నప్పుడును అధికునినుండిగాని, హీనునినుండిగాని, సమునినుండిగాని ఎక్కువలాభమును కోరవచ్చును. 23. శత్రువుసైన్యముల సహాయమున మరియొకని దుస్సాధ్యమగు దుర్గమునో అపారసైన్యమునో ఆటవికసైన్యమునో మర్దించునుద్దేశముతో తరలిన సైన్యమును రక్షించుకొనదలచినప్పుడును, దూర దేశములో దీర్ఘ కాల దండయాత్రను సాగించుటకై వెళ్ళు శత్రుసైన్యములకు క్షయవ్యయములను కలిగించ కోరినపుడును సైనిక సహాయము ద్వారా తన వృద్ధికి తోడ్పడిన శత్రువునే నిర్మూలము చేయదలచినప్పుడును శత్రుసైన్యములను తానే వశపరుచుకొనదలచినపుడును ఎక్కువలాభమును కోరినవాని కట్టిలాభమును సమకూర్చవచ్చును.

24. అధికుడు శత్రువుపై దండయాత్రను చేయునట్లు నటించి హీనుని వశపరుచుకొనదలచినపుడును, శత్రువును పెకలించిన తర్వాత నతనినిగూడ

పెకలించదలచినపుడును, సమకూర్చినలాభమును కొంతకాలమైనతర్వాత నపహరించదలచినపుడును సైన్యముకంటె నెక్కువఅంశమునిచ్చునట్లు హీనునితో బేరముపెట్టవచ్చును. 25. బేరమునకు పిలువబడినవా డపకారసమర్థుడైన యెడల యుద్ధము చేయవలెను; సమర్థుడు కానప్పుడు సంధి చేసుకొనవలెను. 26. లేదా, దండయాత్రకు గురియైనవానితో కలియవచ్చును; లేదా, దూష్యులతో కూడిన సైన్యమునుగాని, విరోధించు సైన్యమునుగాని, ఆటవికసైన్యమును గాని సహాయముగ పంపవచ్చును.

27. వ్యసనములలో చిక్కుకొనినట్టియు ఛిద్రములతో కూడినప్రజలు కలిగినట్టియు అధికుడు సైన్యమునకు సమమగునంశమునిచ్చినట్లు హీనునితో బేరముచేయవచ్చును. 28. బేరమునకు పిలువబడినవా డపకారసమర్థుడైన యెడల యుద్ధముచేయవలెను; సమర్థుడుకానప్పుడు సంధిచేసుకొనవలెను.[2]

29. ఇట్టిస్థితిలోనుండు హీనునికి సైన్యసహాయముకంటె తక్కువ లాభమునిచ్చునట్లు అధికుడు బేరముచేయవచ్చు. 30. బేరమునకు పిలువబడిన వాడపకారసమర్థుడైనయెడల యుద్ధముచేయవలెను; సమర్థుడుకానప్పుడు సంధిచేసుకొనవలెను.

31. (శ్లో) సంధినికోరువాడు కోరబడువాడు మొట్టమొదట నొకరొకరి యుద్దేశములను తెలుసుకొనవలెను. తర్వాత రెండుపక్షములవారు చక్కగా నాలోచించి ఎందులో శ్రేయస్సుకలదో అట్టిమార్గము ననుసరించవలెను.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు ద్వైధీభావికములగు సంధివిగ్రహములనే ఏడోఅధ్యాయము.

---

[2] ఈ సంధులన్నిటిలో సైన్యమునకు బదులుగ లాభముతో ఎంతటి అంశము నియ్యవలెనను విషయము వివరింపబడినది. సహాయము కోరువానియొక్కయు కోరబడువానియొక్కయు పరిస్థితులనుబట్టి ఇది నిర్ణయము కావలెననుట ఈ వివరణముయొక్క సారాంశము. ఇదంతయు రాజుల మధ్య బేరము. బేరమునకు ఫలితము సంధికావచ్చును; లేదా, యుద్ధము కావచ్చును

ఏడో అధికరణము

## అధ్యాయము 8

### ప్రకరణము 114 : యాతవ్యవృత్తి[1]

### ప్రకరణము 115 : అనుగ్రహించదగిన మిత్రులగురించిన విశేషములు

1. అనేకులు కలిసి సంధిచేసుకొని తనపైదాడిచేయ సిద్ధపడినప్పుడు యాతవ్యుడు సంధికిగల కారణములను తొలగించు ఉద్దేశముతోగాని, సంధిని భగ్నపరుపకోరిగాని సామవాయికులలో నొకనితో రెండింతల లాభమును తానే ఇచ్చునట్లు బేరముచేయవలెను. 2. బేరమును ప్రారంభించి దాడిమూలమున కలుగు క్షయము, వ్యయము, ప్రవాసము, ఇతరాటంకములు, శత్రువులకు సమకూరు లాభములు, శరీరబాధ మొదలగు వాటిని వివరించవలెను; దీనికంత కతడు సమ్మతించినయెడల నతనికి ధనము నియ్యవలెను. 4. లేదా, తక్కిన సామవాయికులతో నతనికి విరోధమును కల్పించి అతనిని వారినుండి వేరుచేయ వలెను.

5. చక్కగానారంభముకాని కార్యములకు మరింత క్షయవ్యయములు కలిగించదలచినప్పుడును, చక్కగనారంభింపబడిన యాత్రకు విఘాతము కలిగించదలచినప్పుడును, అతని మూలస్థానముపై దాడిచేయదలచినప్పుడును అతని యాత్రను ఆటంకపరుపదలచినప్పుడును, యాతవ్యునితో కలిసినతర్వాత మరింత లాభమును కోరదలచినప్పుడును, బేరముసందర్భమున ధనమును గురించి కొన్నిఇబ్బందులుకలిగినను, లేదా, అతనియందు ఎక్కువవిశ్వాసము లేకపోయినను ప్రస్తుతము తక్కువలాభమును భవిష్యత్తులో ఎక్కువలాభమును సమకూరునట్లు ఒప్పందము చేసుకొనవచ్చును.

---

[1] యాతవ్య డనగా ఇతరులు దండయాత్రకు గురియైనవాడు. దండయాత్రవలన కలుగు ప్రమాదములనుండి తప్పించుకొను ఉపాయములు కొన్ని ఇచ్చట వివరింపబడియున్నవి.

6. తనమిత్రుని కుపకారమును శత్రువున కపకారమును తనకుధన లాభమును చేకూరునని తోచినప్పుడును, ఇంతకు పూర్వము తన కుపకారముచేసిన రాజునుండి మరింతలాభమును సంపాదించదలచినపుడును, ప్రస్తుతము తక్కువ లాభముతో తృప్తిపొంది భవిష్యత్తులో నెక్కువలాభము నపేక్షించవలెను.

7. దూష్యులతో గాని శత్రువులతో గాని, మూలస్థానమును పట్టుకొన దలచిన ఆధికునితోగాని పోరుచుండురాజును రక్షించదలచినపుడును, అట్టిరాజు ముందుముందట్టి సహాయమును తనకు చేయవలెనని కాంక్షించునప్పుడును, సంబంధబాంధవ్యమునుగురించి ఆలోచించవలసినప్పుడును ఇప్పుడుగాని భవిష్యత్తులోగాని లాభము నపేక్షించరాదు.

8. సంధిని చేసుకొనినతర్వాత దాని నతిక్రమించదలచినప్పుడును, శత్రుప్రజలధనమును హరించదలచినప్పుడును, మిత్రామిత్రులతో చేసుకొనిన సంధిని భగ్నముచేయదలచినపుడును, శత్రువు తనపై దాడిచేయునను అనుమానమును కలిగి నపుడును, రావలసినలాభమునుగాని అంతకంటె హెచ్చు లాభమునుగాని కోరవలెను. 9. అట్టిసందర్భములో రెండవవాడు ప్రస్తుతము భవిష్యత్తులో చేయవలసిన కార్యక్రమమునుగురించి ఆలోచించవలెను. 10. దీనినుండి పూర్వవిషయములనన్నిటిని తెలుసుకొనవలెను.

11. శత్రువుగాని విజిగీషువుగాని వారివారిమిత్రులకు సహాయముచేయు సందర్భములో[2] మిత్రుడు సులభసాధ్యములును నిర్దుష్టములును లాభదాయకములును స్థిరములును అగు కార్యములు కలవాడై నప్పుడును అనురక్తులగు ప్రజలు కలవాడైనప్పుడును విశిష్టమగులాభమును చేకూర్చకలవాడగును. 12. సాధ్యములగు కార్యములుకలవాడు పూర్తిచేయుటకు సాధ్యములైనవాటినే ప్రారంభించును ; నిర్దుష్టములగు కార్యములుకలవాడు లోపములులేనికార్యములనే ప్రారంభించును ; లాభదాయకములగువాటినికలవాడు సత్ఫలితములిచ్చువాటినే ప్రారంభించును. 13. స్థిరకర్మలుకలవాడు తానుతలపెట్టిన కార్యములు పూర్తియగువరకు విశ్రమించడు. 14. అనురక్తులగు ప్రజలుకలవాడు సహాయ సంపత్తియున్నవాడగుటచేత ఇతరులనుండి స్వల్పసహాయము లభించినను కార్యములను సంపాదించుకొన గలవాడగును. 15. ఇట్టిమిత్రులు కృతార్థత చెందినవారై బహుళమగు ప్రత్యుపకారమును సులభముగ జేయుదురు. 16. ఇట్టిలక్షణములు లేనివారికి సహాయము చేయరాదు.

17. ఇద్దరును ఒకనికే సహాయముచేసినప్పుడు తనమిత్రునికిగాని మిత్రతరునికిగాని సహాయము చేసినవాడు రెండవవానిని మించినవాడగును. 18. ఏలయన, మిత్రునినుండి తనలాభమును వృద్ధిజేసుకొనును ; రెండవవాడన్నో

---

[2] ఎట్టి మిత్రులు అనుగ్రహ పాత్రులను విషయ మిచట వివరింపబడినది.

క్షయ వ్యయములు ప్రవాసకష్టములు భరించి శత్రువులకు లాభముకలి గించువాడగును. 19. శత్రువు తనయుద్దేశమును నెరవేర్చుకొనినతర్వాత శత్రువుగనే ప్రవర్తించును.

20. ఇద్దరును మధ్యమునకు సహాయము చేసినప్పుడు, మధ్యముఁడు మిత్రుడుగను మిత్రతరుడుగను ఉన్నట్టివాడు రెండవవానిని మించినవా డగును. 21. ఏలయన, మిత్రునినుండి తనలాభమును వృద్ధిజేసుకొనును ; రెండవవాడన్ననో క్షయవ్యయములు ప్రవాసకష్టములు భరించి శత్రువులకు లాభముకలిగించువాడగును.

22. సహాయముపొందిన తర్వాత మధ్యము డెదురుతిరిగినయెడల శత్రువు విజీగీషుని అతిక్రమించగలవాడగును. 23. ఏలయన, మధ్యమునికి శత్రువైనవాడు ప్రస్తుతము తనకు మిత్రుడగుచున్నాడు. ఇతడిదివరలో మధ్యమునకై ప్రయాసపడి ఇప్పుడతనిని త్యజించి ఏకార్థమును సాధించుటకు[3] తనతో కలిసినవాడు.

24. దీనినుండి ఉదాసీనునికి చేయుసహాయమునుగురించి తెలుసు కొనవలెను.

25. మధ్యమునకుగాని ఉదాసీనునికిగాని సైన్యసహాయము చేయు విష యములో శూరులు అస్త్రములందు నిపుణులు కష్టములనుసహించువారు అనురక్తులు అగుసైనికులను సహాయముగ పంపినవాడు అతిక్రమించబడిన వాడగును. 26. దీనికి విరుద్ధముగ ప్రవర్తించినవాడు అతిక్రమించినవాడగును.[4]

27. సహాయమునకై పంపిన సైన్యములు ఇతరప్రయోజనములను కూడ సాధించగలవైనప్పుడు దేశకాలములు తెలిసినవైనయెడల మూలబలమును గాని భృతకబలమునుగాని శ్రేణీబలమునుగాని ఆటవికబలమునుగాని పంపవలెను ; దేశకాలములు దూరముగను దీర్ఘముగను ఉన్నయెడల అమిత్రబలమునుగాని ఆటవికబలమునుగాని పంపవలెను.

28. "తనయుద్దేశము నెరవేరినతర్వాత నాసైన్యమును వశపరుచుకొనును ; లేదా, దానిని అమిత్రసైన్యములయు ఆటవికసైన్యములయు శిబిరములలోగాని అనర్థములగు ప్రదేశములందుగాని కాలములందుగాని నివసింపజేయును ; లేదా, శక్తివిహీనముగ జేయును," అని తోచినపుడు తనసైన్యములు ప్రదేశాం

[3] మధ్యమునికి నష్టము కలిగించుటయే ఈ ఏకార్థము. విజిగీషువు శత్రువునితో కలియుట కిది కారణము.

[4] ఇతరులకు సహాయము చేయవలసివచ్చినప్పుడు—అందులో ముఖ్యముగ మధ్యమునికి ఉదాసీనునికి సహాయముచేయవలసివచ్చినప్పుడు సారములగు తన సైన్యములను పంపరాదు. అట్టి సైన్యములను పంపినవాడు బలహీనుడై అతిక్రమింపబడును.

తరము నకు వెళ్ళవలసిన అవసరమున్నదను కారణముచూపి వాటిని పంపుట మానుకొనవలెను. 29. కాని సైన్యములను తప్పక పంపవలసివచ్చినప్పుడు అట్టిసమయమునమాత్రమే వినియోగింపదగినవాటిని పంపవలెను. 30. యాత్ర పూర్తియగు వరకు తగిన ప్రదేశములలో వాటికి నివాసము లభించునట్లును యుద్ధము చేయునట్లును ఏర్పాటుగావించి సైనికప్రమాదములకు గురి కాకుండునట్లు రక్షించవలెను. 31. అతని యుద్దేశము నెరవేరినవెంటనే ఏదియో సాకు చూపి తనసైన్యములను రప్పించుకొనవలెను. 32. లేదా, యాతవ్యునితో సంధిచేసుకొని ఇతనిని మోసగించవలెను.

33. (శ్లో) లాభము సమమైనప్పుడు సంధి చేసుకొనవలెను; సమము కానప్పుడు సములు, హీనులు, అధికులగురాజులు యుద్ధము చేయవచ్చునని పెద్దలమతము. ఇది సంధివిక్రమముల వివరణము.

ఇది షాడ్గుణ్యమను ఏడోఅధికరణమందు యాతవ్యవృత్తి, అనుగ్రహించ దగిన మిత్రులగురించిన విశేషములు అనే ఎనిమిదో అధ్యాయము..

# ఏడో అధికరణము

## అధ్యాయము 9

### ప్రకరణము 116 : మిత్రహిరణ్యభూమికర్మసంధులు
### (i) మిత్రసంధి (ii) హిరణ్యసంధి

1. సంధిచేసుకొని యానముచేయు సందర్భములో మిత్రహిరణ్యభూమి లాభములందు ముందు చెప్పబడిన లాభముకంటె తర్వాత చెప్పబడిన లాభము శ్రేష్ఠము. 2. భూమిలాభమునుండి మిత్రహిరణ్యములు ప్రాప్తించును; హిరణ్యమునుండి మిత్రుని సంపాదించవచ్చును. 3. లేదా, ఎట్టిలాభము నుండి తక్కిన రెండులాభములను సంపాదించుట సాధ్యమో అట్టిలాభమును కోరవలెను.

4. "మనమిద్దరము ఒక్కొకమిత్రుని సంపాదింతము," ఇదియు ఇటు వంటి ఇతరములును సమసంధులు. 5. "నీవు మిత్రునొకనిని సంపా దింపుము. (నేను తక్కినరెంటిని సంపాదించెదను)" ఇట్టివి విషమసంధులు. 6. వీటిలో విశేషలాభమును పొందుట అతిసంధి.

7. సమసంధియందు సంపన్నుడగు మిత్రునిగాని కష్టదశలోనున్న మిత్రునిగాని సంపాదించినవాడు ఎక్కువలాభమును పొందినవాడగును. 8. ఏలయన, ఆపదలు స్నేహస్థైర్యమునకు కారణమగును.

9. కష్టములలోనున్న మిత్రులలో నొకడు నిత్యుడైనను అవశ్యుడుగ నుండ వచ్చును; మరియొకడు అనిత్యుడైనను వశ్యుడుగ నుండవచ్చును; "ఇట్టివారిలో నిత్యుడు వశ్యుడుకాకున్నను స్నేహపాత్రుడగును; ఏలయన, నతడు సహాయము చేయకపోవచ్చునుగాని అపకారముచేయడు," అని ఆచార్యులు. 10. "ఇది కూడదు," అని కౌటిల్యుడు. 11. నిత్యుడు కాకపోయినను వశ్యుడగువాడే స్నేహ పాత్రుడు. 12. ఎంతకాల మతడుపకారముచేయునో అంతకాలమతడు మిత్రుడుగ నుండును; మిత్రునికి లక్షణ ముపకారము చేయుటయేగదా!

13. వశ్యులగు మిత్రులిద్దరిలో నొకడనిత్యుడైనను ఎక్కువఉపకారము చేయగలవాడు కావచ్చును; మరియొకడు నిత్యుడైనను అల్పోపకారము చేయు వాడు కావచ్చును; "వీరిలో ఎక్కువ ఉపకారముచేయువా డనిత్యుడైనను స్నేహ పాత్రుడు; అట్టివాడు స్వల్పకాలములో గొప్పసహాయము చేయును; ఎక్కువ ఖర్చులను భరించును," అని ఆచార్యులు. 14. "ఇది కూడదు," అని కౌటిల్యుడు. 15. స్వల్పముగ సహాయము చేయువాడైనను నిత్యుడే స్నేహపాత్రుడు, 16. అనిత్యుడు ఎక్కువసహాయముచేయ సమర్థుడైనను అట్టిసహాయముచేయవలసి వచ్చునను భయముతో సంబంధమును వదలుకొని వెళ్ళిపోవును; లేదా, ఇచ్చిన దానిని తిరిగిఇచ్చివేయుమని కోరును. 17. నిత్యుడు స్వల్పోపకారమును చేయువాడైనప్పటికిని దానిని అంతరాయములేక చాలకాలము చేయుచుండువాడగుటచేత నది మహోపకారమే అగుచున్నది.

18. మిత్రులలో నొకడు గొప్పవాడు, కాని మందముగ నడుచువాడు; ఇంకొకడు స్వల్పుడు, కాని చురుకుగ నడుచువాడు. వీరిలో, "మందముగ నడుచు గొప్పవాడు ప్రతిష్ఠను సమకూర్చును; అతడు కదలినయెడల కార్య సిద్ధి తప్పక జరుగును," అని ఆచార్యులు. 19. "ఇట్లు జరుగదు," అని కౌటిల్యుడు. 20. చురుకుగనడచు స్వల్పుడే స్నేహపాత్రుడు. 21. అట్టి వాడు కార్యమునకు కావలసిన కాలమును దాటనీయడు; బలహీనుడగుటచేత నతనిని ఇష్టానుసారము వినియోగించుకొనవచ్చును; అధికవిస్తీర్ణమగు రాజ్య ముగల రెండవవాని నిట్లు వినియోగించుకొనుట సాధ్యముకాదు.

22. చెదరిపోయిన సైన్యమా, లేక, వశములోలేని సైన్యమా? "చెదరి పోయిన సైన్యము నొకచోట చేర్పవచ్చును—అది వశములో నున్నట్టిదిగనుక," అని ఆచార్యులు. 23. "కాదు," అనికౌటిల్యుడు. 24. వశములో లేని సైన్యమే ఉత్తమము. 25. సామాద్యుపాయములచేత అవశమగు సైన్యమును వశపరుచు కొనవచ్చును; చెదరిపోయిన సైన్యమున కితరపనులుండుటచేత దానినొకచోట చేర్చుట సాధ్యముకాదు.

26. మనుష్యసహాయము చేయగల మిత్రుడా, లేక, హిరణ్యసహాయము చేయగలమిత్రుడా, కోరదగినవాడు? "పురుషసహాయముచేయువాడే కోరదగినవాడు; అట్టివాని, మూలమున ప్రతిష్ఠ లభించుచున్నది; అతడు కదలినయెడల కార్య సిద్ధికాగలదు," అని ఆచార్యులు. 27. "కాదు," అని కౌటిల్యుడు. 28. హిరణ్య సహాయముచేయువాడే కోరదగినవాడు. 29. హిరణ్యమును సర్వకాలములం దుపయోగించవచ్చును; సైన్యమును కొన్నికాలములందు మాత్రమే ఉపయో గించుటకు వీలుండును. 30. హిరణ్యముతో సైన్యములను ఇతరసామగ్రిని సంపాదించవచ్చును.

31. హిరణ్యమునిచ్చు మిత్రుడా, లేక, భూమినిచ్చుమిత్రుడా కోరదగిన వాడు? "హిరణ్యమునకు చలనశక్తికలదు; దానితో అన్నిఖర్చులను భరించ వచ్చును; అందుచేత హిరణ్యమునిచ్చుమిత్రుడే కోరదగినవాడు," అని ఆచార్యులు. 32. "కాదు," అని కౌటిల్యుడు. 33. భూమి లాభము మూలమున మిత్రుడు హిరణ్యము లభించునని ఇదివరకే చెప్పియున్నాము. 34. అందుచేత భూమినిచ్చు మిత్రుడే కోరదగినవాడు.

35. ఇద్దరుమిత్రులుచేయు సైనికసహాయము సమానముగనున్నప్పుడు పరాక్రమము, కష్టములు భరించగలశక్తి, అనురాగము, (ఒకే) మిత్రునినుండి సర్వ బలలాభము[1]—ఇవి గుర్తించవలసిన విశేషములు.

36. ఇద్దరు మిత్రులుచేయు హిరణ్యసహాయము సమానముగనున్నప్పుడు కోరినవస్తువుల సంపాదనము, బాహుళ్యము, అల్పప్రయాస, నిరంతరము లభించుట—ఇవి గుర్తించదగిన విశేషములు.

37. ఈసందర్భములో దిగువవివరములు తెలుసుకొనవలెను :

38. (శ్లో) నిత్యుడు, వశ్యుడు, చురుకుగపనిచేయువాడు, పితృపైతామహుడు, గొప్పవాడు, అద్వైధ్యుడు—ఇట్టివాడు షడుణములతో కూడిన సంపన్న మిత్రుడు.

39. (శ్లో) ప్రేమవలన రక్షించువాడు, ప్రేమవలననే రక్షింపబడువాడు, ధనమును లక్ష్యపెట్టనివాడు, పూర్వకాలమందుండి సంబంధమును వృద్ధిచేసుకొనినవాడు, నిత్యుడగు మిత్రుడని చెప్పబడును.

40. (శ్లో) వశ్యులలో మూడురకములవారున్నారు : తమసర్వస్వముతో సహాయముచేయువారు ; వివిధములగు సహాయములుచేయువారు ; అత్యధికముగ సహాయము చేయువారు ; ఒకవైపునుండి సహాయముచేయువారు, రెండువైపుల నుండి సహాయముచేయువారు ; అన్నివైపులనుండి సహాయముచేయువారు—ఇదిమరియొక విభేదము.[2]

41. (శ్లో) ఇచ్చినను పుచ్చుకొనినను శత్రువును హింసించుచు జీవించువాడు, పారిపోవుటకు దుర్గముగాని అరణ్యప్రదేశముగాని కలవాడు నిత్యుడును అవశ్యుడునగు మిత్రుడు.

42. (శ్లో) ఇంకొకనితో యుద్ధముచేయుసమయమునగాని, అల్పమగు ఆపద సంభవించినప్పుడుగాని సహాయార్థమై సంధిచేసుకొనువాడు వశ్యుడును అనిత్యుడు నగుమిత్రుడు.

43. (శ్లో) సమానమగు ప్రయోజనమును కోరువాడు, ఉపకారము చేయు

---

[1] సైన్యమునకు కావలసిన ఆయుధములు మొదలైనవి.

[2] ఈ విభేదము 7–16–10–15 సూత్రములలో వివరించబడినది.

వాడు ఎన్నడుగాని మారనివాడు మిత్రభావముగల మిత్రుడు—ఇట్టి మిత్రు డాపదల యందుకూడ ద్వైధీభావము లేనివాడగును.

44. (శ్లో) ఒకనియందుమాత్రమే మిత్రభావముకలవాడు నిత్యమిత్రుడు; శత్రువుపట్లకూడ మిత్రభావముకలవాడు చలమిత్రుడు; ఉభయులందు మిత్రభావము లేనివాడు ఉదాసీనుడు; ఉభయులపట్ల మిత్రభావముచూపువాడు ఉభయభావ మిత్రుడు.

45. (శ్లో) ఇద్దరు బలవంతులమధ్యనుండు మిత్రుడు నిజముగ విజిగీషుని పట్ల మిత్రత్వములేనివాడే; సహాయము చేయవలసిన బాధ్యతగాని, దానికికావల సినశక్తిగాని లేనికారణమున నతడు సహాయముచేయడు.[3]

46. (శ్లో) శత్రువునకు ప్రియుడును, అతనిరక్షణకు గౌరవమునకు పాత్రుడును, అతనితో బంధుత్వముగలవాడును అగుమిత్రుడు శత్రుసాధారణుడు.[4]

47. (శ్లో) విశాలమగు భూమికలవాడు, సంతుష్టుడు బలవంతుడు అల సుడునగు మిత్రుడును, వ్యసన కారణమువలన నవమానింపబడిన మిత్రుడును ఉదాసీనుడు.

48. (శ్లో) తనదౌర్బల్యముచేత శత్రువుయొక్కయు విజిగీషుని యొక్కయు శ్రేయస్సుకు లోబడి ఉభయులచేత విరోధింపబడనివాడు ఉభయ భావి (అగుమిత్రుడు) అని పేర్కొనబడుచున్నాడు.

49. (శ్లో) కారణముండిగాని కారణములేకగాని విడిపోయినట్టియు కారణముండిగాని కారణములేకగాని తిరిగివచ్చినట్టియు మిత్రునిగురించి ఉపేక్షించుట మృత్యువు నాలింగనము చేసుకొనుటయే.

50. "త్వరలో లభించు అల్పలాభమా, చాలకాలము గడచినతర్వాత లభించు గొప్పలాభమా కోరదగినది? కార్యదేశకాలానుగుణమైనప్పుడు త్వరలో లభించు అల్పలాభమే కోరదగినది," అని ఆచార్యులు. 51. "కాదు" అని కౌటిల్యుడు. 52. నష్టముకానట్టియు విత్తనమువలె నుండునట్టియు[5] చాల కాలము తర్వాత లభించు గొప్పలాభమే కోరదగినది.

53. (శ్లో) ఇట్లు ధ్రువమగులాభమందును లాభంశమందును ఉండు సుగుణములను తెలుసుకొని రాజు స్వార్థసిద్ధిపరుడై సామవాయికులతో కలిసి దండయాత్రను సాగించవలెను.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు మిత్రహిరణ్యభూమికర్మ సంధులలో మిత్రసంధి హిరణ్యసంధి అనే తొమ్మిదో అధ్యాయము.

---

[3] ఇతనికి అంతర్ధితుడని పేరు.

[4] అతడు శత్రువునకు విజిగీషునికికూడ మిత్రుడు.

[5] విత్తనములవలె భవిష్యత్తులో మరింత లాభమును తెచ్చునట్టిది.

# ఏడో అధికరణము

## అధ్యాయము 10

### ప్రకరణము 116 : (మిగులు) (iii) (భూమిసంధి)

1. "నీవు నేనుకలసి భూమిని సంపాదింతము" అని చేసుకొనిన సంధి భూమిసంధి.

2. వారిద్దరిలో ఎవడు సంపన్నమగు భూమిని దాని కవసరము కలిగినప్పుడు సంపాదించునో వా డెక్కువ లాభమును పొందినవాడగును.

3. సంపన్నమగుభూమి సమానముగ నిద్దరికి లభించినప్పుడు వారిలోనెవడు బలవంతుని ఓడించి భూమిని సంపాదించునో వాడెక్కువలాభమును సంపాదించినవాడగును. 4. ఏలయన, నతడు భూమినిసంపాదించుటయేగాక శత్రువును బలహీనపరచినవాడును, ప్రఖ్యాతిగాంచినవాడు నగుచున్నాడు. 5. దుర్బలునినుండి భూమినిసంపాదించుట సులభతరమన్నమాట సత్యమే. 6. కాని, అట్టిభూమికూడ బలహీనముగ (సారములేనిదిగ) నుండును ; అంతేగాక దానికి పొరుగునందుండు రాజిప్పటివరకు మిత్రుడుగనుండి ఇప్పటినుండి శత్రువగుచున్నాడు.

7. ఓడినరాజు లిద్దరు సమానబలులైనప్పుడు ఎవడు స్థిత శత్రువును[1] పెకలించి భూమిని సంపాదించునో వాడుఎక్కువలాభమును పొందినవాడగుచున్నాడు. 8. ఏలయన, దుర్గమును వశవరుచుకొనుట మూలమున నతడు తన రాజ్యమును రక్షించుకొని శత్రువును నాటవికులను ఓడించినవాడగుచున్నాడు.

9. చలన స్వభావముగల శత్రువునుండి భూమిని సంపాదించుటలో పొరుగురాజు దుర్బలుడైనపక్షమున విశేషమున్నది. 10. సామంతుడు దుర్బలుడైనప్పుడు భూమియొక్క యోగక్షేమములను త్వరలో వృద్ధిచేయవచ్చును. 11. సామంతుడు బలవంతుడైనప్పుడు ఫలితము దీనికి విరుద్ధమై కోశదండము

---

[1] స్థిత శత్రువనగా దుర్గమందు స్థితుడైనవాడు ; దానిచే రక్షింపబడినవాడు.

లకు నష్టము కలిగించును.

12. సంపన్నమును నిత్యశత్రువుగల భూమియా, లేక, నిత్యశత్రువులు లేని మందగుణములుగల భూమియా కొరతగినది ? "సంపన్నమును నిత్యశత్రువులుగల భూమియే శ్రేయస్కరము. సంపన్నమగు భూమినుండి కోశమును సైన్యమును సంపాదించవచ్చును ; ఈరెండును శత్రువును నాశముచేయును," అని ఆచార్యులు. 13. "చేయదు," అని కౌటల్యుడు. 14. నిత్యశత్రువులుగలభూమిని సంపాదించుట శత్రువుల నత్యధికముగ సంపాదించుటయే. 15. ఉపకారము చేసినను అపకారముచేసినను నిత్యశత్రువు శత్రువుగనే ఉండును ; అనిత్య శత్రువు ఉపకారము చేయుట మూలమునను అపకారముచేయకుండుట మూలమునను శత్రుత్వమును వదలుకొనును.

16. ఏభూమియొక్క పొలిమేరలందు దుర్గము లనేకము లుండునో, దేని పొలిమేరలలో సర్వదా చోరగణములు మ్లేచ్ఛాటవికజనము నుండునో, అదినిత్య శత్రువులుగలది ; దీనికి విరుద్ధమగుభూమి నిత్యశత్రువులు లేనిది.

17. సమీపమందుండు స్వల్పవిస్తీర్ణముగల భూమియా, దూరమందుండు బహువిస్తీర్ణముగల భూమియా కోరదగినది ? సమీపమందుండు స్వల్పవిస్తీర్ణము గల భూమియే కోరదగిననది. 18. ఏలయన, దానిని సంపాదించుట, పాలించుట, రక్షించుట సులభము. 19. దూరమందుండుభూమి దీనికంతకు విరుద్ధము.

20. దూరమందున్న భూములు రెంటిలో సైన్యముచే రక్షింపబడునదా, లేక, స్వయముగ రక్షింపబడునదా కొరదగినది ? స్వయముగ రక్షింపబడునదే కోర దగినది. 21. ఏలయన, దానినిరక్షించుటకు కావలసిన కోశదండము లందే ఉత్పత్తియగును. 22. సైన్యముచే రక్షింపబడునది దీనికివిరుద్ధమైనట్టిది ; అది సైనికస్థావరముగమాత్రమే ఉపయోగించును.

23. బాలిశులనుండి సంపాదించినభూమియా, ప్రజ్ఞావంతులనుండి సంపాదించిభూమియా కొరతగినది ? బాలిశులనుండి సంపాదించినభూమియే శ్రేయోదాయకము. 24. దానిని సంపాదించుటయు రక్షించుటయు సులభము ; శత్రువు దానిని తిరిగి తీసుకొనడు. 25. ప్రజ్ఞావంతులనుండి తీసుకొనినది దీనికి విరుద్ధమైనట్టిది ; ప్రజలు ప్రజ్ఞావంతులపట్ల అనురక్తులై ఉండెదరు.

26. పీడింపదగినవాడు, పెకలింపదగినవాడు—వీరిద్దరిలో పెకలింపదగిన వానినుండి భూమిని సంపాదించుట శ్రేయస్సు. 27. ఏలయన, పెకలింపదగినవాని కాశ్రయముండదు ; ఉన్నను అదిదుర్బలాశ్రయముగ నుండును. దాడిచేయబడి నప్పుడతడు కోశదండములతో పారిపోవదలచినయెడల ప్రజలతనిని విడనాడెదరు ; పీడింపదగినవా డిట్లుగాక దుర్గమందుగాని మిత్రులచేగాని రక్షింపబడును.

28. దుర్గముచే రక్షింపబడువారిలో నదీదుర్గముచే రక్షింపబడువాని భూమి

కంటె స్థలదుర్గముచే రక్షింపబడువాని భూమిని సంపాదించుట మంచిది. **29.** స్థలదుర్గమును ముట్టడివేయుట, మర్దించుట, అకస్మాత్తుగ పట్టుకొనుట సులభము ; దానినుండి శత్రువు తప్పించుకొని పారిపోవుట కష్టము. **30.** నదీదుర్గ విషయములో రెండింతల కష్టమున్నది ; నీళ్ళను తీసివేయుట సాధ్యము కాదు ; ఇది గాక నదీజలములు శత్రువునకు జీవనాధారమగును.

**31.** పర్వతదుర్గములోనుండువాని భూమికంటె నదీదుర్గములోనుండువాని భూమిని సంపాదించుట మంచిది. **32.** నదీదుర్గమును ఏనుగులు స్తంభములతో కూడిన వంతెనలు, కట్టలు, పడవలు మొదలగువాని సాధనమున జయించవచ్చును. దాని లోతులో భేదముండును ;[2] దాని నీళ్ళను గూడ తీసివేయవచ్చును. **33.** పర్వతదుర్గమును రక్షించుట సులభము ; దానిని ముట్టడించుట కష్టము ; దాని నెక్కుటకూడ కష్టమే ; ఒకభాగమును భగ్నముచేసినను దుర్గమునంతను నాశనముచేయుట సాధ్యముకాదు ; దానికి ప్రమాదము కలిగించువారిపై రాళ్ళను చెట్లను దొర్లించవచ్చును.

**34.** నేలమీదనుండి యుద్ధముచేయువారి భూమికంటె నీటిలోనుండి యుద్ధము చేయువారి భూమిని సంపాదించుట మంచిది. **35.** ఏలయన, నీటిలోనుండు వారు దేశకాలములన్నిటియందు యుద్ధముచేయలేరు ; నేలమీదనుండువారన్ని ప్రదేశములందును, అన్నికాలములందును యుద్ధము చేయగలరు.

**36.** ఉన్నతప్రదేశములనుండి యుద్ధముచేయువారి భూమికంటె గోతులలోనుండి యుద్ధముముచేయువారి భూమిని సంపాదించుట మంచిది. **37.** ఏలయన, గోతులలోనుండి యుద్ధముచేయువారు గోతులతోను శస్త్రములతోను యుద్ధముచేయవలసివారు ;[3] ఉన్నతప్రదేశములనుండి యుద్ధముచేయువారు శస్త్రములతో మాత్రమే యుద్ధముచేసెదరు.

**38.** (శ్లో) అర్థశాస్త్రవిదుడగు రాజు ఇట్టి రాజులనుండి భూమిని సంపాదించి సామవాయికులు శత్రువులు సంపాదించు లాభముకంటె నధికలాభమును పొందుచున్నాడు.

ఇది షాడ్గుణ్యమను ఏడవ అధికరణమందు మిత్రహిరణ్యభూమికర్మసంధులలో భూమిసంధి అనే పదో అధ్యాయము.

---

[2] అందుచేత దానిని దాటుట సాధ్యమగును.

[3] వారు గోతులను త్రవ్వుపనిని చేయవలెను. అటుతర్వాత శస్త్రములతో యుద్ధము చేయవలెను. కావున రెండు పనులను చేయవలసినవారుగ నున్నారు. వారి నోడించుట సులభము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 11

### ప్రకరణము 116 : (మిగులు) (iii అ) అనవసితసంధి[1]

1. "నీవు నేనుకలిసి శూన్యప్రదేశములందు నివేశనముల నేర్పరుతము," అని చేసుకొనిన సంధి, అనవసితసంధి.

2. వారిద్దరిలో నెవడు తనఅవసరమును గుర్తించి ఇంతకు పూర్వము వివరించిన సంపదలన్నిటితో కూడిన భూమిలో నివేశనముల నేర్పరచునో వాడు ఎక్కువలాభమును సంపాదించినవాడగును.

3. అట్టిభూములలో నధికవిస్తీర్ణముగల మెట్టనేలకంటె స్వల్పవిస్తీర్ణము గల నీటివసతులతో గూడిన నేలమంచిది; దీనినుండి నిర్ణీతమగు ఫలితమును సర్వదా పొందవచ్చును.

4. మెట్టభూములలో పూర్వాపరసస్యముల రెంటిని అధికముగ సాగుచేయుటకు వీలైనట్టిది, వర్షమల్పమైనను పంటలనిచ్చునది, అన్నికార్యములకు, అనుకూలించునట్టిది కోరదగినది.

5. నీటివసతులుగల భూములలో ధాన్యములసాగు కనుకూలించని దానికంటె ధాన్యములు పండునట్టిది మంచిది.

6. వీటిలోని అల్పాధికములగు భూములలో ధాన్యములపంట కనుకూలించుస్వల్పభూమికంటె ధాన్యములపంట కనుకూలించని అధికవిస్తీర్ణముగల భూమియే శ్రేష్ఠము. 7. ఏలయన, అధికవిస్తీర్ణముగల భూమిలో మెట్టలలో పెరుగు మొక్కలేగాక నీటిలో పెరుగు మొక్కలుకూడ పెరుగుట కవకాశముండును. 8. ఇంతేగాక దుర్గముల నిర్మాణము మొదలగు కార్యములనుగూడ జరిపించ

---

[1] అనవసిత మనగా నివాసములులేని ప్రదేశము. అదియే శూన్యప్రదేశము. దానినిగురించిన సంధి ఈ ప్రకరణములో వివరింపబడినది.

వచ్చును. 9. ఏలయన, మానవుని కార్యములబట్టి భూమిగుణములు నిర్ణయింప బడును.[2]

10. గనులుగల భూములు, ధాన్యములు పండే భూములు—వీటిలో గనులు గల భూములవలన కోశము వృద్ధిగాంచును; ధాన్యములు పండు భూములవలన కోశము కోష్ఠాగారము వృద్ధిగాంచును. 11. దుర్గనిర్మాణాది కార్యములన్నిటికి ధాన్యములాధారము. 12. లేదా, విక్రయమున కనుకూలించు ద్రవ్యములనిచ్చు గనులు శ్రేష్ఠములు.

13. "ద్రవ్యహస్తివనములలో ద్రవ్యవనము సమస్తకార్యములకుమూలాధారము; కోష్ఠాగారముల నింపునట్టిది. హస్తివన మిట్టిది కాదు," అని ఆచార్యులు. 14. "కాదు," అని కౌటిల్యుడు. 15. అనేకములగు భూముల్లో వివిధములగు ద్రవ్యవనములను పెంచవచ్చును; కాని హస్తివనములుపెంచుట సాధ్యముకాదు. 16. ఇదిగాక, శత్రుసైన్యములవధకు ఏనుగులే ఆధారము.

17. నీటిమార్గ స్థలమార్గములలో నీటిమార్గముల నన్నికాలములలో నుపయోగించుట సాధ్యముకాదు; స్థలమార్గముల నన్నికాలములలో నుపయోగించవచ్చును.

18. ఐకమత్యములేని ప్రజలతో కూడిన భూమి, (ఐకమత్యముగల) శ్రేణీజనముతో కూడిన భూమి—వీటిలో ఐకమత్యములేని ప్రజలతో కూడిన భూమియే మంచిది. 19. దీని ననుభవించుట సులభము; ఇది శత్రువుల కుట్రలకు పాలుపడునట్టిది కాదు; కాని ఆపదలను సహించజాలదు. 20. శ్రేణీజనముతో కూడినది ఇట్టిది కాదు; తిరుగుబాటు సంభవించిన కాలములలో ప్రమాదమును కలిగించునట్టిది.

21. అందు నివాసము చేయుటకుతగిన నాలుగు వర్ణముల దృష్ట్యా—అవర వర్ణము లెక్కువగ నివాసముచేయు ప్రదేశము సమస్తభోగముల నిచ్చునట్టిది; ఎక్కువగ కర్షకులు గలది వ్యవసాయబాహుళ్య వ్యవసాయ స్థైర్యములతో కూడి కోరదగినది అగుచున్నది; గోరక్షకులు గలది, వ్యవసాయమునకు తదితరములగు కార్యముల కనుకూలించును; ధనికులగు వర్తకులుగలది పణ్యముల సమృద్ధితో కూడినట్టిది అగుటయే కాక ఋణముల విషయమునకూడ ననుకూలపడును.[3]

22. భూమి గుణము లన్నిటిలో ఆశ్రయమునిచ్చు గుణము శ్రేష్ఠమైనది.[3]

23. దుర్గసంపన్నము మనుష్యసంపన్నమైన భూములలో మనుష్యసంపన్నమైనది శ్రేష్ఠము. 24. పురుషసమృద్ధిగలదే రాజ్యము. 25. మనుష్యులు లేని భూమి గొడ్డావువలె ఎట్టిఫలితము నిచ్చును?

---

[2] భూమిలోని సహజ సంపదల కంటె మానవుని కృషియే ఎక్కువ ఫలమునిచ్చును.

[3] రాజులకు ఋణములు కావలసినప్పుడు వర్తకులనుండి వాటిని తీసుకొనుచుండువారు.

26. నివేశనముల నేర్పరచుట మహాక్షయవ్యయములతోకూడిన భూమిని సంపాదించదలచినపుడు దుర్బలుడు క్షత్రియవంశమునకు చెందనివాడు, ఉత్సాహము లేనివాడు, మిత్రులు లేనివాడు, అన్యాయముగ వర్తించువాడు. వ్యసనములలో చిక్కుకొనినవాడు, అన్నిటికి తలవ్రాతయే కారణమని విశ్వసించువాడు, (ఆలోచించక) ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించువాడు—ఇట్టి క్రేతతో మొదట బేరము చేయవలెను.[4]

27. ఏలయన, క్షత్రియవంశమునకు జెందినదుర్బలుడుకూడ క్షయవ్యయములతో కూడిన నివేశనముల నేర్పరచుటలో తనకు వశపడినప్రజలతో కూడ క్షయవ్యయములు కారణముగ వినాశముగాంచును. 28. క్షత్రియవంశమునకు జెందని బలవంతుడు క్షయ వ్యయ భయముకలవారగు ప్రజల అనురాగమునకు దూరుడై వారిచే త్యజింపబడును.

29. నిరుత్సాహుడు సైనికసంపదగలవాడైనప్పటికిని క్షయవ్యయములు కారణముగ సైన్యముతోకూడ నశించును.

30. మిత్ర పక్షములేనివాడు కోశముకలవాడైనప్పటికి క్షయవ్యయముల వలన లాభముపొందువారు లేనికారణమున ఎట్టి ప్రయోజనమును పొందజాలడు.

31. అన్యాయముగ ప్రవర్తించువాడు నివేశనములతోకూడిన భూమిని కూడ వ్యర్థముచేయును. 32. అట్టివాడు శూన్యప్రదేశములో నివేశముల నేర్పరుపగలవాడగునా ? 33. వ్యసనములలో చిక్కుకొనినవాని స్థితికూడ ఇట్టిదే.

34. అన్నిటికి తలవ్రాతయే కారణమని విశ్వసించువాడు మనుష్య ప్రయత్నమనునదిలేక ఏ కార్యమును, ప్రారంభించడు ; ప్రారంభించినను విపత్తులు పొందును.

35. ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించువాడు ఎట్టి ప్రయోజనమును సాధించలేడు. 36. అందరిలో వీడే అధముడు. 37. "ఇట్టివాడు ఒక్కొకప్పుడు విజిగీషువులోని లోపముదేనినైనను కనుగొనవచ్చును," అని ఆచార్యులు. 38. (కాని) "అతడు లోపమును కనుగొనునట్లే వినాశనముకూడ పొందవచ్చును," అని కౌటిల్యుడు.

39. ఇట్టివాడు లభించనియెడల పార్ష్ణిగ్రాహి ప్రకరణమున వివరించినట్లు నివేశనములను కల్పించవలెను.

40. ఇది అభిహితసంధి.

---

[4] ఇట్టి క్రేతకు దాని నమ్మి దాని నతడు బాగుచేసినతర్వాత తిరిగి కొనవలెను. దానిని బాగుచేయుటకు కావలసిన ఖర్చులనన్నిటిని అతడు భరించును. వానిలో నదేదైనలోపము ఉండుటచేత వానినుండి భూమిని తిరిగిసంపాదించుట సులభము.

41. సంపదలుగల భూమినిగాని అక్రమించదగిన భూమినిగాని బలవంతుడు విక్రయించవలసినదిగ కోరినప్పుడు సంధిచేసుకొని దానిని ఇచ్చివేయవలెను. 42. దీనికి అనిభృత సంధి (బహిరంగముగ జేసుకొనినసంధి) అని పేరు. 43. సముడు కోరినప్పుడు, "దీనిని నేను తిరిగి తీసుకొనగలను; ఇదినాకు వశమగును; దీనికి బద్ధుడై శత్రువు నాకు వశుడుకావచ్చును; దీనిని విక్రయించిన కారణమున నాకు మిత్రలాభము హిరణ్యలాభము కలుగును; దీని మూలమున నాకార్యములు సఫలములగును," అను విషయముల నాలోచించి దానినిచ్చివేయవలెను. 44. హీనుడు భూమిని విక్రయించవలసినదిగ కోరినప్పుడిదే విధముగ నాలోచించి పనిచేయవలెను.

45. (శ్లో) శాస్త్రవిదుడైన రాజు మిత్రుని హిరణ్యమును జనముతోకూడినట్టియు కూడనట్టియు భూమి నిట్లు సంపాదించి సామవాయికు లందరికంటెనధికుడగుచున్నాడు.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు మిత్రహిరణ్యభూమికర్మ సంధులలో అనవసితసంధి అనే పదకొండో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 12

### ప్రకరణము 116 : (మిగులు) (iv) కర్మసంధి

1. "నీవు నేనుకలిసి దుర్గమును నిర్మించుకొందము," అని చేసుకొనిన సంధి కర్మసంధి.

2. వారిద్దరిలో దైవకృతము,[1] అభేద్యము, అల్పవ్యయము అగు దుర్గమును నిర్మించుకొనువాడు ఎక్కువలాభమును పొందుచున్నాడు. 3. ఈ దుర్గములలో స్థలదుర్గమునకంటె నదీదుర్గము, నదీదుర్గమునకంటె పర్వతదుర్గము శ్రేష్ఠములు.

4. రెండు జలాధారములలో, సహజముగ ప్రవహించు నీరు కలది, ప్రదేశాంతరమునుండి తీసుకొనిరావలసిన నీటిపై ఆధారము పడువానికంటె శ్రేష్ఠము. 5. సహజప్రవాహముగల జలాధారములు రెంటిలో సాగుచేయుట కనుకూలించు ప్రదేశమధికముగ గలది శ్రేష్ఠము.

6. ద్రవ్యవనములు రెంటిలో విస్తీర్ణాధిక్యముకలది, సారములగు ద్రవ్యములతో కూడినట్టిది, పొలిమేరలో ఉండునట్టిది, నదీమాతృకమైనట్టిది శ్రేష్ఠము. 7. ఏలయన, నదీమాతృకము జీవనోపాధిని కల్పించునది ; అపత్కాలమందాశ్రయము నిచ్చునట్టిది.

8. హస్తివనములు రెంటిలో, శౌర్యముగల మృగము లనేకములతో కూడినట్టిది ; దుర్బలులగు పొరుగురాజులతో కూడినట్టిది, (శత్రువులకు) సదాకష్టములు కలిగించునట్టిది, పొలిమేరలో ఉన్నట్టిది శ్రేష్ఠము ; ఇట్టి వనమును సంపాదించినవాడు ఎక్కువ లాభమును పొందుచున్నాడు. 9. "ఒకనివద్ద మందప్రకృతిగల ఏనుగు లనేకములు ; మరియొకనివద్ద శౌర్యముగల ఏనుగులు స్వల్ప

1. దైవకృతమనగా ప్రకృతిసిద్ధములగు వసతులు కలిగినది.

సంఖ్యలో ఉన్నప్పుడు, స్వల్పసంఖ్యలో శౌర్యముగల ఏనుగులున్నవాడే ఎక్కువ లాభమును పొందును ; శౌర్యముగలవి సంఖ్యలో తక్కువైనను మందము లగువాటి ననేకములను ఓడించును ; ఓటమిగాంచినవి స్వసైన్యముమీదపడి దానిని భగ్నపరుచును,' అని అచార్యులు. 10. "కాదు," అని కౌటిల్యుడు. 11. మంద ప్రకృతిగల అనేకములే శ్రేయోదాయకములు. 12. అవి అనేక ములగుటచేత సైన్యమునకు సంబంధించిన పను లనేకములను చేయగలవు ; యుద్ధకాలమందు స్వసైన్యమున కధికముగ రక్షణను కల్పించును ; శత్రుసైన్య ములకు దుర్ధర్షమై భయమును కలిగించును. 13. మందప్రకృతిగల యనేక ములకు శిక్షణనిచ్చి శౌర్యముకలవానిగ మార్చవచ్చును ; అల్పసంఖ్యలో నున్నవి శౌర్యముకలవైనను వాటిసంఖ్యను వృద్ధిచేయుట సాధ్యముకాదు.

14. గనులురెంటిలో సారద్రవ్యములు కలదానిని, దుర్గమములుకాని మార్గములుకలదానిని, తక్కువఖర్చులతో పనిచేయ సాధ్యమైనదానినిత్రవ్వువాడు ఎక్కువలాభమును పొందును. 15. వీటిలో ఎక్కువవిలువగల అల్పసంఖ్య లోనివా, తక్కువవిలువగల అధికసంఖ్యలోనివా కోరదగినవి ? ఎక్కువవిలువ గల అల్పసంఖ్యలోనివే కోరదగినవి ; వజ్రములు, మణులు, ముత్తెములు, పగడములు, బంగారము, వెండి మొదలైన నధాతువులు వాటిఅత్యధికమగు విలువ వలన తక్కువవిలువగల వాటినెన్నిటినైనను కప్పివేయును," అని అచా ర్యులు. 16. "కాదు," అని కౌటిల్యుడు. 17. ఎక్కువవిలువగల వాటిని కొనువాడెప్పుడో గాని లభించడు ; తక్కువవిలువగలవాటిని కొనువా రెందరో ఉండెదరు ; వాటికి సర్వదా గిరాకియే.

18. దీనినుండి వ్యాపారమార్గములగురించిన విశేషముల నెరుగవలెను.

19. ఈ సందర్భములో "నీటిమార్గములు, మెట్టమార్గములలో నీటి మార్గములే ఎక్కువలాభకరములు ; వీటికై చేయవలసిన ఖర్చు తక్కువ ; శ్రమ కూడ తక్కువ ; కాని, ఎక్కువ వర్తకలాభమును చేకూర్చును," అని అచార్యులు. 20. "కాదు," అని కౌటిల్యుడు. 21. నీటిమార్గములు ఆటంకములతో కూడినట్టివి ; అన్నికాలములలో ఉపయోగించుటకు వీలులేనట్టివి ; అనేకాపా యములకు గురియైనవి ; ప్రతిక్రియలు లేనట్టివి ; మెట్టమార్గము లిట్టివికావు.

22. నీటిమార్గములలో సముద్రతీరమార్గము సముద్రము లోపలిమార్గమున కంటె శ్రేష్ఠము ; ఏలయన, ఇందు పణ్యపట్టణము లనేకము లుండును ; సర్వదా ఉపయోగింప దగినట్టిది యగుటచేతను, ప్రమాదములెదుర్కొనుట సాధ్యమగుట చేతను నదీమార్గముకూడ శ్రేష్ఠమే.

23. "మెట్టమార్గములలో దక్షిణాపథమునకంటె హిమవంతమునకు వెళ్ళు మార్గము శ్రేష్ఠము ; ఏలయన, (ఇందులభించు) ఏనుగులు, గుర్రములు, సుగంధ

ద్రవ్యములు, దంతములు, చర్మములు, వెండి, బంగారము మొదలైనవి మిక్కిలి విలువగలవి," అని ఆచార్యులు. 24. "కాదు," అని కౌటిల్యుడు. 25. వీటిలో కంబళ్ళు, చర్మములు, గుఱ్ఱములుతప్ప తక్కినవన్నియు, శంఖములు, వజ్రములు, మణులు, ముత్తెములు, బంగారము దక్షిణాపథమందెక్కువగ లభించును.

26. దక్షిణమునకు వెళ్ళుమార్గములలోకూడ, అనేకములైన గనులు, ఎక్కువవిలువగల పణ్యములు, ప్రసిద్ధములగు రాకపోకలు, అల్పములగు ఖర్చులు, మొదలగువాటితో కూడుకొనినవి శ్రేష్ఠములు; తక్కువవిలువగలవైనను విక్రయించుట కెక్కువఅవకాశముగల పణ్యములతో కూడినట్టివికూడ శ్రేష్ఠములే.

27. దీనినుండి తూర్పుగను పడమటగను వెళ్ళుమార్గములగురించితెలుసుకొనవలెను.

28. కాలిబాటకంటె బండిబాట శ్రేష్ఠము; అందు, (వ్యాపారాది) కార్యములను బాహుళ్యముగ జరుపవచ్చును; లేదా, దేశకాలానుగుణములగు గాడిదలు ఒంటెలు పోగల మార్గములు కూడ మంచివే. 29. దీనినుండి మనుష్యుల మూపులమీద మోసుకొనిపోగల మార్గములవిషయము తెలుసుకొనవలెను.

30. (శ్లో) శత్రువునకు లాభసాటియగు కార్యము తనకు క్షయము, కలిగించునది అనియు, అతనికి నష్టము కలిగించునది తనకు లాభసాటి అనియు, ఇద్దరికి సమానముగ లాభనష్టములు కలుగుటయే "స్థాన" మనియ విజిగీషువు గ్రహించవలెను.

31. (శ్లో) నష్టమనగా తక్కువలాభము ఎక్కువఖర్చు అనియు, లాభమనగా దీనికి విరుద్ధమైనట్టిది అనియు, కార్యములలో ఖర్చులు లాభముతోసమానమగుట "స్థాన" మనియు తెలుసుకొనవలెను.

32. (శ్లో) కావున, దుర్గాదికర్మలలో తక్కువఖర్చు ఎక్కువలాభము గలవాటిని ప్రారంభించి విశిష్టమగు లాభమును సంపాదించవలెను; ఇదియే కర్మసంధుల వివరణము.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు మిత్రహిరణ్యభూమికర్మసంధులలో కర్మసంధి అనే పన్నెండో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 13

### ప్రకరణము 117 : పార్ష్ణిగ్రాహచింత[1]

1. విజిగీషువు శత్రువుకలిసి శత్రువులతో పోరుచుండు శత్రువులిద్దరిని[2] వెనుకభాగమునుండి కొట్టునపుడు వారిలో ఎవడు శక్తిసంపన్నుడగు శత్రువును వెనుకభాగమునుండి కొట్టునో వాడు ఎక్కువ లాభమును పొందినవాడగుచున్నాడు. 2. ఏలయన, శక్తిసంపన్నుడు తనశత్రువును భగ్నపరిచి వెనుకనుండి కొట్టు (పార్ష్ణిగ్రాహి) వానిపైపడి వానిని నిర్మూలించవచ్చును ; ఎట్టిలాభమును పొంద లేని శక్తిహీను డిట్లు చేయలేడు.

3. ఇద్దరు సమానశక్తి సంపన్నులై నప్పుడు విపులములగు కార్యముల నారంభించిన శత్రువును వెనుకనుండికొట్టువా డెక్కువ లాభమును సంపాదించును. 4. ఏలయన, అట్టివాడు తనశత్రువును నిర్మూలించి పార్ష్ణిగ్రాహిని నిర్మూలించవచ్చును ; అల్పకార్యముల నారంభించినవాడిట్లు చేయలేడు ; అతనిసైన్యము కార్యములో చిక్కుకొనియుండును.

5. ఆరంభించిన కార్యములు సమానములైనప్పుడు సమస్త సైన్యముతో దాడిచేయు శత్రువును వెనుకనుండి కొట్టువా డెక్కువ లాభమును సంపాదించును.

6. ఏలయన, అట్టివాడు మూలబలములేక సులభసాధ్యు డగుచున్నాడు ; సైన్యములోని కొంతభాగముతోమాత్రము దాడిచేయువాడు వెనుకభాగమును రక్షించుకొనుటకు కావలసిన ఏర్పాటును చేసుకొనగలవాడగును.

---

[1] పార్ష్ణిగ్రాహి అనగా వెనుకనుండి శత్రువును కొట్టువాడు.

[2] శత్రువులు వారిశత్రువులతో పోరుచున్నప్పుడు వారివెనుకనుండి కొట్టిన యెడల ఎక్కువ లాభమును సంపాదించుట కవకాశ ముండును. ఎట్టిసందర్భములలో పార్ష్ణిగ్రాహి లాభ మధికముగనుండునో ఈ అధ్యాయము వివరించుచున్నది.

7. సమానబలముతో దాడిచేయువారిద్దరిలో చలనశత్రువుపై దాడిచేయు వానిని వెనుకనుండి కొట్టువాడెక్కువ లాభమును సంపాదించును. 8. ఏలయన, చలనశత్రువుపై దాడిచేయువాడు సులభముగ విజయమును సంపాదించి పార్ష్ణిగ్రాహిని నిర్మూలించవచ్చును; దుర్గమందు స్థిరముగనున్న శత్రువుపై దాడి చేయువా డిట్లు చేయలేడు. 9. ఇట్టివాడు దుర్గముమూలమున నోటమిగాంచి, పార్ష్ణిగ్రాహిపైపడినను దుర్గస్థితుడగు శత్రువుచే వారింపబడును.

10. దీనినుండి ఇంతకు పూర్వముచెప్పిన రాజులవిషయము తెలుసుకొనవలెను.

11. శత్రువులు సమాన బలముగలవారైనప్పుడు ధర్మచింతగలరాజుపై దాడిచేయువానిని వెనుకనుండి కొట్టువా డెక్కువ లాభమును సంపాదించును. 12. ఏలయన, ధర్మచింత గలవానిపై దాడిచేయు రాజును స్వజనము తదితరులు ద్వేషింతురు; అధార్మికునిపై దాడిచేయువానిపట్ల ప్రియముగలవా రగుదురు.

13. దీనినుండి మూలహరుడు, తాదాత్వికుడు, కదర్యుడు[3]—వీరిని వెనుకనుండికొట్టువానివిషయమును తెలుసుకొనవలెను.

14. తమమిత్రులపై దాడిచేయువారిని వెనుకనుండికొట్టు సందర్భములో కూడ నిట్టియుద్దేశములను గుర్తించవలెను.

15. మిత్రునిపై దాడిచేయువాడు శత్రువుపై దాడిచేయువాడు—వీరిద్దరిలో మిత్రునిపై దాడిచేయు వానిని వెనుకనుండి కొట్టువా డెక్కువలాభమును సంపాదించును. 16. ఏలయన, మిత్రునిపైదాడిచేయువాడు సులభముగ విజయమును సంపాదించి వెనుకనుండి కొట్టు పార్ష్ణిగ్రాహిని నిర్మూలించవచ్చును. 17. మిత్రునితోసంధిచేసుకొనుట సులభము; శత్రువుతో సంధిచేసుకొనుట సులభము కాదు.

18. మిత్రుని నిర్మూలము చేయువాడు, శత్రువును నిర్మూలము చేయువాడు—వీరిద్దరిలో శత్రువును నిర్మూలనముచేయువానిని వెనుకనుండి కొట్టువా డెక్కువ లాభమును సంపాదించును. 19. ఏలయన, శత్రువును నిర్మూలముచేసినవాడు మిత్రసహాయమును సంపాదించి పార్ష్ణిగ్రాహిని నిర్మూలముగావించవచ్చును; స్వపక్షమునే నిర్మూలముగావించినవా డట్లు చేయజాలడు.

20. దాడిచేసిన శత్రువులిద్దరు లాభమునుపొందక వెనుకకువచ్చినప్పుడు వారిలో నెవని శత్రువు ఎక్కువ ఆశాభంగమును గాంచెనో, లేదా, ఎక్కువ క్షయ వ్యయముల నెదుర్కొనెనో అట్టివానిని వెనుకనుండి కొట్టువా డెక్కువలాభ

[3] మూలహరు డనగా పెద్దలు సంపాదించిన రాజ్యమును పోగొట్టుకొనువాడు; తాదాత్వికుడనగా భవిష్యత్తునుగూర్చి ఆలోచించనివాడు; కదర్యుడనగా లోభి. వీరినిగురించి 2–9–21–23లో ప్రస్తావించబడినది.

మును సంపాదించును. 21. లేదా, వారిద్దరు లాభమును పొంది వెనుకకు వచ్చి నప్పుడు వారిలో నెవనిశత్రువు లాభముదృష్ట్యాగాని శక్తిదృష్ట్యాగాని హీనుడో వానిని వెనుకనుండికొట్టినవా డెక్కువలాభమును సంపాదించును ; లేదా, ఎవని శత్రువు యాతవ్యుడై యుద్ధములో నెక్కువ నష్టమును కలిగించగలడో, అట్టి వానిని వెనుకనుండికొట్టువా డెక్కువలాభమును సంపాదించును.

22. పార్ష్ణిగ్రాహు లిద్దరిలో తానుద్దేశించిన కార్యసాధనమునకు ఎక్కువబల మును చేకూర్చుకొనువాడు, దుర్గరక్షణము కలవాడు, శత్రువుపార్శ్వమునం దుండి దాడిచేయగలవాడు ఎక్కువలాభమును సంపాదించును. 23. ఏలయన, పార్శ్వమందుండు యాతవ్యునికి సహాయముచేయ సమర్థుడు ; శత్రువు మూలస్థానమునకు బాధను కలిగించగలడు ; వెనుకనుండి కొట్టువాడు మూల స్థానమునకుమాత్రమే ప్రమాదము కలిగించును.

24. (శ్లో) శత్రుకార్యములను నిరోధించగల పార్ష్ణిగ్రాహులు మూడు రకములవారు : వెనుకనుండి కొట్టువారు, రెండుప్రక్కలనుండి కొట్టువారు.

25. (శ్లో) నేతకును (విజిగీషునకును) శత్రువునకును మధ్యనుండు హీనుడు అంతర్ధియని చెప్పబడును ; దుర్గముగాని, పారిపోవుటకు అరణ్యప్రదేశము గాని ఉన్నయెడల అతడు బలవంతుని నిరోధించగలవాడగును.

26. అరి విజిగీషువు లిద్దరు మధ్యముని వశపరుచుకొనగోరి వెనుకనుండి అతనిపైబడినప్పుడు విజయముసాధించివచ్చిన నతనిని అతని మిత్రునినుండి వేరు పరచి ఇదివరకు శత్రువుగనున్నవానిని మిత్రునిగ జేసుకొనగలవా డెక్కువ లాభమును సంపాదించును. 27. శత్రువుగనుండినను సహాయముచేసినవాడు సంధికి అర్హుడగునుగాని మిత్రభావమును విసర్జించిన మిత్రుడు దానికి అర్హుడు కాజాలడు.

28. దీనినుండి ఉదాసీనుని వశపరుచుకొను విషయమును తెలుసుకొనవలెను.

29. "పార్ష్ణిగ్రాహి గ్రహణ సందర్భమందును శత్రువుపై దాడిచేయు సందర్భ మందును దౌత్యయుద్ధము శ్రేయస్కరము. 30. ఏలయన, సైనికయుద్ధములో రెండుపక్షములకు క్షయవ్యయములు కలుగుటచేత ఆదాయమనునది ఉండదు. 31. జయమును సాధించినవాడుకూడ సైన్యమును కోశమును కోల్పోయి పరాజితుని వంటివాడగుచున్నాడు," అని ఆచార్యులు. 32. "కాదు," అని కౌటిల్యుడు. 33. క్షయవ్యయము లత్యధికములైనప్పటికిని శత్రువును నాశము చేయుటయే కర్తవ్యము.

34. క్షయవ్యయములు సమానములైనప్పుడు ఎవడు మొట్టమొదట తన దూష్యసైన్యమును[4] వినాశముగావించి కంటకములను తొలగించుకొని తర్వాత

[4] దూష్యసైన్యమనగా రాజును ద్వేషించిన వారితోకూడిన సైన్యము. అది సర్వదా ప్రమాద కారణము. దానిని నిర్మూలించుట ప్రథమకర్తవ్యము.

వశ్యులగు సైనికుల సహాయమున యుద్ధముసాగించునో, వాడు ఎక్కువ లాభమును సంపాదించును. 35. మొదటనే దూష్యసైన్యమును వినాశముగావించిన వారిద్ద రిలో ఎవడు ఎక్కువ సైన్యమును ఎక్కువ శక్తిగల సైన్యమును ఎక్కువగ ద్వేషించిన సైన్యమును నాశముచేయునో వాడెక్కువ లాభమును సంపాదించును.

36. దీనినుండి శత్రుసైన్యమును ఆటవికసైన్యమును నాశముచేయు విషయమును తెలుసుకొనవలెను.

**37.** (శ్లో) విజిగీషువు పార్ష్ణిగ్రాహుడుగనో, అభియోక్తగనో, యాతవ్యు డుగనో ప్రవర్తించవలసినప్పుడు నేతవిషయమై ఈవిధముగ చేయవలెను.

**38.** (శ్లో) పార్ష్ణిగ్రాహిని తప్పించుటకై వచ్చిన వానితో ఆక్రందుడు తలపడునట్లు పన్నాగము పన్ని నేత తనమిత్రునిపై దాడిచేయు శత్రువును వెనుక నుండి కొట్టవలెను.

39. (శ్లో) ఎదుటనుండి పైనపడునప్పుడు ఆక్రందుని సహాయముతో పార్ష్ణిగ్రాహి నెదుర్కొనవలెను; అదేవిధముగ పార్ష్ణిగ్రాహిమిత్రుని తన ఆక్రంద మిత్రుని సహాయమున నెదుర్కొనవలెను.

40. (శ్లో) ఎదటిభాగమున తనమిత్రుడు అరిమిత్రునితో తలపడునట్లు చేయవలెను; అదేవిధముగ అరిమిత్రుని తనమిత్రునిద్వారా నివారించవలెను.

41. (శ్లో) అభియుక్తుడైనప్పుడు అభియోగము చేసినవానిని మిత్రుని సహాయమున వెనుకనుండి కొట్టవలెను; అటుతర్వాత మిత్రమిత్రుని సాధనమున నాక్రందుని పార్ష్ణిగ్రాహినుండి తప్పించవలెను.

42. (శ్లో) ఇట్లు మిత్రపకృతిసంపదల సాధనమున విజిగీషువు స్వప్రయో జనమునకై ముందుభాగమునను వెనుకభాగమునను రాజమండలము నొకదానిని నిర్మించుకొనవలెను.

43. (శ్లో) మండల మందంతట నతడు దూతలను గూఢపురుషులను నియమించి శత్రువులయెడ మిత్రభావమును చూపుచు పదేపదే వారినికొట్టి తన రహస్యమును రక్షించుకొనవలెను.

44. (శ్లో) రహస్యమును రక్షించుకొనలేనివాని వ్యవహారములు విశిష్ట మగు విజయమును సాధించిన ట్లగుపడినను మహాసముద్రమందలి పడవవలె భగ్నము గాంచును.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు పార్ష్ణిగ్రాహచింత అనే పదమూడో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 14

### ప్రకరణము 118 : హీనశక్తి పూరణము[1]

1. ఇట్లు సామవాయికు లేకమై తనపై దాడిచేసినప్పుడు[2] వారిలో ప్రధాను డగువానితో విజిగీషువు, "నీతో నేను సంధిచేసుకొనెదను ; ఇదిగో హిరణ్యము ; నేను నీకు మిత్రుడ నయ్యెదను. ఇట్లు నీకు రెండువిధముల లాభములు చేకూరును. మిత్రులవలె నటించు శత్రువుల వృద్ధికి తోడ్పడి ఆత్మక్షయము గావించుకొనుట నీకుతగదు ; ఏలయన, వీరు తమశక్తిని వృద్ధిచేసుకొని నిన్నునాశనము చేసెదరు," అని చెప్పవలెను.

2. లేదా, "అపకారమెట్టిదానిని చేయని నన్ను వీరందరు కలిసి ఎట్లు హింసించుచున్నారో, అట్లే వీరందరు ఏకమై నీవు స్వస్థతగాంచినప్పుడుగాని ఆప దలోనున్నప్పుడుగాని నీపై పడెదరు. ఏలయన, బలము చిత్తమునకు వికారము కలిగించును ; కావున, వారిబలమునకు విఘాతము గావింపుము," అనిచెప్పి వారిలో భేదమును కల్పించవలెను.

3. వారిలో విభేదములు పుట్టినతర్వాత నతడు ప్రధానునకు తోడ్పడి అతనిని సామవాయికులతో యుద్ధముచేయునట్లు పురికొల్పవలెను ; లేదా, బలహీను లకు సహాయము చేసి వారిని ప్రధానునిపై యుద్ధము చేయునట్లు పురికొల్పవలెను ; లేదా, తనకు లాభకరమగు వేరొకమార్గము ననుసరించవలెను.

4. లేదా, వారిలో నొకనిని ఇతరులపట్ల విరోధమువహించునట్లుచేసి, వానిని వారినుండి వేరుపరుపవలెను.

[1] శక్తిని పోగొట్టుకొనిన రాజు దానిని తిరిగిసంపాదించుటకు వినియోగించదగు సాధనము లీప్రకరణమున వివరింపబడినవి.

[2] శక్తిని కోల్పోవుటకు శత్రువులనేకులు కలిసివానిపై దాడిచేయుట ఒకముఖ్య కారణము. అట్టిస్థితిలో సామవాయికులమధ్య విభేదములు కల్పించి తనబలమును వృద్ధిచేసుకొనవలెను.

5. లేదా, ప్రధానునకు రహస్యముగ గొప్పలాభమును చూపి. అతని ద్వారా సామవాయికు లందరితో సంధిచేసుకొనవలెను. 6. అటుతర్వాత ఉభయ వేతనులగు గూఢపురుషు లీయధికలాభమును బహిరంగపరచి, "మిమ్ములనందరి నితడు మోసముచేసెను," అనిచెప్పుచు సామవాయికులమనస్సులను కలుషితము చేయవలెను. 7. వారట్లు కలుషితులైన తర్వాత సంధి నతిక్రమించవలెను. 8. అటుపిమ్మట ఉభయవేతనులు, "మేము దీనినేగదా సూచించితిమి," అని చెప్పుచు వారిమధ్య మరింత విభేదమును కల్పించవలెను. 9. వారిలో విభేదము కలిగిన తర్వాత నతడు వారిలో నొకనికి సహాయముచేసి తన కార్యమును సాధించుకొనవలెను.

10. వారిలో ప్రధానుడెవ్వడు లేనప్పుడు సామవాయికులను ప్రేరేపించిన వానిని, తనకార్యములలో పట్టుదలగలవానిని, అనురక్తులగుప్రజలుకలవానిని, లోభమువలనగాని భయమువలనగాని సామావాయికులతో కలిసినవానిని, విజిగీషుని చూచి భయపడువానిని, తనరాజ్యముపట్లగాని మిత్రునిపట్లగాని చలనశత్రువుపట్ల గాని విశేషమగు శ్రద్ధవహించినవానిని వరుసగ నొకనితర్వాత నింకొకనిని వశపరుచుకొనవలెను ; వారిని పురికొల్పిన వానిని ఆత్మార్పణముచేతను, తన కార్యములలో పట్టుదలగలవానిని శాంతియుతముగ ప్రణామముగావించుటచేతను, అనురక్తులగు ప్రజలుకలవానిని కన్యాదానముచేతను కన్యాపరిగ్రహణముచేతను, లుబ్ధుని రెండింతలభాగము నిచ్చుటచేతను, భయపడిన వానిని కోశదండము, లిచ్చుటచేతను, తన్ను జూచి భయపడినవానిని జామీనిచ్చి నమ్మకము కలిగించుట చేతను, రాజ్యముపట్ల శ్రద్ధవహించినవానిని ఐక్యభావముచేతను, మిత్రునియందు బద్ధుడైనవానిని ఉభయులకు ప్రియమును హితమును అగుకార్యములచేతను, లేదా, వారిమూలమున నిదివరలో కలిగిన లాభమును వారికి తిరిగి ఇచ్చివేయుటచేతను, చలనశత్రువును హింసనుమానియు ఉపకారముచేసియు విశ్వాసముకలిగించుట చేతను వశపరచుకొనవలెను. 11. లేదా, వారిలోభేదముకల్పించుటకు ఎట్టిసాధనము మంచిదో దాని నుపయోగించవలెను ; లేదా, ఆపదలగురించిన ప్రకరణమందు వివరింపబడు సామధానభేదదండోపాయములను వినియోగించవలెను.

12. లేదా, ఆపత్తుసంభవించిన కారణముగ తొందరపడవలసివచ్చి నప్పుడు కోశదండముల నిచ్చి దేశకాలకార్యముల నిర్ణయించుకొని సంధిచేసుకొన వలెను. 13, సంధి చేసుకొనినతర్వాత తనబలహీనతను పూరించుకొనవలెను.

14. పక్షమొకటి లేనికారణమున బలహీనుడైనయెడల[3] బంధుమిత్రులతో

---

[3] బలహీనతకు స్వపక్షము లేకపోవుట, మంత్రశక్తి, ప్రభుశక్తి, ఉత్సాహశక్తి క్షీణించుట కారణములు కావచ్చును. అట్టిసందర్భములో కోల్పోయినశక్తిని తిరిగిసంపాదించుసాధనములు 14–29 సూత్రములలో వివరింపబడినవి. ఈ సందర్భములో ప్రజలు, ప్రకృతిసంపదలు, రహదారులు, జలాధారములు మొదలగువాటికిగల ప్రాధాన్య మిచ్చుట వివరింపబడినది.

కూడిన పక్షమొకదానిని సృష్టించుకొనవలెను ; లేదా, దుర్భేద్యమగు దుర్గమును నిర్మించుకొనవలెను. 15. ఏలయన, దుర్గరక్షితుడు, మిత్రరక్షితుడు తనవారి యొక్కయు ఇతరులయొక్కయు గౌరవమునకు పాత్రుడగును.

16. బలహీనతకు మంత్రశక్తి లేకపోవుట కారణమైనయెడల ప్రజ్ఞావంతులగు పురుషులను చేరదీయవలెను ; లేదా, విద్యావృద్ధుల సాంగత్యమును సంపాదించవలెను. 17. ఇట్లు చేసినయెడల సద్యఃఫలమును పొందును.

18. ప్రభావహీనుడు ప్రజల యోగక్షేమములను వృద్ధిచేయ ప్రయత్నించవలెను. 19. సర్వశ్రేయస్సులకు జనపదమే మూలము ; దానినుండి ప్రభావము లభించుచున్నది. 20. ఆపత్కాలములో ప్రభావమునకును తనకును దుర్గమే స్థానము. 21. సస్యములకు జలాధారములు మూలము. 22. ఏలయన, వర్షము వలన సాగుబడికి కలుగు లాభము జలాధారముల మూలమున శాశ్వతమగుచున్నది. 23. శత్రువు నధిగమించుటకు వ్యాపారమార్గము మూలము. 24. సైన్యమును గూఢపురుషులను తరలించుటకు, శస్త్రములు కవచములు యానములు వాహనములు కొనుటకు, అన్నివస్తువుల ప్రవేశనిష్క్రమణములకు వ్యాపారమార్గము సాధనము. 26. యుద్ధోపకరణములకు గనులు మూలము ; ద్రవ్యవనములు దుర్గకర్మలకు, యానములకు, రథములకు మూలము ; హస్తివనములు ఏనుగులకు, మందలు ఆవులకు, గుర్రములకు, గాడిదెలకు, ఒంటెలకు మూలములు. 26. అవి దొరకనప్పుడు బంధుసమూహములనుండి మిత్రసమూహములనుండి వాటిని సంపాదించవలెను.

27. ఉత్సాహహీనుడు శ్రేణులనుండి, చోరగణములనుండి, ఆటవికులనుండి, మ్లేచ్ఛజాతులనుండి, శత్రువుల కపకారముచేయగల గూఢపురుషులనుండి, ప్రవీరపురుషులను యథాలాభముగ సమకూర్చవలెను.

28. లేదా, "పరమిత్రాప్రతీకారము," "ఆబలీయసము," అను ప్రకరణములలో వివరించిన సాధనములను శత్రువుపై ఉపయోగించవలెను.

29. (శ్లో) ఇట్లు పక్షము మంత్రము ద్రవ్యము బలము మొదలగు సంపదలను సమకూర్చుకొని తన్ను అణచుటకు శత్రువులు గావించిన ప్రయత్నముల నెదుర్కొనుటకు తరలి వెళ్ళవలెను.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు హీనశక్తిపూరణము అనే పద్నాలుగో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 15

### ప్రకరణము 119 : బలవంతునితో విగ్రహించి దుర్గములో తలదాచుకొనుటకు హేతువులు

### ప్రకరణము 120 : దండోపనతుని వృత్తి

1. బలవంతునిచే దాడిచేయబడిన బలహీనుడగురాజు[1] వానికంటె బలవత్తరుడును మంత్రశక్తియందతనిని మించినవాడును అగు మరియొకరాజు నాశ్రయించవలెను. 2. మంత్రశక్తియందు సమానులగువారిలో పురుషసంపదగలవాడును వృద్ధసాంగత్యము గలవాడును అధికుడు.

3. బలవత్తరుడు లేనప్పుడు బలవంతునితో సమానమగు బలముకలిగినట్టియు మంత్రశక్తియందుగాని బలమందుగాని అతనిచే నధిగమింపబడనట్టియు రాజులతోగాని సంఘములతోగాని కలిసి యుండవలెను. 4. సమానమగు మంత్రశక్తియు ప్రభుశక్తియు కలవారిలో కార్యబాహుళ్యముకలవా డధికుడు.

5. సమానబలముగలవారు లేనప్పుడు శుచులు ఉత్సాహవంతులు బలవంతునికి విరోధులు అయినట్టియు., మంత్రశక్తి, ప్రభుశక్తి, ఉత్సాహశక్తులలో నతనిచే నదిగమింపబడనట్టియు హీనులతో కలిసియుండవలెను. 6. సమానమగు ఉత్సాహశక్తిగలవారిలో స్వయుద్ధమున కనుగుణమైన భూమికలవా డధికుడు. 7. అట్టిభూమి సమానముగ కలవారిలో స్వయుద్ధమున కనుకూలించు కాలము గలవా డధికుడు. 8. సమానమగు భూమిని కాలానుకూల్యము గలవారిలో బండి పశువులు శస్త్రములు కవచములబట్టి ఆధిక్యము లభించుచున్నది.

[1] బలవంతునిచే దాడిచేయబడిన రాజు బలవత్తరుడగువాని సహాయమునుగాని, సమానబలము గలవారి సహాయమునుగాని, ఈ రెండును లభించనప్పుడు హీనుల సహాయము సంపాదించి యుద్ధము సాగించవలెను. ఇది సాధ్యము కానప్పుడు దుర్గమందు చేరి శత్రువునకు చిక్కులు కలిగించవలెను.

9. సహాయముచేయువారెవ్వరు లేనప్పుడు గొప్పసైన్యముగల శత్రువు కూడ ఎట్టిదుర్గమునకు వచ్చి ఆహారపదార్థములను పశుగ్రాసమును కట్టెలను ఉదకములను అడ్డగించజాలక అట్టిప్రయత్నములో తానే (శత్రువే) క్షయ, వ్యయములపొందునో అటువంటి దుర్గము నాశ్రయించవలెను. 10. సమాన బలముగల దుర్గములలో దేనియందెక్కువ వస్తుసామగ్రియు రక్షణ సౌకర్యము లెక్కువగ నుండునో అది ఆధిక్యముకలదియని చెప్పదగును. 11. ఏలయన, "వస్తుసంపదయు రక్షణసంపదయు పురుషసంపదయుగల దుర్గము కోరదగినది," అని కౌటిల్యుడు.

12. అట్టిదుర్గమును చేరుటకుగల కారణములివి[2] : "నేను పార్ష్ణిగ్రాహునిగాని, ఆసారునిగాని, మధ్యమునిగాని, ఉదాసీనునిగాని నావైపునకు మరల్చుకొన గలను ; సామంతునిచేగాని, అటవికునిచేగాని, దాయాదిచేగాని బంధితుడగు రాజకుమారునిచే గాని శత్రురాజ్యమును పట్టుకొనునట్లును నాశముచేయునట్లును నేను పురికొల్ప గలను ; అతనిని త్యజించవలచినవారికి సహాయముచేసి అతని దుర్గమందును రాష్ట్రమందును స్కంధావారమందును తిరుగుబాటు సంభవించునట్లు చేసెదను ; అతడాసన్నుడైనప్పుడు శస్త్రములను అగ్నిని విషమును మంత్రములను యథేష్టముగ నుపయోగించి అతనిని చంపెదను ; నా రహస్యప్రయోగముల వలన నతనికి క్షయ వ్యయములు కలిగించెదను ; అతనిమిత్రవర్గముగాని సైన్యముగాని క్షయవ్యయప్రవా సములచే బాధగాంచినప్పుడు సమయమును కనిపెట్టి వారినతనిపైకి పురికొల్పి విజయ మును సంపాదించెదను ; అతని సైనిక సామగ్రిని ఆసారబలమును ప్రసారబలమును నాశముచేసి శిబిరములోని అతని సైన్యమును వశపరచుకొనెదను ; నాసైన్యమును తరలించి, అతని సైన్యమందెక్కుడైన నొకరంధ్రమును గావించి నాసర్వసైన్యముతో నతినిపైపడెదను ; అతని ఉత్సాహమంతయు చల్లపడినప్పుడు యథేష్టముగ సంధిచేసుకొనెదను ; అతడు నాతో పోరుచున్నప్పుడు నలుమూలలలో నతనిపై తిరుగుబాటులు సంభవించును ; అసారసైన్యములులేని అతని మూలస్థానమును నామిత్రసైన్యములచేతగాని ఆటవికులచేతగాని దోపిడిచేయించెదను ; దుర్గము, నం దుండి విశాలమగు దేశమునకంతకు యోగక్షేమములు చేకూర్చెదను ; నేనిచటనుండ నలువైపుల చెదరియున్న నాసైన్యములు నామిత్రునిసైన్యములు ఒకచోటచేరి శత్రువున కవిషహ్యము లగును ; నీటిలోను, గోతులలోను, రాత్రులలోను యుద్ధముచేయుట యందు నేర్పుగల నాసైన్యము రహదారుల బాధలనుండి విముక్తిగాంచి శత్రు సైన్యము సమీపించగనే దానినెదుర్కొని కొట్టును ; అనుకూలించని దేశకాలములు

---

[2] దుర్గములో తలదాచు కొనినవాడు సర్వవిధముల తనశత్రువును నాశము చేయుటకై పన్నా గములు పన్నవలెను. ఆపన్నాగము లెట్లుండవలెనో 10వ సూత్రము వివరించుచున్నది. దుర్గమునందు చేరినవాడు యుద్ధమును మానకూడదు. దానిని సాధనాంతరముల ద్వారా సాగించవలెను.

గలవాడై అతడే ఇక్కడికి వచ్చి క్షయ వ్యయముల పొందును ; ఈప్రదేశమంతయు దుర్గములతోడను అడవులతోడను అపసారసైన్యముతోడను కూడినది, విదేశీయులకు రోగముతెచ్చునట్టిది, వారిసైన్యముల వ్యాయామమున కనుకూలించనట్టిది. కావున నవి ఇక్కడికివచ్చుట క్షయ వ్యయములకు కారణమగును. వచ్చిన యెడల ఆపదలు తప్పవు. ప్రవేశించిన తర్వాత నిష్క్రమించుట సాధ్యము కాదు''. (అనునవి కారణములు).

13. ''ఇట్టి కారణములు లేనప్పుడు, లేదా, శత్రువు బలసంపన్నుడైనప్పుడు అతడు దుర్గమును వదలి వెళ్ళిపోవలెను. 14. లేదా, మిడుత అగ్ని లోపడునట్లు (ముందువెనుకలాలోచించక) శత్రువుపై పడవలెను. 15. ఆత్మ విశ్వాసము కోల్పోయినవానికి ఏదియో ఒకటి సిద్ధించును,'' అని ఆచార్యులు 16. "కాదు'' అని కౌటిల్యుడు. 17. శత్రువుతో సంధిచేసుకొనదగిన పరిస్థితు లున్నట్లు తోచినయెడల సంధిని చేసుకొనవలెను. 18. అట్టిపరిస్థితులు లేనప్పుడతడు యుద్ధము చేసి సంధిని కోరవలెను ; లేదా, తప్పించుకొని పారిపోవలెను. 19. సంధి సాధ్యమని తోచినయెడల శత్రువువద్దకు దూతను పంపవలెను. 20. లేదా, అతడే దూతను పంపినయెడల అట్టి దూతను అర్థ మానములతో గౌరవించి. ''ఇవి రాజునకు కానుకలు ; ఇవి నా దేవియు నా కుమాళ్ళు మీదేవికి మీరాజపుత్రులకు నిచ్చు కానుకలు ; ఈ రాజ్యమును, నేనును మీ ఆధీనము." అని చెప్పవలెను.

21. ఆశ్రయమును సంపాదించి సమయాచారిక ప్రకరణమున చెప్పిన విధముగ భర్తయెడల ప్రవర్తించవలెను. 22. దుర్గాధికర్మలను వివాహములలో కన్యల నిచ్చిపుచ్చుకొనుట, రాజపుత్రాభిషేకము, గుఱ్ఱములను కొనుట, ఏనుగులను పట్టుకొనుట, యజ్ఞయాగముల చేయుట, యాత్రలకు విహారములకు వెళ్ళుట—ఈపనులన్నిటి నతని యనుజ్ఞతో చేయవలెను. 23. తన రాజ్యము లోని ప్రకృతులకు సంబంధించిన ఒప్పందములు, తన్నువదలి వెళ్ళిపోయిన వారిపై విధించు శిక్షలు —ఇట్టివన్నిటిని అతని అనుజ్ఞతో చేయవలెను.

24. లేదా, తనపౌరులు తనజానపదులుకూడ విరోధము వహించినయెడల న్యాయ ప్రవృత్తిగలవాడై వేరొకదేశము నియ్యవలసినదిగ కోరవలెను. 25. లేదా, వారిని రాజద్రోహులవలె రహస్యముగ దండించవలెను. 26. ఇయ్యదగిన భూమినికూడ మిత్రునినుండి ప్రతిగ్రహించరాదు.

27. భర్తయగు రాజును చూచుట సాధ్యముకానప్పుడు మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు మున్నగువారిలో నొకనిని చూచి శక్త్యనుసారము వారికి కానుక లియ్యవలెను.

28. దైవతముల పూజించునపుడును స్వస్తివాచనసమయములందును

భర్తను ఆశీర్వదించునట్లు చేయవలెను. 29. తనఆత్మార్పణము సర్వత్ర శ్రేయస్కరమని చెప్పుచుండవలెను.

30. (శ్లో) బలప్రయోగముచే శరణుజొచ్చినవాడు చంచలస్వభావము లేక, స్థిరబుద్ధికలవాడై అధికారులను సేవించుచు శంకితులు మొదలైనవారికి దూరుడై భర్తతోకలిసి ప్రవర్తించవలెను.[3]

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు బలవంతునితో విగ్రహించి దుఃఖముతో తలదాచుకొనుటకు హేతువులు, దండోపనతునివృత్తి అనే పదిహేనో అధ్యాయము.

[3] యుద్ధమందపజయముగాంచి బలవంతుని శరణుజొచ్చిన రాజు ఏవిధముగ ప్రవర్తించవలెనో 20–29–సూత్రములు వివరించుచున్నవి.

# ఏడో అధికరణము

## అధ్యాయము 16

### ప్రకరణము 121 : దండోపనాయివృత్తము[1]

1. సంధిషరతుల కంగీకరించియు చిక్కులుపెట్టుచుండువానిని జయించ దలచిన బలవంతుడగు విజిగీషువు స్వసైన్యముల కనుకూలించు ప్రదేశము కాలము వృత్తి కలిగినట్టియు, పార్ష్ణిగ్రాహిగాని పార్ష్ణిగ్రాహ్యాసారుడుగాని లేనట్టియు, శత్రువునకు రక్షించదగిన దుర్గము లేనట్టియు దిక్కున యానము చేయవలెను. 2. ఇట్టి అనుకూలములులేని సందర్భమున స్వరక్షణకు కావలసిన ఏర్పాటుల నన్నిటిని చేసుకొని యానము చేయవలెను.

3. దుర్బలుల నతడు సామ దానములచేతను, బలవంతులను భేద దండ ములచేతను వశపరచుకొనవలెను. 4. ఉపాయములలో నొకటినిగాని, వైకల్పిక ముగగాని, అన్నిటినిగాని వినియోగించి అనంతర ప్రకృతులను ఏకాంతరప్రకృ తులను వశపరుచుకొనవలెను.

5. గ్రామములందును అడవులలోను నివసించువారి రక్షణ, పశువుల మందలరక్షణ, వ్యాపారమార్గముల రక్షణ, త్యజింపబడినవారిని పారిపోయిన వారిని అపకారముచేసినవారిని వారివారి స్వస్థానములకు చేర్చుట—ఇట్లు సామో పాయము ననుసరించవలయును. 6. భూమిని, ద్రవ్యమును, కన్యలను ఇచ్చియు, అభయ ప్రదానము చేసియు దానోపాయము ననుసరించవలెను. 7. సామంతునిగాని అటవికునిగాని, దాయాదినిగాని, అభిమానమును కోల్పోయిన రాజపుత్రునిగాని వశపరుచుకొని, వారికై కోశమును సైన్యమును భూమిని దాయమును కోరుట భేదోపాయము. 8. ప్రకాశయుద్ధమందుగాని, కూటయుద్ధమందుగాని, మూకయుద్ధ

---

[1] దండము నుపయోగించి వశపరచుకొనిన రాజులపట్ల వశపరచుకొనినవాఁడెట్లు ప్రవ ర్తించవలెనో ఈ అధ్యాయము వివరించుచున్నది.

మందుగాని, దుర్గమును వశపరుచుకొనుటచేతగాని శత్రువును సాధించుట దండో పాయప్రయోగము.

9. ఇట్లు ఉత్సాహవంతులను సైన్యమున కుపచరించు కార్యములందును, ప్రభావవంతులను కోశమున కుపచరించు కార్యములందును, ప్రజ్ఞావంతులను భూమి కుపచరించు కార్యములందును నియోగించవలెను.

10. వీరిలో పణ్యపట్టణములందు, గ్రామములందు, గనులయందు ఉత్పత్తి యగు రత్నములు సారద్రవ్యములు ఫల్గుద్రవ్యములు కుప్యముల సాధనమున గాని, ద్రవ్యవనములందు హస్తివనములందు మందలయందు లభించు యాన వాహనములసాధనమునగాని సహాయముచేయువాడు చిత్రభోగియని[2] చెప్పదగు మిత్రుడు. 11. సైన్యమును కోశమును ఇచ్చి మహోపకారముచేయువాడు మహా భోగియని చెప్పదగుమిత్రుడు. 12. సైన్యమును కోశమును భూమిని ఇచ్చి సహా యము చేయువాడు సర్వభోగియని చెప్పదగు మిత్రుడు.

13. శత్రువును ఒకదిక్కున మాత్రమే ఎదుర్కొని సహాయము చేయు మిత్రుడు ఏకభోగి. 14. శత్రువును అతని ఆసారుని రెండుదిక్కుల నెదుర్కొని సహాయముచేయు మిత్రుడు ఉభయతోభోగి. 15. శత్రువును అతనిఆసారుని పారుగువానిని ఆటవికుని అన్నిదిక్కులనుండి ఎదుర్కొను మిత్రుడు సర్వతోభోగి.

16. పార్ష్ణిగ్రాహియగు ఆటవికుడుగాని, శత్రువు ఉద్యోగులలో ముఖ్యుడు గాని, శత్రువుగాని భూమిదానముచే వశ్యుడగునట్లు తోచినయెడల గుణహీనమగు భూమినిచ్చి అతనిని వశపరచుకొనవలెను. దుర్గస్థునికి మిగులదూరమందుండు భూమిని, ఆటవికునికి జీవనాధారముగ నుపయోగించని భూమిని, శత్రుకులము లోని దాయాదికి ఇచ్చిపుచ్చుకొనుటకు తగినదానిని, రాజాభిమానమును కోల్పో యిన రాజపుత్రునికి శత్రువునుండి వశముచేసుకొనినదానిని, శ్రేణీబలముకలవానికి నిత్యశత్రువులతో కూడినట్టిదానిని, సంహతబలము కలవానికి బలవంతులగు సామంతులతోకూడినదానిని, యుద్ధమునం దెదుర్కొనినవానికి ఈరెండులక్షణ ములతో కూడినదానిని, ఉత్సాహవంతునికి యుద్ధమున కనర్హ మగుదానిని, శత్రు పక్షములోనివానికి బీడుపడినదానిని, (ఇతరులప్రేరేపణవలన) విడిపోయినవానికి నిస్సారమగుదానిని, గతాగతునికి మహాక్షయ వ్యయములతో కూడినదానిని, (శత్రువునుండి) పారివచ్చినవానికి నిరాశ్రయమగుదానిని ఇయ్యవలెను. ఇతరు లెవ్వరు వశముచేసుకొనలేని భూమినిచ్చి శత్రువును స్వాధీనము చేసుకొనవలెను.

17. వీరిలో మహోపకారియు నిర్వికారియు నగువానిని యథాస్థితియం దుంచవలెను. 18. ఇట్టి గుణములులేనివానిని రహస్యముగ చంపవలెను. 19. ఉప

---

2 చిత్రభోగి అనగా రకరకములగు భోగపదార్థముల నిచ్చువాడు.

కారము చేసినవానికి శక్త్యనుసారము ప్రత్యుపకారము చేసి సంతోషపెట్టవలెను. 20. అతడు పడినకష్టముల కనుగుణముగ నతనికి అర్థమానముల నిచ్చి ఆపదల యందు సహాయము చేయవలెను. 21. స్వయముగ వచ్చినవారికి వారిఇష్టాను సారము దర్శనమిచ్చి వారిరాకకు కావలసిన ఏర్పాటుల గావించవలెను. 22. వారిని పరిభవించకూడదు; హింసించరాదు; హేళనచేయకూడదు; వారిపట్ల మితిమీరి మాట్లాడరాదు. 23. వారి కభయదానముచేసి తండ్రివలె ననుగ్రహించవలెను.

24. వీరిలో నెవరైన నపకారము చేసినయెడల వానిదోషమును ప్రకటించి అతనిని బహిరంగముగ చంపవలెను. 25. అట్టి చర్య ఇతరుల నుద్వేగపరుచునని తోచినయెడల "దాండకార్మిక" ప్రకరణమందు చెప్పినట్లుచేయవలెను. 26. చని పోయినవాని భూమిని ద్రవ్యమును పుత్రులను భార్యలను తాను పరిగ్రహించరాదు. 27. అతని కుటుంబములోనివారిని వారికితగిన స్థానములం దుంచవలెను. 28. తన పనులుచేయుచు చనిపోయినవానికుమారుని వానిరాజ్యమందు నిలుపవలెను.

29. ఇట్లు చేసినయెడల తన సైనికబలమునకు లోబడిన రాజు లందరు (దండోపనతులందరు) పుత్రపౌత్రులయెడ అనురాగముతో ప్రవర్తింతురు.

30. ఇట్లుగాక, లోబడిన రాజులను చంపినను, బంధించినను, వారిభూము లను ద్రవ్యములను పుత్రులను భార్యలను పరిగ్రహించదలచినను రాజమండలము భయపడి అతని వినాశమునకు పూనెదరు. 31. వారివారి ప్రదేశములందుండు అతనిఅమాత్యులు భయపడి రాజమండలము నాశ్రయించెదరు. 32. లేదా, వారు స్వయముగ నతని రాజ్యమును, ప్రాణమును హరింపబూనెదరు.

33. (శ్లో) కావున, సామోపాయముద్వారా వారివారి రాజ్యములలో సురక్షి తముగనుండు రాజులు (విజిగీషువగు) రాజుపట్ల అభిమానముకలవారై, అతని పుత్రపౌత్రుల ననుసరించెదరు.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు దండోపనాయివృత్తము అనే పదహారో అధ్యాయము.

# ఏడో అధికరణము

## అధ్యాయము 17

### ప్రకరణము 122 : సంధికర్మ

### ప్రకరణము 123 : సమాధిమోక్షము

1. శమము, సంధి, సమాధి—ఇవి ఒకే అర్థముగల మాటలు. 2. శమము సంధి, సమాధి—వీని యుద్దేశము రాజులలో విశ్వాసము కలిగించుట.

3. "సత్యముమీద శపథముమీద ఆధారపడి చేసుకొనిన సంధి చలసంధి. జామీనుమీద హామీమీద ఆధారపడి చేసుకొనినసంధి స్థిరసంధి," అని ఆచార్యులు. 4. "కాదు," అని కౌటిల్యుడు. 5. సత్యముమీద శపథముమీద ఆధారపడిన సంధికి ఇహలోకమున పరలోకమున స్థిరత్వము చేకూరుచున్నది ; జామీనుమీద హామీమీద ఆధారపడిన సంధికి బలమే ఆధారమగుటచేత ఇహలోకమందు మాత్రమే స్థిరత్వము చేకూరుచున్నది.[1]

6. "మనము సంధిచేసుకొంటిమి," అని సత్యసంధులగు ప్రాచీనకాలపు రాజులు సత్యముపైననే ఆధారపడి సంధి చేసుకొనుచుండువారు. 7. సంధి నతిక్రమింతురను భయముకలిగినప్పుడు వారు అగ్ని, ఉదకము, నాగలిచాలు, దుర్గప్రాకారములోని మట్టిపెళ్ళ, ఏనుగుభుజము, గుఱ్ఱపు పిరుదులు, రథముముందరి భాగము, శస్త్రము, రత్నము, విత్తనము, సుగంధద్రవ్యము, రసము, బంగారము, హిరణ్యము—వీనిని స్పృశించి, "మేము శపథము నతిక్రమించిన యెడల నివి మమ్ము చంపుగాక, లేదా, మమ్ము త్యజించుగాక" అని శపథము

[1] సంధికంగీకరించినట్లు చేసిన వాగ్దానముగాని శపథముగాని సంధికి స్థిరత్వము నిచ్చునా, లేక, జామీనుగాని హామీగాని ఉండవలెనా అనువివాదములో వాగ్దానము శపథములు చాలునని కౌటిల్యుడు, అవి చాలవు, జామీను, హామీ ఉండవలెనని ఆచార్యులు.

చేయువారు.[2]

8. శపథము నతిక్రమింతురను భయమున్నప్పుడు గొప్పవారు, తాప సులు, అధికారముఖ్యులు జామీనుగ నుండుటకు బద్ధులగుటయే జామీను. 9. ఈ సందర్భములో శత్రువు నణచుటకు సమర్థుడగువానిని జామీనుగ సంపాదించినవా డెక్కువలాభమును పొందును. 10. దీనికి విపరీతుడు నష్టపడును.

11. బంధువునుగాని అధికారముఖ్యునిగాని హామీగా గ్రహించుట ఉప గ్రహము. 12. ఈ సందర్భములో దూష్యుడగు నమాత్యునిగాని, దూష్యుడగు సంతానమునుగాని హామీగా నిచ్చువా డెక్కువ లాభమును పొందుచున్నాడు. 13. దీనికి విపరీతుడు నష్టపడును. 14. ఏలయన, హామీ లభించెనని నమ్మకముతో నున్నవాని ఛిద్రములేవియో తెలుసుకొని శత్రువు నిర్భోగమాటముగ నతనిపై దెబ్బతీయును.

15. సంతానమును హామీగానిచ్చినప్పుడు పుత్రుని నియ్యక పుత్రిక నిచ్చిన వా డెక్కువలాభమును పొందును. 16. ఏలయన, పుత్రిక వారసురాలు కాజాలదు ; ఆమె ఇతరులకుమాత్రమే ఉపయోగించునట్టిది ; ఆమెను బాధించుటకూడ సులభ సాధ్యము కాదు. 17. పుత్రునిస్థితిదీనికి విరుద్ధము.

18. పుత్రులిద్దరిలో ఔరసుని ప్రాజ్ఞుని శూరుని అస్త్రవిద్యలనేర్చినవానిని ఏకపుత్రుని హామీగాఇచ్చువాడు నష్టపడును. 19. దీనికి విరుద్ధుని ఇచ్చువాడు లాభము పొందును. 20. ఔరసుడు దాయమున కర్హుడగుటచేతను వంశమును నిలుపువాడగుటచేతను అనౌరసునే హామీగ నియ్యవలెను ; మంత్రశక్తికి లోపము కలుగునుగనుక ప్రాజ్ఞునికంటె నప్రాజ్ఞుని నిచ్చుటయే మంచిది ; ఉత్సాహశక్తికి లోపము కలుగునుగనుక శూరునికంటె నశూరుని నిచ్చుటయేమంచిది ; దెబ్బ తీయుటకు లోపము కలుగునుగనుక కృతాస్త్రునికంటె నకృతాస్త్రుని నిచ్చుట మంచిది ; అపేక్షకు లోపము కలుగునుగనుక నేకపుత్రునికంటె ననేకపుత్రు లలో నొకని నిచ్చుట మంచిది.

21. ఒకపుత్రు డౌరసుడుగను మరియొకడు ప్రాజ్ఞుడుగ నున్నప్పుడు అప్రాజ్ఞుడగు నౌరసునే రాజ్యాధికారము వరించును ; ఔరసుడు కాకపోయినను ప్రాజ్ఞునికి మంత్రాధికారముండును. 22. కాని, మంత్రాధికారవిషయములో కూడ

[2] చేసినవాగ్దానమునుగాని శపథమునుగాని తప్పినయెడల నిహలోకమం దపకీర్తి పాలగుటయు, పరలోకమున నరకబాధ పొందుటయు తప్పదనుభయ ముండుటచేత జామీనుగాని హామీగాని అవసరము లేదని కౌటిల్యుని మతము. కాని, సంధిని చేసుకొనినవారు దీనితో తృప్తిపొందక జామీనుగాని హామీగాని కోరుచుండువారు. అట్టి సందర్భములో ఎవనిని హామీగా శత్రువువద్దకు పంపుట అను విషయము ప్రాధాన్యము గాంచును. దానినిగురించిన వివిధ విషయము లందు వివరింపబడినవి.

వృద్ధసాంగత్యము మూలమున ఔరసుడు ప్రాజ్ఞతను సంపాదించి ప్రాజ్ఞు నధిగమించగలడు.

**23.** ఒకపుత్రుడు ప్రాజ్ఞుడుగను మరియొకడు శూరుడుగ నున్నప్పుడు శూరుడు కాకపోయినను ప్రాజ్ఞుడుగనున్నవానికి బుద్ధికుశలతఅవసరమగు కార్యములు సాధ్యమగును; అప్రాజ్ఞుడైనను శూరునికి విక్రమమవసరమగు కార్యములు సాధ్యములగును. **24.** శౌర్యమువిషయములోకూడ వేటకాడు ఏనుగును అధిగమించునట్లు ప్రాజ్ఞుడు శూరుని అధిగమించగలడు.

**25.** ఒకపుత్రుడు శూరుడుగను మరియొకడు కృతాస్త్రుడుగనున్నప్పుడు శూరుడగువాడు కృతాస్త్రుడు కాకపోయినను శౌర్యమవసరమగు కార్యములను సాధించగలడు; అస్త్రవిద్యలనేర్చినవాడు శూరుడుకాకున్నను లక్ష్యములను కొట్టుటకు సమర్థు డగును. **26.** లక్ష్యమును కొట్టువిషయములోకూడ స్థైర్యమువలనను ప్రతిపత్తివలనను జాగరూకతవలనను శూరుడు కృతాస్త్రుని అధిగమించగలడు.

**27.** అనేకపుత్రులు, ఏకపుత్రుడు కలరాజు లిద్దరిలో అనేకపుత్రులుకల వాడొకనిని హామీగనిచ్చి, తక్కినపుత్రులసహాయముతో సంధి నతిక్రమించగలవాడగును; ఏకపుత్రుడుగల రాజున కిది సాధ్యము కాదు.

**28.** సర్వస్వమగు పుత్రునిచ్చి సంధి చేసుకొనవలసి వచ్చినప్పుడు పుత్రునికి సంతానముండుట విశేషము. **29.** అట్టిసంతానలాభము సమమైనప్పుడు మరికొంత సంతానమును కనగలశక్తినిబట్టి విశేష మేర్పడుచున్నది. **30.** అట్టి శక్తి సమముగ నున్నప్పుడు త్వరలో సంతానము కలుగువాని కెక్కువ లాభము.

**31.** శక్తిసంపన్నుడగు పుత్రుడొక్కడే ఉన్నప్పుడు, తనకు సంతానయోగ్యతలేని పరిస్థితిలో తానే హామీగ వెళ్ళవలెనుగాని ఏకపుత్రుని హామీగ నియ్యరాదు.

**32.** తనబలమును వృద్ధిచేసుకొని సమాధిమోక్షము (హామీలో ఉన్నవాని విడుదలను) గావించవలెను.[3]

**33.** కారువులయు శిల్పులయు వేషములుధరించిన గూఢపురుషులు రాజపుత్రునికి సమీపమందు కార్యములు గావించుచు రాత్రిపూట సురంగమార్గమునొకదానిని త్రవ్వి అతని నపహరించవలెను.

**34.** లేదా, నటులు, నర్తకులు, గాయనులు, వాదకులు, వాగ్జీవనులు, కుశీలవులు, ప్లవకులు, సౌభికులు—పూర్వమే నియమింపబడినవారై—శత్రువును కొలిచియుండవలెను. **35.** వారొకరితర్వాత మరియొకరుగ రాజకుమారుని

---

[3] పుత్రుని హామీగా పంపించినను, వానిని విడుదలచేయుటకు సర్వవిధముల ప్రయత్నించవలెను. ఇవిఅన్నియు మోసముతో కూడినట్టివి. ఎన్నెన్ని విధములుగ మోసముచేయుట సాధ్యమో ఈ ప్రకరణము వివరించుచున్నది. మోసముచేయుట రాజనీతికి విరుద్ధముకాదు.

సేవించుచుండవలెను. 36. అతడు వారికి కాలముతో నిమిత్తములేని ప్రవేశస్థాన నిష్క్రమముల కనుజ్ఞ నియ్యవలెను. 37. తర్వాత వారిలో ఒకనివేషమును ధరించి రాత్రిపూట తప్పించుకొని వెళ్లిపోవలెను. 38. వేశ్యల వేషములోను భార్యల వేషములోను ఉండువారిని గురించి దీనినుండి గ్రహించవలెను.

39. లేదా, అతడు వారి తూర్యవాద్యములపెట్టెలను మోసుకొని వెళ్ళిపోవలెను.

40. లేదా, వంటవాండ్రు, నౌకర్లు, స్నానముచేయించువారు, ఒళ్ళుపట్టువారు, పడకలు వేయువారు, మంగళ్ళు, ఆభరణముల తొడుగువారు, ఉదకపరిచారికలు, ద్రవ్యభాండములు, వస్త్రభాండములు, ఇతరద్రవ్యములు, పతకలు, పీటలు మొదలగువాని నుపయోగించి బయటికి తీసుకొని వెళ్ళునప్పుడు రాజకుమారునికూడ బయటికి తీసుకొని వెళ్ళవలెను.

41. లేదా, అతడుపరిచారకునివేషముధరించి, ఆనవాలుపట్టుటకుసాధ్యముకాని కాలమందు వెళ్ళిపోవలెను ; లేదా, దైవపూజ అను మిషతో రాత్రిపూట సురంగముద్వారా వెళ్ళిపోవలెను. 42. లేదా, జలాశయమున వరుణయోగము నభ్యసించవలెను.

43. లేదా, వర్తకులవేషమును ధరించినగూఢపురుషులు పక్వాన్నఫలములను విక్రయించువారై కావలివాండ్రకు విషముపెట్టవలెను.

44. లేదా, దేవతలకు నైవేద్యములు, పితరులకు శ్రాద్ధములు, సంతర్పణలు మొదలగు సమయములందు మదనరసముతోగాని విషముతోగాని కలిసిన అన్నపానములను రసములను కావలివాండ్రకిచ్చి పారిపోవలెను ; లేదా, కావలివాండ్రను మత్తుపెట్టి పారిపోవలెను.

45. లేదా, విలాసపురుషులు, కుశీలవులు, వైద్యులు, పిండివంటలు విక్రయించువారు—వీరివేషములు ధరించినగూఢపురుషులు రాత్రిపూట ధనికుల ఇండ్లకుగాని కావలివాండ్రఇండ్లకుగాని నిప్పుపెట్టవలెను. 46. లేదా, వర్తకవేషధారులు వర్తకస్థానమునకు నిప్పుపెట్టవలెను. 47. లేదా, తాను నివసించు ఇంటిలోపల నొకశవమును పడవేసి, పారిపోవు తన్ను వెంటనంటకుండ జేసుకొని, ఇంటికి నిప్పుపెట్టవలెను. 48. అటుతర్వాత గోడలో నొకకన్నముద్వారాగాని కాలువద్వారాగాని సురంగముద్వారాగాని వెళ్లిపోవలెను.

49. లేదా, కావడికుండలలో సామగ్రినిపెట్టుకొని దానిని మోయువాని వేషముధరించి రాత్రిపూట వెళ్ళిపోవలెను.

50. లేదా, ముండులయు జటిలులయు ప్రవాసప్రదేశములు ప్రవేశించి, వారిలో నొకరివేషమునుధరించి రాత్రిపూట వెళ్ళిపోవలెను ; లేదా, వారిలో నొకరి

సహాయముతో తనరూపమును మార్చుకొని వ్యాధితునివలెగాని ఆటవికునివలె గాని వెళ్ళిపోవలెను.

51. లేదా, ప్రేతమువలెకనిపించి గూఢపురుషులచే బయటికి మోసుకొని పోబడవలెను. 52. లేదా, స్త్రీ వేషముధరించి ప్రేతముతో వెళ్ళుగుంపు ననుసరించ వలెను.

53. వనచరుల వేషమును ధరించిన గూఢపురుష లతనిని పట్టుకొనుట కొక దిక్కునుండివచ్చు రాజభృత్యులను మరియొకదిక్కువైపు వెళ్ళునట్లు చేయ వలెను. 54. అప్పు డతడు మరియొకవైపు వెళ్ళవలెను. 55. లేదా, బండ్లవారి బండ్లసముదాయముద్వారా తప్పించుకొనిపోవలెను.

56. వెంబడించువారు సమీపమునకు వచ్చినప్పు డతడు దాగుకొనవలెను. 57. దాగుకొనుటకు స్థలము దొరకనప్పుడు దారికి రెండువైపుల హిరణ్యమును గాని విషముతోగూడిన తినుబండారములుగాని వెదజల్లవలెను. 58. అటుతర్వాత మరియొక దిక్కుగ వెళ్ళిపోవలెను.

59. పట్టుబడినయెడల పట్టుకొన్నవారిని మంచిమాటలద్వారాగాని మరి యొకవిధమునగాని విషముతోకూడిన తినుబండారముల సాధనమునగాని మోసము చేయవలెను.

60. లేదా, వారుణ యోగ సమయమునగాని అగ్నిప్రయోగ సమయమున గాని ప్రేతశరీర మొకదాని నక్కడపెట్టి "నీవు నాకుమారుని చంపితివి," అని శత్రువుపై నిందను మోపవలెను.

61. (శ్లో) లేదా, రహస్యముగ శస్త్రములను సంపాదించి, రాత్రిపూట కావలివాండ్ర నటకాయించి, వడిగ పరుగెత్తగల గుర్రములనెక్కి గూఢపురుషులతో కలిసి పారిపోవలెను.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు సంధికర్మ సమాధిమోక్షము అనే పదిహేడో అధ్యాయము.

## అధ్యాయము 18

### ప్రకరణము 124 : మధ్యమచరితము

### ప్రకరణము 125 : ఉదాసీనచరితము

### ప్రకరణము 126 : మండలచరితము

1. మధ్యముని విషయము విజిగీషునికి మూడవ అయిదవ ప్రకృతులు మిత్రప్రకృతులు.[1] 2. రెండవ, నాల్గవ, ఆరవప్రకృతులు శత్రుప్రకృతులు.[2]

3. మధ్యము డీరెంటికి సహాయము చేయువాడైనయెడల విజిగీషువు మధ్యమునిపట్ల సుముఖుడుగ నుండవలెను. 4. ఎవరికిని సహాయముచేయని యెడల విజిగీషువు మిత్రప్రకృతుల కనుకూలుడుగ నుండవలెను.

5. మధ్యముడు విజిగీషునియొక్క మిత్రభావముగలమిత్రుని పట్టుకొనుటకు ప్రయత్నించినయెడల మిత్రమిత్రులను తనమిత్రులను అతనిపైకి లేవదీసియు తనమిత్రులనతనినుండి విడదీసియు నతనిని (మిత్రుని) రక్షించవలెను. 6. లేదా, "ఈమధ్యము డత్యధికముగ వృద్ధిగాంచి మనలనందరిని నాశముచేయ సమకట్టియున్నాడు; మనమందరము కలసి అతని యాత్రకు విఘ్నము కలిగించ వలెను," అని మండలమునంతను ప్రోత్సహించవలెను. 7. మండలము దీనికి సమ్మతించినయెడల నతడు మధ్యము నోడించి తనశక్తిని వృద్ధిచేసుకొనవలెను. 8. మండలము దీనికి సమ్మతించని యెడల కోశదండములతో మిత్రునికి సహాయముచేసి, మధ్యముని ద్వేషించిన రాజులనేకులలో ఎవరు పరస్పరము సహాయము చేసుకొనుచున్నారో, వారిలో ఎవనిని వశపరచుకొనిన యెడల తక్కినవారు వశపడెదరో, ఎవరు పరస్పరము శంకించుకొని తిరుగు

[1] మిత్రుడు, మిత్రమిత్రుడు.

[2] అరి, అరిమిత్రుడు, అరిమిత్రమిత్రుడు.

బాటుచేయుటకు వెనుదీయుచున్నారో—ఇట్టివారిలో ప్రధానునిగాని, అనన్యునిగాని సామదానములచే చేరదీసుకొనవలెను. 9. ఇట్లు ద్విగుణుడై రెండవవానిని, త్రిగుణుడై మూడవవానిని, చేరదీసుకొనవలెను. 10. ఇట్లు తనశక్తినివృద్ధి చేసుకొని మధ్యమునణచవలెను. 11. లేదా, దేశకాలములు దాటిపోయిన (ప్రతికూలములైన) యెడల మధ్యమునితో సంధిచేసుకొని మిత్రునికి సహాయ పడవలెను ; లేదా, (మధ్యముని) దూష్యులగు అధికారులతో కర్మసంధి చేసుకొన వలెను.

12. తనమిత్రులలో బలహీనుడు కాదగినవానిని మధ్యముడు పట్టుకొను టకు ప్రయత్నించినయెడల, "నేను నిన్ను రక్షించెదను," అని చెప్పి అతడు బలహీను డగువరకు కాలయాపనము చేయవలెను. 13. బలహీనుడైన తర్వాత నతనిని రక్షించవలెను.

14. తనమిత్రులలో నిర్మూలించదగినవానిని మధ్యముడు పట్టుకొనుటకు ప్రయత్నించినయెడల నతడు బలహీనుడైనతర్వాత నతనిని రక్షించవలెను ; (రక్షించనియెడల) మధ్యము డత్యధికముగ వృద్ధిగాంచు భయమేర్పడును. 15. నిర్మూలుడైనయెడల నతడు మరియొకని నాశ్రయించకుండునట్లతనికి భూమి నిచ్చి తన యధీనము లోనికి తెచ్చుకొనవలెను.

16. బలహీనులుకాదగినట్టియు నిర్మూలింపదగినట్టియు తనమిత్రులు మధ్యమునికి సహాయముచేయునెడల, మరియొకని సాధనమున సంధి చేసుకొన వలెను. 17. లేదా, వీరిద్దరి మిత్రులు విజిగీషు నణచుటకు సమర్థులైనయెడల నతడు మధ్యమునితో సంధిచేసుకొనవలెను.

18. మధ్యముడు (విజిగీషుని) శత్రువును పట్టుకొనుటకు ప్రయత్నిం చిన యెడల నతనితో సంధిచేసుకొనవలెను. 19. ఇట్లుచేసినయెడల తనకు లాభము చేకూరును ; మధ్యముడుకూడ సంతోషించును.

20. మధ్యముడు మిత్రభావముగల స్వమిత్రుని పట్టుకొన ప్రయత్నిం చిన యెడల మరియొకని సాధనమున సంధి చేసుకొనవలెను. 21. లేదా, విజిగీషుని మాటలపట్ల గౌరవముకలవాడైనయెడల, "మిత్రుని నిర్మూలనము నీకుతగదు," అనిచెప్పి అతనిని వారించవలెను. 22. లేదా, "అతడు స్వపక్షమునే వధించుటను చూచి మండల ముద్రేకము చెందుగాక," అని అనుకొనుచు ఉపేక్షించి యుండవలెను.

23. తన శత్రువును పట్టుకొనుటకు మధ్యముడు ప్రయత్నించిన యెడల రహస్యముగ నతనికి కోశదండముల నిచ్చి సహాయము చేయవలెను.

24. మధ్యము డుదాసీనుని పట్టుకొన దలచినయెడల, "ఉదాసీనునినుండి ఇతడు విడిపోవుగాక," అని అనుకొని అతనికి సహాయము చేయవలెను. 25. మధ్య

మోదాసీనులలో మండలము ఎవరి నభిమానించునో అతనినే తానుగూడ అభిమానించ వలెను.

26. మధ్యమచరితమునుండి ఉదాసీనచరితమును తెలుసుకొనవలెను.

27. ఉదాసీనుడు మధ్యముని పట్టుకొనుటకు ప్రయత్నించినప్పుడు తానెవని పక్షము వహించినయెడల తన శత్రువునకు నష్టమును, మిత్రునికి లాభమును కలుగునో అతని పక్షమును వహించవలెను; లేదా, ఉదాసీనుడు తనకు సైనిక సహాయము చేయునట్లు ప్రవర్తించవలెను.

28. ఇట్లు తన బలమును వృద్ధిచేసుకొని అరిప్రకృతిని బలహీనపరచి మిత్ర ప్రకృతికి బలమును సమకూర్చవలెను.

29. పొరుగురాజ్యములు పాలించువారందరు శత్రుభావము కలవారైనప్పటి కిని[3] (ముందుండు) అనాత్మవంతుడును సర్వదా అపకారము చేయువాడును అగు శత్రువు, ముందుండువానితో కలిసిన పార్ష్ణిగ్రాహియగు శత్రువు, వ్యసని యగుటచే యాతవ్యుడగు శత్రువు, ఆపదల యందుండు నేతపై దాడిచేయు శత్రువు—వీరు శత్రుభావముకల శత్రువులు; ఒకేసమానమగు ప్రయోజనమును సాధించుటకు యానముచేయువాడు, భిన్నప్రయోజనమును సాధించుటకు యానముచేయువాడు, సైనికబలముతో కలిసి యానముచేయువాడు, సంధిచేసుకొనిన తర్వాత యానము చేయువాడు, స్వప్రయోజనమునకై యానముచేయువాడు, నేతతో కలిసి కార్యోన్ముఖుడైనవాడు, ద్వైధీభావము నాశ్రయించి కోశమునుగాని దండమునుగాని విక్రయించువాడు, లేదా, కొనువాడు—వీరు మిత్రభావముగల శత్రువులు; బలవంతుని కాటంకము కలిగించునట్లుగాని బలవంతు లిద్దరిమధ్యనుగాని ఉన్నట్టి సామంతుడు (అంతర్ధి); బలవంతునికి పార్ష్ణిగ్రాహిగనుండు సామంతుడు, స్వయముగగాని ప్రతాపకారణమునగాని దండోపనతుడగు సామంతుడు — వీరు భృత్యభావముగల శత్రువులు. 30. వీరినుండి భూమ్యేకాంతరు లగువారిని గురించి తెలుసుకొనవలెను.

31. (శ్లో) తాను శత్రువుతో విరోధించినప్పుడు తనతోకలిసి ఏకార్థమును సాధించుటకు సంసిద్ధుడగు మిత్రునికి శత్రువు నెదుర్కొనుటకు కావలసినంత శక్తి సహాయమును (విజిగీషువు) చేయవలెను.

32. (శ్లో) శత్రువును సాధించిన తర్వాత తన మిత్రుడు తన్ను మించిపోయిన యెడల నతనికి సామంతునితోను ఏకాంతరునితోను విరోధము కలుగునట్లు పన్నాగము పన్నవలెను.

---

[3] పొరుగురాజ్యములను పాలించువారందరు శత్రువులే. కాని, వారి పరిస్థితులనుబట్టి వారిలో తరతమభావము లేర్పడుచున్నవి. వారిని శత్రుభావముగల శత్రువులని, మిత్రభావముగల శత్రువులని, భృత్యభావముగల శత్రువులని మూడు వర్గములుగ కౌటిల్యుడు విభజించినాడు.

**33.** (శ్లో) లేదా, అతని రాజ్యమును దాయాదులలో నొకడుగాని బంధితుడగు రాజపుత్రుడుగాని ఆక్రమించునట్లు చేయవలెను; లేదా, చేసిన ఉపకారమును గుర్తించి తన అధీనములో నుండునట్లు చేయవలెను.

**34.** (శ్లో) బలమును కోల్పోయిన కారణమున తనకు సహాయము చేయ నట్టియు, లేదా, శత్రుపక్షము వహించునట్టియు మిత్రుని అర్థశాస్త్రవిదుడు బలవంతునిగ గాని బలహీనునిగగాని చేయరాదు.

**35.** (శ్లో) స్వప్రయోజనార్థము సందిచేసుకొను చలనమిత్రుని విషయములో నతడు చలించి వెళ్ళిపోవుటకు కారణ మేదియో తెలుసుకొని, అతడు చలించకుండు నట్లు చేసుకొనవలెను.

**36.** (శ్లో) తనయందును తన శత్రువునందును మిత్రత్వము వహించిన శఠుడగు మిత్రుని శత్రువునుండి విడదీసి, నిర్మూలము గావించి, అటుతర్వాత శత్రువును నిర్మూలించవలెను.

**37.** (శ్లో) ఉదాసీనత్వము వహించిన మిత్రునికి సామంతులతో విరోధము సంభవించునట్లు చేయవలెను; అటుతర్వాత యుద్ధములో నతడు శక్తిని కోల్పోయి నప్పుడు కొంత ఉపకారముచేసి తన వశములోనికి తెచ్చుకొనవలెను.

**38.** (శ్లో) బలహీనుడగు తన మిత్రుడు సహాయార్థమై శత్రువునుగాని విజిగీషువునిగాని చేరదలచినపుడు వానికి సైనిక సహాయము గావించి తన్ను వదల కుండ జేసుకొనవలెను.

**39.** (శ్లో) లేదా, అతనిని వాని రాజ్యమునుండి తొలగించి, తనకు సైనిక సహాయముచేసిన మరియొక మిత్రుని కారాజ్యము నిచ్చి, వానిని మరియొక ప్రదేశ మందుండునట్లు చేయవలెను.

**40.** (శ్లో) అపకారముచేయ సమర్థుడైనట్టియు, ఉపకారము చేయగల వాడైనను ఆపదలలో నుపకారము చేయనట్టియు మిత్రుని తన్ను నమ్మి తన వశము లోనికి వచ్చిన తర్వాత నిర్మూలనము గావింపవలెను.

**41.** (శ్లో) ఆపదలయందు చిక్కుకొనిన తన మిత్రునిపైకి శత్రువు చెలరేగి నప్పుడు మిత్రునికి సహాయముచేసి అతనిద్వారానే శత్రువును హతమార్చవలెను.

**42.** (శ్లో) శత్రువునకు సంభవించిన ఆపదమూలమున వృద్ధిగాంచిన మిత్రుడు తనపై విరోధించినపుడు శత్రువు ఆపదకు ప్రతీకారము గావించి వానిద్వారముననే అతనిని హతమార్చవలెను.

**43.** (శ్లో) అర్థశాస్త్రవిదుడగువాడు వృద్ధి క్షయము స్థానము కర్శనము ఉచ్ఛేదనము మొదలగు ఉపాయముల నన్నటిని వినియోగించవలెను.

**44.** (శ్లో) ఇట్లు షాడ్గుణ్య మన్యోన్యాశ్రయమని తెలుసుకొనినవాడు బుద్ధి

అనే సంకెళ్ళతో రాజులను బంధించి తన ఇష్టానుసారము వారితో క్రీడించగలవాడగును.

ఇది షాడ్గుణ్యమను ఏడో అధికరణమందు మధ్యమ చరితము, ఉదాసీన చరితము, మండల చరితము[4] అనే పద్దెనిమిదో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు షాడ్గుణ్యమను ఏడో అధికరణము సమాప్తము.

---

[4] విజిగీషువు మధ్యముని పట్ల, ఉదాసీనుని పట్ల, రాజమండలము పట్ల ప్రవర్తించవలసిన విధాన మీ అధ్యాయమందు వివరింపబడినది.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## ఎనిమిదో అధికరణము

## వ్యసనాధికారికము

### అధ్యాయము 1

### ప్రకరణము 127 : ప్రకృతి వ్యసనవర్గము[1]

1. ఏకకాలమందు వ్యసనములు (ఆపదలు) సంభవించినయెడల యానము చేయుట మంచిదా, లేక, (దుర్గమునజేరి) రక్షించుకొనుట (స్థానము) మంచిదా అని వితర్కించుటయే వ్యసనచింత.

2. ప్రకృతికి సంభవించు ఆపద దైవికము కావచ్చును; మానుషము కావచ్చును; అనయముగాని అపనయముగాని దానికి మూలము.

3. విరుద్ధములగు గుణము లుండుట, గుణములు లేకపోవుట, విపరీతమగు దోషము, ప్రసంగము, పీడ—ఇవి వ్యసనములు. 4. శ్రేయస్సునుండి మనుష్యుని తొలగించునది గనుకనే వ్యసనమనుపేరు సార్థకమగుచున్నది.[2]

5. "రాజు, అమాత్యుడు, జనపదము, దుర్గము, కోశము, సైన్యము, మిత్రుడు—వీనిని వ్యసనములు పట్టుకొనినపుడు వెనుకవాని వ్యసనములకంటె ముందుండువాని వ్యసనములు వరుసగ నెక్కువ ప్రమాదకరములు," అని

---

[1] ప్రకృతు లేడింటిలో నొక్కొక్కదానికి ఎట్టి గుణసంపద యుండవలెనో మండలయోని అనే ఆరో అధికరణము మొదటి అధ్యాయమందు వివరింపబడినది. ఆ సంపదలు లేకుండుటయే వ్యసనము. ప్రకృతులకు సంభవించు ఆపదలే అవి. అట్టి వ్యసనములను (ఆపదలను) వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణము వివరించుచున్నది.

[2] వ్యసన మనగా "వ్యస్యతి = తొలగించునది" అని అర్థము.

ఆచార్యులు.[3]

6. "కాదు," అని భారద్వాజుడు. 7. "రాజును పట్టుకొనిన వ్యసనముల కంటె నమాత్యుని పట్టుకొనినవి ఎక్కువ ప్రమాదకరములు. 8. ఆలోచన (మంత్రము,) ఆలోచనఫలమును సంపాదించుట, కార్యములను కొనసాగించుట, ఆయ వ్యయములకు సంబంధించిన పనులు, దండనమును విధించుట, శత్రువులను ఆటవికులను నిరోధించుట, రాజ్యరక్షణము, ఆపదలకు ప్రతీకారము చేయుట, రాజపుత్రుల రక్షణము, రాజ్యాభిషేకము—వీటి కన్నిటికి మంత్రులే ఆధారము.[4] 9. మంత్రులు లేనప్పుడు ఇవికూడ లేనట్లే; రెక్కలుఛేదింపబడిన పక్షివలె రాచకార్యములన్నియు నిలబడిపోవును. 10. అమాత్యవ్యసనములమూలమున శత్రువులకుట్రలు వృద్ధిగాంచును. 11. రాజున కాసన్నముగనుండు అమాత్యులు విరోధులైన యెడల రాజుప్రాణమునకే ప్రమాదము."

12. "కాదు," అని కౌటిల్యుడు. 13. మంత్రి పురోహితాది భృత్యులను నియమించువాడు, అధ్యక్షుల కార్యములనుశాసించువాడు, ప్రకృతులకు సంభవించు పురుషవ్యసనములకు ద్రవ్యసంపదలను ప్రతీకారము చేయువాడు, పురుష సంపదలను ద్రవ్యసంపదలను వృద్ధిచేయువాడు రాజు. 14. అమాత్యుల కాపదలు సంభవించినయెడల ఆపదలకుపాలుగాని ఇతరుల నత డమాత్యులుగ నియమించును. 15. అతడెల్లప్పుడు పూజ్యులను పూజించుటయందును ద్రోహము చేయువారిని పట్టుకొనుటయందును జాగరూకతగలవాడు. 16. రాజు గుణసంపన్నుడైనచో తక్కిన ప్రకృతులకుకూడ సంపదలు చేకూర్చగలవాడగును. 17. తక్కినప్రకృతుల వృద్ధిక్షయము లతని ఆధీనమందుండుటచేత నత డెట్టి శీలముగలవాడో అట్టి శీలమే వాటికిని ప్రాప్తించును. 18. ఏలయన, అన్నిటికి మకుట స్థానమందుండువాడు రాజు.

19. "అమాత్యులకు జనపదమునకు సంభవించు ఆపదలలో జనపదమునకుసంభవించునవి ఎక్కువ ప్రమాదకరములు," అని విశాలాక్షుడు. 20. కోశము, సైన్యము, కుప్యము, విష్టి, వాహనములు, వస్తుసామగ్రి—ఇవి జనపదమునుండి లభించును. 21. జనపదము లేనప్పుడు ఇవికూడ లేనట్టే; ఆటుతర్వాత రాజు అమాత్యులుకూడ లేకపోవుదురు.

22. "కాదు," అని కౌటిల్యుడు. 23. జనపదములో ప్రారంభింపబడిన కార్యములసిద్ధి, స్వజనమునుండియు శత్రుజనమునుండియు ప్రమాదములు సంభ

[3] ఏడు ప్రకృతులలో నొక్కొక్కదానికి ఆపదలు సంభవించవచ్చును. అట్టి పరిస్థితిలో ఏ ప్రకృతికి సంభవించు ఆపదలు రాజ్యమున కెక్కువ ప్రమాదకరములు అనే విషయ మీ అధ్యాయమందు చర్చించబడినది.

[4] ప్రధానామాత్యుని కర్తవ్యములిచట వివరింపబడినవి.

వించకుండ జనపదమునకు యోగక్షేమముల చేకూర్చుట, ఆపదలకు ప్రతీకారము గావించుట, శూన్యప్రదేశములలో నివేశనములను స్థాపించి వృద్ధిచేయుట, దండములనుండియు పన్నులనుండియు లాభము సమకూర్చుట—ఇట్టిపన్నులన్నిటికి అమాత్యులే మూలము.

24. "జనపదమునకు దుర్గమునకు సంభవించు ఆపదలలో దుర్గమునకు సంభవించునవి ఎక్కువ ప్రమాదకరములు," అని పారాశరులు. 25. "ఏలయన, కోశదండములకు దుర్గము ఉత్పత్తిస్థానము; అపత్కాలములో జనపదమందలి ప్రజలకు రక్షణస్థానము. 26. జానపదులకంటె పురవాసు లెక్కువ శక్తిమంతులు; అపత్కాలమందు భక్తిస్థైర్యముకలవారై రాజున కెక్కువ సహాయము చేయగలరు. 27. జానపదులట్టుగాక (తమరాజుతో) సమానముగ శత్రురాజు పట్ల భక్తికలవారు."[5]

28. "కాదు," అని కౌటిల్యుడు. 29. "దుర్గములోని కార్యకలాపములకు, కోశమునకు, సైన్యమునకు, జలాధారములకు, ప్రజలవృత్తులకు జనపదమే మూలము." 30. శౌర్యము, స్థైర్యము, దక్షత, బాహుళ్యము—ఇవి జానపదుల యందే కనిపించును. 31. జనపదములేని కారణమున పర్వతదుర్గములు నదీదుర్గములు శూన్యములుగ నుండును. 32. కాని, కర్షక ప్రాయమగు దేశములో దుర్గమునకు సంభవించు అపద ఎక్కువప్రమాదకరము; ఆయుధీయ ప్రాయమగు దేశములో జనపదమునకు సంభవించు ఆపద ఎక్కువ ప్రమాదకరము.

33. "దుర్గమునకు కోశమునకు సంభవించు ఆపదలలో కోశమునకు సంభవించు అపద ఎక్కువ ప్రమాదకరము," అని పిశునుడు. 34. ఏలయన, దుర్గనిర్మాణము, దుర్గరక్షణము, జనపదమును మిత్రుని శత్రుని అదుపులో నుంచుట, దేశాంతరవాసులకు ఉత్సాహము కలిగించుట—వీనికి కోశమేమూలము. 35. శత్రువుల కుట్రలకు దుర్గము వశమగునట్లు కోశము వశము కాజాలదు. 36. అపత్కాలమందు కోశమును తీసుకొని మరియొక ప్రాంతమునకు పారిపోవచ్చును కాని దుర్గముతో పారిపోవుట సాధ్యముకాదు.

37. "కాదు," అని కౌటిల్యుడు. 38. కోశము, సైన్యము, మూకయుద్ధము, స్వపక్షమువారిని నిగ్రహించుట, మిత్రసైన్యమును స్వీకరించుట, శత్రుసైన్యములను ఆటవిక సైన్యములను ప్రతిషేధించుట—వీటి కన్నింటికి దుర్గమే ఆధారము. 39. దుర్గము లేనియెడల కోశము శత్రుస్వాధీనమగును. 40. ఏలయన, దుర్గములులేనివారు నిర్మూలముకావింపబడుట కనిపించును.

---

[5] నగరవాసులు ఉత్తములా, పల్లెలలో నివసించువారు ఉత్తములా, అనే వాదము కౌటిల్యుని కాలమందుండి ఇప్పటివరకును జరుగుచున్నది. ఆచార్యులు నగరవాసుల నుత్తములుగ పరిగణించిరి. కౌటిల్యుడు జానపదుల పక్షము వహించినవాడు.

41. "కోశమునకు సైన్యమునకు సంభవించు ఆపదలలో సైన్యమునకు సంభవించు ఆపద ఎక్కువ ప్రమాదకరము," అని కౌణపదంతుడు. 42. ఏల యన, మిత్రులయు, శత్రువులయు, నిగ్రహమునకు, పరసైన్యముల కుత్సాహము కలిగించుటకు, స్వసైన్యముల వృద్ధిచేసుకొనుటకు సైన్యము మూలము. 43. సైన్యము లేనియెడల కోశ వినాశము ధ్రువము. 44. కోశము లేకపోయినను కుప్యముతోగాని భూమితోగాని శత్రుభూమిని ఎవరికి తోచినట్లు వారు ఆక్రమించుట మూలమునగాని సైన్యమును సంపాదించవచ్చును; సైన్యమున్నయెడల కోశమును సంగ్రహించవచ్చును. 45. రాజున కాసన్నముగనుండు కారణమున అమాత్య లక్షణములన్నియు సైన్యమునకు కూడకలవు."

46. "కాదు," అని కౌటిల్యుడు. 47. సైన్యమునకు కోశమేమూలము. 48. కోశములేనియెడల సైన్యము శత్రువు నాశ్రయించును; లేదా, రాజునే చంపి వేయును. 49. సమస్త ప్రయత్నములను కోశము సఫలముగావించి, ధర్మము నకు కామమునకు సాధనమగుచున్నది. 50. కాని, దేశకాలకార్యములనుబట్టి ఒక్కొక్కప్పుడు కోశమును, మరియొకప్పుడు సైన్యమును ప్రధాన్యము వహించును. 51. కోశమును సంపాదించుటకు రక్షించుటకు సైన్యముమూలము; కోశసైన్యముల సంపాదించి రక్షించుటకు కోశము మూలము. 52. సర్వద్రవ్య ములను సంపాదించుటకు సాధనమగుటచేత కోశమునకు సంభవించు ఆపదయే ఎక్కువ ప్రమాదకరము."

53. "సైన్యమునకు మిత్రునికి సంభవించు ఆపదలలో మిత్రునికి సంభ వించు ఆపద ఎక్కువ ప్రమాదకరము," అని వాతవ్యాధి. 54. మిత్రుడు భృతిని కోరక పనిని చేయును; దూరములోని పనినికూడ చేయును; పార్ష్ణి గ్రాహిని, ఆసారుని, శత్రువును, ఆటవికుని ప్రతిఘటించును; కోశము సైన్యము భూమి—వీటినిఇచ్చి ఆపత్కాలములోకూడ కలిసియుండి కావలసిన సహాయము చేయును."

55. "కాదు," అని కౌటిల్యుడు. 56. సైన్యమున్నవానియెడల మిత్రుడు మిత్రభావము కలవాడగును; శత్రువుకూడ మిత్రభావము కలవాడగును. 57. కాని, ఒకేకార్యము సైన్యము మూలమునగాని మిత్రుని మూలమునగాని సుసాధ్యమగు నెడల వాటిబలమును బట్టియు, వాటివాటి యుద్ధమునకు తగిన దేశకాల లాభమును బట్టియు విశేషము కలుగుచున్నది. 58. (ఉదాహరణకు) శీఘ్రముగ శత్రువుల పైని ఆటవికులపైని యానముచేయవలసినప్పుడు, అంతఃకలహము నణచవలసి వచ్చినప్పుడు, మిత్రునివలన ఉపయోగముండదు. 59. ఆపదలు ఏకకాలమందు సంభవించినప్పుడు, శత్రుబలము వృద్ధిదశలోనున్నప్పుడు, మిత్రుడు స్వప్రయో జనమందే శ్రద్ధవహించును.

60. ఇది ప్రకృతులకు సంభవించు ఆపదల తారతమ్య నిర్ణయము.

61. (శ్లో) ఆపదయొక్క ప్రత్యేక లక్షణమునుబట్టియు, ప్రకృత్యవయవముల బాహుళ్యమును అనురాగమును బలమును బట్టియు కార్యము సిద్ధించును.

62. (శ్లో) రెండు ప్రకృతులకు సంభవించిన ఆపదలు సమానములగునప్పుడు తక్కిన ప్రకృతిసంపదలు ప్రయోజనకరములుగ నుండునెడల నారెండు ప్రకృతులమధ్య వానిగుణములలోని క్షయమునుబట్టి భేదమేర్పడును.

63. (శ్లో) కాని, ఒకప్రకృతికి సంభవించిన ఆపదమూలమున తక్కినప్రకృతులన్నిటికి క్షయము కలుగుపక్షమున, అట్టి ఆపద ప్రధాన ప్రకృతికి సంభవించినను ఇతర ప్రకృతులకు సంభవించినను అత్యధిక ప్రమాదముకలిగించునది అగును.

ఇది వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణమందు ప్రకృతి వ్యసన వర్గము అనే మొదటి అధ్యాయము.

# ఎనిమిదో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 128 : రాజరాజ్యముల వ్యసనచింత

**1.** ప్రకృతుల నేడింటిని సంక్షిప్తపరిచి రాజ రాజ్యములని చెప్పవచ్చును.[1]

**2.** రాజునకు లోపలితిరుగుబాటువలనగాని వెలుపలితిరుగుబాటువలనగాని ప్రమాదము సంభవించవచ్చును. **3.** లోపలి తిరుగుబాటు సర్పభయము వంటిది; అందుచేత వెలుపలితిరుగుబాటుకంటె నెక్కువపీడను కలిగించునట్టిది. (ఇందులో కూడ) లోపలి తిరుగుబాటుకంటె రాజ్యములోపలి అమాత్యుల తిరుగుబాటు మరింత ప్రమాదకరము. **4.** కావున, నతడు కోశమును సైన్యమును తన అధీనమందే ఉంచుకొనవలెను.

**5.** ద్వైరాజ్య వైరాజ్యములలో దేనినుండి ప్రమాద మెక్కువ?[2] పరస్పర ద్వేషానురాగముల వలనను పరస్పర సంఘర్షణము వలనను ద్వైరాజ్యము నాశము గాంచును; వైరాజ్యమిట్టిదిగాక, ప్రజలచిత్తమును వశపరుచుకొనగోరిన పరులచే యథాస్థితియందుంచబడి అనుభవింపబడును,'' అని ఆచార్యులు.

**6.** ''కాదు,'' అని కౌటిల్యుడు. **7.** తండ్రియు కొడుకును, లేదా, సహోదరులిద్దరు పరిపాలించు ద్వైరాజ్యము వారిద్దరు సమముగ పంచుకొనిన యోగక్షేమములు కలదిగను, వశపడిన మంత్రులు కలదిగను సాగిపోవును. **8.** న్యాయదృష్ట్యా మరియొకనికి చెందినట్టిదియు, అతనినుండి అన్యాయముగ హరింపబడి

[1] ప్రకృతు లేడైనను వాటిలో రాజు ప్రధానస్థానమువహించుచున్నాడు. రాజ్య మనగా రాజ్యాధికారమని అర్థము చేసుకొనవలెను.

[2] ద్వైరాజ్య మనగా ఇద్దరు కలిసి ఏకకాలమందొక రాజ్యమును పాలించుట. వైరాజ్యమనగా న్యాయతః రాజ్యమునకు వారసుడగువానిని అధికారమం దుండి తొలగించి పరాయి రాజ్యమందుండివచ్చినవారు పాలించుట. ఇది ఒక విధమగు పరాయి పరిపాలన. దానిమూలమున ఎక్కువ నష్టము కలుగునని కౌటిల్యుని మతము. ఆచార్యుల మతము దీనికి భిన్నము.

నట్టిదియు అగువైరాజ్యము, "ఇది నాదికాదు," అని భావించువాని పరిపాలనకు లోబడి ఆతనిచే దరిద్రస్థితిలోనికి తేబడును; అతడందులోని ధనరాసుల నపహరించును; రాజ్యమును వ్యాపారదృష్ట్యా పాలించును; ప్రజ లనురాగములేనివారైనయెడల రాజ్యమును వదలి వెళ్ళిపోవును.[3]

9. రాజులలో నొకడుబొత్తిగ శాస్త్రజ్ఞానములేని అంధుడు; మరియొకడు శాస్త్రము నతిక్రమించువాడు—వీరిలో శాస్త్రచక్షువులేని అంధుడు ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించును; మొండిపట్టుగలవాడగును; లేదా, అన్యుల ప్రేరేపణకు లోబడును· ఇట్లు న్యాయవిరుద్ధముగ పాలించి రాజ్యమును నాశముచేయును. "కాని, శాస్త్రము నతిక్రమించువానిని శాస్త్రము నతిక్రమించు చిత్తముకలవాడై నప్పుడు మంచి మాటలతో మార్చవచ్చును," అని ఆచార్యులు.

10. "కాదు," అని కౌటిల్యుడు. 11. అంధుడగు రాజును శాస్త్రజ్ఞానము గలవారి సహాయసంపదచే నడువదగిన మార్గమున నడుచునట్లు చేయవచ్చును. 12. శాస్త్రము నతిక్రమించువాడు శాస్త్రవిరుద్ధములగు కార్యములందు తనచిత్తమును లగ్నముచేసి అన్యాయ ప్రవృత్తిచే తన్ను తన రాజ్యమును నాశము చేయును.

13. రాజులలో నొకడు వ్యాధితుడు; మరియొకడు క్రొత్తవాడు—వీరిలో వ్యాధితు డమాత్యుల మూలమున రాజ్యమునుండి తొలగించబడవచ్చును; లేదా, పరిపాలనా భారము మూలమున ప్రాణమును కోల్పోవచ్చును; క్రొత్తవాడగురాజిట్లుగాక స్వధర్మ మనుష్ఠించుటయందును, ఇతరుల ననుగ్రహించుట యందును, పరిహారముల ప్రసాదించుటయందును, దానముచేయుటయందును, గౌరవప్రదాన కార్యములందును శ్రద్ధవహించి ప్రజలను సంతోషపెట్టి వారికి లాభము చేకూర్చును," అని ఆచార్యులు.

14. "కాదు," అని కౌటిల్యుడు. 15. వ్యాధితుడగురాజు పూర్వసాంప్రదాయానుసారము రాజ్యమును పాలించును. 16. క్రొత్తవాడు "నాబలముచే నే నీరాజ్యమును జయించితిని," అని భావించి, రాజ్యము తనది అని అనుకొని నియమమును పాటించక యథేచ్ఛగ చరించును. 17. లేదా, తనతో కలిసి తిరుగుబాటుచేసినవారికి వశుడై రాజ్యమునకు వినాశముకలిగించు కార్యములకు సమ్మతించును. 18. ప్రేళ్ళునాటుకొనక ప్రజాభిమానములేనివాడై సులభముగ నిర్మూలింపబడును.

19. వ్యాధితుడగు రాజువిషయములో నతనిని పీడించునది (కుష్ఠము మొదలగు) పాపిష్ఠవ్యాధియా, పాపిష్ఠముకాని వ్యాధియా అనునది విశేషము. 20.

[3] బ్రిటిష్‌పరిపాలనము వంటిపరాయి పరిపాలనములవలన ఇట్టి ప్రమాదములకు భారతదేశము గురియగుట చరిత్రనుండి మనకు తెలియవచ్చుచున్నది.

క్రొత్తవాని విషయములో నతడు పుట్టినది ఉన్నతమగు వంశమా కాదా అనునది విశేషము.

21. ఒకడు బలహీనుడు; కాని ఉన్నతవంశమున బుట్టినవాడు: మరి యొకడు బలవంతుడు; కాని ఉన్నతవంశమున బుట్టినవాడు కాడు: ఉన్నత వంశమునకు చెందినవాడైనను బలహీనుడగు రాజును ప్రజలు లక్ష్యపెట్టరు; వాని యాజ్ఞల నతికష్టముమీద ననుసరింతురు: "ఉన్నతవంశమున బుట్టకపోయి నను బలమున్నకారణమున బలవంతుని యాజ్ఞలను ప్రజలు సులభముగ శిరసావ హించెదరు," అని ఆచార్యులు.

22. "కాదు,"అని కౌటిల్యుడు. 23. ఉన్నతవంశమున బుట్టినవానికి రాజ్యాధికారము సహజముగ ప్రాప్తించినకారణమున, అట్టివాడు దుర్బలుడైనను ప్రజలు స్వయముగ వానినే అనుసరించెదరు.

24. సద్గుణములన్నిటికి అనురాగమే మూలమగుటచేత ఉన్నతవంశము నకు చెందనివాడు బలవంతుడైనను ప్రజలు (వానియం దనురాగము లేనివారై) వానియాజ్ఞలను తిరస్కరింతురు.

25. పడిన కష్టమునకు నష్టము కలుగును కావున సస్యములకు కలుగు నష్టము చల్లిన విత్తనములకు కలుగునష్టముకంటె గొప్పది; జీవనాధారమునకు నష్టము కలిగించు అనావృష్టి అతివృష్టి కంటె ప్రమాదకరము.

26. (శ్లో) స్థాన యానములకు పృకృతులకు సంభవించు ఆపదలు కారణము; ఏకకాలమున సంభవించునట్టి రెండేసి ఆపదల బలాబలములు సంప్ర దాయానుసార మిచట వివరింపబడినవి.

ఇది వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణమందు రాజరాజ్యముల వ్యసనచింత అనే రెండో అధ్యాయము.[4]

---

[4] ఏకకాలమందు ఇద్దరురాజులు కలిసి పాలించుట, న్యాయతః వారసుడుకాని పరాయిరాజు పాలించుట, శాస్త్రజ్ఞానములేని జ్ఞానాంధుడు శాస్త్రజ్ఞాన ముండియు దాని నతిక్రమించువాడు, వ్యాధితుడు, క్రొత్తవాడు, ఉన్నతవంశమందు బుట్టినవాడు, అట్టి వంశమందు బుట్టనివాడు— వీరి పాలనమూలమున కలుగు బాధనష్టములిందు వివరించబడినవి.

# ఎనిమిదో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 129 : పురుషవ్యసనవర్గము[1]

1. విద్యాలయందు శిక్షణపొందకుండుటయే పురుషవ్యసనము లన్నిటికి కారణము. 2. ఏలయన, శిక్షణపొందనివాడు వ్యసనములలోని దోషములను చూడ లేకపోవును. 3. వాని నిచ్చట వివరించెదము.

4. కోపమువలన మూడుదోషముల సముదాయము, కామమువలన నాలుగు దోషముల సముదాయము పుట్టుచున్నవి.

5. వీటిలో కోపమే ఎక్కువ ప్రమాదకరము. 6. ఏలయన, కోపము సర్వత్ర పనిచేయునట్టిది. 7. కోపమునకు వశులైన రాజులను కోపోద్రేకులైన ప్రజలు హత్యచేసినట్లు పదేపదే వినుచుందుము; కామవశులైన రాజులు క్షయమును పొంది శత్రువులచేతను రోగములచేతను ప్రాణముల కోల్పోయినట్లు వినుచుందుము.

8. "కాదు," అని భరద్వాజుడు. 9. కోపము సత్పురుష లక్షణము. వైరము నెదుర్కొనుటకు సాధనము, అవమానమును తొలగించుట కుపాయము, భీతిని కలిగించునట్టిది. 10. పాపమును ప్రతిషేధించుటకు కోపము సర్వదా అవసరము. 11. కామము కార్యసిద్ధికి, అనునయమునకు, త్యాగశీలతకు ప్రేమ ప్రభావమునకు సాధనము. 12. కార్యసాఫల్యము ననుభవించుటకు కామము సర్వదా అవసరము.

[1] సర్వాధికారము వహించిన రాజుల పరిపాలనములో రాజ్యములుండిన ప్రాచీన కాలమందు పరిపాలనములోని గుణదోషములకు రాజులలోని గుణదోషములు ప్రధాన కారణములుగ నుండెడివి. రాజులలోని దోషములకు వారు వ్యసనములలో చిక్కుకొనుటయే మూలము. అట్టి వ్యసనములకు కారణములగు కామక్రోధములను వానిలోని తారతమ్యములను ఈ అధ్యాయము వివరించుచున్నది.

13. "కాదు," అని కౌటిల్యుడు. 14. ద్వేషమునకు గురియగుట, విరోధులను పెంచుకొనుట, బాధను పొందుట—ఇదియే కోపము. 15. పరిభవము, ద్రవ్యనాశము, దొంగలు, జూదగాండ్రు, వేటకాండ్రు, గాయనులు, వాదకులు మొదలగు దుష్టులతో సాంగత్యము—ఇదియే కామము. 16. వీటిలో పరిభవము కంటె ద్వేషమునకు గురియగుట ఎక్కువ ప్రమాదకరము. 17. పరిభవమును పొందినవాడు తనవారికి ఇతరులకు వశుడగుచున్నాడు ; ద్వేష్యుడు నిర్మూలింపబడుచున్నాడు. 18. ద్రవ్యనాశముకంటె విరోధులను పెంచుకొనుట ఎక్కువ ప్రమాదకరము. 19. ద్రవ్యనాశమువలన కోపమునకు నష్టము కలుగును ; విరోధులను పెంచుకొనుటవలన ప్రాణనష్టము కలుగును. 20. దుష్టులతో సాంగత్యమునకంటె బాధనుపొందుట ఎక్కువ ప్రమాదకరము. 21. దుష్టులతో సాంగత్యము నొక ముహూర్తకాలములో పరిహరించవచ్చును ; బాధ దీర్ఘక్లేశకరము. 22. కావున, కోపమే ఎక్కువ ప్రమాదకరము.

23. వాక్పారుష్యము, ధనాపహరణము, దండపారుష్యము—ఇవికూడ కోపమువలన పుట్టు దుర్గుణములు.

24. "వాక్పారుష్య ధనాపహరణములలో వాక్పారుష్యమెక్కువ ప్రమాదకరము," అని విశాలాక్షుడు. 25. "పరుషములగు మాటలకు గురియగు పౌరుషవంతుడు పౌరుషముతో నెదుర్కొనును. 26. వాక్పారుష్యమను శల్యము హృదయములో గ్రుచ్చుకొని పౌరుషమును మరింతపెంచి ఇంద్రియముల కుద్వేగము కలిగించును."

27. "కాదు," అని కౌటిల్యుడు. 28. ధనమునిచ్చి వాక్శల్యమును పరిహరించవచ్చును ; కాని, ధనాపహరణము (జీవనాధారమగు) వృత్తికి భంగము కలిగించును. 29. (ఇతరునికి చెందవలసిన దానిని) ఇయ్యకపోవుట, తీసుకొనుట, ధనమునకు వినాశము కలిగించుట, ధనమును పరిత్యజించుట—ఇవి అన్నియు ధనాపహరణము.

30. "ధనాపహరణ దండపారుష్యములలో ధనాపహరణ మెక్కువ ప్రమాదకరము," అని పరాశరుడు. 31. ధర్మకామములకు అర్థము మూలము. 32. లోకమంతయు అర్థమునకు కట్టువడియున్నది. 33. కావున, అర్థవినాశ మెక్కువ ప్రమాదకరము.

34. "కాదు," అని కౌటిల్యుడు. 35. ధనమెంత ఇచ్చినను శరీర వినాశము కోరువా డెవడును ఉండడు. 36. ఇతరులకు శరీరమును హింసించిన వానికి ఇతరులనుండి అట్టి హింస సంభవించు ప్రమాదమున్నది.

37. ఇది కోపమువలన పుటుమూడు దోషముల సముదాయము.

38. కామమువలన వేట, జూదము, స్త్రీ, పానము అను నాలుగుదోష ముల సముదాయము పుట్టుచున్నది.

39. "వేట, జూదము—ఈ రెంటిలో వేట ఎక్కువ ప్రమాదకరము," అని పిశునుడు. 40. ఏలయన, వేటలో దొంగలు, శత్రువులు, అడవిమృగ ములు, దావాగ్ని, తడబాటుమూలమున పడిపోవుట, ఆకలి, దప్పి మొదలగు వానివలన ప్రాణాపాయము సంభవించును. 41. జూదమందు పాచికలలో నిపు ణుడగు వానికి—జయత్సేన దుర్యోధనులకు లభించినట్లు—జయము లభించును.

42. "కాదు," అని కౌటిల్యుడు. 43. నలునికి యుధిష్ఠిరునకు జరిగినట్లు జూదములో నొకపక్షమువాని కపజయము తప్పదు. 44. జూదములో సంపాదించిన ధనము మరింత ఆశను పురికొల్పి వైరకారణ మగుచున్నది. 45. సంపాదించిన ధనమునకు స్థిరత్వము లేకపోవుట, లేని ధనమును సంపాదించు ప్రయత్నము, ఉన్నదాని ననుభవించుటకు పూర్వమే కోల్పోవుట, మూత్రపురీష ముల ధారణము వలనను ఆకలి మొదలగువానివలనను రోగపీడితుడగుట--ఇవి జూదములోని దోషములు. 46. వేటలో నిట్లుగాక శరీరవ్యాయామము, శ్లేష్మము, పిత్తము, వాతము, స్వేదము మొదలగువాని నాశము, స్థిరములు చలనములునగు లక్ష్యముల గురిపెట్టి కొట్టుటయందు నేర్పు, కోప భయములుజెందిన జంతువుల చిత్తజ్ఞానము, ఎప్పుడైన నొకప్పుడు ప్రయాణము--ఇవి వేటవలనకలుగు లాభములు.

47. "ద్యూత స్త్రీ వ్యసనములలో ద్యూత మెక్కువ ప్రమాదకరము," అని కౌణపదంతుడు. 48. ఏలయన, జూదగాడు రాత్రియనక పగలనక దీపము పెట్టుకొనియు, తల్లి మరణశయ్య యందున్నప్పుడుకూడ ఆడుతునే యుండును. 49. కష్టసమయములందు ప్రశ్నింపబడినయెడల కోపిష్ఠుడగును. 50. స్త్రీవ్యసని ఇట్లుగాక స్నానము అలంకరణము భోజనము మొదలగు సమయములలో ధర్మార్థములకు సంబంధించిన ప్రశ్నల నాలకించును. 51. రాజునకు హితబోధచేయుటకు స్త్రీని వినియోగించవచ్చును; లేదా, రహస్య శిక్షమూలమునగాని రోగము మూలమునగాని స్త్రీని తొలగించవచ్చును."

52. "కాదు," అని కౌటిల్యుడు. 53. జూదమునకు ముక్తికలదు గాని స్త్రీ వ్యసనమునకు ముక్తిలేదు. 54. కనిపించకపోవుట, కార్యము లందు అనిష్టము, కాలాతిపాతమువలన ధర్మార్థములకు నష్టము, పరిపాలన దౌర్బల్యము, మద్యపానమందాసక్తి—ఇవి స్త్రీవ్యసనమువలనకలుగు ఫలితములు.

55. "స్త్రీ పానవ్యసనములలో స్త్రీవ్యసనమెక్కువ ప్రమాదకరము," అని వాతవ్యాధి. 56. "నిశాంతప్రణిధి" ప్రకరణమున వివరించినట్లు స్త్రీలమూల మున కలుగుప్రమాదము లనేకవిధములు. 57. మద్యపానమందిట్లు గాక శబ్దాది ఇంద్రియసుఖముల ననుభవించవచ్చును; ఇతరులకు ప్రీతిపూర్వమగు దానము

చేయుట, పరిజనులను గౌరవించుట, అలసటను తీర్చుకొనుట—ఇట్టి లాభములు కూడ పొందవచ్చును.

58. "కాదు," అని కౌటిల్యుడు. స్త్రీవ్యసనమువలన సంతానోత్పత్తి, అంతఃపురభార్యల మూలమున ఆత్మరక్షణము కలుగును; బాహ్యలగు స్త్రీల మూలమున దీనికి విరుద్ధమగు ఫలితము లభించును; పొందకూడనివారిని పొందుటవలన సర్వనాశమగును. 60. మద్యపానమందుకూడ ఈ రెండుదోషములుకలవు. 61. కాని మద్యపానములో తెలివితప్పిపడిపోవుట, ఉన్మత్తుడుకానివాడు ఉన్మత్తునివలె ప్రవర్తించుట, చావకపోయినను చచ్చినవానివలె (ప్రేతమువలె) కనిపించుట, కౌపీన దర్శనము, పాండిత్యమునకు, జ్ఞానమునకు, బలమునకు, ధనమునకు, మిత్రులకు హానిని కలిగించుట, శిష్టులనుండి విడిపోవుట, దుష్టులతో సంయోగము, ధనమునకు హానికలిగించు తంత్రీగీతనైపుణ్యములం దాసక్తి—ఇట్టి లక్షణము లుండును.

62. "ద్యూత మద్యములలో ద్యూతమెక్కువ ప్రమాదకరము. 63. పందెము కారణముగ ఏదోఒక పక్షమునకు జయమో అపజయమో రాగలదు; దీని మూలమున చేతనాచేతనములకు సంబంధించి ప్రజలలో రెండు పక్షములు బయలుదేరి వానిమధ్య కలహము పుట్టుచున్నది. 64. విశేషించి సంఘములలోను,[2] సంఘధర్మముగల రాజుకులములలోను జూదము కారణముగ విభేదము, విభేద కారణముగ వినాశము సంభవించును; జూదము మూలమున దుష్టులకు లాభము కలుగుటచేతను, పరిపాలనాదౌర్బల్యము సంభవించుటచేతను వ్యసనములన్నిటిలో నది పాపిష్ఠిది.

65. (శ్లో) కామము దుష్టులకు లాభము కలిగించును; కోపము శిష్టులనణచివేయును; రెంటియందు దోష బాహుళ్యముండుటచేత రెండునుకూడ గొప్ప వ్యసనములని అందరియొక్క మతము.

66. (శ్లో) కావున, ఆత్మవంతుడగు రాజు వృద్ధసేవియై ఇంద్రియముల జయించి సర్వవ్యసనమునకు కారణములైనట్టియు మూలమునుకూడ హరించునట్టియు కామమున కోపమును పరిత్యజించవలెను.[3]

ఇది వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణమందు పురుషవ్యసనవర్గము అనే మూడో అధ్యాయము.

---

[2] ప్రాచీనకాలములో కొన్నిప్రాంతములు రాజులపరిపాలమునకుబదులు సంఘముల పరిపాలనకు లోబడియుండెను. అట్టి సంఘములలో జూదమువలన విభేదము కలుగునని ప్రత్యేకముగ చెప్పవలసిన అవసరముండినందున ఈ సూత్రము చేర్చబడినది.

[3] ఇట్టి వ్యసనములను దృష్టిలోనుంచుకొని, ఇవితొలగుటకు విద్యయు, వృద్ధుల తోటి సాంగత్యము ప్రధాన సాధనములని భావించి, కౌటిల్యుడు వినయాధి కారికమను మొదటి అధికరణమును రచించెను.

# ఎనిమిదో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 130 : పీడనవర్గము[1]
### ప్రకరణము 131 : స్తంభవర్గము[2]
### ప్రకరణము 132 : కోశసంగవర్గము[3]

1. అగ్ని, ఉదకము, వ్యాధి, దుర్భిక్షము, మరకము—ఇవి దైవ పీడనములు.

2. అగ్న్యుదకపీడనములలో అగ్నిపీడనము ప్రతీకారములేనిది ; సర్వమును దహించునది ; ఉదకపీడనము తప్పించుకొనుటకు సాధ్యమైనది ; దానిమూలమున కలుగు ప్రమాదమునుండి తప్పించుకొనుట సాధ్యము," అని ఆచార్యులు. 3. "కాదు," అని కౌటిల్యుడు. 4. అగ్ని ఒకగ్రామమునో సగముగ్రామమునో దహించును ; ఉదకప్రవాహములో వందలకొలది గ్రామములు కొట్టుకొనిపోవును.

5. వ్యాధి దుర్భిక్షములలో వ్యాధివలన కార్మికులనేకులు మరణించుటయు రోగపీడితులగుటయు బాధలనుభవించుటయు సంభవించును ; అందుచేత, కార్యముల కాటంకము కలుగును ; దుర్భిక్షము కార్యములకాటంకము కలిగించదు ; ఇంతేగాక హిరణ్యరూపమునను పశువులరూపమునను పన్నులను చేకూర్చును," అని ఆచార్యులు. 6. "కాదు," అని కౌటిల్యుడు. 7. వ్యాధి ఒకప్రదేశమును మాత్రమే పీడించును ; వ్యాధికిప్రతీకారమున్నది. దుర్భిక్ష మనిన నో దేశమునంతను పీడించును ; ప్రాణులకు జీవనాధారము లేకుండజేయును.

---

[1] దైవికములు మానుషములు అగు వివిధపీడల గురించిన వివరణము.

[2] స్తంభ మనగా దేశాభివృద్ధిని స్తంభింపజేయు ఆటంకములు. వీటి వివరణము 48వ సూత్రమం దున్నవి.

[3] కోశమునకు నష్టము కలిగించు కారణములు. వీటి వివరణము 49వ సూత్రమం దున్నది.

8. దీనినుండి మరకమును గురించి తెలుసుకొనవలెను.

9. "సామాన్యజన ప్రముఖజన నష్టములలో[4] సామాన్యజననష్టము కార్యముల యోగక్షేమమునకు భంగముకలిగించును; ప్రముఖ జననష్టము కార్యములు సాగించుట కాటంకమును కలిగించును," అని ఆచార్యులు. 10. "కాదు," అని కౌటిల్యుడు. 11. సామాన్యజనము సంఖ్యాబాహుళ్యము కలదియగుటచేత దానికి సంభవించునష్టమును పూరించుట సాధ్యము; ప్రముఖజననష్టమును పూరించుట సాధ్యముకాదు. 12. ప్రముఖులకు సత్వము ప్రజ్ఞ అధికముగనుండవలసిన కారణముననను, సామాన్యులు వారినాశ్రయింపవలసిన వారగుటచేతను వేలకొలది జనములో నొకప్రముఖు డుండవచ్చును—ఒకడుకూడ నుండక పోవచ్చును.

13. "స్వసైన్యము శత్రుసైన్యములలో స్వసైన్య మధికదౌర్జన్యము మూలమునను పన్నులమూలమునను ప్రజలనెక్కువగపీడించును; దానిని వారించుటకూడ సాధ్యముకాదు; శత్రుసైన్యము నెదిరించవచ్చును; పారిపోవుట మూలమునగాని సంధిమూలమునగాని దానినుండి సంభవించు ప్రమాదమును తప్పించుకొనవచ్చును," అని ఆచార్యులు. 14. "కాదు," అని కౌటిల్యుడు. 15. స్వసైన్యము కలిగించు పీడను సైన్యములోని ముఖ్యపురుషుల అనుగ్రహమును సంపాదించిగాని, వారిని నాశముచేసికాని వారించవచ్చును; ఇదిగాక, ఇట్టిపీడ దేశములో నొకప్రాంతమందే కనుపించును; శత్రుసైన్యమువలన కలుగుపీడ సర్వవ్యాప్తమై, దోపిడి, హత్యలు, కాల్చుట, ధ్వంసముచేయుట, ఎత్తుకొనిపోవుట మొదలగు చర్యలమూలమున దేశమును నాశము చేయును.

16. ప్రజలలోని అంతఃకలహము రాజకుటుంబములోని కలహము—వీనిలో ప్రజలలోని అంతఃకలహము ప్రజలలో విభేదము కల్పించును; శత్రువుల దండయాత్రను ప్రోత్సహించును, రాజకుటుంబములోని కలహము ప్రజలకు రెండింతల ఆహారపదార్థములను వేతనములను పరిహారములను లభింపజేయును," అని ఆచార్యులు. 17. "కాదు," అని కౌటిల్యుడు. 18. ప్రజలలోని అంతఃకలహమును ప్రజల నాయకులను వశపరచుకొనిగాని కలహకారణమును తొలగించిగాని మాన్పవచ్చును. 19. వివాదపడుచుండు ప్రజలు పరస్పరసంఘర్షణముద్వార రాజునకు లాభము చేకూర్తురు. 20. రాజకుటుంబములోని కలహమిట్లుగాక ప్రజలపీడనము

---

[4] 9–47 సూత్రములలో మానుషములగు వివిధ పీడనములవలన సంభవించు నష్టములలో తారతమ్యములు వివరింపబడినవి. ఈసందర్భములో కౌటిల్యుని అభిప్రాయము తత్పూర్వుల అభిప్రాయమునకు భిన్నమైనట్టిది. సామాన్య జననష్టము, ప్రముఖజన నష్టము, స్వసైన్యము, శత్రుసైన్యము, ప్రజలలో అంతఃకలహము, రాజవంశములో అంతఃకలహము, ప్రజలక్రీడాసక్తి, రాజుక్రీడాసక్తి, రాజుప్రియురాలు, రాజకుమారుడు, శ్రేణి, ముఖ్యులు. సన్నిధాత, సమాహర్త, అంతపాలురు, వైదేహకులు, దొంగలు, ఆటవికులు—వీని మూలమున పీడలు సంభవించును.

నకును వినాశమునకును కారణమగును; దాని నణచుటకు రెండింతల పరిశ్రమ అవసరమగును.

21. "దేశప్రజలు క్రీడాసక్తులగుట, రాజు క్రీడాసక్తుడగుట—వీనిలో దేశప్రజలు క్రీడాసక్తులగుటవలన త్రికాలములందు కార్యసాఫల్యమునకు విఘాతము కలుగును; కాని, క్రీడాసక్తుడగురాజు కారువులు, శిల్పులు, కుశీలవులు, వాగ్జీవనులు, రూపాజీవులు, వైదేహకులు మొదలగువారి కుపకారము చేయును," అని ఆచార్యులు. 22. "కాదు," అని కౌటిల్యుడు. 23. ప్రజలక్రీడాసక్తి వారు శ్రమపడుటవలన కలిగిన అలసటను తీర్చుకొనుటలో కొంతవ్యయమునకు కారణమగును; కాని, వ్యయము జరిగిన తర్వాత వారు తిరిగి కార్యోత్సాహు లగుదురు; కాని, రాజు క్రీడాసక్తుడగు నెడల నత డిష్టమువచ్చినదానిని స్వాధీనముచేసుకొనుటచేతను, కానుకలను పణ్యములను కోరుటచేతను, అతడును అతనికి కావలసినవారును ప్రజలకార్యములకు భంగముకలిగించుటచేతను ఎక్కువపీడ సంభవించును.

24. రాజునకు ప్రియురాలు, రాజకుమారుడు—వీరిలో రాజకుమారుడు స్వయముగను ఇష్టులమూలమునను కానుకలను పణ్యములను గ్రహించియు కార్యములను పీడించును; ప్రియురాలు విలాసముల ననుభవించుటచేత (పీడించును)," అని ఆచార్యులు.

25. "కాదు," అని కౌటిల్యుడు. 26. మంత్రి పురోహితుల సాధనమున రాజకుమారుని వారించుట సాధ్యము; కాని, వివేకములేనిది యగుటచేత ప్రియురాలిని వారించుట సాధ్యముకాదు.

27. "శ్రేణి (యోధులగుంపు) ముఖ్యుడు—వీరిలో శ్రేణి సంఖ్యాబలము కలది: అందుచేత దానినణచుట కష్టసాధ్యము; దొంగిలించియు బలప్రయోగము చేసిపట్టుకొనియు ప్రజలను పీడించును; ముఖ్యుడు కార్యముల నను గ్రహించును," అని ఆచార్యులు. 28. "కాదు," అని కౌటిల్యుడు. 29. శ్రేణి సమానశీలము వ్యసనముకలది; అందుచేత దానినదుపులోనికి తీసుకొనిరావచ్చును; లేదా, శ్రేణీ ముఖ్యునిగాని, శ్రేణిలో కొందరినిగాని వశపరచుకొని శ్రేణినంతను అదుపులోనికి దీసుకొనిరావచ్చును. 30. ముఖ్యుడనినసో గర్విష్ఠుడు; పరులప్రాణములకు ద్రవ్యములకు నష్టముకలిగించి ప్రజలను పీడించును.

31. సన్నిధాతృ సమాహర్తలలో సన్నిధాత ఇతరులుచేసిన పనుల యందు లోపముల నెంచియు దండముల విధించియు పీడించును; సమాహర్త కరణాధిష్ఠితుడై నిర్ణయింపబడిన ఫలము ననుభవించును. 32. "కాదు," అని కౌటిల్యుడు. 33. సన్నిధాత ఇతరుల అభిప్రాయము ననుసరించి కోశములో దాచదగిన ద్రవ్యములను స్వీకరించును. సమాహర్త ప్రప్రథమమున తనలాభ

మును సమకూర్చుకొని తర్వాత రాజునకు రావలసిన ఆదాయమును వసూలు చేయును ; లేదా, వసూలుచేయుట మానును ; ఇతరుల ద్రవ్యమును స్వీకరించు విషయమున తనకు తోచినట్లు ప్రవర్తించును.

34. "అంతపాల వైదేహకులలో అంతపాలుడు దొంగలను ప్రోత్సహించుట మూలముననను, అధికముగ పన్నులు వసూలుచేయుటమూలముననను వ్యాపారపు రహదారులను పీడించును ; వైదేహకు లట్లుగాక పణ్యములను వెలుపలికి పంపుటమూలముననను, వాటికిబదులుగ పణ్యములను దేశములోపలికి తెచ్చుట మూలముననను లాభము చేకూర్చెదరు," అని ఆచార్యులు. 35. "కాదు," అని కౌటిల్యుడు. 36. అంతపాలుడు పణ్యసంగ్రహమును ప్రోత్సహించి రహదారులను మంచిస్థితిలో నుంచును ; వైదేహకులు కలిసి పణ్యముల ధరలను పెంచుచు తగ్గించుచు పణమునకు నూరుపణముల లాభమును కుంభమునకు నూరుకుంభముల లాభమును సంపాదించెదరు.

37. "ఉన్నతవంశములోనివాడు స్వాధీనపరచుకొనిన భూమి, పశువుల మందలవారు స్వాధీనపరచుకొనిన భూమి—వీనిలో ఉన్నతవంశమువారు స్వాధీనముచేసుకొనిన భూమి గొప్పఫలితము నిచ్చునట్టిది ; కాని, దీనినుండి సైనికులనేకులు లభించుపక్షమున వాని అధీనమునుండి దీనిని తప్పించరాదు ; అట్లుతప్పించుట ప్రమాదకరము ; పశువులమందలవారు స్వాధీనముచేసుకొనిన భూమి కృషియోగ్యమగుటచేత దానిని వారి అధీనమునుండి తప్పించవచ్చును. 38. గోభూముల కంటె వ్యవసాయయోగ్యములగు భూములు ఉత్తమములు," అని ఆచార్యులు. 39. "కాదు," అని కౌటిల్యుడు. 40. ఉన్నతవంశములోనివాడు స్వాధీనపరుచుకొనినభూమి ఎక్కువ ఫలితము నిచ్చునట్టిది కావచ్చును ; కాని, దానిమూలముననే ఎక్కువప్రమాదము సంభవించు భయము కలదు ; కావున, దానినే వశపరుచుకొనవలెను ; పశువులమందలవారు స్వాధీనపరుచుకొనిన భూమి కోశమునకు లాభకారి ; వస్తువుల రాకపోకల కనుకూలించునట్టిది ; దానిమూలమున సస్యములు నాటుట కాటంకము సంభవించినప్పుడు తప్ప దానిని వశపరుచుకొనరాదు.

41. "దారినికొట్టుదొంగలు, ఆటవికులు—వీరిలో దొంగలు రాత్రులందు వారి వ్యాపారమును సాగింతురు ; దారిలో కాచుకొనియుందురు ; శరీరములను బాధించెదరు. సర్వదా ప్రమాదముల సంభవింపజేయుదురు ; శతసహస్రపణముల నపహరించెదరు ; ప్రధానుల నుద్రేకపరిచెదరు ; ఆటవికు లిట్లుగాక, పొలిమేరకు చాలదూరమున అరణ్యములలో సంచరించుచు, అందరియెదుట బహిరంగముగ వారిపనులను సాగించుకొనెదరు. వారివలన దేశములో నేదియో ఒకప్రాంతమునకు మాత్రమే ప్రమాదము కలుగును," అని ఆచార్యులు. 42. "కాదు," అని కౌటిల్యుడు. 43. దొంగలు జాగరూకతలేనివారి ధనమునుమాత్రమే అపహరింతురు. వారు అల్పసంఖ్యాకులు, శక్తిలేనివారు, వారిని గుర్తుపట్టుటయు పట్టు

కొనుటయు సులభము ; ఆటవికులు స్వదేశములందు నివసించువారు ; అధిక సంఖ్యాకులు ; పరాక్రమవంతులు ; బహిరంగముగ యుద్ధముచేయువారు ; రాజ లక్షణములుకలవారై దేశములనాక్రమించి నష్టపరచెదరు.

44. లేళ్ళవనములు, హస్తివనములు— లేళ్ళు సంఖ్యలో అధికము ; అధిక ముగ మాంసమును చర్మములను ఇయ్యగలవు ; వాటికి కావలసిన గ్రాసము సుల భముగ లభించును ; వాటిని సులభముగ వశపరుచుకొనవచ్చును. 45. ఏనుగు లిట్టివి కావు : వానిని పట్టుకొనిన పిమ్మటకూడ నవి దుష్టములై దేశమును నాశము గావించును.

46. స్వస్థానీయమునకు గావించిన ఉపకారము, శత్రుస్థానీయమునకు గావించిన ఉపకారము—ధాన్యము, పశువులు, హిరణ్యము, కుప్యముల రూప మున స్వస్థానమునకు గావించిన ఉపకారము ఆపత్కాలములో జానపదుల జీవనా ధారమునకు తోడ్పడును. 47. శత్రుస్థానీయమునకు గావించిన ఉపకారము దీనికి విరుద్ధము.

దీనితో పీడనములు సమాప్తము.

48. ముఖ్యులమూలమున కలుగు ఆటంకములు (స్తంభములు) అభ్యం తరాటంకములు ; శత్రువుల మూలమునను ఆటవికులమూలమునను కలుగునవి బాహ్యాటంకములు.

దీనితో స్తంభవర్గము సమాప్తము.

49. ఈ రెండురకములగు ఆటంకములచేతను పైన వివరింపబడిన పీడ నములచేతను పీడింపబడినట్టిది, ముఖ్యులు అపహరించినది, పరిహారములచేత నష్టపడినది, నలువైపుల చెదరినది, వసూలులో పొరపాటులకు గురియైనది, శత్రువులు ఆటవికులు తీసుకొనిపోయినది—ఇవి కోశసంగములు (కోశమునకు నష్టము కలిగించు సాధనములు).

50. (శ్లో) దేశాభివృద్ధికై రాజు పీడనములు సంభవించకుండ జేయవలెను ; సంభవించినవానిని నివారించవలెను. స్తంభములను సంగములను రాకుండ జేయ వలెను.

ఇది వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణమందు పీడనవర్గము, స్తంభ వర్గము, కోశసంగవర్గము అనే నాలుగో అధ్యాయము.

## ఎనిమిదో అధికరణము

### అధ్యాయము 5

### ప్రకరణము 133 : సైన్యవ్యసనవర్గము
### ప్రకరణము 134 : మిత్రవ్యసనవర్గము

1. సైన్యవ్యసనములు : గౌరవింపబడకుండుట, అవమానింపబడుట, వేతనములు లభించకుండుట, రోగముచే పీడింపబడుట, క్రొత్తగసన్నద్ధమగుట, దూరప్రయాణము చేసివచ్చుట, అలసిపోవుట, సంఖ్యాబలమును కోల్పోవుట, అపజయము గాంచుట, మొదటి ఆక్రమణలో నష్టపడుట, అకాలమందు పనిచేయవలసివచ్చుట, ప్రతికూలప్రదేశమందు పనిచేయవలసివచ్చుట, ఆశను కోల్పోయి బాధపడుట, పారిపోవుట, స్త్రీజనముతో కూడినదగుట, ద్రోహులతో కూడినదగుట, మూలబలము కోపించి యుండుట, విభేదములతో కూడినదగుట, విదేశమునకు పారిపోవుట, నలువైపుల చెదరిపోవుట, శత్రుసమీపశిబిరమందుండుట, శత్రుసైన్యములోకలిసిపోవుట, శత్రువు ఆటంకపరచుట, శత్రువుచుట్టుముట్టినదగుట, ఆహారధాన్యములరాకకు పురుషులరాకకు ఆటంకము సంభవించుట, స్వదేశమందు చెదరియుండుట, మిత్రదేశమందు చెదరియుండుట, దూష్యులతో కూడినదగుట, దూష్యుడగు పార్ష్ణిగ్రాహకునితో కూడినదగుట, మూలస్థానమందు సైనికులు లేకుండుట, రాజుతో కలియకుండుట, నాయకుని కోల్పోవుట, గ్రుడ్డిదగుట.

2. గౌరవింపబడనిసైన్యము, అవమానింపబడినసైన్యము—వీనిలో గౌరవింపబడని సైన్యము ధనమునిచ్చి గౌరవించినయెడల యుద్ధముచేయును ; అంతః కోపము కలదియగుటచేత అవమానింపబడిన సైన్యము యుద్ధముచేయుటకు సమ్మతించదు.

3. వేతనము లభించని సైన్యము, రోగపీడితమగు సైన్యము—వీనిలో వేతనములభించని సైన్యమునకు వేతనమిచ్చినయెడల, వెంటనేయుద్ధముచేయును ;

పనిచేయలేని రోగపీడితమగు సైన్యము యుద్ధము చేయజాలదు.

4. క్రొత్తగ సన్నద్ధమైవచ్చిన సైన్యము, దూరప్రయాణము చేసివచ్చిన సైన్యము—వీనిలో క్రొత్తగ వచ్చినసైన్య మితరులనుండి దేశమునుగురించి తెలిసుకొనియు పాతసైనికులతో కలిసియు యుద్ధము చేయగలది అగును. దూరప్రయాణము మూలమున కష్టములకులోనైన సైన్యము యుద్ధముచేయు స్థితిలో నుండదు.

5. అలసిపోయిన సైన్యము, సంఖ్యాబలమును కోల్పోయిన సైన్యము—వీనిలో అలసిపోయినసైన్యము స్నానము భోజనము విశ్రాంతి మొదలగు వాటి మూలమునయుద్ధము చేయగలది అగును ; ప్రదేశాంతరమందు పాల్గొనిన యుద్ధములో బండ్లఎద్దులను పురుషులను కోల్పోయిన సైన్యము యుద్ధము చేయుస్థితిలో నుండదు.

6. అపజయముగాంచినసైన్యము, మొదటి ఆక్రమణలో నష్టపడినసైన్యము — వీనిలో మొదటిదెబ్బను సహించలేక వెనుకకు తరిమివేయబడి అపజయము గాంచిన సైన్యము ప్రవీరపురుషులచే సమకూర్చబడి యుద్ధముచేయగలది అగును ; మొదటిఆక్రమణలో ప్రవీరపురుషులను కోల్పోయిన సైన్యము యుద్ధముచేయు స్థితిలో నుండదు.

7. అకాలమందు పనిచేయవలసిన సైన్యము, ప్రతికూల ప్రదేశమందు పని చేయవలసిన సైన్యము—వీనిలో అకాలమందు పనిచేయవలసిన సైన్యము కాలానుగుణములగు యానవాహనములను శస్త్రములను ఆవరణములను పొంది యుద్ధము చేయగలది అగును; ప్రసారవ్యాయామములు సాధ్యముకాని ప్రతికూలప్రదేశమందలి సైన్యము యుద్ధముచేయుస్థితిలో నుండదు.

8. ఆశను కోల్పోయిన సైన్యము, పారిపోయిన సైన్యము—వీనిలో ఆశను కోల్పోయిన సైన్యముయొక్క ఆశలను తీర్చినయెడల యుద్ధముచేయగలది అగును ; ముఖ్యులందరు పారిపోయిన సైన్య మిట్టిస్థితిలో నుండదు.

9. స్త్రీజనముతో కూడినసైన్యము, ద్రోహులు కలసైన్యము—వీనిలో స్త్రీజనముతో కూడినసైన్యము స్త్రీలను తొలగించినయెడల యుద్ధము చేయగలది అగును ; లోపల శత్రువులుండు ద్రోహులుకల సైన్యమిట్టిది కాజాలదు.

10. కోపించిన మూలముగల సైన్యము, విభేదములతో కూడిన సైన్యము—సామాది ఉపాయముల మూలమున కోపమును చల్లార్చవచ్చును ; అందుచేత, కోపించిన మూలముగల సైన్యము యుద్ధము చేయగలది అగును. ఒకభాగ మింకొకభాగమునుండి విడిపోయిన సైన్యము నిట్టి స్థితిలోనికి తెచ్చుట సాధ్యము కాదు.

11. విదేశమునకు పారిపోయిన సైన్యము, నలువైపుల చెదిరిపోయిన

సైన్యము—వీనిలో విదేశమునకు పారిపోయిన సైన్యమును అది ఒకేప్రదేశమం దుండుటచేత రాయబారముల మూలమునను సైనికవ్యాయామముల మూలము నను దుర్గమందుగాని, మిత్రరాజ్యమందుగాని ఆశ్రయము కల్పించి యుద్ధము చేయునట్టిదానినిగ మార్చవచ్చును; అనేకరాజ్యములకు చెదరిపోయిన సైన్య మెదుర్కొనవలసిన ప్రమాదములు బహుళము లగుటచేత దానిని యుద్ధముచేయ గల స్థితిలోనికి తెచ్చుట సాధ్యము కాదు.

**12.** శత్రువునకు సమీపమందున్న సైన్యము, శత్రుసైన్యములో కలిసి పోయిన సైన్యము—శత్రువునకు సమీపమందున్న సైన్యము ప్రత్యేక యానస్థాన ములు కలదిగనుక శత్రువునకు వశపడక, వానితో యుద్ధముజేయును; శత్రు వుతో కలిసిన యానస్థానములుగల సైన్య మిట్టిది కాదు.

**13.** శత్రువు ఆటంకపరచినసైన్యము, శత్రువు చుట్టుముట్టినసైన్యము—శత్రువు ఆటంకపరచిన సైన్యము మరియొక మార్గముద్వారా తప్పించుకొని అతనిని యుద్ధము చేయగలది అగును; నలుమూలల చుట్టబడిన సైన్యమున కిది సాధ్యము కాదు.

**14.** ఆహారధాన్యముల రాక కాటంకముగల సైన్యము, పురుషుల రాక కాటంకముగల సైన్యము—మరియొక ప్రాంతమునుండి ఆహారధాన్యముల తెప్పించి కొనిగాని, మాంసాహార శాకాహారముల మూలమునగాని ఆహారధాన్యముల రాక కాటంకముగల సైన్యము యుద్ధము చేయగలది అగును; అవసరమగు పురుషసహాయమును సంపాదించలేని పురుషులరాక కాటంకముగల సైన్యమున కిది సాధ్యము కాదు.

**15.** స్వదేశమందు చెదరిపోయిన సైన్యము, మిత్రదేశమందు చెదరి పోయిన సైన్యము—స్వదేశమందు చెదరిపోయిన సైన్యము నాపత్కాలమందు ఒకేప్రదేశమున చేర్చవచ్చును; మిత్రదేశమందు చెదరిపోయిన సైన్యము దూర ప్రాంతమం దుండుటచేతను, దానినిచేర్చుట కెక్కువకాలము పట్టుటచేతను దాని నొకే ప్రదేశమున చేర్చుట సాధ్యము కాదు.

**16.** దూష్యులతోకూడిన సైన్యము, దూష్యుడగు పార్ష్ణిగ్రాహి వెంటనంటు సైన్యము—ఆప్తపురుషుల నధికారస్థానములందు నియోగించుట మూలమునను దూష్యులు కలియకుండ చేయుట మూలమునను దూష్యులతో కూడిన సైన్యమును యుద్ధము చేయుటకుతగినస్థితిలోనికి తీసికొని రావచ్చును; కాని, పార్ష్ణిగ్రాహి వెనుక నుండి వెంటనంటునని భయపడిన సైన్యము నిట్టిస్థితిలోనికి తెచ్చుట సాధ్యము కాదు.

**17.** మూలస్థానములేని సైన్యము, రాజుతోకలియని సైన్యము—పౌరులయు జానపదులయు రక్షణమును సంపాదించి సర్వసందోహముతో మూలస్థానములేని

సైన్యము యుద్ధముచేయగలది అగును; రాజుగాని సేనాపతిగాని లేని సైన్యమిట్టిది కాజాలదు.

**18.** నాయకుని కోల్పోయిన సైన్యము, గ్రుడ్డిదియగు సైన్యము—మరియొకనిని సేనానాయకునిగ నియమించి నాయకుని కోల్పోయిన సైన్యముచేత యుద్ధము సాగింపవచ్చును; దారిచూపువాడు లేని గ్రుడ్డిసైన్యమిట్టిది కాజాలదు.

**19.** (శ్లో) దోషనివారణము, క్రొత్తసైనికుల సంపాదనము, బలిష్ఠమగు ప్రదేశమున జేరి శత్రువు నధిగమించుట, బలవంతునితో సంధిచేసుకొనుట—ఇవి సైన్యవ్యసనములను తొలగించుటకు సాధనములు.

**20.** (శ్లో) సదా జాగరూకత గలవాడై రాజువ్యసనములతో కూడిన తన సైన్యమును శత్రువులనుండి రక్షించుకొనవలెను. అట్లే, సదా జాగరూకత గలవాడై శత్రుసైన్యములోని వ్యసనము లెట్టివో తెలుసుకొని దానిపై దెబ్బతీయవలెను.

**21.** (శ్లో) దేనిమూలమున తనప్రకృతులకాపదలు సంభవించునో దానిని ముందే గ్రహించి జాగరూకుడగు రాజు దానికి కావలసిన ప్రతిక్రియను చేసుకొనవలెను.

**22-27.** (శ్లో) స్వయముగ నితరులతోకలిసిగాని ఇతరుల ప్రోత్సాహమువలనగాని ఒకనిదండయాత్రకు గురియైన మిత్రుడు; ఒకని బలహీనతచేతగాని లోభముచేతగాని (ఇతరులపట్లగల) గౌరవముచేతగాని పరిత్యజింపబడిన మిత్రుడు; దాడిచేసిన శత్రువుతో సంభవించిన యుద్ధమునుండి వెనుకకు మరలివచ్చినవానిచేత విక్రయింపబడిన (సహాయములేకవదలివేయబడిన) మిత్రుడు; ద్వైధీభావము ననుసరించుచు మరియొకవైపుననుండు మరియొకశత్రువుపై దాడిచేయదలచినవానిచేత విక్రయింపబడిన మిత్రుడు; విశ్వాసపాత్రుడను భావముతో ప్రత్యేకయానములోగాని సంహితయానముగాని ఒకనితో పాల్గొని అటుపిమ్మట వానిచే మోసగింపబడిన మిత్రుడు; భయమువలన గాని గౌరవములేకపోవుటవలనగాని, సోమరితనమువలనగాని ఆపత్కాలమందు సహాయము పొందని మిత్రుడు; స్వభూమినుండి తొలిగింపబడి భయకారణమున నొకనిపక్షమును త్యజించిన మిత్రుడు; అపహరణమువలనగాని ఇయ్యకపోవుటవలనగాన ఇచ్చుటవలనగాని అవమానముపొందిన మిత్రుడు; ఒకనిచేత స్వయముగగాని ఇతరుల మూలమునగాని బలాత్కరింపబడి ధనమును పోగొట్టుకొనిన మిత్రుడు; అతిభారమగు కార్యమందు నియుక్తుడై, దానిని నిర్వహించుటయందు భంగపడి శత్రువునాశ్రయించిన మిత్రుడు; అశక్తుడను కారణమున నుపేక్షింపబడి (అటుతర్వాత) కోరినదాని నియ్యకపోవుటచేత నిరోధించిన మిత్రుడు—ఇటువంటి మిత్రుని వశపరచుకొనుట కష్టసాధ్యము; వశపడినను అతడు అనతికాలముననే విరోధియగును.

**28-29.** (శ్లో) కష్టపడిపనిచేసినమిత్రుడు ; ఒకనివలన గౌరవింపదగినవాడై నను పొరపాటువలన గౌరవమును పొందనివాడు, లేదా, తగినగౌరవమును పొందని వాడు; బలమును సమకూర్చుకొనుటయందు వారింపబడినవాడు ; మరియొకమిత్రు నికి జరిగినఅపకారమువలన భయపడినవాడు ; శత్రువుతో సంధి జరుగునేమోఅని శంకించినవాడు; దూష్యులచే వేరుచేయబడినవాడు—ఇటువంటిమిత్రుని వశపరుచు కొనుట సుసాధ్యము ; ఇట్టివాడు చాలాకాలము మిత్రుడుగ నుండును.

**30.** (శ్లో) కావున మిత్రులకు బాధనుకలిగించు ఇట్టిదోషము లుత్పన్నము లగునట్లు ప్రవర్తించరాదు. ఒకవేళ ఉత్పన్నములైనను దోషములను తొలగించు శక్తిగల సుగుణములమూలమున వానిని తొలగింపవలెను.

ఇది వ్యసనాధికారికమను ఎనిమిదో అధికరణమందు సైన్యవ్యసనవర్గము, మిత్రవ్యసనవర్గము అనే అయిదో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు వ్యసనాధికారికమనే ఎనిమిదో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## తొమ్మిదో అధికరణము

## అభియానముచేయువాని కార్యము

### అధ్యాయము 1

### ప్రకరణము 135 : శక్తి దేశకాల బలాబలజ్ఞానము
### ప్రకరణము 136 : యాత్రాకాలములు

1. విజిగీషువు తనయొక్కయు తన శత్రువుయొక్కయు శక్తులు, దేశము, కాలము, యాత్రకు తగినఋతువు, సైన్యములు సమకూర్చుకొనుటకు తగినకాలము, వెనుకభాగమునుండి సంభవింపగల తిరుగుబాటు, క్షయము, వ్యయము, లాభము, ఆపదలు మొదలగువానికి సంబంధించిన బలాబలములను తెలుసుకొని తనకున్నబల మధిక మైనయెడల యానము చేయవలెను ; అట్లు కాని యెడల ఆసనము ననుసరించవలెను.

2. "ఉత్సాహ, ప్రభావ శక్తులలో ఉత్సాహశక్తి శ్రేయస్కరము.[1] 3. ఏల యన, స్వయముగ శూరుడు, బలవంతుడు, ఆరోగ్యవంతుడు, అస్త్రవిద్యల నేర్చినవాడు అగు రాజు కేవల మొక సైన్యసహాయముతో ప్రభావవంతుడగు రాజును జయించగలడు. 4. వీనిసైన్య మల్పమైనను ఉత్సాహవంత మగుట చేత తనకార్యమును సాధించగలది యగుచున్నది. 5. నిరుత్సాహుడగు రాజు ప్రభావవంతుడైనను పరాక్రమము (గలవాని) నెదుర్కొని వినాశముగాంచును," అని ఆచార్యులు.

---

[1] రాజునకు మూడువిధములగు శక్తులుండవలెను. అవి ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి. రాజుకుగల శౌర్యము పౌరుషము మొదలైనవానితో కూడినది ఉత్సాహశక్తి; రాజునకు బాహ్యమగు కోశము, సైన్యములతోకూడినది ప్రభుశక్తి ; మంత్రులమూలమున దూతల మూలమున లభించుశక్తి మంత్ర శక్తి.

6. "కాదు," అని కౌటిల్యుడు. 7. ప్రభావవంతుడగు రాజు తనప్రభావము (ప్రభుశక్తి) వలనను, (ఉత్సాహమందు) తనకంటె నధికుడగు వాని నాహ్వానించుట వలనను, ప్రవీరపురుషులను క్రయమిచ్చిగాని వేతనమిచ్చిగాని సమకూర్చుకొనుటవలనను ఉత్సాహవంతుడగు రాజు నోడించగలడు. 8. అధిక శక్తిమంతమగు నతని సైన్యము గుర్రములు, ఏనుగులు, రథములు, ఉపకరణములు మొదలగు వానితో కూడినట్టిదై అడ్డులేక అన్నిప్రదేశములందు సంచరించగలది అగును. 9. ఉత్సాహవంతులను వశపరచుకొనియు, క్రయమిచ్చికొనియు, ప్రభావవంతులు తుదకు స్త్రీలు, బాలురు, కుంటివారు, గ్రుడ్డివారుకూడ—ప్రపంచమునంతను జయించిరి.

10. "ప్రభావ మంత్రశక్తులలో ప్రభావము శ్రేయస్కరము. 11. ఏలయన, ప్రభుశక్తిలేని మంత్రశక్తిసంపన్నుని మంత్రశక్తి నిష్ఫలము. 12. వర్షాభావమువలన భూగర్భములోని ధాన్యపు విత్తనములు నశించునట్లు ప్రభుశక్తిలేని కారణమున చక్కగా నాలోచించి ప్రారంభింపబడిన కార్యములుకూడ నాశము గాంచును," అని ఆచార్యులు.

13. "కాదు," అని కౌటిల్యుడు, 14. మంత్రశక్తియే శ్రేయస్కరము. 15. ప్రజ్ఞయు శాస్త్రము కన్నులుగా గల రాజు అల్పమగు ప్రయత్నముగావించి సామాద్యుపాయములచేతను యోగోపనిషత్క్రియలచేతను ఉత్సాహప్రభాశక్తులుగల రాజును వశపరుచుకొనగలడు.

16. ఇట్లు ఉత్సాహ ప్రభుమంత్రశక్తులలో ఉత్తరోత్తరములగు శక్తులలో నధికుడగురాజు[2] శత్రువునోడించగల వాడగును.

17. దేశమనగా పృథివి. 18. అందులో హిమవత్పర్వత సముద్రములకుమధ్య ఉత్తరముగ వ్యాపించినట్టియు తూర్పునుండిపశ్చిమమువరకు వేయి యోజనముల పరిమాణము గలిగినట్టియు భూభాగము చక్రవర్తి క్షేత్రము.[3] 19. అందు అరణ్యమయ ప్రదేశములు, గ్రామమయప్రదేశములు, పర్వతమయ ప్రదేశములు, ఉదకమయప్రదేశములు, మెట్టప్రదేశములు, సమప్రదేశములు, విషమప్రదేశములు—అనునవి వివిధములగు ప్రదేశములు. 20. వీనియందు స్వబలము వృద్ధియగుటకు కావలసిన కార్యముల నతడు ప్రారంభించవలెను.

21. స్వసైన్యవ్యాయామములకు ఉచితమైనట్టియు శత్రుసైన్యవ్యాయామ

[2] ఉత్సాహశక్తి కంటె ప్రభుశక్తియు, ప్రభుశక్తి కంటె మంత్రశక్తియు ప్రాధాన్యము వహించునని కౌటిల్యుని మతము.

[3] భరతఖండమంతయు చక్రవర్తి క్షేత్రమను సత్యమును ప్రతిపాదించిన వారిలో కౌటిల్యుడగ్రగణ్యుడు. ఈభూభాగమంతయు ఒకే చక్రవర్తి పరిపాలనలో నుండదగినదని దాని తాత్పర్యము.

ముల కనుచితమైనట్టియు భూమి ఉత్తమము ; దీనికి విపరీతమగునది అధమము ; ఉభయుల కనుకూలమైనట్టిది మధ్యమము.

22. శీతము, ఉష్ణము, వర్షము అని కాలము(మూడువిధములు). 23. అందు రాత్రి, పగలు, పక్షము, ఋతువు, అయనము, సంవత్సరము, యుగము— అనునవి భాగములు. 24. వీనియందు స్వబలము వృద్ధియగుటకు కావలసిన కార్యముల నతడు ప్రారంభించవలెను.

25. అందు స్వసైన్యవ్యాయామముల కుచితమైనట్టియు శత్రుసైన్యవ్యాయామముల కనుచితమైనట్టియు కాలము ఉత్తమకాలము ; దీనికి విపరీతమగునది అధమము ; ఉభయుల కనుకూలమైనది మధ్యమము.

26. "శక్తి దేశ కాలములలో శక్తి శ్రేయస్కరము," అని ఆచార్యులు. 27. ఏలయన, శక్తిమంతుడు ఉదకమయప్రదేశముల మూలమునను మెట్టప్రదేశముల మూలమునను శీతోష్ణవర్షాకాలముల మూలమునను సంభవించు కష్టములకు ప్రతీకారము చేసుకొనగలడు. 28. "దేశము శ్రేయస్కరము," అని కొందరు చెప్పెదరు. 29. "ఏలయన, నేలమిదనుండు కుక్క కూడ మొసలిని లాగగలదు ; నీటిలోని మొసలి కుక్కను లాగగలదు." 30. "కాలము శ్రేయస్కరము," అని మరికొందరు చెప్పెదరు. 31. "పగటిపూట కాకి గుడ్లగూబను చంపగలదు ; రాత్రిపూట గుడ్లగూబ కాకిని చంపగలదు." 32. "కాదు," అని కౌటిల్యుడు. 33. "శక్తి దేశ కాలములు పరస్పరము సహాయము చేసుకొనునట్టివి."

34. వీటిలో నభివృద్ధిగాంచి, సైన్యములో మూడవవంతునుగాని నాల్గవ వంతునుగాని మూలస్థానమందును పార్ష్ణియందును పొలిమేరలోని అడవులయందును రక్షణార్థముంచి, కార్యసాధనకు కావలసిన కోశసైన్యములను తీసుకొని, కూడబెట్టిన పాతఆహారధాన్యముల క్షయము గాంచినట్టియు, కొత్తధాన్యములను సేకరించుకొననట్టియు, దుర్గమును బలపరచుకొని యుండనట్టియు, శత్రువు పైకి నతని వర్షాకాలపు పంటలను హేమంతములోని నాటులను నాశముచేయు ఉద్దేశముతో మార్గశీర్షమాసమున యానముచేయవలెను. 35. తృణకాష్ఠోదకముల క్షయము గాంచినట్టియు, దుర్గమును బలపరుచుకొని యుండనట్టియు, శత్రువుపైకి నతని వసంతకాలపుపంటలను వర్షాకాలపు నాటులను నాశముచేయు ఉద్దేశముతో జ్యేష్ఠ మాసమందు యానము చేయవలెను.

36–37. అత్యుష్ణమును, అల్పమగు పశుగ్రాసము కట్టెలును నీళ్లుగల దేశముపైకి హేమంతమందు యానము చేయవలెను. 38. అధికముగ మంచు వర్గము పడునట్టియు, అగాధమగు జలములు గలిగినట్టియు దట్టమగు గడ్డియు చెట్లును కలిగినట్టియు దేశముపైకి గ్రీష్మమందు యానము చేయవలెను. 39. స్వసైన్యవ్యాయామముల కుచితమైనట్టియు శత్రు సైన్యవ్యాయామముల కనుచిత

మైనట్టియు దేశముపై వర్షఋతువునందు యానము చేయవలెను.

40. మార్గశీర్ష పౌష్యపూర్ణిమలకు మధ్య దీర్ఘకాలయాత్రలను, చైత్ర వైశాఖపూర్ణిమలకు మధ్య మధ్యమకాలయాత్రలను, జ్యేష్ఠాషాఢపూర్ణిమలకుమధ్య స్వల్పకాలయాత్రలను చేయవలెను; శత్రువున కాపదసంభవించిన కాలములో నతనిదేశమును దహింపనెంచిన యెడల నాల్గవయాత్రను చేయవలెను.

41. "విగ్రహించిన తర్వాత యానము," అనే ప్రకరణమందు ఆపదలో చిక్కుకొనిన శత్రువుపై చేయతగు యానమును గురించి వివరింపబడియున్నది.

42. "శత్రువు ఆపదలో నున్నప్పుడు యానము చేయవలెను," అని సాధారణముగ ఆచార్యు లుపదేశించి యున్నారు. 43. "ఆపదలనుగురించి నిశ్చితాభిప్రాయమున కవగాశము లేనికారణమున శక్తి వృద్ధిగాంచినప్పు డీయానము చేయవలెను," అని కౌటిల్యుడు. 44. లేదా, ఎప్పుడు యానముచేసినయెడల శత్రువును బలహీనపరచుటగాని నిర్మూలము చేయుటగాని సాధ్యమో అప్పుడు యానము చేయవలెను.

45. అత్యుష్ణకాలము దాటిపోయిన తర్వాత ప్రాయశముగ ఏనుగుల సైన్యముతో యానము చేయవలెను. 46. ఏలయన, శరీరములోపల చెమటకారు ఏనుగులకు కుష్ఠువ్యాధి సంభవించును. 47. మునుగుటకు త్రాగుటకు నీళ్ళులేని కారణమున అంతఃక్షారము సంభవించి అవి గ్రుడ్డివగును. 48. కావున ఎక్కువగ ఏనుగులతో వెళ్ళదలచినవాడు సమృద్ధిగ నీళ్లుదొరకు ప్రదేశముపైకిగాని వర్షాకాలమందుగాని యానము చేయవలెను. 49. దీనికి విపర్యయముగ వర్షము బురద స్వల్పముగనుండు దేశముపైకి గాడిదలు, ఒంటెలు, గుర్రములు మున్నగు వానితో కూడిన సైన్యములతో యానము చేయవలెను. 50. వర్షాకాలమున ఎడారి ప్రదేశముపైకి చతురంగబలముతో యానము చేయవలెను.

51. యానము చేయవలసిన మార్గముయొక్క సమవిషమములబట్టియు, నీటిసౌకర్యములబట్టియు, నేలసౌకర్యములబట్టియు, హ్రస్వదీర్ఘములబట్టియు నతడు యానక్రమమును నిర్ణయించుకొనవలెను.

52. (శ్లో) కార్యము సులభసాధ్యమగునప్పుడు స్వల్పకాలములో ముగియు నట్లుగ యానము చేయవలెను. కార్యము గొప్పదైనప్పుడు యాత్రాకాలము దీర్ఘము కావచ్చును. అట్టి సందర్భములో శత్రుదేశమందు వర్షాకాలమున శిబిరముల నేర్పరుచుకొనవలెను.

ఇది అభియానముచేయువాని కార్యము అను తొమ్మిదో అధికరణమందు శక్తి దేశకాలబలాబలజ్ఞానము, యాత్రాకాలములు అనే మొదటి అధ్యాయము.

## అధ్యాయము 2

### ప్రకరణము 137 : బలోపాదానకాలములు

### ప్రకరణము 138 : సన్నాహగుణములు

### ప్రకరణము 139 : ప్రతిబలకర్మ

1. మౌలబలము, భృతకబలము, శ్రేణీబలము, మిత్రబలము, అమిత్ర బలము, ఆటవికబలము—వీని నుపయోగించదగిన కాలములు.[1]

2. మూలస్థానమును రక్షించుటకు కావలసినదానికంటె మౌలబల మధిక ముగా నున్నప్పుడు; మౌలబలమందు విద్రోహు లనేకు లుండుటచేత మూలస్థానము నకు ప్రమాదము సంభవించునని తోచినప్పుడు; శత్రువువద్ద ననురక్తులగువారితో కూడిన మౌలబలముగాని సారబలముగాని యుండుటచేత వాని నెదుర్కొనుటకు సైనికవ్యాయామము లవసరమైనప్పుడు; యానము చేయవలసిన మార్గము దీర్ఘ మగుటచేతగాని, దాని కెక్కువకాలము పట్టుటచేతగాని సంభవించు క్షయవ్యయముల సహించుటకు మౌలబల మొక్కటే సమర్థమైనప్పుడు; అనురక్తులగు సైనికు లధికముగ నున్నను భృతకాదిసైన్యములు యాతవ్యుడగు శత్రువు కుట్రలకు లోబడి

[1] మౌలబల మనగా శాశ్వతముగను వంశపారంపర్యముగ రాజును సేవించునట్టిదియగు సైన్యము. భృతకబల మనగా తాత్కాలికముగ యుద్ధము చేయుటకు సమకూర్చబడిన సైన్యము. యుద్ధము ముగిసినతర్వాత దాని కవసరముండదు. శ్రేణీబల మనగా మామూలుగ నేదియో ఒక వృత్తి ననుసరించుచు, యుద్ధకాలమం దొకశ్రేణి-సంఘముగ వారి వారి నాయకులతోఏర్పడిన ప్రత్యేక సైన్యము. మిత్రుడు పంపిన సైన్యము మిత్రబలము. జయింప బడిన శత్రువు పంపిన సైన్యము అమిత్రబలము. పుళిందులు, శబరులు మొదలగు ఆటవికులతో కూడినది ఆటవికబలము. ఈ ఆరు విధములగు సైన్యముల గుణదోషము లీఅధ్యాయమున వివరింపబడినవి. అన్నిటికంటె మౌలబలము శ్రేష్ఠము. అమిత్రబలము, ఆటవికబలము అధమములు.

నమ్మదగినవి కాకపోవునని భయము కలిగినప్పుడు ; తక్కిన సైన్యముల బలము క్షీణించినప్పుడు మౌలబలము నుపయోగించవలెను.

3. "నా భృతకబలము గొప్పది, నా మౌలికబలము చిన్నది ; శత్రువువద్ద నుండు మౌలబలము చిన్నది ; అనురాగము లేనిది ; అతని భృతకబలమునందు బలములేనివా రధికముగను బలముగలవారు తక్కువగ నున్నారు ; అతనితోడి యుద్ధము దౌత్యయుద్ధము, దానిని సాగించుటకు స్వల్పసైనికవ్యాయామములు సరిపోవును ; వెళ్ళవలసిన దూరము కాలము స్వల్పములు ; క్షయవ్యయములు కూడ స్వల్పములు ; నా సైన్యములోని ద్రోహుల సంఖ్య తక్కువ ; శత్రువు కుట్రల నన్నింటిని నే నెదుర్కొంటిని ; నా సైన్యము నమ్మదగినట్టిది ; ఎదుర్కొనవలసిన శత్రువు దాడి స్వల్పమైనట్టిది," అని అనుకొనినప్పుడు భృతకబలము నుపయోగించవలెను.

4. "నావద్దనుండు శ్రేణీబలము గొప్పది ; దానిని మూలస్థానమందును యానమునందును ఉపయోగించవచ్చును ; దూరము స్వల్పము ; శత్రువువద్ద శ్రేణీబలమే అధికముగనున్నది ; అతడు దౌత్యసాధనమునను సైనికవ్యాయామ సాధనమునను యుద్ధము చేయదలచియున్నాడు ; వ్యవహారమును ఆయుధసహితమగు సైన్యముద్వారా నడిపించవలెను," అని అనుకొనినప్పుడు శ్రేణీబలము నుపయోగించవలెను.

5. "మూలస్థానమం దుపయోగించుటకును యానము చేయుటయం దుపయోగించుటకును కావలసినంతటి గొప్పమిత్రబలము నావద్ద నున్నది ; దూరము స్వల్పము ; దౌత్యయుద్ధమునకంటె వ్యాయామయుద్ధ మెక్కువగ సాగించవలసి యున్నది ; మొదట మిత్రబలముతో (శత్రువుయొక్క) ఆటవిబలమును దుర్గస్థానమును ఆసారమును ఎదుర్కొని తర్వాత నా స్వసైన్యముతో యుద్ధమును సాగించెదను ; ఈ కార్యము నాకును మిత్రునికిని సమానముగ లాభము చేకూర్చునట్టిది ; నా కార్యసిద్ధి మిత్రునిపై ఆధారపడినట్టిది ; నా మిత్రు డాసన్నుడు ; అనుగ్రహింపదగినవాడు ; అతని లాభముకొరకు వాని సైన్యములోని బహుళసంఖ్యాకులగు ద్రోహుల నాశము చేసెదను," అని అనుకొనినప్పుడు మిత్రబలము నుపయోగించవలెను.

6. "నావద్ద శత్రుబల మధికముగనున్నది ; శత్రుబలముతో నేను (యాతవ్యునియొక్క) నగరస్థానమునుగాని ఆటవికబలమునుగాని ఎదుర్కొనెదను ; అట్టి సందర్భములో కుక్కకు పందికి జరిగిన కలహమందు చండాలునికివలె ఫలిత మెట్టిదైనను నాకు తప్పక లాభము కలుగును ; ఆసారబలమందును ఆటవికబలమందునుగల కంటకములను వీరి సాధనమున నేను తొలగించగలను," (అని అనుకొనినప్పుడు) ఇట్టి బల మత్యధికమైనప్పుడు వారు తిరుగుబాటు చేయకుండునట్లు వారి నెల్లప్పుడు తన సమీపమందే ఉంచుకొనవలెను ; రాష్ట్రములోపల

కలహము సంభవించినపు డిట్లు చేయవలసినదిలేదు ; శత్రుయుద్ధము తర్వాత తాను యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు—ఇట్టి సమయములలో అమిత్రబలము నుపయోగించవలెను.

7. దీనినుండి ఆటవికబలము నుపయోగించదగిన కాలములను తెలుసుకొన వలెను. 8. మార్గమును చూపవలసివచ్చినప్పుడు ; శత్రుభూమికి తగియున్నప్పుడు ; శత్రుయుద్ధవిధానమునకు ప్రతీకారము చేయవలసివచ్చినప్పుడు ; "బిల్వమును బిల్వముచేతనే నాశము చేయవలెను," అను సూత్రము ప్రకారము శత్రువువద్ద ఆటవికబల మెక్కువగ నున్నప్పుడు ; అల్పమగు దాడి నెదుర్కొనవలసినప్పుడు— ఆటవికబలమును (ప్రత్యేకముగ) ఉపయోగించవలెను.

9. అనేక నాయకులు కలది, అనేక ప్రాంతములనుండి సమకూరినది, చెప్పినను చెప్పకున్నను దోపిడీ చేయుటకు సిద్ధమైనట్టిది—ఇట్టి సైన్యము ఔత్సాహిక సైన్యము.[2] భక్తవేతనము లియ్యకున్నను దోపిడి చేయునట్టిది ; కష్టపడి పనిచేయు నట్టిది ; ప్రతాపము కలది. శత్రువు కుట్రల మూలమున విభేదముగాంచునది. కాని, ఒకే ప్రాంతమునకుగాని, జాతికిగాని, వృత్తికిగాని సంబంధించినవా రెక్కువగ నున్నప్పుడు విభేదము గాంచదు.

దీనితో బలోపాదానకాలములు సమాప్తము

10. వీనిలో అమిత్రసైన్యమునకు ఆటవికసైన్యమునకు కుప్యద్రవ్యములను గాని, దోపిడిద్రవ్యమునుగాని వేతనముగ నియ్యవలెను. 11. లేదా, శత్రువు వాని బలమును సమకూర్చుకొను సమయము వచ్చినప్పుడు (విజిగీషువు) అమిత్ర బలమును తన వశమునందే ఉంచుకొనవలెను ; లేదా, వానిని ప్రదేశాంతరమునకు పంపవలెను ; లేదా, నిరుపయోగముగ జేయవలెను ; లేదా, చెదరగొట్టవలెను ; లేదా, కాలమతిక్రమించగనే పరిత్యజించవలెను.

12. అట్టిసైన్యములను సమకూర్చుకొను శత్రువున కాటంకము కలిగించ వలెను ; వాటిని తానే సమకూర్చుకొనవలెను.

13. సన్నాహముచేయుటలో ముందుచెప్పినవి తర్వాతచెప్పినవానికంటె శ్రేయస్కరములు.

14. రాజునకుండు భావములే మౌలబలమున కుండుటచేతను, అది సర్వదా అతని గౌరవమునకు పాత్రమగుటచేతను భృతకబలముకంటె మౌల బలము శ్రేష్ఠము.

15. సర్వదారాజున కాసన్నముగనుండుటచేతను, అతిత్వరితముగ కార్య ములను ప్రారంభింపగలది యగుటచేతను, వశపడియుండుటచేతను భృతకబలము శ్రేణీబలముకంటె శ్రేష్ఠము.

[2] ఔత్సాహికసైన్య మనగా స్వచ్ఛంద సైన్యము (Volunteer Corps).

16. స్వదేశీయమగుటచేతను, ఒకేప్రయోజనమును సాధించగోరినది యగుటచేతను, సంఘర్షణమందును విరోధమందును కార్యసిద్ధియందును లాభమందును రాజునకుండు భావముతో సమానమగు భావముకలదియగుట చేతను శ్రేణీబలము మిత్రబలముకంటె శ్రేష్ఠము.

17. ఒకే ప్రదేశమునకుగాని కాలమునకుగాని పరిమితము కానిదగుట చేతను ఒకే ప్రయోజనమును సాధింపదలచినదగుటచేతను మిత్రబలము అమిత్రబలముకంటె శ్రేష్ఠము.

18. ఆర్యుల నాయకత్వము కలది అగుటచేత అమిత్రబలము ఆటవిక బలముకంటె శ్రేష్ఠము. 19. దోపిడిచేయుటయే ఈ రెంటియొక్క ఉద్దేశము. 20. దోపిడిలభించనప్పుడు ఆపదలు సంభవించినప్పుడు వీనిమూలమున సర్ప భయమువంటి భయముకలుగును.

21. "బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రసైన్యములలో సన్నాహము చేయ వలసినప్పుడు ఉత్సాహశక్తిదృష్ట్యా ముందుది తర్వాతదానికంటె శ్రేయస్కరము," అని ఆచార్యులు. 22. "కాదు" అని కౌటిల్యుడు. 23. నమస్కారము చేసి శత్రువు బ్రాహ్మణసైన్యమును వశపరుచుకొనగలడు. 24. ఆయుధవిద్య యందు శిక్షణపొందిన క్షత్రియబలము శ్రేయస్కరము ; లేదా, అధికబలము గల వైశ్యబలము, శూద్రబలమునుకూడ శ్రేయస్కరమే.

25. కావున, "శత్రువుకూడ ఇట్టిసైన్యములుకలవాడు, వానినెదుర్కొ నుట కిది ప్రతిబలము," అని మనసునందుంచుకొని సైన్యసన్నాహము చేసుకొన వలెను.

26. ఏనుగులు యంత్రములు బండ్లు మధ్యనున్నట్టియు, కుంతము ప్రాసము హాటకము వెదుళ్ళు శల్యములు మొదలగువానితో కూడినట్టియు సైన్యము ఏనుగులబలమునకు ప్రతిబలము. 27 ఇట్టిదే, రాళ్ళు, గదలు, కవచములు, అంకుశములు, కచగ్రహణములు మొదలగువానితో కూడినది రథబలమునకు ప్రతిబలము. 28. అశ్వబలమునకు, కవచములధరించిన హస్తిబలమునకు, కవచములధరించిన అశ్వబలమునకుకూడ ఇదియే ప్రతిబలము. 29. కవచములతో కప్పబడిన రథములు ఆవరణములధరించిన కాల్బలము చతురంగబలమునకు ప్రతిబలము.

30. (శ్లో) ఇట్లు తన సైనికబలమున కనుగుణముగను, అందులోని అంగముల కనుగుణముగను, శత్రుసైన్యముల వారించుటకు సాధ్యమగునట్లు గను (రాజు) తనసైన్యముల సన్నాహపరుచుకొనవలెను.

ఇది అభియానముచేయువానికర్మ అను తొమ్మిదో అధికరణమందు బలోప దానకాలములు, సన్నాహగుణములు, ప్రతిబలకర్మ అనే రెండో అధ్యాయము.

## అధ్యాయము 3

### ప్రకరణము 140 : వెనుక వైపు సంభవించు తిరుగుబాటులు

### ప్రకరణము 141 : బాహ్యాభ్యంతర కోపప్రతీకారములు

1. వెనుకవైపు సంభవించు స్వల్పప్రమాదము, ఎదుటివైపున కనిపించు మహాలాభము—ఈ రెంటిలో వెనుకవైపున సంభవించు స్వల్పప్రమాదము గరీయము. 2. ఏలయన, యానము చేయుట కతడు వెళ్ళినతర్వాత దూష్యులు, శత్రువులు, ఆటవికులు స్వల్పప్రమాదము నలువైపుల వ్యాపించునట్లు వృద్ధి చేయుదురు; లేదా, ప్రకృతుల తిరుగుబాటు దానిని వృద్ధిచేయవచ్చును. 3. ఇది జరిగిన యెడల ఎదుటివైపులభించిన మహాలాభమును మిత్రులు భృత్యులు క్షయవ్యయములు మ్రింగివేయును. 4. కావున, వెనుకవైపు ప్రమాదము సంభవించినప్పుడు ఎదుటివైపు లాభము వేయింట నొక పాలో నూటికి ఒక పాలో అగుటచేత యానమును మానుకొనవలెను. 5. అనర్థములు సూదిమొన వంటివి," అను లోకోక్తి కలదు.[1]

6. వెనుక వైపు ప్రమాదము సంభవించినప్పుడు సామ దాన భేద దండముల నుపయోగించవలెను. 7. ఎదుటివైపు కనిపించు లాభము విషయములో సేనాపతినిగాని రాజకుమారునిగాని దండనాథునిగ చేయవలెను. 8. లేదా, వెనుకవైపు సంభవించిన ప్రమాదమును సులభముగ నణచగలిగినయెడల ఎదుటి వైపులాభమును సంపాదించుటకు రాజు స్వయముగ యానము చేయవలెను.

---

[1] మరియొకరాజ్యమును జయించనెంచి యానముచేయు రాజు ఎదుర్కొనవలసిన ప్రమాదములు, వానినెదుర్కొనుటకు ఉపాయములు ఈ అధ్యాయము వివరించుచున్నది. ఆ ప్రమాదములు మూడురకములు. అతడు యానము చేయునపుడు వెనుకవైపునుండి ద్రోహులుగాని, శత్రుసైన్యములుగాని అతనిపై పడవచ్చును; లేదా, అతని రాజ్యము లోపల తిరుగుబాట్లు సంభవించవచ్చును; లేదా, అతని బాహ్యప్రదేశములందు తిరుగుబాట్లు సంభవించవచ్చును.

9. రాష్ట్రములోపల తిరుగుబాటు జరుగునను సందేహము కలిగినప్పుడు అనుమానాస్పదులను తనవెంటబెట్టుకొని యానము చేయవలెను; బాహ్యప్రదేశము లందు తిరుగుబాటు జరుగునను సందేహము కలిగినప్పుడు వీరి పుత్రులను భార్యలను తనవెంటబెట్టుకొని యానముచేయవలెను.

10. రాష్ట్రములోపల సంభవించిన తిరుగుబాటు నణచి, వివిధములగు సైన్యముల ననేకనాయకుల స్వాధీనమందుంచి, శూన్యపాలు[2] నొకనిని నియమించి తాను యానము చేయవలెను; లేదా, యానమును మానుకొనవలెను. 11. రాష్ట్రము లోపలి తిరుగుబాటు బాహ్యప్రదేశములోని తిరుగుబాటుకంటె ప్రమాదకరమని ఇదివరకే చెప్పబడియున్నది.

12. రాష్ట్రములోపలి తిరుగుబా టనగా, మంత్రిగాని పురోహితుడుగాని సేనాపతిగాని యువరాజుగాని తిరుగుబాటు చేయుట. 13. తనలోని దోషమును తొలగించుకొనిగాని, కలహించినవానిశక్తికిని అపరాధమునకును ననుగుణమగు చర్యను తీసుకొనిగాని దాని నణచవలెను. 14. పురోహితుడు మహాపరాధము గావించినను కారాగారనిర్బంధశిక్షనో దేశబహిష్కారశిక్షనో విధించవలెను; యువరాజునకు నిర్బంధశిక్షను విధించవలెను; గుణవంతుడుగు కుమారు డింకొక డున్నయెడల మరణశిక్ష విధించవచ్చును.

15. రాజ్యమును హరించగోరు పుత్రుని సోదరుని కుటుంబములోని మరియొకనిని అనాలస్యముగ సాధించవలెను; అట్లు సాధించలేనప్పుడు శత్రువుతో నతడు కలియునను భయమును పోగొట్టుకొనుటకై అతడు హరించినభాగము నతనికిచ్చి రాజీచేసుకొనవలెను. 16. లేదా, అట్టివాడగు మరియొకనికి భూమిని దానముచేసి, అతనివిశ్వాసమును సంపాదించవలెను. 17. లేదా, అతనికంటె బల వత్తరమగు సైన్యమునకు భూమి నాక్రమించుట కనుజ్ఞ నిచ్చి, అతనిపైకి పంపవలెను; లేదా, సామంతునిగాని, ఆటవికునిగాని, అతనిపైకి పంపవలెను; అతడు వారితో యుద్ధము చేయుచున్న సమయములో నతనిని వంచించ వలెను. 18. లేదా, అభిమానమును కోల్పోయిన రాజపుత్రుని విషయమం దనుస రించవలసిన విధానమునుగాని, శత్రునగరమును వశపరుచుకొనవలసినప్పు డనుసరించు విధానమునుగాని అనుసరించవలెను. 19. దీనినుండి మంత్రిసేనా పతుల విషయమును తెలుసుకొనవలెను.

20. మంత్రియు తదితరులును తప్ప తక్కిన అమాత్యుల రాష్ట్రము లోపలి తిరుగుబాటు అంతరమాత్యుల తిరుగుబాటు. 21. వారి విషయములోకూడ యథార్థములగు ఉపాయముల నుపయోగించవలెను.

---

[2] శూన్యపాలు డనగా రాజు హాజరులో లేనప్పుడు వానిస్థానమున పరిపాలన భారమును వహించువాడు.

22. బాహ్యప్రదేశమందలి తిరుగుబాటనగా, రాష్ట్రముఖ్యుడుగాని అంత పాలుడుగాని ఆటవికుడుగాని దండోపనతుడుగాని చేయు తిరుగుబాటు. 23. వారిలో వారికి భేదము కల్పించి దాని నణచవలెను. 24. లేదా, తాను దుర్గములో సుస్థాపితుడై సామంతుడు, ఆటవికుడు, దాయాది, బంధితుడగు రాజకుమారుడు— వీరిలో నొకని సాధనమున నతని నణచవలెను. 25. లేదా, అతడు శత్రుపక్షము వహించకుండునట్లు తన మిత్రులలో నొకని సాధనమున నతనిని వశపరచుకొన వలెను.

26. లేదా, గూఢపురుష డొక డతనితో, "ఇతడు (ఈ శత్రువు) నీవొక గూఢపురుషుడవని భావించి రాజుపై కలహించునట్లు చేసి, తన ప్రయోజనము సాధించుకొనిన తర్వాత నీకొక సైన్యము నిచ్చి శత్రువుపైకిగాని ఆటవికునిపైకిగాని పంపును ; లేదా, కష్టసాధ్యమగు మరియొక పనియందు నియోగించును ; లేదా, నీ భార్యాపుత్రులను వేరుచేసి నిన్నొక దూరప్రదేశమునకు పంపివేయును.

27. "(నీ భర్తపై) యుద్ధములో నీవు ఓడినయెడల నిన్నతడు పణ్యముగ రాజునకు విక్రయించును ; లేదా, నిన్ను సాధనముగ నుపయోగించి, వానితో సంధి చేసుకొనును. 28. కనుక నుపకారయోగ్యుడగు నతని మిత్రుని చేరుము," అని చెప్పి శత్రువునుండి వానిని విడదీయవలెను.

29. దీని కతడు సమ్మతించినయెడల నతని కోరికలను తీర్చి గౌరవించ వలెను. 30. అతడు సమ్మతించనియెడల, "ఇతడు నిన్ను శోధించుటకు గూఢ పురుషుడుగ నియమింపబడినవాడు," అని చెప్పి ఆశ్రయమునుండి వానిని వేరు చేయవలెను. 31. లేదా, మరణశిక్షకు పాత్రులైనవారి లేఖల నాధారముగ జేసుకొని కాని, గూఢపురుషుల సాధనమునగాని వానిని చంపించవలెను. 32. లేదా, అతనితో కలిసివెళ్ళిపోయిన ప్రవీరపురుషుల అభిమతములను తీర్చి వారిని వశపరచుకొన వలెను. 33. అటుతర్వాత వారు తన్ననుసరించినవారని గూఢపురుషుడు ప్రకటించ వలెను. 34. ఇట్లు కార్యసిద్ధిని గాంచవలెను.

35. ఇట్టి తిరుగుబాటులు శత్రువుపై జరుగునట్లతడు కుట్రలు పన్నవలెను ; తనపై జరిగినవాని నణచవలెను.

36. తిరుగుబాటును లేవదీయుటకుగాని అణచుటకుగాని సమర్థుడగువాని నతడు రహస్యముగ ప్రోత్సహించవలెను.

37. ఎవడు సత్యసంధుడో, ఎవడు కార్యముల కొనసాగించుటయందును వాటి ఫలమును సంపాదించుటయందును సహాయముచేయగలవాడో, ఎవడు కార్య ములు చెడినపుడు రక్షించగలవాడో, వాని విషయమున కుట్రకు మారుకుట్ర చేయ వలెను ; అతడు సదుద్దేశములు కలవాడైనది శఠుడైనది ఆలోచించి తెలుసుకొన వలెను.

38. బాహ్యప్రదేశములోని శరుడగు అధికారి రాష్ట్రములోపలి అధికారి నొకనిని ఈ క్రింది ఉద్దేశములతో తిరుగుబాటు చేయుమని ప్రోత్సహించవచ్చును : "రాజును చంపి నన్ను రాజుగ ప్రతిపాదించినయెడల శత్రువు చనిపోవుట, రాజ్యము లభించుట అను రెండు లాభములు నాకు కలుగును ; లేదా, శత్రువే ఇతనిని చంపును ; దాని ఫలితముగ చనిపోయిన ముఖ్యుని బంధువులు అట్టి నేరము చేసి నందుకు శిక్ష ననుభవింపవలసివచ్చునని భయపడిన ఇతరులు నా పక్షమున చేరి నాకు వశు లగుదురు ; లేదా, అట్టివారిని మరికొందరిని రాజు శంకించును ; అప్పుడు మరణశిక్షను పొందినవారి లేఖల నాధారముగ జేసుకొని వాని ముఖ్యులలో నొకరొకరినిగ చంపించెదను."

39. రాష్ట్రము లోపలి శరుడగు అధికారి బాహ్యప్రదేశములోని అధికారి నొకనిని ఈ క్రింది ఉద్దేశములతో తిరుగుబాటుచేయుమని ప్రోత్సహించవలెను : "నే నతని కోశమును వశపరుచుకొనెదను ; లేదా, అతని సైన్యమును నాశనము చేసెదను ; లేదా, దుష్టుడగు రాజు నతనిచే చంపించెదను ; అతడు సమ్మతించిన యెడల, అతని సైన్యము చిక్కుబడిపోవును ; అతని విరోధము మరింత బలపడును ; అప్పుడతడు నాకు వశుడగును ; అప్పుడు నేను రాజును శాంతింపజేయగలను ; లేదా, నేనే రాజ్యమును వశపరుచుకొనెదను," అని చెప్పి "బాహ్యప్రదేశములోని అధికారిని శత్రువుతోగాని అటవికునితోగాని యుద్ధము చేయునట్లు ప్రోత్సహించెదను ; లేదా, అతనిని బంధించి బాహ్యప్రదేశమును రాజుయొక్క భూమిని—ఈరెంటిని— సంపాదించెదను ; రాజుపట్ల విరోధము వహించి నాయందు విశ్వాసముకలవాడైన తర్వాత బాహ్యప్రదేశ ముఖ్యుని నావద్దకు పిలిపించుకొని చంపించివేసెదను ; శూన్య మగు నతని మూలస్థానము నపహరించెదను."

40. సదుద్దేశములు కలవాడు సహజీవుల లాభము నపేక్షించి ఇతరులు తిరుగుబాటు చేయునట్లు ప్రోత్సహించును.

41. సదుద్దేశములు కలవానితో సంధి చేసుకొనవలెను ; దురుద్దేశము కల వానితో "అట్లే కానిమ్ము," అని సమ్మతించి, తర్వాత నతనిని మోసగించవలెను.

42. (శ్లో) దీనినంతను గ్రహించి నీతివిదుడగు రాజు పరులను పరుల నుండియు, తనవారిని తనవారినుండియు, తనవారిని పరులనుండియు, పరులను తనవారినుండియు రక్షించుచు తన్ను తనవారినుండియు పరులనుండియు రక్షించు కొనవలెను.

ఇది అభియానము చేయువాని కార్యము అను తొమ్మిదో అధికరణమందు వెనుకవైపు సంభవించు తిరుగుబాటులు, బాహ్యాభ్యంతర కోపప్రతీకారములు అనే మూడో అధ్యాయము.

# తొమ్మిదో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 142 : క్షయ వ్యయ లాభముల విపరిమర్శ

1. పశునష్టము పురుషనష్టము—ఇది క్షయము. 2. హిరణ్యమునకు ధాన్యములకు కలుగు నష్టము వ్యయము.

3. సుగుణము లనేకములతో కూడిన లాభము క్షయవ్యయములకంటె నధికమగునపుడు యానము చేయవలెను.

4. ఆదేయము, ప్రత్యాదేయము, ప్రసాదకము, ప్రకోపకము, హ్రస్వకాలికము, తనుక్షయము, అల్పవ్యయము, మహత్తు, వృద్ధ్యుదయము, కల్యము, ధర్మ్యము, పురోగము—ఇవి లాభసంపదలు.

5. సులభముగ పొందదగినది, సులభముగ రక్షించుకొనదగినది, శత్రువు మరల తీసుకొనుటకు సాధ్యముకానిది—ఇది ఆదేయము (తీసుకొనదగినది). 6. దీనికి విరుద్ధమగునది ప్రత్యాదేయము. 7. అట్టిదానిని (భూమిని) వశపరుచు కొనువాడు, అందు నిలబడిపోవువాడు వినాశముగాంచును.

8. "ప్రత్యాదేయమును వశపరచుకొని (శత్రువుయొక్క) కోశమునకు సైన్యమునకు, వస్తుసమూహమునకు దుర్గములకు నాశము కలిగించెదను ; గనులను, ద్రవ్యవనములను, హస్తివనములను, సేతుబంధములను, వణిక్పథము లను సారహీనములుగ చేసెదను ; అతని ప్రజలను కష్టపెట్టెదను ; లేదా, స్థాన భ్రష్టుల చేసెదను ; లేదా, తగువిధమున శాంతింపజేసెదను ; శత్రువు ప్రతికూల చర్యలవలన వారికి కోపము కలిగించును ; దీని నితని శత్రువునకు అమ్మివేయుదును ; లేదా, దీని నతని మిత్రుడుగాని అభిమానమును కోల్పోయిన రాజపుత్రుడుగాని స్వీకరించునట్లు చేయుదును ; లేదా, నే నిక్కడనే ఉండి దొంగలుగాని శత్రువులు గాని నా మిత్రుని రాజ్యమునకు నా రాజ్యమునకు కలిగించు ప్రమాదముల నెదుర్కొ నెదను ; అతని మిత్రుడుగాని అతని కాశ్రయమిచ్చినవాడుగాని అతని బలహీనతను

గ్రహించునట్లుగజేసి, వారు విరక్తులైనప్పుడు అతని శత్రువునుగాని దాయాదిని గాని సమర్థించునట్లు చేసెదను ; లేదా, అతనిని గౌరవించి, అతని భూమిని మరల నతని కిచ్చి దీర్ఘకాలము నాతో కలిసి పనిచేయు మిత్రుని సంపాదించినవాడ నగుదును," అని అనుకొనినపుడు ప్రత్యాదేయమగు లాభమునుకూడ నతడు సంపాదించవచ్చును.

9. ఇట్లు ఆదేయ ప్రత్యాదేయములు వ్యాఖ్యానించబడినవి.

10. అధార్మికుడగు రాజు నుండి ధార్మికుడగు రాజు లాభమును సంపాదించి తనకు తన ప్రజలకు ప్రసాదకుడగుచున్నాడు (ఇంపు కలిగించువాడు). 11. దీనిక విరుద్ధమగు లాభము ప్రకోపకము (కోపము కలిగించునట్టిది).

12. మంత్రుల ఉపదేశానుసారము లభించని లాభముకూడ ప్రకోపకము. (ఏలయన) వారు "మనవలన నితనికి క్షయవ్యయములు కలిగినవి," అని భావింతురు. 13. దూష్యులగు మంత్రుల ఉపదేశమునకు విరుద్ధముగ లభించిన లాభముకూడ ప్రకోపకము. (ఏలయన) వారు "ఇతడు తన యుద్దేశమును నెరవేర్చుకొన్నవాడై మనలను నాశముచేయును," అని భావింతురు. 14. దీనికి విరుద్ధమగు లాభము ప్రసాదకము.[1]

15. ఇట్లు ప్రసాదక ప్రకోపక లాభములు వ్యాఖ్యానింపబడినవి.

16. గమన మాత్రము వలన సాధించిన లాభము హ్రస్వ కాలికము. 17. దౌత్యసాధనమున సంపాదించిన లాభము తనుక్షయము (స్వల్పనష్టముతో కూడినది). 18. భోజనవ్యయ మొకదానితో సంపాదించిన లాభము అల్పవ్యయము. 19. ప్రస్తుతము విపులమగు లాభము మహాలాభము. 20. ఆటంకము లేక మరింత లాభమును చేకూర్చునది వృధ్యుదయము. 21. కీడులేని లాభము కల్యము. 22. ప్రశస్త సాధనముల మూలమున సంపాదించినది ధర్మ్యము. 23. సామవాయికుల ఆటంకములకు లోబడక లభించినది పురోగము.

24. (రెండు యానములనుండి లభించు) లాభము సమానముగ నున్నప్పుడు దేశకాలములు, శక్తులు, ఉపాయములు, ప్రియాప్రియములు, జవాజవములు, దగ్గర దూరములు, వర్తమాన భవిష్యత్తులలోని ఫలితములు, సారత్వసాతత్యములు, గుణముల సంఖ్య, గుణముల బాహుళ్యము—వీని నన్నిటిని విమర్శించి, బహు గుణములుగల లాభమును సంపాదించవలెను.

---

[1] లాభము వచ్చునని మంత్రులు చెప్పిన సలహా ననుసరించి యానము చేసినప్పుడట్టి లాభము రానియెడల నది మంత్రుల కోపమునకు కారణమగును. అట్లే ద్రోహులగు మంత్రులు లాభము రాదని చెప్పినను లాభము వచ్చినప్పుడు వారుకూడ కోపము చెందెదరు. ఈ రెండు సందర్భములలో తమ సలహా వ్యర్థమగుటవలన మంత్రులు భయపడి రాజుపై కోపముగలవారగుచున్నారు.

25. లాభమునకు విఘ్నములు కలిగించునవి: కామము, కోపము, పిరికితనము, కారుణ్యము, సిగ్గు, అనార్యభావము, మానము, కనికరము, పరలోకాపేక్ష, ధార్మికత్వము, త్యాగబుద్ధి లేకపోవుట, దైన్యము, అసూయ, చేజిక్కినదానిని లక్ష్యపెట్టకుండుట, దౌరాత్మ్యము, అవిశ్వాసము, భయము, ప్రతీకారము చేయక పోవుట, శీతోష్ణవర్షములను సహించలేకపోవుట, మంగళ తిథి నక్షత్రములందు ఇష్టము.

26. (శ్లో) సర్వదా నక్షత్రమును లెక్కించు మూఢుని నుండి అర్థము తొలగి పోవును. అర్థమునకు అర్థమే నక్షత్రము. నక్షత్రములు చేయగలిగినది ఏమి కలదు ?

27. (శ్లో) ధనహీనులు శతాదియత్నములు చేసినను కార్యమును సాధించు కొనజాలరు. ఏనుగులు ఏనుగులచేతనే పట్టుకొనబడునట్లు అర్థము లర్థములకే వశమగును.

ఇది అభియానము చేయువాని కార్యము అను తొమ్మిదో అధికరణమందు క్షయవ్యయలాభముల విపరిమర్శ అనే నాలుగో అధ్యాయము.

# తొమ్మిదో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 143 : బాహ్యాభ్యంతరములగు ఆపదలు

1. సంధి మొదలగు సాధనముల నుపయోగించదగినట్లుపయోగించకపోవుట **అపనయము**. 2. దాని మూలమున ఆపదలు (కుట్రలు) సంభవించును.

3. ఆపదలు (కుట్రలు) నాలుగు విధములు : బాహ్యమందుత్పత్తియై అభ్యంతరులచే బలపరుపబడినవి ; అభ్యంతరమందుత్పత్తియై బాహ్యులచే బలపరుపబడినవి ; బాహ్యమందుత్పత్తియై బాహ్యులచే బలపరుపబడినవి ; అభ్యంతరమందుత్పత్తియై అభ్యంతరులచే బలపరుపబడినవి.[1]

4. బాహ్యమందలివారు అభ్యంతరులను కుట్రలలోకి దించినపుడును, అభ్యంతరులు బాహ్యమందలివారిని కుట్రలలోకి దించినప్పుడును ఈ రెండు వర్గములవారు కలిసినయెడల దింపబడినవారిని వశము చేసుకొనుట లాభకరము. 5. కుట్రలను ప్రోత్సహించువారికంటె వానికి చెవియొగ్గి బలపరిచినవారెక్కువ మోసగాండ్రు. 6. వారిని వశపరుచుకొనినయెడల కుట్రలను ప్రోత్సహించినవారితరులను కుట్రలలోకి దించజాలరు. 7. ఏలయన, బాహ్యుల కాభ్యంతరులను కుట్రలలోకి దింపుటయు, అభ్యంతరులకు బాహ్యులను కుట్రలలోనికి దింపుటయు కష్టసాధ్యము. 8. పరులు చేయు ఇట్టి మహాప్రయత్నములు విఫలము లగును ; అందుమూలమున తనకు (రాజునకు) లాభము చేకూరును.

---

[1] కుట్రలను లేవదీయువారొకరు, వానిలోనికి దిగి బలపరచువారు మరియొకరు—అను భేదము నాధారముగ జేసుకొని ఈ వర్గీకరణము జరిగినది. పరరాజ్యముపైకి దండయాత్ర తలపెట్టిన రాజు తన రాజ్యములో కుట్రలు జరుగకుండ చూచుకొనవలెను. విదేశములందు లేవదీయబడిన కుట్రలకంటె దేశములోపల లేవదీయబడిన కుట్రలు ఎక్కువ ప్రమాదకరములను గొప్ప సత్యమును కౌటిల్యుడు స్పష్టపరిచెను. దేశస్వాతంత్ర్య సౌభాగ్యముల వినాశమునకు అంతఃకలహములే ప్రధానకారణములని మనదేశచరిత్ర మిక్కిలిగా చాటుచున్నది.

9. కుట్రలకు వశులైన అభ్యంతరుల విషయములో సామదానముల వినియోగించవలెను. 10. ఉన్నతోద్యోగమును, గౌరవమును ఇచ్చుటయే సామము. 11. అనుగ్రహములు, పరిహారములు, కార్యములలో వినియోగించుట—ఇవి దానములు.

12. బాహ్యులు కుట్రలకు వశులైనప్పుడు భేద దండములను వినియోగించవలెను. 13. మిత్రుల వేషము ధరించిన గూఢపురుషులు బాహ్యుల కీ రహస్య సమాచారము నందించవలెను : "ద్రోహుల వేషము ధరించిన ఈ గూఢపురుషుల సాధనమున రాజు మిమ్ము మోసగించదలచియున్నాడు ; జాగ్రత్తపడుడు." 14. లేదా, ద్రోహుల వేషము ధరించిన గూఢపురుషులు అభ్యంతరద్రోహులవద్ద చేరి, వారిని బాహ్యద్రోహులనుండియు, బాహ్యద్రోహులను అభ్యంతరద్రోహులనుండియు విడదీయవలెను. 15. లేదా, ద్రోహుల సన్నిధియందు జేరిన తీక్ష్ణులు శస్త్రములచేత గాని విషప్రయోగముచేతగాని వారిని చంపవలెను. 16. లేదా, బాహ్యద్రోహులను నగరమున కాహ్వానించి చంపించవలెను.

17. బాహ్యప్రదేశములోనివారు బాహ్యులను కుట్రలలోకి దింపినపుడును, అభ్యంతరులు అభ్యంతరులను కుట్రలలోనికి దింపినపుడును, కుట్రదారు లొక ప్రాంతమునందుమాత్రమే కలిసినయెడలను, కుట్రలను లేపినవారిని వశముచేసుకొనుట లాభకరము. 18. ఏలయన, ద్రోహమును నిర్మూలించినతర్వాత ద్రోహులుండరు. 19. కాని, ద్రోహులను వశపరుచుకొనినయెడల మరికొందరు ద్రోహవర్గములో చేరవచ్చును.

20. కావున, బాహ్యులు కుట్రలను లేవదీసినప్పుడు భేదదండములు వినియోగించవలెను. 21. మిత్రవేషమును ధరించిన గూఢపురుషులు, "ఈ రాజు స్వయముగ నిన్ను పట్టుకొనదలచియున్నాడు ; నీవు రాజుతో యుద్ధముచేయు స్థితియందున్నావు ; జాగ్రత్తపడుము," అని చెప్పవలెను. 22. లేదా, కుట్రలకు లోబడినవాని దూతకు సంబంధించిన సైన్యములో తీక్ష్ణులు ప్రవేశించి, శస్త్రములతోను విషము మొదలగువానితోను వాని ఛిద్రములపై దెబ్బతీయవలెను. 23. అటుతర్వాత గూఢపురుషులు కుట్రను లేవదీసినవానిపై నేరమును మోపవలెను.

24. అభ్యంతరులు అభ్యంతరులను కుట్రలలోనికి దించినపుడు యథార్థముగ నుపాయములను వినియోగించవలెను. 25. పైకి తృప్తిచెందినవానివలె కనిపించుచు వాస్తవముగ నసంతృప్తిచెందినవాని విషయములోను, దీనికి విరుద్ధముగ నుండువాని విషయములోను సామమును వినియోగించవలెను. 26. శుచిఅనియు సామర్థ్యముగలవాడనియు గుర్తించి గౌరవించుట, ఆపత్కాలమందుగాని శుభసమయములందుగాని ఆదరమును చూపుట—ఇవి దానములు. 27. లేదా, మిత్రుని వేషము ధరించిన గూఢపురుషుడు, "మీ భావములను తెలుసుకొనుటకై రాజు మిమ్ము శోధించును ; మీరు మీ భావములను స్పష్టముగ తెలియపరుపవలెను,"

అని వారితో చెప్పవలెను. **28.** లేదా, "మిమ్ములనుగురించి ఫలానొవాడు రాజున కిట్లు రహస్యముగ చెప్పుచున్నాడు," అని పలుకుచు వారిలోవారికి భేదము కల్పించ వలెను—ఇది భేదము. **29.** దాండ కార్మిక విషయమున చెప్పినట్లు బలప్రయో గము చేయవలెను.

**30.** ఈ నాలుగు విధములగు కుట్రలలో ప్రప్రథమమున అభ్యంతరములగు వానిని పరిహరించవలెను. **31.** అభ్యంతరమగు తిరుగుబాటు, సర్పభయము వలె, బాహ్యమగు తిరుగుబాటుకంటె ప్రమాదకరమని ఇంతకు పూర్వమే చెప్ప బడినది.

**32.** (శ్లో) కుట్రలలో ముందు చెప్పబడినది తర్వాత చెప్పబడినదానికంటె తక్కువ ప్రమాదకరమని తెలుసుకొనవలెను; లేదా, బలవంతులు లేవదీసినది ఎక్కువ ప్రమాదకరమనియు, దానికి విరుద్ధమగునది తక్కువ ప్రమాదకరమనియు తెలుసుకొనవలెను.

ఇది అభియానముచేయువాని కార్యము అను తొమ్మిదో అధికరణమందు బాహ్యాభ్యంతరములగు ఆపదలు (కుట్రలు) అనే అయిదో అధ్యాయము.

# తొమ్మిదో అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 144 : దూష్య శత్రుసంయుక్తములు (ఆపదలు)

1. దూష్యుల మూలమున మాత్రమే సంభవించినది, శత్రువుల మూలమున మాత్రమే సంభవించినది—అని శుద్ధములగు నాపదలు రెండు విధములు.

2. దూష్యుల మూలమున మాత్రమే సంభవించిన ఆపదలలో పౌరులమీదను జానపదులమీదను దండము తప్ప తక్కిన ఉపాయములను ప్రయోగించవలెను. 3. ఏలయన, ప్రజాసమూహముపై దండము ప్రయోగించుట సాధ్యముకాదు. 4. ప్రయోగించినను వాంఛించిన ప్రయోజనము లభించకపోవుటయేకాక మరియొక అనర్థమునకు దారితీయును. 5. కాని, ప్రజానాయకులపై దాండకార్మికమందు చెప్పిన విధానమును ప్రయోగించవలెను.[1]

6. శత్రువుల మూలమున మాత్రమే సంభవించిన ఆపదల విషయములో శత్రుప్రధానుడుగాని, సామాన్యుడుగాని ఉన్న ప్రదేశమందు సామాది ఉపాయముల ప్రయోగించి కార్యసిద్ధిని పొందవలెను. 7. ప్రధానుని విషయములలో కార్యసిద్ధికి రాజు ఆధారము; సామాన్యుని విషయములో కార్యసిద్ధికి మంత్రి ఆధారము; ఇద్దరి విషయములో కార్యసిద్ధికి ఇద్దరును ఆధారము.

8. దూష్యాదూష్యులు కలియుటవలన సంభవించిన ఆపద అమిశ్రాపద. 9. అమిశ్రాపద నెదుర్కొనుటలో కార్యసిద్ధి అదూష్యుల మూలమున లభించును. 10. ఏలయన, ఆలంబనము లేక ఆలంబితు డుండడుకదా !

11. మిత్రులు శత్రువులు కలియుటవలన సంభవించిన ఆపద పరమిశ్రాపద. 12. పరమిశ్రాపదల నెదుర్కొనుటలో కార్యసిద్ధి మిత్రుల మూలమున

[1] ప్రజలు ద్రోహబుద్ధి కలవారైనను వారందరిపై దండమును ప్రయోగించరాదనుట గమనించదగిన విశేషము. ప్రజానాయకులు మాత్రమే దండనార్హులు.

లభించును.[2] 13. ఏలయన, మిత్రునితో సంధి సులభము ; శత్రువుతో సులభము కాదు.

14. మిత్రుడు సంధికి సమ్మతించని యెడల పదేపదే అతనిపైన రహస్య కుట్రలను పన్నవలెను. 15. అటుతర్వాత గూఢపురుషులద్వారా వానిని శత్రువుల నుండి విడదీసి తన పక్షమునకు రప్పించవలెను. 16. లేదా, సామవాయిక మిత్రుల పొలిమేరయందుండు రాజును వశపరుచుకొనవలెను. 17. పొలిమేర యందున్నవాడు వశుడైన యెడల నడుమనున్నవారందరు విడిపోయెదరు. 18. లేదా, నడుమనున్నవారిలో నొకనిని వశపరుచుకొనవలెను. 19. నడుమనున్నవాడు వశుడైన యెడల పొలిమేరయందుండువారి కలయిక దెబ్బతినును.

20. సామవాయికులలో నాశ్రయభేదము కలుగు నుపాయముల ప్రయోగించ వలెను.[3]

21. ధార్మికుడగు రాజును వాని జాతి కుల పాండిత్య ప్రవర్తనములను ప్రశంసించియు, తమకుగల ప్రాతకాలపు బంధుత్వమును జ్ఞాపకపరిచియు త్రికాల ములలో ఉపకారము చేసియు కీడుచేయకయు తనవైపునకు త్రిప్పుకొనవలెను. 22. ఉత్సాహము పోగొట్టుకొనిన వానిని, యుద్ధమందు విరక్తిగాంచిన వానిని, ప్రయత్నములలో వైఫల్యముగాంచిన వానిని, క్షయవ్యయముల మూలముననుదండయాత్రల మూలమునను నష్టపడినవానిని, తన శుచిత్వము నాధారముగ జేసుకొని మైత్రి నపేక్షించువానిని, మరియొకని వలన భయముగాంచినవానిని, మైత్రియే ప్రధానమని భావించినవానిని, సదుద్దేశములు కలవానిని సామోపాయముచే వశపరుచుకొనవలెను.

23. తాపసునిగాని ముఖ్యునిగాని మొదట జామీనుగ గ్రహించి లుబ్ధుని హీనబలుని దానోపాయమున వశపరుచుకొనవలెను. 24. దానము లయిదు విధ ములు : తనకు రావలసినదానిని వదలుకొనుట ; ఇతరుడు తీసుకొనినదానికి సమ్మ తించుట ; తాను తీసుకొనినదానిని ఇచ్చివేయుట ; ఇంతకుపూర్వమియ్యని తన ద్రవ్య మిప్పుడిచ్చుట ; ఇతరుల ధనము నపహరించుటకు సమ్మతించుట. 25. దీనితో దానకర్మ సమాప్తము.

26. పరస్పర ద్వేషమువలనను వైరమువలనను భయపడినవానిని, తన భూమిని మరియొక డాక్రమించుకొనునేమోఅని శంకించినవానిని భేదోపాయము లలో నొకదానిని ప్రయోగించి వశపరుచుకొనవలెను. 27. "(అతనితో) సంధి చేసుకొని ఇతడు నీపైన చర్యను ప్రారంభించును. అందుకై వాని మిత్రుని రప్పించు

[2] ఆపదలు మూడు విధములు : శుద్ధములు, ఆమిత్రాపదలు, పరమిత్రాపదలు—అని.

[3] సామవాయికు లనేకులుకలసి ఒకనిపై యానముచేసినపుడు వారివలన కలుగు నాపదల నెదుర్కొనుటలో ననుసరించదగినఉపాయము లిందు వివరింపబడినవి.

చున్నాడు. సంధిసంప్రతింపులలో నీమాటకూడ లేదు," అని బెదరించి పిరికివానిని విడదీయవలెను.

28. ఏరాజునకైనను స్వదేశమునుండిగాని విదేశమునుండిగాని పణ్యములు కానుకలుగ లభించినపుడు గూఢపురుషులు, "ఇవి అన్నియు మనము యానము చేయదలచిన శత్రువునుండి వచ్చినవి," అని ప్రచారము చేయవలెను. 29. ప్రచారము బాగుగ జరిగిన తర్వాత, "ఈ ద్రవ్యములు కానుకలుగ నేను నీకు పంపితిని ; సామవాయికులపై పడుము ; లేదా, వారిని పరిత్యజించుము ; అప్పుడు నేను నీకు శేషించిన ద్రవ్యముల నిచ్చెదను," అని మరణశిక్షకు పాత్రుడైనవాని ద్వారా లేఖను పంపవలెను. 30. అటుతర్వాత గూఢపురుషులు, "దీని నిచ్చిన వాడు శత్రువు," అని అందరు గ్రహించునట్లు చేయవలెను.

31. లేదా, శత్రువునకు చెందినట్టిది యని అందరికి తెలిసిన ద్రవ్యము నొకదాని నజ్ఞాతముగ విజిగీషునికి చేర్చవలెను. 32. వర్తక వేషమును ధరించిన గూఢచారులు దానిని శత్రుదేశములోని ముఖ్యులకు విక్రయించవలెను. 33. అటు తర్వాత, "ఈ వస్తువు నిచ్చినవాడు శత్రువు," అని గూఢపురుషులు ఇతరులు గ్రహించునట్లు చేయవలెను.

34. లేదా, మహాపరాధముల గావించినవారిని అర్థమానములచే ననుగ్రహించి శస్త్రములతోను విషద్రవ్యములతోను అగ్నిపరికరములతోను వారిని శత్రువుపైకి పంపవలెను. 35. అటుతర్వాత నమాత్యులలో నొకడు తన్ను పరిత్యజించినట్లు నటించవలెను. 36. అమాత్యుని పుత్రులను భార్యను తన రక్షణలోనుంచుకొని, "రాత్రియందు వారు హత్యచేయబడిరి," అని ప్రకటించవలెను. 37. అటుతర్వాత నమాత్యుడు అపరాధుల నొక్కొక్కరిని శత్రువునకు తెలియపరుపవలెను. 38. తాను చెప్పినట్లు వారు ప్రవర్తించినయెడల వారు పట్టుబడకుండ చేయవలెను. 39. అది సాధ్యము కానప్పుడు వారిని పట్టించ వలెను. 40. అతనివద్ద ఆప్తుడైన అమాత్యుడు సామవాయికముఖ్యుని మూలమున ప్రమాదము సంభవించగలదనియు, అవిషయములో జాగరూకత వహించవలసి యున్నదనియు శత్రువునకు బోధించవలెను.

41. అప్పు డుభయవేతను డొకడు ముఖ్యుని వినాశమునకై శత్రువు వ్రాసినలేఖను హరించవలెను.

42. లేదా, ఉత్సాహశక్తిగలవానికి, "ఫలానావానిరాజ్యము నాక్ర మించుము. మనసంధి ఎప్పటివలె నుండును," అని లేఖను పంపవలెను. 43. తర్వాత గూఢచారు లాలేఖ శత్రువుల వశమగునట్లు చేయవలెను.

44. లేదా, సామవాయికులలో నొకని స్కంధావారమునుగాని యుద్ధ సామగ్రినిగాని, ఆసారబలమునుగాని, గూఢపురుషులు నాశముచేయవలెను.

45. ఇతరులతో తనకుగల మైత్రిని గురించి అతడు ప్రస్తావించునపుడు, "వీరు నన్ను నాశముచేయదలచియున్నారు," అని చూచాయగ చెప్పవలెను.

46. సామవాయికులలోనొకని ప్రవీరపురుషునిగాని ఏనుగునుగాని, గుర్రమునుగాని గూఢపురుషులు చంపినప్పుడును, లేదా, తీసుకొనివెళ్ళిపోయినప్పుడును, మరికొందరు గూఢపురుష లిదియంతయు సామవాయికులలో నొకడు చేసినపని అని ప్రచారముచేయవలెను. 47. అప్పు డితడు (విజిగీషువు) నేరముగావించినట్లు చెప్పబడినవానికి, "ఇట్టిపనిని నీవు మరిమరిచేయుము. నీ కిచ్చినట్లు చెప్పిన ధనములో తక్కినభాగము నే నప్పుడు నీ కిచ్చెదను," అని ఒకలేఖను వ్రాయవలెను. 48. ఉభయవేతను లాలేఖను పట్టుకొనవలెను.

49. ఇట్లు వారిలోవారికి విభేదములు కలిగిన తర్వాత వారిలోనొకరిని తన వశములోనికి తెచ్చుకొనవలెను.

50. దీనినుండి సేనాపతులలోను రాజకుమారులలోను దండనాయకులలోను కల్పించవలసిన విభేదములగురించి తెలుసుకొనవలెను.

51. సంఘములలోగూడ నతడు విభేదములు కల్పించవలెను. 52. దీనితో భేదకర్మ సమాప్తము.

53. తీక్ష్ణుని, ఉత్సాహశక్తికలవానిని, ఆపదలో చిక్కుకొనినవానిని, దుర్గము నాశ్రయించినవానిని, గూఢపురుషులు శస్త్రము అగ్ని విషము మొదలగువాని సాధనమున సాధించవలెను; లేదా, కార్యసౌలభ్యమునుబట్టి వారిలో నొకడే ఈపనిని చేయవచ్చును. 54. ఏలయన, తీక్ష్ణుడొక్కడు శస్త్రము అగ్ని విషములతో నిట్టిపనులను చేయసమర్థుడు. 55. ఇతడు సైన్యమంతయు చేయుపనిని, అంతకంటె నెక్కువపనిని చేయగలవాడు.

56. ఇది నాలుగు ఉపాయముల సమూహము. 57. వీటిలో ముందు చెప్పినది తర్వాతచెప్పినదానికంటె లఘుతరము. 58. సామ మొకరెట్టు. 59. సామపూర్వమగు దానము రెండురెట్లు. 60. సామదానపూర్వమగు భేదము మూడు రెట్లు. 61. సామదానభేదపూర్వమగు దండము నాలుగురెట్లు.

62. అభియానముచేసినవారి నెమర్కొను విధాన మిట్లు వివరింపబడినది.

63. స్వభూమి యందలివారి విషయమునగూఢ నిట్టి యుపాయముల ననుసరించవలెను. 64. కొంతవిశేషముకూడ కలదు. 65. స్వభూముల యందుండు సామవాయికులలో నొకనివద్దకు కానుకలతో ప్రఖ్యాతదూతముఖ్యులను పలుమారు పంపవలెను. 66. వారతనిని సంధిచేసుకొనునట్లుగాని, సామవాయికులలో నొకనిని చంపునట్లుగగాని ప్రోత్సహించవలెను. 67. వాడు సమ్మతించనియెడల, "మేము సంధిచేసుకొంటిమి," అని ప్రకటించవలెను. 68. ఉభయవేతనులు దాని నితరులకు తెలియపరచి, "ఈమీరాజు ద్రోహి," అని చెప్పవలెను.

69. లేదా, వారిలోనొకడు మరియొకని యెడల భయమో ద్వేషమో వైరమో కలవాడైనయెడల గూఢపురుషులు, "ఈరాజు నీ శత్రువుతో సంధి చేసుకొనుచున్నాడు ; ముందుముందు నిన్ను మోసముచేయును ; నీవు వేగముగ సంధిచేసుకొని ఇతనిని నిగ్రహించుము,'' అని చెప్పి అతనిని విడదీయవలెను.

70. లేదా, కన్యలను ఇచ్చియు పుచ్చుకొనియు వారితో వివాహసంబంధ ములజేసి అట్టివారిని వివాహ సంబంధము లేనివారినుండి విడదీయవలెను.

71. వారి రాజ్యములను సామంతుడు, ఆటవికుడు, దాయాది, అభిమాన మును కోల్పోయినరాజపుత్రుడు మొదలగువారి సాధనమున నాశముచేయవలెను ; వారిసార్థములను, పశువులమందలను, అడవులను నష్టపరుపవలెను. వానికి సహా యము చేయదలచు సైన్యములనుగూడ నాశముచేయవలెను. 72. పరస్పర మాశ్రయించిన జాతిసంఘములు వారిలోని ఛిద్రములను మరింతబలపరుపవలెను ; గూఢపురుషులు అగ్నివిష శస్త్రములతో వారికి నష్టము కలిగించవలెను.

73. (శ్లో) పరమిత్రాపదయందు విజిగీషువు మోసబుద్ధికలవాడై లుబ్ధకుడు వలను ఎరను ఉపయోగించునట్లు మొదటనమ్మకమునుపుట్టించి ఆశనుపురికొల్పి తర్వాత రహస్యచర్యలచే శత్రువులను చంపవలెను.

ఇది అభియానముచేయువాని కార్యము అను తొమ్మిదో అధికరణమందు దూష్యశత్రుసంయుక్తములగు ఆపదలు అనే ఆరో అధ్యాయము.

# తొమ్మిదో అధికరణము

## అధ్యాయము 7

### ప్రకరణము 145 : అర్థానర్థసంశయయుక్తములు (ఆపదలు)

### ప్రకరణము 146 : వివిధములగు ఉపాయముల మూలమున వాని నెదుర్కొని కార్యసిద్ధి గాంచుట

1. కామక్రోధాదులు మితిమీరుట స్వరాష్ట్రములోని ప్రజలకు కోపోద్రేకము కలిగించును; అపనయము పరరాష్ట్రములోని ప్రకృతులకు కోపోద్రేకము కలిగించును. 2. ఈరెండును అసురప్రవృత్తులు. 3. స్వజనుల చిత్త వికారమే తిరుగుబాటు.

4. శత్రువృద్ధికి కారణభూతములగువాని మూలమున ఆపదర్థము, అనర్థము, సంశయములు కలుగును.

5. ఏఅర్థము (విజిగీషునికి) లభించనపుడు శత్రువు వృద్ధిగాంచునో, ఏఅర్థము లభించినను శత్రువు దానిని మరల తీసుకొనగలడో, ఏఅర్థము లభించినను క్షయవ్యయములకు కారణమగునో అది ఆపదర్థము. (ఆపదలకు దారి తీయు అర్థము). 6. ఉదాహరణము : సామంతులందరు కోరునట్టిదియు వారిని కాదని సంపాదించిన లాభము; శత్రువు వాంఛించునట్టిదియు స్వభావముచేతవానికి చెందవలసినట్టిదియు నగులాభము; వెనుకవైపున నుండువారియొక్కగాని పార్ష్ణిగ్రాహియొక్కగాని తిరుగుబాటునకు కారణమగు ముందువైపులాభము; మిత్రుని నిర్మూలనమునకుగాని సంధియొక్క అతిక్రమణమునకుగాని కారణమై రాజమండలమునంతను నుద్వేగపరుచు నట్టిలాభము—ఇట్టిలాభము ఆపదతో కూడిన లాభము (ఆపదర్థము).

7. స్వజనమువలనగాని శత్రువువలనగాని ప్రమాదము సంభవించునట్లు చేయు అర్థము (లాభము) అనర్థము.

8. ఈరెండింటివిషయములో : ఇది అర్థమా, కాదా ? అనర్థమా, కాదా ? అనర్థ మర్థము కాగలదా ? అనునది సంశయము. 9. శత్రుమిత్రుని ఉత్సాహ పరుచుఅర్థము అర్థమా కాదా ? అనుసంశయము సంశయార్థమునకు ఉదాహరణము. 10. శత్రుసైన్యమునకు ధనమును గౌరవమునిచ్చి ఆహ్వానించుట అనర్థమా కాదా ? అను సంశయము సంశయార్థము. 11. బలవంతుడగు సామంతుడున్న భూమిని వశపరుచుకొనుట అనర్థముతోకూడిన అర్థము కాదా? అను సంశయము సంశయార్థము. 12. అధికుడగువానితో కలిసి యానముచేయుట అర్థముతోకూడిన అనర్థము కాదా ? అను సంశయము సంశయార్థము.

13. ఇట్టి సందర్భములలో అర్థముతోకూడిన సంశయముల కనుగుణముగ ప్రవర్తించవలెను.

14. అర్థమువలన మరికొంతఅర్థము లభించుట అర్థానుబంధము ; అర్థము నుండి ఫలితమేదియు లభించకుండుట అర్థనిరనుబంధము ; అర్థమునుండి అనర్థము సంభవించుట అర్థానర్థానుబంధము ; అనర్థమునుండి అర్థము లభించుట అనర్థార్థానుబంధము ; అనర్థమునుండి ఫలిత మేదియు లభించకుండుట అనర్థనిరనుబంధము ; అనర్థమునుండి అనర్థము లభించుట అనర్థానర్థానుబంధము—ఇది అనుబంధషడ్వర్గము. 15. ఎదుటనున్న శత్రువును నిర్మూలించి పార్ష్ణిగ్రాహిని వశపరుచుకొనుట అర్థానుబంధమగు అర్థము. 16. ప్రతిఫలమునుకోరి ఉదాసీనునికి సైన్యసహాయముచేయుట నిరనుబంధమగు అర్థము. 17. శత్రువుయొక్క అంతర్గతుని నిర్మూలించుట అనర్థానుబంధమగు అర్థము. 18. శత్రువునకు పొరుగుననున్న వానికి కోశము సైన్యము నిచ్చి సహాయముచేయుట అర్థానుబంధమగు అనర్థము. 19. హీనబలుని ఉత్సాహపరిచి (అటుతర్వాత) కార్యమునకు పూనకుండుట నిరనుబంధమగు అనర్థము. 20. అధికుని ఉత్సాహపరచి కార్యమునకు పూనకుండుట అనర్థానుబంధమగు అనర్థము. 21. వీనిలో అర్థప్రాప్తి విషయమున ముందుచెప్పినది తర్వాత చెప్పినదానికంటె శ్రేయస్కరము.

22. ఇది (ఆపదలసందర్భములో) కార్యముల నిర్ణయము.

23. ఏకకాలమం దన్నివైపులనుండి అర్థోత్పత్తి కలుగుట అన్నివైపుల నుండి వచ్చు ఆపదర్థము. 24. దానికి పార్ష్ణిగ్రాహి యాటంకము కలిగించినయెడల నన్నివైపులనుండివచ్చు అర్థసంశయాపద అని తెలుసుకొనవలెను. 25. ఇట్టి సందర్భములో మిత్ర ఆక్రందుల సాధనమున కార్యసిద్ధిని పొందవలెను.

26. అన్ని వైపులనుండి శత్రువులమూలమున సంభవించు ఆపద అన్నివైపులనుండివచ్చు అనర్థాపద. 27. దానిని మిత్రు డెదుర్కొనిన యెడల నన్నివైపులనుండివచ్చు అనర్థసంశయాపద అని తెలుసుకొనవలెను. 28. ఇట్టి సందర్భములో చలమిత్రుని సహాయమువలనగాని ఆక్రందుని సహాయమువలనగాని

పరమిత్రాపదకు ప్రతీకారము చేయవలసిన విధానమువలనగాని కార్యసిద్ధిని పొంద వలెను.

29. ఇటువైపునుండి లాభము మరియొకవైపునుండి లాభము కలుగుట ఉభయపార్శ్వములనుండి కలుగుఅర్థాపద. 30. ఇట్టిసందర్భములోను, అన్ని వైపులనుండి లాభమువచ్చు సందర్భములోను లాభముతోకూడిన అర్థమును సంపాదించుటకై అతడు యానముచేయవలెను. 31. లాభగుణములు సమానము లైనప్పుడు ప్రధానమైనదానిని ఆసన్నమైనదానిని, అతిపాతముకానిదానిని, లేదా, లోపమును పూరించుకొనుటకు కావలసినదానిని సంపాదించుటకు యానముచేయ వలెను.

32. ఇటువైపు అనర్థము మరియొకవైపునకూడఅనర్థము సంభవించుట ఉభయపార్శ్వములనుండి సంభవించు అనర్థాపద. 33. ఇట్టి సందర్భములోను, అన్నివైపులనుండి అనర్థములు సంభవించు సందర్భములోను మిత్రులసాధన మున కార్యసిద్ధిని గాంచవలెను. 34. మిత్రులు లేనప్పుడు ఒకవైపున సంభ వించిన ప్రమాదమును ప్రకృతులలో నప్రధానమైనదానిని వశపరచియు, రెండు వైపులసంభవించిన ప్రమాదమును ఎక్కువ ప్రధానమైన దానిని వశపరచియు, అన్నివైపులనుండి సంభవించిన ప్రమాదమును మూలస్థానమును వశపరచియు ఎదుర్కొనవలెను. 35. ఇది సాధ్యముకానప్పుడు సమస్తము వదలుకొని వెళ్ళి పోవలెను. 36. ఏలయన, ప్రాణమున్నయెడల సుయాత్రఉదయనులవలె రాజ్య మునకు మరల రావచ్చును.

37. ఒకవైపులాభము, మరియొకవైపు రాజ్యము నాక్రమించు ప్రమా దము సంభవించుట రెండువైపులనుండి సంభవించు అర్థానర్థాపద. 38. అట్టి సందర్భములో ననర్థమును సాధించుటకు శక్తిగల అర్థమును సంపాదించుటకై యానము చేయవలెను. 39. అట్లుకానిపక్షమున ఆక్రమణను తొలగించవలెను. 40. దీనినుండి అన్నివైపులనుండివచ్చు అర్థానర్థాపద విషయమును తెలుసుకొన వలెను.

41. ఒకవైపు అనర్థము మరియొకవైపు అర్థసంశయము కలుగుట రెండువైపులనుండి సంభవించు అనర్థార్థసంశయము. 42. ఇట్టి సందర్భములో నతడు మొదలు అనర్థమును సాధించవలెను ; అది జరిగిన తర్వాత సంశయాత్మక మగు నర్థమునకై ప్రయత్నించవలెను. 43. దీనినుండి అన్నివైపులసంభవించు అనర్థార్థసంశయవిషయమును తెలుసుకొనవలెను.

44. ఒకవైపు అర్థము మరియొకవైపు అనర్థసంశయము కలుగుట రెండువైపులనుండి సంభవించు అనర్థానర్థసంశయాపద. 45. దీనినుండి అన్ని వైపులసంభవించు అనర్థానర్థసంశయవిషయము తెలుసుకొనవలెను. 46. ఇట్టి

సందర్భములో పూర్వప్రకృతుల నొకటొకటిని వరుసక్రమమున అనర్థసంశయమునుండి విడుదలచేయవలెను. 47. మిత్రు డనర్థసంశయమునకు గురియగుట మంచిదిగాని సైన్యము గురియగుట మంచిదికాదు ; అట్లే, సైన్యము గురియగుట మంచిదిగాని కోశము గురియగుట మంచిదికాదు. 48. ప్రకృతులనన్నిటిని సమగ్రముగ రక్షించుట సాధ్యము కానప్పుడు వానిలోని భాగములను రక్షించుటకు ప్రయత్నించవలెను. 49. పురుషప్రకృతులలో బహుళసంఖ్యాకములను అనురాగముకలవానిని రక్షించవలెను; తీక్ష్ణులకు లుబ్ధులను రక్షించవలసినది లేదు ; ద్రవ్యప్రకృతులలో సారములను మహోపకారకములను రక్షించవలెను. 50. సంధివలనగాని ఆసనమువలనగాని ద్వైధీభావమువలనగాని లఘుప్రకృతులను, ఇతరసాధనములమూలమున ప్రధానప్రకృతులను రక్షించవలెను. 51. క్షయస్థానవృద్ధులలో ముందువాటికంటె తర్వాతివానికై ప్రయత్నించవలెను. 52. లేదా, భవిష్యత్తులో ప్రత్యేకలాభమువచ్చునని తోచినయెడల క్రమమును మార్చి క్షయాదులను వాంఛించవచ్చును.

53. ఇది (ఆపదలసందర్భములో) దేశనిశ్చయము. 54. దీనినుండి యానముయొక్క ఆదియందు మధ్యమునందు అంత్యమందు సంభవించు అర్థమును అనర్థమును సంశయమును తెలుసుకొనవలెను.

55. అర్థానర్థసంశయముల ఫలితములు వెంటనేలభించునుగనుక యాత్రాదియందే అర్థమును సంపాదించుట శ్రేయస్కరము ; అప్పు డది పార్ష్ణిగ్రాహ్యాసారులనోడించుటలోను, క్షయ వ్యయ ప్రవాసముల పూరించుటలోను, మూలరక్షణములోను సహాయపడును. 56. అదేవిధముగ, అనర్థసంశయములు స్వదేశమందున్నవానికి సహింపదగియుండును.

57. యాత్రామధ్యమందు సంభవించు అర్థానర్థసంశయముల విషయము దీనినుండి తెలుసుకొనవలెను.

58. యాత్రాంతమందు బలహీనునిగ జేయదగినశత్రువును బలహీనపరచి, నిర్మూలించదగిన శత్రువును నిర్మూలించి అనర్థసంశయములకంటె అర్థమునుసంపాదించుట శ్రేయస్కరము ; అట్లుకానియెడల శత్రువునుండి ప్రమాదము సంభవించవచ్చును.

59. కాని, సామవాయికులలో ప్రధానుడుకానివానికి యాత్రమధ్యమందును అంత్యమందును అనర్థసంశయములు లభించుట శ్రేయస్కరము ; అది నిర్బంధములేక సామవాయికులందరికి చెందునది అగుటయే దీనికి కారణము.

60. అర్థము, ధర్మము, కామము—ఇవి అర్థ త్రివర్గము. 61. వీనిలో వెనుకదానికంటె ముందుదానిని సంపాదించుట శ్రేయస్కరము.

62. అనర్థము, అధర్మము, శోకము—ఇవి అనర్థ త్రివర్గము. 63. వీనిలో వెనుకదానికంటె ముందుదానిని తొలగించుకొనుట శ్రేయస్కరము.

64. "ఇది అర్థమా?"; "ఇది ధర్మమా", "అనర్థమా ?" "ఇది కామమా, శోకమా ?" ఇవి సంశయ త్రివర్గము. 65. వీనియందొక్కొకదానిలో రెండవపక్షము నెదుర్కొని మొదటిపక్షమును సంపాదించుట శ్రేయస్కరము.

66. ఇది (ఆపదలసందర్భములో) కాలనిశ్చయము.

దీనితో ఆపదలు సమాప్తము.

67. ఆపదల నెదుర్కొనుటకు సాధనములు.

68. పుత్రుడు, సోదరుడు, బంధువు—వీరిమూలమున సంభవించు ఆపదలను సామదానములద్వారా ఎదుర్కొనుట తగినది; పౌరుల నాయకులు, జానపదుల నాయకులు, దండనాయకులు—వీరివిషయములో దానభేదములు, సామంతులు, ఆటవికులు—వీరివిషయములో భేదదండములు ఉచితము. 69. ఇది సహజమగు మార్గము; దీనికి విరుద్ధమగు మార్గము అసహజము.

70. మిత్రులవిషయములోను శత్రువులవిషయములోను ఉపాయములను కలిపి ప్రయోగించవలెను. 71. ఏలయన, ఉపాయములు పరస్పరసాధకములు.

72. శత్రువుల శంకితులగు నమాత్యులవిషయములో సామము నుపయోగించుటచేత తక్కినఉపాయము లనవసరము లగుచున్నవి; (అట్లే) దూష్యులగు నమాత్యులవిషయములో దానము నుపయోగించుటచేతను, సామవాయికుల విషయమున భేద ముపయోగించుటచేతను, శక్తిమంతులవిషయమున దండమును ఉపయోగించుటచేతను తక్కిన ఉపాయము లనవసరము లగుచున్నవి.

73. ఆపదల గురుత్వ లఘుత్వములబట్టి ఉపాయములను నియోగముగ గాని, వైకల్పికముగగాని, సముచ్చయముగగాని ఉపయోగించవలెను. 74. "ఈ ఉపాయముచేతనే గాని మరియొక ఉపాయముచేత కాదు"—ఇది నియోగము. 75. "ఈ ఉపాయముచేతగాని మరియొక ఉపాయముచేతగాని"—ఇది వైకల్పికము. 76. "దీనిచేతను ఇతరములచేతను"—ఇది సముచ్చయము.

77. వీనిలో నొక్కొకపర్యాయ మొక ఉపాయము నుపయోగించుట, ఒక్కొకపర్యాయము మూడుఉపాయముల నుపయోగించుట—ఇట్టివి నాలుగగును; ఒక్కొకపర్యాయము రెంటి నుపయోగించుట ఆరు అగును; ఒకపర్యాయము నాలుగింటినికలిపి ఉపయోగించుట ఒకటి అగును. 78. కావున మొత్తముమీద ఉపాయములను పదిహేనువిధములుగ నుపయోగించవచ్చును. 79. అసహజముగ నుపయోగించినపుడుకూడ నన్నియే విధములు.

80. వీనిలో నొకఉపాయము మూలమున కార్యసిద్ధి ఏకసిద్ధి; రెంటి

5. దీని కావల నూరేసి ధనుస్సుల అంతరముగలవియు, బండ్లు ముండ్ల కంపలతోకూడిన ప్రదేశములు, స్తంభములు, ప్రాకారములుగలవియు నగు నాలుగు ఆవరణములుండవలెను.

6. ముందుభాగములో మొదటికక్ష్య యందు మంత్రి పురోహితుల నివాసములు, కుడివైపున కోష్ఠాగారము, వంటశాల, ఎడమవైపున కుప్యాగారము, ఆయుధాగారము ఉండవలెను. 7. రెండవకక్ష్యలో మౌలికభృతక సైన్యస్థావరములు, అశ్వరథశాలలు, సేనాపతినివాసము ఉండవలెను. 8. మూడవకక్ష్యలో ఏనుగులు, శ్రేణీబలము ప్రశాస్త ఉండవలెను. 9. నాలుగవకక్ష్యలో విష్టివర్గము, నాయకుడు, వారివారినాయకులుగల మిత్రసైన్యము, అమిత్రసైన్యము, ఆటవిక సైన్యము ఉండవలెను. 10. ప్రధానమార్గము నానుకొని వర్తకులు వేశ్యలు నివసించవలెను.

11. శిబిరమునకావల తప్పెటలు మంటలతోకూడిన లుబ్ధకులు కుక్కల వేటకాండ్రు గూఢపురుషులు నివసించవలెను.

12. శత్రువుల యాత్రామార్గమందు పైకికనుపించని బావులను గోతులను త్రవ్వించి (దారిపొడుగున) ముండ్లతీగెలను పరిపించవలెను.

13. అష్టాదశవర్గములలోని రక్షకభటుల నప్పుడప్పుడు మార్చుచుండవలెను. 14. (శత్రువుల) గూఢచర్యలను తెలుసుకొనుటకై పగటిపూటయందు కూడ రక్షకభటులను నియోగించవలెను.

15. వివాదములను, మద్యపానమును, విలాసగోష్ఠులను, జూదమును నిషేధించవలెను ; తనముద్రను రక్షించుకొనవలెను.

16. లిఖితపూర్వమగు రాజాజ్ఞ లేక సైన్యమును వదలి బయటికి వచ్చు సైనికుని శూన్యపాలుడు పట్టుకొనవలెను.

17. (శ్లో) ప్రశాస్త మార్గమునకు ముందుగ నడుచుచు రక్షణకును ఉదకమునకును కావలసిన ఏర్పాటులను వర్ధంగులు కూలిజనములద్వారా చేయించవలెను.

ఇది సాంగ్రామిక మను పదో అధికరణమందు స్కంధావారనివేశము అనే మొదటి అధ్యాయము.

# పదో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 148 : స్కంధావార ప్రయాణము

### ప్రకరణము 149 : సైన్యముల నాపత్కాలమందును ఆక్రమణకాలమందును రక్షించుకొనుట

1. పశుగ్రాసము, కట్టెలు, నీటి సదుపాయముల బట్టి మార్గమందుండు గ్రామములలోను అడవులలోను ఎన్ని మజిలీ లవసరమో లెక్కవేసియు, స్థానమునకు అసనమునకు ప్రయాణమునకు ఎంత కాలము పట్టునో అంచనావేసుకొనియు యాత్రను ప్రారంభించవలెను. 2. కావలసినదానికంటె రెండింతల ఆహార పదార్థములను ఆయుధములను తరలించవలెను. 3. అది సాధ్యముకానప్పుడు వానిని సైన్యమునకే అప్పగించవలెను ; లేదా, మార్గములో నచ్చటచ్చట సేకరించి యుంచవలెను.

4. ముందు నాయకుడు, నడుమ స్త్రీజనము, రాజు పార్శ్వములందు బాహులవలె వ్యూహముగ నేర్పడిన గుర్రములు, కొనయందు ఏనుగులు, లేదా, ప్రసారము చేయగల గుర్రములు, వెనుక సేనాపతి యానము చేసి విడిది చేరవలెను.

5. అరణ్యములలో నన్నివైపులనుండి సామగ్రిని సంపాదించుట ప్రసారము. 6. స్వదేశమునుండి సామగ్రిని తెచ్చుకొనుట వీవధము. 7. మిత్ర బలము ఆసారము. 8. స్త్రీజనముండు ప్రదేశము అపసారము.

9. ముందువైపు ఆక్రమణలో మకర వ్యూహమునను, వెనుకవైపు ఆక్రమణలో శకట వ్యూహమునను, పార్శ్వముల ఆక్రమణలో వజ్ర వ్యూహమునను, అన్నివైపులనుండి ఆక్రమణలో సర్వతోభద్ర వ్యూహమునను, ఏకాయనమందు సూచీ వ్యూహమునను యానము చేయవలెను.

10. యానముచేయుటకు రెండుమార్గములున్నప్పుడు తనకనుకూలముగ

నుండు ప్రాంతములో యానముచేయవలెను. 11. ఏలయన, తమకనుకూలించు ప్రదేశములో నుండువారు ప్రతికూల ప్రదేశములో నుండువారిని సులభముగ నెదుర్కొనగలరు.

12. యోజనము చొప్పున యానముచేయుట అధమము; ఒకటిన్నర యోజనముచొప్పున యానముచేయుట మధ్యమము; రెండుయోజనముల చొప్పున యానముచేయుట ఉత్తమము; లేదా, శక్తికొలది యానము చేయవచ్చును.

13. శత్రువున కాశ్రయ మిచ్చినట్టియు సంపన్నములగు తనభూములకు నష్టముకలిగించునట్టియు పార్ష్ణిగ్రాహిపైగాని, వానిఆసారునిపైగాని, మధ్యముని పైగాని ఉదాసీనునిపైగాని ప్రతీకారచర్యలు తీసుకొనవలసివచ్చినప్పుడు; కష్టమగు మార్గమును చక్కబెట్టుకొనవలసివచ్చినప్పుడు; కోశము, సైన్యము, మిత్రబలము, అమిత్రబలము, ఆటవికబలము, కూలిజనము, సరియగుఋతువు— వీనికై వేచియుండవలసినప్పుడు; "శత్రుదుర్గములకు, సామగ్రికి, రక్షణసాధనములకు క్షయము కలుగును; అతని క్రీతబలము మిత్రబలము ఉద్వేగము గాంచును; అతని కొలువులోని కుట్రలులేపువారు త్వరపడుటలేదు; శత్రువు నా కోరికలను తీర్చగలడు," అని అనుకొనినప్పుడు మెల్లగ యానము చేయవలెను; పరిస్థితులు దీనికి విరుద్ధమగునప్పుడు శీఘ్రముగ యానము చేయవలెను.

14. ఏనుగులు, స్తంభములతోకూడిన వంతెనలు, నీటికట్టలు, పడవలు, కట్టెతోను వెదుళ్ళతోను అమర్చినతెప్పలు, సొరకాయబుర్రలు, చర్మములతో చుట్టబడిన గంపలు, దోనెలు, చెట్లబోదెలు, త్రాళ్ళుమొదలగువాని సహాయముతో ఉదకముల దాటవలెను. 15. శత్రువు రేవు నడ్డగించినయెడల రాత్రియందు ఏనుగుల గుర్రముల సహాయమున మరియొకచోట నీటిని దాటి రహస్యముగ దాగి యుండవలెను.

16. నీళ్లుదొరకని ప్రదేశములందు వెళ్ళవలసిన దూరమున కనుగుణముగ బండ్లమీదను పశువుల సహాయమునను శక్త్యనుసారము నీళ్ళను మోసుకొనిపోవలెను.

17. అడవులలో దీర్ఘప్రయాణముచేయునప్పుడు. నీళ్ళులేనప్పుడు, పశుగ్రాసము కట్టెలు నీళ్ళుతగ్గినప్పుడు, కష్టమగుమార్గమున యానముచేయునప్పుడు, ఆక్రమణమువలన చెదరినప్పుడు, ఆకలి దప్పి దీర్ఘ ప్రయాణములవలన అలసినప్పుడు, లోతగు నీళ్ళను బురదను దాటునప్పుడు, లోయలను కొండలను ఎక్కిదిగునప్పుడు, ఒక్కొక్కరుగ వెళ్ళవలసిన మార్గమందుగాని కొండలమూలమున ఎగుడుదిగుడగు ప్రదేశమందుగాని ఇరుకుప్రదేశమందుగాని గుంపుగ చేరునప్పుడు, స్థానమందుగాని ప్రయాణమందుగాని ఆయుధసామగ్రిని కోల్పోయినప్పుడు, భోజనము చేయుచున్నప్పుడు, దీర్ఘయానమువలన అలసినప్పుడు,

నిద్రించునప్పుడు, వ్యాధిమరకదుర్భిక్షములవలన బాధచెందునప్పుడు, పదాతులు ఏనుగులు గుర్రములు వ్యాధిగ్రస్తములైనప్పుడు, అనుకూలముగాని ప్రదేశమందున్నప్పుడు, సైన్యము లాపదలలో చిక్కుకొనినప్పుడు (విజిగీషువు) స్వసైన్యమును రక్షించుకొనవలెను. శత్రుసైన్యమిట్టి స్థితిలోనున్నప్పుడు దాని నాక్రమించవలెను.

18. ఏకాయనమార్గములో[1] ప్రయాణముచేయు సైనికులసంఖ్యను, వారి పశుగ్రాసము, భోజనసామగ్రి, పరచుకొనిన పడకలు, వంటకై వారు ఏర్పాటు చేసుకొనిన పొయ్యిలు, ధ్వజములు, ఆయుధములు—వీనినన్నిటిని లెక్కపెట్టి శత్రుసైన్యమెంతటి బలముగలదో ఊహించవలెను. 19. తనసైన్యమును గురించిన ఇట్టివివరములను దాచవలెను.

20. (శ్లో) అపసారమున కనుకూలించునట్టియు సైనికబలమునుకలిగినట్టియు పర్వతదుర్గమునుగాని నదీదుర్గమునుగాని వెనుకభాగమందు స్థాపించుకొని తగినప్రదేశమందు శిబిరము నేర్పరచుకొని యుద్ధముచేయవలెను.

ఇది సాంగ్రామికమను పదోఅధికరణమందు స్కంధావార ప్రయాణము, సైన్యముల నాపత్కాలమందును ఆక్రమణకాలమందును రక్షించుకొనుట అనే రెండో అధ్యాయము.

[1] ఒకడుమాత్రమే నడుచుటకు సాధ్యమగు ఇరుకుత్రోవ.

## అధ్యాయము 3

### ప్రకరణము 150 : వివిధములగు కూటయుద్ధములు

### ప్రకరణము 151 : స్వసైన్యోత్సాహనము

### ప్రకరణము 152 : శత్రుబలము నెదుర్కొనునట్లు స్వబలవ్యూహము

1. (శత్రువుకంటె) అధికసైన్యమున్నప్పుడు, (శత్రు శిబిరములో) కుట్రలుపన్న గలిగినప్పుడు, యాత్రాకాలమునుగురించి అవసరచర్యలు తీసుకొన గలిగినప్పుడు, అనుకూలమగు ప్రదేశమందున్నప్పుడు (విజిగీషువు) ప్రకాశ యుద్ధము చేయవలెను. 2. పరిస్థితులు దీనికి విరుద్ధముగ నున్నప్పుడు కూట యుద్ధము చేయవలెను.

3. శత్రుసైన్యము ఆపదలలోనున్న సమయములందు, ఆక్రమించు సమయములందు, తాననుకూల ప్రదేశముననను, శత్రువు ప్రతికూల ప్రదేశముననను ఉన్న సమయములందు, శత్రువు అనుకూలప్రదేశమునందున్నను ప్రకృతులందరు తనకు సహాయముచేయ సిద్ధముగనున్న సమయములందు శత్రువును కొట్టవలెను.

4. లేదా, దూష్యబలము, అమిత్రబలము, ఆటవికబలములచే నోడింప బడినట్లు నటించి, (తన్ను వెంటనంటు) శత్రుసైన్యములు ప్రతికూలప్రదేశమును చేరగనే ఎదురుతిరిగి వానిని ప్రహరించవలెను.

5. సంహతితమగు శత్రుసైన్యమును ఏనుగులతో భేదించవలెను.

6. ఓటమి నటించిన తన్ను వెంటనంటు శత్రుసైన్యము భిన్నమైనప్పుడు తనసైన్యము భిన్నము కానట్లు జేసుకొని వెనుకకు మరలి అతనిపై దెబ్బతీయవలెను.

7. లేదా, మొదట ముందువైపుకొట్టి దానిఫలితముగ శత్రువు ప్రచలితు డైనప్పుడు, లేదా, వెనుకకు పారిపోవునప్పుడు ఏనుగులతోను, గుర్రములతోను

వెనుకనుండి అతనిపై పడవలెను. 8. లేదా, మొదటవెనుకవైపుకొట్టి, దాని ఫలితముగ శత్రువు ప్రచలితుడైనప్పుడుగాని వెనుకకు పారిపోవునప్పుడుగాని బలముగల సైన్యముతో ముందువైపునుండి అతనిని కొట్టవలెను. 9. దీనినుండి పార్శ్వములనుండి ఆక్రమణచేయువిధానమును తెలుసుకొనవలెను. 10. ఏవైపున శత్రుబలము దూష్యముగను సారహీనముగను ఉండునో ఆ వైపునుండి దానిని కొట్టవలెను.

11. ముందుండు ప్రదేశము మిట్టపల్లములతో కూడినదైనయెడల వెనుక నుండి కొట్టవలెను. 12. వెనుకనుండు ప్రదేశము మిట్టపల్లములతో కూడినదైన యెడల ముందువైపునుండి కొట్టవలెను. 13. ఒకపార్శ్వమం దిట్లున్నయెడల రెండవపార్శ్వమందుండి కొట్టవలెను.

14. లేదా, దూష్యబలము, అమిత్రబలము, ఆటవికబలము అనువానితో మొదట యుద్ధము చేసి, అతడు అలసిపోయినప్పుడు తానుమాత్రము అలసిపోక అతనిని మార్కొనవలెను.

15. దూష్యబలముచేత తానోడినట్లు నటించి, జయముగాంచినట్లు భావించు శత్రువును రహస్యప్రదేశమునందుండి స్వరక్షణలో నప్రమత్తుడై ఎదుర్కొనవలెను.

16. తానప్రమత్తుడై, శత్రువుసార్థవాహమునుగాని పశువులమందలను గాని స్కంధావారమునుగాని వాహనములనుగాని దోచుటలో ప్రమత్తుడుగ నున్న ప్పుడు దానిపై దెబ్బతీయవలెను.

17. లేదా, హీనబలులగు సైనికులవెనుక దాగియుండు తనసారవంత మగుసైన్యముతో శత్రుప్రవీరులమధ్య ప్రవేశించి వారిని చంపవలెను.

18. గోగ్రహణముపట్లను మృగములవేటపట్లను శత్రువీరులదృష్టిని మరలించి తానురహస్య ప్రదేశమున దాగియుండి వారిపై పడవలెను.

19. రాత్రియందు శత్రువీరులపై అకస్మాత్తుగ నాక్రమణచేసి, వారినిద్రకు భంగముకలిగించి పగటిపూట వారు నిద్రమత్తులో నున్నప్పుడుగాని నిద్రపోవు చున్నప్పుడుగాని వారిని చంపవలెను.

20. లేదా, రాత్రులందు వారు నిద్రించుచున్నప్పుడు చర్మములతో ఏనుగుల పాదములనుకప్పి వానితో వారిపై పడవలెను.

21. రోజంతయు ఆయుధములధరించి అలసిపోయిన శత్రుసైన్యమును అపరాహ్ణమున నెదుర్కొనవలెను.

22. గులకరాళ్ళసంచులను మోసుకొనుచు బెదరిపోయిన పశువులు, దున్నపోతులు, ఒంటెలగుంపుల మూలమున గందరగోళపడిపారిపోవు హస్త్యశ్వము లతోకూడిన శత్రువును స్వస్థుడై ఎదుర్కొనవలెను.

23. గాలి, ఎండ శత్రుసైన్యమునకెదురుగ నున్నప్పుడు సైన్యముల నన్నిటిని మార్కొనవలెను.

24. ఎడారి, అరణ్యము, సంకటప్రదేశము, బురదనేల, పర్వతము, లోయప్రదేశము, మిట్టపల్లములతోకూడిన ప్రదేశము, పడవ, పశువులు, శకట వ్యూహము, మంచు, రాత్రి—ఇవి కూటయుద్ధమున కనువగు ప్రదేశములు.

25. శత్రుసైన్యమును కొట్టుట కనువగు కాలములని ఇదివరలోవివరింప బడిన కాలములు కూటయుద్ధమున కనువగు కాలములు.

26. (కాని) నిర్దిష్ట దేశకాలములుగల ప్రకాశయుద్ధమే ధర్మయుద్ధము.

27. సైనికులనందరిని సమావేశపరచి, వారితో "నేనుకూడ మీవలె వేత నము పుచ్చుకొని పనిచేయువాడను. ఈ రాజ్యము మీతోకలిసి అనుభవించదగినది. నాప్రార్థన కంగీకరించి మీరు శత్రువుపై దెబ్బతీయవలెను," అని చెప్ప వలెను.

28. దక్షిణలతో సమాప్తినొందిన యజ్ఞములందలి అవభృదస్నానము వలన కలుగు ఫలము శూరులకు కలుగునని వేదములుకూడ చెప్పుచున్నవి. 29. ఈసందర్భములో రెండుశ్లోకములు కూడనున్నవి.

30. (శ్లో) స్వర్గమున కాంక్షించు బ్రాహ్మణులు అనేకయజ్ఞములమూలమునను తపస్సుమూలమునను పాత్రోచితములగు దానములమూలమునను ఏలోకములను పొందుచున్నారో, ఆ లోకములకు మించినలోకములను ధర్మయుద్ధములందు ప్రాణ ములను త్యజించిన శూరులు క్షణకాలమున పొందుచున్నారు.

31. (శ్లో) ప్రభువుయొక్క ఉప్పుతిని, అతనికై యుద్ధము చేయనివాడు నీటితో నిండినట్టియు, మంత్రపూతమైనట్టియు, దర్భోత్తరీయముతో కప్పబడి నట్టియు కొత్తకుంభమును గ్రహించుటకు పాత్రుడుగాక నరకమును పొందును.

32. మంత్రి పురోహితులు వ్యూహసంపదలను ప్రశంసించుచు సైనికుల నుత్సాహవంతులుగ చేయవలెను.

33. జ్యోతిష్కులు మొదలగువారు తమప్రభువుయొక్క సర్వజ్ఞత్వ మును దైవసంపదను ప్రఖ్యాతపరచి స్వపక్షమున కుత్సాహమును శత్రుపక్షము నకు భయమును కల్పించవలెను.

34. యుద్ధము రేపనగా ప్రభువు ఉపవాసముచేసి శస్త్రవాహనముల ప్రక్కన పరుండవలెను. 35. తర్వాత అథర్వవేదమంత్రములతో హోమము చేయవలెను. 36. విజయయుక్తములును స్వర్గసంపాదకములునగు ఆశీర్వచన ములను కోరవలెను. 37. బ్రాహ్మణులకు ఆత్మార్పణము చేయవలెను.

38. శౌర్యము, నైపుణ్యము, సద్వంశము, అనురాగముకలిగినట్టియు అర్థమానములచే తృప్తిగాంచినట్టియు సైనికులను నడుమనుంచవలెను.

39. ఆయుధముల మాత్రము ధరించినట్టియు, ధ్వజములు లేనట్టియు, పితృపుత్రభ్రాతృసంబంధము కలిగినట్టియు సైనికుల నడుమ రాజు ఉండవలెను. 40. అశ్వారూఢులచే రక్షింపబడిన ఏనుగుగాని రథముగాని రాజునకు వాహనముగ నుండవలెను. 41. లేదా, సైన్యమం దేయంగము అధికముగనుండునో దానినిగాని, లేదా, దేనియందతడు శిక్షితుడో దానినిగాని వాహనముగ జేసుకొనవచ్చును. 42. రాజవేషమును ధరించినవాడొకడు సైన్యమునకు ముందుండవలెను.

43. సూతులు మాగధులు శూరులకు స్వర్గము, భీరువులకు నరకము కలుగునని చెప్పుచు సైనికులజాతిని సంఘమును కులమును కార్యములను ప్రవర్తనమును ప్రశంసించవలెను. 44. పురోహితపురుషులు అభిచారక్రియల మహిమలను పొగడవలెను; యాంత్రికులు వర్ధంగులు మౌహూర్తికులు తమకార్యములు ఫలించుచున్నవనియు శత్రుకార్యములు విఫలమగుచున్నవనియు ప్రకటించవలెను.

45. అర్థమానముల పొంది తృప్తిగాంచిన సైనికులతో సేనాపతి, "శత్రురాజును హత్యచేయువానికి నూరువేలపణములు బహుమానము; సేనాపతిని కుమారుని వధించినవానికి ఏబదివేల పణములు; ప్రవీరముఖ్యులను వధించినవానికి పదివేలపణములు; హస్తిరథసైనికులను వధించినవానికి అయిదువేల పణములు; అశ్వసైనికుని వధించినవానికి వేయిపణములు; పదాతిముఖ్యుల వధించినవానికి వందపణములు; పదాతిశిరస్సునకు ఇరవైపణములు; రెండింతల వేతనము; స్వయముగ వశపరచుకొనిన శత్రుసామగ్రి—ఇదంతయు లభించును," అని చెప్పవలెను. 46. దశవర్గముఖ్యులు దీని నంతను తెలునుకొనవలెను.

47. శస్త్రములు, యంత్రములు, ఔషధములు, తైలములు, కట్లుకట్టుటకు వస్త్రములుమున్నగువానితో కూడినవైద్యులు; అన్నపానీయములతో కూడినట్టియు, పురుషులకు ఉత్సాహముకలిగించునట్టియు స్త్రీలు— వెనుకభాగమందుండవలెను.

48. తగినప్రదేశమందు దక్షిణముఖము కాకుండగను, సూర్యుడు వెనుకవైపుననుండునట్లుగను, గాలి అనుకూలముగ నుండునట్లుగను సైన్యవ్యూహము నేర్పరచవలెను. 49. శత్రుసైన్యవ్యూహమున కనువగు ప్రదేశమందు తనసైన్యములోని గుర్రములు సంచరించుచుండవలెను.

50. తనవ్యూహము గట్టిగ నిలబడుటకుగాని వడిగ ప్రయాణము చేయుటకుగాని తగిన ప్రదేశము లేనప్పుడు నిలబడినను ప్రయాణము చేసినను జయము లభించుట కష్టసాధ్యము. 51. ప్రదేశము దీనికి విరుద్ధముగ నున్నప్పుడు నిలబడిన ప్రయాణము చేసినను జయము తప్పదు.

52. ప్రదేశము సమమైనదియు విషమమైనదియు మిశ్రమమైనదియు ముందున, వెనుకన, పార్శ్వములందు ఎట్టిదియైనదియు తెలుసుకొనవలెను. 53. సమప్రదేశమందు దండమండలవ్యూహములు, విషమప్రదేశమందు సర్ప వ్యూహము, అసంహతవ్యూహము, మిశ్రమమగు ప్రదేశమందు విషమవ్యూహ ములను పన్నవలెను.

54. విశిష్టబలుడగు శత్రువుసోడించి సంధినికోరవలెను. 55. సమ బలుడు సంధికోరినయెడల సంధిజేసుకొనవలెను. 56. హీనబలుని కొట్టుచునే ఉండవలెను; కాని స్వభూమిని చేరినవానినిగాని ఆత్మత్యాగముచేయ సిద్ధపడిన వానినిగాని కొట్టరాదు.

57. (శ్లో) పారిపోయి వెనుకకువచ్చి యుద్ధముచేయువానియొక్కయు జీవితమందు ఆశలేనివానియొక్కయు ఉద్వేగము ఎదురులేనిది; అందుచేత భగ్నత గాంచిన శత్రువును పీడించరాదు.

ఇదిసాంగ్రామికమను పదోఅధికరణమందు వివిధములగు కూటయుద్ధ ములు, స్వసైన్యోత్సాహనము, శత్రుబలమునెదుర్కొనునట్లు స్వబలవ్యూహము అనే మూడోఅధ్యాయము.

## పదో అధికరణము

### అధ్యాయము 4

### ప్రకరణము 153 : యుద్ధభూములు

### ప్రకరణము 154 : పత్త్యశ్వరథహస్తికర్మలు

1. పదాతులు, గుర్రములు, రథములు, ఏనుగులు యుద్ధముచేయుటకును నివేశనముగ నుపయోగించుకొనుటకును అర్హ మగుప్రదేశ మవసరము. 2. ఎడారులందు అరణ్యములందు నిమ్నప్రదేశములందు మెట్టప్రదేశములందు గోతుల నుండి బయలుప్రదేశమునుండి రాత్రులుగాని పగలుగాని యుద్ధముచేయు పదాతులకు; నదులు, పర్వతములు, బురదనేలలు, సరస్సులు మొదలగు వానితో సంబంధముగల ఏనుగులు గుర్రములు యుద్ధముచేయుటకును అనువగు ప్రదేశములను కాలములను (విజిగీషువు) తనఇష్టానుసారము నిర్ణయించవలెను.

3. సమములు, స్థిరములు, స్పష్టముగ కనుపించునవి, కుదుపులుకలిగించనివి, చక్రములుగాని ఖురములుగాని దిగబడనివి, అక్షములకాటంకము కలిగించనివి, చెట్లు పొదలు తీగెలు చెట్లబోదెలు నీటితోనిండినపొలములు, గోతులు, పుట్టలు, ఇసక, బురద, పగుళ్ళులేనివి—ఇట్టిప్రదేశములు రథములకు తగినవి; ఇట్టివి సాధారణపరిస్థితులలోగాని అసాధారణపరిస్థితులలో గాని యుద్ధభూమిగ నుపయోగించుటకును నివేశనముగ నుపయోగించుటకును ఏనుగులకు గుర్రములకు పదాతులకు కూడ ననుకూలించునవి.

4. చిన్నరాళ్లు మొక్కలు కలది, గంతుటకుతగిన చిన్నగోతులుకలది, చిన్నపగుళ్లుకలది—ఇట్టిది గుర్రములకు తగినప్రదేశము.

5. పెద్దచెట్లబోదెలు, రాళ్లు, చెట్లు, తీగెలు, పుట్టలు, పొదలుకలది పదాతులకు తగినప్రదేశము.

6. దాటతగిన పర్వతములు నీళ్లు మిట్టపల్లములుకలది, కొట్టివేయతగిన

వృక్షములుకలది, ఛేదించుటకు తగిన తీగెలుకలది, బురదమూలమున పగుళ్ళు కలది, (ఇతరములగు) పెద్దపగుళ్లులేనిది—ఇట్టిది ఏనుగులకు తగినప్రదేశము.

7. ముళ్ళులేనిది, ఎక్కువవిషమముకానట్టిది, పారిపోవుట కవకాశము కలది—ఇట్టిది పదాతులకు మరింత తగిన ప్రదేశము.

8. పారిపోవుటకు రెండింతల అవకాశముకలది, బురద, నీళ్ళు, మడుగులు, గులకరాళ్ళులెనిది—ఇట్టిది గుఱ్ఱములకు మరింత తగినప్రదేశము.

9. దుమ్ము బురద నీళ్ళు రెల్లు తుంగ అనువానితోకూడినది, శ్వదంష్ట్రలు[1] లేనట్టిది, మహావృక్షశాఖలచే నష్టగింపబడనిది—ఇట్టిది ఏనుగులకు మరింత తగినప్రదేశము.

10. నీటిసదుపాయములు సేదదీర్చుకొనుటకు స్థావరములు కలది, కుదుపులుకలిగించనిది, కేదారములులేనిది, వెనుకకు తిరుగుట కనుకూలించునది—ఇట్టిది రథములకు మరింత తగినప్రదేశము.

11. (చతురంగములు) అన్నిటికి తగినప్రదేశములు వివరింపబడినవి.
12. దీనినుండి బలములన్నిటికి యుద్ధమునకుగాని నివేశనమునకుగాని తగిన ప్రదేశములను తెలుసుకొనవలెను.

13. అర్హమగు ప్రదేశమును నివేశనమును అరణ్యములను శోధించుట, విషమముకాని ప్రదేశమును, నీటిని, రేవును, గాలిని, వేడిని గుర్తించుట, (శత్రువు) వీవధాసారముల వినాశము, (విజిగీషువు) వీని రక్షణము, సైన్యమును శుద్ధముచేయుట, స్థిమితపరచుట, ప్రసారమును వృద్ధిచేయుట, శత్రువును తరుముట, మొదటిదెబ్బనుకొట్టుట, (శత్రుసైన్యము) లోపలప్రవేశించుట, చీల్చుకొనిపోవుట, ఆప్యాయము కలిగించుట, బంధితుల వశపరుచుకొనుట, విడుదలచేయుటకు వెంటనంటు మార్గమునుమార్చుట, కోశమునుగాని రాజకుమారునిగాని తప్పించి తీసుకొనిపోవుట, వెనుకభాగమందును కొనలందును శత్రువు పైపడుట, బలహీనుల ననుసరించుట, అనుయానముచేయుట, సైనికులనొక చోటచేర్చుట—ఇవి అశ్వదళముచేయవలసిన కార్యములు.

14. ముందుభాగమున నడుచుట, క్రొత్తమార్గములను నివేశనములను రేవులను నిర్మించుట, శత్రువును పారద్రోలుట, నీళ్ళను దాటుట, నీళ్ళలోకి దిగుట, స్థిరముగ నుండుట, ముందుకు నడుచుట, దిగుట, విషమమగు నట్టియు జన సమ్మర్దముకలిగినట్టియు ప్రదేశముల ప్రవేశించుట, నిప్పు అంటించుట చల్లార్చుట, ఒంటరిగ విజయమును సాధించుట, చెదరినసైనికుల నొకచోటచేర్చుట, సంఘటితమగు సేనలను భగ్నముచేయుట, ఆపదలలో రక్షించుట, ఆక్రమణము

[1] ఇది ఒకవిధమగు ముండ్ల చెట్టు.

చేయుట, భయపెట్టుట (భీతినికలిగించుట), క్షోభనుకల్పించుట, పట్టుకొనుట, విడుదలచేయుట, ప్రాకారములను ద్వారములను గోపురములను పగులకొట్టుట, కోశమును తెచ్చుట తీసుకొనిపోవుట—ఇవి ఏనుగులు చేయవలసిన కార్యములు.

15. స్వసైన్యమును రక్షించుట, చతురంగబలము నెదుర్కొని ఓడించుట, పట్టుకొనుట, విడుదలచేయుట, చెదరినసైన్యమును సంఘటితపరచుట, సంఘటిత సైన్యమును భేదించుట, భీతిగొల్పుట, క్షోభనుకల్పించుట, భయంకరముగా నినాదములుచేయుట—ఇవి రథములు చేయవలసినకార్యములు.

16. సర్వదేశకాలములందు ఆయుధముల ధరించుట, సైనికవ్యాయామము—ఇవి పదాతులు చేయవలసినకార్యములు.

17. శిబిరములను మార్గములను సేతువులను కూపములను తీర్థములను శోధించి శుభ్రపరుచుట ; యంత్రములను ఆయుధములను ఆవరణములను ఉపకరణములను గ్రాసమును మోయుట ; యుద్ధరంగమునుండి ఆయుధములను ఆవరణములను గాయపడినవారిని తీసుకొనిపోవుట—ఇవి విష్టి (కార్మికులు) చేయవలసిన కార్యములు.

18. (శ్లో) కావలసినన్ని గుర్రములులేని రాజు గుర్రములను ఎద్దులను రథములకు కట్టవలెను ; కావలసినన్ని ఏనుగులులేనిరాజు గాడిదలు ఒంటెలుకట్టిన బండ్లను సైన్యమునడుమ నిలుపవలెను.

ఇది సాంగ్రామిక మను పదోఅధికరణమందు యుద్ధభూములు పత్త్యశ్వరథహస్తికర్మలు అనే నాలుగో అధ్యాయము.

# పదో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 155 : పక్షకక్షోరస్యములందును పురోభాగమందును వ్యూహవిభాగము

### ప్రకరణము 156 : సారఫల్గుబలవిభాగము

### ప్రకరణము 157 : పత్త్యశ్వరథహస్తియుద్ధములు

1. అయిదు వందల ధనుస్సుల దూరమందుగాని, ప్రదేశమున కనుగుణముగగాని దుర్గమును నిర్మించి, (అటుతర్వాత) యుద్ధములోనికి దిగవలెను.

2. సైన్యమును శత్రువునకు కనుపించకుండునట్లు గావించి, ఆయా స్థానములందు ముఖ్యుల నియమించి, సేనాపతియు నాయకుడు సేనావ్యూహము నమర్చవలెను.

3. శమమున కొకని చొప్పున పదాతులను, మూడు శమముల కొకటి చొప్పున గుర్రములను, అయిదు శమముల కొకటి చొప్పున రథములను ఏనుగులను నిలబెట్టవలెను. 4. లేదా, దీనికి రెండింతలో మూడింతలో దూరమున నిలబెట్టవచ్చును. 5. ఒక్కొకడు సమ్మర్దములేక సుఖముగ యుద్ధము చేయవలెను.

6. ధనుస్సనగా అయిదు అరత్నులు. 7. అంతటి దూరమున నత దొక ధనుర్ధరుని నిలుపవలెను; మూడు ధనుస్సుల దూరమున గుర్రపురౌతును, అయిదు ధనుస్సుల దూరమున రథమును, ఏనుగును నిలుపవలెను.

8. పక్షములు, కక్షములు, ఉరోభాగము—ఈ మూడును అయిదు ధనుస్సుల దూరమున కలియవలెను.

9. ఒక్కొక గుర్రమునకు ముందు ముగ్గురు యోధు లుండెదరు. 10. ఒక రథమునకుగాని ఏనుగునకుగాని పదిహేనుమంది యోధులు అయిదు గుర్రములు

ఉండవలెను. 11. అందరు పాదరక్షకులను గుర్రములకు రథములకు ఏనుగులకు నియమించవలెను.

12. ఉరోభాగమున (నడుమ) మూడేసి రథములుగల మూడు పంక్తులను ఒక్కొక పక్షమందు కక్షమందు అదే పరిమాణముగల రథపంక్తిని అమర్చవలెను. 13. ఈ లెక్క ప్రకారము ఒక్కొక రథానీకమందు నలభైఅయిదు రథములు, రెండువందల ఇరవైఅయిదు గుర్రములు, ముందుభాగమున ఆరువందల డెబ్బైఐదు పదాతియోధులు, అందరు పాదరక్షకులు ఉండెదరు.

14. ఇది సమవ్యూహము. 15. దీని నొక్కొక పర్యాయము రెండేసి రథ పంక్తుల చొప్పున ఇరవైఒక్క రథపంక్తులవరకు వృద్ధిచేయవచ్చును. 16. ఇట్లు ఈ బేసిసంఖ్యలు సమవ్యూహములోని పది ప్రకృతులు (ఆధారములు) అగుచున్నవి.

17. పక్షములలోను కక్షములలోను ఉరోభాగమందును పంక్తుల సంఖ్యా సమములుకానియెడల విషమవ్యూహ మేర్పడుచున్నది. 18. ఇదికూడ నొక్కటే పర్యాయము రెండేసి రథపంక్తుల చొప్పున ఇరవైఒక్క రథపంక్తులవరకు వృద్ధి కావచ్చును. 19. ఇట్లు ఈ బేసి సంఖ్యలు విషమవ్యూహములోని పది ప్రకృతు లగుచున్నవి.

20. ఇట్లు వ్యూహమును నిర్మించిన తర్వాత శేషించిన సైన్యమును "ఆవాపము" చేయవలెను. 21. రథములలో మూడింట రెండవ వంతును పార్శ్వములందును, మిగిలినవానిని ఉరోభాగమందును నిలుపవలెను. 22. ఇట్లు రథములలో మూడింట నొకభాగము తక్కువగ "ఆవాపము" చేయవలెను.

23. దీనినుండి గుర్రములయు ఏనుగులయు ఆవాపముల గురించి తెలిసు కొనవలెను. 24. సమ్మర్ధములేక గుర్రములు రథములు ఏనుగులు సులభముగ యుద్ధము చేయదగినట్లుగ "ఆవాపము" జరుగవలెను.

25. సేనాబాహుళ్యమే ఆవాపము. 26. పదాతుల బాహుళ్యము ప్రత్యా వాపము. 27. ఏకాంగబాహుళ్యము అన్వావాపము. 28. దూష్యుల బాహుళ్యము అత్యావాపము.

29. శత్రుసైన్యములోని ఆవాప ప్రత్యావాపములకంటె స్వసైన్యబలము ననుసరించి నాలుగురెట్లు మొదలు ఎనిమిదిరెట్లవరకు ఆవాపము చేయవచ్చును.

30. రథవ్యూహ వివరణమునుండి హస్తివ్యూహ వివరణమును తెలుసుకొన వలెను.

31. లేదా, సైన్యాంతములందు ఏనుగులు, పార్శ్వములందు గుర్రములు ఉరోభాగమున రథములు అమర్చి హస్తిరథాశ్వములతో కూడిన మిశ్రమవ్యూహము నేర్పరుపవచ్చును. 32. ఉరోభాగమున ఏనుగులు, కక్ష్యములందు రథములు,

పక్షములందు గుర్రములు—ఇది మధ్యభేదియగు వ్యూహము. 33. దీనికి విరుద్ధ మగునది అంతర్భేదియగు వ్యూహము.

34. ఉరోభాగమున యుద్ధముచేయు ఏనుగులు, వెనుకభాగమున వాహకము లగు ఏనుగులు, కొనలందు వ్యాళములగు ఏనుగులు—ఇట్టిది శుద్ధమగు హస్తి వ్యూహము.

35. ఉరోభాగమున వర్మములతో కప్పబడిన గుర్రములు, కక్ష పక్షములలో వర్మములులేని గుర్రములు—ఇట్టిది శుద్ధమగు అశ్వవ్యూహము.

36. ముందుభాగమున ఆవరణముల ధరించిన పదాతులు, వెనుకభాగమున ధనుర్ధరులు—ఇట్టిది శుద్ధమగు పత్తివ్యూహము.

37. దీనితో శుద్ధవ్యూహములు సమాప్తము.

38. పక్షములందు పదాతులు, పార్శ్వములందు గుర్రములు, పృష్ఠము నందు ఏనుగులు, ముందుభాగమున రథములు అమర్చబడవలెను; లేదా, శత్రు వ్యూహము ననుసరించి దీనిని తల్రక్రిందులు చేయవచ్చును. 39. ఇది రెండంగ ములతో కూడిన సైన్యవిభాగము. 40. దీనినుండి మూడంగములతో కూడిన సైన్య విభాగము గురించి తెలుసుకొనవలెను.

41. పదాతుల విషయములో సైన్యసంపద యుండుటయే ఉత్తమపదాతుల లక్షణము. 42. ఏనుగుల, గుర్రముల విషయములో కులము, జాతి, సత్వము, వయస్సు, ఉత్సాహము, ఎత్తు, వేగము, తేజస్సు, శిక్షణ, స్థైర్యము, ఉదగ్రత, విధేయత్వము, శుభసూచకములగు గుర్తులు (సుళ్ళు), సత్ప్రవర్తనము—ఇవి ప్రత్యేక లక్షణములు.

43. సారములగు పత్త్యశ్వరథద్విపములలో మూడవవంతును ఉరోభాగ మందు, మూడింటరెండువంతులను రెండుకక్షములందు రెండుపక్షములందు నిలుపవలెను; వీనివెనుక రెండవరకమువానిని; మూడవరకమువానిని సార బలమునకుముందు, సారహీనమగుదానిని దీనికిముందు నిలుపవలెను. 44. ఇట్లు సైన్యమునంతను నుపయోగించు కొనవలెను.

45. సారహీనములగు బలములను సైన్యాంతములందు నిలిపినయెడల వేగముతో శత్రుసైన్యముల నెదుర్కొనుట సాధ్యమగును.

46. సారబలమును ముందుంచినపుడు రెండవరకము సైన్యములను కొనల యందును, మూడవరకమువానిని పృష్ఠమునను, సారహీనములను నడుమను నిలుపవలెను. 47. అప్పుడు శత్రుసైన్యము నోడించుట సాధ్యమగును.

48. వ్యూహమునమర్చి, పక్ష కక్ష ఉరోభాగములందుండు ఒకదానితోగాని రెంటితోగాని శత్రువును కొట్టవలెను; తక్కిన సైన్యభాగములతో వీనికి సహాయ పడవలెను.

49. శత్రుసైన్యములోని బలహీనభాగమును, హస్త్యశ్వములునులేనట్టి దానిని, దూష్యులతో కూడినట్టిదానిని, లేదా, కుట్రలకు లోబడినదానిని తనసైన్య బాహుళ్యముతోను, బలవత్తరులగువారితోకూడిన భాగముతోను ఎదుర్కొనవలెను. 50. లేదా, ఎందు శత్రుసైన్యము సారబలముగలదిగ నున్నదో దానిని సారబలము గల రెండింతల సైన్యముతో నెదుర్కొనవలెను. 51. తనసైన్యములో ఏఅంగము నందు సారబలము తగ్గియున్నదో దానిని సారబల బాహుళ్యముతో నింపవలెను. 52. శత్రువున కెచ్చట నష్టముకలుగునో అట్టిప్రదేశమందుగాని, ఎచ్చటతన కెక్కువ ప్రమాదము సంభవించునో అట్టిప్రదేశమందుగాని తనసైన్యమును వ్యూహపరుపవలెను.

53. ముందుభాగమునుండి వడిగా పైబడుట, నలువైపులనుండి పైబడుట, (శత్రుసైన్యముల) దాటిపైబడుట, వెనుకనుండి తరుముట, మర్దించికలియుట, గట్టిగపట్టుకొనుట, నలువైపులపరుగెత్తుట, చుట్టుముట్టుట, చెదరునట్టుచేయుట, పరుగెత్తి వెనుకకుతిరుగుట, ఎదుట పార్శ్వములందు వెనుక భగ్నమైన స్వసైన్యములను రక్షించుట, భగ్నమైన సైన్యముల వెంటనంటుట — ఇవి అశ్వ యుద్ధ విధానములు.

54. చెదరునట్లు చేయుటతప్ప తక్కిన అశ్వయుద్ధవిధానములు, చతురంగములన్నిటినిగాని ఒక్కొకదానినిగాని నాశముచేయుట, పక్షకక్షోరస్యములను భగ్నపరుచుట, అకస్మాత్తుగ పైబడుట, నిద్రించుచున్నవారిని కొట్టుట — ఇవి హస్తియుద్ధ విధానములు.

55. ఈవిధానములలో మర్దించికలియుటతప్ప తక్కినవి, అర్హమగు ప్రదేశమున ముందునడుచుట, దూరముగపోవుట, స్థితస్థానమందుండి యుద్ధము చేయుట—ఇవి రథయుద్ధ విధానములు.

56. అన్నిప్రదేశములందు, అన్నికాలములందు పైనబడుట, రహస్య దండము—ఇవి పదాతుల యుద్ధవిధానములు.

57. (శ్లో) ఇట్లు చతురంగములను తగినవిధమున ఉపయోగించదగినట్లుగ బేసిగను సమముగను వ్యూహముల నేర్పరుపవలెను.

58. (శ్లో) రెండువందల ధనుస్సుల దూరమున సైన్యమునకు వెనుకభాగమున రాజునిలబడవలెను. అచటనుండి భగ్నముగాంచిన సైన్యములను సంఘటితపరచు కొనుట సాధ్యమగును. వెనుకభాగమందు అధికసైన్యములను నిలుపుకొనక యుద్ధము చేయరాదు.

ఇది సాంగ్రామికమను పదో అధికరణమందు పక్షకక్షోరస్యములందును పురోభాగమందును వ్యూహవిభాగము, సారఫల్గు బలవిభాగము, పత్త్యశ్వరథ హస్తియుద్ధములు అనే అయిదోఅధ్యాయము.

# పదో అధికరణము

## అధ్యాయము 6

### ప్రకరణము 158 : దండభోగమండలాసంహతవ్యూహముల వ్యూహనము

### ప్రకరణము 159 : వానినెదుర్కొనుటకు ప్రతివ్యూహస్థాపనము

1. రెండుపక్షములు, ఒకఉరోభాగము, ప్రతిగ్రహము[1]—ఇదివ్యూహ విభాగమని ఔశనసులు. 2. రెండుపక్షములు, రెండుకక్షములు, ఒకఉరోభాగము, ప్రతిగ్రహము—ఇదివ్యూహవిభాగమని బార్హస్పత్యులు.

3. ఉభయుల మతము ప్రకారము పక్షములు కక్షములు ఉరోభాగములుకల దండవ్యూహము భోగవ్యూహము మండలవ్యూహము అసంహతవ్యూహము—అనునవి ప్రకృతివ్యూహములు.[2] 4. వీనిలో తిర్యగ్వృత్తి (వెనుకకుతిరిగికొట్టుట) గలది దండవ్యూహము. 5. సైనికవిభాగము లన్నియు నొకటితర్వాత నొకటి యుద్ధముచేయునట్లమర్చబడినది భోగ (సర్ప) వ్యూహము. 6. సైనికవిభాగములన్ని ప్రక్కలనుండి యుద్ధముచేయున ట్లమర్చబడినది మండలవ్యూహము. 7. నిర్ణీత మగు స్థానమునుండి వేర్వేరుగ సైనికవిభాగములు యుద్ధముచేయునట్లమర్చ బడినది అసంహతవ్యూహము.

8. పక్షకక్షోరస్యములు సమముగ యుద్ధముచేయున ట్లమర్చబడినది దండవ్యూహము. 9. అట్టిది పక్షములుముందుకు సాగిపోవున ట్లమర్చబడినది ప్రదరము. 10. అట్టిది పక్షకక్షము లవసరమైనప్పుడు వెనుకకు తిరుగున ట్లమర్చబడినది దృఢకము. 11. అట్టిది పక్షములతో దాటిపోవున ట్లమర్చబడినది అసహ్యము. 12. పక్షములను కదలించక ఉరోభాగములోని దళములు సాగి

---

[1] ప్రతిగ్రహ మనగా ప్రమాదమునెదుర్కొనుటకు ప్రత్యేకింపబడిన సైన్యము.

[2] ప్రకృతివ్యూహము లనగా సహజముగనేర్పడు వ్యూహములు, తక్కిన వన్నియు వీని విభేదములు.

పోవునట్లమర్చబడినది శ్యేనము. 13. (ఈనాలుగు) విరుద్ధములైనప్పుడు చాపము, చాపకుక్షి, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠము అను వ్యూహములగును. 14. చాపాకారపక్షములుకలది సంజయము. 15. అట్టిది ఉరస్యముతో సాగిపోవున ట్లమర్చబడినది విజయము. 16. స్థూలకర్ణములపలెనుండు పక్షములుకలది స్థాణుకర్ణము. 17. పక్షములలో రెండుస్తంభములుకలది విశాలవిజయము. 18. పక్షములు మూడురెట్లు వృద్ధిగాంచినది చమూముఖము. 19. దీనికి విరుద్ధమగునది ఝషాస్యము. 20. ఏకపంక్తియందుండు దండము సూచీవ్యూహము. 21. రెండు దండములు వలయము. 22. నాలుగుదండములు దుర్జయము. 23. దీనితో దండవ్యూహములు సమాప్తము.

24. పక్షకక్షోరస్యములు విషమముగ యుద్ధముచేయున ట్లమర్చబడినది భోగ (సర్ప) వ్యూహము. 25. అదియే "సర్పసారీవ్యూహము," లేదా, "గోమూత్రికావ్యూహము." 26. ఉరోభాగమందు రెండుసైనికదళములు దండవ్యూహముగనుండు పక్షముకలది శకటము. 27. దీనికి విరుద్ధమగునది మకరము. 28. హస్త్యశ్వరథములతో కలిసిన శకటము పారిపతంతక వ్యూహము. 29. దీనితో భోగవ్యూహములు సమాప్తము.

30. పక్షకక్షోరస్యములు ఏకమగుట మండలవ్యూహము. 31. అట్టిది సర్వతోముఖమగునప్పుడు సర్వతోముఖవ్యూహము. 32. ఎనిమిది సైనికదళములుకలది దుర్జయము. 33. దీనితో మండల వ్యూహములు సమాప్తము.

34. పక్షకక్షోరస్యములు కలియక వేరువేరుగ నుండుట అసంహత వ్యూహము. 35. అయిదుసైనికదళము లసంహతములుగ నమర్చబడుట వజ్ర వ్యూహము, లేదా, గోధావ్యూహము. 36. నాలుగుదళము లసంహితములగు నపుడు ఉద్ధానకము, లేదా, కాకపది. 37. మూడుదళము లసంహితములగునపుడు అర్ధచంద్రకము, లేదా, కర్కటకశృంగము. 38. దీనితో అసంహిత వ్యూహములు సమాప్తము.

39. ఉరోభాగమందు రథములు, కక్షలందు ఏనుగులు, పృష్ఠమందు గుఱ్ఱములు—ఇట్టిది అరిష్టవ్యూహము. 40. పదాతులు, గుఱ్ఱములు, రథములు, ఏనుగులు—ఇవి ఒకటివెనుక మరియొకటి ఉండుట అచలవ్యూహము. 41. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులు—ఇవి ఒకటివెనుక మరియొకటి ఉండుట అతిహతవ్యూహము.

42. వీనిలో ప్రదరమును దృఢకముచేతను, దృఢకము నసహ్యము చేతను, శ్యేనమును చాపముచేతను, ప్రతిష్ఠమును సుప్రతిష్ఠముచేతను, సంజయమును విజయముచేతను, స్థూణాకర్ణమును విశాలవిజయముచేతను, పారిపతం

తకమును సర్వతోభద్రముచేతను ప్రతిఘటించవలెను. 43. దుర్జయముచేత వ్యూహములనన్నిటిని ప్రతిఘటించవలెను.

44. పదాతులు, గుర్రములు, రథములు, ఏనుగులు—వీనిలో వరుసగ ముందున్నదానిని తర్వాతిదానితో ప్రతిఘటించవలెను; హీనాంగమును అధికాంగముచేత ప్రతిఘటించవలెను.

45. అంగములలో పదింటికి ఒక పతికుడు, పదిపతికులకొక సేనాపతి, పది సేనాపతుల కొక నాయకుడు[3] ఉండవలెను. 46. సైన్యాంగ విభాగములకు, సంఘటితములకు, విడియుటకు, యానముచేయుటకు వెనుకకుతిరుగుటకు, మార్కొనుటకు అతడు తూర్యఘోషములతోను ధ్వజములతోను పతాకములతోనుసంజ్ఞలను ఏర్పరుపవలెను.

47. శత్రువ్యూహములు సమములైనప్పుడు దేశకాలబలములబట్టి విజయము లభించును.

48-50. (శ్లో) యంత్రములచేతను, మంత్రక్రియలచేతను, కార్యాసక్తులగువారిని హత్యచేయుటయందు నేర్పుగల తీక్ష్ణులచేతను, మాయలచేతను, దైవకార్యములచేతను, శకటములచేతను, భయపెట్టు ఏనుగులచేతను, దూష్యులకుద్రేకము కలిగించుటచేతను, పశువులమందలచేతను, శిబిరములకు నిప్పంటించుటచేతను, సైన్యముకొనలయందు వెనుకభాగమందు దెబ్బతీయుటచేతను, "నీదుర్గము దగ్ధముచేయబడినది, లేదా, శత్రువశమైనది; నీ కుటుంబములోనివాడొకడు తిరుగుబాటు చేసెను; నీ శత్రువో ఆటవికుడో తిరుగుబాటుచేసెను," అని ప్రకటించు దూతవ్యంజనుల మూలమున విభేదములు కల్పించుటచేతను శత్రువునకు భీతికల్పింపవలెను.

51. (శ్లో) ధనుర్ధరుడు వదలిన బాణమొకనిని చంపవచ్చును; లేదా, చంపకపోవచ్చును; కాని, ప్రాజ్ఞునిచే నుపయోగింపబడిన బుద్ధి గర్భమందున్న శిశువులనుకూడ హత్యచేయును.

ఇది సాంగ్రామికమను పదో అధికరణమునందు దండభోగమండలాసంహత వ్యూహముల వ్యూహనము, వాని నెదుర్కొనుటకు ప్రతివ్యూహ స్థాపనము అనే ఆరో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు సాంగ్రామికమను పదో అధికరణము సమాప్తము.

---

[3] సేనాపతికంటె నాయకుడు ఉన్నతపదవియం దున్నట్లు ఇచట చెప్పబడినది, ఇది కొంత విపరీతముగ కనిపించును.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## పదకొండో అధికరణము

## సంఘవృత్తము

### అధ్యాయము 1

### ప్రకరణము 160 : భేదోపాదానములు

### ప్రకరణము 161 : రహస్యదండములు

1. సంఘలాభ మిత్రలాభములలో సంఘలాభ మత్యుత్తమము. 2. సంఘము లైకమత్యము కలవి యగుటచేత శత్రువులు వశపరుచుకొనుట సాధ్యము కాదు. 3. వానిలో మిత్రభావముగలవానిని సామదానములచేతను శత్రుభావము గలవానిని భేదదండములచేతను వశపరుచుకొనవలెను.[1]

4. కాంభోజులు, సురాష్ట్రులు, క్షత్రియులు, శ్రేణులు మొదలగువారు ఆర్థికములగువృత్తులను శస్త్రవృత్తులను అనుసరించువారు. 5. లిచ్ఛావికులు, వృజకులు, మల్లకులు, మద్రకులు, కుకురులు, కురులు, పాంచాలురు, తదితరులు రాజశబ్దము నుపయోగించువారు.[2]

---

[1] ఇది మిక్కిలి ప్రధానమగు అధ్యాయము. ప్రాచీనకాలపు భరతఖండమందు రాజులు పాలించురాజ్యములే గాక సంఘములుపాలించు రాజ్యములున్నట్లు దీనినుండి స్పష్టమగుచున్నది. సాధారణముగ సంఘములోని వారందరు కులక్రమాగతముగ రాజబిరుదమును వహించి శస్త్రములతో జీవించు క్షత్రియులు. వారిలో ఐకమత్యమున్నంతవరకు వారితరులకు వశపడకుండిరి. సామ్రాజ్యమును కాంక్షించిన చక్రవర్తులందరు వారిని వశపరుచుకొనుటకు సర్వప్రయత్నములు చేయుచుండువారు. వారిలో భేదములుకల్పించుటయే ఈప్రయత్నములన్నిటిలో ప్రధానమైనది. ఏయే విధముగ భేదముల గల్పించ వలెనో ఈ అధ్యాయము వివరించుచున్నది.

[2] సంఘములోనివారందరికి రాజబిరుద ముండెడిది. ఈసంఘములలో లిచ్ఛావికులుతప్ప

*(footnote 2 contd. in the next page)*

6. వీరందరివిషయములో, అనన్యులైన గూఢచారులు సంఘములలోని పరస్పరలోపములను, ద్వేషమునకు వైరమునకు కలహమునకు కారణస్థానము లను తెలుసుకొని, తమమాటలు వినగలవాడను విశ్వాసముకలవానితో "ఫలానా వాడు నిన్నునిందలపాలుచేయుచున్నాడు," అనిచెప్పి, ఇతరులనుండి వానిని విడదీయవలెను. 7. ఈవిధముగ నుభయపక్షముల మధ్య రోషము పెరిగిన తర్వాత ఆచార్యుల వేషముల ధరించిన గూఢచారులు శిష్యులలో విద్య, నేర్పు, జూదము, విహారములు మున్నగువానిని గురించి కలహములు కల్పించవలెను.

8. లేదా, తీక్ష్ణులు వేశ్యాగృహములందును, పానశాలలందును సంఘ ముఖ్యుల యనుచరుల సమక్షములో వారి విరోధులను ప్రశంసించుచు వారిలోవారికి కలహములు సంభవించునట్లు చేయవలెను; లేదా, కృత్యపక్షమువారిని సమర్థించ వలెను.

9. లేదా, వారు తక్కువ సుఖముల ననుభవించు యువకులను ఎక్కువ సుఖము లనుభవించువారిని ద్వేషించునట్లు చేయవలెను.

10. లేదా, వారు, వారిలో విశిష్టులగువారు హీనులతో భోజనములచేయుటను గాని వివాహసంబంధముల జేసుకొనుటనుగాని నివారించవలెను. 11. లేదా, వారు హీనుల నధికులతో భోజనము చేయవలసినదనియు వివాహసంబంధములు చేసు కొనవలసినవనియు ప్రోత్సహించవలెను.[3] 12. లేదా, వారు, అతిహీనులగువారు అధికులతో కులగౌరవమందును, పౌరుషమందును, గౌరవస్థానముల మార్చు కొనుటయందును సమానత్వమును కోరునట్లు కుట్రలు పన్నవలెను.

13. లేదా, పరిష్కరింపబడిన వ్యవహారమును దానికి పూర్తిగ విరుద్ధమగు విషయముల నుద్ఘాటించి వివాద గ్రస్థమగునట్లు చేయవలెను.

14. తీక్ష్ణులు వివాదవిషయములో రాత్రియందు ద్రవ్యములకు పశువులకు మనుష్యులకు నష్టముకలిగించి వివాదమును మరింత బలపరుపవలెను.

15. కలహములన్నిటియందు (విజిగీషువగు) రాజు కోశముతోను సైన్యముతోను హీనపక్షమును సమర్థించి విరోధిపక్షమును హత్యచేయుటకై వారిని పురికొల్పవలెను. 16. లేదా, విడివడినవారిని ఎత్తుకొని పోవలెను. 17. వారిలో అయిదేసి కుటుంబములకుగాని పదేసికుటుంబములకుగాని వ్యవసాయ యోగ్యములగు భూములనిచ్చి నివేశనములందు నిలుపవలెను.

---

*(footnote in continuation of the previous page)*

తక్కిన సంఘములన్నియు మౌర్యసామ్రాజ్యస్థాపనమునాటికి అంతరించినవి. తర్వాతికాలమున ప్రఖ్యాతిగాంచిన యౌధేయులు, అర్జునాయినులు, ఉదంబరులు మొదలగు సంఘములను కౌటిల్యుడు పేర్కొనక పోవుటచేత నతడు మౌర్యులకాలమునాటివాడనియు తర్వాతికాలము వాడు కాడనియు చెప్పదగియున్నది.

[3] సంఘములలోనివారిలో తరతమభేదములున్నట్లు దీనినుండి తెలియవచ్చుచున్నది.

18. ఏలయన, ఒకప్రదేశమందు కలిసి నివసించువారైనయెడల వారు ఆయుధముల నుపయోగించుటలో సమర్థులు కాగలరు. 19. వారు కలిసినయెడల శిక్షవిధించవలెను.

20. వారిలో సద్వంశములకు చెంది, అవరుద్ధుడుగనో రాజశబ్దమునుపయోగించువారి అభిమానమును కోల్పోయినవాడుగనో ఉన్నట్టివానిని యువరాజుగ నియోగించవలెను. 21. సాముద్రికశాస్త్రము నెరిగినవారు అట్టివారు మరికొందరు వానికి రాజలక్షణమున్నట్లు సంఘములోనివారికి తెలియపరుపవలెను. 22. అతడు సంఘముఖ్యులలో ధర్మిష్ఠులగువారితో, "ఫలానా రాజపుత్రునిపట్లగాని రాజసోదరునిపట్లగాని మీరు ధర్మము నెరవేర్పవలెను," అని చెప్పి వారిమనస్సులను మార్చవలెను. 23. వారునమ్మతించిన తర్వాత, కృత్యపక్షమువారిని బలపరచుటకు కోశమును సైన్యమును పంపవలెను. 24. యుద్ధము జరుగుచున్నప్పుడు మద్యము తయారుచేయువారి వేషముల ధరించిన గూఢచారులు మరణముగాంచిన పుత్రునియొక్కగాని భార్యయొక్కగాని ప్రేతతృప్తికని చెప్పుచు మదనరసముతో కలిపిన మద్యమును వందలాదికుంభములలో నింపి వారి కియ్యవలెను.

25. చైత్యములయు దేవాలయములయు ద్వారములవద్దగాని, దుర్గనమీప స్థలములందుగాని ముద్రవేసి ఉంచబడిన హిరణ్యముతోకూడిన సంచులను భాండములనుఉంచి, ఇవిఒప్పందము ప్రకారము తేబడినవని గూఢచారులు చూపించవలెను. 26. సంఘముఖ్యులు వానినిచూచుటకువచ్చినప్పుడు గూఢపురుషులు, "ఇవి రాజునకు చెందినవి," అనిచెప్పవలెను. 27. అప్పుడత డాక్రమణమును జరిపించవలెను.

28. లేదా, సంఘమునుండి వాహనములనుగాని హిరణ్యమునుగాని తాత్కాలికముగ ఋణరూపమున తీసుకొని వానిలో ప్రఖ్యాతిగాంచిన వస్తువు నొకదానిని సంఘముఖ్యుని కొకని కియ్యవలెను. 29. దానిని వారు తిరిగిఇయ్యవలసినదిగ కోరినప్పుడు, "దానిని ఫలానాముఖ్యునికి ఇచ్చితిని," అనిచెప్పవలెను.

30. దీనినుండి శత్రుశిబిరములోను ఆటవికులలోను ఎట్లు విభేదముల కల్పింపవలెనో తెలుసుకొనవలెను.

31. లేదా, గూఢపురుషుడు సంఘముఖ్యుల పుత్రులలో ఆత్మసంభావితు నొకనితో, "నీవు ఫలానారాజుయొక్క కుమారుడవి. శత్రుభయముచే నిచట దాచబడితివి," అని నమ్మునట్లు చెప్పవలెను. 32. అతడు నమ్మతించినయెడల రాజు వానికి కోశముతోను సైన్యముతోను సహాయముచేసి సంఘముతో యుద్ధము చేయునట్లు ప్రోత్సహించవలెను. 33. తన యుద్దేశము నెరవేరినతర్వాత రాజు వానిని చంపించవలెను.

34. వేశ్యాపోషకులు, ప్లవకులు, నటులు, నర్తకులు, సౌభికులు గూఢ

చారులై సంఘముఖ్యులను రూపయౌవనవతులగు స్త్రీల వలలో చిక్కు కొనినవారినిగ చేయవలెను. 35. వారు కామోద్రేకులైన తర్వాత స్త్రీలు వారిలో నొకరినినమ్మించి మరియొకరిని పొందుచున్నారనియు, లేదా, బలాత్కరించబడు చున్నారనియు వదంతులుకల్పించి వారుకలహించునట్లు ప్రేరేపించవలెను. 36. కలహకాలమందు తీక్ష్ణులు, "ఈకాముకు డిట్లు చంపబడెను," అని చెప్పుచు వారి పనిని పూర్తిచేసుకొనవలెను. 37. ఆశాభంగముపొందినవాడు సహించి ఊరకున్న యెడల ఆడమనిషి అతనివద్దకువెళ్ళి, "ఫలానాముఖ్యుడు నన్నుకామించి నన్ను బాధించుచున్నాడు. అతడు జీవించియుండునంతవరకు నేనిక్కడ నుండజాలను," అనిపలికి అతనిని చంపించవలసినదని బ్రతిమాలుకొనవలెను. 38. లేదా, ఆమె బలవంతముగ నపహరించబడినయెడల వనాంతమందుగాని క్రీడాగృహమందుగాని బలాత్కరించినవానిని రాత్రియందు తీక్ష్ణునిచే చంపించవలెను; లేదా, విషముచే తానే చంపవలెను. 39. అటుతర్వాత నామె "నాప్రియుడు ఫలానావానిచే చంపబడెను," అని ప్రకటించవలెను.

40. లేదా, సిద్ధునివేషము ధరించిన గూఢచారి కాముకుడగు సంఘ ముఖ్యునొకనిని స్త్రీని వశముచేసుకొనుటయం దుపయోగకరములగు ఔషధముల నిచ్చి విశ్వాసపాత్రునిగ జేసుకొని విషప్రయోగముచేసి, వానిని చంపి పారిపో వలెను. 41. అతడు పారిపోయినతర్వాత గూఢపురుషు లాపనిని చేసినవాడు సంఘ ముఖ్యులలో మరియొకడని ప్రకటించవలెను.

42. లేదా, గూఢచారిణులగుస్త్రీలు ధనికురాండ్రగు విధవలవలెనో, రహస్యవృత్తివలన జీవించువారివలెనో, దాయ నిక్షేపములకై వివాదములో చిక్కుకొనినవారివలెనో కనిపించుచు సంఘముఖ్యులను కామోద్రేకులుగ చేయ వలెను; లేదా, అదితి కౌశిక స్త్రీలుగాని నర్తకులుగాని గాయనులుగాని ఇట్టిపనిని చేయ వచ్చును. 43. వారు సమ్మతించి రాత్రియందు సమాగమమునకు రహస్యగృహ మునకు వచ్చినప్పుడు తీక్ష్ణులు వారిని చంపవలెను; లేదా, వారినిబంధించి తీసికొని పోవలెను.

44. లేదా, గూఢచారి స్త్రీలోలుడగు సంఘముఖ్యునొకనితో, "ఫలానా గ్రామమునకు కుటుంబసహితముగ దరిద్రు డొకడు వచ్చియున్నాడు. అతని భార్య రాజునకర్హమైనది, ఆమెను అపహరించుము," అని వర్ణించి చెప్పవలెను. 45. అతడామెను పట్టుకొనితెచ్చిన తర్వాత ఒకపక్షముగడచిన పిమ్మట సిద్ధుని వేషముధరించిన గూఢచారి దూష్యసంఘముఖ్యుల సమక్షమునకు వచ్చి, "ఈ ముఖ్యుడు నాభార్యను కోడలిని సోదరిని కుమార్తెను బలాత్కరించెను," అని ఆక్రోశించవలెను. 46. సంఘ మతనిని శిక్షించినయెడల రాజు వానిపక్షము వహించి వానివిరోధులతో నతడు యుద్ధముగావించునట్లు ప్రోత్సహించవలెను. 47. వారతనిని శిక్షించనియెడల సిద్ధునివేషము ధరించినవానిని గూఢపురుషులు

రాత్రియందు హత్యగావించవలెను. 49. అటుతర్వాత నట్టి వేషముధరించిన మరి కొందరు, "ఫలానావాడు బ్రాహ్మణ ఘాతకుడు; బ్రాహ్మణస్త్రీ జారుడు," అని ప్రకటించవలెను.

49. లేదా, జ్యోతిష్కుని వేషమునుధరించినగూఢచారి ఒక సంఘముఖ్యుడు వరించిన కన్యనుగురించి మరియొకనితో, "ఈకన్య రాజమహిషియో రాజ పుత్రునికి తల్లియో కాదగ్గది. నీ సర్వస్వము ఖర్చుపెట్టిగాని, బల ప్రయోగము చేసిగాని నీవామెను పరిగ్రహించవలెను," అని వర్ణించి చెప్పవలెను. 50. ఆమెను పరిగ్రహించనియెడల గూఢచారి రెండవవానిని రోషావేశునిగ చేయ వలెను. 51. పరిగ్రహించినయెడల కలహము తప్పదు.

52. లేదా, భిక్షుకివేషమునుధరించిన గూఢస్త్రీ భార్యాప్రియుడగు నొక ముఖ్యునివద్దకువెళ్ళి "యౌవనగర్వితుడైన ఈముఖ్యుడు నన్ను నీభార్యవద్దకు పంపెను; భయపడి నేను వానిదగ్గరనుండి ఈఉత్తరమును ఆభరణములను తెచ్చితిని; నీభార్యనిర్దోషురాలు; రహస్యముగ నతనిపై ప్రతీకారచర్యకు పూనుకొనవలెను; ఈమధ్యకాలములో నేను (నీభార్య తరపున) సమ్మతించెదను," అని చెప్పవలెను.

53. ఇట్టికలహములు స్వయముగ సంభవించినను తీక్ష్ణులప్రోద్బలము వలన సంభవించినను రాజు బలహీనపక్షమునకు కోశదండములతో సహాయపడి తనవిరోధులతో యుద్ధముచేయున ట్లతనిని పురికొల్పవలెను; లేదా, అతనిని తన వద్దకు రప్పించుకొనవలెను.

54. ఏకరాజు[4] సంఘములపట్ల ఇట్లు ప్రవర్తించవలెను.

55. సంఘములుకూడ తమపై కుట్రలుపన్ను ఏకరాజు విషయమై తగిన జాగ్రత్తను వహించవలెను.

56. (శ్లో) సంఘముఖ్యుడు సంఘములోనివా రందరియెడల న్యాయ ప్రవృత్తికలవాడుగను హితుడుగను ప్రియుడుగను అందరికోరికలను చెల్లించువాడు గను ఉండి, అనురక్తులగువారి సహాయముతో దాంతుడుగ ప్రవర్తించవలెను.

ఇది సంఘవృత్తమను పదకొండో అధికరణము భేదోపాదానములు రహస్యదండములు అనే మొదటి అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు సంఘవృత్తమను పదకొండో అధి కరణము సమాప్తము.

---

[4] రాజులచే పాలింపబడు రాజ్యములలో ఒకడే రాజుగ నుండును; సంఘములలో అనేకులు రాజులుగ అధికారస్థానములందుండెదరు.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## పన్నెండో అధికరణము

## అబలీయసము[1]

### అధ్యాయము 1

### ప్రకరణము 162 : దూతకర్మ

1. "బలవంతుడగువానిచే దాడిచేయబడిన దుర్బలుడు వేతసీధర్మము ననుసరించి సర్వత్ర ప్రణతుడై ఉండవలెను. 2. బలవంతునికి నమ్రుడగుట ఇంద్రునికి నమ్రుడగుటయే," అని భారద్వాజుడు.

3. "అతడు తనసైన్యమునంతను సన్నాహపరచి యుద్ధముచేయవలెను. 4. ఏలయన, పరాక్రమము ఆపదల నన్నిటిని అధిగమించగలదు. 5. యుద్ధములో జయముగాంచినను పరాజయము గాంచినను ఇది క్షత్రియుని ప్రత్యేక ధర్మము," అని విశాలాక్షుడు.

6. "కాదు," అని కౌటిల్యుడు. 7. సర్వత్ర నమ్రుడైనవాడు మందను వదలిన గొర్రెవలె ఆశయుననదిలేక జీవించవలసినవా డగును. 8. అల్పసైన్యముతో యుద్ధమునకు దిగువాడు నావలేక సముద్రములో దిగినవానివలె నాశము పొందును. 9. కావున బలవంతుడగు ప్రభువు నొకని నాశ్రయించవలెను; లేదా, శత్రుసాధ్యముకాని దుర్గమును చేరవలెను.[2]

10. అభియానము చేయు రాజులు ధర్మవిజయి, లోభవిజయి, అసురవిజయి అని మూడురకములు. 11. వారిలో ధర్మవిజయి నమ్రత్వ మాత్రముచేత

---

[1] అబలీయస మనగా బలములేనివానికి సంబంధించినది. బలములేనివాడు తనపై అభియానము చేయదలచిన బలవంతులపట్ల ఎట్లుప్రవర్తించవలెనో ఈఅధికరణము వివరించుచున్నది.

[2] భారద్వాజుడు, విశాలాక్షుడు ఒకవిధముగ అతివాదులు; కౌటిల్యుడు వారి వలెగాక మధ్యమార్గమును సూచించుచున్నాడు.

తృప్తిపొందును. 12. కావున, వానికి లోబడుటయే మంచిది; ఇతరులనుండి అపాయములు రానున్నప్పుడుకూడ ఇట్లేచేయవలెను. 13. లోభియగువాడు (లోభవిజయి) భూమిని ద్రవ్యములను హరించి తృప్తిగాంచును. 14. వానికి ధనమునిచ్చుట మంచిది. 15. అసురవిజయి భూమిని ద్రవ్యమును పుత్రులను భార్యలను హరించి తృప్తిగాంచును; అతనికి భూమిని ద్రవ్యమును ఇచ్చి అతనికి వశముగాక ప్రతిక్రియల చేయవలెను.

17. వీరిలో నొకడు తనపై యానముచేయుటకు బయలుదేరినప్పుడు వానిని సంధితోగాని దౌత్యయుద్ధముతోగాని కూటయుద్ధముతోగాని ఎదుర్కొన వలెను. 18. వాని శత్రుపక్షమును సామదానములచేతను, స్వపక్షమును భేద దండ ములచేతను వశపరుచుకొనవలెను.

19. గూఢచారులు శస్త్రములతోను విషముతోను అగ్నితోను అతని దుర్గమును జనపదమును శిబిరమును నాశముచేయవలెను. 20. అన్నివైపులనుండి అతనిపృష్ఠభాగమును మార్కొనవలెను. 21. లేదా, ఆటవికులచే నతని రాజ్యము నకు నష్టము కలిగించవలెను; దాయాదులచేతగాని అవరుద్ధుడగు రాజకుమా రునిచేతగాని అతనిరాజ్యమును హరించునట్లు చేయవలెను. 22. ఇట్టి హానికరము లగు కార్యములను గావించినతర్వాత సంధికై అతనివద్దకు దూతను పంపవలెను. 23. లేదా, హానికరములగు కార్యములను చేయకయే సంధిని కోరవచ్చును.

24. అప్పుడుకూడ నతడు యానముచేయు నెడల నాలుగోవంతు అధిక ముగ కోశమును సైన్యమును ఇచ్చునట్లుగగాని (పనిచేయవలసినకాలమును) అహోరాత్రములచే వృద్ధిచేయునట్లుగగాని చెప్పి సంధిసంప్రతింపులు జరుప వలెను.

25. అతడు సైనికసంధిని కోరినయెడల, పనికిరాని ఏనుగులను గుఱ్ఱ ములనుగాని, విషయుక్తములగువానినిగాని ఇయ్యవలెను.

26. అతడు పురుషసంధిని కోరినయెడల, గూఢచారుల నాయకత్వమునకు లోబడిన దూష్యసైన్యమునుగాని అమిత్రసైన్యమునుగాని ఆటవిక సైన్యమునుగాని ఇయ్యవలెను. 27. ఈరెండింటికి వినాశముకలిగించు చర్యలను తీసుకొనవలెను. 28. లేదా, అవమానింపబడినపుడు ఘాతుకచర్యలకు సిద్ధపడు తీక్ష్ణులతో కూడిన సైన్యమునుగాని, అతని వ్యసనకాలములం దతనికి హానిచేయు మౌలికసైన్యమును గాని ఇయ్యవలెను.

29. అతడు కోశసంధిని కోరినయెడల, క్రేతలుదొరకని సారవస్తువులను గాని,[3] యుద్ధమందుపనికిరాని కుప్యద్రవ్యములనుగాని ఇయ్యవలెను.

---

[3] అత్యధికమగు విలువగల వజ్రములు మొదలయినవి ఇట్టివి.

**30.** అతడు భూమిసంధిని కోరినయెడల తిరిగి తానుతీసుకొనగల భూమిని గాని, నిత్యశత్రువులతో కూడినట్టిదానినిగాని, ఆశ్రయము లేనిదానినిగాని, మహాక్షయవ్యయములతో కూడిన నివేశనావకాశములు కలిగినట్టిదానినిగాని ఇయ్యవలెను.

**31.** లేదా, దుర్గవర్జముగ సర్వస్వము నిచ్చివేయు షరతుపై బలవంతునితో సంధిచేసుకొనవలెను.

32. (శ్లో) (శత్రువు) బలప్రయోగముచేసి హరించదలచినదానిని ఉపాయాంతరములచే తానే సమర్పించవలెను. తాను రక్షించుకొనవలసినది తనశరీరమునుగాని ధనమునుకాదు ; అనిత్యమగు ధనమువిషయమున విచారమెందుకు ?

ఇది అబలీయసమను పన్నెండో అధికరణమందు దూతకర్మ[4] అనే మొదటిఅధ్యాయము.

[4] యుద్ధముచేయుట సాధ్యము కాదనితోచినపుడు బలహీనుడగురాజు దూతల సహాయమున బలవంతునితో సంప్రదింపులు గావించి తన్ను రక్షించుకొనుటయే దూతకర్మ. దీనినే ప్రస్తుతకాలమందు War through Diplomacy అనెదరు.

## అధ్యాయము 2

### ప్రకరణము 163 : మంత్రయుద్ధము[1]
### ప్రకరణము 164 : సేనాముఖ్యవధ

1. అతడు సంధికి ఇష్టపడనియెడల వానితో ఇట్లనవలెను : "షడ్వర్గము నకు వశులైనరాజులందరు కాలగతినొందిరి ; అనాత్మవంతులగువారి అడుగుజాడ లలో నడుచుట నీకు తగదు. 2. నీవు ధర్మార్థములను కోరవలెను. 3. ఏలయన, నీచేత సాహసకార్యములను ధర్మరహితములగు కార్యములను ధననష్టము కలి గించు కార్యములను చేయించువారు మిత్రవేషమును ధరించిన శత్రువులు. 4. ఆత్మ త్యాగముచేసుకొనుటకు సిద్ధపడిన శూరులతో యుద్ధమునకు దిగుట సాహసము ; ఉభయపక్షములలో జనక్షయముగావించుట ధర్మరహితము ; సిద్ధముగనున్న లాభమును, అదుష్టుడగు మిత్రుని విడనాడుట ధననష్టమును కలిగించుకార్యము. 5. ఆరాజు మిత్రవంతుడు ; ఈయుద్దేశముతో నతడు మరికొందరు మిత్రులను సంపాదించుకొనుచున్నాడు ; వీరందరు నీపై పడెదరు. 6. మధ్యముడుగాని, ఉదాసీనుడుగాని, రాజమండలముగాని వానిని త్యజించలేదు ; కాని, వారందరు నిన్ను త్యజించిరి ; ఏలయన, నీవుయుద్ధమునకు సిద్ధపడుచుండగ వారు, "ఇతడు మరికొంత క్షయవ్యయము లనుభవించుగాక ; మిత్రులనుండి విడిపోవుగాక ; మూలస్థానమునుకూడ కోల్పోయినతర్వాత వీనిని సులభముగ నిర్మూలము చేయగలము," అని భావించి నిన్ను ఉపేక్షించి యున్నారు. 7. కావున, మిత్రులవలె నటించుచుండు శత్రువులమాటలను వినుటగాని, మిత్రులను భయపెట్టుటగాని, శత్రువుల శ్రేయస్సును వృద్ధిచేయుటగాని, నీ ప్రాణమునకే ముప్పుదెచ్చుకొని అనర్థ ముల పాలగుటగాని నీకు తగదు."—ఇట్లుచెప్పి అతనిని వారించ ప్రయత్నించవలెను.

[1] మంత్రయుద్ధ మనగా దూతను పంపి శత్రువును బుజ్జగించియో, హెచ్చరించియో, బెదరించియో, అతని యానప్రయత్నముల భంగపరుచుట.

8. అప్పుడుకూడ నతడు యాత్రకు బయలుదేరినయెడల "సంపువృత్తి," "యోగవామన" ప్రకరణములలో చెప్పిన ట్లతని ప్రకృతులు వానిపై కలహించునట్లు ప్రోత్సహించవలెను. 9. అతడు తీక్ష్ణులను రసదులను కూడ ప్రయోగించవలెను. 10. "ఆత్మరక్షణ" ప్రకరణమందు చెప్పినట్లు రక్షించదగిన ప్రదేశములందు తీక్ష్ణులను రసదులను వినియోగించవలెను.

11. వేశ్యాపోషకులు పరమరూపయౌవనవతులగు స్త్రీలద్వారా వాని సేనాముఖ్యులను కామోద్రేకులుగ జేయవలెను. 12. వారిలో ననేకులుగాని ఇద్దరుగాని ఒకేస్త్రీని కామించినయెడల తీక్ష్ణులు వారిలోవారికి కలహము సంభవించునట్లు చేయవలెను. 13. కలహములో నోడినవారిని దేశాంతరమునకు వెళ్లునట్లుగగాని యాత్రలో తమప్రభువునకు సహాయపడునట్లుగగాని (గూఢచారులు) ప్రోత్సహించవలెను.

14. లేదా, సిద్ధులవేషమును ధరించిన గూఢచారులు కామవశులగు ముఖ్యులకు విషయుక్తములగు సాంవాదని కౌషధములు[2] నిచ్చి మోసగించవలెను.

15. లేదా, వర్తకవేషమును ధరించిన గూఢచారి (శత్రురాజునకు) ప్రియమైన భార్యకు సన్నిహితురాలైన పరిచారికను కామించి ధనరాసులిచ్చి ఆమెను విడిచి వెళ్లిపోవలెను. 16. తర్వాత సిద్ధునివేషమునుధరించిన గూఢచారి వర్తకుని పరిచారకుడుగ వేషమువేసుకొనిన మరియొకగూఢచారి కభిమానియై కామవర్ధనమగు నౌషధము వాని కిచ్చి, "దీనిని వర్తకునిపై ప్రయోగింపుము," అనిచెప్పవలెను. 17. తనకోరిక సిద్ధించినపిమ్మట నతడు, "ఈఔషధమును రాజుపై గూడ ప్రయోగించుము," అని రాజమహిషిని కోరవలెను. 18. అప్పు డతడు విషముతో రాజును మోసగించవలెను.

19. లేదా, సాముద్రిక శాస్త్రవేత్త వేషమును ధరించిన గూఢచారి ప్రధానమంత్రికి విశ్వాసపాత్రుడై, "నీయందు రాజలక్షణములున్నవి," అని చెప్పవలెను. 20. భిక్షుకి యొకర్తె ఆతనిభార్యతో, "నీవురాజమహిషివో రాజమాతవో కాగలవు," అని పలుకవలెను.

21. లేదా, మహామాత్రునొకనికి భార్యగ వేషము వేసుకొన్న స్త్రీగూఢచారి, "రాజు నన్ను తనయంతఃపురములో నుంచుకొనదలిచియున్నాడు ; భిక్షుకి యొకర్తె ఈలేఖను ఈఆభరణములను నీయింటికి తెచ్చెను," అని అనవలెను.

22. లేదా, వంటవాని వేషమునో పరిచారకునివేషమునో ధరించిన గూఢచారి మహామాత్రునొకనితో విషప్రయోగము చేయుటకై రాజు తన్నునియోగించినట్లును, అందుకై ధనమును పంపినట్లును చెప్పవలెను. 23. వర్తకవేషము ధరించిన మరియొకగూఢచారి ఆవృత్తాంతమును బలపరిచి కార్యసిద్ధి అయ్యెనని చెప్పవలెను.

---

[2] కామించినస్త్రీనిగాని పురుషునిగాని వశపరుచుకొనుట కుపయోగించు ఔషధములు.

24. ఇట్లు ఒకటో, రెండో, మూడో ఉపాయములను ప్రయోగించి మహామాత్రులలో నొకనితర్వాత మరియొకనిని రాజుపై తిరుగుబాటుచేయు నట్లును త్యజించునట్లును ప్రోత్సహించవలెను.[3]

25. శూన్యపాలుని కాసన్నులగు గూఢచారులు శత్రుదుర్గములలో చేరి పౌరులపట్లను జానపదులపట్లను మిత్రత్వమును ప్రదర్శించుచు "రాజు కష్టదశలో నున్నాడు; అతడు ప్రాణముతో రావచ్చును, రాకపోవచ్చును. మీరు బలప్రయోగముచేసి ధనమును సంపాదించుకొని మీశత్రువులను నాశముచేసుకొనుడు," అని శూన్యపాలుడు యోధులను అధ్యక్షులను ఆదేశించినట్లు ప్రకటించవలెను. 26. వదంతి బహుళముగ వ్యాప్తిగాంచినతర్వాత తీక్ష్ణులు రాత్రియందు పౌరుల ధనమును దోచుకొనియు ముఖ్యులను చంపియు, "శూన్యపాలుని ఆజ్ఞలను శిరసావహించనివారందరికి ఇట్టిగతియే పట్టును," అని పలుకవలెను. 27. శూన్యపాలుని ఇంటిముందు నెత్తురుమరకలుగల శస్త్రములను వస్తువులను త్రాళ్ళను వదలిపెట్టవలెను. 28. అటుతర్వాత గూఢచారులు, "శూన్యపాలుడు ప్రజలనిట్లు చంపుచున్నాడు; వారిధనముల నిట్లపహరించుచున్నాడు," అని ప్రకటించవలెను.

29. ఇట్లే వారు జానపదులను సమాహర్తనుండి వేరుచేయవలెను. 30. కాని, తీక్ష్ణులురాత్రియందు గ్రామములమధ్య సమాహర్తయొక్క భృత్యులను చంపి, "అన్యాయముగ జానపదుల హింసించు వారందరు ఇట్టిగతినే అనుభవింతురు," అని ప్రకటించవలెను.

31. తిరుగుబా టిట్లు ప్రారంభమైనతర్వాత ప్రజలకు మరింతరోషావేశముల కల్పించి శూన్యపాలునిగాని సమాహర్తనుగాని చంపించవలెను. 32. అటుతర్వాత దాయాదిగాని, బంధితుడగు రాజపుత్రుడుగాని రాజ్యమునాక్రమించునట్లు ప్రోత్సహించవలెను.

33. (శ్లో) వారు అంతఃపురములకు పురద్వారములకు ద్రవ్యములు ధాన్యములు కల కోష్ఠాగారములకు నిప్పుపెట్టవలెను; లేదా, అక్కడి అధికారుల నందరిని చంపి, శత్రువే దీనినంతను చేయించెనని ఆర్తనాదము చేయవలెను.

ఇది అబలీయన మను పన్నెండోఅధికరణమందు మంత్రయుద్ధము అనే రెండోఅధ్యాయము. ఇది సేనాముఖ్యవధలో ప్రథమభాగము.

[3] బలవంతుడగు శత్రురాజును లొంగదీయుటకు వానిముఖ్యులు వానిప్రజలు అతనిపై తిరుగుబాటు చేయునట్లు పన్నాగములు పన్నుట ఒకగొప్పసాధనము.

## అధ్యాయము 3

### ప్రకరణము 164 : (మిగులు) సేనాముఖ్యవధ

### ప్రకరణము 165 : మండలప్రోత్సాహనము

1. శత్రురాజునకు రాజవల్లభులకు నానన్నులగు గూఢచారులు పత్త్యశ్వ రథహస్తిముఖ్యుల మిత్రులవద్దకు వెళ్ళి స్నేహభావమును ప్రకటించునట్లు నటించి వారితో "రాజు, ముఖ్యులయెడ, కోపముచెందియున్నాడు," అని చెప్పవలెను. 2. వదంతులు పూర్తిగ వ్యాపించినపిమ్మట తీక్ష్ణులు రాత్రియందు సంచారము చేయుటమూలమున సంభవించు ప్రమాదములకు ప్రతీకారములు చేసుకొని ముఖ్యులయిండ్లకు వెళ్ళి, "రాజాజ్ఞ ననుసరించి మావెంబడి రావలెను," అని వారితో చెప్పవలెను. 3. వారు బయటికివచ్చినవెంటనే వారిని చంపి, "రాజాజ్ఞ మేరకు మేమిట్లు చేసితిమి," అని చుట్టుప్రక్కలనున్న వారితో ననవలెను. 4. హత్యగావింపబడని ముఖ్యులతో "ఇదంతయు నిదివరకే మేము మీకు తెలియపరచితిమి, ఇప్పుడైనను ప్రాణమును రక్షించుకొనదలచు వారందరు పారిపోవలెను," అని చెప్పవలెను.

5. తాము కోరినదానిని రాజునుండి పొందలేనివారివద్దకు గూఢచారులు వెళ్ళి వారితో "ఫలానావారు కోరరానివస్తువును కోరిరి ; వారికోరికను నిరాకరించి నందున వారు నాపై క్రోధమువహించి శత్రుపక్షముచేరిరి. 6. వారిని నిర్మూలించు టకు ప్రయత్నించుము," అని శూన్యపాలునితో రాజు చెప్పియున్నాడని పలుక వలెను ; తక్కినదంతయు నింతకుపూర్వము చెప్పినట్లు జరుగవలెను.

7. తాము కోరినదానిని రాజునుండి పొందినవారితో "ఫలానావారు కోర రాని వస్తువును కోరిరి. (అయినను) వారికి నాయందు విశ్వాసముకలుగుటకై వారు కోరినదాని నిచ్చితిని ; కాని వారు శత్రుపక్షము చేరిరి ; వారిని నిర్మూలించు టకు ప్రయత్నించుము," అని శూన్యపాలునితో రాజు చెప్పియున్నాడని పలుక

వలెను. 8. తక్కినదంతయు నింతకుపూర్వము చెప్పినట్లు జరుగవలెను.

9. కోరదగినదానిని కోరనివారితో గూఢచారులు, "ఫలానావారుకోరదగిన దానినికూడ కోరలేదు, వారిలో దోషముండుటతప్ప దీనికి కారణమేమి కలదు? వారిని నిర్మూలించుటకు ప్రయత్నించుము," అని శూన్యపాలునితో రాజు చెప్పి యున్నాడని పలుకవలెను. 10. తక్కినదంతయు నింతకుపూర్వము చెప్పినట్లు జరుగవలెను.

11. వశముచేసుకొనదగినవారి విషయము దీనితో సమాప్తము.

12. రాజున కాసన్నుడగు గూఢచారి "నీ మహామాత్రులలో ఫలానా వాడు శత్రుపురుషులతో ఉత్తరప్రత్యుత్తరముల జరుపుచున్నాడు," అని రాజు గ్రహించునట్లు చెప్పవలెను. 13. అతడు దీనిని నమ్మినతర్వాత మహామాత్రుని వద్దనుండి లేఖలను తీసుకొనిపోవు దూష్యులను కొందరిని చూపి "ఇదే అది," అని చెప్పవలెను.

14. లేదా, సేనానాయకులలో ముఖ్యులగువారిని కొందరిని భూమితోగాని ధనముతోగాని లోభపెట్టి స్వజనముతో వారు యుద్ధము చేయునట్లుగాని, తమతో కలిసి పారిపోవునట్లుగాని ప్రోత్సహించవలెను.

15. తనకు సమీపమందుగాని దుర్గమందుగాని నివాసముచేయుచుండు రాజకుమారుని, "నీవు ఎక్కువ ఆత్మసంపన్నత గల కుమారుడవు; అయినను నీవు నిరాకరించబడితివి; నీ వేల యుపేక్షించెదవు? తిరుగుబాటుచేసి రాజ్యమును వశపరచుకొనుము; యువరాజు శీఘ్రకాలములో నిన్ను నాశముచేయును," అని గూఢచారులద్వారా కలహమునకు ప్రోత్సహించవలెను.

16. దాయాదినిగాని, అవరుద్ధుడగు రాజకుమారునిగాని ధనముతో లోభ పెట్టి "రాజ్యములోపల నుండు (శత్రు) సైన్యమునుగాని పొలిమేరలోని సైన్య మునుగాని అంతపాలదుర్గమునుగాని మర్దింపుము," అని ప్రోత్సహించవలెను.

17. లేదా, ఆటవికుల నర్థగౌరవములచే వశపరచుకొని వారిమూలమున నతని రాజ్యమునకు నాశము కలిగించవలెను.

18. లేదా, వాని పార్ష్ణిగ్రాహితో "ఈరాజు నన్ను నిర్మూలించి నిన్ను నిర్మూలించ దలచియున్నాడు; వెనుకనుండి నీవు వానిపై బడుము; అతడు చుట్టుతిరిగి నిన్ను మార్కొనినయెడల నే నతనిని వెనుకనుండి కొట్టెదను," అని చెప్పవలెను.

19. లేదా, వానిమిత్రులతో "నేను మీకు సేతువువంటివాడను; నన్ను భేదించి వీడు మిమ్ములనందరిని మార్కొనును; మనమందరము కలిసి వీని యాత్రను భగ్నముచేయుట మంచిది," అని చెప్పవలెను.

20. శత్రువుతో కలిసినవారికి కలియనివారికి నతడు "ఈరాజు నన్ను నిర్మూలించి మీయందరిపైని పడనున్నాడు, మీరు జాగ్రతపడవలెను; మీరు నాకు సహాయముచేయుట శ్రేయస్కరము," అని లేఖలు వ్రాయవలెను.

21. (శ్లో) మధ్యమోదాసీనులలో నెవరు సమీపమం దుండెదరో వారికి తన సర్వస్వము నర్పించి తన్ను రక్షించవలసినదిగ కోరవలెను.

ఇది అబలీయసమను పన్నెండో అధికరణమందు సేనాపతిముఖ్యవధ, మండలప్రోత్సాహనము అనే మూడో అధ్యాయము.

## పన్నెండో అధికరణము

### అధ్యాయము 4

### ప్రకరణము 166 : శస్త్రాగ్నిరసముల రహస్యప్రయోగము

### ప్రకరణము 167 : వీవధాసారప్రసారవినాశము[1]

1. శత్రుదుర్గములలో వర్తకులవేషముధరించిన గూఢచారులు, గ్రామములలో గృహస్థులవేషము ధరించిన గూఢచారులు, జనపదసంధులలో గోరక్షకతాపసుల వేషముధరించిన గూఢచారులు వారివారికి సమీపమందుండు సామంతులకు ఆటవికులకు దాయాదులకు నవరుద్ధుడగు రాజకుమారునికి కానుకల నిచ్చి, "ఈప్రదేశము (సులభముగ) హరించసాధ్యమైనది," అని వార్తను పంపవలెను. 2. వీరిగూఢపురుషులు దుర్గములను చేరినవెంటనే వారు వీరినర్థమానములచే గౌరవించి శత్రుప్రకృతులలోని ఛిద్రముల నన్నిటిని వారికి చూపించవలెను. 3. వీరు వారిసహాయముతో ఛిద్రములపై దెబ్బతీయవలెను.

4. లేదా, మద్యము తయారుచేయువాని వేషముధరించిన గూఢచారి శత్రుశిబిరమును ప్రవేశించి ఉరిశిక్ష విధింపబడినవాని నొకనిని తనకుమారుడని చెప్పి, అవస్కందకాలమందు[2] అతనికి విషమిచ్చి చంపి, అతని శ్రాద్ధక్రియల కని చెప్పి వందలకొలది మద్యభాండము లచట చేర్చవలెను. 5. మొదటిరోజున నతడు శుద్ధమగు మద్యమునుగాని నాలుగోవంతు విషముకల్పిన మద్యమునుగాని పంచిపెట్టి, మరునటిరోజున పూర్తిగ విషముకలిపిన మద్యము నియ్యవలెను. 6. లేదా, సేనానాయకులకు మొదట శుద్ధమగుమద్యము నిచ్చి వారు మత్తులోనున్నప్పుడు విషముకలిసిన మద్యము నియ్యవలెను.

[1] ఈ అధ్యాయములో రెండు ప్రకరణము లున్నట్లు చెప్పినను ఒక సూత్రము మినహాగా తక్కినవన్నియు శస్త్రాగ్నిరసముల రహస్యప్రయోగమునకు సంబంధించినవి. 20వ సూత్రమొకదానియందే వీవధాసారప్రసారము ప్రస్తావించబడినది.

[2] అవస్కందకాల మనగా శత్రుసైన్యముపై పడునట్టి కాలము.

7. లేదా, సేనాముఖ్యునివేషములోనున్న గూఢచారి ఉరిశిక్షకుపాత్రుడైన వాడు తనకుమారుడని ప్రకటించి తక్కినపనులన్నిటినిపైనచెప్పినట్లు చేయవలెను.

8. లేదా, వండినమాంసము, అన్నము, మద్యము, పిండివంటలు మొదలగువానిని విక్రయించువారి వేషము ధరించిన గూఢచారులు వారివారిపణ్యములకు మంచిప్రచారము గావించి, ఒకరితోనొకరు పోటీపడి శత్రుశిబిరములో, "ఇది అరువుబేరము, అతిచౌకబేరము," అని ప్రకటించి వారిపణ్యములను విషముతో కలపవలెను.

9. లేదా, స్త్రీలు, పిల్లలు మద్యము పాలు పెరుగు వెన్న నూనె మొదలగువాని నాయావర్తకులవద్దనుండి కొని, విషముతోకూడిన తమపాత్రలలో వాటినిపోయవలెను. 10. "ఈవెలకు వీని నిండు; లేదా, ఇంతకంటె మంచివాని నిండు," అనిచెప్పుచు వానిని వర్తకులపాత్రలలో పోయవలెను. 11. వర్తకుల వేషము ధరించిన గూఢచారులు, లేదా, శిబిరములో వస్తుసామగ్రిని విక్రయించు వారు వీనిని కొని (శిబిరములో అమ్మవలెను).

12. అసన్నులు హస్త్యశ్వముల తిండి గడ్డి మొదలగువానిలో విషము కలుపవలెను. 13. లేదా, కూలివాండ్రవేషము ధరించినవారు గడ్డిని నీటిని విషముతోకలిపి విక్రయించవలెను.

14. శిబిరముతో చిరకాలసంబంధముగల పశువులవర్తకులు అవస్కంద కాలమందు శత్రువులను గందరగోళపెట్టు ప్రదేశములలో మందలుమందలుగా పశువులను మేకలను గొర్రెలను దుష్టములగు గుర్రములను గాడిదలను ఒంటెలను మహిషములు మొదలగువానిని వదిలివేయవలెను. 15. పైవేషములధరించిన వారు చుంచెలుకలరక్తమును పైజంతువుల కండ్లకుపూసి వానిని వదలివేయవలెను. 16. వేటకాండ్ర వేషము వేసుకొనినవారు పంజరములనుండి క్రూరమృగములను, పాములవాండ్రు విషసర్పములను, ఏనుగులనుపెంచువారు ఏనుగులను వదలివేయవలెను. 17. అగ్నిజీవనులు వస్తువులన్నిటికి నిప్పంటించవలెను.

18. లేదా, పత్త్యశ్వరథద్విపముఖ్యులు (యుద్ధరంగమందుండి) విముఖులైనప్పుడు గూఢచారులు వారిని చంపవలెను; లేదా, వారి నివాసములకు నిప్పంటించవలెను.

19. శత్రువశమందుండు దూష్యసైన్యము అమిత్రసైన్యము ఆటవిక సైన్యము—ఇట్టి సైన్యములవేషమును వేసుకొనినవారు వానివెనుకభాగముపై పడవలెను; లేదా, హీనబలుని ఆక్రమణమందతనికి సహాయపడవలెను.

20. అరణ్యములలో దాగియున్నవారు పొలిమేరలలోని సైన్యములనుసికొల్పి నాశము చేయవలెను; లేదా, ఏకాయనమార్గమందరునడుచు వీవధాసారప్రసారములను నాశముచేయవలెను.

21. లేదా, రాత్రియుద్ధమందు సంకేతముగ నిర్ణయింపబడిన తప్పెటల కోలాహలమునుకల్పించి, "మేము లోపలప్రవేశించితిమి; రాజ్యమును సంపాదించితిమి," అని కేకలుపెట్టవలెను.

22. లేదా, రాజనివాసమును ప్రవేశించి సంకులమును కల్పించి రాజును హత్యచేయవలెను. 23. లేదా, అతడు తప్పించుకొనిపోవుటకు ప్రయత్నించిన యెడల రహస్యప్రదేశములందుగాని చెట్లబోదెలవెనుకగాని దాగియున్న మ్లేచ్ఛ సేనలనాయకులు ఆటవికసేనల నాయకులు నలువైపులనుండి వాని నడ్డగించి చంపవలెను. 24. లేదా, వేటకాండ్ర వేషములో నున్నవారు సంకులమగు నాక్రమణకాలమందు రహస్య యుద్ధమున కనువగు సమయములలో నతనిని పట్టి కొట్టవలెను. 25. లేదా, వారికనుకూలమగు ప్రదేశములందు నిలబడి శత్రురాజు నేకాయనమార్గమందుగాని కొండమీదగాని చెట్లబోదెలతోకూడిన కంచెవెనుకగాని బురదనేలలోగాని నీటిలోగాని ఉన్నప్పుడు వానినిపట్టి కొట్టవలెను. 26. లేదా, నదుల కట్టలను సరోవరముల కట్టలను తటాకముల కట్టలను త్రెంపి నీటిప్రవాహములో నతనిని ముంచివేయవలెను. 27. లేదా, అతడు ఎడారికోటయందుగాని వనదుర్గమందుగాని జలదుర్గమందుగాని యున్నయెడల యోగాగ్నిధూమములచే నతనిని నాశముచేయవలెను. 28. ఇరుకుత్రోవ యందున్న శత్రురాజును అగ్నిసాధనమునను, ఎడారిలోనున్నప్పుడు పొగచేతను, నివాసములోనున్నప్పుడు విషముచేతను, నీటిలో మునిగియున్నప్పుడు భయంకరములగు మొసళ్ళచేతగాని నీళ్ళలోసంచరించువానిచేతగాని చంపించవలెను; కాలిపోయిన నివాసమునుండి తప్పించుకొని వచ్చువానిని వెంటనే చంపవలెను.

29. (శ్లో) పైనిచెప్పిన ప్రదేశములందు చిక్కుకొనిన శత్రువును "యోగవామనప్రకరణము"న చెప్పినట్లుగగాని, మరియేవైనకుత్రలచేగాని రహస్యచర్యలచేగాని పైకి లాగి మోసగించవలెను.

ఇది అబలీయసమను పన్నెండో అధికరణమందు శస్త్రాగ్నిరసముల రహస్యప్రయోగము, వీవధాసారప్రసారవినాశము అనే నాలుగో అధ్యాయము.

# పన్నెండో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 168 : రహస్యసాధనములచే శత్రువును పరిమార్చుట

### ప్రకరణము 169 : సైన్యముచే శత్రువును పరిమార్చుట

### ప్రకరణము 170 : ఏకవిజయము[1]

1. దైవభక్తి కారణముగ శత్రురాజు ఉత్సవదినమందు పూజలకై అనేక దేవాలయములకు వెళ్లవచ్చును. 2. అట్టి ప్రదేశములలో నతనిపై రహస్యచర్యలనేకములను తీసుకొనవలెను. 3. అతడు దేవాలయమును ప్రవేశించిన వెంటనే యంత్రసాహాయ్యమున నొక రహస్యపు గోడగాని, బండగాని అతనిపై పడద్రోయవలెను. 4. లేదా, పైఅంతస్తునుండి శస్త్రవర్షమునుగాని శిలావర్షమునుగాని కురియించవలెను; లేదా, తలుపులుగాని, తలుపుగోడలో నొకప్రదేశమందమర్చిన తలుపుగడియగాని అతనిపై పడునట్లు చేయవలెను. 5. లేదా, దేవతావిగ్రహము ధ్వజము శస్త్రములు అతనిపై పడునట్లు చేయవలెను. 6. లేదా, అతడు నివసించునట్టియు, కూర్చుండునట్టియు వెళ్లునట్టియు ప్రదేశములందు అలుకుటకై ఉపయోగించు గోమయములోను, చల్లుట కుపయోగించు సుగంధపు నీటిలోను, అతడువేసుకొను, పుష్పమాలలలోను, పూసుకొను సుగంధచూర్ణములోను విషము కలుపవలెను. 7. సుగంధద్రవ్యముల వాసనతో విషధూమమును కూడ పీల్చునట్లు చేయవలెను. 8. అతని మంచముక్రిందగాని ఆసనముక్రిందగాని యంత్రబద్ధమగు నేలలో శూలములతో కూడిన కూపమునొకదానిని తయారుచేసి మేకునొకదానిని సడలించగనే అత డందులో పడిపోవునట్లు చేయవలెను.

---

1 ఏకవిజయమనగా మిత్రసహాయమెట్టిదిలేక, దుర్గమునుకూడ శత్రువశము గావించి తానొంటరిగ విజయము సాధించుట. అందుకు కావలసిన సాధన సంపత్తి, వాటి వినియోగము 43వ సూత్రమునుండి వివరింపబడినది.

9. శత్రువు సమీపించినయెడల దీర్ఘమగు ముట్టడిని సహించగల జనమును తనజనపదమునుండి దుర్గములోనికి చేర్చవలెను. 10. ముట్టడిని సహించలేని జనమును దుర్గమునుండి తొలగించవలెను; లేదా, ప్రత్యాదేయమగు శత్రుభూమికి పంపించవలెను. 11. జానపదులనందరిని ఒకప్రదేశమందు శైల వన నదీ దుర్గములలో నొకదానియందుగాని అడవులచే వేరుచేయబడిన ప్రదేశమందుకాని—కుమారునియొక్కయో సోదరునియొక్కయో ఆధిపత్యమం దుంచవలెను.

12. "దండోపనతవృత్తి" యను ప్రకరణమందు దుర్గమును చేరుటకు హేతువులు వివరింపబడినవి.

13. దుర్గము చుట్టుయోజనపర్యంతము గడ్డిని చెట్లను కాల్చివేయవలెను. 14. జలములను పాడుచేయవలెను; లేదా, శూన్యములుగ చేయవలెను.

15. దుర్గమునకుబయట కూపములను పైకికనిపించనిగోతులను కంటక ప్రదేశములను కల్పించవలెను.

16. శత్రుశిబిరమువరకు బహుముఖమగు సురంగమునొకదానిని త్రవ్వి శత్రుకోష్ఠాగారముఖ్యులను పట్టితీసుకొనిరావలెను; లేదా, శత్రురాజునే పట్టి తేవలెను. 17. శత్రువే సురంగమును త్రవ్వినపక్షమున దానిలోపలికి నీళ్లు ప్రవేశించునట్లు తనఅగడ్తను మరింత లోతుచేయవలెను; లేదా, కోటగోడలచుట్టు కూపశాలలనిర్మించవలెను. 18. శంకించదగిన ప్రదేశములలో త్రవ్వకములేవైన జరిగినవోతెలుసుకొనుటకు నీటికుండలనుగాని కంచుబిందెలనుగాని అచ్చట పెట్టించవలెను. 19. శత్రుసురంగము తెలియవచ్చిన తర్వాత ప్రతిసురంగము నొకదానిని దానికి జవాబుగ నిర్మించవలెను. 20. దాని మధ్యభాగమును బ్రద్దలుచేసి దానినుండి నీళ్ళు పొగ వ్యాపించునట్లు చేయవలెను.

21. దుర్గరక్షణకు ఏర్పాటులుగావించి, మూలస్థానమును దాయాదులలో నొకని అధీనముచేసి శత్రువువచ్చినమార్గమును తప్పించుకొని వేరొకమార్గమున వెళ్ళవలెను; లేదా, ఏమార్గమున వెళ్ళినయెడల మిత్రులతోను బంధువులతోను ఆటవికముఖ్యులతోను శత్రువునకుశత్రువులగువారితోను దూష్యులతోను కలియుట సాధ్యమగునో; ఎక్కడికి వెళ్ళినయెడల శత్రువును వానిమిత్రులనుండి వేరుచేయుటగాని, వెనుకనుండి వానిపైబడుటగాని, వానిరాజ్యము నపహరింపజేయుటగాని, అతనివీవధాసారప్రసారముల నివారించుటగాని సాధ్యమగునో; ఎచటనుండి పాచికలనువేయు జూదగానివలె వానిరాజ్యముపై పడుటయు, తన రాజ్యమును రక్షించుకొనుటయు, తనమూలస్థానమును బలపరుచుకొనుటయు సాధ్యమగునో, అమార్గమునుబట్టి వెళ్ళవలెను. 22. లేదా, ఎచటికివెళ్ళినయెడల వాంఛించదగిన సంధిని జేసుకొనుట సాధ్యమో అచటికి వెళ్ళవలెను.

23. లేదా, తనతో దుర్గమును వదలి బయటికివచ్చినవారు శత్రువునకు,

"ఈనిశత్రువు మాకువశుడయ్యెను; పణ్యముకొను మిషతోగాని హానిజేయు మిషతోగాని హిరణ్యమును సారవంతమగు సైన్యమును పంపుము; మేము వీనిని బంధించి నిస్వాధీనముచేసెదము; లేదా. చంపివేయుదుము," అని కబురు పంపవలెను. 24. అతడు దీని కంగీకరించి వీరుచెప్పినప్రకారము చేసినయెడల నితడు హిరణ్యమును సైన్యమును వశపరుచుకొనవలెను.

25. లేదా, అంతపాలుడు దుర్గము వశపరిచెదనని చెప్పి సైన్యమును పంప వలసినదిగ (శత్రువును) కోరవలెను; వచ్చినశత్రుసైన్యములో కొంతభాగమును దుర్గములో ప్రవేశపెట్టి, తనయందు వారికి నమ్మకము కుదిరినతర్వాత, వారిని చంపించవలెను.

26. లేదా, (శూన్యపాలుడు) ఒకచోట చేర్చబడిన జనపదజనమును నాశముచేయుటకని శత్రువును సైన్యముపంపించవలసినదిగ కోరవలెను. 27. దాని నవరుద్ధ ప్రదేశమునకు తీసుకొనివెళ్ళి, తనయందు దానిలోనివారికి నమ్మకము కుదిరినతర్వాత వారిని హత్యచేయవలెను.

28. మిత్రునివేషము ధరించినగూఢచారి దుర్గమును ముట్టడించిన శత్రువునకు, "ఈదుర్గములోని ధాన్యములు, నూనెలు, క్షారములు లవణములు ఖర్చుపడి పోయినవి; బయటనుండి ఫలానాచోట ఫలానాకాలమందవి దుర్గములోకి రాగలవు; వాటి నపహరించుము," అని కబురంపవలెను. 29. అటుతర్వాత విషముకలిపినధాన్యములు, నూనెలు, క్షారములు, లవణములు, దూష్యులు అమిత్ర సైన్యము ఆటవికసైన్యము అభిత్యక్తులగు తదితరులు దుర్గములోపలికి తేవలెను. 30. దీనినుండి సమస్తవస్తుసామగ్రిని వీవధములను పట్టుకొనువిషయమును తెలుసుకొనవలెను.

31. లేదా, సంధిచేసుకొని హిరణ్యములో కొంతభాగమునుమాత్రము వెంటనే ఇచ్చి, తక్కినభాగము కాలయాపనచేసి ఇయ్యవలెను. 32. తర్వాత నతడు వాని (శత్రువు) దుర్గములు మొదలగురక్షాస్థానములు బలము కోల్పోవు నట్లు చేయవలెను. 33. లేదా, వానిని విషము, అగ్ని, శస్త్రములతో కొట్టవలెను. 34. లేదా, హిరణ్యమును స్వీకరించుటకువచ్చిన వాని అభిమానితుల ననుగ్రహించవలెను.

35. లేదా, పూర్తిగనష్టపడినయెడల దుర్గమునుకూడ నతనికిచ్చివెళ్ళిపోవలెను. 36. అతడు సురంగమార్గముద్వారాగాని, ప్రాకారములోనిప్రక్కకన్నము ద్వారాగాని వెళ్ళిపోవలెను.

37. రాత్రిపూట అకస్మాత్తుగ దుర్గముపైపడి జయముగాంచినయెడల నచటనే ఉండిపోవలెను; జయములభించనియెడల నేదియో ఉపాయముపన్ని తప్పించుకొని వెళ్ళిపోవలెను. 38. పాషండునివేషమువేసికొని స్వల్పశిష్యపరివా

రముతో వెళ్ళిపోవలెను. 39. లేదా, గూఢపురుషు లాతనికి ప్రేతవేషమువేసి మోసుకొనిపోవలెను. 40. లేదా, స్త్రీవేషము వేసుకొని ప్రేతమును వెంబడించ వలెను. 41. లేదా, దైవతోత్సవములందు ప్రేతకార్యములందు విందులయందు నుపయోగపడు అన్నపానములలో విషమును కలిపి తాను వెళ్ళిపోవలెను.

42. లేదా, రహస్యముగ కుట్రలుపన్ని, దూష్యులవలె కనిపించు సైనికులతో బయటికివచ్చి, దాగియున్న సైన్యసాహాయ్యముతో శత్రువుపై పడవలెను.

43. లేదా, తనదుర్గమునిట్లు శత్రువు వశపరుచుకొనినతర్వాత తానొక చైత్యమునునిర్మించి, ఆహారపదార్థముల నందులో చేర్చి, విగ్రహములోని ఛిద్ర ములో ప్రవేశించియో, పైకికనుపించని గోడకన్నములో ప్రవేశించియో, విగ్రహ యుక్తమగు భూమిగృహము (నేలక్రిందనిర్మించబడినట్టిది) ప్రవేశించియో దాగి యుండవలెను. 44. కొంతకాలముగడచి, గతిమునందరుమరచిన తర్వాత సురంగ మార్గముద్వారా రాత్రిపూట శత్రుగృహమును ప్రవేశించి నిద్రలోనున్నప్పుడు వానినిచంపవలెను. 45. యంత్రముద్వారా సడలించుటసాధ్యమైనవానిని సడ లించి, అది వానిపై పడునట్లు చేయవలెను. 46. రసాగ్నితోపూసిన ఇంటిలోగాని లక్కయింటిలోగాని శత్రువు నిద్రించుటను కనిపెట్టి దానికి నిప్పుపెట్టవలెను. 47. ఉద్యానవనములోగాని మరియొక విహారస్థలమందుగాని విహరించుచు శత్రువు ప్రమత్తుడుగ నున్నప్పుడు భూమిగృహముద్వారాగాని సురంగముద్వారాగాని, రహస్యమగుగోడనుండిగాని తీక్ష్ణులు వానివద్దకు వెళ్ళి వానినిచంపవలెను; లేదా, గూఢచారులు విషముపెట్టి చంపవలెను.

48. లేదా, ఏకాంతప్రదేశమందతడు నిద్రించు సమయమున గూఢచారులు లతనిపైకి విషసర్పములనుగాని విషాగ్నిధూమములనుగాని వదలవలెను.

49. లేదా, తగినసమయమునుకనిపెట్టి రహస్యముగ సంచరించుచుండు తాను అంతఃపురములోనుండు శత్రువునిపై ఏదచ్చ సాధ్యమో దానిని తీసుకొన వలెను. 50. తర్వాత తాను రహస్యముగ నిర్గమించి, తనవారికి సంజ్ఞల నందించ వలెను.

51. (శ్లో) శత్రువుకొలువులో గూఢచారులుగ నుండు ద్వారపాలకులను సపుంసకులను తదితరులను తూర్యనాద సంజ్ఞలతో పిలిచి తక్కినశత్రువులనందరిని చంపించవలెను.

ఇది అబలీయసమను పన్నెండోఅధికరణమందు రహస్యసాధనములచే శత్రువును పరిమార్చుట, సైన్యముచే శత్రువును పరిమార్చుట, ఏకవిజయము అనే అయిదో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు అబలీయసమను పన్నెండో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## పదమూడో అధికరణము

## దుర్గలంభోపాయము

### అధ్యాయము 1

### ప్రకరణము 171: ఉపజాపము (రాజద్రోహమును ప్రోత్సహించుట)

1. శత్రుదుర్గమును వశపరుచుకొనగోరు విజిగీషువు తన సర్వజ్ఞత్వమును తనకుగల దైవసంపత్తిని ప్రచారముచేసి స్వపక్షమువారిలో నుత్సాహమును, పరపక్షమువారిలో భయమును పుట్టించవలెను.

2. తన సర్వజ్ఞత్వము నీవిధముగ స్థాపించవలెను; ముఖ్యులగృహముల నుండి రహస్యముగ సమాచారము సేకరించి దానిని వారికి తెలియపరచుట; కంటకశోధకులద్వారా రహస్యవర్తమానమును సంపాదించి రాజద్రోహులెవరో ప్రకటించుట; ఇతరులు చేయు విజ్ఞాపనములను వారు తనకియ్యదలచు నుపాయనములను అదృష్టములగు సంజ్ఞలసాహాయ్యమునను సంయోగవిద్యాసాహాయ్యమునను ముందేప్రకటించుట; విదేశసంఘటనలగురించిన జ్ఞానమును ముద్రవేసిన లేఖలను తెచ్చు ఇంటిపావురాళ్ళసహాయమున సంఘటనలు జరిగినరోజుననే ప్రదర్శించుట.

3. తనదైవసంపత్తినీవిధముగ రుజువుపరుపవలెను; సురంగమార్గము ద్వారా అగ్నిచైత్యములలోని బోలువిగ్రహములలోపల ప్రవేశించి, అగ్నిచైత్యములలోని దేవతలవలెనటించు గూఢపురుషులతో సంభాషణము, వారిని పూజించుట; ఉదకములనుండి పైకిలేచివచ్చిన నాగదేవతలయు వరుణదేవతలయు వేషము ధరించినవారితో సంభాషణము, వారినిపూజించుట, రాత్రియందు నీటిలోపల సముద్రపు ఇసుకపేటిక నొకదాని నుంచి, దానిసహాయమున అగ్నిమాలను

ప్రదర్శించుట ;[1] శిలలతోకూడిన గొలుసులతో కట్టిన పడవపై నిలబడుట; తైలమును నూరుపర్యాయములు లేడిప్రేగులతోను ఎంద్రకాయలు మొసళ్ళు శింశుమారములు ఉద్రవములు మొదలగువాని కొవ్వుతోను కలిపి కాచి, ముక్కు మినహాగా ఒకని తలను నీటిసంచిలోగాని జరాయువుతోగాని కప్పి, తైలమును ముక్కుకుపూయుట.[2] 4. ఇది రాత్రిగణసంచారము. 5. ఇవి ఉదకమండలి సంచారములు. 6. వీనినుండి (ఉదకములనుండి) వరుణకన్యలు నాగకన్యలు మాటలాడుట; వారితోసంభాషణము; వారికికోపము కలిగినప్పుడు నోటినుండి అగ్నిధూమములు వెలువడుట; ఇట్టివానిని ప్రదర్శించుట.

7. అతని మహిమను కార్తాంతికులు, నైమిత్తికులు, మౌహూర్తికులు, పౌరాణికులు, ఈక్షణికులు, మహిమలను చూపించుటలో సహాయపడినవారు, మహిమలను చూచినవారు స్వరాజ్యమందంతట ప్రచారము చేయవలెను. 8. వీరు శత్రురాజ్యమునకు వెళ్లి ఇతడు దైవమును సందర్శించెననియు దైవసహాయము వలన కోశమును సైన్యమును సంపాదించగలిగెననియు ప్రచారము చేయవలెను. 9. దైవతప్రశ్నలు, శకునములు, కాకిపరుగులు, శారీరకలక్షణములు, స్వప్నములు, జంతువులకేకలు, పక్షులకూతలు—వీని అర్థమును తెలుపువా రితనికి జయమే లభించుననియు, శత్రువున కపజయము కలుగుననియు ప్రకటించవలెను. 10. శత్రువు నక్షత్రమందు తోకచుక్క ఉన్నట్లు దుందుభులమ్రోతతో వారు ప్రకటించవలెను.

11. దూతలవేషమును ధరించినవారు శత్రుముఖ్యులయెడ స్నేహమును చూపి, తమ ప్రభువు వారియెడల గౌరవముకలవాడనియు, అతనిపక్షము బలమును సమకూర్చుకొనుచున్నదనియు, శత్రుపక్షము క్షీణించుచున్నదనియు వారితో చెప్పవలెను. 12. అమాత్యులకు ఆయుధీయులకు ఇంతవరకున్నవారితో సమానమగు యోగక్షేమము లభించునని చెప్పవలెను. 13. తమప్రభువు వారికి కష్టసుఖములలో సహాయపడుననియు వారిసంతానమునుకూడ నతడనుగ్రహించు ననియు చెప్పవలెను.[3]

14. శత్రువుపై శత్రుపక్షము నెట్లుద్వేగపరుపవలెనో ఇంతకుపూర్వమే

---

[1] సముద్రపుఇసుక సహాయమున అగ్నినిపుట్టించవచ్చునను నమ్మకమారోజులలో ప్రబలియుండెను. 14–2–36లో సముద్రపు నురుగుమహిమ సూచింపబడియున్నది.

[2] ఇట్టితైలమును ముక్కుకు పూసినయెడల దానినుండి అగ్నిజ్వాలలు వెలువడునట!

[3] గూఢచారులు శత్రురాజ్యమును ప్రవేశించి, అచ్చటనుండు ముఖ్యులను, పౌరులను, జానపదులను వారిరాజునుండి విడదీసి, వానిపైకోపముకలునట్లు చేయుటయే ఉపజాపము. ఇందుకై ఎట్టిసాధనములు ఉపయోగించవలెనో ఈ అధ్యాయము వివరించుచున్నది. శత్రుదుర్గమును వశపరుచుకొనుటకిది యొకప్రధాన సాధనము.

వివరించబడినది. 15. దీనినిగురించి మరియొకపర్యాయము ఇచట చెప్పెదము. 16. శత్రువుకొలువులోనుండు దక్షులను మామూలుగాడిదెలతో పోల్చియు, సైన్యాధిపతులను చెట్లకొమ్మను కొట్టుటకై వినియోగపడు కర్రతో పోల్చియు, భయపడినవారిని మందనువిడిచిన గొర్రెతో పోల్చియు, అవమానితులను పిడుగు దెబ్బను తినిన వారితో పోల్చియు, ఆశాభంగముగాంచినవారిని ఫలప్రదముకాని రెల్లుతోను, వాయసపిండముతోను వర్షించని కృత్రిమమేఘముతోను పోల్చియు, గౌరవింపబడినవారిని ద్వేషించిన భర్తనుండి అలంకారములగాంచిన భార్యతో పోల్చియు, రహస్యముగ శోధింపబడినవానిని వ్యాఘ్రచర్మముతోను మృత్యు కూటముతోను పోల్చియు, రాజున కుపకారముచేయువారిని పీలుఫలమును కరకములను తిను వానితోను అడుఒంటెలతోను పాలకై వినియోగింపబడు గాడిదతోను పోల్చియు శత్రురాజుపై క్రోధావేశులుగ జేయవలెను.[4]

17. శత్రురాజునువిడిచి తనపక్షముచేరినవారికి అర్థమానము లిచ్చి గౌర వించవలెను. 18. ద్రవ్యమునుగాని ఆహారపదార్థములుగాని లభించక వారు కష్ట పడుచున్నయెడల వారికి ద్రవ్యములను ఆహారపదార్థములను సమకూర్చవలెను. 19. వారు వీనినిస్వీకరించనియెడల వారిభార్యలకు పిల్లలకు అలంకారముల నియ్యవలెను.

20. క్షామకాలములలోను, చోరులమూలమునగాని ఆటవికులమూలమున గాని కష్టములు సంభవించినకాలములలోను గూఢచారులు శత్రురాజ్యమును ప్రవేశించి, కష్టపడుచుండు పౌరులతోను జానపదులతోను, "రాజును సహాయము చేయువలసినదిగ ప్రార్థింతము ; అతడు సహాయముచేయనిపక్షమున దేశాంతర మునకు వెళ్ళుదము," అని చెప్పి రాజుపై వారికి కోపము కలుగునట్లు చేయ వలెను.

21. (శ్లో) "అలాగే," అని వారు సమ్మతించినయెడల వారికిద్రవ్యము లను ధాన్యములను ఇయ్యవలెను. ఇదియే ఉపజాపమను గొప్ప అద్భుతము.

ఇది దుర్గలంబోపాయమను పదమూడో అధికరణమందు ఉపజాపమనే మొదటి అధ్యాయము.

---

[4] గాడిద ప్రతిఫలములేక బరువులనుమోయును ; కొమ్మలోని కాయలను దంపుటకుపయోగించు కర్రమూలమున ఇతరులు ఫలితము ననుభవించునట్లు సేనానాయకుల కష్టమువలన వారిరాజు ఫలితము ననుభవించును ; వారికెట్టి ఫలితము లభించదు. వాయసపిండము అల్పత్వమును సూచించును. పీలుఫలము కరకములు చేదుగనుండును. ఉపకారులవిషయములో శత్రురాజు అడుఒంటెవలెను అడుగాడిదవలెను ఉండునని అర్థము. వీనినుండి పాలు పితుకుట సాధ్యము కాదు.

# పదమూడో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 172 : యోగవామనము[1]

1. పర్వతగుహలో నివసించు ముండుడో జటిలుడో అగు సన్యాసి తాను నాలుగువందల సంవత్సరముల వయస్సువాడనని ప్రకటించుకొనుచు జటాధారులగు శిష్యకోటితో శత్రునగరమునకు సమీపమందు ఆశ్రమమును స్థాపించుకొనవలెను. 2. శిష్యులు కందమూలఫలములతోను పండ్లతోను మంత్రులను రాజును సమీపించి యోగిదర్శనార్థమై వారిని పిలుచుకొని రావలెను. 3. దర్శనమునకై వచ్చినరాజుతో పూర్వకాలపు రాజులగురించియు వారిలక్షణములగురించియు ప్రస్తావించి, "నా జీవితములో నూరుసంవత్సరములు పూర్తికాగా నేనగ్ని ప్రవేశముచేసి తిరిగి బాలుడ నయ్యేదను. కావున నే నిపుడు నీ సమక్షమున నాల్గవపర్యాయము అగ్నిప్రవేశము చేసెదను. అవశ్యముగ నిన్ను గౌరవించవలసియున్నది, మూడువరములను కోరుకొనుము," అని చెప్పవలెను. 4. అత డంగీకరించినవెంటనే, "ఉత్సవప్రదర్శనమున కేర్పాటులగావించి, నీవు భార్యతోను పుత్రులతోను ఏడురాత్రు లిచటనుండవలెను," అని వానితో చెప్పవలెను. 5. అత డచట నున్నప్పుడు వానిని పట్టి బంధించవలెను.

6. భూగర్భములోని ద్రవ్యములను కనుగొను[2] మహిమకలవాడని ప్రకటించుకొనిన ముండుడో జటిలుడో ఒకడుజటాధారులగు శిష్యకోటితోకూడి, ఒక

---

[1] వామనమనగా లోపలనుండి బయటికి రప్పించుట. దుర్గములోనుండు శత్రు రాజును బయటికి రప్పించుటలో నుపయోగించు యోగములు (ఉపాయములు) ఈఅధ్యాయమందు వివరింపబడినవి. ఇవిఅన్నియు మోసముతో కూడినట్టివి.

[2] భూగర్భములోని లోహాదులను ప్రస్తుతకాలమున భూగర్భపరిశోధకులు (Geologists) కనుగొనుటకు ప్రయత్నించుచున్నారు. ప్రాచీనకాలమందుకూడ సాధనాంతరములచే నిట్టిపరిశోధనములు చేయబడుచుండెను.

వెదురుకఱ్ఱకు మొదట మేకనెత్తురును, తర్వాత దానిపైని బంగారుచూర్ణమును పూసి, చీమలనాకర్షించుటకై దానినొక పుట్టపై నాటవలెను; లేదా, ఆపుట్టమీద నొకబంగారు గొట్టమును నాటవలెను. 7. తర్వాత గూఢచారియొకడు (శత్రు) రాజువద్దకువెళ్ళి, "ఈ సిద్ధునికి పుష్పించు నిధి తెలియును," అని చెప్పవలెను. 8. రాజు (సందేహించి) అడిగినయెడల, "సందేహములేదు," అనిచెప్పి, కఱ్ఱను చూపియు, భూమిలోని మరికొంత బంగారమునుపెట్టియు దానిని రుజువు చేయవలెను. 9. అటుతర్వాత నతడు రాజుతో, "నాగముచే రక్షింపబడుచుండు ఈ నిధిని నాగపూజ చేసి సంపాదించవచ్చును," అని చెప్పవలెను. 10. రాజు దాని కంగీకరించినయెడల నేడురాత్రులు మొదలగు విషయములను పైని చెప్పినట్లు జరిపించవలెను.

11. భూగర్భములోని నిధులను కనుగొను మహిమగల యోగివేషము ధరించిన యొకడు రాత్రులందు తేజవాగ్నితో కప్పబడిన శరీరము కలవాడై ఏకాంతప్రదేశమందు నివసించవలెను; అతని శిష్యులు రాజునకు వానియెడల విశ్వాసమును కలిగించినతర్వాత, "ఈసిద్ధుడు శ్రేయోదాయి," అని వానితో చెప్పవలెను. 12. రాజు ఏప్రయోజనమును కోరినయెడల నాప్రయోజనము లభించునట్లతనికిచెప్పి, "ఏడురాత్రులు" మొదలగు విషయములను పైనిచెప్పినట్లు జరిపించవలెను.

13. సిద్ధునివేషమును ధరించిన గూఢచారి జంభకవిద్యలచే రాజును ప్రలోభపెట్టవలెను. 14. అత డేప్రయోజనమును కోరునో దానికి సంబంధించిన దంతను పైనిచెప్పినట్లు చేయవలెను.

15. లేదా, సిద్ధునివేషమును ధరించిన వాడొకడు దేశములోని వారందరు పూజించు దేవుని ఆలయమునందాశ్రయమును సంపాదించి, పదేపదే ఉత్సవములను జరిపించుచు, తద్ద్వారా ప్రకృతిముఖ్యులను వశపరుచుకొని, కాలక్రమమున రాజును మోసగించవలెను.

16. లేదా, పూర్తిగ తెల్లజడలను ధరించినవాని వేషములోనున్న గూఢచారి ఎల్లప్పుడు జలములలో నివసించువాడనియు అందుండి ఒక సురంగములోనికి గాని, కట్టక్రింది భూమిగృహములోనికిగాని వెళ్ళగలవాడనియు ప్రకటించుకొనవలెను; అతని శిష్యులు రాజువద్దకు వెళ్ళి క్రమక్రమముగ నతని విశ్వాసము సంపాదించి, "ఈయోగి వరుణుడు, నాగరాజు," అని అతనితో చెప్పవలెను. 17. అత డేప్రయోజనమును కోరునో దానినంతను పైనచెప్పినట్లు చేయవలెను.

18. లేదా, సిద్ధునివేషము వేసుకొనిన గూఢచారి, దేశమునకు పొలిమేరలో నివసించుచు, శత్రువును చూడవలసినదిగ రాజును ప్రోత్సహించవలెను. 19. అతడు దానికి సమ్మతించిన తర్వాత శత్రువురూపములో నుండు బొమ్మ

నొకదానిని తయారుచేసి శత్రువునం దావాహన గావించి ఏకాంత ప్రదేశమందు దానిని చూచుటకు వచ్చినరాజును చంపివేయవలెను.

20. లేదా, వర్తకవేషములోనుండు గూఢచారులు విక్రయార్థమై గుర్రములను దెచ్చి, వానిని కొనుటకుగాని కానుకగ గ్రహించుటకుగాని రావలసినదని రాజును కోరవలెను.[3] అతడు వానిని పరీక్షించుటలో మునిగియున్నప్పు డతనిని చంపవలెను; లేదా, గుర్రముల మధ్యనున్నప్పుడు గుర్రముతోకూడ నతనిపై పడవలెను.

21. లేదా, తీక్ష్ణులు నగరసమీపమందలి చైత్యములోని వృక్షమునొక దానిని రాత్రియందు ఎక్కి, రెల్లుతోగాని తుంగతోగాని కుండలలోనికి ఊదుచు, వినబడీవినబడనట్లు, "రాజుయొక్కయు అమాత్యులయొక్కయు మాంసమును భక్షించకోరుచున్నాము; మమ్ము పూజించుట మీకు కర్తవ్యము," అని చెప్పవలెను. 22. శకునముల పరీక్షించి అర్థముచెప్పు నైమిత్తికులయు మౌహూర్తికులయు వేషముల ధరించినవారు దీనిని ప్రచారము చేయవలెను.

23. లేదా, నాగదేవతల వేషము వేసుకొనినవారు రాత్రియందు తేజన తైలమును పూసుకొని, పవిత్రమగు కోనేటియందుగాని తటాకమందుగాని ఇనుప గదలతోను రోకళ్ళతోను కలియబెట్టుచు పైవిధముగ పలుకవలెను.

24. లేదా, ఎలుగుబంట్ల చర్మమును కప్పుకొనిన గూఢచారులు, నోటినుండి నిప్పును పొగను కక్కుచురాక్షస రూపమును ధరించి, ముమ్మారు నగరము చుట్టు అపసవ్యముగ ప్రదక్షిణముచేసి, రాత్రిపూట కుక్కలనక్కల అరుపుల మధ్య పైవిధముగ కేకలు వేయవలెను.

25. లేదా, గూఢచారులు రాత్రిపూట చైత్యదేవాలయములోని విగ్రహమును తేజనతైలముతోగాని, అభ్రకముతో కప్పిన నిప్పుతోగాని ప్రజ్వలింపజేసి పైనివిధముగ పలుకవలెను. 26. ఇతరులు దానిని ప్రచారముచేయవలెను.

27. అందరిభక్తికి పాత్రములైన దేవతల విగ్రహములకు రక్తము నపరిమితముగపూసి, వానినుండి రక్తము ప్రవహించునట్లు చేయవలెను. 28. విగ్రహములనుండి ప్రవహించు రక్తము యుద్ధమందు పరాజయమును సూచించుచున్న దని మరికొందరు ప్రచారము గావించవలెను.

29. లేదా, గూఢచారులు సంధిరాత్రులందు శ్మశానములో ప్రముఖభాగ మందుండు చైత్యములో మనుష్యులు నిలబడినవారు నిలబడియుండగనే భక్షింపబడుచున్నట్లు ప్రకటించవలెను. 30. అటుతర్వాత రాక్షసరూపమందుండు గూఢచారి నరబలిని కోరవలెను. 31. అచటికి శూరుడని చెప్పుకొను వాడెవడైనగాని, మరియొకడుగాని చూచుటకువచ్చినప్పుడు ఇనుపరోకళ్ళతో వానిని హత్యగావించి

[3] ఇటీవల వేదము వెంకటరాయశాస్త్రిగారు రచించిన ప్రతాపరుద్రీయ నాటక మందిట్టి సన్నివేశముకలదు.

రాక్షసుడే అతనిని చంపెనని స్థాపించవలెను. 32. దానిని చూచినవారు, తదితరులగు గూఢపురుషులు రాజునకు ఆఅద్భుతమును తెలియపరుపవలెను.

33. తర్వాత, నైమిత్తిక మౌహూర్తికుల వేషముల వేసుకొనినవారు శాంతి ప్రాయశ్చిత్త క్రియలను విధించి, అవి జరుగనియెడల దేశమునకు రాజునకు గొప్పఅరిష్టము సంభవించును," అని చెప్పవలెను. 34. దాని కత డంగీకరించిన తర్వాత, "ఈసందర్భములలో రాజే స్వయముగ నేడురాత్రులు మంత్ర బలి హోమములు ప్రతిదినము చేయవలెను," అని వారు చెప్పవలెను. 35. తక్కిన దంతయు నిదివరకు చెప్పినట్లు జరుగవలెను.

36. విజిగీషువే ఇట్టి మోస కార్యములకు లోబడవలసిన యెడల వాని కన్నిటికిని ప్రతీకారములు గావించుకొని తనమహిమను శత్రువునకు స్పష్టపరచవలెను. 37. తర్వాత నిమోసముల నన్నిటిని శత్రువుపై ప్రయోగించవలెను.

38. లేదా, పైనిచెప్పబడిన అద్భుతములన్నిటికి ప్రతీకారములు చేసుకొని తనకోశమునకు కలిగిననష్టమును పూరించుకొనవలెను.

39. శత్రురాజు ఏనుగుల యందిష్టము కలవాడైన యెడల హస్తివనపాలురు సులక్షణములుగల యేనుగు నతనికి చూపి మభ్యపెట్టవలెను. 40. అత డందుల కంగీకరించిన తర్వాత, వారు వానిని దట్టమగు నరణ్యములోనికిగాని, ఏకాయన మగు నరణ్యములోనికిగాని తీసుకొనివెళ్ళి చంపవలెను; లేదా, బంధించి తీసుకొని వెళ్ళిపోవలెను. 41. వేటయందు వ్యసనియగువాని విషయమునగూడ నిట్లే చేయవలెను.

42. శత్రురాజు ద్రవ్యలోలుడైనఎడలను స్త్రీలోలుడైనయెడలను ధనికురాండ్రగు విధవలను,[4] లేదా, పరమరూప యౌవనవతులను దాయమునకొరకు నిక్షేపము కొరకు గూఢచారులు వానివద్దకు తీసుకొనివెళ్ళి లోభపెట్టవలెను. 43. అతడంగీకరించినతర్వాత గూఢచారులు రాత్రియందు దాగియుండి సమాగమకాల మందతనిని శస్త్రముచేగాని విషముచేగాని చంపవలెను.

44. లేదా, శత్రురాజు సిద్ధులను, సన్యాసులను, చైత్యములను, స్తూపములను, దైవతప్రతిమలను దర్శించుటకు వెళ్ళునసమయము లనేకములందు తీక్ష్ణులు భూమిగృహములందు, సురంగములందు, రహస్యపుగోడలందు దాగియుండి వానిపైబడి కొట్టవలెను.

45. (శ్లో) శత్రురాజు నాటకప్రవర్శనములను స్వయముగ చూచుటకు వెళ్ళు ప్రదేశములందును, యాత్రావిహారములకును జలక్రీడలకును వెళ్లు ప్రదేశములందును;

[4] విధవలు ధనికురాండ్రని అనుటలో విశేష మున్నది.

46. (శ్లో) హెచ్చరికలు మొదలగువానికి సంబంధించినమాటలు మాట లాడుసమయములందును, యజ్ఞసమయములందును, ప్రవహణములందును, జన్మ సంస్కార ప్రేతసంస్కార సమయములందును, రోగులను చూచుటకువెళ్ళు సమయములందును, అనురాగము శోకము భయములతోకూడిన సమయము లందును ;

47. (శ్లో) స్వజనోత్సవములలో నంచరిని విశ్వసించి ప్రమత్తుడై యున్నప్పుడును, రక్షకభటులు లేక సంచరించునప్పుడును, వర్షము పడుచున్న ప్పుడును, గుంపులమధ్య నున్నప్పుడును ;

48–49. (శ్లో) దారితప్పినప్పుడును, అగ్నిప్రమాదము సంభవించినప్పు డును, నిర్జనప్రవేశమును ప్రవేశించినప్పుడును వస్త్రాభరణమాల్యములతోను శయనాసనములతోను. మద్యభోజనభాండములతోను వాద్యములతోను తీక్ష్ణులు లోపలికి ప్రవేశించి తత్పూర్వమే అక్కడికివెళ్ళిన తమ సహచరులతో కలిసి వానిని కొట్టవలెను.

50. (శ్లో) రహస్యముగ శత్రువునుకొట్టుటకు వారు లోపలికివెళ్ళినట్లే వారు బయటికి మరలిరావలెను. ఇవి యోగవామన వివరణము.

ఇది దుర్గలంభోపాయమను పదమూడో అధికరణమందు యోగవామ నము అనే రెండో అధ్యాయము.

## అధ్యాయము 3

### ప్రకరణము 173 : గూఢపురుషుల వినియోగము

1. (విజిగీషువు) అప్పుడగు శ్రేణీముఖ్యు నొకనిని ఉద్యోగమునుండి తొలగించవలెను. 2. అతడు శత్రువు నాశ్రయించి తనపక్షము వారను కారణము చూపి స్వదేశమందుండి కలిసి పనిచేయువారిని సహాయపడువారిని పిలిపించవలెను. 3. లేదా, శత్రువుసమ్మతితో గూఢపురుషులను కొందరిని సమకూర్చుకొని తన ప్రభువుయొక్క దూష్యగ్రామమునుగాని ఏనుగులు గుఱ్ఱములు లేనట్టియు దూష్యులతో కూడినట్టియు సైన్యమునుగాని దూష్యుడగు నాకందునిగాని కొట్టి శత్రువునకు తెలియపరచవలెను. 4. లేదా, సహాయమును సంపాదించుటకై జనపదములో నొకభాగమునుగాని శ్రేణీబలమునుగాని ఆటవికముఖ్యులనుగాని ఆశ్రయించవలెను. 5. శత్రుని విశ్వాసమును పూర్తిగసంపాదించినతర్వాత తన ప్రభువునకు వర్తమానము పంపవలెను. 6. అప్పుడతడు ఏనుగులను బంధించు మిషతోగాని ఆటవికులనణచు మిషతోగాని రహస్యముగ శత్రువును కొట్టవలెను.

7. దీనినుండి అమాత్యులు ఆటవికులు—వీరి విషయమును తెలుసుకొన వలెను.

8. శత్రువుతో స్నేహముచేసుకొని తనమంత్రులలో కొందరిని ఉద్యోగము నుండి తొలగించవలెను. 9. వారు శత్రువువద్దకు "మాప్రభువు మాయందను గ్రహము చూపునట్లు చేయుము," అని సందేశము పంపవలెను. 10. అప్పు డందుకై అతడు పంపుదూతను, 'మీరాజు నన్ను నామంత్రులనుండి విడదీయు చున్నాడు. ఇందుకై నీ విచటికి మరల రాకూడదు," అని చీవాట్లు పెట్టవలెను. 11. తర్వాత మంత్రులలో నొకడుతన్ను వదలి వెళ్ళిపోవునట్లు చేయవలెను. 12. అతడు శత్రువువద్ద ఆశ్రయము సంపాదించి దూష్యులగు గూఢచారులను అనురాగములేనివారిని బలహీనులగుద్రోహులను ఉభయరాజ్యములకు బాధను

కలిగించు చోరులను ఆటవికులను అతనిదృష్టికి తీసుకొనిరావలెను. 13. ఇట్లతని విశ్వాసమును సంపాదించి, అతనికొలువులోనుండు అంతపాలుడు ఆటవికుడు దండనాయకుడు మొదలగు ప్రవీర పురుషులగురించి అతనితో, "ఫలానావాడు నీశత్రువుతో కలిసియుండుట సత్యము," అని అతనిదృష్టి ఆకర్షించునట్లు చెప్ప వలెను. 14. తర్వాత నతడు మరణశిక్షకు పాత్రులైనవారు తెచ్చు లేఖలద్వారా వారిని చంపించవలెను.

15. లేదా, (శత్రుని) శత్రువుయొక్క సైనికబలము నుపయోగించి అతనిని నాశముచేయునట్లు ప్రోత్సహించవలెను.

16. లేదా, కృత్యపక్షమువారి ననుగ్రహించి శత్రువుని శత్రువు తన కపకారముచేయునట్లు పన్నుగడనుపన్ని అతనిపై పడవలెను. 17. అట్లుచేసి శత్రువునకు, "ఈ నీశత్రువు నాకపకారము చేయుచున్నాడు. మనమిద్దరము కలిసి అతనిని నాశము చేయుదము. లభించినభూమి హిరణ్యములలో నీకుగూడ భాగముండును," అని సందేశము పంపవలెను. 18. ఈమాటలను గౌరవించి దీనికిసమ్మతించి అతడువచ్చినయెడల అకస్మాత్తుగ సంభవించు ఆక్రమణలో గాని ప్రకాశయుద్ధమందుగాని శత్రువుచే నతనిని చంపించవలెను. 19. లేదా, అతని విశ్వాసమును సంపాదించుటకై భూమినిచ్చుటకనియో పుత్రాభిషేకమున కనియో రక్షణార్థమనియో యతని నాహ్వానించి, వచ్చినవెంటనే ఆతనిని పట్టి బంధించవలెను. 20. లేదా, అతనిని పట్టుకొనుట సాధ్యముకానప్పుడు రహస్య దండముచే నతనిని చంపించవలెను. 21. అతడు స్వయముగ వచ్చుటకు బదులు సైన్యమును పంపినయెడల శత్రువుద్వారా దానిని నాశము చేయించవలెను. 22. లేదా, అతడుసైన్యముతో వచ్చుటకు సిద్ధపడినను విజిగీషువుతో కలిసి యానముచేయుట కిష్టపడనియెడల రెండువైపులనుండి వానిని పీడించి నాశము చేయవలెను. 23. లేదా, తనయందు విశ్వాసములేక అతడు వేరుగయానముచేయ గోరినయెడలను, లేదా, వారు కలిసి యానము చేయదగినవాని భూమిని వశపరుచు కొన గోరినయెడలను శత్రుసైన్యసాధనమునగాని, తన బలమునంతను సమకూర్చు కొనిగాని అతనిని నాశము చేయవలెను. 24. లేదా, అతడు శత్రువుతో యుద్ధముచేయుచుండు సమయమును కనిపెట్టి మరియొకవైపునుండి తనసైన్య మును పంపి అతని మూలస్థానము నాక్రమించవలెను.

25. శత్రుభూమి నిచ్చివేయు పరతున మిత్రునితోను, మిత్రునిభూమి నిచ్చివేయుపరతున శత్రువుతోను సంప్రతింపులు జరుపవలెను. 26. అటు తర్వాత శత్రుభూమి నాక్రమించు సమయములో మిత్రుడు ప్రమాదమందున్నప్పు డతనిపైబడి ఇంతకుపూర్వముచెప్పిన మోసపుకార్యముల నన్నిటి నతనిపై ప్రయోగించవలెను.

**27.** సంప్రతింపులకు సమ్మతించి మిత్రునిభూమి నాక్రమించు శత్రువునకు సైనికసహాయము చేయవలెను. **28.** అతడు శత్రువుపై యానముచేయునపు డతనిని మోసగించి కొట్టవలెను.

**29.** లేదా, అవసరమగు ప్రతీకారచర్యలనన్నిటిని తీసుకొని, తమ కేదో ప్రమాదము సంభవించినట్లు నటించి, తన మిత్రునిద్వారా శత్రువును పోత్సహించి తనపై యానమునకు పురికొల్పవలెను. **30.** అటుతర్వాత నతనిని పీడించి నాశము చేయవలెను ; లేదా, సజీవునిగ పట్టుకొని, రాజ్యమును తీసుకొని దానికి బదులుగ వానిని వదలిపెట్టవలెను.

**31.** లేదా, మిత్రుని ఆశ్రయమును సంపాదించి శత్రువు తనకు వశపడ గోరనియెడల సామంతు డతని రాజ్యములోని మూలస్థాన మపహరించునట్లు చేయవలెను. **32.** లేదా, సైన్యసాధనమున దానిని రక్షించుకొన ప్రయత్నించిన యెడల నతని సైనికులకు నష్టము కలిగించవలెను.

**33.** వారిద్దరు విడివడని సందర్భములో వారి భూముల విషయమై బహిరంగముగ బేరము పెట్టవలెను. **34.** అటుతర్వాత మిత్రులవేషము వేసుకొనిన గూఢచారులుగాని, ఉభయవేతనులుగాని వారిలో మొదటివానివద్దకుగాని రెండవవానివద్దకుగాని, "ఈ రాజు శత్రువుతో కలిసి నీ భూముల నాక్రమింప నుద్దేశించి యున్నాడు," అని చెప్పుటకై వార్తాహరులను పంపవలెను. **35.** వారిలో నెవడైన భయకంపితుడైనను రోషావేశుడైనను ఇదివరలో చెప్పినట్లు విజిగీషువు ప్రవర్తించవలెను.

**36.** లేదా, అతడు తనదుర్గముఖ్యులనుగాని రాష్ట్రముఖ్యులనుగాని, దండముఖ్యులనుగాని తన అభిమానమును కోల్పోయినట్లు కారణములతో కూడ ప్రకటించి దేశమునుండి బహిష్కరించవలెను. **37.** వారు యుద్ధమందుగాని, అవస్కందమందుగాని, ముట్టడి యందుగాని, మరియొక ప్రమాదమందుగాని శత్రువును పట్టుకొనవలెను. **38.** లేదా, స్వవర్గముతో నతనికి విభేదములు కల్పించవలెను. **39.** మరణశిక్షకు పాత్రులైనవారివశమందుండు లేఖలద్వారా విభేదకారణములను బలపరుపవలెను.

**40.** లేదా, వేటకాండ్రవేషము వేసుకొనిన గూఢచారులు మాంసవిక్రయమునకని (శత్రు) దుర్గద్వారమునచేరి, ద్వారపాలకులద్వారా ఆశ్రయమును సంపాదించి, చోరులరాకను రెండుమూడుపర్యాయములు శత్రువునకు ముందుగ తెలియపరిచి అతని విశ్వాసమును సంపాదించవలెను. తర్వాత వారు వారిప్రభువు యొక్క సైన్యమును శత్రుగ్రామము నాక్రమించుట కొకచోటను అవస్కందమున కింకొకచోటను—రెండుప్రదేశములందు—చేర్చి, శత్రువుతో, "దొంగల గుంపొకటి సమీపమం దున్నది ; కల్లోలము హెచ్చుగ నున్నది ; గొప్ప సైన్య

మును పంపుము," అని చెప్పవలెను. 41. శత్రుగ్రామము నాక్రమించు తమ ప్రభువుయొక్క సైన్యమునకు దానిని వశపరిచి, తమ ప్రభువుయొక్క రెండవ సైన్యముతో రాత్రిపూట (శత్రు) దుర్గద్వారములకువచ్చి "చోరగణము చంపబడినది; యాత్రలో విజయమును గాంచిన సైన్యము వెనుకకు వచ్చినది. ద్వారములు తెరవండి," అని వారు చెప్పవలెను. 42. లేదా, ముందే అచటనుంచబడిన గూఢచారులు ద్వారముల తెరవవలెను. 43. వారందరితోకలిసి కొట్టవలెను.

44. లేదా, ఆతడు శత్రుదుర్గమందు కారువులు శిల్పులు పాషండులు కుశీలవులు వైదేహకులు మొదలగువారి వేషముల ధరించిన సైనికులను చేర్చవలెను. 45. గృహస్థుల వేషములోనుండు గూఢచారులు కట్టెలు గడ్డి ధాన్యములు పణ్యములు మొదలగువానిని తీసుకొనివచ్చు బండ్లద్వారా ఆయుధములను ఆవరణములను వారికి అందజేయవలెను; లేదా, దేవధ్వజములద్వారాగాని విగ్రహములద్వారాగాని వాని నందజేయవలెను. 46. అటుతర్వాత వారివేషము వేసుకొనినవారు ప్రమత్తులను (రక్షకభటులను) చంపవలెను; అవస్కందమును పార్ష్ణిగ్రహణమును బలపరుపవలెను; లేదా, శంఖదుందుభిస్వనములతో "శత్రు సైన్యము దుర్గములోనికి ప్రవేశించినది," అని ఘోషించవలెను. 47. తర్వాత ప్రాకారద్వారములను గోపురములను తెరచి, శత్రుసైన్యమును భేదించవలెను; లేదా, నాశము చేయవలెను.

48. సార్థవాహులతోను, గణములతోను, అతివాహకులతోను, కన్యావాహకులతోను, గుఱ్ఱముల వర్తకులతోను, ఇతరద్రవ్యముల విక్రయించువారితోను, ఉపకరణములను మోసుకొనిపోవువారితోను, ధాన్యములుకొని అమ్ము వారితోను, పరివ్రాజక వేషధారులతోను, దూతలతోను కలిసి సైన్యమును (శత్రు) దుర్గములోనికి ప్రవేశపెట్టవలెను. (ఈమధ్యకాలములో) విశ్వాసము కలిగించుటకై సంధిచేసుకొనవలెను.

49. (శత్రు) రాజును మోసముచేయుటకై వినియోగపడు గూఢచారుల వివరణ మింతటితో సమాప్తము.

50. ఆటవికుల విషయమున వినియోగింప వలసినవారు కూడ వీరే; కంటకశోధన ప్రకరణమందు వివరింపబడినవారు కూడ వీరే. 51. గూఢచారులు పశువులమందలనుగాని, ఆటవికుల సమీపమందుండు సార్థవాహమునుగాని చోరులచే నపహరింప జేయవలెను. 52. ముందే అనుకొనిన యేర్పాటు ప్రకారము మదనరసముతో కలిపిన అన్నపానము లచట పెట్టి వారు వెళ్ళిపోవలెను. 53. మదనరసము మూలమున వారు వికారము గాంచినపుడు గోపాలకులు వర్తకులు దొంగిలించిన వస్తువులను మోసుకొనిపోవు దొంగల నటకాయించవలెను.

54. లేదా, ముండునివేషమునో జటిలునివేషమునో ధరించినగూఢచారి

సంకర్షణదైవతము నారాధించువానివలె నటించుచు ఉత్సవసమయమందు మదన రసము నుపయోగించి ఆటవికులను మోసగించవలెను. 55. అటుతర్వాత వారిని కొట్టవలెను.

56. లేదా, మద్యము తయారుచేయువారి వేషముధరించిన గూఢచారులు దైవతోత్సవములందుగాని, ప్రేతకార్యముల సమయమందుగాని, ప్రవహణ సమయములందుగాని మద్యమును విక్రయించునప్పుడును పంచిపెట్టునప్పుడును మదనరసమును వినియోగించి ఆటవికులను మోసగించవలెను. 57. అటుతర్వాత వారినికొట్టవలెను.

58. (శ్లో) పట్టణముపైపడి దోచుకొనుటకు వచ్చిన ఆటవికులను గుంపులుగుంపులుగ చెదరగొట్టి వారిని నాశముచేయవలెను. చోరులకు సంబంధించిన గూఢచారుల వివరము మింతటితో సమాప్తము.

ఇది దుర్గలంభోపాయమను పదమూడో అధికరణమందు గూఢపురుషుల వినియోగము అనే మూడో అధ్యాయము.

# పదమూడో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 174 : (దుర్గమును) ముట్టడించుట

### ప్రకరణము 175 : అవమర్దము

1. దుర్గమును ముట్టడించుటకు పూర్వము శత్రువును బలహీన పరుప వలెను.

2. ఒప్పందము ప్రకారము జనపదమున కభయప్రదానము చేయవలెను. 3. తిరుగుబాటు చేసినవారి ననుగ్రహ పరిహారములతో తృప్తిపరిచి జనపదమందు నిలుపవలెను ; దేశాంతరమునకు వెళ్ళదలచినవారివిషయములో నిట్లు చేయవలసి నదిలేదు. 4. వారికి (నిల్చినవారికి) యుద్ధరంగమునకు దూరముగనుండు ప్రదేశములందు నివాసములేర్పరచవలెను ; లేదా, వారందరొకే ప్రదేశమందు నివసించు నట్లు చేయవలెను. 5. ఏలయన, జనులులేనిజనపదముగాని, జనపదములేని రాజ్యముగాని ఉండదుకదా ![1]

6. దుర్గమమగు దుర్గమందు సన్నివిష్టుడగు రాజుయొక్క నాట్లను పంటలను నాశముచేయవలెను ; అతని వీవధప్రసారములకుకూడ నష్టము కలిగించవలెను.

7. (శ్లో) ప్రసారవీవధములను ఛేదించుట మూలముననూ, నాట్లను సస్యములను నాశముచేయుటమూలముననూ, ప్రకృతుల వమనము మూలముననూ, రహస్యవధల మూలముననూ ప్రకృతులకు క్షయము సంభవించును.

8. "నా సైన్యమునకు కావలసినంత కంటె నధికముగ ధాన్యములు, కుప్య

---

[1] విజిగీషువు తాను జయించదలచిన శత్రురాజ్యములలోని ప్రజలకునష్టము కలిగించరాదు. విజిగీషు వనుసరించవలసిన నియమములలో నిది ప్రధాన స్థానము వహించవలెనని కౌటిల్యుని మతము.

ములు, యంత్రములు, శస్త్రములు, ఆవరణములు, విష్టి, త్రాళ్ళు సమకూరి యున్నవి; ఋతువు నా కనుకూలించి యున్నది; శత్రువునకు ప్రతికూలముగ నున్నది; వ్యాధి దుర్భిక్షముల వలన నతని కోష్ఠములకు రక్షాస్థానములకు క్షయము సంభవించినది; అతని క్రీతబలము మిత్రబలము నిర్వేదము గాంచియున్నవి," అని (విజిగీషువు) అనుకొనినప్పుడు దుర్గమును ముట్టడించవలెను.

9. తన స్కంధావారమునకు వీవధమునకు ఆసారములకు మార్గములకు రక్షణము కల్పించుకొని, అగడ్త ప్రాకారముల ననుసరించి దుర్గమును చుట్టుముట్టవలెను; జలములను కలుషపరుపవలెను; అగడ్తలోని నీళ్ళను ఖాళీచేయవలెను; లేదా, అగడ్తను నీళ్ళతో నింపవలెను; సురంగముద్వారాను సైన్యములను మర్దించుటద్వారాను వప్రప్రాకారములను వశపరచుకొనవలెను; ఆవరణములతో కప్పబడిన ఏనుగుల సహాయమున ప్రాకారమును బేధించవలెను. 10. గోతులను మట్టిపెళ్ళలతో కప్పవలెను.

11. సైనికులనేకులచే రక్షింపబడు ప్రదేశములను యంత్రసహాయమున నాశముచేయవలెను. 12. నిష్కిరమునుండి[2] సైనికులను పైకిలాగి గుర్రములతో కొట్టవలెను. 13. యుద్ధముల మధ్యకాలములలో నుపాయములలో నొక్కటినిగాని, వేరువేరుగగాని, కలిపిగాని ఉపయోగించి విజయముగాంచ ప్రయత్నించవలెను.

14. శత్రుదుర్గమందుండు డేగలను, కాకులను, పుంజులను, గద్దలను, చిలుకలను, శారికలను, గూబలను, పావురములను పట్టితెచ్చి వానితోకలకు "అగ్నియోగము" నుకట్టి శత్రుదుర్గములోనికి వదలవలెను. 15. దుర్గమునకు దూరముగనుండు తనశిబిరమునుండి, పైకెత్తినధ్వజములతోకూడిన ధనుర్ధరుల రక్షణముతో మానుషాగ్నిచేత దుర్గములో మంటలు లేపవలెను. 16. దుర్గరక్షకుల వేషము ధరించిన గూఢచారులు ముంగిసలు కోతులు పిల్లులు కుక్కలు మొదలగువాని తోకలలో యోగాగ్నినిపెట్టి, వానిని పూరికుప్పలపైకి, రక్షాస్థానముల లోనికి ఇండ్లలోనికి వదలివేయవలెను. 17. ఎండిన చేపలగర్భములోను, ఎండిన మాంసములోను నిప్పుపెట్టి, కాకులఆహారముగ నుపయోగించునట్లు పక్షుల ద్వారా వానిని దుర్గములోనికి చేర్చవలెను.

18. సరళము, దేవదారు, పూతితృణము, గుగ్గిలము, శ్రీవేష్టకము, సర్జరసము, లక్కగుళికలు, గాడిదలు, ఒంటెలు, మేకలు, గొర్రెలు—వీనిపేడ—ఇవి అగ్నిధారణ సమర్థములు.

19. ప్రియాలుచూర్ణము, అవల్గుజమషి, మైనము, గుర్రములయు గాడిదలయు ఒంటెలయు పశువులయు పేడ—వీనినికలిపినయెడల దుర్గము లోపలికి విసరుటకు తగిన యోగాగ్ని తయారగును.

---

[2] నిష్కిర మనగా సైనికులు పారిపోవుట కనుకూలించు ప్రదేశము.

**20.** అగ్నివర్ణముగల లోహములన్నిటి చూర్ణము, కుంభి, సీసము, తగరములచూర్ణము, పారిభద్రక పలాశపుష్పములతోను కేశమషితోను, నూనె, మైనము, శ్రీవేష్టకములతోను కలిపినయెడల యోగాగ్నియగును ; ఇది విశ్వాసఘాతి (ఒకవిధమైనయంత్రము). **21.** బాణమునకు దానినిపూసి నారతోను త్రపునపుపట్టతోను కప్పినయెడల నిప్పంటించుటకు తగినసాధన మగును.

**22.** కాని, యుద్ధము సాధ్యమగునప్పుడు నిప్పును వినియోగించరాదు. **23.** ఏలయన, నిప్పును నమ్ముటకు వీలులేదు.[3] అదియొక దైవపీడనము ; లెక్కలేని ప్రాణులను, ధాన్యములను, పశువులను, హిరణ్యమును, కుప్యమును, ద్రవ్యములను నాశము చేయునట్టిది. **24.** నాశముగాంచిన రాజ్యము లభించినను నష్టమునకే హేతువగును.

దీనితో దుర్గమును ముట్టడించు విషయము సమాప్తము.

**25.** "ఈప్రయత్నమునకు కావలసిన యుపకరణములు విష్టియు నావద్ద నున్నవి, శత్రువు వ్యాధితుడు ; గూఢచారుల శోధనల మూలమున ప్రకృతుల యభిమానమును కోల్పోయియున్నాడు ; దుర్గముల నిర్మించుకొనలేదు ; ద్రవ్యముల సమకూర్చుకొనలేదు ; ఆసారములేనివాడు ; ఉన్నను త్వరలోనే మిత్రులతో సంధి జేసుకొనును," అని అనుకొనినప్పుడు దుర్గము అవమర్దమునకు తగినకాలము[4].

**26.** (శత్రువుదుర్గములో) అగ్నిప్రమాదము సహజముగగాని గూఢ పురుషులద్వారాగాని సంభవించినప్పుడు, ఉత్సవము జరుగుచున్నప్పుడు, సైన్యములు ప్రదర్శనమును చూచుచున్నప్పుడు, మద్యపానము మూలమున కలహము సంభవించినప్పుడు, నిరంతరము యుద్ధముచేయుటవలన సైన్యము అలసియున్నప్పుడు, యుద్ధములనేకములందు సైనికు లధికముగ గాయపడినప్పుడు, లేదా, అనేకులు చనిపోయినప్పుడు, జనము మేలుకొనియుండుటకుశక్తిలేక గాఢనిద్రలో నున్నప్పుడు, వర్షము పడుచున్నప్పుడు, నది వరదలతో కూడియున్నప్పుడు దట్టముగ మంచు ఆవరించియున్నప్పుడు దుర్గమును మర్దించవలెను.

**27.** లేదా, శిబిరమును ఖాళీచేసి, వనమందు దాగియుండి శత్రువు దుర్గమునుండి బయటికి వచ్చినవెంటనే వానిని చంపవలెను.

**28.** లేదా, మిత్రునివలె ఆసారునివలె వేషముధరించినవా డొక డవరుద్ధునితో స్నేహముచేసుకొని మరణశిక్షకు పాత్రుడైనవానినొకనిని దూతగ నతని

[3] ప్రస్తుత కాలమున నిట్టి సూత్రమునకు విలువయే లేదు. బాంబులవర్షమును కురిపించి శత్రుదేశములను దగ్ధముచేయుట సర్వసాధారణమైనది.

[4] అవమర్దము (మర్దించుట) నలువైపులనుండి దుర్గముపై బలములన్నిటితో ఒకేపర్యాయము పడుట.

వద్దకు పంపవలెను; అతడు (దూత) "నీయందలి దోషమిట్టిది; వీరు నీయెడల ద్రోహముతలపెట్టినవారు; ముట్టడి వేసినవానిలోని దోషమిట్టిది, నీవు వశము చేసుకొనదగువారు లేరు," అనిచెప్పవలెను. 29. ప్రతిదూతతో నతడు దుర్గము నుండి బయటికి వచ్చినవెంటనే విజిగీషువతనిని పట్టి చంపించి వెళ్ళిపోవలెను. 30. మిత్రునివలె ఆసారునివలె వేషముధరించినవా డవరుద్ధునితో, "నన్ను రక్షించుటకు బయటికిరమ్ము; లేదా, నాతోకూడ ముట్టడించినవానిని సంహరించుము," అని అనవలెను. 31. దీని కతడు సమ్మతించినప్పు డతనిని రెండువైపులనుండి మర్దించి చంపవలెను; లేదా, బంధితునిగజేసి, రాజ్యమును తీసుకుని వదలివేయవలెను. 32. లేదా, అతని ప్రధాననగరమును నాశముచేయవలెను. 33. లేదా, అతనిసారబలమును విడదీసి వానిపైపడి కొట్టవలెను.

34. దీనినుండి దండోపనతుని విషయము అటవికుల విషయము తెలుసుకొనవలెను. 35. దండోపనతుడుగాని అటవికుడుగాని అవరుద్ధునివద్దకు, "ముట్టడి వేసినవాడు రోగపీడితుడుగ నున్నాడు; లేదా, పార్ష్ణిగ్రాహి యతనిపై పడుచున్నాడు; లేదా, వానిలో మరియొకలోపము కనుపించినది; లేదా, అతడు దేశాంతరమునకు వెళ్ళదలచియున్నాడు," అని సందేశము పంపవలెను. 36. అతడు సమ్మతించినపక్షమున విజిగీషువు తనశిబిరమునకు నిప్పుపెట్టి పెళ్ళిపోవలెను. 37. అటుపిమ్మట నిదివరకు చెప్పినట్లు చేయవలెను.

38. లేదా, పణ్యములను సమకూర్చి, విషముతో కూడిన పణ్యములతో వానిని మోసపుచ్చవలెను.

39. లేదా, ఆసారుని వేషమును ధరించినవాడు దూతనొకని నవరుద్ధుని వద్దకుపంపి, "నేను నీశత్రువును మార్కొనుచున్నాను; నీవుకూడ బయటికివచ్చి వానిని మార్కొనుము," అని చెప్పించవలెను. 40. అతడు సమ్మతించినయెడల నిదివరకు చెప్పినట్లు చేయవలెను.

41. స్నేహితునో బంధువునో చూచుటకని గూఢపురుషులు ముద్రవేసిన లేఖతో దుర్గమును ప్రవేశించి శత్రు వాలేఖను పట్టుకొనునట్లు చేయవలెను.

42. లేదా, ఆసారునివేషము వేసుకొనిన గూఢచారి "ఫలానాప్రదేశమందు, ఫలానా కాలమందు నేను శత్రుశిబిరముపై పడెదను. నీవుకూడ నప్పుడు యుద్ధము చేయవలెను," అని సందేశము పంపవలెను. 43. అతడు సమ్మతించినయెడల, పైని చెప్పినట్లు సంకుల నినాదమును కల్పించవలెను; దానిని విని అతడు రాత్రియందు బయటికివచ్చిన వెంటనే వానిని నాశము చేయవలెను.

44. లేదా, అతడు వానిమిత్రునిగాని అటవికునిగాని ఆహ్వానించి, వారిని "అవరుద్ధునితో యుద్ధము చేయుడు; వానిభూమి నాక్రమింపుడు," అని పురికొల్ప

వలెను. 45. వారిలో నొకడు యుద్ధముచేయుచుండ నతడు ప్రజలమూలమున గాని, దూష్యముఖ్యులలో నొకనిని బలపరచుట మూలమునగాని అతనిని చంపించవలెను; లేదా, తానే విషప్రయోగముచేసి వానిని చంపి, "ఇతడు మిత్రఘాతుకుడు," అని ప్రకటించి తనయుద్దేశము నెరవేర్చుకొనవలెను.

46. మిత్రునివేషములోనివా డొకడు శత్రువువద్దచేరి మిత్రులలో నొకడతనిపై పడదలచియున్నాడని చెప్పవలెను. 47. అతని విశ్వాసము సంపాదించి వాని ప్రవీరపురుషులను చంపించవలెను.

48. లేదా, వానితో సంధిచేసుకొని జనపదనివేశమున కతనిని పురికొల్పవలెను. 49. నివేశము జరిగినతర్వాత తా నజ్ఞాతుడై దానిని నాశము చేయవలెను.

50. (శత్రుని) దూష్యమూలమునను, ఆటవికుల మూలమునను వానికి నష్టముకలిగించి, వారిపై వానిసైన్యములో కొంతభాగమును పంపునట్లుగావించి, (అటుతర్వాత) దుర్గముపై నకస్మాత్తుగపడి దానిని వశపరుచుకొనవలెను.

51. తన్నుచేరిన (శత్రుని) దూష్యామిత్రాటవిక సైన్యములకు విరోధులకు త్యజించినవారికి అర్థమానములను సంజ్ఞలను చిహ్నముల నిచ్చి, వారిచేత దుర్గమును పట్టుకొనునట్లు చేయవలెను.

52. శత్రుదుర్గముపైనగాని, శిబిరముపైనగాని పడినప్పుడు పతితులకు పరాఙ్ముఖులకు, లోబడినవారికి, తలవెంట్రుకల విరబోసికొనినవారికి, శస్త్రములు లేనివారికి, భయముచే కురూపులైనవారికి యుద్ధము చేయనివారికి అభయప్రదానము చేయవలెను.

53. దుర్గము వశపడినతర్వాత శత్రుపక్షమువా రెవ్వ రందులో లేనట్లు చేసిన తర్వాతను, లోపలను బయటను రహస్యదండప్రతీకారముగావించిన తర్వాతను తా నందులో ప్రవేశించవలెను.

54. విజిగీషు విట్లు శత్రుభూమిని వశపరుచుకొనినతర్వాత మధ్యముని వశపరుచుకొన ప్రయత్నించవలెను; అందు జయముగాంచిన పిమ్మట నుదాసీనుని వశపరుచుకొనవలెను. 55. భూగోళమును జయించుట కిదియే మొదటిమార్గము.

56. మధ్యమోదాసీనులు లేనప్పుడు గుణాతిశయముచే మొదట శత్రుప్రకృతులను, పిమ్మట తక్కిన ప్రకృతులను వశపరుచుకొనవలెను. 57. ఇది రెండవ మార్గము.

58. మండలము లేనప్పు డుభయ పార్శ్వములనుండి మిత్రుని శత్రువు ద్వారాను, శత్రువును మిత్రునిద్వారాను పీడించి జయము సంపాదించవలెను 59. ఇది మూడోమార్గము.

60. (విజిగీషువు) మొదట బలహీనునిగాని, సామంతులలో నొకనిని గాని సాధించవలెను; దానిఫలితముగ రెండింతల బలముగలవాడై రెండో

సామంతుని, అటుతర్వాత మూడింతల బలముగలవాడై మూడోసామంతుని జయించవలెను. 61. భూగోళమును జయించుట కిది నాలుగోమార్గము.

62. భూగోళమును జయించినతర్వాత వర్ణాశ్రమములుగ విభక్తమైనట్టిది యగు దానిని (భూగోళమును), స్వధర్మానుసారము పరిపాలింపవలెను.

63. (శ్లో) ఉపజాపము, గూఢపురుషులు, వామనము, ముట్టడి, అవమర్దము—ఈఅయిదు దుర్గమును వశపరుచుకొనుటకు సాధనములు.

ఇది దుర్గలంభోపాయమను పదమూడో అధికరణమందు దుర్గమును ముట్టడించుట, అవమర్దము అనే నాలుగో అధ్యాయము.

# పదమూడో అధికరణము

## అధ్యాయము 5

### ప్రకరణము 176 : లబ్ధప్రశమనము[1]

1. విజిగీషుని యుత్థానమునకు లక్ష్యములు రెండు: అడవులు మొదలైనవి; లేక, నగరము మొదలైనవి. 2. దానిని సంపాదించుటకు సాధనములు మూడు; క్రొత్తది (క్రొత్తగ దానిని సంపాదించుట); ఇంతకుపూర్వ మనుభవములో నుండునది; పిత్ర్యము (పూర్వులనుండి లభించినది).

3. క్రొత్తదేశమును సంపాదించిన తర్వాత శత్రువులోని దోషములను తనలోని సుగుణములచే కప్పివేయవలెను; తనలోని సుగుణములను రెండింతలుగ వృద్ధిచేసుకొనవలెను. 4. నిర్దిష్టమగు స్వధర్మమును నిర్వహించియు, అనుగ్రహములగు కార్యముల గావించియు, పరిహారముల నిచ్చియు, దానములు చేసియు, గౌరవములు కల్పించియు, ప్రజలకు ప్రియమును హితమును జేయవలెను. 5. శత్రుపక్షమునుండి తనపక్షమునకు వచ్చినవారికి తనవాగ్దానముల ననుసరించి లాభము చేకూర్చవలెను; కష్టపడి పనిచేసినవారికి మరింతలాభము చేకూర్చవలెను. 6. ఏలయన, వాగ్దానములను చెల్లించనివాడు తనప్రజలయు పరప్రజలయు విశ్వాసమునకు పాత్రుడు కాకపోవును; తనప్రజల ఆచారములకు విరుద్ధముగ ప్రవర్తించువాని స్థితికూడ నిట్టిదే. 7. కావున శీలము, వేషము, భాష, ఆచారము మొదలగువాని విషయములో తాను ప్రజలతో సమానుడుగ

---

[1] లబ్ధప్రశమన మనగా జయించి సంపాదించిన దేశములోని ప్రజలను సంతృప్తిపరచి వారికి విజిగీషువునం దనురాగము కలుగునట్లు చేయు విధానము, ఇది మిక్కిలి ప్రధానమగు అధ్యాయము. జయించిన ప్రజల ఆచార వ్యవహారములలోగాని, వేషభాషలలోగాని విజిగీషువు మార్పు చేయరాదనియు, అత డాప్రజల ఆచార వ్యవహారములను వేషభాషలను స్వయముగ ననుసరించవలెననియు కౌటిల్యుని మతము. ఆధునిక యుగములో పరదేశములను జయించి పాలించినవా రీసూత్రమునకు విరుద్ధముగ ప్రవర్తించుట గమనించతగినది.

నుండవలెను. 8. (తానుజయించిన) దేశములోని దేవతల యెడలను, సమాజోత్సవములయెడలను, విహారములయెడలను భక్తిగలవాడై ప్రవర్తించవలెను.

9. దేశములోని ముఖ్యులకు, నగరములకు, జాతులకు, సంఘములకు గూఢపురుషులు పదేపదే శత్రువుని లోపములను, విజిగీషుని మహాభాగ్యమును, అతనికి వారియందుగలభక్తిని, గౌరవమును ప్రకటించవలెను. 10. వారికి సంప్రదాయసిద్ధముగ లభించిన భోగములను పరిహారములను రక్షణలను గౌరవించి వారిని వినియోగించుకొనవలెను.

11. అతడు వారిదేవత లందరికిని, వారి ఆశ్రమములకును పూజ లొనరించవలెను; విద్యయందు, వాక్కునందు, ధర్మాచరణమందు ప్రఖ్యాతిగాంచినవారికి భూదానములను ద్రవ్యదానములను పరిహారదానములను చేయవలెను; కారాగారబంధితులనందరిని విడుదలచేయవలెను; దీనులను, అనాథులను, వ్యాధితులను రక్షించవలెను. 12. నాలుగుమాసములలో నొకపక్షముకాలము, పూర్ణిమల సందర్భమున నాలుగురోజులు, రాజదేశనక్షత్రముల సందర్భములో నొకరోజు జంతుహింసను మాన్పించవలెను. 13. స్త్రీవధను, బాలవధను, పుంస్త్వవధను నిషేధించవలెను.

14. కోశమునకు సైన్యమునకు నష్టము కలిగించునట్టియు, ధర్మ విరుద్ధము లగునట్టియు ఆచారములను నిషేధించి, ధర్మ వ్యవహారమును స్థాపించవలెను.

15. చోరత్వము వృత్తిగ ననుసరించువారిని, మ్లేచ్ఛజాతులవారిని, దుర్గరాష్ట్ర దండముఖ్యులను ఒకేస్థానమం దుండనట్లుగను, స్థానములను మార్చునట్లుగను చేయవలెను. 16. శత్రువుఅనుగ్రహమునకు పాత్రులుగనుండిన మంత్రిపురోహితాదులను శత్రుదేశపు పొలిమేరలకు పంపి, వివిధస్థానములలో నివసించునట్లు చేయవలెను. 17. అపకార సమర్థులను, అపకారముచేయ దలచువారిని రహస్యదండముచే నణచవలెను. 18. (ఉద్యోగములనుండి) తొలగింపబడినవారి స్థానములలో స్వదేశీయులనుగాని, శత్రువుకోపమునకు గురియైనవారినిగాని నియమించవలెను.

19. శత్రు వంశమునకుచెందిన వాడెవడైన ప్రత్యాదేయమగు భూమి నాక్రమించగలవాడని తోచినప్పుడు; లేదా, పొలిమేరలోని అడవులలో నివసించు ముఖ్యుడెవడైన చిక్కులు కలిగించువాడని తోచినప్పుడు; వారికి గుణహీనమగు భూమినిగాని, గుణవంతమగు భూమిలో నాల్గవభాగమునుగాని కోశదండరూపమగు కప్పమును నిర్ణయించి ఇయ్యవలెను. 20. కప్పమును చెల్లించు సందర్భములో వారియెడల పౌరులకు జానపదులకు క్రోధముకలుగునట్లు దానిని నిర్ణయించవలెను; క్రోధము కలిగినప్పుడు వానిని వీరిచేతనే చంపించవలెను. 21. ప్రజల అభిమానమును కోల్పోయినవాని నుద్యోగమునుండి తొలగించవలెను; లేదా, ప్రమాదకరమగు ప్రాంతమునకు పంపివేయవలెను.

22. ఇంతకు పూర్వము తనఅనుభవములోనుండిన (మధ్యకాలమున విడిపోయి తిరిగిలభించిన) దేశము విషయములో—ఏలోపమువలన తా నా దే శ మును కోల్పోవలసివచ్చినదో ఆలోపమును సవరించుకొని, ఏ సుగుణము వలన దానిని తిరుగ జయించుట సాధ్యమయ్యెనో ఆసుగుణమును బలపరుచుకొనవలెను.

23. పిత్ర్యమగు దేశమువిషయమున తనతండ్రిలోని దోషములను కప్పిపుచ్చి, తనలోని సుగుణములను ప్రదర్శించవలెను.

24. (శ్లో) ఇంతకుపూర్వ మాచరణములోలేని ధర్మము నతడు ప్రవేశపెట్టవలెను; ఇతరులు ప్రవేశపెట్టిన ధర్మమును ప్రవర్తింపజేయవలెను. ధర్మవిరుద్ధమగు నాచారము దేనినిగూడ అతడు ప్రవేశపెట్టరాదు; ఇతరులు ప్రవేశపెట్టిన ధర్మవిరుద్ధములగు నాచారములను నిషేధించవలెను.

ఇది దుర్గలంభోపాయమను పదమూడో అధికరణమందు లబ్ధప్రశమనము అనే అయిదో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు దుర్గలంభోపాయమను పదమూడో అధికరణము సమాప్తము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## పదునాలుగో అధికరణము

## ఔపనిషదికము

### అధ్యాయము 1

### ప్రకరణము 177 : పరబలఘాత ప్రయోగము

**1.** చాతుర్వర్ణ్య రక్షణార్థ మత డధర్మప్రవర్తనము కలవారియెడల నౌప నిషదికమును (రహస్యసాధనములను) ప్రయోగించవలెను.[1]

**2.** నమ్మదగినదేశము, వేషము, వృత్తి, భాష, కులములుగల కుబ్జులు, వామనులు, కిరాతులు, మూగవాండ్రు, చెవిటివాండ్రు, జడులు, అంధులు మొద లగువారి వేషములధరించిన మ్లేచ్ఛజాతి స్త్రీపురుషులు విశ్వాసపాత్రులై కాల కూటాది విషములను శత్రుశరీరోపభోగ్యములగు వస్తువులలో ప్రవేశపెట్ట వలెను.

**3.** శత్రురాజు క్రీడలలో నుపయోగించు వస్తువులలోను, అతని యుప యోగమునకై ప్రత్యేకింపబడిన భాండాగారములందలి వస్తువులలోను గూఢ చారులు శస్త్రములను ప్రవేశపెట్టవలెను; అట్లే, రహస్యకార్యములందు నియుక్తులై రాత్రులలో సంచారముచేయు గూఢపురుషులు అగ్నిజీవులు ఆవస్తువులలో అగ్నిని ప్రవేశపెట్టవలెను.

---

[1] ఈ సాధనములన్నియు మోసముతో కూడినట్టివి. ఇవి చాతుర్వర్ణ్యమును రక్షించుటకై ఉపయోగింపబడుటచేతను, వీనిని అధర్మముగ ప్రవర్తించు వారిపైనమాత్రమే ఉపయోగించుట చేతను, ఇందులో దోషమెట్టిదియులేదు. ఈ సాధనములలో విషపదార్థములను తయారుచేసి, వానిని ప్రయోగించుట ప్రధానస్థానము వహించుచున్నది. ప్రస్తుతకాలమున యుద్ధములలో విష వాయువులను, విషక్రిముల నుపయోగించుట ధర్మమా అను వాద మీసందర్భమున గమనించదగినది.

4. చిత్రవర్ణపుకప్ప, కౌండిన్యకము, కృకణము, పంచకుష్ఠము, శత పది—వీనిచూర్ణము; ఉచ్చిదంగము, కంబలి, శతకందము, ఇధ్మము, కృక లాసము అనువాని చూర్ణము; గృహగోలికము, అంధాహికము, కృకంటకము, పూతికీటము, గోమారికము అనువానిచూర్ణము—ఈ చూర్ణములు భల్లాతకావల్గు జముల రసముతో కలిపిన ద్రవ్యము క్షణములో ప్రాణమును హరించును. ఈ చూర్ణముల పొగకూడ నిట్టిదే.

5. (శ్లో) లేదా, పైకీటకములలో నొకదానిని కృష్ణసర్పముతోను ప్రియంగువుతోను కలిపి ఉడకబెట్టి, మిశ్రమపదార్థము నెండబెట్టవలెను. ఈ పదార్థము క్షణములో ప్రాణమును హరించునట్లు చెప్పెదరు.

6. ధామార్గవ యాతుధానముల వ్రేళ్ళు భల్లాతకపుష్పముల చూర్ణముతో కలిసి యేర్పడిన మిశ్రమపదార్థము పక్షములో ప్రాణముల హరించును.

7. వ్యాఘాతకపువ్రేళ్ళు, భల్లాతకపుష్పచూర్ణము, కీటకములు—వీని కలయిక మూలమున నేర్పడిన పదార్థము మాసములో ప్రాణముల హరించును.

8. మనుష్యులను చంపుటకు కళామాత్రముచాలును; గాడిదలకు గుర్రము లకు రెండింతలు; ఏనుగులకు ఒంటెలకు నాలుగింతలు.

9. శతకర్దమము, ఉచ్చిదంగము, కరవీరము, కటుతునబి (చేదుసొరకాయ), చేపలు—వీనిని మదనకోద్రవముల కాడలతోగాని, హస్తికర్ణపలాశముల కాడలతోగాని కాల్చినపుడు పైకిలేచుపొగ ఎదుటివైపువీచుగాలితో కలిసి ఎంతదూరము వ్యాపించునో అంతదూరమువరకు ప్రాణుల నన్నిటిని హరించును.

10. పూతికీటము, చేపను, చేదుసొరకాయ, శతకర్దమము, ఇధ్మము, ఇంద్రగోపము అనువానిచూర్ణము; లేదా, పూతికీటము, క్షుద్ర, ఆరాళ, హేమము, విదారిలచూర్ణము—మేకకొమ్ముల గిట్టల చూర్ణముతో కలిసినప్పుడు లేచుపొగ దృష్టిని పోగొట్టును.

11. పూతికరంజపుఆకులు, హరితాలము, మనఃశిల, గుంజవిత్తనములు, ఎర్రపత్తికాడలు (మొదలగువాని చూర్ణమును), ఆస్ఫోటరసము, కాచు, ఆవు పిడకలతో కలిపినముద్దపొగ దృష్టిని నాశముచేయును.

12. పాముకుబుసము, పశువులపేడ, గుర్రములలద్దె, "అంధాహికము" యొక్క శిరస్సు—వీనిపొగ, దృష్టిని నాశముచేయును.

13. పావురములు, కప్పలు, మాంసముతినుజంతువులు, ఏనుగులు, మనుష్యులు, అడవిపందులు—వీనిమూత్రపురీషములు; కాసీసము, ఇంగువ, యవలపొట్టు, నూకలు, తండులములు, పత్తివిత్తనములు, కుటజముల విత్తన ములు, కోశాతకి విత్తనములు, గోమూత్రికపువ్రేళ్ళు, భాండివ్రేళ్లు, నింబము, శిగ్రు, ఫణిర్జకము, అక్షివము, పీలుకముల ముక్కలు; సర్పముయొక్కయు శఫరి

యొక్కయు చర్మము; ఏనుగువేళ్ళయు దంతములయు చూర్ణము—వీనిని మదనకోద్రవముల కాడలతోగాని హస్తికర్ణపలాశములకాడలతోగాని కాల్చినపుడు లేచుపొగ ఎంతదూరము వ్యాపించునో అంతదూరము ప్రాణులలో నొక్కొక దానిని చంపివేయును.

14. కాళి, కుష్ఠ, నడ, శతావరుల వేళ్ళు, లేదా, సర్పము, ప్రచాలకము, కృకణము, పంచకుష్ఠములచూర్ణము—వీనినుండి ఇదివరకు చెప్పినట్లు లేచు పొగగాని; లేదా, సగముపచ్చి సగముఎండిన కాడలతో కాల్చినపుడు లేచు పొగ గాని యుద్ధరంగమునకు వచ్చు శత్రువుపైని, అవస్కందకాలపు గుంపులపైని వ్యాపించినపుడు ప్రాణులందరి దృష్టిని నాశముచేయును. దీనిని ప్రయోగించు వారు "నేజనోదకము" చేత తమకండ్లను కడుగుకొని ప్రతీకారము చేసుకొనవలెను.

15. శారిక, పావురము, కొంగ, బాతు—వీని పురీషము, అర్క, అక్షి, పీలుక, స్నుహివృక్షములక్షీరముతో కలిపినముద్ద దృష్టిని నాశముచేయుకాటుక—ఇది ఉదకములనుకూడ కలుషితము చేయును.

16. యవలమూలములు, శాలిమూలములు, మదనఫలము, జాజిఆకులు మనుష్యుని మూత్రము, ప్లక్షపుప్రేళ్లు, విదారివేళ్ళు—వీనిని మూకఉదుంబర, మదన, కోద్రవకషాయములోగాని, హస్తికర్ణపలాశముల కషాయములోగాని కలిపి కాచిన పదార్థము స్మారకము తప్పునట్లు చేయును.

17. శృంగి, గౌతమవృక్ష, కంటకార మయూరపదుల సంయోగము; గుంజ, లాంగులి, విషమూలిక, ఇంగుది అనువాని సంయోగము; కరవీర, అక్షి, పీలుక, అర్క, మృగమారణుల సంయోగము—వీనిని మదనకోద్రవముల కషాయములోగాని హస్తికర్ణ పలాశముల కషాయములోగాని కలిపి కాచిన పదార్థము స్మారకముతప్పునట్లు చేయును.

18. లేదా, ఇవి అన్నియు పశుగ్రాసమును కట్టెలను ఉదకములను కలుషితములుగ జేయును.

19. కృతకండలము, బల్లి, ఇండ్లలోనిబల్లి, అంధాహికము—వీని పొగ, దృష్టిని నాశముచేయును; ఉన్మాదమును కలిగించును.

20. కృకలాసము (బల్లి), గృహగోళికము (ఇంటిబల్లి)—వీని సంయోగము కుష్ఠరోగమును తెచ్చును. 21. ఈ సంయోగము చిత్రవర్ణపుకప్ప పేగులతోను తేనెతోను కలిసినప్పుడు ప్రమేహరోగమును తెచ్చును; మనుష్య రక్తముతో కలిసినప్పుడు క్షయరోగమును తెచ్చును.

22. దూషీవిషము, మదనకోద్రవములచూర్ణము—వీని సంయోగము నాలుకను చైతన్యహీనము చేయును.

23. మాతృవాహకము, అంజలికారము, ప్రచలాకము, కప్ప, అక్షి పీలుకము—వీని సంయోగము విషూచిరోగమును తెచ్చును.

24. పంచకుష్ఠము, కౌండిన్యకము, రాజవృక్షపుష్పములు, తేనె—వీని సంయోగము జ్వరమును తెచ్చును.

25. భాసనకులములమాంసము, జిహ్వాగ్రంధికలసంయోగమును గాడిదె పాలతో కాచినపదార్థము నెలరోజులలోగాని పక్షమురోజులలోగాని మూగవానిని గను చెవిటివానినిగను చేయును.

26. పురుషునివిషయములో కలామాత్రమనియు, తక్కినవాని విష యములో నధికమనియు నిదివరకు చెప్పియున్నాము.

27. ఓషధులవిషయములో ముక్కలకషాయము, ప్రాణులవిషయములో చూర్ణము, అందరివిషయములో కషాయములు వీర్యవత్తరములగును. 28. ఇది సంయోగముల సంపద.

29. శాల్మలీ విదారీ ధాన్యములతో తయారుచేయబడినట్టియు, మూలవత్స నాభములచే జతపరుపబడినట్టియు, కస్తూరిఎలుక నెత్తురు పూయబడినట్టియు బాణము తగిలి గాయపడినవాడు (పిచ్చెత్తి) పదిమందిని కొరుకును; వారిలో నొక్కొకరు పదిమందిని కొరికెదరు.

30. భల్లాతకము, యాతుధానము, అవాను, ధామార్గవము, బాణముల పుష్పములతో ఏలకులు, అక్షి, గుగ్గిలము, హాలాహలము అనువానిని కలిపికాచిన కషాయములో మేకనెత్తురు మనుష్యుని నెత్తురు కలిపినపదార్థము కొరుకున్వభా వమును కల్పించును. 31. అర్ధధారణము పరిమాణముగల ఈపదార్థమును యవల పిండితోను గానుగపిండితోను కలిపి నీటిలో పడవేసినయెడల నూరుధనుస్సుల వైశాల్యముగల తటాకము విషపూరిత మగును. 32. దీనిని మ్రింగినట్టియు స్పృశించినట్టియు చేపలు విషపూరితములగును; ఈనీటిని త్రాగువారు స్పృశించు వారుకూడ నిట్టివా రగుదురు.

33. గోధామృగమొకటి ఒంటెఆకారముగలపాత్రలో నెర్రని తెల్లని అవాలతోకూడ ఉంచబడి, మూడుపక్షముల కాలము భూగర్భముననుండి, అటు తర్వాత మరణశిక్షకు పాత్రుడైనవానిచే పైకి తీయబడవలెను. అట్టిది దేనిపై దృష్టిని ప్రసరించునో అది వెంటనే చనిపోవును; నల్లసర్పముకూడ నిట్టిదే.

34. పిడుగుపడుటచేత కాలుచుండుబొగ్గు, పిడుగుపడుటచే పుట్టినమంట, పిడుగుపడుటచే కాలినకట్టె—ఇవిఅన్నియు కలసి వృద్ధిచేసిన అగ్నిసమక్షమున కృత్తికాభరణీనక్షత్రములందు రుద్రపూజను గావించినయెడల నట్టియగ్ని శత్రువు పైప్రయోగింపబడి తిరుగులేక జ్వలించును.

35. (శ్లో) కమ్మరినుండితెచ్చిన అగ్నిలో తేనెను, మద్యము తయారు చేయువానినుండి తెచ్చిన అగ్నిలో మద్యము, మార్గమునుండితెచ్చిన అగ్నిలో నేతిని హోమము చేయవలెను.

36. (శ్లో) పతివ్రతనుండి తెచ్చినఅగ్నిలో పుష్పమాలను, వేశ్యనుండి తెచ్చినవానిలో ఆవాలను, పురుడుపోసుకొనిన స్త్రీనుండి తెచ్చినదానిలో పెరుగును, ఆహితాగ్నిలో తండులములను హోమము చేయవలెను.

37. (శ్లో) చండాలునినుండి తెచ్చిన అగ్నిలో మాంసమును, చితాగ్నిలో మనుష్యమాంసమును, అగ్నులన్నిటిలో మేకకొవ్వును మానుషధ్రువమును హోమము చేయవలెను.

38. (శ్లో) మంత్రముల నుచ్చరించుచు నగ్నిలో రాజవృక్షపు సమిధలను వేయవలెను. ఈ అగ్నికి ప్రతీకారము లేదు. ఇది శత్రువులకండ్లకు దిగ్భ్రమ కలిగించును.

39. హే అదితి, నీకునమస్కారము, హే అనుమతి, నీకునమస్కారము, హే సరస్వతి, నీకు నమస్కారము, హే సవితా, నీకునమస్కారము. 40. అగ్నికి స్వాగతము, సోమునికి స్వాగతము, భూమికి స్వాగతము, భువమునకు స్వాగతము.

ఇది ఔపనిషదికమను పదునాలుగోఅధికరణమందు పరబలఘాత ప్రయోగ మనే మొదటి అధ్యాయము.

# పదునాలుగో అధికరణము

## అధ్యాయము 2

### ప్రకరణము 178 : ప్రలంభనము[1] (అందు అద్భుతోత్పాదనము)

1. నేతితోకలిపిన శిరీషోదుంబర, శమీచూర్ణములు పక్షముకాలమువరకు ఆకలిలేకుండ జేయును. 2. కశేరుకము, తామరవేరు, చెరుకువేరు, తామర తూళ్ళు, దూర్వము—వీనిచూర్ణము పాలు, నెయ్యి, మీగడలతో కలిపి సేవించినయెడల నెలరోజులు ఆకలివేయదు.

3. మినుములు, యవలు, కులుద్ధము, దర్భలవేరు—వీనిచూర్ణమును పాలలో నేతిలో కలిపినదానిని ; సమపాళ్ళలో కలిపి, ఉడికించినవల్లి, క్షీరము, నెయ్యి అనువానిని ; సాలవేరు, పృశ్నిపర్ణివేరు, నెయ్యి అనువాని మిశ్రమమును, దీనిని పాలు తేనె నెయ్యి—అనువానితోకలిపి ఉడికించిన పదార్థమును సేవించిన యెడల నెలరోజు లుపవానము చేయవచ్చును.

4. తెల్లమేకలమూత్రములో ఏడురాత్రులు నానవేసిన ఆవాలనుండి తీసిననూనెను ఒకటిన్నరనెలరోజులు చేదుసొరకాయలో ఉంచిఉపయోగించిన యెడల చతుష్పాత్తులు ద్విపాత్తులు విరూపముగాంచును.

5. ఏడురాత్రులు యవలను తిని పాలను త్రాగిన తెల్లగాడిదపేడలో పెట్టిన యవలతో కాచబడిన తెల్లఆవాలనూనె విరూపమును కలిగించును.

6. తెల్లమేకయొక్కయు తెల్లగాడిదయొక్కయు మూత్రపురీషములతో

---

[1] ప్రలంభనమనగా మోసముచేయుట. అద్భుత క్రియలచే శత్రువును మోస పుచ్చువిధాన మీఅధ్యాయమందు వివరించబడినది. అద్భుతములగు ఔషధములను ప్రయోగించి శత్రుసైనికులను విరూపులను చేయవచ్చును ; వారిని గ్రుడ్డివారుగను, స్మృహతప్పిపోవు వారుగను, దిగ్భ్రమకలుగునట్టివారుగను చేయవచ్చును, వీనిమూలమున స్వసైనికులకు నిప్పులపైన నడుచుట, అలనటలేక దూరప్రయాణముచేయుట, శత్రువునకు కనిపించక యుద్ధము చేయుట మొదలగు అద్భుతశక్తులు కలుగును.

కలిపికాచిన తెల్లఆవాలనూనెలో కలిపినఅర్క, తూల, పతంగచూర్ణము మనిషి రంగును తెల్లగజేయును.

7. తెల్లకోడి, అజగరముల మలమును కలిపి పూసినను తెల్లరంగు వచ్చును.

8. తెల్లమేకమూత్రములో ఏడురాత్రులుంచిన తెల్లఆవాలు, మజ్జిగ, అర్కక్షీరము, ఉప్పు, ధాన్యము—వీనిని కలిపి, పక్షముకాలముతర్వాత వాడిన యెడల శరీరమునకు తెల్లరంగువచ్చును.[2]

9. తీగెలోనుండు చేదుసొరకాయలోపల పక్షముకాలము పెట్టిన తెల్లఆవాల పిండి వెండ్రుకలను తెల్లగజేయును.

10. (శ్లో) అలోజనమనుకీటకము తెల్లనిగృహగోలికము—ఈరెంటిని కలిపి, ముద్దజేసి, వెండ్రుకలకు పూసినయెడల నవి శంఖమువలె తెల్లబడును.

11. ఆవు పేడతోగాని క్షీతింతుకారిష్టకల్కముతోగాని దేహమును రుద్ది భల్లాతకీరసమును పూసినయెడల నెలరోజులలో కుష్ఠవ్యాధి వచ్చును.

12. ఏడురాత్రులు నల్లత్రాచునోటిలోగాని గృహగోలిక నోటిలోగాని ఉంచిన గుంజాగింజలు కుష్ఠవ్యాధిని తెప్పించును.

13. చిలుకపిత్తము, దాని గుడ్డులోని రసము—వీనితో అభ్యంగనము కుష్ఠవ్యాధిని తెచ్చును.

14. ప్రియాలుకల్కకషాయము కుష్ఠవ్యాధికి మందు.

15. కుక్కుట, కోశాతకి, శతావరీ వ్రేళ్ళను తినువాడు నెలరోజులలో తెల్లరంగుకలవాడగును.

16. వటకషాయములో స్నానము చేసి, సహచరకల్కమును పూసు కొనినయెడల దేహము నల్లబడును.

17. శకున, కంగులనూనెలో కలిపిన హరితాలమనశ్శిలలు నల్లరంగును కలిగించును.

18. ఆవనూనెలో కలిపిన మిణుగురు పురుగుల చూర్ణము రాత్రియందు వెలుతురు నిచ్చును.

19. మిణుగురు పురుగుల చూర్ణము, గండూపదమను పురుగులచూర్ణము, లేదా, సముద్రజంతువులయు (ఇది ఒకవృక్షము), భృంగకపాలములయు ఖదిర ములయు కర్ణికారములయు పుష్పముల చూర్ణము—వీనిని శకున, కంగుల నూనెలో కలిపి వాడినయెడల వస్తువులు మెరుపుకలవి యగును.

20. కప్పవసతో కలిపిన పారిభద్రకపు పట్టయొక్క మసి శరీరము నగ్నితో

[2] తెల్లరంగుగలవస్తువుల నుపయోగించుటచే శరీరము తెల్లబడునను విశ్వాసముండెడిది.

ప్రజ్వలింపజేయును. 21. పారిభద్రకపు పట్టలోని పప్పు, నువ్వులు—వీనిని పూసిన శరీరము అగ్నితో ప్రజ్వలించును.

22. పీలువృక్షపుపట్టనుండి తయారుచేసిన మసిపిండము అరచేతిలో జ్వలించును (చేతిని కాల్చకుండ జ్వలించును). 23. దీనికి కప్పవసను పూసిన యెడల అగ్నితో ప్రజ్వలించును. 24. దీనినిగాని, సముద్రపుఆడకప్ప, సముద్రపు నురుగు, సర్జరసముల చూర్ణముతో కలిపిన కుశామ్రఫలతైలమునుగాని పూసినయెడల శరీరము జ్వలించును.

25. కప్ప, ఎండ్రకాయ మొదలగువాని వసను సమపాళ్ళుగ కలిపి కాచిన నూనె శరీరములోని అవయవములనన్నిటిని అగ్నితో ప్రజ్వలింపజేయును.

26. వెదురువేళ్ళు, పాచి, కప్పవస—వీనిని పూసిన శరీరము అగ్నితో ప్రజ్వలించును.

27. కప్పవసతోను, పారిభద్రక, ప్రతిబల, పంజుల, వజ్ర, కదళీ మూలముల పప్పుతోను కాచిన నూనెను పాదములకు పూసుకొనినవాడు మండుచుండు బొగ్గులపై నడువగలడు.

28–29. (శ్లో) ఉపోదక, ప్రతిబల, వంజుళ, పారిభద్రక కల్కములను కప్పవసతో ఉడికించి తైలమును తయారుచేయవలెను. పాదములను కడుగుకొని దీనిని పాదములకు పూసుకొనినవాడు పువ్వులరాశిమీద నడుచునట్లు మండుచుండు బొగ్గులరాసిమీద నడువగలడు.

30. హంస, క్రౌంచములు, నెమళ్లు, లేదా, ఉదకములలో సంచరించు తక్కిన పెద్దపక్షులు—వీనితోకలకు కట్టిన దీపములతో కూడిన తుంగలు రాత్రియందు తోకచుక్కలవలె కనిపించును.

31. పిడుగుపడుటవలన కలిగినబూడిద అగ్నిమాపక సాధనము.

32. స్త్రీరజస్సులో నానిన మినుములు, వజ్రకూలివేళ్ళు, కప్పవసతో కలిసినప్పుడు పొయ్యిమండుచుండినను పచనమునకు భంగముకలిగించును. 33. పొయ్యిని శుద్ధముచేయుట దీనికి ప్రతీకారము.

34. పీలుమయమగు ఉండలోపల నిప్పుపెట్టి, దానిని సువర్చలవేరుతో గాని నూలుతోగాని ముడివేసి, దానిచుట్టు ప్రత్తినిచుట్టి నోటియందుంచుకొనిన యెడల నోటినుండి పొగను మంటను బయటికి విడువవచ్చును.

35. కుశామ్రఫలతైలమును చల్లిన నిప్పు వర్షములోను విసరుగాలిలోను మండుచునే యుండును.

36. నూనెతోకూడినసముద్రపునురుగు నీటిపైనతేలుచు ప్రజ్వలించును.

37. తెలుపు, నలుపు రంగులుగల వెదురుతో నీటిలో ఈదుపక్షుల ఎము

కలను మథించి పుట్టించిన అగ్నిని నీళ్ళు చలార్చజాలవు ; అది నీటితోకలిసి మండుచునే యుండును.

38. శస్త్రములచేచంపబడిన మనుష్యునియొక్కగాని ఉరిశిక్షననుభవించిన వానియొక్కగాని ఎడమవైపు ఎముకలతో తెలుపు నలుపురంగులుగల వెదురును మథించి రగులుకొల్పిన అగ్నిగాని, పురుషునియొక్కగాని స్త్రీయొక్కగాని ఎముకతో మనుష్యుని పక్కఎముకను మథించి రగులుకొల్పిన అగ్నిని మూడుపర్యాయము లపసవ్యముగ ప్రదక్షిణముచేసిన ప్రదేశములో మఱియొక అగ్ని ప్రజ్వలించదు.

39. (శ్లో) కస్తూరి ఎలుక (చుచుందరి), కాటుకపిట్ట (ఖంజరీటము) క్షారకీటకములను చూర్ణముచేసి, గుఱ్ఱపుమూత్రములో కలిపినయెడల గొలుసు లనుకూడ తెంపగల సాధన మగును.

40. అయస్కాంతపాషాణము, ఎంద్రకాయ, కప్ప, క్షారకీటకములవసను పూసినపుడు రెండింతల ప్రభావముకలదియై గొలుసులను త్రెంపగలుగును.

41. క్రౌంచభాసముల పార్శ్వములతోను, తామరపువ్వుతోను, నీటితోను మర్దనముచేయబడిన పశువులోని గర్భపిండము చతుష్పాత్తులకు ద్విపాత్తులకు మంచిపాదలేపము.

42. ఒంటెచర్మముతోచేసిన పాదరక్షలకు గుడ్లగూబ గద్దలవసను పూసి మఱ్ఱిఆకులనుకప్పి ధరించినయెడల అలసటలేక యాభై యోజనముల దూరము నడువవచ్చును.

43. డేగ, కంకము, కాకి, గద్ద, హంస, క్రౌంచము, విచీరల్ల, సింహము, పులి, చిరుతపులి—వీనిమజ్జ రేతస్సు నూరుయోజనముల దూర మలసటలేక నడుచునట్లు చేయును.

44. సర్వవర్ణములవారి గర్భస్రావములనుగాని, శ్మశానములోని చని పోయిన శిశువులనుగాని ఒంటెఆకారములోనుండుపాత్రలో మర్దనముచేయుటచే లభించినమేదస్సు నూరుయోజనములదూర మలసటలేక నడుచునట్లు చేయును.

45. (శ్లో) హానికరములు అద్భుతములు అగు నిట్టి యుత్పాతముల మూల మున శత్రువును భయపెట్టవలెను ; రాజ్యములో తిరుగుబాటు జరిగినప్పుడుకూడ నిట్టి నిర్వాద చర్యలను తీసుకొనవలెను. రాజ్యమును బలపరుచుకొనుట కిదియే సాధనము.

ఇది ఔపనిషదికమను పదునాలుగో అధికరణమందు ప్రలంభనము— అందు అద్భుతోత్పాదనమనే రెండో అధ్యాయము.

# పదునాలుగో అధికరణము

## అధ్యాయము 3

### ప్రకరణము 178 : (మిగులు) ప్రలంభనము
### (అందు భైషజ్యమంత్రయోగము)[1]

1. పిల్లి, ఒంటె, తోడేలు, అడవిపంది, ముళ్లపంది, ఎగిరేనక్క, నప్త, కాకి, గుడ్లగూబ, రాత్రియందు సంచారముచేయు ఇతరపక్షులు—వీనిలో నొకదాని యొక్కగాని, రెంటియొక్కగాని, అంతకంటె నధికసంఖ్యకలవానియొక్కగాని కుడికండ్లను ఎడమకండ్లను విడదీసి, వేరువేరుగ రెండుచూర్ణములను తయారు చేయవలెను. 2. కుడికంటిచూర్ణమును ఎడమకంటికిని, ఎడమకంటిచూర్ణమును కుడికంటికిని పూసుకొనినయెడల రాత్రులయందును చీకటిలోను (వస్తువులను స్పష్టముగ) చూడవచ్చును.

3. (శ్లో) ఒకఉసిరికాయ, అడవిపందికన్ను, మిణుగురుపురుగు, నల్లశారివ—వీనిసంయోగమును కండ్లకు పూసుకొనినయెడల రాత్రులయందు రూపములను చూడవచ్చును.

4. మూడురాత్రు లుపవాసముచేసి, పుష్యమినాడు, శస్త్రహతుడో, శూలప్రోతుడో అగువాని పుర్రెలో మట్టి పోసి, అందులో యవలవిత్తనములు వేసి, గొర్రెపాలతో తడుపవలెను. 5. అటుతర్వాత అందుండిపెరిగిన యవల మొక్కలను దండగవేసుకొని తననీడగాని రూపముగాని ఎవ్వరికి కనుపించకుండ సంచారము చేయవచ్చును.

[1] మంత్రతంత్రముల మూలమునను క్షుద్రదేవతల నుపాసించుట మూలమునను అద్భుతశక్తులను సంపాదించి, శత్రువుతో మాయాయుద్ధము చేయుప్రక్రియ ఈఅధ్యాయమందు వివరింపబడినది. అభిచారహోమాదుల మూలమున సర్వశక్తులను సంపాదించిన రాక్షసుల కథలు రామాయణాది గ్రంథములలో ఎన్నియోయున్నవి. ఈఅధ్యాయములోని ప్రక్రియలుకొన్ని వానిని పోలియున్నవి.

6. మూడురాత్రులు ఉపవాసము చేసి, పుష్యమునాడు కుక్క, పిల్లి, గుడ్ల గూబ, ఎగిరేనక్కల కుడికండ్లను ఎడమకండ్లను విడదీసి వేరువేరుగ చూర్ణములనుతయారుచేయవలెను. 7. అటుతర్వాత నాయాకండ్లచూర్ణముల నాయా కండ్లకు పూసుకొనినయెడల తననీడగాని రూపముగాని ఎవ్వరికి కనుపించకుండ సంచారము చేయవచ్చును.

8. మూడురాత్రులు ఉపవాసముచేసి, పుష్యమునాడు ఒకఘాతుకునితొడ ఎముకనుండి ఒకశలాకను (కడ్డి) ఒకకాటుకభరణిని తయారుచేయవలెను. 9. అటుతర్వాత వీనిలో నొకదానికంటి చూర్ణమును పూసుకొని తననీడగాని రూపముగాని ఎవ్వరికి కనిపించకుండ సంచారము చేయవచ్చును.

10. మూడురాత్రులు ఉపవాసము చేసి, పుష్యమినా డొక ఇనుపశలాకను కాటుకభరణిని తయారుచేయవలెను. 11. అటుతర్వాత రాత్రులలో సంచారము చేయుప్రాణులలో నొకదాని పుర్రెను కాటుకతోనింపి, దానిని మరణముగాంచిన స్త్రీయోనియందుంచి కాల్చవలెను. 12. ఆకాటుకను పుష్యమునాడుపైకి తీసి అదే భరణిలో నుంచవలెను. 13. ఆకాటుకను పెట్టుకొనినవాడు తననీడనుగాని రూపమునుగాని ఎవ్వరికి కనుపించకుండ సంచారము చేయుగలడు.

14. ఆహితాగ్నియగు బ్రాహ్మణుడు చితిపైన కాలిపోవుటనుగాని కాలి పోవుచుండుటనుగాని చూచి మూడురాత్రులుపవాసముండి పుష్యమిరోజున స్వయం మృతుడైనవాని వస్త్రమును సంచిగాచేసుకొని, దానిలో చితాభస్మమునువేసి, దానిని ధరించుకొనినవాడు తననీడగాని రూపముగాని ఎవరికి కనబడకుండునట్లు సంచరించ గలడు.

15. బ్రాహ్మణుని ప్రేతకార్యమందు వధింపబడిన వృషభముయొక్క అస్థి మజ్జాచూర్ణముతోనింపిన పాముకుబుసమును ధరించిన పశువు లెవరికిని కను పించకుండ సంచరించగలవు.

16. సర్పదష్టుడగువాని చితాభస్మముతో నింపిన ప్రచలాకచర్మము లెళ్ళను కనుపించకుండ చేయును.

17. గుడ్లగూబయొక్కయు ఎగిరేనక్కయొక్కయు తోక, పురీషము, మోకాలిఎముకల చూర్ణముతోనింపిన పాముకుబుసము పక్షులను కనిపించకుండ చేయును.

18. ఇవి అంతర్ధానమగుట కెనిమిది యోగములు.

19. (శ్లో) విరోచనునికుమారుడగు బలిని, శతమాయుడగు శంబరుని, భంధీరపాకుని, నరకుని, నికుంభుని, కుంభుని నేను నమస్కరించుచున్నాను.

20. (శ్లో) దేవలుని నారదుని నమస్కరించుచున్నాను; సావర్ణిగాలవుని నమస్కరించుచున్నాను. వీరి ప్రక్రియలసాధనమున మీరు నిద్రమత్తు చెందితిరి.

21. (శ్లో) ఎట్లు అజగరములు నిద్రించుచున్నవో, ఎట్లు చమూఖలములు నిద్రించుచున్నవో, అట్లే పురుషులు నిద్రించెదరుగాక! కుతూహలులగు గ్రామవాసులుకూడ నట్లే నిద్రించెదరుగాక!

22. (శ్లో) వేయి భాండములతోను నూరురథనేములతోను నే నీగృహమును ప్రవేశించెదను. భాండములు నిశ్శబ్దముగ నుండుగాక!

23–24 (శ్లో) మనువును నమస్కరించి, కుక్కలశాలలను బంధించి, దేవలోకములందలి దేవతలకు మానవులలో బ్రాహ్మణులకు, అధ్యయనపారగలగు సిద్ధులకు, కైలాసవాసులగు తాపసులకు, ఇట్టిసిద్ధులందరికి నమస్కారము చేసి, మీయందరికి మహత్తరమగు నిద్రను తెగలిగితిని.

25. నేను దూరము వెళ్ళుచున్నాను; వీరుకూడ కలిసివెళ్ళిపోయెదరుగాక!

26. ఓ అలిత, ఓ వలిత, మనువునకు స్వాగతము.[2]

27. దీనిప్రయోగము. 28. మూడురాత్రు లుపవాసముచేసి, పుష్యమీనక్షత్రయుక్తమగు బహుళచతుర్దశినాడు శ్వపాకస్త్రీహస్తమునుండి బిలఖావకలేఖనముల కొనవలెను.[3] 29. వానిని మినుములతో నొకగంపలోపెట్టి, సమ్మార్గములేని శ్మశానములో పాతివేయవలెను. 30. మరుసటిచతుర్దశినాడు వానిని పైకితీసి, పెండ్లికానికన్యచేత వానిని చూర్ణముగ చేయించి మాత్రలు కట్టవలెను. 31. పై మంత్రము నుచ్చరించుచు ఎచట నీమాత్ర వేయబడునో అచటనుండు వారందరు నిదురలో మునిగిపోయెదరు.

32. అదేవిధముగ ఒకడు మూడునల్లగీతలు మూడుతెల్లగీతలుగల ముళ్లపందిముల్లు నొకదానిని సమ్మార్గములేని శ్మశానములో పూడ్చిపెట్టవలెను. 33. దానిని రెండవచతుర్దశినాడు పైకితీయవలెను. అటుతర్వాత దానితో చితాభస్మమును చేర్చి ఈ క్రింది మంత్రము నుచ్చరించుచు ఏప్రదేశమందైన పడవేసిన యెడల నచట నుండువారందరు నిద్రలో మునిగిపోయెదరు.

34. (శ్లో) సువర్ణపుష్పములతో కూడిన బ్రహ్మణికి, కుశధ్వజుడగు బహ్మమునకు, దేవత లందరికి తాపసు లందరికి నమస్కారము చేయుచున్నాను.

35. (శ్లో) బ్రాహ్మణులందరు నాకు వశులగుదురుగాక! భూమిపాలురగు క్షత్రియులు నాకు వశులగుదురుగాక! వైశ్యులు శూద్రులు సర్వదా నాకు వశు లగుదురుగాక!

---

[2] 19–26 సూత్రము లందొక మంత్ర ముదాహరింపబడినది. ఇదియొక ప్రస్వాపన మంత్రము. దీనిని పఠించిన ఫలితముగ నితరులు నిద్రమత్తులో పడి పోయెదరు.

[3] బిలఖము లనగా బిలము (కన్నము) నుచేయు ఎలుకలు మొదలగునవి. బిలఖావక లేఖనము లనగా, అవి కొరికి పారవేసిన వస్తువులు.

**36.** స్వాగతము! ఓ అమిల, ఓ కిమిల, ఓ వయుచార, ఓ ప్రయోగ, ఓ ఫక్క, ఓ వయుహ్వ, ఓ విహాల, ఓ దంతకటక—స్వాగతము!

**37.** (శ్లో) కుక్కలు సుఖముగ నిద్రించుగాక! గ్రామములోని కుతూహలులందరు నిద్రించెదరుగాక! మూడుతెల్లగీతలుగల ఈముళ్ళపందిముల్లు బ్రహ్మచే సృష్టింపబడినది.

**38.** (శ్లో) సిద్ధించిన కోరికలు కలవారందరు నిద్రించుచున్నారు; గ్రామసీమాంతములవరకు, సూర్యోదయమువరకు ఈనిద్ర మిమ్ముల వశము చేసుకొనవలెను.

**39.** స్వాగతము.

**40.** పై మంత్రమునకు[4] ప్రయోగము : **41.** మూడుతెల్లగీతలుగల పంది ముండ్లను సంపాదించవలెను; తర్వాత ఏడురాత్రు లుపవాసముచేసి కృష్ణపక్ష చతుర్దశినాడు నూటయెనిమిది ఖాదిరసమిధలను తేనెతోను నేతితోను పైమంత్రము నుచ్చరించుచు అగ్నిలో హోమము చేయవలెను. **42.** తర్వాత ముండ్లలొనొకటి గ్రామద్వారమందుగాని, ఇంటి ముందరగాని ఎచట పూడ్చబడునో అచట నుండు వారందరు నిద్రమత్తు గాంచెదరు.

**43.** (శ్లో) విరోచనుని కుమారుడగు బలికి, శతమాయుడగు శంబరునికి నికుంభునికి, నరకునికి, కుంభునికి, మహాసురుడగు తంతుకచ్చునికి నమస్కారము.

**44.** (శ్లో) అర్మాలవునికి, ప్రమీలునికి, మండోలుకునికి, ఘటోద్బలునికి, కృష్ణకంసుల ఉపచారమునకు, యశస్వియగు పౌలోమికి నమస్కారము.

**45.** (శ్లో) కార్యసిద్ధికై అభిమంత్రించి శారికాశవమును గ్రహించుచున్నాను. దానికి జయమగుగాక! అది జయించగలదు. శలకభూతములకు స్వాగతము!

**46.** (శ్లో) కుక్కలు సుఖముగ నిద్రపోవుగాక! గ్రామములో కుతూహలులు నిద్రపోవుదురుగాక! మే మేప్రయోజనమును కోరుచున్నామో ఆప్రయోజనమును సాధించినవారు సూర్యాస్తమయము మొదలు సూర్యోదయమువరకును నా కార్యము ఫలవంత మగువరకును నిద్రపోవుదురుగాక!

**47.** స్వాగతము![5]

**48.** పైమంత్రమునకు ప్రయోగము : **49.** నాలుగు పూటలు ఉపవాసము చేసి కృష్ణచతుర్దశినాడు సమ్మర్దములేని శ్మశానములో బలినియ్యవలెను; అటుతర్వాత శారికాశవమును పందిముట్టెతో కూడినసంచిలో పెట్టి కట్టవలెను. **50.** దానిమధ్య భాగము నొకముండ్లపంది ముల్లుతో పొడిచి, ఈమంత్రము నుచ్చరించి దాని

[4] 34–39 సూత్రములలోనిది మంత్రము.

[5] 43–47 సూత్రములలోనిది మంత్రము.

నెచ్చట పూడ్చిన అచ్చట నుండువారందరు నిద్రమత్తు గాంచెదరు.

51. (శ్లో) నేను అగ్ని, (ఇతర) దేవతలు, దశదిశలు—వీనిశరణము గాంచుచున్నాను ; అన్నియు వెళ్ళిపోవుగాక! అన్నియు నాకు వశమగుగాక !

52. స్వాగతము![6]

53. పై మంత్రమునకు ప్రయోగము : 54. మూడు రాత్రులు ఉపవాసము చేసి, పుష్యమినా డిరువదియొక్క గులకరాళ్ళను సేకరించి, తేనెతోను నేతితోను హోమము చేయవలెను. 55. అటుతర్వాత నారాళ్ళను గంధమాల్యములతో పూజించి పూడ్చివేయవలెను. 56. మరుసటిపుష్యమినాడు వానినిపైకితీసిమంత్రము నుచ్చరించుచు ఒక రాతితో ఇంటితలుపును కొట్టవలెను. 57. నాలుగురాళ్ళతో కొట్టినవెంటనే తలుపులు తెరచుకొనును.

58. నాలుగుపూటలుపవాసముచేసి, కృష్ణపక్షచతుర్దశినాడు, విరిగిన పురుషుని ఎముకలతో నొకఎద్దును తయారుచేయవలెను ; తర్వాత దాని నీమంత్రముచే నభిమంత్రించవలెను. 59. రెండెడ్లబండియొకటి తనవద్దకు తేబడును. 60. అది మొదలు తాను ఆకాశమందు సంచరించుశక్తికలవా డగును. 61. సూర్యునిపోలిక గలవాడై ద్వారబంధమున కావలనుండు ప్రతివస్తువును ప్రవేశించును.

62. "చండాలస్త్రీయొక్క చేదుసొంకాయతుంబ కుంభమునకుగల చేదు బలము నీకు గలదు. ఆమెభగముకూడ నీ కున్నది. స్వాగతము." 63. ఇంటితాళముల తెరచుటకు, అందరికి నిద్రమత్తు కలిగించుట కిది సాధనము.

64. మూడురాత్రు లుపవాసము చేసి పుష్యమినాడు శస్త్రహతుడో శూలప్రోతుడో అగువాని పుర్రెలో మట్టి పోసి, అందు తువరిగింజలనునాటి నీళ్లుచల్లవలెను. 65. అవి మొలకెత్తినతర్వాత పుష్యమినాడే వానిని పైకితీసి త్రాడుగ పేనవలెను. 66. తర్వాత దానిని ధనుస్సుల యెదుటగాని తీగెలతోకూడిన యంత్రముల యెదుటగాని ఛేదించినయెడల తీగెలన్నియు తెగిపోవును.

67. స్త్రీగాని పురుషుడుగాని మట్టిలో శ్వాసను వదలినతర్వాత, ఆమట్టిని నీటిపాముచర్మములో నింపవలెను ; అది ముక్కును బంధించుటకు నోటిని కట్టివేయుటకు సాధనము.

68. శ్వాసను వదలినమట్టిని పందిచర్మపు సంచిలో నింపి, కోతినరములతో దానిని కట్టవలెను. మూత్ర పురీషముల స్తంభన కిది సాధనము.

69. కృష్ణపక్షచతుర్దశినాడు రాజవృక్షపుకర్రతో శత్రువుబొమ్మ నొకదానిని చేసి శస్త్రహతమగు కపిలగోవు పిత్తమును దానికండ్లకు పూయవలెను. అతనిని గ్రుడ్డివానిగ జేయుట కిది సాధనము.

---

[6] 51–52 సూత్రములలోనిది మంత్రము.

70. నాలుగుపూట లుపవాసము చేసి, కృష్ణపక్షచతుర్దశినాడు బలి నిచ్చి శూలప్రోతుడగువాని ఎముకలతో నాలుగుకీలకములను (మేకులు) తయారు చేయవలెను. 71. వీనిలో నొకదానిని శత్రువుమూత్రపురీషములలో గ్రుచ్చిన యెడల నతని మూత్రపురీషములు స్తంభించును; అతడు నడుచు మార్గ మందుగాని కూర్చుండుచోటగాని నొకదానిని నాటినయెడల క్షయవ్యాధిచే నతడు మరణించును; అతని పణ్యస్థానమునగాని క్షేత్రమునగాని ఇంటియందుగాని నాటినయెడల నతనికి వృత్తిచ్ఛేదము సంభవించును.

72. పిడుగుపడుటవలన కాలినచెట్టునుండి తయారుచేయబడిన కీలకముల విషయమును దీనినుండి గ్రహించవలెను.

73–74. (శ్లో) ఎవని గృహములో పునర్నవము తలక్రిందు లగునో, ఎవనిగృహములో ప్రేతవస్త్రములో కట్టిన నింబము, కామమధువు, కోతివెంద్రుకలు, మనుష్యుని ఎముకలు పూడ్చబడునో, ఎవని అడుగుజాడలలో నవి వేయ బడునో, వాడు మూడుపక్షములు గడుచుటకుముందే భార్యా పుత్ర ధనములతో కూడ నశించును.

75–76. (శ్లో) ఎవని అడుగుజాడలలోగాని, ఇంటిముందుగాని, శిబిర మందుగాని, గ్రామమందుగాని, నగరమందుగాని పునర్నవము తలక్రిందుగను, నింబము, కామమధువు, స్వయంగుప్తము, మనుష్యుని ఎముకలు పూడ్చివేయ బడునో వాడు మూడుపక్షములు గడచుటకుముందే భార్యాపుత్రధనములతో గూడ నశించును.

77. (శ్లో) (విజిగీషువు) అతడు మేక, కోతి, పిల్లి, ముంగిస, బ్రాహ్మణులు, శ్వపాకులు, కాకి, గుడ్లగూబ—వీని రోమములను సంపాదించవలెను. శత్రుపురీష మందు వీనిని కలిపి మర్దించిన క్షణముననే అతడు నాశముగాంచును.

78. (శ్లో) ఎవని అడుగుజాడలో ప్రేత పుష్ప మాలికలు, పొంగిన మద్యము, ముంగిస వెంద్రుకలు, తేలు, తేనెటీగ, పాముల చర్మము పూడ్చబడునో అవి అక్కడ నుండునంతవర కతడు పుంస్త్వమును కోల్పోవును.

79. మూడురాత్రు లుపవాసముచేసి, శస్త్రహతుడో శూలప్రోతుడో అగువాని పుర్రెలో పుష్యమినాడు మట్టినిపోసి, అందు గుంజిగింజలను నాటి నీటిని చల్లవలెను. 80. అవి మొలకలెత్తిన తర్వాత పుష్యమినక్షత్రయుక్తమగు అమావాస్యనాడుగాని పౌర్ణమినాడుగాని వానిని పెరికి చుట్టలుగ చుట్టవలెను. 81. వానియందుంచిన అన్నపానభాండము లెప్పటికిని క్షయమును పొందవు.

82. రాత్రియందు ప్రదర్శనము జరుగుచున్నప్పుడు చచ్చిన గోవుయొక్క స్తనములను ఛేదించి దీపపుమంటలో కాల్చివేయవలెను. 83. అవి కాలిన తర్వాత వానిని ఎద్దుయొక్క మూత్రముతో కలిపి మర్దించి, మర్దనము నొక కొత్తకుండ

లోపలిభాగమునకు పూయవలెను; 84. తర్వాత దానిని గ్రామముచుట్టు నపసవ్యముగ తీసుకొని వెళ్ళవలెను; అటుపిమ్మట నెచ్చట నది ఉంచబడునో అచ్చట నుండు వెన్న అంతయు అందులోనికి వచ్చి చేరును.

85. కృష్ణపక్షచతుర్దశినాడు పుష్యమీనక్షత్ర సంయుక్తకాలమున ఆడకుక్క యోనియందు కాల్చిన ముద్రికను ప్రవేశపెట్టవలెను. 86. అది స్వయముగ పడిపోయినతర్వాత దానిని తీసుకొనవలెను. 87. దానిని చేతనుంచుకొని ఏ వృక్ష ఫలములను కోరిన ఆ ఫలములు లభించును.

88. (శ్లో) మంత్రములతోను ఔషధములతోను కూడిన ప్రక్రియల సాధనమునను, మాయల సాధనమునను అతడు శత్రువులను నాశముచేసి, స్వజనమును రక్షించవలెను.

ఇది ఔపనిషదికమను పదునాలుగో అధికరణమందు ప్రలంభనము—అందు భైషజ్య మంత్రయోగము అనే మూడో అధ్యాయము.

# పదునాలుగో అధికరణము

## అధ్యాయము 4

### ప్రకరణము 179 : స్వబలోపఘాత ప్రతీకారము[1]

1. స్వపక్షముపై శత్రువు ప్రయోగించిన దూషీవిషము మొదలగు విషములకు ప్రతీకారము :

2. శ్లేష్మాతకము, కపిత్థము, దంతి, దంతిశారము, గోజి, శిరీషము, పాటలి, బల, స్యోనాగము, పునర్నవము, శ్వేతవరణము—వీని కషాయముతో కలిసినట్టియు, చందనముతోను ఆడతోడేలురక్తముతోను కలిసినట్టియు నేజనోదకము[2] రాజుచే ననుభవింపబడు స్త్రీల గుహ్యావయవముల ప్రక్షాళనమున కుపయోగించవలెను ; సేననలపై ప్రయోగించిన విషములకు కూడ నిదియే విరుగుడు.

3. రంగులలేడి, ముంగిస, నెమలి, గోధామృగముల పిత్తము అనుదానితోను ; సింధువారితము, వరుణము, వారుణి, తండులీయకము, శతపర్వపిండాంతకముల చిగుళ్లు—వీని సంయోగముతోను[3] కలిపిన మహారాజిచూర్ణము మత్తెక్కించు పదార్థములకు విరుగుడు.

4. సృగాలవిన్న, మదనము, సింధువారితము, వరణము, వల్లి—వీనిలో నొక్కదానియొక్కగాని అన్నిటియొక్కగాని కషాయమును పాలతో కలిపి త్రాగిన యెడల మత్తెక్కించు పదార్థములవలన కలుగు దోషమును హరించును.

5. కైదర్యము, పూతి, నువ్వులు—వీని నూనెను ముక్కురంధ్రములకు పూసినయెడల ఉన్మాదము తొలగిపోవును.

6. ప్రియంగు నక్తమాలల సంయోగము కుష్ఠరోగమును కుదుర్చును.

---

[1] తన సైన్యములకు కలిగిన బాధలకు విరుగుడు.

[2] నేజనోదకము—స్నానముచేయుట కుపయోగించు నీళ్లు.

[3] సంయోగ మనగా రెండు మూడు వస్తువులను మిశ్రమము చేయుట.

7. కుష్ఠము, లోధ్రము—వీని సంయోగము నెరసిన వెండ్రుకలకు, క్షయ వ్యాధికి విరుగుడు.

8. కటఫలము, ద్రవంతి, విలంగములచూర్ణము నస్యముగ లుపయోగించిన యెడల శిరోరోగము కుదురును.

9. ప్రియంగు, మంజిష్ఠ, తగరము, లక్కారసము, మధుకము, పసుపు, తేనె—వీని సంయోగము ఉరిపోసుకొనుటచేతను, నీళ్ళలో మునిగిపోవుటచేతను, విషప్రయోగముచేతను, క్రిందపడుటచేతను స్పృహతప్పినవారికి స్పృహను తెచ్చును.

10. మనుష్యుల కొక అక్షము, పశువులకు గుర్రములకు రెండింతలు, ఏనుగులకు ఒంటెలకు నాలుగింతలు—ఇవి ప్రయోగపరిమాణములు.

11. వీని మాత్రలలోపల బంగారమునుపెట్టి ఉపయోగించినయెడల విషము లన్నిటికి విరుగుడు కలుగును.

12. పల్లపుభూములలో పెరిగిన జీవంతి, శ్వేత, ముష్కకము, పుష్పవందాక, అశ్వత్థముల మాత్ర సర్వవిషములను హరించును.

13. (శ్లో) వీనిని[4] పూసిన దుందుభుల మ్రోత విషమును నాశముచేయును; వీనిని పూసిన ధ్వజమునుగాని పతాకనుగాని చూచినవానిపై విషమునకు ప్రభావ ముండదు.

14. (శ్లో) వీని సాధనమున తన్నును తన సైన్యమును రక్షించుకొని విషయుక్తమగు పొగను ఉదకమును శత్రువుపై ప్రయోగించవలెను.

ఇది ఔపనిషదికమను పదునాలుగో అధికరణమందు స్వబలోపఘాతప్రతీకార మనే నాలుగో అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు ఔపనిషదికమనే పదునాలుగో అధికరణము సమాప్తము.

[4] వీనిని అనగా 9వ సూత్రములో చెప్పిన ప్రియంగు మొదలైనవి.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## పదిహేనో అధికరణము

## తంత్రయుక్తి

### అధ్యాయము 1

### ప్రకరణము 180 : తంత్రయుక్తులు[1]

1. మనుష్యుల జీవితమునకు మూలము అర్థము; లేదా, మనుష్యులతో కూడిన భూమియే అర్థము. 2. అట్టి భూమిని సంపాదించు ఉపాయములు, పాలించు ఉపాయములు—వీనిని గురించిన శాస్త్రము అర్థశాస్త్రము.[2]

3. అందు ముప్పైరెండు యుక్తులు చెప్పబడినవి : అధికరణము, విధానము, యోగము, పదార్థము, హేత్వర్థము, ఉద్దేశము, నిర్దేశము, ఉపదేశము, అపదేశము, అతిదేశము, ప్రదేశము, ఉపమానము, అర్థాపత్తి, సంశయము, ప్రసంగము, విపర్యయము, వాక్యశేషము, అనుమతము, వ్యాఖ్యానము, నిర్వచనము, నిదర్శనము, అపవర్గము, స్వసంజ్ఞ, పూర్వపక్షము, ఉత్తరపక్షము, ఏకాంతము, అనాగతావేక్షణము, అతిక్రాంతావేక్షణము, నియోగము, వికల్పము, సముచ్చయము, ఊహ్యము—అని.

4. గ్రంథములోని ఏ భాగమందొక విషయము ప్రత్యేకముగ వివరించబడి యున్నదో ఆ భాగమున కధికరణమని పేరు. 5. ఉదాహరణము : "భూ

---

[1] తంత్ర మనగా శాస్త్రము. శాస్త్రములో సమర్థింపబడిన సిద్ధాంతములను సమర్థించుటలో గ్రంథకర్త ఉపయోగించిన సాధనములు తంత్రయుక్తులు. అవి ఇందు ఉదాహరణ సహితముగ వివరింపబడినవి. ప్రస్తుతకాలమున నిట్టి సాధనములను (methods) గురించి వాదోపవాదము లనేకములు జరుగుచున్నవి.

[2] భూమిని సంపాదించుటయు పాలించుటయు రాజుల కర్తవ్యము. అందుచేత నీ శాస్త్రము రాజనీతియనికూడ చెప్పదగినది.

సంపాదన పరిపాలనల నుద్దేశించి పూర్వాచార్యులచే ఎన్నెన్ని అర్థశాస్త్రములు రచింపబడినవో వాటి నన్నిటిని సేకరించి ఈ అర్థశాస్త్రము వ్రాయబడినది." (1-1-1)

6. అర్థశాస్త్రమందలి ప్రకరణములను వరుసగ పేర్కొనుట విధానము. 7. ఉదాహరణము : "విద్యలసంఖ్య, వృద్ధులతోసాంగత్యము, ఇంద్రియజయము, అమాత్యుల నియామకము మొదలైనవి." (1-1-3)

8. వాక్యములకూర్పు యోగము. 9. ఉదాహరణము : "చతుర్వర్ణ చతురాశ్రమములతో కూడిన ఈలోకము." (1-4-16)

10. పదమం దిమిడియుండు అర్థము పదార్థము. 11. ఉదాహరణము : మూలహరు డనునది పదము. 12. "తండ్రితాతలనుండి సంక్రమించిన ధనమును న్యాయవిరుద్ధముగ ఖర్చుపెట్టువాడు మూలహరుడు," అనునది అర్థము (2-9-21)

13. అర్థమును సాధించు హేతువు హేత్వర్థము. 14. ఉదాహరణము : "ఏలయన, ధర్మకామములకు అర్థము మూలము." (1-7-7)

15. సంక్షిప్తపరిచి చెప్పుట ఉద్దేశము. 16. ఉదాహరణము : "విద్యా వినయహేతువైన ఇంద్రియజయము. "(1-6-1)

17. వివరణవాక్యము నిర్దేశము. 18. ఉదాహరణము : "త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అను ఇంద్రియముల వృత్తులైన స్పర్శ, రూప, శబ్ద, రసగంధములయందు అపరిమితమైన ఆసక్తిలేకపోవుటయే ఇంద్రియజయము." (1-6-2)

19. "ఒక డిట్లు ప్రవర్తించవలెను" అనుట ఉపదేశము. 20. ఉదాహరణము : "ధర్మార్థములకు విరోధములేక కామములను తీర్చుకొనవలెను ; కాని, సుఖములను (పూర్తిగ) త్యజించరాదు." (1-7-3)

21. "ఫలానావా డిట్లు చెప్పుచున్నాడు," అనుట అపదేశము. 22. ఉదాహరణము : "అతడు పండ్రెండుగురు మంత్రులతోకూడిన మంత్రిపరిషత్తును ఏర్పరచవలెను," అని మానవులు. "పదహారుగురు," అని బార్హస్పత్యులు. "ఇరువదిమంది" అని ఔశనసులు. "యథాసామర్థ్యము," అని కౌటిల్యుడు. (1-15-47,50)

23. ఇదివరకు చెప్పబడినదాని సహాయమున తెలుసుకొనవలె ననుట అతిదేశము. 24. ఉదాహరణము : "దానములను వశపరుపకపోవు విషయమును ఋణాదానమునుండి తెలుసుకొనవలెను." (3-16-1)

25. ఇకమీదట చెప్పబోవుదాని సహాయమున తెలుసుకొనవలె ననుట ప్రదేశము. 26. ఉదాహరణము: "లేదా, ఆపదలనుగురించిన ప్రకరణమందు వివరింపబడు సామ దాన భేద దండోపాయములను వినియోగించవలెను." (7–14–11)

27. తెలియనిదానిని తెలిసినదాని సహాయముతో సాధించుట ఉపమానము. 28. ఉదాహరణము: "కాలానుసారముగ పరిహారములు కోల్పోయినవారికి తండ్రివలె అనుకూలములను కల్పించవలెను." (2–1–18)

29. చెప్పకపోయినను అర్థముమూలమున గ్రహించదగినది అర్థాపత్తి. 30. ఉదాహరణము: "లోకానుభవముగల పురుషుడు రాజునకు ప్రియులును, హితులును అగువారిద్వారా ఆత్మసంపన్నుడును ద్రవ్యప్రకృతి సంపన్నుడును అగు రాజుకొలువులో చేరవలెను" (5-4-1). 31. ప్రియులును హితులును కానివారిద్వారా చేరరాదు అను అర్థము దీనినుండి గ్రహించదగియున్నది.

32. ఉభయపక్షములకు హేతువులుండుట సంశయము. 33. ఉదాహరణము: "క్షీణులు లుబ్ధులు అగు ప్రజలున్నవానిపైకి వెళ్ళవలెనా, లేక, తిరుగుబాటు చేయు స్వభావముకల ప్రజలున్నవానిపైకి వెళ్ళవలెనా ?" (7–5–12)

34. ప్రకరణాంతరముతో సమానమగువిషయము ప్రసంగము. 35. ఉదాహరణము: "అతడు వ్యవసాయార్థమై (మంత్రి) ఇచ్చిన ప్రదేశమందు పై విధముగ ప్రవర్తించవలెను." (1–11–10)

36. విరుద్ధమగు విషయమును సాధనము చేసుకొని ఒకవిషయమును సాధించుట విపర్యయము. 37. ఉదాహరణము: "ప్రతికూలుడైన శత్రువు లక్షణములు వీటికి విరుద్ధముగ నుండును." (1–16–12)

38. దేనిచేత వాక్యము సమాప్తియగునో అది వాక్యశేషము. 39. ఉదాహరణము: "రెక్కలుచేదింపబడిన (పక్షివలె) రాచకార్యములన్నియు నిలబడిపోవును" (8–1–9). 40. ఇందు "పక్షి" అనునది వాక్యశేషము.

41. పరునివాక్యమును నిషేధింపకుండుట అనుమతము. 42. ఉదాహరణము: "రెండుపక్షములు, ఒకఉరోభాగము, ప్రతిగ్రహము"—ఇది వ్యూహవిభాగమని ఔశనసులు. (10–6–1)

43. ఒకవిషయము నతిశయించి వర్ణించుట వ్యాఖ్యానము. 44. ఉదాహరణము: "విశేషించి సంఘములలోను సంఘధర్మముగల రాజకులములలోను, జూదముకారణముగ విభేదము, విభేదము కారణముగ వినాశము సంభవించును. జూదము మూలమున దుష్టులకు లాభము కలుగుటచేతను, పరిపాలనలో దౌర్బల్యము సంభవించుటచేతను వ్యసనములన్నిటిలో నది పాపిష్ఠము." (8–3–64)

45. పదములోని గుణములనుండి దానియుత్పత్త్యర్థమును చెప్పుట నిర్వచనము. 46. ఉదాహరణము : "శ్రేయస్సునుండి మనుష్యుని తొలగించునది గనుకనే వ్యసనమను పేరు సార్థక మగుచున్నది."

47. దృష్టాంతము చెప్పి ఒకవిషయమును సాధించుట నిదర్శనము, 48. ఉదాహరణము : "ఏలయన, బలవంతునితో యుద్ధముచేయుట ఏనుగుతో తనపాదమును సాధనముగ వినియోగించి యుద్ధముచేయుటయే." (7–3–3)

49. సర్వత్రవర్తించు సూత్రమునుండి మినహాయించుట అపవర్గము. 50. ఉదాహరణము : "వారు (అమిత్రబలము) తిరుగుబాటు చేయకుండునట్లు వారి నెల్లప్పుడు తనసమీపమందే ఉంచుకొనవలెను ; రాష్ట్రములోపల కలహము సంభవించినపు డిట్లు చేయవలసినదిలేదు." (9–2–6)

51. ఇతరగ్రంథకర్త లంగీకరించకపోయినను ప్రత్యేకార్థముతో గ్రంథ కర్తయుపయోగించు మాట స్వసంజ్ఞ. 52. ఉదాహరణము : "(విజిగీషువు) ప్రథమ ప్రకృతి. అతని పొరుగురాజ్యమును పాలించువాడు ద్వితీయప్రకృతి. దానికి తర్వాతిరాజ్యమును పాలించువాడు తృతీయప్రకృతి." (6–2–13–15)[3]

53. ప్రతిషేధింపదగినవాక్యము పూర్వపక్షము. 54. ఉదాహరణము : "రాజును పట్టుకొనిన వ్యసనములకంటె నమాత్యుని పట్టుకొనినవి ఎక్కువ ప్రమాదకరములు." (8–1–7)

55. దానినిగురించిన తుదినిర్ణయము ఉత్తరపక్షము. 56. ఉదాహరణము : "తక్కిన ప్రకృతు లతని అధీనమందుండుటచేత : ఏలయన, అన్నిటికి మకుట స్థానమం దుండువాడు రాజు." (8–1–17–18)

57. సర్వత్రవర్తించుసూత్రము ఏకాంతము. 58. ఉదాహరణము : "కావున తాను ఉత్సాహవంతుడుగ నుండవలెను." (1–19–5)

59. "ఇది తర్వాత చెప్పబడును," అనుట అనాగతావేక్షణము. 60. ఉదాహరణము : "తులామానములు "పౌతవాధ్యక్ష" అధ్యాయమందు వివరింప బడును." (2–13–28)

61. "ఇది ఇంతకుముందే చెప్పబడినది," అనుట అతిక్రాంతావేక్షణము. 62. ఉదాహరణము : "అమాత్యులకు ఉండవలసిన గుణములు (అమాత్య సంపద) ఇంతకుపూర్వమే వివరింపబడినది." (6–1–7)

63. "ఇట్టిదేగాని మరియొకటి కూడదు." అనుట నియోగము. 64. ఉదాహరణము ; "కనుక, అతనికి ధర్మార్థములను బోధించవలెనేకాని అధర్మమును అనర్థమును బోధించరాదు." (1–17–33)

---

[3] ప్రథమ ప్రకృతి, ద్వితీయ ప్రకృతి, తృతీయ ప్రకృతి అను మాటలు ఈ సూత్రములలో వాడబడలేదు. మరికొన్ని సూత్రములలో వాడబడియున్నవి.

65. "ఇట్లుగాని మరియొకవిధమునగాని." అనుట వికల్పము. 66. ఉదాహరణము: "లేదా, ధర్మవివాహమువలన పుట్టిన కుమార్తెలు." (3–5–10)

67. "ఇట్లు అట్లు," అనుట సముచ్చయము. 68. ఉదాహరణము: "అతడు కన్నతండ్రియు బంధువులయు ఆస్తికి హక్కుదారుడు." (3–7–13)

69. స్పష్టముగ చెప్పనిదానిని చేయుట ఊహ్యము. 79- ఉదాహరణము: "దాతయు ప్రతిగ్రహీతయు నష్టపడకుండునట్లు కుశలులు రద్దువిషయమును నిర్ణయించవలెను." (3–16–5)

71. (శ్లో) ఇట్లీశాస్త్రము ఇట్టితంత్రయుక్తుల సాధనమున ఇహలోక పరలోకముల సంపాదనార్థము పాలనార్థము వ్రాయబడినది.

72. (శ్లో) ఈ శాస్త్రము ధర్మార్థకామములను ప్రవర్తింపజేసి వానిని రక్షించు చున్నది. అధర్మమును, అనర్థమును, ద్వేషమును నాశము చేయుచున్నది.

73. (శ్లో) నందరాజుల వశమందున్న శాస్త్రమును శస్త్రమును భూమిని ఎవడు కోపావిష్టుడై త్వరితకాలమున ఉద్ధరించెనో అతడు ఈ శాస్త్రమును రచించెను.[4]

ఇది తంత్రయుక్తి అను పదిహేనో అధికరణమందు తంత్రయుక్తులు అనే మొదటి అధ్యాయము.

దీనితో కౌటిల్యుని అర్థశాస్త్రమందు తంత్రయుక్తి అను పదిహేనో అధికరణము సమాప్తము.

(శ్లో) శాస్త్రములకు భాష్యములు వ్రాసినవారిలో విప్రతిపత్తు లనేకము లుండుటను గమనించి విష్ణుగుప్తుడే స్వయముగ సూత్రమును భాష్యమును రచించెను.[5]

ఇంతటితో కౌటిల్యుని అర్థశాస్త్రము సమాప్తము.

---

[4] నందరాజుల నోడించి మౌర్య సామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్త చక్రవర్తికి కుడిభుజమై సామ్రాజ్య సంపాదనపరిపాలనలం దతనికి తోడ్పడిన చాణక్యుడు (కౌటిల్యుడు) ఈ గ్రంథమును రచించెననుట కిదియొక ఆధారము.

[5] ఇది తర్వాతివా రెవరో చేర్చిన వాక్యమని అనేకుల అభిప్రాయము. గ్రంథమం దెచ్చటను విష్ణుగుప్తుని పేరు లేదు. కౌటిల్యునిపేరుమాత్రమే కనిపించుచున్నది. గ్రంథమందు సూత్రములు మాత్రమే ఉన్నవి. భాష్యము లేదు.

# అధికరణ, ప్రకరణాల అకారాది సూచిక